

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద



“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ రామకృష్ణ మిషన్ (సేవాసంస్థ): తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికాధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధక్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్షవీక్షణాప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

---

అడ్రెసు : **మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము ౨౬ ౧౯౭౦ - జనవరి : సౌమ్య - పుష్యము సంచిక ౭

## విషయసూచిక



ఫోన్ : 71231 శ్రీ రామకృష్ణప్రభ పోస్టు బాక్సు : 635

### ప్రకటన

1969 జూలై నెలలో శ్రీరామకృష్ణప్రభ యిరువదియాఱవ సంపుటము ప్రారంభ మయినది. ఈ పత్రికయందు ఇంతవఱకు ఆదరాభిమానములు చూపుచున్న ఆంధ్రమహాజనులకు మా హృదయపూర్వకాభివందనములు. మా పారమార్థిక సందేశ ప్రచారసేవను ప్రశంసించుచున్న వందలాది భక్తులకు, పాఠకులకు మా శ్రేయః కాంక్షలు.

చందాదారు లందఱును భగవత్సేవాపరాయణమైన మా యీ పత్రికయెడల ఎప్పటియట్ల ఆదరాభిమానములు చూపగలరని విశ్వసించుచున్నాము.

మేనేజరు : శ్రీ రామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీ రామకృష్ణమఠము - మద్రాసు 4.


మూడు
రూపాయలకు మూలం
యన్. పి. కె. (నత్రజని, భాస్వరము, పొటాషియము) తగినన్ని పాళ్లలో వాడి ఉత్తమ ఫలితాన్ని పొందండి.
ఎరువులు వాడటం మూలంగా వచ్చే అత్యధిక లాభాన్ని పొందటానికి మొక్కలను రక్షించే మార్గాలు అవలంబించండి.
ఎరువులను ఎప్పుడు, ఎందుకు, ఏ విధంగా వాడాలో తెలుసుకోవటానికై మీ గ్రామ సేవక్ ను గాని, వ్యవసాయ విస్తరణాధికారిని గాని సంప్రదించండి.
ఒక
రూపాయ మాత్రమే
చాలా సులభమైనది
ఎరువులు వాడండి
భూసార పరీక్ష జరిపించండి
DAVP 69/401

‘అఖిలవిభు శరణొొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ } ౧౯౭౦ - జనవరి సౌమ్య - పుష్యము { సంచిక ౭


శ్రీః

## స్తవము


మూలము :
శ్రీకూరనాథుడు

వ్యాఖ్యాత :
శ్రీమత్కాంచీ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి


[ గత సంచిక తరువాయి ]

ఐశ్వర్యం య దశేషపుంసి య దిదం సౌన్దర్యలావణ్యయోః
రూపం య చ్చ హి మఙ్గళం కి మపి య ల్లోకే స ది త్యుచ్యతే
త త్సర్వం త్వదధీన మేవ య దత శ్శ్రీ రి త్యభేదేన వా
యద్వా శ్రీమది తీదృశేన వచసా దేవి ప్రథా మశ్నుతే. 7

| | |
|---|---|
| దేవి | అమ్మాయీశ్వరీ |
| అశేషపుంసి | సమస్త చేతనులందును |
| యద్ ఐశ్వర్యం (అస్తి) | ఏయైశ్వర్యమున్నదో |
| సౌందర్యలావణ్యయోః | అవయవశోభ సముదాయశోభ అనువాని |
| యత్ ఇదం రూపమ్ | రూప మేదో |
| లోకే | లోకమున |
| యచ్చహిమఙ్గళం | ఏది మంగళమో |
| యత్ కిమపి | ఏది |
| సత్ ఇతి ఉచ్యతే | మంచిది అని చెప్పబడుచున్నదో |

| | |
|---|---|
| తత్ సర్వం | ఐశ్వర్యాదులైన అవి అన్నియు |
| యత్ | ఏ కారణముచే |
| త్వత్ అధీనమ్ | నీయాజ్ఞకు లోబడియున్నవో |
| అతః (తత్సర్వం) | ఆ కారణముచే (అదంతయు) |
| శ్రీః ఇతి అభేదేనవా | అభేదముగ శ్రీ అనియో |
| యద్ వా | లేక |
| శ్రీమత్ ఇతి ఈదృశేనవచసా | శ్రీమంతము అను విశేషణముతోనో |
| ప్రథామ్ అశ్నుతే | ప్రసిద్ధినందుచున్నది. |

ప్రపంచమున ప్రతివస్తువునం దున్న మేలిమి సొంపు—మున్నగు సమస్తమును లక్ష్మీ సంబంధనిబంధన మనుచున్నారు.

ఐశ్వర్య మనగా ఈశ్వరత్వము, సామర్థ్యము. ఇది చీమమొదలు బ్రహ్మవఱకు సకల ప్రాణులందు నున్నది. చీమకు పైది ఈగ, ఈగకుపైది తుమ్మెద. ఈ రీతి ఒకదానికంటె నొకటి పైదిగా అమరియుండు ప్రాణులలో ఒక్కొక్కదాని కొక్కొక్కరీతి ఐశ్వర్య మున్నది కదా. కొన్నివస్తువులలో ప్రత్యవయవమును అందముగా నుండును. అది సౌందర్య మనబడును. కొన్ని వస్తువులలో అందము ఒక్కొక్కఅవయవములో లేకున్నను అవయవములసముదాయములో నుండును. అది లావణ్య మనబడును. పసుపు, పువ్వులు దీపము మున్నగు కొన్నివస్తువులు మంగళకరము లని ప్రసిద్ధములు. ఊర్ధ్వపుండ్రముల తీర్చుకొనుట కుపయుక్తమగు తెల్లమట్టి కడ్డి మున్నగు కొన్నివస్తువులు మంచివస్తువు లన బరగును: ఐశ్వర్యము సౌందర్యము లావణ్యము మంగళకరత్వము సద్వస్తుత్వము అగు నిట్టి మేలుము లన్నియు లక్ష్మీసంబ ధనిబాధనములు. కావున కొన్నివస్తువుల పేర్లకు ముందు 'శ్రీ' శబ్దమును, కొన్నివస్తువులపేర్లకు ముందు 'శ్రీమ' చ్ఛబ్దమును కూర్పొందుచుండును. శ్రీమందిరము, శ్రీపర్వతము, శ్రీమదనంతసరస్సు శ్రీమద్వె నాద్రి—ఇత్యాదు లుదాహరణములు. 7

దేవి, త్వన్మహిమావధి ర్న హరిణా నాపి త్వయా జ్ఞాయతే
యద్యప్యేవ మథాపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే
యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదు
ర్వ్యోమామ్భోజ మిదన్తయా కిల విద న్భ్రాన్తో ఽయ మి త్యుచ్యతే. 8

| | |
|---|---|
| దేవి | ఈశ్వరీ |
| త్వన్మహిమఅవధిః | నీపేర్మికి ఎల్ల |
| హరిణాపి | భగవంతునిచేతను |
| యద్యపి నజ్ఞాయతే | ఎఱుగబడుటలేదు |
| త్వయాపి | నీచేతను |
| నజ్ఞాయతే | ఎఱుగబడుటలేదు |

| | |
|---|---|
| ఏవమ్ అథ అపి | ఇట్లెవ్వరిచేతను ఎఱుగబడకున్నను |
| యువయోః | మీయిద్దఱి |
| సర్వజ్ఞతా | సర్వజ్ఞత్వము |
| నైవ హీయతే | లోటు చెందుటలేదు |
| యత్ నాస్తి ఏవ | ఏవస్తువు (లోకమున) బొత్తిగాలేదో |
| తదజ్ఞతామ్ | దానినిగూర్చి యెఱుగకుండుట |
| సర్వజ్ఞతాయాః | సర్వజ్ఞత్వమునకు |
| అనుగుణాం విదుః | తగినదే అని (వివేకులు) ఎఱుగుదురు |
| వ్యోమాంభోజం | ఆకాశకుసుమము |
| ఇదమ్ తయావిదన్ | 'ఇదిగో ఉన్నదే' అని ఎఱిగెడివాడు |
| అయం భ్రాన్తః ఇతి | వీడు వెఱ్ఱివాడు అని |
| ఉచ్యతే కిల | (లోకులచే) చెప్పబడునుగదా. |

అమ్మా, నీవును భగవంతుడును సర్వజ్ఞులరు. అయినను నీవైభవ మీపాటి దని యెఱుగ నీకును శక్యము కాదు, భగవంతునకును శక్యము కాదు. ఇంతమాత్రముచేత మీసర్వజ్ఞత్వమున కెట్టి లోపమును గలుగదు. మహిమావధి నెఱుగని వారిని సర్వము నెఱిగినవారనుట ఎట్లు పొసగు నందు రేమో! సర్వజ్ఞత్వ మనగా ఉన్నసమస్తము నెఱిగియుండుట. దేవి మహిమకు అవధి ఉన్న కదా దాని నెఱుగ నగును? దేవి మహిమకు అవధి లేదాయె. లేనిదాని నెఱుగుట యనగా, లేనిదాని నున్న దని తలంచుటే యగును. లేనిదాని నున్నట్లు తలంచుట భ్రాంతియగునే కాని జ్ఞానము కానేరదు. గొడ్రాలిబిడ్డ, కుందేటికొమ్ము, ఎండమావులనీరు, ఆకాశకుసుమము—అను నివి ప్రపంచమున లేనివి. 'ఇదిగో ఆకాశకుసుమము, నే నెఱుగుదు' నని చెప్పువాడు వెఱ్ఱివాడే. 8

లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం యస్యాః ప్రసాదపరిణామ ముదాహరన్తి
సా భారతీ భగవతీ తు యదీయదాసీ తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః. 9

| | |
|---|---|
| లోకే | లోకమున |
| వనస్పతిబృహస్పతి తారతమ్యం | ఒకడు చెట్టువలె జడుడుగా జన్మించుట ఒకడు బృహస్పతివలె మహా విద్వాంసుడుగా పుట్టుట అను ఎక్కువ తక్కువలు |
| యస్యాః | ఏ సరస్వతి |
| ప్రసాదపరిణామమ్ | అనుగ్రహ పరిపాకఫలమని |
| ఉదాహరన్తి | (జ్ఞానులు) చెప్పుదురో |
| భగవతీ | పూజ్యమైన |
| సాభారతీతు | ఆసరస్వతియు |
| యదీయదాసీ | ఏ లక్ష్మీదేవి దాసులకు దాసిగా నున్నదో |

| | |
|---|---|
| దేవ దేవమహిషీమ్ | దేవాధి దేవుని పట్టపు దేవియగు |
| తాం శ్రియమ్ | ఆలక్ష్మీ దేవిని |
| ఆశ్రయామః | ఆశ్రయించుచున్నాము. |

లక్ష్మీకటాక్షమును బడసినవారివిషయమున వాగ్దేవియగు సరస్వతిసైతము దాసాను దాసిగ నుండు ననుచున్నారు. 'మొద్దు' లనదగినట్లుగ కొందఱు మహాధాత్ములుగ నుండుటయు బృహస్పతి యనెడి దేవగురుని యపరావతారము లనదగినట్లు కొందఱు మహాజ్ఞాతలుగ నుండు టయు సరస్వతికృపయొక్క అన్వయవ్యతిరేకములచే సంభవించుచుండు ననుట ఎల్ల రెఱిగినవిష యమే. అటువంటివైభవము గల సరస్వతీదేవిసైతము లక్ష్మీకటాక్షభాజనుల భవనద్వారముల లొద్ద నిల్చి వారిచెప్పుచేతలకు లోనైన పరిచారికగా నుండును గావున తదనుగుణమైన పేర్మిగల శ్రీదేవిని శరణు జొత్త మనుచున్నారు.

క్రింద రెండవ శ్లోకమున 'యుక్తాం భావయ భారతీం' అని శ్రీదేవిని వాక్సమృద్ధి నొసగు మని ప్రార్థించినట్టి శ్రీకూరనాథుని జూచి కొందఱు "వాక్సమృద్ధికోరినవారు సరస్వతిని గదా స్తుతింపవలసిన" దని యడుగగా అందుకు "సరస్వతీదేవి లక్ష్మీకటాక్షభాజనులదాసులకు దాసిగా నుండగా, సకలసమృద్ధులకొఱకును లక్ష్మీదేవిని స్తుతించుటయే కదా తగినపని" అను జవాబును ఈశ్లోకమున సూచించిరి.

"యస్యాః ఇమే యదీయాః; యదీయానాం దాసీ" అని వ్యుత్పత్తి చెప్పుకోవల యును. 'ఏలక్ష్మీదేవిగారిదాసులకుదాసియో' అనుట.

యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన సద్య స్సముల్లసితపల్లవ ముల్లలాస
విశ్వం విపర్యయసముత్థవిపర్యయం ప్రాక్ తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః. 10

| | |
|---|---|
| ప్రాక్ | మునుపు (ప్రళయకాలమున) |
| విపర్యయసముత్థవిపర్యయం | లక్ష్మీకటాక్ష ప్రాప్తిలేనందున వాడుపాటొంది యున్న |
| విశ్వం | జగత్తు |
| యస్యాః | ఏ శ్రీదేవియొక్క |
| కటాక్షమృదువీక్షణ | కడకన్నులచే ఆప్యాయకరముగ చూతమనెడి |
| దీక్షణేన | సంకల్పముచే |
| సద్యః | అప్పటికప్పుడే |
| సముల్లసితపల్లవం | చిగిరింపదొడగి |
| ఉల్లలాస | వెలుగొందెనో |
| దేవ దేవమహిషీం | దేవాధి దేవుని పట్టపు దేవియగు |
| తాంశ్రియం | ఆలక్ష్మీ దేవిని |
| ఆశ్రయామః | ఆశ్రయించుచున్నాము. |

ప్రళయకాలమున సకలాత్మవర్గమును కరణకళేబరవిధురమై తెక్కలు విఱిగిన పిట్టల వలె ఎట్టిప్రవృత్తికిని యోగ్యత లేక అసత్కల్పముగ పడియుండగా—ఈయాత్మవర్గమంతటికిని ప్రవృత్తిసామర్థ్యము గలుగవలయు నని శ్రీదేవి చల్లనికటాక్షముల వానిపై ప్రసరించినవెంటనే కదా అన్నింటి జడత్వము తొలగి, చిగుళ్ళ పసిమిమిసిమితో వెలుగొందినది. ఆశ్రీదేవిని శరణు జొచ్చుచున్నా ననుచున్నారు. అట్లే అసత్కల్పుడనగు నన్నును శ్రీదేవి చల్లగ కటాక్షించి సద్గోష్ఠిలో అన్వయింపజేయవలయునను ప్రార్థన మిట నిగూఢము.

"దుర్వాసునిశాపముచే త్రిభువనములు నిశ్శ్రీకములుగా కావలసివేర్పడగా, ఆభువనములను త్యజించి లక్ష్మి పాలకడలిలోనికి జేరుకొన్నది. ఆలాగు ఆమె కటాక్షము తొలగుటచే, "అసన్నేవ" అన్నట్లు త్రిభువనమును నష్టమాయెను. తర్వాత "పయఃపారావారామృతమున నవతరించినట్టిదియు" అనదగినట్లు అమృతమునుండి వెలువడు కన్యామృతముగా అవతరించి స్నాతయై మహార్హవసనయై చిత్రమాల్యానులేపనయై మహోజ్జ్వలవిష్ణువక్షఃస్థలము నధిష్ఠించి "క్షణమైన నిటనుండి తొలగ" నని సంశ్లేషించినపిమ్మట తన కారుణ్యశీతలకటాక్షసుధావర్షమును గురియగా, దానిచే త్రిభువనము సత్త నంది సమృద్ధమైనరీతిని ఈశ్లోకమున వాక్రుచ్చుచున్నారు" అని చతుఃశ్లోకీవ్యాఖ్యలో శ్రీపెరియఆచ్చాన్ పిళ్ళైగారు తెల్పినవివరణమును శ్రీస్తవమందలి యీశ్లోకమునకును జెప్పుకొనవచ్చును. అప్పుడు "ప్రాక్" అనుటకు దుర్వాసునిశాపముచే నిశ్శ్రీకమైనప్పు డని యర్థ మగును. ఈయర్థము చతుఃశ్లోకీభాష్యకర్తలైన శ్రీవేదాంతదేశికులవారికిని అభిమతమే యగును.

యస్యాః కటాక్షవీక్షా క్షణలక్షం లక్షితా మహేశా స్స్యుః
శ్రీరఙ్గరాజమహిషీ సా మామపి వీక్షతాం లక్ష్మీః. **11**

| | |
|---|---|
| యస్యాః | ఎవతెయొక్క |
| కటాక్షవీక్షా | కడకంటిచూపునకు |
| క్షణలక్షంలక్షితాః | క్షణకాలము లక్ష్యముగనుండగన్నవారు |
| మహేశాఃస్యుః | పరమైశ్వర్య సంపన్నులగుదురో |
| శ్రీరఙ్గరాజమహిషీ | శ్రీరంగనాథస్వాముల పట్టపుదేవియగు |
| సాలక్ష్మీః | ఆ శ్రీదేవి |
| మామపి | నన్నును |
| వీక్షతామ్ | కటాక్షించునుగాక. |

ఎవతె కడకంటిచూపునకు క్షణకాలము పాత్రులైనవారు ధన్యు లగుదురో, మహామహిమశాలినియగు ఆశ్రీదేవి నన్నును కటాక్షించి ధన్యు నొనర్చుగాత మని ప్రార్థించుచున్నారు.

'క్షణలక్ష్యం' అనియు పాఠ మున్నది. అర్థ మేమో ఒక్కటే. "మహేశాః స్యుః"- ఇచ్చట చెప్పబడినది ఐహికమును క్షుద్రమునగు నైశ్వర్యము కాదు. 'ఏలా బ్రహ్మపదంబు'

అన్నట్లు 'తృణీకృతవిరిఞ్చాది నిరంకుశవిభూతులై' పరమవైరాగ్యపూర్ణులైన శ్రీకూరనాథులకు ఈక్షుద్రైశ్వర్యము కోరదగినది కాదు. స్వరూపానురూపమైన ఐశ్వర్యమేదో అదే యిట వివక్షితము. భగవత్కైంకర్యసంపదయే చేతనునకు స్వరూపానురూపము. కాసారములో సద్యోవికసిత పుష్పములను కోయ నేగి పాదము మొసలినోట చిక్కుకొనగా ప్రాణసంశయదశలో నున్న గజరాజును "స తు నాగవరః శ్రీమాన్" అన్నారు. రావణుడు తన్ను తిరస్కరించి తన్నివేయగా తనసర్వస్వమును పరిత్యజించి వచ్చి శ్రీరామచంద్రుని శరణుగోరుచు మింట నిలిచిన విభీషణుని "అన్తరిక్షగతః శ్రీమాన్" అన్నారు. రాజ్యముతోఁబాటు సకలసంపదలను విడిచి తల్లిను గడ్డపాఱను చేదాల్చి శ్రీరాముని వెంట కాననమునకు దరలుచున్న లక్ష్మణుని "లక్ష్మణో లక్ష్మిసమ్పన్నః" అన్నారు. ఈచోటులందు అభిప్రేతము కైంకర్యసంపదయే కదా. ఈకైంకర్య సంపద ఇహలోకమున అర్చావతారమున లభింపవలె నన్నను శ్రీవైకుంఠమున లభింపవలె నన్నను—లక్ష్మీకటాక్ష ముండి తీరవలెను. లేకున్న—లభింపదు అనువిషయము దివ్యసూరులయు ఆచార్యమహత్తరులయు అనేక శ్రీసూక్తులచేత విశదము. లక్ష్మిని కాదని, భగవంతుని మాత్రమే పడయగోరువారికి శూర్పణఖకు పట్టిన గతియే పట్టు నని మనపూర్వాచార్యులు వక్కాణించుచుందురు 'సా మా మపి వీక్షతాం లక్ష్మీః' "ఆ లక్ష్మి నన్నును కటాక్షించును గాక, నాకును భగవత్కైంకర్యసంపదను ప్రసాదించును గాక"-అనుట.

శ్రీస్తవవ్యాఖ్యానము ముగిసినది.

సీ. పుష్కరవిహారణస్ఫురణంబు వహియించి, యచలానుగుణవృత్తి నవధరించి,
యార్యాభిగణ్యసౌకర్యంబున రహించి, ప్రబలహిరణ్యావర్ధనత మించి,
త్రిభువనాంచితరూపవిభవంబు ప్రాపించి, భృగుకులంబు పవిత్రముగ జనించి,
యంభోధిభంగలీలాసక్తి వర్తించి, కామపాలనరీతి ఖ్యాతిగాంచి,

గీ. పుణ్యజనముల పూజనములు గ్రహించి, కలికితన మెందు నిట్టిది గలదె యనఁగఁ
జెలువుచెలువున నలు వొందు కలిమిచెలువ మెచ్చి నిచ్చలు మాకోర్కు లిచ్చుఁ గాత.

—కంకంటి పాపరాజు

చ. కలశపయోధిపుత్త్రి యలకాంచనగర్భునిఁగన్నతల్లి క
ల్వలదొరతోడఁబుట్టు హరివల్లభ లేములఁబోవులేమ సొం
పలరఁగఁ బద్మషండములయందు వసించెడు తన్వి, లచ్చి నా
కెలమి సమస్తసంపదల నిచ్చి కృతార్థునిఁ జేయుఁ గావుతన్.

—శ్రీ గోపీనాథము వేంకటకవి.

# వివేకానందధ్యానము

## శ్రీ చలవాది సోమయ్యగారు

("చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా! గతమెంతో ఘనకీర్తి గలవోడా..." అనుమాదిరి)

శ్రీవివేకానంద భాస్కరా! వేదాంతసింహమా జేజేలు !!

హైందవసంస్కృతి కన్ని రూపులు దిద్ది। అమరసందేశము జగతి కిచ్చితివి
భారతీయులఖ్యాతి నిలిపితివి। భారతాంబకు వెలుగుదెచ్చితివి ॥శ్రీవివేకానంద॥ 1

ప్రాక్పశ్చిమాఖండ విజ్ఞానమెల్లను। ప్రజ్ఞతోడుతనీవు పుడిసిలించితివి
మతసామరస్యము నెఱపితివి। మానవతకే విలువనిచ్చితివి ॥శ్రీవివేకానంద॥ 2

జీవులందఱిలోన దేవు గాంచితివి। జీవదేవులు ఒకేతత్త్వమని తెల్పితివి
అద్వైతఅనుభూతి బొందితివి। ఆచరణలోదాని నిల్పితివి ॥శ్రీవివేకానంద॥ 3

దీనకోటులజూచి దిగులొందితీవెంతో। దీనజనసేవకు బీజాలుచల్లితివి
వెన్నహృదయము నీది స్వామిజీ। విశ్వవ్యాపకమూర్తి వీవయ్యా ॥శ్రీవివేకానంద॥ 4

భక్తిజ్ఞాన కర్మ రాజయోగంబుల। యుక్తియుక్తముగను విపులీకరించితివి
తత్త్వబోధాగ్రణీ జేజేలూ! త్యాగీశ్వరేశ్వరాప్రణతూలూ! ॥శ్రీవివేకానంద॥ 5

సాంఘికలోపాల సరిచేయదలచియు। సంఘుస్థితులన్నిటి తరచిచూచితివి
సూచనలనెన్నిటో చేసితివి। సంఘుసంస్కర్తగానిలిచితివి ॥శ్రీవివేకానంద॥ 6

సంఘుసేవలు జేయు సద్బుద్ధియుతుడవై। సాధుసజ్జనులతో సమృద్ధిగావెల్గు,
సంఘుమతములనెన్నో స్థాపించితీవ్। సద్భక్తి మీకివే కైమోడ్పులు ॥శ్రీవివేకానంద॥ 7

# వివేకానందస్వామి బోధించిన బలోపనిషత్తు

నా ధీర బాలకురాలా, మీ రందఱును మహాకార్య నిర్వహణముకై జన్మించితి రను పరిపూర్ణ విశ్వాసము కలిగి యుండుడు. కుక్కపిల్లల మొఱుగుళ్లకే మీరు ఉలికి పడుదురా? లోకములను కంపిల్లజేయు ఘోర గర్జారావముతో ఆకసమును ప్రీల్చుకొనివచ్చు పిడుగుపాటులను కూడ బెదరక నిశ్చలులై నిలిచి కార్యనిర్వహణమగ్నులై యుండుడు.

మీ దేశమునకు సాహసపరాక్రమ సంపన్నులగు శూరులు కావలసియున్నారు. కావున మీ రట్టి శూరులుగా నుండవలెను. పర్వత స్థైర్యముతో నిలువుడు. సత్యమునకు సర్వదా జయమే చేకూరును. జాతీయ రక్తనాళములలో ఇతోధికశక్తి నుద్దీపింప జేయగల యొక నూతన విద్యుత్తేజమే భారతదేశమున కిప్పుడు కావలసినది. ధీరత వహింపుడు, ధీరత వహిం

పుడు! మనుజుడు మృతినొందున దొక్క-సారియే! నా శిష్యులు పిఱికి పందలుగా నుండ రాదు. పిఱికితన మన్న నాకు మిక్కిలి రోత. దేనికిని తొణకకుండు పరిపూర్ణ మనఃస్థైర్యమును అలవఱచుకొనుడు. తుచ్ఛులు మిమ్ము గూర్చి పలుకు నిందావాక్యముల నేమాత్రము సరకుసేయకుడు. వారియెడ ఉదాసీనత చూపుడు. ముమ్మాటికిని ఉదాసీనతయే! కన్నులు రెండు, చెవులును రెండు; కాని నోరు మాత్రము ఒక్క-టే అని జ్ఞప్తియుంచుకొనుడు. మహా కార్యములు మహా విఘ్నముల నడుమనే మహా విఘ్నముల నెదుర్కొ-నియే, నిర్వహింపబడును. మీ పురుషకారమును (పురుష ప్రయత్నమును) నిర్వహింపుడు. కామకాంచన పరాధీనులగు నిర్భాగ్యులను లక్ష్యపెట్ట బనిలేదు.

* * *

"మిత్రుడా, ఏడ్చెదవేల? సర్వశక్తియు నీయందే కలదు. ఓ భగవానుడా, సంపూర్ణ మాహాత్మ్యముగల నీ స్వభావమును ప్రత్యక్షపఱచుకొనుము. ఈ ముజ్జగము లన్నియు నీకు పాదాక్రాంతము లగును. విజయ మెప్పుడును ఆత్మదేగాని, ప్రకృతిది కానేరదు." దేహాత్మ భ్రాంతి (తమ శరీరములే తాము అనెడు భ్రాంతి) గల పామరులే "దుర్బలులము, దుర్బలులము, మేము దుర్బలులము!" అని దీనముగా విలపించుచుందురు. దేశమున కిపుడు కావలసినది సాహసమును వైజ్ఞానిక ప్రతిభయును, మహాధీరత్వము, అఖండ శక్తిసామర్థ్యములు, అపరిమితోత్సాహము, మనకిప్పుడు అవసరము. ఆడంగితనము బొత్తిగా పనికిరాదు. కార్యశూరుని, పురుషసింహుని, విజయలక్ష్మి వరించును. వెనుకకు చూడ బనిలేదు. ముందుకు నడువుడు! అఖండ శక్తి, అఖండోత్సాహము, అఖండ ధైర్యము, అఖండశాంతత—ఇవియే మనకు ఆవశ్యకములు. అవి యున్నగాని మహా కార్యములు సాధింపబడవు.

* * *

పాప మనునది ఒకటి కలదని వేదాంతము అంగీకరింపదు. పొరపాట్లు ఉండునని మాత్రము అది అంగీకరించును. దాని ప్రకారము పొరపాటు లన్నిటిలో మిక్కిలి హేయమైనది "నేను దుర్బలుడను, నేను పాపిని, నేను నీచుడను, నేను శక్తిహీనుడను, నాకే పని చేయసమర్థత లేదు" అని పల్కుటయే.

* * *

భగవంతుని ఉనికియందు విశ్వాసము లేనివాడు నాస్తికుడని ప్రాచీన మతములు పలికినవి. స్వశక్తియందు విశ్వాసము లేనివాడు నాస్తికుడని ఈ నవీన మతము పలుకుచున్నది.

* * *

బలమే జీవము, బలహీనతయే మరణము; బలమే సుఖము—నిత్యమును మరణము లేనట్టిదియు నగు జీవము; బలహీనత నిరంతర శ్రమము, దుఃఖము. బలహీనతయే మరణము. మిక్కిలి పసితనమునుండియు మీ బుద్ధిలో అభివృద్ధికరములు, బలప్రదములు, లోకోపకారకములు అగు భావములనే ప్రవేశింపనిండు.

* * *

సర్వవ్యథలకు బలహీనతయే ఏకైక కారణము. బలహీనులము గనుకనే కడగండ్లపాలగుచున్నాము. బలహీనులము గనుకనే మనము బొంకుట, చంపుట, దొంగిలించుట, ఇతరాపరాధములు చేయుట. బలహీనులము గనుకనే మన దుఃఖములు, మరణములు. మనకు బలహీనత కల్పించున దేదియు లేనిచో, మరణములు, దుఃఖములు ఉండవు.

* * *

మన కతిముఖ్యముగా కావలసినది బల మొక్కటియే. భవరోగమునకు బలమే ఔష ధము. ధనికులు పీడించునప్పుడు బీదల కుండ వలసిన ఔషధము బలము. విద్యావంతులు పీడించునప్పుడు పాపులకు ఉండవలసిన ఔష ధము బలము.

* *

బలాఢ్యుడవై ధైర్యశాలివై నిలువుము. బాధ్యతనంతయు నీమీాదనే పెట్టుకొనుము. నీ విధికి నీవే కారణ భూతుడవని ఎఱుగుము. నీకు వలయు శక్తియంతయు, సాహాయ్యమంతయు, నీయందే కలదు. కావున నీ భవిష్యత్తును నీవే నిర్మించుకొనుము.

* *

మనము జాడ్యగ్రస్తులమని సదా తలపోసి కొనుచుండుటచే జాడ్యవిముక్తి కాదు. ఔష ధము సేవింపవలెను. బలహీనతను జ్ఞప్తికి తెచ్చుకొనుచుండుట అంతగా ఉపయుక్తము కాదు. బలమును చేకూర్చుకొనుము. సదా బలహీనతను గూర్చి చింతించుటచే బలము లభింపదు. బలహీనతను గూర్చి విచారించుట కాదు బలహీనతను పోగొట్టుకొను మార్గము. బలమునే స్మరింపవలెను.

* * *

ఈ (భౌతిక) ప్రపంచమునగాని, పార మార్థిక ప్రపంచమున గాని భీతి పతనమున కును, పాతకమునకును, తప్పక దారితీయు ననుట సత్యము. దుఃఖమునకును, మరణమున కును భీతియే మూలము. కీడునకును బీజము భీతియందే కలదు. ఇక, భీతికి కారణమేమి? మన ఆత్మతత్త్వము నెఱుగమియే. మనలో ప్రతివాడును ఆ సమ్రాట్చక్రవర్తికి "ఉత్తర వారసు."

* * *

పాపము లన్నియు, అశుభము లన్నియు, "దౌర్బల్యము" అను ఒక్క మాటలో ఇముడ్చ వచ్చునని తెలిసికొనుము. దుష్టప్రవర్తన మంత టికిని ప్రేరక మీా దౌర్బల్యమే. స్వార్థపరత్వ మంతటికిని మూల మీా దౌర్బల్యమే. మానవు లితరులకు హాని కలిగించున దీ దౌర్బల్యము వలననే. మానవులు తమ యథార్థతత్త్వము నకు భిన్నముగా గోచరించుటయు ఈదౌర్బల్య మూలముననే.

* *

ప్రకృతిని లోబఱచుకొనుటకై పోరాడు చుండు మానవునికే మానవనామము చెల్లును. ఈ ప్రకృతి ఆంతరమనియు, బాహ్యమనియు రెండు తెఱగులు గలది. బాహ్యప్రకృతిని జయించుట మంచిదే, అది మిక్కిలి ఘన కార్యమే. కాని ఆంతరప్రకృతిని జయించుట ఇంకను ఘనతర కార్యమగును. నక్షత్రములను పాలించు ధర్మములను గ్రహించుట ఘనమే, మాననీయమే. కాని నరునివిషయవాంఛలను, భావములను, ఇచ్ఛాశక్తిని పాలనముచేయు ప్రకృతిధర్మములను తెలిసికొనుట అత్యంతము ఘనతరమును, మాన్యతరమును అగును.

* * *

సర్వజంతువుల కన్నను, సర్వదేవయోనుల కన్నను, మానవు డధికుడు. మానవునికన్న అధికు లెవ్వరును లేరు. దేవతలుగూడ మరల మానవశరీరమునుదాల్చి యవతరించి తన్మూలముననే ముక్తిపొందవలెను. పరిపూర్ణత నందు నది మానవుడొక్కడే, దేవతలు సైతము కారు.

జగద్రహస్యములను, మర్మములను, ఛేదించు శక్తిగలిగి, ఆ ఉద్యమము నేవిధమున నైనను-సముద్రగర్భాంతరాళములోనికి జొచ్చి

మృత్యువును ముఖాముఖి నెదుర్కొనవలసి వచ్చినను-సాధించు గాఢదీక్షగల అప్రతిహత మహత్తర సంకల్పసంపన్నులు - ఇనుపకండరములును, ఉక్కు నరములును గలవారు-మన దేశమున కిప్పుడు కావలసియున్నారు.

*   *   *

మనము విలపించినది చాలు. ఇప్పటికైనను విలపనములు మాని, అన్యాధార మపేక్షింపక, పౌరుషము చూపుదుముగాక! మన కిప్పుడు కావలసినది మానవత్వమును నిర్మించు మతము, మానవత్వమును నిర్మించు సిద్ధాంతములు, సర్వతోముఖముగా మానవత్వమును నిర్మించు విద్య. సత్యమును గుర్తించు టెట్లందురా? శారీరకముగాను, వైజ్ఞానికముగాను, పారమార్థికముగాను, మీకు దుర్బలత కలిగించున దంతయు విషమే. దానిని విసర్జింపుడు. అది ప్రాణరహితమైనది - సత్యము కాజాలదు. సత్యము బలవర్ధకము, సత్యము నిర్మలము, సత్యము సర్వజ్ఞానమయము. సత్యము బలప్రదమై, జ్ఞానోద్దీపకమై, శక్త్యుత్సాహదాయకమై ఉండవలెను.

*

మన మెన్నో విషయములనుగూర్చి చిలుక పలుకులు పలుకుచుందుము. అనగా ఆ పలుకులు కార్యరూపము నొందునవి కావు చెప్పుటయు, చేయకుండుటయు మన కలవాటై పోయినది. ఇందుకు కారణమేమి? బలహీనత. బలహీనమగు ఇట్టి మెదడేమియు చేయజాలదు. దానికి మనము పుష్టి కలిగింపవలెను. మన యువకులు బలిష్ఠకాయులగుట మొదటి కర్తవ్యము. మతజ్ఞానము పిదపవచ్చును. పారమార్థిక లోకమును చేరుటకు గీతాపఠనమునకన్న 'ఫుట్ బాల్' ఆట ఎక్కువగా ఉపకరించును. భుజకండరములును, ఇతర కండరములును ఇంక కొంత బలిష్ఠములైనపిదప మీరు భగవద్గీత నిప్పటికన్న బాగుగా గ్రహింపగలుగుదురు. మీలోని రక్తమొకింత పుష్టి నొందినచో శ్రీకృష్ణుని మహత్తర ప్రతిభను, మహత్తర శక్తిని ఇప్పటికన్న చక్కగా గ్రహింపగలుగుదురు. మీ శరీరములు మీ పాదములమీద సుస్థిరముగా నిల్చి, మానవుల మను భావము మీ కెప్పుడు స్పష్టముగా తోచునో, అప్పుడు మీకు ఉపనిషత్తులును, ఆత్మవైభవమును ఇప్పటికన్న చక్కగా బోధపడును.

*

వ్యాకోచము నొంద ప్రయత్నింపుడు. చలనమును, అభివృద్ధియునే జీవించియుండుటకు గుఱుతులని జ్ఞప్తియుంచుకొనుడు.

*   *   *

నీతిపరుడవై, ధైర్యవంతుడవై, త్రికరణశుద్ధి కలిగియుండుము. అనగా, నీనీతి పరమ నిర్దుష్టమైనదిగా, నీ ధైర్యమెట్టి సాహసికకృత్యమునుండియైనను వెనుదీయనిదిగా ఉండవలెను. మతసిద్ధాంతము లేమి బోధించుచున్నవా అని ఆలోచింపనే వలదు. పిఱికివాండ్రే పాపమొనర్తురు. ధీరు లెన్నడును నొనర్పరు. వీరు వారు అను భేదభావము లేక సర్వజనులను ప్రేమింప ప్రయత్నింపుము.

కపట వర్తనముచే మహాకార్య మేదియు సాధింపనలవికాదు. ప్రేమమూలమున, అఖండ సత్యదీక్షవలన, అపార పరిశ్రమచేత, ఉద్యమములు నెఱవేఱును. కావున నీ పురుషకారమును ఆవిష్కరింపుము.

*   *   *

ఈ కాలమున అతి ముఖ్యముగా వలయునది రజోగుణము. సత్త్వగుణసంపన్నులని

నీవు భావించు వారిలో నూటికి తొంబదిమందికి పైగా నిజమునకు అగాధతమస్సులో మునిగిన వారు. దేశమంతయు మృతమై, తమస్సను బట్టచే ఆచ్ఛాదితమై పడియున్నది. కావున మనకిప్పుడు అవసరమైనది అపారమగు రాజసిక శక్తి. ఈ దేశప్రజలకు అన్నవస్త్రము లీయవలెను. వారిని మేలుకొల్పవలెను. ఇప్పటి కన్న నెక్కువగా పనిచేయునట్లొనర్పవలెను. లేనిచో వారు వృక్షములవలె, రాతిబండలవలె స్తబ్ధులైపోవుదురు.

*　*　*

ఆదర్శపరుడొక వేయితప్పులు చేసినచో, ఆదర్శరహితుడు ఏబదివేల తప్పులు చేయుననుట నిస్సంశయము. కావున ఆదర్శము కలిగి యుండుట మంచిది.

*　*　*

మీ యథార్థతత్త్వము మీకు ఎఱుకపడి యున్న నెంత బాగుండెడిది! మీరు ఆత్మలు, దైవములు. మిమ్ము మానవు లన్నప్పుడే నేను అపచార మాడితి ననుకొనునది.

*　*　*

నేను సత్యనిష్ఠుడను, సత్యము అసత్యముతో నెన్నడును పొత్తుసేయదు. లోకమంతయు నాకు మాఱొడ్డి నిలిచినను, చివరకు సత్యమే జయించును.

*　*　*

ఈ లోకమున పిఱికివారికి స్థానములేదు. పాఱిపోజూడకుము, జయింతునా, ఓటమి నొందుదునా అని ఆలోచింపకుము.

*　*　*

పగ తీర్చుకొనుడని నే నెన్నడును బోధింపలేదు. సర్వదా నేను బోధించునది బలము నార్జించుకొండనియే. ఈ సముద్రపు తుంపర బొట్టుపై పగతీర్చుకొనుభావము మనకు కలలో నైన తోచునా? కాని దోమ కది ఘనకార్యము.

*　*　*

లెండు, కార్యాచరణమునకు గడంగుడు. ఎన్నాళ్లిట్లు పడియుండుట? ఈ లోకమున జన్మించినందుకు గురుగా ఏదో యొకటి (మహాకార్యమును) చేసిపొండు. లేనిచో, మీకును ఈ వృక్షములకు, ఈ శిలలకు భేదమేమి? అవికూడ ఉనికినంది, క్షీణించి లయించును గదా?

*　*　*

ధైర్యవంతులై యుండు నా కుఱ్ఱలకు అన్నిటికన్న అధికముగా ధైర్యము ఉండవలెను. అది ఎందువలనగాని ఇసుమంతయు లోపింపరాదు. అత్యున్నత సత్యములను సర్వజనులకు బాహాటముగా బోధింపుడు. మీకు గౌరవహాని కలుగుననిగాని, అనుకూలురతో రాయిడి కలుగుననిగాని జంకకుడు. ఎట్టి తీవ్రపరీక్షలకైన ఆగి, సత్యమును వీడక, సేవించితిరేని, మీ కొక దివ్యశక్తి చేకూరునని దృఢముగా నమ్ముడు. అప్పుడు సత్యదూరములని మీకు తోచు విషయములను మీయెదుట చెప్పుటకే మానవులు భీతిలుదురు. మీసత్యదీక్ష కేమాత్రము భంగము రానీయక, పదునాలుగేండ్లు, వరుసగా, నిష్కర్షగా సత్యవ్రతము పాటించితిరేని, మీ పలుకులన్నిటి యందును జనులకు పరిపూర్ణ విశ్వాసము కుదురును.

*　*　*

వత్సా, ఇనుప కండరములు, ఉక్కునరములు, వానిలోపల నివసించు మనస్సు పిడుగు పదార్థముతో చేయబడినది: ఇదియే నాకు కావలసినది.

*　*　*

సత్యాసత్యములను తూచినచో, సత్యము వైపు అపారముగా మ్రొగ్గుచూపును. సౌజన్య ముకూడ సత్యమువంటిదే. ఇవి రెండును నీకు కలవేని, అప్రయత్నముగా స్వతస్సిద్ధశక్తిచేతనే నీకు విజయము చేకూరును.

*　*　*

పర్వతసమానములగు మహావిఘ్నములు అడ్డుతగిలినను వానిని దాటుదమను దృఢ సంకల్పము మీకు కలదా? ఖడ్గము చేతబూని లోకమంతయు మిమ్ము ప్రతిఘటించి నిల్చినను, యోగ్యమని మీకు తోచిన విధముననే ప్రవర్తింపసాహసింతురా? మీ ఆలుబిడ్డలు మీకు ప్రతికూలురుగా నున్నను, మీ ద్రవ్యమంతయు పోయినను, మీపేరు ప్రతిష్ఠలు నశించినను, మీ సంపద అదృశ్యమైనను అట్లే ప్రవర్తింతురా? అప్పటికిని మీరామార్గమును వీడక, గమ్యము చేరువఱకు అచంచలదీక్షతో దానినే అనుసరింతురా?

*　*　*

సత్యమార్గము నిన్నెచటికి గొనిపోయినను వీడక దానినే అనునుసరించుచుండుము. నిన్ను నీ భావములు వానితార్కిక పరమావధికి కొనిపోనిమ్ము. ఆ విషయమున పిఱికితనము చూపకుము; కపటవేషధారివియు కాకుము.

*　*　*

ఆశాశీలత నలవఱచుకొనుము. అనగా, ప్రతి వస్తువునందును, ప్రతి సంఘటనమందును గల గుణమును, ఆనుకూల్యమును చూడ యత్నింపుము. ఒకచోట చతికిలబడి మన శరీరములందుగల లోపము లన్నిటిని జ్ఞప్తికి తెచ్చుకొని ఏడ్చుచు, మొత్తుకొనుచు ఉండుట వలన నేమైన ఫలము కలుగునా? ప్రతికూల వాతావరణమును లొంగదీసి విజయము సాధించు ధీరోద్యమమే మన కాత్మోన్నతిని చేకూర్పగలదు.

*　*　*

ఆస్తికధర్మజీవన మనగా యజ్ఞయాగాదు లొనర్చుటకాదు; (దేవాలయములలో) మోకరించి ప్రణమిల్లుటకాదు; గొణుగుళ్లును, సణుగుళ్లును (మంత్రోచ్చారణము) కూడ కాదు. కాని, వానియందు గుణము లేకపోలేదు. మనోజ్ఞములగు సాహసిక కృత్యములను ధీరతతో నిర్వహింప మనలను బురికొల్పి మన తలంపుల నత్యున్నతికి గొనిపోయి దివ్యపరిపూర్ణతను గ్రహించు శక్తిని కల్పించినచో, అవన్నియు గుణవంతములే.

*　*　*

మొదట మనము దివ్యులము కావలెను. ఆ పిదప ఇతరులు ఆ స్థితినిపొంద దోడ్పడవలెను. '(నీవు) కమ్ము, పిదప (ఇతరులను) కానిమ్ము' అనునదియే మన దీక్షావాక్యమగు గాక!

*　*　*

మన శ్రుతి స్మృతులందే 'అభీః', 'అభీః' అను విశేషణము భగవంతునిగూర్చి వాడబడినది. జన్మసాఫల్యమొందుటకు మనముకూడ 'అభీః' (భయరహితులము) కావలెను.

*　*　*

మీలోని దైవత్వమును పైకి తెండు. అప్పుడు సర్వమును దానిచుట్టి, తమ తమ స్థానములలో నమరి పరస్పరానుకూలములై యుండును.

# నిత్యనూతన సందేశప్రదాత : వివేకానందస్వామి

ఆధ్యాత్మికరంగములో మహాపురుషులలో శ్రీవివేకానందస్వామి సాటిలేని వ్యక్తివిశేషము. ఆయన జన్మించినది 1863-వ సంవత్సరము జనవరి 12-వ తేది. మహాసమాధినొందినది 1902 జూలై 4-వ తేది. ముప్పదితొమ్మిది సంవత్సరముల ఐదునెలల మూడువారముల ఈఅల్పాయుస్సులో ఆయనసాధించినంత సాధించినవారు శ్రీశంకరాచార్యులకనంతరము ఈ వేయేండ్లలో మఱొక్కరు లేరు. ఆయన కనంతరము ఈఅఱువదియేండ్లలో సైతము అంతటివారు – గాంధిమహాత్ముడు తప్ప–మఱొక్కరు లేరు. ప్రాచీనకాలములో బౌద్ధమతప్రచారకులు సముద్రాంతరిత దేశములకు పోయి ప్రచారము చేసిరని చరిత్రవలన తెలిసికొనుచున్నాము. అర్వాచీనకాలమున భారతీయ వేదాంతసందేశమును సుదూరప్రాంతములకు కొనిచనిన ప్రథమహిందూసన్న్యాసి శ్రీవివేకానందస్వామియే.

ఆయనవ్యక్తివిశేషమును రూపొందించి పెంపొందించిన అంశములు మూడు. (1) పసిప్రాయముననే ఆయన అధికరించిన విద్య. (2) శ్రీరామకృష్ణునిసన్నిధిలో బడసిన ఆధ్యాత్మికశిక్షణము. (3) భారతదేశమును గూర్చియు ప్రజలనుగూర్చియు ఆయన గడించిన పరిజ్ఞానము. వానియందు ఆయనకు గల ప్రేమభక్తులు.

ఆయన పాశ్చాత్యతత్త్వశాస్త్రమును ఇతర శాస్త్రములను నేర్చెను. ప్రాచ్యదేశీయవిజ్ఞానమును బడసెను. కావున భౌతికాదిశాస్త్రప్రయోగముల ఫలితములను భారతీయమహర్షులు ఆధ్యాత్మికరంగమున సాధించిన పరిశోధనలఫలితములను సమన్వయింపగలిగెను. ఉపనిషన్మతమును వేదాంతశాస్త్రమును ఆధునిక మానవుని డెందమున కెక్కురీతిలో ప్రదర్శించెను.

శ్రీరామకృష్ణుడు ఇతనికి గురు వగుట ఇతనియదృష్టము. ఆయన కితడు శిష్యు డగుట ఆయనయదృష్టము. గురుదేవుని అమోఘశిక్షణములో అతడు ఆధ్యాత్మికసాధనలందు సిద్ధిపొంది వేదాంతశిఖరమగు నిర్వికల్పసమాధిని అధిరోహింపగల్గెను. ఆసమాధిదశలో ఏకాద్వితీయనిర్గుణబ్రహ్మమందు జీవజగత్తులు లయించిపోగా ఆత్మైక్యము స్వానుభవగోచర మగును. శ్రీరామకృష్ణుడు మహాసమాధినందుటకు మూడుదినములుముందు స్పర్శమాత్రమున తన సర్వశక్తులను వివేకానందునిలోనికి సంక్రమింపజేసెను. మానవతతిని ప్రబోధింపు మని అతనిని శాసించెను. తనశిష్యుడు సప్తర్షులలో నొక్కడనియు మానవులభౌతికమానసిక నైతికపారమార్థికలోపములను తొలగింప అవతరించెననియు గురుదేవుడు దివ్యదృష్టిచే నెఱిగియుండెను. కావున విశ్వమానవశ్రేయస్సును సాధించుటకు శిష్యుని పూంచెను.

ఈనాటి రాజనీతిజ్ఞులవలె శ్రీవివేకానందస్వామి వార్తాపత్రికలను ఇతరప్రచురణములను చదివి అందుమూలముగా భారతదేశమును భారతీయులను వారిసమస్యలను గూర్చిన జ్ఞానమును పొందినవాడు కాడు. స్వామి పాదచారియై హిమాలయములనుండి కన్యాకుమారియగ్రమువఱకు పర్యటించి గడించినది ఆయన జ్ఞానము. సంఘములోని వివిధవర్గముల పరిస్థితులను వారియక్కఱలను ప్రత్యక్షముగ చూచి గ్రహించెను. ఆయనకంటె భారతమాతను గాఢముగ ప్రేమించినవారు లేరు. ఆయనను మించిన దేశభక్తుడు లేడు.

వరిష్ఠవేదాంతి యనియు, నవ్యధర్మప్రవక్త అనియు, దేశభక్తయతీశ్వరు డనియు దైవదత్త

వక్తృత్వశోభితు డనియు—ఇంకను పెక్కు విశేషణములతో వివేకానందస్వామి ప్రశంసింపబడెను. ఆయనకు గొప్పలు ఇవే కావు. ఇంక నెన్నియో కలవు. చికాగోలో జరుగనుండిన విశ్వమతమహాసభలో ప్రతినిధిగ స్వీకరింపబడుటకు యోగ్యతాపత్రము నిమ్మని ఆయన హార్వర్డుయూనివర్సిటీ ప్రొఫెస్సరగు రైటు మహాశయుని అడిగినప్పుడు ఆయన చెప్పినాడట: "స్వామీ, నిన్ను యోగ్యతాపత్ర మడుగుట ఎట్లుండు ననగా 'ప్రకాశించుటకు నీ కేమి హక్కున్నది' అని సూర్యు నడిగినట్లుండును." ప్రతినిధుల నెన్నుకొను పరిషత్తున కధ్యక్షుడగు డాక్టరు బాఱ్ఱోసుకు ప్రొఫెస్సరు రైటు ఇట్లు వ్రాసెను. 'పండితులగు మన ప్రొఫెస్సరులను అందఱిని కలిపినప్పటికిని ఈయనకు సాటి కాలేరు.

ఆయన ఉపదేశించినదియు ప్రచారము చేసినదియు ఏమి? ఆయనమాటలలోనే చెప్పవలయు ననిన ప్రాతఆసవమునే క్రొత్తసీసాలో నింపినాడు. సనాతనమైన భారతవిజ్ఞానమును క్రొత్తమార్గములో ఆయన ప్రచారము చేసెను. స్వకీయప్రగాఢాధ్యాత్మిక సాక్షాత్కారములచే ఆయన బోధనలలో అపూర్వామోఘశక్తి యుండెడిది.

చెదరియున్న హిందూసిద్ధాంతపు బలగముల నన్నిటిని ఆయన ఒక్కటిగ చేర్చి 'ఈ మతము అన్నిమతములకంటె ప్రాచీనమైనది. అన్ని మతములకును ఇది తల్లిమతము' అని ప్రదర్శించెను. వివిధచిత్తవృత్తులకు అభిరుచులకు అనువుగా హిందూసిద్ధాంతము వివిధసాధలను కలుపుచుండును. ఈసిద్ధాంతమునకు సగుణబ్రహ్మమును సమ్మతమే నిర్గుణబ్రహ్మమును సమ్మతమే. ద్వైతము, విశిష్టాద్వైతము అద్వైతము సమప్రధానములగు మార్గములే. తర్కశాస్త్రమున, మనస్తత్త్వశాస్త్రమున, నీతిశాస్త్రమున, వేదాంతమున స్వానుభూతిప్రధానమగు మర్మమతమున గల వైవిధ్యము హిందూమతమునకు సమ్మతమైనందున దీనినే బహుమత పరిషత్తు అని పేర్కొనిరి. వివేకానందస్వామి తన ప్రతిభాజ్యోతిచే ఈయన్నింటిని ఒక్కయ ఖండరూపముగ కలిపి 1893 లో షికాగోనగరమున విశ్వమతమహాపరిషత్తులో ప్రదర్శించెను. ఎల్లయ్యకు, పుల్లయ్యకు, రామయ్యకు ఒక్కకొలత చొక్కా సరిపడ దని ఆయన ఎఱుగును. కావున ఆయన హేతువాదప్రవణులకు జ్ఞానయోగమును, భావోద్రేకపరులకు భక్తియోగమును, కర్మప్రవణులకు కర్మయోగమును కలిపెను. రాజయోగమునుగూడ ఆయన బోధించి ప్రచారము చేసెను. మతసారమును తత్త్వసారమును ఆయన సూత్రప్రాయముగ ఈక్రిందిమాటలలో ఇమిడ్చెను. 'ప్రతిఆత్మయందును దివ్యత గర్భితమైయున్నది. వెలుపలి లోపలి ప్రకృతిని అదుపులోనికి దెచ్చుకొని, గర్భితమైయున్న దివ్యతను ఆవిష్కరించుటే లక్ష్యము. కర్మయోగముచేతగాని, భక్తియోగముచేతగాని, రాజయోగముచేతగాని, జ్ఞానయోగముచేతగాని- ఈయన్నింటిచేతగాని ఆలక్ష్యమును సాధింపుడు, బంధవిముక్తి నొందుడు. మతసార మిదే. సిద్ధాంతాలు, సూత్రాలు, క్రతువులు, గ్రంథములు, గుడులు, ఆచారములు ఈవివరము లన్నియు అప్రధానములు'.

శీలము రూపొందవలెను. ఆధ్యాత్మికసాధన లుండవలయును. ఇవి లేక కేవలము తత్త్వశాస్త్రాధ్యయనము చాలదు. ఇవి ఉన్ననే సాధకునకు బ్రహ్మసాక్షాత్కారానుభవము కలుగును.

ద్వేషదురభిమానములు స్వామిజీకి అనభిమతములు. విశ్వమతమహాసభలో ఆయన

ఇట్లు వ్రాసెను. ''ఎన్నటికైనను విశ్వమానవమత మనున దొకటి వెలయుచో అది తాను ప్రకటించు భగవంతునివలెనే దేశకాలాతీతమై అనంతమై వెలయవలయును. కృష్ణు ననుసరించువారలయందేమి, క్రీస్తు ననుసరించువారలయందేమి, పావనాత్ములయందేమి, పాపాత్ములయందేమి ఎల్లరయందును సమానముగా తదీయభానుదీప్తి ప్రసరింపవలయును. అది బ్రాహ్మణమతముగా గాని, మహమ్మదీయమతముగా గాని, బౌద్ధమతముగా గాని, క్రైస్తవమతముగా గాని యుండక వీని నన్నిటిని తనయందిముడ్చుకొనుచు ఇంకను వికాస మొందుట కనంతమగు నవకాశము కలిగి యుండవలెను. మఱియు సంసారపంకమున పొరలాడుచుండు పశుప్రాయుడు మొదలుకొని అఖండౌదార్యధీవైభవములచే తన మానవత్వమును గూర్చి సంశయ ముదయింపజేయుచు, సామాజికభయగౌరవాస్పదుడై, ఇంచుమించుగా మానవకోటికంతకు నతీతుడై యుండు మహనీయునివఱకు ఎల్లరకును తావొసగి వారలను తనయనంతప్రేమహస్తముతో నాలింగన మొనరించుకొనునట్టిదై యుండవలయును. అట్టి విశ్వమానవమతము హింసాద్వేషములకు తనవ్యవస్థయందిసుమంతయు చోటీయక సమస్తస్త్రీపురుషులును భగవత్స్వరూపులే యని గుర్తించుచు తన యథార్థదైవస్వభావమును గ్రహింప మానవకోటికి తోడ్పడుటయే తనప్రధానాశయముగ గణించును. అట్టి మతమును ఒసగుదురేని సర్వదేశములవారును మి మ్మనుసరింతురు... క్రైస్తవుడు హిందువుగా గాని, బౌద్ధుడుగా గాని కానక్కఱ లేదు. హిందువుకాని బౌద్ధుడుకాని క్రైస్తవుడు కానక్కఱలేదు. ప్రతి వ్యక్తియు ఇతరుల భావములను ఇతర మతసారమును గ్రహించుచుండియు స్వీయవ్యక్తిత్వమును నిలుపుకొని స్వీయవికాస నియమానుసారము అభివృద్ధి నొందవలయును''.

ఆర్ద్రహృదయముతో ఆయన ఇట్లనెను. '..మిమ్ము పాపు లని పేర్కొన హిందువు నిరాకరించును. భూమిపై నున్న దివ్యులరు, మీరు పాపులా! మానవుని పాపి అని పేర్కొనుటే పాపము, మానవప్రకృతికి దూషణము. రండి, సింహములారా, మీరు గొఱ్ఱెలరను భ్రాంతిని దులిపివేసికొనుడు. మీరు నిత్యాత్ములు, ముక్తాత్ములు, ధన్యాత్ములు. ప్రకృతి మీరు కారు. మీరు దేహములరు కారు. ప్రకృతి మీకు బానిసయే కాని మీరు ప్రకృతికి బానిసలు కారు.'

తికోన్నతిని ఆధ్యాత్మికసమున్నతిని సాధించుటలో వేదాంతమార్గమునకును క్రైస్తవమార్గమునకును గల విభేదమును పై నుదాహృతములైన స్వామీజీవాక్కులు స్పష్టపఱచుచు జీవులలో దివ్యత గర్భితమైయున్న దను అంశమును నొక్కి తెలుపుచున్నవి. జీవునిలో అనాదినిధనమును నీడలేని జ్యోతియు బలమునకు ధీరతకు విశుద్ధికి పవిత్రతకు జ్ఞానమునకు వివేకమునకు ఆకరమును ఐన నిత్యాత్మ యున్నది అనెడి శ్రీ స్వామీజీసందేశములో భవిష్యత్తున అపార శ్రేయస్సాధకములైన అవకాశము లున్నవి. అందఱిలో నున్న బ్రహ్మ మొక్కటే అనెడి ప్రబోధము మానవసేవయే మాధవసేవ అనెడి ఆశయరూపమున వెలువడినది. మానవసేవ మాధవసేవయే అని మనలో పలువురము చెప్పుచుందుము. కాని చెప్పునప్పుడెల్ల ఆ మాటల సార్థక్యమును మనము గుర్తించుటలేదు. బాధలకు లోనైన మానవుని భగవంతుని ప్రత్యక్షరూపముగా భావించి మనలో నున్న ఆత్మయే అతనిలోను ఉన్న దని విశ్వ

సించినప్పుడు అతనికి మనము చేయు పరిచర్య భగవదారాధన మగు నని శ్రీ వివేకానంద స్వామి బోధించెను. మన మేమి చేసినను అది జీవునిలోని దేవునకే చెందును. కావున బాధిత మానవుల భౌతికమానసికనైతికాధ్యాత్మికము లైన కొదువలను తీర్చి వారికి సేవ చేయు అవకాశము లభించునేని అందుచే ధన్యుల మగు వారము మనమే.

ఈ సేవాదర్శమును అమలుపఱచుటకే శ్రీ వివేకానందస్వామి రామకృష్ణమిషను (సేవా సంఘము)ను స్థాపించెను. ఆ సంఘశాఖలు పెక్కులు ఈనాడు భారతదేశమందును, విదేశములందును ఉన్నవి. అన్ని శాఖలును స్వామీజీ నిర్ణయించిన సేవాప్రణాళికను నిర్వహించుచున్నవి. ఈ సేవాదర్శమును అమలుపఱచినచో సేవను స్వీకరించువారి ఉపయోగము కలుగుటయే గాక సేవచేయు వారికిని పవిత్రత సిద్ధించుచున్నది. జీవునిలోని దేవుని సమారాధనము ఆరాధకునికి పవిత్రతను సమున్నతిని సమకూర్చుటే గాక ఆరాధితులకు సైతము ఉదాత్తతయు ఉన్నతియు కల్గుట కనుకూలములైన వాతావరణము నేర్పఱచును.

పాశ్చాత్యవిద్వాంసులు కొందఱు 'వివేకానందస్వామి మానవతత్త్వ పరిశోధకనిష్ణాత' అనిరి. కాని ఆయన అనుష్ఠించినది, ప్రచారము చేసినది, మానవాధ్యాత్మికతత్త్వమునే గాని కేవల మానవతత్త్వమును కాదు. కొందఱాయనను ప్రజాసామ్యవాది (సోషలిస్టు) అనిరి. కాని సర్వమానవులకును తప్పక యుండవలసిన వివేకమే ఆయన బోధించిన సామ్యవాదము. తన్నుగూర్చి ఆయనే ఇట్లు చెప్పుకొన్నాడు. నేను ప్రజాసామ్యవాది నగుదునో కానో నే నెఱుగను. కాని పస్తుపెట్టుటకంటె సగము కడుపునకు అన్నముపెట్టుట మే లనుట నామతము. మానవతత్త్వవాదము ప్రజాసామ్యవాదము మున్నగువానిలో నేదియు ఆయన యనుష్ఠించి బోధించిన దానికి తగిన పేరు కాదు. ఏలయన ఆత్మైక్యమును ఆయన బోధించియున్నాడు. ఈ వాదములో దేనిలోను ఆత్మైక్యసిద్ధాంతము లేదు. ప్రతిమానవునిలోను దివ్యత ఇమిడియున్నదనియు మనలో నున్న ఆత్మయే అందఱుమానవులలో నున్నందున మానవునకు మానవసేవ విధాయకము అని కదా స్వామీజీ యుపదేశము. మానవసేవయే మాధవసేవ అను ఆశయమును విశ్వమంతటికిని కఱపినది భారతదేశమే. ఉపనిషత్తుల నిండుగ నున్న విషయములు మానవులకు ఆసక్తిగొలుపునవే. భారతీయమహర్షులును ఆచార్యులును మానవసేవను నొక్కి కఱపిరి. శ్రీ వివేకానందస్వామిద్వారా వెలువడినపుడీబోధనము మఱింత శక్తివంత మాయెను. అద్వైతమును ఆయన బోధనానుసారము మన సమస్యల పరిష్కారమునకు వినియుక్తమైనప్పుడు అది పండితులకు మాత్రము నచ్చు శుష్కతత్త్వము కాకపోవును.

పాశ్చాత్యులయొద్దనుండి భారతీయులు నాలుగువిషయములను నేర్చుకొనవలయు నని వివేకానందస్వామి కోరినారు. 1. భౌతికాదిశాస్త్రము. 2. సంస్థానిర్మాణము. 3. సడలని కార్యదీక్ష. 4. విశ్వమానవసమానత్వము. 'పాశ్చాత్యుని పాదములవద్ద కూర్చుండి భారతీయుడు యంత్రనిర్మాణము నేర్చుకొనవలయును. భారతీయుని పాదములొద్ద కూర్చుండి పాశ్చాత్యులు ఆస్తిక్యమును, పారమార్థిక మార్గమును నేర్వవలెను' అని స్వామీజీ చెప్పినాడు.

'పాశ్చాత్యులలో సంస్థానిర్మాణసామర్థ్యమున్నది. చెదరినశక్తులను సేకరించి ఏకముఖ

మొనరించి తమ అక్కఱలకు వారు వినియో గించుకొనగలరు. ఆ నేర్పును వారియొద్దనుండి భారతీయులు గడింపవలయును. పాశ్చాత్యుల కార్యదీక్షను ప్రశంసించుచు స్వామీజి 'చూడుడు యూరపు శక్తిజనకయంత్రమువలె నున్నది. అందుండి నిరంతరశక్తి ప్రవాహము వెలువడుచున్నది' అన్నారు. ఇదియు పాశ్చా త్త్యులయొద్దనుండి భారతీయులు నేర్చుకొన వలసినదే. సర్వమానవ సమానత్వమును ఆలాగు నేర్చుకొనవలసినదే.

పాశ్చాత్యుడు భారతీయునియొద్దనుండి శాంతమును ప్రసన్నతను అలవఱచుకొనవల యును. పశ్చిమదేశాలలో జీవితము నిర్విరామ మైన పరుగువలె నుండును. తమకార్యో ద్వేగము తమ్ము ఎటకు కొంపోయి విడచునో వారు ఎఱుగరు. గ్రుడ్డియాశలు వానివైఫ ల్యము తత్ఫలితమైన అశాంతి పాశ్చాత్యదేశ ములలో మిక్కుటముగ కానవగును. ఇవి తొలగవలయు ననిన వారు ఆధ్యాత్మికలక్ష్య మును ఆకళింపుకొనవలయును. ధ్యానమనన ములను ఎక్కువగ నభ్యసింపవలయును. ప్రాత స్సాయంకాలములందు ప్రాపంచికవిషయము లను విస్మరించి పరమాత్మధ్యానమును అభ్య సింపనిదే శాంతి మానవులమధ్యను చేకూరదు, ఒక్కొక్కమానవునిలోను చేకూరదు.

దివ్యదృష్టిచేతనో అనునట్లు భవిష్యత్కాల మున పాశ్చాత్యులకు శ్రేయస్కరమైన మత మును స్వామీజీ సూచించెను. 'నేడు యూరో పులో ఐహికపరత ఉత్కటముగ నున్నది. యుక్తివాదమునకును హేతువాదమునకును ఆగగల అద్వైత మొక్కటే వారికి మోక్ష దాయకము. విజ్ఞానపరులకు నచ్చున దద్వైతమే. కావుననే అమెరికా, యూరపులలో అది నెలకొనుచున్నది.'

పాశ్చాత్యులకు స్వామీజీ ఈలాగు హెచ్చ రిక చేసినారు. 'ఆధ్యాత్మికప్రవణత అలవఱచు కొనక యంత్రశక్తివర్ధకమగు ఐహికపరత యూరపులో ఇట్లే యుండునేని ఏబదేండ్లలో సర్వవినాశము చేకూరును.' ఈమాట స్వామీజీ చెప్పినది 1895 లో. ఇరువదేండ్లలో స్వామీజీ సూచించినట్లు సర్వవిధ్వంసకమగు మొదటి ప్రపంచయుద్ధము సంభవించినది.

లక్షకాండిలుబల్బును వెలిగించి చీకటిని పాఱద్రోలి ఆవెలుతురులో వస్తువర్గమును స్పష్టముగా చూపెట్టినట్లు శ్రీవివేకానందస్వామి భారతీయసమస్యలను తేటతెల్లమొనర్చెను. ఆయన పరిశీలింపని చర్చింపని యంశ మొక్క టైనను లేనే లేదు. ఆయన చర్చలలోను పరి ష్కారములలోను 'రవికానని దానినిసైతము కాంచగల' ప్రాతిభచక్షువు గోచరించు చుండును.

స్వామిజియభిప్రాయమున "విద్య యనగా మనతలలోని కెక్కింపబడిన విషయబాహు ళ్యము కాదు; జీర్ణము కాక కలత పుట్టించు నానావిషయముల కలగూరగంప కాదు. ఉజ్జీ వనకరములును స్థైర్యవీర్యజనకములును శీల నిర్మాణ సమర్థములునగు భావములను గ్రహిం చుటయే విద్య. అదే మనకు వలయునది. ఐదు భావములను గ్రహించి మనజీవితమును వాని మయముగాను వానిని మనశీలముగాను రూపొం దించుకొన గల్గితిమేని పెద్ద భాండాగారము నంతను కంఠస్థముచేసికొనినవానికంటె మనమే విశేషవిద్యావంతు లనిపించుకొన దగినవారమై దీపింతుము. విద్య కేవలము భావరాశియే య గుచో పుస్తకభాండగారములనే విజ్ఞాన సర్వస్వములనే మునీశ్వరులుగను ఋషీశ్వరులు గను గణింపదగియుండును." విద్యకుగల యద్భుత శక్తిచేత పరిష్కరింప సాధ్యపడని సమస్యయే

లేదని స్వామిజిచిత్తము. కావునపామరప్రజానీక మునకు విద్య గఱపుటయు మహిళల సముద్ధరణమును స్వామిజిప్రణాళికలో ప్రధానాంశ ములు.

ఆయనకాలపు సంఘసంస్కర్తలు స్వామిజిని తమకోవలో జేర్చుకొనగోరి ప్రయత్నించిరి. కాని పైపైనిమార్పులు తన కనభిమతములనియు ఆమూలాగ్రము చక్కబఱచుటే తన లక్ష్యమనియు ఆయన విశదీకరించెను. వితంతుపునర్వివాహమును గూర్చి ఆయనయభిప్రాయము నడిగిన యొకరికి ఆయన చెప్పిన జవాబు "ఈ ప్రశ్నను మీరు నన్నేల అడుగుచున్నారు? నేను వితంతువునా?... వితంతువులకు లభించు భర్తలసంఖ్యపై దేశాభ్యుదయ మాధారపడి యుండుననుట మీ యభిప్రాయమా?...మహిళలకు విద్య గఱపుడు. వారిసమస్యలను వారే పరిష్కరించుకొందురు."

పేదప్రజలపట్ల దేశమున గానవగుచుండు ఉపేక్షయు నిరాదరమును స్వామిజిని కనలించినవి, ఇట్లన్నా డాయన: "లక్షలకొలదిమంది స్వదేశీయు లజ్ఞులై క్షుధార్తులై దినములు గడపుచుండ, వారిని గ్రేగంటనైనను జూడక, వారి నథఃపాతాళమునకు దిగద్రొక్కి తాము విద్యావంతులైన వారందఱును దేశద్రోహు లని నాయభిప్రాయము."

మహిళలలో విద్య పెంపొందవలె ననుట స్వామిజి యభిప్రాయమైనను, భారతీయమహిళలు పాశ్చాత్యమహిళల ప్రతికృతులుగా రూపొందుట ఆయన కనభిమతము. మనమహిళలు సీత - సావిత్రి - అహల్యాబాయి - గార్గి- మైత్రేయి మున్నగువారిని ఆదర్శములుగ నుంచుకొనుటే ఆయన కభిమతము.

ఆయనజీవితకార్యమునకు భారతదేశ మొకరంగము, సమస్తవిశ్వమును ఒకరంగమే. జాతిమతవర్ణాదివిభేదము నాయన పాటింపలేదు. విశ్వము నుజ్జ్వాత లూపినవా డాయన— "మాకు భారతదేశ మెంత? ఇంగ్లం డెంత? అమెరికా ఏపాటి? అజ్ఞులచే జీవు డని పేర్కొనబడుచుండు దేవునకు కింకరులము మేము" అన్నాడు. "నాజీవితము మానవకోటికై బలిపీఠమున నర్పితమగు భవ్యదిన మెప్పుడు వచ్చునో" అని ఆయన ఉబలాటపడె ననగా- ఆశ్చర్య మేమి?

నానాటికీ హెచ్చుచున్న స్వామిజిశిష్యులయు భక్తులయు ప్రశంసకులయు సంఖ్యను జూడుడు. ప్రాక్పశ్చిమములందు లక్షలకొలది మానవుల జీవితాలపై నిశ్శబ్దముగా పర్వుచుండు ఆయన ప్రభావమును జూడుడు. సద్వారకముగను అద్వారకముగను నూర్లకొలది ఉద్యమాలకు ఆయనసందేశమే ప్రేరక మగుచుండుటను గుర్తింపుడు. గుర్తించినపుడు— మహాసమాధికి రవంతముందు స్వామిజి పల్కిన వాక్కుల యాథార్థ్యము విశదమగును. "జీర్ణవస్త్రమువలె నీశరీరమును విడిచి యశరీరుడనై యుండుటయే మంచి దని భావింతును గాక, నాయుద్యమమునుమాత్రము విడువను. సమస్తప్రపంచము తాను భగవంతునకంటె వేఱుకా దని గ్రహించు పర్యంతము మానవుల నుజ్జీవింపజేసెదను" - అనెను కదా!

# శ్రీ వివేకానంద శంఖారావం

## కవియోగి మహర్షి శ్రీ శుద్ధానంద భారతిగారు

1917 వ సంవత్సరంలో మధురయొద్ద నేను దేశీయనాయకవరేణ్యుడగు బాలగంగాధర తిలక్కును కలిసికొన్నాను. భారతదేశంలో ఒక గీతామిషన్ (= సేవాసంఘమును) నెలకొల్పాలి. భారతీయులలో ఆత్మచైతన్యమును మేలుకొల్పడానికి ప్రచారకులదళం ఒకటి రూపొందాలి అని నేను అయనతో సంభాషిస్తున్నప్పుడు, ఆకస్మికంగా ఆయన శ్రీవివేకానందస్వామినిగూర్చి ప్రసంగించడం ప్రారంభించాడు. తిలక్కు వివేకానందస్వామిని 1892 వ సంవత్సరం పూనాలో దర్శించెనట. వివేకానందస్వామి తిలక్కుతో ఎనిమిదిదినాలు బస చేశారు. ఆయన పౌర సభలో ఉపన్యాసాలు చేయ లేదు. పదిమందితో కలియడం లేదు. తిలక్కు వివేకానందస్వామిచే దక్కను క్లబ్బులో తొట్టతొలిసారి మాటాడించారు. అప్పుడు స్వామి ఈలాగు అన్నారుట. ''సజీవ భగవద్గీతలుగాను సజీవములైన ఉపనిషత్తులుగాను ఉండండి. వైరాగ్యం అంటే కేవలం లోకాంతరపరతయు గొడ్డుజీవితమున్నూ కాదు. ధీరంగా వీర్యంతో అమోఘంగా మీరు జీవితాన్ని ఎదుర్కోనాలి. మనలో లేనిది ఐకమత్యం. దేశం విజయవంతం కావాలంటే ఐకమత్యమూ కార్యశూరత కావాలి.'' ''అందఱు వివేకానందులుగా రూపొందాలి. ఆ ఆత్మధీరత, స్వాతంత్ర్యానికై పోరాడడానికి కావలసిన ఆ సాహసం అలవడాలి'' అన్నారు తిలక్కుగారు.

నాతోబుట్టువు జె. వి. రాము - శ్రీవివేకానందస్వామి మధురరామనాథమండలాలలో ఉన్నన్నినాళ్లు ఆయనతో ఉండినాడు. స్వామిజి కొందఱు పిల్లలని ఆలింగనం చేసికొని, ''అనవె ఓం తత్స దో మని ము క గీతి'' అంటు దీవించారు. ఆ పిల్లలలో నేను ఒకణ్ణి. నేను సన్న్యాసి నౌతానని స్వామిజి నాసోదరునితో చెప్పారుట.

భారతాధ్యాత్మికవాణి శ్రీవివేకానంద స్వామిగుండ వెలువడింది. ఆయన భారతదేశానికి కీర్తిప్రతిష్ఠలు తెచ్చారు. మహోజ్జ్వలమైన భారతదేశపునర్భవాన్ని ముమ్ముందు సూచించినవా డాయన. నవభారతానికి (శ్రీ)రామకృష్ణపరమహంస ముఖ్య పూజారి; శ్రీ వివేకానందస్వామియే నవ్యభారతాధ్యాత్మికవాణి. ఏకీకరణశక్తిని రామకృష్ణుడు దక్షిణేశ్వరంలో అంకురింప జేశాడు. దాని నొక ప్రజ్వలోద్యమంగా పెంపొందజేశాడు వివేకానంద స్వామి.

గురుదేవుడు తా నెన్నుకొన్న సాధక శిఖామణిలో తన అనుగ్రహాన్ని కూలంకషంగా నింపి 1886 వ సంవత్సరం ఆగస్టు 15 వ తేది మహాసమాధి పొందాడు. వివేకానందస్వామి ఆస్థాసంపన్నులను తనచుట్టు ప్రోగుచేసికొని రామకృష్ణమిషను అను గొప్పసంస్థను ప్రారంభించాడు. గురుదేవుడు కలలుగన్న లక్ష్యాలను సాధిస్తున్నది ఆ సంస్థ. బరానగరంలో పాడుపడి పాములపుట్టగా ఉండిన ఒక యింటిలో ఈయువసన్న్యాసులు మొదట ఉంటూ వచ్చారు. పేదఱికపుబాధ పడ్డారు, అవివేకుల పరిహాసాలకు వారిచేతిపరాభవాలకు గుఱి అయ్యారు, భిక్షాటనంతో జీవనం గడిపారు: ఐనా, వారు సర్వతంత్రస్వతంత్రులు, భవిష్యత్తునందు అప్రకంప్యమైన విశ్వాసం వారి కుండింది. యోగమందున్నూ వేదాంతపరిజ్ఞానమందున్నూ వారు పరిపూర్ణతను గడించి అల

నాటి బుద్ధదేవుని శిష్యులవలెను క్రైస్తు శిష్యులవలెను 'ప్రతిజీవుడూ దేవుడే' 'అందరిలో ఉండే దేవుడు ఒక్కడే' అనే సందేశం ప్రచారంచేస్తూ తరలినారు. ఆ సేతుహిమాచలం పర్యటించి శ్రీవివేకానందస్వామి కన్యాకుమారి కెదురుగ ఉండు గుట్టనధిరోహించాడు. 'ఏకం సత్' ఉన్నదొక్కటే అనే సందేశంతో పాశ్చాత్యదేశాలకు వెళ్లుదా మనే ఆశయం ఆయనలో అప్పుడు ఆవిర్భవించింది. సేతుపతి మహారాజు ఆయనను అమెరికాకు పంపారు. అక్కడ ఆయన రెండునెలలపాటు కష్టాలు పడ్డాడు. తర్వాత శ్రీమతి జార్జి హేలుసతి సాహాయ్యం ఆయనకు లభించింది. ఆ సాహాయ్యంతో పరిచయలేఖలతో స్వామి పదివేల మంది సదస్యులు క్రిక్కిటిసిఉండే విశ్వమత మహాపరిషదుపన్యాసవేదిక మీదికి ఆహ్వానం పొందాడు. భారతదేశాధ్యాత్మిక చరిత్రలో 1893 వ సంవత్సరం సెప్టెంబరునెల 11 వ తేది అవిస్మరణీయ నిత్యోజ్జ్వలదినం. "అమెరికను సోదరులారా" అను స్వామి ప్రసంగంలోని తొలి మాటలు సందర్భానికి అత్యంతానురూపంగా ఉండినందువల్ల సదస్యులవద్దనుండి అప్రయత్నంగా వెలువడ్డ కరతాళఘోష బృంహితసాధువాదములతో సభామందిరం నిండిపోయింది. పాశ్చాత్య నాయకులు హిందు యతీంద్రుని ఉపన్యాసమును ఒళ్లంతా చెవులుచేసికొని ఆలకించారు. ఆయన ఉపన్యాసాలు స్వతంత్రములున్నూ విశ్వరంజకములున్నూ అయినందున పరిషత్సమావేశాలు జరిగిన అన్నిదినాలు కార్యక్రమంలో కడపట స్వామిజి ఉపన్యాసం ఉంటుం దని ప్రకటిస్తే చాలు. తహతహపాటుతో నిరీక్షిస్తూ శ్రోతలు వెడలకుండెడివారుట. ఆయననోట వెలువడే ప్రతిమాటకు సదస్యుల ప్రశంసాఘోష మిన్ను ముట్టేది. ఆయన మతాలసామరస్యాన్ని వివరించి విశ్వైక మతానికి పునాది వేశారు. ప్రపంచాన్ని చీలదీసి శాంతిని రూపుమాపే సంకుచితతను ద్వేష దురభిమానాలను అంధవిశ్వాసాలను అయన ఖండించారు. 'జీవుడు దేవుడే, అందఱు మానవులూ సమానులే' అనే భారతదేశసనాతన సందేశం మళ్లీ ఒకమాఱు శ్రీ వివేకానంద స్వాముల ప్రావృషేణ్య పయోవాహగర్జాగంభీరమైన కంఠంనుండి వెలువడింది, స్వామిజి పాశ్చాత్యులకు ఆత్మనుగూర్చినజ్ఞానం బోధించాడు, ప్రాచ్యదేశీయులకు "సేవా"ధరమ్మును కఱపాడు. భారతీయయువకులలో స్వామిజి త్యాగోత్సాహాన్ని నింపాడు.

"మీరు నిత్యాత్ములరు, ముక్తాత్ములరు, విశుద్ధాత్ములరు, మీరు అమృతపుత్రులరు, అమర్త్యులరు, ధైర్యం వహించండి. ఆత్మల మొత్తం ఒక్కటె నానమ్మిన దైవం. నేను సేవించి భజించేది ఆదైవమునే" - ఇవి శ్రీ వివేకానందుని హృదయమునుండి ప్రవహించిన వాగ్ఝరి. ఆయన నెలకొల్పిన సేవాసంఘం ఈనాడు మానవుల సాంఘికవైజ్ఞానికాధ్యాత్మిక సమున్నతికి ఇంతంతనరానంత సాధకమై ఉన్నది.

స్వామిజీకి బుద్ధదేవునం దుండిన భక్తి అపారం "బుద్ధుని సేవకులకు సేవకుడ' నన్నాడాయన. శంకరుని ధీవిభవమును బుద్ధుని హృదయవైశాల్యమును మనకు లక్ష్యాలు కావాలి, ప్రతిభారతీయునికి ముస్లిము దేహము వేదాంతహృదయము నుండవలె ననుట ఆయన కోరిక. రాజకీయాధ్యాత్మికస్వాతంత్ర్యయోధుడు స్వామిజి. "మానవుని రూపొందిం

చడం నా జీవితకార్యం'' అన్నాడు స్వామిజి. నవ్యభారతమునకు స్రష్ట ఆయనయే.

''ధీరుల రగుడు, ముందున కురుకుడు, సోమరితనమును నిరుత్సాహమును దులిపివేసి కొనుడు. అప్పుడు మీకు జీవితంలో విజయం చేకూరుతుంది, జీవితలక్ష్యం చేతి కందుతుంది, 'నేను బ్రహ్మమను' అనే సాక్షాత్కారమే జీవితలక్ష్యం'' - ఇది శ్రీ వివేకానందస్వామి సదా కావిస్తూవచ్చిన ఉపదేశం.

# వివేకానంద జ్యోతిర్వికాసము

## శ్రీ తుమ్మల పేరారెడ్డిగారు

ఒకనాడు ఉద్రిక్త భావదశలో ఉన్న శ్రీరామకృష్ణుని దృష్టికి సప్తర్షిమండలమును అందొక దివ్యశిశువును గోచరించినవి. ఆ దివ్యశిశువు తన మృదుబాహువులతో నందొక ఋషిని కౌగిలించుకొని ''నేను భువియం దవతరించుచున్నాను, నీవు రావా'' అని ప్రశ్నించెను. వత్తు నని ఋషి తలయూపి సూచించెను. వెంటనే ఆ ఋషినుండి జ్యోతి దిగి కల్కత్తాలో భువనేశ్వరీదేవీ విశ్వనాథ దత్తలనెడి భవ్యదంపతులుండు గృహములోనికి జొచ్చుకొనెను. ఆ దంపతులకే శ్రీ వివేకానందస్వామి పుత్రుడుగా జన్మింపనున్నాడు. ఆ ఋషిని హెచ్చరించిన దివ్యశిశువు నారాయణుడే. ఆయనే శ్రీరామకృష్ణుడుగ అవతరించెను. శ్రీరామకృష్ణుని దివ్యసందేశమును విశ్వమంతట వెదజల్లుటకై నరమహర్షియే నరేంద్రనాథ దత్తగా అవతరించెను.

కావున దక్షిణేశ్వర యోగిపుంగవుడు నరేంద్రునాగమనమును నిరీక్షించుచుండె నన్నచో అం దాశ్చర్య మేమి? నరేంద్రుడు రాగానే శ్రీరామకృష్ణుడు నిర్భరానంద పూర్ణుడై ''ఆహా, వచ్చితివా యిన్నాళ్ళకు? ఏల యింత జాగు? నన్నింతకాలము కాచుకొ బెట్టుట న్యాయ్యమా?'' అని పల్కుటే కాక కేలోడ్చి ''నీవు పురాణర్షివగు నరుడవు, నా జీవితసందేశమును విశ్వవ్యాప్త మొనర్ప జన్మించినవాడ'' వని కొనియాడెను.

నరేంద్రనాథుని భవిష్యన్మహత్త్వమునకు సూచనలు చిఱుప్రాయముననే శైశవముననే కననగుచుండినవి. క్రీడాపరుడుగను అణగని వాడుగను ఉన్నప్పటికిని యథార్థమైన అతని ప్రకృతి అగపడుచునే యుండెను. ఆ వయస్సులోనే సీతారాముల విగ్రహములను సంపాదించి అతడు పుష్పాదికముతో పూజించుచుండెను. వారు వివాహితులు దంపతులు అని తెలియ వచ్చిన మీదట ఆయన ఎప్పటిభక్తితో పూజింపజాలకపోయెను. త్యాగచక్రవర్తియైన పరమశివుని ప్రతిమను సంపాదించి దానిని పూజింపజొచ్చెను. పరివ్రాజకసన్న్యాసులం దతని కుండిన భక్త్యాదరములు ఉత్కటకోటికములు. తనయొద్ద ఏమున్నను అతడు వారి కర్పించివేసెడివాడు. వినోదముగా ధ్యానింప గూర్చున్న యతనికి ధ్యానములో బాహ్యలోక స్మరణము బొత్తిగా లేనట్టి యేకాగ్రత కుదిరెడిది. నిదురింప నతడు కన్నులు మోడ్చి నప్పుడు కనుబొమలమధ్యనుండి దివ్యమైన

యొక వెలుగు వెలువడి చిత్రవర్ణోజ్జ్వలమై గాఢ ప్రశాంతత నావహించుచు నతని మేని నావరించెడిది.

స్కూలులో కాలేజిలో ఎంతదుర్గ్రహమైన విషయమునైనను అతిశీఘ్రముగ ఆకళించుకోగల అతని ప్రజ్ఞకు ఉపాధ్యాయులాశ్చర్య పడెడివారు. సాహిత్యమునకు చరిత్రమునకు తత్త్వశాస్త్రమునకు ఆధ్యాత్మికమునకు సంబంధించిన గొప్పగ్రంథాలనన్నిటిని ఆయన చదివెను. ఒక పేరగ్రాఫులో తొలితుదివాక్యాలను చదివి పూర్తిపేరగ్రాఫు నర్థమును క్షుణ్ణముగ గ్రహింపగలనేర్పు ఆయన కుండెను. వారి ప్రిన్సిపాలు హేస్టి "నరేంద్రుని ప్రతిభ అమేయము, అసాధారణము. అతని భవిష్యత్తు మహోజ్జ్వలము" అని నుడివియుండెను.

వాద్యసంగీతములో నోటిపాటలో నరేంద్రున కెంతో ఆసక్తి. బెంగాలి హిందీ ఉర్దు పెర్షి యను భాషలలో ఆయన భక్తిగేయములను పాడునేని శ్రోతలు ముగ్ధులు కావలసినదే.

కాలేజీచదువు సాగుచున్నప్పుడే నరేంద్రుడు బ్రాహ్మసమాజమున చేరెను. అతని ప్రకృతిలో మూఢవిశ్వాస మన్నది లేదు. అజ్ఞేయవాదమువంకకు మొగ్గు గలదు. "దేవుని మీరు చూచితిరా" అని ప్రశ్నించును. శ్రీరామకృష్ణుని సమీపమున కతనిని తరిమినదిదే. "దేవుని నేను జూచితిని, నిన్ను జూచుచున్నంత స్పష్టముగా చూచితి" నని ఆ యోగిపుంగవుడు చెప్పిన జవాబితనిని ఆశ్చర్య ఱచెను. శ్రీరామకృష్ణు డతని వక్షము నంటగానే యింద్రియాతీతమైన యనుభూతి నితనికి క్షణకాలము గలిగెను. గురుదేవునితో నిత డుండిన కాలము దాదాపాఱేండ్లు. ఆయన చెప్పిన వాక్యమునుగాని ఎప్పుడుగాని నిశితముగ పరిశీలింపక గ్రుడ్డిగా నితడు విశ్వసింపలేదు. సోదరినివేదితతో ననంతరకాలమున నిట్లు చెప్పెను. "నేను నాగురుదేవునితో ఆఱేండ్లు పోరాడితిని, గంతవ్యమార్గమున ప్రత్యంగుళమును నా ంత క్షుణ్ణముగ తెలిసియుండుట తత్ఫలితమే." పరీక్షింపక సమ్మతింపని శిష్యుని ఆర్జవము గురుదేవున కత్యంత ప్రీతికర మాయెను. నరేంద్రుని యవిశ్వాసము నెవరేని ఆక్షేపించిన వారిని శ్రీరామకృష్ణుడు చీవాట్లుపెట్టి "నరేంద్రుని మీరు చక్కగా నర్థముచేసికొనలేరు, త్వరపడి గుణదోష నిర్ణయము సేయరా దని నోరుమూయించెడివాడు; నరేంద్రుని అతని మార్గమున నే బోనిచ్చి, ఓపికతో ప్రేమతో మెట్టుమెట్టుగా అతనిని తర్కాతీతతత్త్వమును సాక్షాత్కరింపజేసి సరిదారిలో స్థిరపఱచెను.

శ్రీరామకృష్ణుడు విగ్రహారాధకుడుగ నేల యుండెనో నరేంద్రునకు తొలుత బోధపడకుండెను. తండ్రి ఆకస్మికముగా మరణించి, నరేంద్రునికుటుంబము దారిద్ర్యగర్తమున పడియుండినప్పుడు "గుడిలోనికి జొచ్చి ఆర్థిక దుఃస్థితిని తొలగింపు మని కాళిమాతను ప్రార్థింపుము" అని శ్రీరామకృష్ణు డాదేశించెను. చ్చి చూచిన నరేంద్రునకు అట కనిపించినది సాక్షాల్లోకజననియే, కాని కేవలము విగ్రహము కాదు. వాంఛితార్థప్రదాయినియైన లోకమాతను జూచినప్పుడు నరేంద్రునకు తన కుటుంబదుఃస్థితి మున్నగు విషయము లేవియు స్మృతిలో లేవు. జ్ఞాన మిమ్మనియే కాని వేఱుక్షుద్రప్రయోజన మడుగుటకు అతనికి నోరాడ లేదు. ఈ సంభవముచే భగవంతుని సాకారతానిరాకారతలు పరస్పర మవిరుద్ధములనియు సాకారోపాసనము సాక్షాత్కారమునకు సులభతరోపాయ మనియు నరేంద్రుడు

గ్రహించి విగ్రహారాధనపరమార్థమును అనంతరకాలమున అనితరసాధ్యక్రమములతో వివరింప గలిగెను.

తనకు నిర్వికల్పసమాధ్యనుభూతిని ప్రసాదింపుమని నరేంద్రుడు గురుదేవుని పలుమార్లు ప్రార్థించెను. "అది కాదు నీవు కోరవలసినది. స్వకీయమోక్షమునకు పాటుపడుట క్రిందిమెట్టు. అందఱిమోక్షమునకై పాటుపడుట అంతకంటె పైమెట్టు. సకలమానవకోటిని భగవంతుని ప్రత్యక్షరూపముగా భావించి సభక్తికసేవలొనర్చి, వారినిశ్రేయసమునకై పాటుపడుము" అని గురుదేవు డాదేశించెను. అతనివలన లోకమునకు నెఱవేఱవలసిన ప్రయోజనము నెఱవేఱువఱకు అతని కాపరమసాక్షాత్కారము నొసంగకు మని గురుదేవుడు జగజ్జననిని ప్రార్థించెను. అయినను గురుదేవుని చరమదినములలో నొకనాడు నరేంద్రునకు నిర్వికల్పసమాధ్యనుభూతి తాత్కాలికముగ గలిగెను. పిమ్మట నతనిని గురుదేవుడు "నీ వొక మహావటవృక్షమువంటివాడవు, అనంతప్రజానీకమును నీనీడలో ప్రోది యొనర్పవలసినవాడవు. కాబట్టి సొంతమునకు ముక్తిని సంపాదించుకొను ప్రయత్నమును తర్వాత పూనుకొందువు గాని ముందుగా నీసోదరశిష్యులను పర్యవేక్షించుకొనుము. విశ్వమానవశ్రేయస్సంపాదకప్రణాళికల నిర్వహింపుము అది నీజీవితకార్యము" అని ప్రబోధించెను. తన యాధ్యాత్మికశక్తిసర్వస్వము గురుదేవుడు శిష్యునిలోనికి సంక్రమింప జేసెను.

గురుదేవుడు మహాసమాధినందిన పిదప నరేంద్రుడు పాదచారిగా యావద్భారతదేశపర్యటనము గావించెను. పెద్దలతో పిన్నలతో పండితులతో పామరులతో ప్రభువులతో ప్రకృతులతో మెలగెను. భారతదేశపరిస్థితులను ప్రత్యక్షముగ నెఱిగెను. ప్రస్తుతసమస్యలను పేదఱికమును దాస్యమును గుర్తించెను. అనాదికాలముగ అనుస్యూతముగ వచ్చుచున్న ఆధ్యాత్మికసంప్రదాయసంపదను స్మరించెను. కన్యాకుమార్యగ్రహమునకు దక్షిణమున సముద్రమధ్యమందలి గుట్ట నధిష్ఠించినప్పుడు అఖండభారతమాతృస్వరూప మాతని దివ్యదృష్టికి గోచరించెను. భారతదేశమును తక్కిన ప్రపంచమును కావించుకొను పరస్పరవిజ్ఞానవినిమయముచే జగదభ్యున్నతి సిద్ధించు క్రమములు ఆయన భావపథమున విస్పష్టరూపము దాల్చినవి. దానిని సాధింప బద్ధకంకణుడై ముందున కుఱికెను. నరేంద్రనాథదత్త, విశ్వమున కంతటికిని వెలుగునిచ్చు జ్ఞానప్రదీపముగా వివేకానందజ్యోతిగా వికసించెను.

# మైసూరు మహారాజావారికి స్వామిజి లేఖ

చికాగో
జూను 23, 1894

మహారాజా,

శ్రీమన్నారాయణుడు మీకును మీ వారికిని యోగక్షేమము లొసగు గాక. దేవరవారు దయతో తోడ్పడినందు వలననే ఈ దేశమునకు వచ్చుట నాకు సాధ్యపడినది. వచ్చినప్పటి నుండియు అందఱికిని పరిచితుడ నైతిని. ఈ దేశప్రజలు అతిథిసత్కారపరాయణులు, నాకు కావలసిన వన్నియు సరఫరా చేసినారు. ఈ దేశ మద్భుతము. ఈప్రజలును ఎన్నో విధ

ముల అద్భుతప్రజలే. నిత్యకృత్యములకు ఈ దేశప్రజలు ఉపయోగించునన్ని యంత్రములను, ఏ దేశ ప్రజలుః ఉపయోగింపరు. ఇక్కడ ప్రతివస్తువును యంత్రమే అంతే కాదు. ప్రపంచజనసముదాయములో ఈదేశ ప్రజ లిరువదింట నొక భాగము మాత్రమే, అయినను వీరి సిరిసంపలు ప్రపంచపు సిరిసంపదలలో ఆఱింట నొకపాలుగా నున్నది. వీరి భోగభాగ్యములకు మితియే లేదు. కాని ఇక్కడ ప్రతివస్తువునకును ధర విపరీతము. ఇచ్చట ఉన్నంత హెచ్చుకూలి ప్రపంచములో వే ఱెచ్చటను లేదు. కాని కార్మికులకును పెట్టుబడిదారులకును పోరాటము సదా సాగుచునే యుండును.

స్త్రీలకు అమెరికాలో నున్నట్టి హక్కులు ప్రపంచమున వేఱెక్కడను లేవు. క్రమముగా సర్వమును వారు తమయధీనములోనికి దెచ్చుకొనుచున్నారు. వింతవిషయ మిది—ఉత్తమ సంస్కారము గల మగవారికన్న అట్టి సంస్కారవతులైన మహిళల సంఖ్య అత్యధికము. కాని ఉత్తమప్రతిభాశాలులు, ఇంకను మగవారిలోనే హెచ్చు. సహజమే. పాశ్చాత్యులు మన వర్ణవిభేదమును దూషింతురు కాని. దానికంటె అన్యాయ్యమైన వర్గము — ధనికవర్గము— వారిలో నున్నది. అమెరికనులు చెప్పునట్లు డాలరు సర్వశక్తిమంతము. ఇక్కడ అది దేనినైనను సాధింపగలదు.

ప్రపంచమున వేఱు ఏదేశమునను ఇన్ని చట్టములు లేవు. చట్టముల నింత నిర్లక్ష్యము సేయుటయు వే ఱెచ్చటను లేదు. పాశ్చాత్యులందఱికంటె, పేదలైన హిందూప్రజలే, నీతిలో మొత్తముమీద ఎంతో అధికులు. మతవిషయమున నిక్కడివారు పై వేషాలవారుగ నైన నుందురు. పరమతాసహనస్వమతదురభిమానవంతులుగ నైన నుందురు. వీరి మూఢవిశ్వాస మతములతో విసుగెత్తి, ఇచ్చట వివేకులు, క్రొత్త వెలుగునకై, భారతదేశమువైపు చూపులు పఱపుచున్నారు. పవిత్రవేదములలోని యుదాత్తాశయములు ఇంచుకంత లభించినను, వీ రెంత ఆతురతతో కైకొందురో, కనులార చూచిననే ఎఱినవారి కెఱుకపడగలదు. అధునాతనభయంకరవిజ్ఞానశాస్త్రాఘాతముల కెదురు నిల్చి, వేదములు అక్షతములుగ నున్నవి కదా. 'శూన్యమునుండి సృష్టి పుట్టినది, ఆత్మయు సృష్టింపబడినదే, దేవుడను నిరంకుశుడు, స్వర్గమని చెప్పబడు నొక్కచోట సింహాపీఠిపై గూర్చుండి, రాజ్యమేలుచుండును. నరకాగ్నులకు చల్లబాఱే లేదు.'' ఇట్టి సూత్రముల యెడల, చదువుకొన్నవారి కెల్లరికి వెగటు పుట్టినది. ''సృష్టి అనాది, అనంతము; ఆత్మయు అట్లే శాశ్వతము. ఈశ్వరుడు అంతర్యామిగా మనలో నున్నాడు'' అను వేదములలోని యుదాత్తభావములను ఏదో యొకరూపమున వారు తొందరతో స్వీకరించుచున్నారు. ఇక నేబదియేండ్లలోపల-ఆత్మయు సృష్టియు ఉభయమును శాశ్వతమే అనియు, ఈశ్వరు డనగా పరిపూర్ణు డనియు పరాత్పరు డనియు - మన వేదములలో చెప్పబడియున్న దానిని ప్రపంచవిద్వాంసు లందఱును అంగీకరింపగలరు. ఇప్పటికే, వారిలో విద్వాంసులైన మతాచార్యులు, బైబిలును ఈ ధోరణిలోనే వ్యాఖ్యానించుచున్నారు. నా నిర్ణయ మే మనగా, వారి నాగరకతలో పారమార్థికపరత హెచ్చవలె. మన నాగరకతలో వాస్తవపరత హెచ్చ వలె—అని.

భారతదేశములో నన్ని యనర్థములకును మూల మొక్కటే, పేదవారి దుఃస్థితి. పాశ్చాత్యులందలి పేదలు పిశాచములే, వారితో

పోల్చి చూచిన, మన పేదలు కేవలము దేవతలే. కావుననే, మన పేదల నుద్ధరించుట చాల సులభమైన పనియే. మనము చేయవలసిన సేవ యెల్ల – వారికి విద్య గఱపుటయు, పోగొట్టుకొన్న వ్యక్తిగౌరవమును మరల బొందించుటయు – మన ప్రజలును ప్రభువులును చేయవలసిన పెద్ద పని ఇది. ఇంతవఱకును ఈవిషయములో ఏమియు జరుగ లేదు. అధికారమున నుండిన పురోహితులును మన దేశము నాక్రమించుకొన్న విదేశీయులును శతాబ్దులుగా వారి నణగద్రొక్కియుంచిరి. కడకు భారతదేశమున పేదలు తాము మనుష్యుల మనుటను గూడ మఱచిపోయినారు. వారి బుఱ్ఱలలోనికి భావములను జొప్పింపవలెను. చుట్టును ప్రపంచములో జరుగుచున్న వానిని చూచునట్లు వారి కన్నులు తెఱవవలెను. అప్పుడు వారిముక్తిని వారే సాధించుకొందురు. ప్రజ గాని, నరుడు గాని నారి గాని, ఎవరిముక్తిని వారే సాధించుకోవలెను, ఆశయములను వారి కీయ వలెను. వారికి కావలసిన సాహాయ్య మంతమాత్రమే, తర్వాత తక్కినదెల్ల దానిఫలితముగ వచ్చియే తీరును. రసాయనవస్తువులను కలుపుట మన పని. తర్వాత పలుకులుగా పేరుట ప్రకృతిసూత్రమే కదా. వారి బుఱ్ఱలలోనికి మన యాశయములు చొప్పించుట మన కర్తవ్యము. తక్కినది వారే చేసికొందురు. భారతదేశాన చేయవలసిన పని ఇదే. నా మనస్సులో చిరకాలముగ నున్న సంకల్ప మిదే. భారతదేశమున దానిని సాధింపలేక పోయితిని. అందుకే యీదేశమునకు వచ్చితిని. పేదలకు విద్యాదాన మొసగుటలో మహాకష్ట మొకటి అడ్డువచ్చును. —ఏలినవారే ప్రతిగ్రామములోను ఒక ధర్మవిద్యాలయమును స్థాపించితి రనుకొనుడు. దాని వలన ఏమేలును ఉండదు. భారతదేశ దారిద్ర్య మట్టిది. పేదబాలురు బడికిపోవుట మాని పొలములలో తండ్రులకు తోడ్పడబోవుదురు. లేదా, ఏదైన జీవికను గడింప బోవుదురు. ఇక నిప్పుడు కొండ మహమ్మదు నొద్దకు రాకున్న, మహమ్మదే కొండయొద్దకు పోవలెను కదా. పేదబాలుడు చదువుకొఱకు రాకున్నచో, చదువే పేదబాలునికడకు పోవలెను. మన దేశములో స్వార్థత్యాగులు ఏకాగ్రచిత్తులు నైన సన్న్యాసులు మతప్రచారము చేయుచు పల్లెనుండి పల్లెకు వేలకొలదిగ పోవుచున్నారు. వారిలో కొందఱినైన లౌకిక విషయములనుగూడ నేర్పు నుపాధ్యాయులనుగా తయారుచేసితిమేని, పల్లెపల్లెలో, ఇంటింటను, వారు మతమును చదువునుకూడ చెప్పుచు పోవుదురు. ఒకపల్లెకు ఒక సాయంకాలము అట్టివారిలో నిద్దఱు కెమెరాతో, గ్లోబుతో, కొన్ని దేశపటములు మున్నగు వానితో వచ్చి రనుకొందము. తెలియనివారికి ఖగోళభూగోళవిషయముల నెన్నిటినో నేర్ప వచ్చును కదా. ఒక జీవితకాలములో పుస్తకములనుండి సంపాదించుకొను విషయవిజ్ఞానముకంటె నూఱంత లెక్కువ విషయవిజ్ఞానమునే వారు భిన్నదేశీయులను గూర్చి కథలు వినిపించి వారికి కలిగింపగలరు. అయినను ఈపనికి సంస్థ కావలెను. అనగా ధనము కావలె ననుటే. ఈ ప్రణాళికను నిర్వహించుటకు భారతదేశమున జనులు కావలసినంతమంది యున్నారు. కాని పాపము వారికి పైసా లేదు. చక్రమును కదలించుటే కష్టము. కదలిన పిదప వర్ధిల్లు వేగముతో నది దొర్లుచు పోవును. నా దేశములోనే సాహాయ్యము కోరి ధనికుల సానుభూతిని పొందలేక విఫలుడనై ఏలినవారి తోడ్పాటుచే ఈ దేశమునకు వచ్చి చేరితిని. భారతదేశమున ప్రజలు చచ్చిననేమి, బ్రతికిననేమి, అమెరికనుల కించుకేని

లక్ష్యమా? వా రేల లక్ష్యపెట్టవలెను? మన వారు ఈస్వార్థమును తప్ప మఱేమియు ఆలోచింపరే.

ప్రభుమహాశయా, జీవితము క్షణభంగురము; ఐహికదంభము లన్నియు నశ్వరములే. పరులకొఱకు బ్రతుకువారే బ్రతుకువారు. ఇతరులు బ్రతికియున్నారనుటకంటె చచ్చి రనుటే తగును. ఉదారమనస్కుఁడు ఉన్నతుఁడు దేశపాలకుడును నైన తమవంటి భారతమాతృకుమారుడు దేశమాతను ఆమె కాళ్ల :ల బెట్టుటకు ఎంతో పనిచేయగలడు. భావిసంతతి వారి కెల్ల పూజ్యముగా తన పేరు నిల్పుకొని పోగలడు.

అజ్ఞానమగ్నులైన పీడితభారతీయజనకోటులను గుఱించి పరమేశ్వరుడు మీ యుదార హృదయమును అనుకంపార్ద్రముగా చేయవలయు నని ప్రార్థించు,

భవదీయుడు,
వివేకానంద.

# అంతః ప్రకోపాల సమీకరణము

## శ్రీ హీరానందస్వామి

మానవుడు సముద్రమున పడవలో జీవించుచుండునేని అతనికి పడవ నడపువిద్య అలవడును. ఈ ప్రపంచమును సముద్రమునకు తీసిపోదు. ఇందు జీవించు మానవుడు జీవిత శిల్పమును అలవఱచుకొనవలయును. సముద్రములో అలలు తలచైనట్లు సుఖదుఃఖములు చావు బ్రతుకులు, ఆశలు ఆశాభంగములును ఈ జగమనెడి సముద్రమునకు సహజములే. నావికునివలె మనము ఈ జగదుదధి కల్లోలములను లెక్కింపక ముందునకు సాగు టెట్లో నేర్చుకొనవలయును. మానవుల క్రొంగ్రొత్తగ జన్మించు వివిధప్రవణతల కనుగుణముగ ఈ విధానమును అందముగ పెక్కుచందములలో నిర్వర్తింపనగును.

మానవుని ఆంతరమున పొటమరించు కల్లోలాలకు సంబంధించిన వివరములను పరికింతము గాక. అసూయ, పోటీ, అణగద్రొక్కుట, దురాక్రమణము, ద్వేషము, హింస - అనునవి మానవుని శీలమున సాధారణముగ నుండు ప్రవణతలు. స్వల్పమైన స్వార్థలాభమునకై అసత్యము చెప్పుట, స్థూలసూక్ష్మమార్గములలో దొంగిలించుట, మగువ మగవానిపైని, మగవాడు మగువపైని చెడ్డచూపులు పఱపుట, సోమరితనముచే ఇతరులపై ఆధారపడియుండుట. తన లాభమునకై ఒరుల సాయమును అంగీకరించుట. ఈ చెమర్చు మఱికి దేహమున అశుద్ధపు టలవాటులు కలిగియుండుట. అసాధారణ భోగయుత జీవితమునకై ఆశించుచు అందుకు తగిన అంతస్తును సంపాదించుకొనజాలనందున నానాటికి మఱింతగా అసంతృప్తి చెందుచుండుట, ఒరుల మనసుల నుండి వెలువడు తలపులను తనలోనికి క్రుక్కికొనుట స్వార్థసాధకోద్యమములు నెఱవేఱక పోగా ఆశాభంగము నొందుట ఈశ్వరసంకల్ప పరతంత్రుడై ఉండకుండుట — ఇవన్నియు మానవుని ఆంతర సంఘర్షణగా రూపొందుచుండును.

ఈ ప్రకోపాలలో ఒక్కొక్కదానిని ప్రత్యేకముగ చక్కబఱచుటకు పూనుకొందుమేని అద్భుతమనశ్శక్తుల మరులునబడి మనము

ఒక్కొక్కప్పుడు పరమ పురుషార్థమును సాధింప మఱచిపోదుము. అహింసాసిద్ధుని సన్నిధానమున ఎట్టిహింసయు శక్యముగాదు. సత్యవ్రత సిద్ధునినోట వెలువడిన ప్రతిమాటయు అమోఘముగ నిజ మగుచుండును. అపహరణేచ్ఛ అంతరించిన వాని ¼ట ఉన్న సకల నిధులు కనవగుచుండును. బ్రహ్మచర్యము పాటించినవాడు ద్రఢిష్ఠుడును బలిష్ఠుడును మేధావియు నగును. అప్రతిగ్రాహకుడుగ నుండువాడు తనమనస్సును మథించుకొనునేని పూర్వజన్మస్మృతి కలుగును. కాని ఆంతరమైన సంఘర్షణము మఱొకరూపములో మనస్సులో నొకమూలలో ఉండనేయుండును. దానిని పూర్తిగ తుడిచివేయు ప్రతిక్రియకు ఏది దారి ?

మన జీవిత దృక్పథమును మార్చుకొనుటే దారి. అది సాధ్యమే. సమీకరణశిల్పమనగా నిదే. మానవతతి నాల్గువర్గములుగ విభక్తమైయున్నది. ఈ విషయమును శ్రీవివేకానంద స్వాముల మాటల ననుసరించి ఇట్లు చెప్పవచ్చును.

ప్రతి ఆత్మలోను దివ్యత గర్భితమైయున్నది. వెలుపలిలోపలిప్రకృతిని అదుపులోనికి తెచ్చుకొనుటచే ఆ దివ్యతను ఆవిష్కరించుకొనుటయే జీవిత లక్ష్యము. కర్మయోగము, భక్తియోగము, రాజయోగము, జ్ఞానయోగము- అనెడి వీనిలో దేనిచేతనైనను అన్నింటిచేతనైనను ఆలక్ష్యమును సిద్ధింపజేసికొనుము; ఇదే ఆధ్యాత్మికధర్మసర్వస్వము.

1. నిస్సంగత్వముతో నిస్స్వార్థముగ కర్మాచరణము చేయవలె ననిన విశ్వమంతయు నాది అను దృక్పథము కుదురవలయును. వ్యాకోచమే జీవితము. సంకోచమే మరణము. నేను అంత సంకుచితుడను గాను. కర్మపరత నా ప్రకృతి. కర్మతత్పరత స్వార్థగంధరహితముగ నుండవలయును. మన ఆంతర సంఘర్షణలకు కారణము మన దృష్టిలోని సంకు విశాలదృక్పథమును అలవఱచుకొన్నచో ఆ సంఘర్షణ మంతరించును.

2. ఉపాసనము, భక్తియు ఆ సంఘర్షణకు ప్రతిక్రియయే. ఉద్రిక్తభావముల కలవడిన మానవుడు ఈ మార్గమున సిద్ధి నొందగలడు. ఉపాసన నిర్వర్తించుటకు చోటు దేవాలయము మాత్రమే కాదు. మానవుని దేహమునే దేవాలయముగ రూపొందించుకొనవచ్చును. "దేవుని వాసస్థానములలో అత్యున్నతమైన స్థానము మానవుడే. మానవారాధన ద్వారా మాధవారాధనను నిర్వర్తించుట సర్వశ్రేష్ఠము" అని శ్రీవివేకానందస్వామి చెప్పుచుండెడివాడు. ఈ యుపాసనమును, ఆరాధనమును నాలుగు విధములుగ చేయవచ్చును. 1. ఆధ్యాత్మికజ్ఞానప్రదానము ప్రథమము. 2. లౌకికజ్ఞానప్రదానము ద్వితీయము. 3. వ్యాధిబాధితులకు వైద్యసేవ సమకూర్చుట తృతీయము. 4. ఆకలిచే నకనకలాడువానికి అన్నప్రదానము చతుర్థము.

3. జ్ఞానయోగము:- హేతువాద ప్రియునికి సంతృప్తి కూర్చుమార్గమిది. అతని మొదటి మెట్టు 'సరియైన రీతిలో అర్థము చేసికొనుట.' మన ఎదుట నున్న జగత్తు పారమార్థిక సత్యమా? లేక ఆభాసమాత్రమా? దూరమున నున్న ఇనుపస్తంభము చీకటిలో తనప్రియుడు కాబోలునని - తహతహతో నిరీక్షించుచుండు విరహిణికి తోచును. పోలీసువాడు కాబోలునని దొంగకు తోచును. దయ్యాలభయము కల వానికి దయ్యము కాబోలునని తోచును. కాబట్టి మనము ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొని తెలిసికొనవలయునే. కాని

'అంతయు మంచిదే' 'అంతయు చెడుగే' అని అంధమర్యాదగా భావించువారి అభిప్రాయము లకు వశపడకూడదు. సత్యమెప్పుడు నేక రూపమే ఐనను మన భ్రాంతితో లగినప్పుడు అది క్రొత్తదియుబోలె తోచును.

4. రాజయోగము: యోగాభ్యాసప్రవణులు నైతికధార్మికసంసిద్ధత చేకూర్చుకొన్న పిమ్మట ప్రాణాయామమునకు పూనుకొందురు. మన తలంపులపై ఉచ్ఛ్వాసనిశ్వాసములకు ఎంతో ప్రభావమున్నదని వారి నమ్మకము. ఉచ్ఛ్వాస నిశ్వాసములపై అదుపు కుదిరిన ఎడల తలపు లును అదుపులో నుండును. అప్పుడు నిరంతరా భ్యాసముచే చెడ్డతలంపులను పూర్తిగా తొల గించుకొనుటయు మనభావనాశక్తిధీరతను హెచ్చించుకొనుటయు సులభము లగును. మన సున కేకాగ్రత కుదిరి మనస్సాగరము మథిత మగునేని పూర్వజన్మస్మృతులు కలుగును. అందుచే మన శక్తియుక్తులను క్షుద్రకాం ములు సంపాదనకై రిత్తపుచ్చుకొనక దృఢా ధ్యవసాయముతో పరమలక్ష్యమువంకకు పురో గమింపగలుగుదుము. నిశ్చలధ్యానము కుదిరి సమాధిదశ సిద్ధించును. కాని ఈదారిలో మన స్సును శుద్ధపఱచుకొను విషయమున చాల మెలకువ వలసియుండును. కేవలము భావో ద్రేకాతిశయముచే ఆదశ నధిగమించుట యాదృచ్ఛికసాక్షాత్కార మగును. యా దృచ్ఛికతచే స్పష్టత కొఱవడును. ద్వేషదురభి మానములకు ఆస్పద మేర్పడును.

పైని పేర్కొన్న నాలుగుమార్గములలో మనదృక్పథమును పరిష్కరించుకొందుమేని ఆంతరములైన ప్రకోపములు అణగిపోవును. దీనినే జీవితశిల్ప మనియు
మనియు పేర్కొందురు. స్థితప్రజ్ఞుని చిత్తస్థితిని భగవద్గీత ఇట్లు వర్ణించుచున్నది. (VI-22)

యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే.

'యోగమనుదశ నధిగమించినవాడు, ఇతరలాభముల నంతకన్న నధికములని యెంచడు, ఎంత దుఃఖము వచ్చినను చలిం పడు'' పై నాలుగు మార్గములలో నొకదాని నవలంబించి దారిదోపిడిగాడైన రత్నాకరుడు వాల్మీకిమహర్షి యయ్యెను. మీవంటి నావంటి ఇతరులను గూర్చి ఏమందుము? కావున శ్రద్ధతో విశ్వాసముతో శ్రీ వివేకానంద స్వాముల ''ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ నిబోధత'' ''లెండు, మేలుకొనుడు, గంత వ్యము చేరుకొను వఱకు నాగకుడు,'' అను హెచ్చరిక ననుసరించి పరిశ్రమింపుడు. ఈ మార్గముల అమోఘతను మహర్షులు మాటి మాటికిని ఉద్ఘాటించి యున్నారు.

శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రా
ఆయే ధామాని దివ్యాని తస్థుః
వేదాహ మేతం పురుషం మహాన్తం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
త మేవ విదిత్వా తిమృత్యు మేతి
నాన్యః పన్థా విద్యతే ఽయనాయ.
(శ్వేతాశ్వతరోపనిషత్తు)

మనము అమృతసంతతివార మైనప్పుడు ప్రపంచమున ఒకమూలనుండి మఱొకమూలకు శాత్రవద్వేషాగ్నిగోళములను ప్రయోగింప నేల? సునిశ్చితసంకల్పబలముతో వివేకముతో క్షేమాసంశలను వర్షింతము గాక.

సర్వే ఽత్ర సుఖినస్సన్తు
ర్వే సన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు
మాకశ్చి ద్దుఃఖ మాప్నుయాత్.

# శివానంద స్మృతులు — 32

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

17-3-1929 (ఆదివారము)
బేలూరు మఠము

నేడు శ్రీరామకృష్ణభగవానుని సర్వజన సామాన్య మహోత్సవము. శ్రీ మహాపురుషుల శరీర మంతగ సరిగా లేదు. శ్రీవారి దర్శనార్థులై పెక్కురు భక్తులు ప్రొద్దుననుండి రాదొడంగిరి. వృద్ధభక్తు డొకడు శ్రీవారికి ప్రణమిల్లి వారి దేహారోగ్యము గుఱించి ప్రశ్నింప మహాపురుషులు = ఒళ్లు అంతగ బాగా లేదు.

భక్తుడు – రాత్రి సరిగా నిద్రపట్టలేదా ?

మహాపురుషులు – మామూలుగనే నిద్రపోతిని. కాని చూడుము ఇదా, ముదుసలి శరీరము – దీనికి తోడు నానావిధరోగములు. శరము అన్నంతనే - షడ్వికారములకు లోనగును. షడ్వికారములు – జన్మ, స్థితి; వృద్ధి; పరిణామము; క్షయము, వినాశము. ఇదియే ఈ పాంచభౌతిక దేహధర్మము. ఈమారు దీనికి కడపటివికారము పట్టినది. అ దేమన వినాశము. అయినను ఇవన్నియు కేవలము దేహామునకు సంబంధించినవే సుమా! కాని లోపల నుండు దేహికి పరమాత్మకు ఎట్టిమార్పులును కలుగవని ఎఱుంగుము. సర్వదా ఒక్క తీరుననే యుండును. శరీరవికారములు దానికి అంటవు, అతడే పరమాత్మ, దేహి. శరీరము ఆత్మ కాదు. శ్రీఠాకూరు దయచూపి మాకు ఈ జ్ఞానమును ప్రసాదించిపోయిరి. ఇక ఈ శరీర మున్నను, నశించినను ఒకటే. ఇందులో ఏమియు ముంచుకోపోలేదు'' కొంతవడి కండ్లు మూసికొని ఆత్మచింతలో మునిగి మరల ఇట్లనిరి – ''శ్రీఠాకూరు మాలో సంపూర్ణ జ్ఞానమును ప్రసాదించిరి. ఇక వారి ఇష్టముండిన ఈ దేహము నిల్చును. లేకున్న పోవును. వారి ఇచ్ఛప్రకారమే జరుగును. ఈ దేహమునకు వయస్సుకూడ ఏమి తక్కువ కాలేదు కదా!

# శివానంద లేఖావళి

## 34

రామకృష్ణమిషను సేవాశ్రమము
కంఖాలుపోస్టు, సహారన్పూరుజిల్లా,
ఉత్తరప్రదేశ్
3 ఏప్రిలు 1912

ప్రియ——

నీజాబు లందినవి. ఇప్పటి నీమనఃపరిస్థితి సహజమే. అందులో వింత ఏమియు లేదు. కోరినది లభింపనప్పుడు మనసున అవిశ్వాసము పొటమరించుటయు, అట్టి యితరకలవరాలు నూర్లకొలది గల్గుటయు సహజమే. గర్వాహంకారములును కలుగును. నిజమైన భక్తుడు వేటెవరిపై కోపము చూపును? నామూషీవలన కలిగిన మనోవ్యథను వేటెవరితో వెళ్ళబోసికొనును? అతనిభావాలును ఉద్రేకాలును అన్నియు భగవంతుని వంకకే. అతడు ప్రేమించునది భగవంతునే. కలహించునదియు భగవంతునితోనే. కావున ఆయనను వదలుకొనకుము. స్నేహముచేతగాని ద్వేషముచేత గాని నీ వాలాగు చేయరాదు. శ్రీరామకృష్ణుని క్షణమైనను హృదయపూర్వకముగ శరణు పొందిన భక్తుడు ఆయనను వదలుకొనగోరినను అతనిని వదలియుండబోడనుటను గట్టిగ తెలిసికొనుము.

పెద్దజాబు వ్రాయుటకు నాకు శక్తి లేదు. కాని ఇంతమాత్రము చెప్పగలను. ప్రతిదానికిని అంతర్నియంతను నేను గాను. గురువు నను భావమును భగవంతుడు నాయం దెప్పుడును నింపలేదు. గురువు నగుద మను కోరిక నాకెప్పుడును లేదు. నన్ను భగవంతుని కింకరునిగ భావించి ఆదరించి ప్రేమింతువేని అందులకు ప్రతిఫలమును తప్పక భగవంతుడే నీ కొసంగును. నా సలహా విందు మను అక్కఱ నీకున్నచో నీ ప్రస్తుతస్థితితో సంతృప్తిచెంది యుండుము. సాధ్యమైనంతవఱకు దేవుని స్మరించుచుండుము. ఆయనను గూర్చిన స్మృతికి మననమునకు ధ్యానమునకు నామజపమునకు నిన్ను అంకితము చేసికొనుము. నీశక్తికనుగుణముగా ప్రజా సేవయందు వ్యగ్రుడవై యుండుము. అట్లుండువేని నీకు పరమశ్రేయస్సు కలుగు నని నాదృఢవిశ్వాసము. అతిమాత్రమైన అశాంతికి నీమనస్సును లోబడనీయకుము. అశాంతి కలిగినప్పుడు దేవుని సన్నిధిని జేరి శిశువువలె ఆక్రందింపుము, ప్రార్థింపుము. ప్రశాంతస్థితి నీ మనస్సుకు మరల తప్పక కలుగును.

శ్రీ బ్రహ్మానందస్వామియు మఱి ఐదారు గురము ఒకానొకపనినిమిత్తము ఆరోగ్యపరిస్థితిచేతను కొన్నాళ్లుగ ఇచ్చటికి వచ్చియున్నాను. ఇక్కడినుండి ఎవ రెచ్చటికి పోవుదురో యింకను తెలియదు.

నీకు మా హృదయపూర్వక ప్రేమాశీస్సులు.

నీశ్రేయోభిలాషి

శివానంద

# వార్తలు - విశేషాలు

## రామకృష్ణమిషను శారదాపీఠము 1968-69 సంవత్సర నివేదిక

జల్పైగురివఱదలప్పుడు శారదాపీఠంవారు సాహాయ్యకార్యక్రమం నిర్వహించారు. నష్టాలపాలైన విద్యార్థులకు 3640-58 రూపాయల విలువ గల గ్రంథాలను విరాళం ఇచ్చారు. జగద్ధాత్రిపూజ యథోచితవైభవంతో నిర్వర్తించారు. శారదాపీఠయాజమాన్యంలో ఉన్న వివిధసంస్థలు శాఖలు సాగించిన కార్యక్రమ వివరాలు—

### విద్యామందిరం

విద్యార్థులను అక్కడనే నివసింపజేస్తు చదువుచెప్పే కళాశాల యిది. కల్కత్తా విశ్వవిద్యాలయంవారి మూడేళ్ళపట్టపరీక్షకువిద్యార్థులిక్కడ తర్ఫీదుచేయబడుతారు. ఈ సంవత్సరం ఇక్కడ చదువుతుండిన విద్యార్థులసంఖ్య మొత్తం 216. పరీక్షకు కూర్చున్న వారు 91 రు, నెగ్గినవారు 81 రు. అందు తొమ్మిది మంది అగ్రశ్రేణిలో నెగ్గారు. డిస్టింక్షను గడించినవారు నలుగురు. విడిదిలో విద్యార్థు లందఱు ఒకసన్న్యాసిపర్యవేక్షణలో ఉంటారు. చదువుతోబాటు వ్యాయామం ప్రార్థన క్రీడలు - ఇవికూడా క్రమసరణిలో నిర్వహింపబడ్డాయి. విద్యార్థుల నైతికాభివృద్ధికై కళాశాలలోను హాస్టలులోను మతాధ్యాత్మికవిషయాలు సక్రమంగా కఱపబడ్డాయి. పేదవిద్యార్థులకు ధనసాహాయ్యం అందజేయబడింది. ఇద్దఱు ఆఫీసర్ల యాజమాన్యంలో కళాశాలలో ఒక ఎన్. సి. సి. దళం ఏర్పఱుపబడింది.

### శిక్షామందిరం

ఇది పశ్చిమబంగాళప్రభుత్వంవారి పోషణలో సాగే సంస్థ. ఇచ్చట పట్టభద్రులు ఉపా

ధ్యాయవృత్తిలో కల్కత్తా విశ్వవిద్యాలయం వారి బి. టి. పట్టపరీక్షకు శిక్షితు లవుతారు. ఈసంవత్సరం ఇచ్చటి విద్యార్థులసంఖ్య మొత్తం 134. బి. టి. పరీక్షకు కూర్చున్నవారు 131 రు, నెగ్గినవారు 129 రు. అగ్రశ్రేణిలో గెల్పొందిన వారు నలుగురు. వివేకానందస్వామిజయంతి యప్పుడు ఈకళాశాలవారు విద్యావిషయక వస్తుప్రదర్శనం (ఎగ్జిబిషన్) నిర్వహించారు. 'సందీపన' మను తమవార్షికపత్రికాసంపుటాన్ని ప్రచురించారు. ఎక్స్టెన్షన్ సర్వీసుయూనిట్ వారు వెలుపలి ఉపాధ్యాయులకై చర్చాసదస్సులు నడపారు.

### శిల్పమందిరం

ఇదిస్నీ పశ్చిమబంగాళప్రభుత్వపోషణలో సాగు'పాలిటెక్నిక్'. ఇచ్చట సివిల్-ఎలెక్ట్రికల్-మెకానికల్ ఇంజినీరింగులో విద్యార్థులు తర్ఫీదై స్టేట్ కౌన్సిలువారు జరుపు పరీక్షలకు పోవుదురు. ఈసంవత్సరం ఉన్న విద్యార్థుల మొత్తంసంఖ్య 439. పరీక్షకు కూర్చున్నవారు 246, నెగ్గిన వారు 174. అగ్రశ్రేణిలో గెలుపొందినవారు 14. విడిది (హాస్టలు) లో నుండినవారు 90. వారికి పర్యవేక్షకులుగ ముగ్గురు సన్న్యాసు లుండినారు. విద్యార్థులకు ఎన్సిసీ శిక్షణంకూడా సమకూర్పబడింది.

### శిల్పాయతనం

14 సంవత్సరముల వయస్సుకు పైబడిన విద్యార్థులకు సామాన్యశాస్త్రము, ఇంజనీరింగు మొదలైనవి ఉచితముగా నేర్పు టెక్నికలు స్కూలు ఇది. ఈసంవత్సరము ఇందుండిన విద్యార్థులమొత్తము సంఖ్య 134.

### శిల్పవిద్యాలయం

ఇందు అర్హులైన విద్యార్థులకు, ఎలక్ట్రిక్కు, ఆటోమెకానిక్కు, టర్నింగు, ఫిట్టింగు, కొయ్యపని, నేతపని ఉచితంగా కఱపబడుతుంది. శిక్షణ కాలం ఒకసంవత్సరమునుండి మూడుసంవత్సరములవఱకు. ఈసంవత్సరం ఇందుండిన విద్యార్థులమొత్తం సంఖ్య 62. పరీక్షకు కూర్చున్న వారు 55, నెగ్గినవారు 42.

### జనశిక్షామందిరం

ఇది ఉమ్మడి విద్యాప్రచార ప్రజాసేవా కేంద్రం. దీని ఆధ్వర్యంలో 9 రాత్రి పాఠశాల లున్నాయి. వానిద్వారా 70 వయోజనులకు అక్షరాస్యత సమకూర్పబడింది. విద్యాప్రచారక చలనచిత్రములు 88 ప్రదర్శింపబడ్డాయి. దాదాపు 58,000 ప్రజలు చూచారు. ఉచిత గ్రంథాలయంలో ఉన్న గ్రంథాలమొత్తం సంఖ్య 16,073. చదువరులకు ఎరవీయబడిన పుస్తకాల సంఖ్య 18,326. యువకుల భౌతిక వైజ్ఞానికాభివృద్ధికి సాధకములైన వివిధ సారస్వతవినోదకార్యక్రమాలు నిర్వహింపబడినవి. ప్రతిదినం దాదాపు 200 శిశువులకు పుష్టికరమైన అల్పాహారం ఉచితంగా సరఫరా చేయబడింది. ప్రతిదినం శిశువులకు తల్లులకు కలిసి మొత్తం 8000 మందికి పాలు ఉచితంగా సరఫరా చేయబడింది.

### తత్త్వమందిరం

ఇందు ప్రతివారం బ్రహ్మచారులకు సన్న్యాసులకు మతాధ్యాత్మిక గ్రంథప్రవచనమున్ను, పురజనులకు శ్రీమద్భాగవతోపన్యాసములున్ను జరుపబడినవి. మంచి సంస్కృతవేదాంత గ్రంథాలయం ఉంది.

### ఉత్పత్తి - గ్రంథప్రచురణశాఖ

ఇందు చిన్నయంత్రములు పరికరములు ఫోటోచట్టములు మొదలైనవి తయారుచేయబడును. ఫోటోగ్రఫీశాఖ ఉన్నది. రామకృష్ణ వివేకానందోద్యమమునుగుఱించిన గ్రంథాలు

19 ఇప్పటివఱకు ప్రచురింపబడి ఉన్నవి. చక్కని పరికరాలతో "గ్రంథప్రదర్శన", "విక్రయ" శాల ఉన్నది.

ఇన్ని సంస్థలను నిర్వహిస్తున్న శారదాపీఠము నకు ఆర్థికపుచిక్కు ఎంతో ఉన్నది. ఉదార మహాజనుల విరాళాలు నిరీక్షింపబడుతున్నాయి.

## శ్రీహరేరామభజన భక్తసమాజము

### శ్రీలక్ష్మీనరసింహక్షేత్రము – హరేరామనగర్

కోరుకొండ, తూర్పు గోదావరిజిల్లా.

ఈసమాజంవారు ఏటేట కార్తికమాసం నెలరోజులూ జరిపే పూజాన్నదానోపన్యాస సంకీర్తనాది కార్యక్రమాన్ని ఈసంవత్సరం ముక్కోటిఏకాదశిదాక పెంచి, మఱునాడు ద్వాదశిరోజున సుమారు 500 మంది దరిద్ర నారాయణులకు కావింపబడ్డ అన్నదానంతోను 60 మంది సాధువులకూ వికలాంగులకూ కావింపబడిన వస్త్రదానంతోను జయప్రదంగా ముగించారు. అభినవతులసీదాస శ్రీపసుమర్తి శ్రీరామమూర్తి ఎమ్. ఏ. గారు, (విశాఖ పట్నం), మోక్షసాధని పత్రికాసంపాదకులు శ్రీరామశరణ శ్రీగుండుమర్తి వేంకటనరసయ్యా పాకయాజిగారు (నామప్రయాగ, బుద్ధాం) పీఠిశిష్యులు శ్రీరామసాక్షాత్కార భాగ్య వంతులు పూర్వజన్మజ్ఞానసంపన్నులు 15 సంవ త్సరముల వయస్సుగల శ్రీహరిరామనాథం గారు (బందరు), కోరుకొండ శ్రీలక్ష్మీనరసింహ స్వామివారి దేవస్థానధర్మకర్తలు శ్రీమాన్ పరాశరసుదర్శనభట్టరు అయ్యావార్లంగారు మొదలగు మహనీయులు ఉపన్యసించారు. మహిమాన్వితులైన శ్రీహరేరామస్వామివారిని దర్శించి, అన్ని విధాలా సహకరించి కార్యక్ర మాన్ని జయప్రదమొనరించిన భక్తులెల్లరికీ అమూల్యమైన వచనామృతమును ప్రసాదించి తరింపజేసిన పండితోత్తములకూ సమాజకార్య దర్శి శ్రీకపిలవాయి సుబ్బరావు కృతజ్ఞతాభి వందనాలు సమర్పించారు. ఈకార్యక్రమం 40 రోజులలో సుమారు రెండువేలమంది దరిద్ర నారాయణులకున్నూ, వచ్చి కార్యక్రమంలో అన్వయించిన భక్తులకు సుమారు వెయ్యిమంది కిన్నీ అన్నసంతర్పణ కావింపబడింది.

# గ్రంథపరిచయం

## ఆంధ్రపద్యగీతాంజలి

రచయిత: డాక్టరు వేమూరి ఆంజనేయశర్మ గారు, సంస్కృతవిభాగము, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాల, తిరుపతి. ప్రకాశ కులు కడపజిల్లా రాజంపేట శ్రీసరస్వతీ బుక్ డిపో వారు. పుటలు 98, వెల మూడు రూపాయలు.

దక్షిణభారతదేశములో తమిళభాషలో నాయనారులును ఆళ్వారులును లోకోత్తరమైన భక్తిగేయసారస్వతాన్ని వెలయించారు. అన్ని విధాలా ఆమార్గానసే రూపొందినది వంగ భాషలో రవీంద్రుని గీతాంజలి. మూలకర్తయే దాన్ని ఆంగ్లభాషలోకి పరివర్తించడం విశేషం. హృదయప్రభవమున్నూ హృదయద్రవీకరణ సమర్థమున్నూ ఆయన గీతాంజలికి దత్తము కావడంచేత నోబెల్బహుమతి చరితార్థమైంది. ఆంగ్లమూలానికి డాక్టరు వేమూరి ఆంజనేయ శర్మగారు కావించిన ఆంధ్రానువాద మిది. విషయమాధుర్యానికి పోషకంగా ఆంధ్రభాషా మాధుర్యం వెల్లివిరిసే శర్మగారి యీ ఫణితికి స్వాగతం.

— ప్రభాకర్.

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించియున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

---

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషన్ (సేవాసంస్థ):
# తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెలమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికాధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధక్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్షవీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# రా మ కృ ష్ణ ప్ర భ

సంపుటము ౨౬ ౧౯౭౦ - ఫిబ్రవరి : సౌమ్య - మాఘము సంచిక ౮

## వి ష య సూ చి క



ఫోన్ : 71231 రా మ కృ ష్ణ ప్ర భ పోస్టు బాక్సు : 635

### ప్ర క ట న

1969 జూలై నెలలో శ్రీరామకృష్ణప్రభ యిరువదియాఱవ సంపుటము ప్రారంభ మయినది. ఈ పత్రికయందు ఇంతవఱకు ఆదరాభిమానములు చూపుచున్న ఆంధ్రమహాజనులకు మా హృదయపూర్వకాభివందనములు. మా పారమార్థిక సందేశ ప్రచారసేవను ప్రశంసించుచున్న వందలాది భక్తులకు, పాఠకులకు మా శ్రేయఃకాంక్షలు.

చందాదారు లందఱును భగవత్సేవాపరాయణమైన మా యీ పత్రికయెడల ఎప్పటియట్ల ఆదరాభిమానములు చూపగలరని విశ్వసించుచున్నాము.

మే నే జ రు : శ్రీ రామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీ రామకృష్ణమఠము - మద్రాసు 4.

# తగ్గింపు ధరలు

## ఆంధ్ర పాఠకులకు అమూల్య తరుణము

1969 జూలై మొదలు 1970 జూన్ వఱకు శ్రీ రామకృష్ణ ప్రభ రజతోత్సవ సంవత్సరముగా పరిగణింపబడుచున్నది. ఈ మధ్యకాలములో మాచే ప్రచురింపబడిన శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి (పది సంపుటములు) తగ్గింపు ధరలకు విక్రయింపబడును. ఆంధ్రపాఠకు లీ యమూల్యావకాశమును సద్వినియోగము చేసికొందురుగాక.

# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

(పది సంపుటములు)

ప్రతి సంపుటములోను దాదాపు 500 పుటలు : అమూల్య సందేశము.

| అట్టబైండు సెట్టు | | క్యాలికోబైండు సెట్టు | |
|---|---|---|---|
| మామూలు ధర | తగ్గింపు ధర | మామూలు ధర | తగ్గింపు ధర |
| రూ. **51-50** | రూ. **38-62** | రూ. **65-00** | రూ. **48-75** |

పుస్తక వ్యాపారులకు $33\frac{1}{3}\%$ కమీషను ఇయ్యబడును.

**నూతన ముద్రణము !** **ఇప్పుడే వెలువడినది !!**

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

**పుటలు : 480** (సర్వాంగసుందరమైన సప్తమ ముద్రణము) **వెల : రూ. 4-00**

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# ఉద్యాన నగరు
# 60 సంవత్సరాల ముందు ప్రగతి

జెమ్‌షెడ్‌పూర్. ఉక్కు నగరంనిండా చెట్లు పువ్వులు! వాస్తవానికి, భారతదేశంలో అందమైన నగరాలలో ఇదొకటి. ఆశ్చర్యకరమైన విషయము, విదేశాలలోకూడా ముందు ప్రణాళికవేసి నగరాలు నిర్మింపబడనప్పుడు జెమ్‌షెడ్‌పూర్ నేడు ఉన్నదున్నట్లుగా 60 ఏళ్లక్రితం ముందు ప్రణాళికతో భావింపబడింది





సొనారి—పల్లె మార్చబడింది. అభివృద్ధి ప్రణాళిక క్రింద టాటా స్టీల్ 20 పల్లెలను చేర్చి అందమైన నగరంగా మంచి మంచి రోడ్లు దీపాలు సౌకర్యాలతో కావలసినంత నీటి వసతులతో మార్చి ప్రజోపకారం కల్గించింది.



ది టాటా మెయిన్ హాస్పటల్ అన్ని వసతి సౌకర్యాలుకలి 600 పడకలుగల హాస్పటలుతోబాటు టాటా స్టీల్ ప్రత్యేకమైన పిల్లల వార్డులతో 82 పడకలతో టిబి హాస్పటల్ నిర్మాణానికి సహకరించింది



జ్యూబిలీ పార్కు. "పుష్పాలు, పార్కులు, చెట్లు నేననుకొంటాను మానవ మాత్రులకు వారి భావ ప్రవృత్తులకు ప్రాతిపదికముగా ప్రాముఖ్యమైనవే. ఉక్కు ఇనుముకంటె వేరైన దానిని కలిగిస్తుంది — ఈ సుందరమైన పార్కును నిర్మించటం ఆనందకరమైన భావనా సంకల్పన"

జవహర్‌లాల్ నెహ్రూ

మన బలము మన ప్రజలమీద
మన ఉక్కుమీద ఆధారపడివుంది

**టాటా స్టీల్**

TN-4478 TE

# శ్రీ రామకృష్ణసూక్తిసుధ

## అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హాగ్లిస్) అను పాగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితా మాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు : తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సన్డే స్టాన్డర్డు : తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల : రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

## అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వాములవారు

వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల : 2-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

‘అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ } ౧౯౭౦ – ఫిబ్రవరి :: సౌమ్య – మాఘము { సంచిక ౨


శ్రీః

## బ్రహ్మస్తోత్రము

మూలము : మహాకవి కాళిదాసు

వ్యాఖ్యాత : కీ॥ శే॥ ఆదికళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు

నమ స్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్ సృష్టేః కేవలాత్మనే
గుణత్రయవిభాగాయ పశ్చా ద్భేద ముపేయుషే. 1

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓ భగవంతుఁడా) |
| సృష్టేః | సృష్టికి |
| ప్రాక్ | పూర్వము |
| కేవల | ఒక్కటియె యగు |
| ఆత్మనే | స్వరూపముగలవాఁడవును (రెండవది లేని వాఁడవును) |
| పశ్చాత్ | తర్వాత (సృష్టికిం గడంగిన సమయమందు) |
| గుణ | (సత్త్వరజస్తమో) గుణములయొక్క |
| త్రయ | మూఁడు అనెడు |
| విభాగాయ | భేదకారణముగలవాఁడవై |
| భేదమ్ | (స్రష్టృత్వములోనగు) ఉపాధిని |
| ఉపేయుషే | పొందినవాఁడవును |
| త్రిమూర్తయే | బ్రహ్మవిష్ణుశివాత్మకమయిన మూఁడు రూపములుగలవాఁడవును (అగు) |

| | |
|---|---|
| తుభ్యం | నీకు |
| నమః | ప్రణామము |

తా. ఓ భగవంతుఁడా, సృష్టికి ముందు ఒక్కఁడవే ఉండి, యనంతరము రజస్సత్త్వతమస్సు లనెడు మూఁడుగుణముల మూలముగా సృష్టిస్థితిసంహారములకై భేదములు పొంది బ్రహ్మవిష్ణురుద్రరూపముల మూఁడుమూర్తులై యున్న నీకు మ్రొక్కు. ౧

> య దమోఘ మపా మన్త రుప్తం బీజ మజ త్వయా
> అత శ్చరాచరం విశ్వం; ప్రభవ స్తస్య గీయసే. 2

| | |
|---|---|
| అజ | పుట్టువు లేనివాఁడా |
| అపామ్ | నీళ్ళయొక్క |
| అన్తః | లోపల |
| త్వయా | నీచేత |
| అమోఘం | వ్యర్థము కాని |
| యత్ బీజం | ఏవిత్తనము |
| ఉప్తం | నాటఁబడినదో |
| అతః | ఆ బీజమునుండి |
| చర | జంగమమును (చరించునదియు) |
| అచరం | స్థావరమును (చరింపనిదియు) అగు |
| విశ్వం (ఉత్పన్నమ్) | ప్రపంచము (పుట్టినది) |
| తస్య | ఆవిశ్వమునకు |
| ప్రభవః | జన్మకారణముగా |
| గీయసే | కొనియాడఁబడుచున్నావు |

తా. పుట్టుక లేని యో భగవంతుఁడా, నీళ్ళలోపల నీవు రిత్తకానిదైన యే విత్తనమును నాటితివో, దానినుండి స్థావరజంగమాత్మకమయిన యీ ప్రపంచము పుట్టినది. కావున నిన్ను ఈప్రపంచముయొక్క జన్మకారణ మని కొనియాడుదురు. ౨

> తిసృభి స్త్వ మవస్థాభి ర్మహిమాన ముదీరయన్
> ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః. 3

| | |
|---|---|
| ఏకః | (సృష్టికిముందు) ఒక్కఁడవేయైయున్న |
| త్వం | నీవు |
| తిసృభిః అవస్థాభిః | మూఁడు దశలచేత |
| మహిమానమ్ | (నీ) ప్రభావమును |
| ఉదీరయన్ | ప్రకటించుచు |
| ప్రళయ | నాశనమునకును |

| స్థితి | రక్షణమునకును |
|---|---|
| సర్గాణాం | సృష్టికిని |
| కారణతాం | హేతుత్వమును |
| గతః | పొందినవాఁడవు |

తా. సృష్టికిముందు ఒక్కఁడవై యున్న నీవు రజస్సత్త్వతమోమయములగు బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపముల మూఁడుదశలచేత నీప్రభావమును ప్రకటించి సృష్టిస్థితిసంహారములకు మూఁటికి కారణభూతుఁడవై యున్నావు. 3

> స్త్రీపుంసా వాత్మభాగౌ తే భిన్నమూర్తే స్సిసృక్షయా
> ప్రసూతిభాజ స్సర్గస్య తా వేవ పితరౌ స్మృతౌ. 4

| స్త్రీపుంసౌ | స్త్రీపురుషులు |
|---|---|
| సిసృక్షయా | సృజించు నిచ్ఛచేత |
| భిన్నమూర్తేః | రెండుగాఁ జేయఁబడిన స్వరూపముగల వాఁడవయిన |
| తే | నీయొక్క |
| ఆత్మ | దేహముయొక్క |
| భాగౌ | పాళ్ళు |
| తావేవ | ఆ పాళ్ళే |
| ప్రసూతిభాజః | ఉత్పత్తిని బొందియున్న |
| సర్గస్య | లకు |
| పితరౌ | తలిదండ్రులుగా |
| స్మృతౌ | చెప్పఁబడినవి |

తా. మిథునసృష్టినిమిత్తము రెండుగా చీలిన నీదేహముయొక్క భాగములే స్త్రీపురుషులు. ఆరెండుభాగములనే పుట్టుకనొందు జంతువులకు తల్లిదండ్రు లని పెద్దలు వ్యవహరింతురు.

> స్వకాలపరిమాణేన వ్యస్తరాత్రిన్దివస్య తే
> యౌ తు స్వప్నావబోధౌ తౌ భూతానాం ప్రళయోదయౌ.

| స్వ | నీయొక్క |
|---|---|
| కాల | కాలముయొక్క |
| పరిమాణేన | కొలతప్రకారము |
| వ్యస్త | విభజింపఁబడిన |
| రాత్రిన్దివస్య | రేయును పవలునుగల యట్టి |
| తే | నీకు |

| | |
|---|---|
| యాతు | ఏవి |
| స్వప్న | నిద్రయు |
| అవబోధౌ | మెలఁకువయునో |
| తావేవ | అవియే |
| భూతానాం | సృజింపఁబడినవానికి |
| ప్రళయ | సంహారమును |
| ఉదయౌ | సృష్టియును (అయియున్నవి) |

తా. నీవు నీకాలపరిమాణముప్రకారము నీకు రాత్రిని పగటిని ఏర్పఱచుకొనియున్నావు. అందు నీవు నిద్రించుకాల మయిన రాత్రి భూతములకు ప్రళయముగాను, నీ మెలఁకువకాల మయిన పగలు భూతములకు సృష్టిగాను ఉన్నది. ౫

జగద్యోని రయోని స్త్వం, జగదన్తో నిరన్తకః;
జగదాది రనాది స్త్వం, జగదీశో నిరీశ్వరః. 6

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓ భగవంతుఁడా) |
| త్వం | నీవు |
| జగత్ యోనిః | ప్రపంచమునకు కారణమవు |
| అయోనిః | (స్వయము) కారణము లేనివాఁడవు |
| (త్వం) | (నీవు) |
| జగత్ అన్తః | లోకముయొక్క సంహారకుఁడవు |
| నిరన్తకః | (స్వయము) సంహారకుఁడు లేనివాఁడవు |
| త్వం | నీవు |
| జగత్ ఆదిః | లోకములకు ముందున్నవాఁడవు |
| అనాదిః | (స్వయము) ఆది లేనివాఁడవు |
| (త్వం) | (నీవు) |
| జగత్ ఈశః | లోకములకు దొరవు |
| నిరీశ్వరః | (స్వయము) దొర లేనివాఁడవు |

తా. ఓభగవంతుఁడా, నీవు ప్రపంచమునకు కారణభూతుఁడవు, నీకు కారణము లేదు. నీవు లోకములను సంహరించువాఁడవు, నిన్ను సంహరించువాఁడు లేఁడు. నీవు లోకసృష్టికి పూర్వ మున్నవాఁడవు, నీకు పూర్వ మెవ్వఁడును లేఁడు. నీవు జగత్తులకు ప్రభువవు, నీకు ప్రభు వెవ్వఁడును లేఁడు. ౬

(సశేషము)

# స్వామిజీనిగూర్చిన ప్రాజ్ఞసూక్తిమయూఖమాల

(స్వామిజీ శతవార్షికమహోత్సవము కొన్ని సంవత్సరములకు మునుపు ప్రపంచమంతటను కొనియాడబడినది. ఆసందర్భములో విద్వాంసులు మేధావంతులు తమరచనలలోను ఉపన్యాసములలోను శ్రీవివేకానందస్వామిలో తమ కొక్కొక్కరికి కననైన విశేషాలను సూక్తులలో తెలిపియున్నారు. వానిలో కొన్నిటిని ఈక్రింద పొందుపఱచుచున్నాము. అవి స్వామిజి ప్రతిభను జీవితవిశేషాలను మఱింతగాఢముగా అవగాహనచేసికొనుటకు చదువరులకు తోడ్పడవచ్చును.)

తనమాతృదేశ మతాధ్యాత్మికవిజ్ఞానములో వరిష్ఠాంశముల నన్నిటిని శ్రీవివేకానందస్వామి తనజీవితమందును ఉపదేశములందును రూపొందించుకొన్నారు.

*  *

మన ఆధ్యాత్మికమహానాయకులలో అగ్రగణ్యులలో శ్రీవివేకానందస్వామి ఒక్కరు. ఆయన యుపదేశములు మనకు నిత్యనూతనోత్సాహ ప్రదములు.

*  *  *

శ్రీవివేకానందస్వామి ఒకయోగియోధుడని అనేకవిధములలో చెప్పవచ్చును. నిద్రాజడులైయుండిన మనప్రజలకు ప్రబోధమును శక్తిని ఆయన కలిగించినారు.

ఆయువసన్యాసి నెమ్మోమునుండి అగ్నిని వెదజల్లెను. ఆయనమాటలు శక్తిజనకయంత్ర (డయనమైటు) ప్రహారములవలె పనివడినవి. ...మానవుని రూపొందించుటకు పోతపోయు కర్మాగారమును నిర్మింపవలసిన దని ఆజ్ఞాపించినవారు స్వామిజి...స్వామిజిని మించిన విశుద్ధాత్ముడును ప్రభావాంచితవ్యక్తివిశేషమును భారతప్రజల ఉద్రేకసంకల్పములను లక్షించు ప్రజ్వలాగ్నిస్వరూపుడును విశ్వపౌరు డనగలిగినవాడును ఎప్పుడును ఎక్కడను ఉండినది లేదు.

స్వామిజి మహాయోగి, మహాగురువు, తత్త్వవేత్త, అన్నిటికిని మించి మహాదేశభక్తుడు.

*  *

నవ్యయుగమున భారతమాత కనిన మహిష్ఠయోగులలో శ్రీ వివేకానందస్వామి యొకడు.

*  *  *

భారతజాతిని రూపొందించిన పితరులలో శ్రీవివేకానందస్వామి యొకడు.

*  *  *

నిరుత్సాహులును నిర్జితులునగు భారతీయుల మేలునకై శ్రీవివేకానందస్వామి ఒక బలతత్త్వశాస్త్రమును ఆనందతత్త్వశాస్త్రమును వ్యాఖ్యానించెను. కాని ఆబలము ఆత్మబలము. ఆయానందము మానవసేవద్వారా మానవులసుఖముద్వారా గలుగు నాత్మసాక్షాత్కారముచే సిద్ధించునట్టిది.

*  *  *

బుద్ధదేవుని నైతికాదర్శతత్త్వమునకును శ్రీశంకరుని ఆధ్యాత్మికాదర్శ తత్త్వమునకును చక్కనికలయిక మనకు శ్రీవివేకానందస్వామి జీవితసందేశాలలో కన నగును.

*  *  *

భారతదేశమునకు మాత్రమే కాక సకల ప్రపంచమునకును వెలుగునిచ్చిన జీవితమును గడపిన శ్రీవివేకానందస్వామి మహాత్ముడు, గొప్పయాధ్యాత్మికపురుషుడు.

*  *  *

స్వామిజి "భారతభూమి" అను పంచాక్షరిని యుచ్చరించినప్పుడు ఆయనకంఠమున ఎంతటి ప్రగాఢకరుణరసము తొణకుచుండు ననగా ఆ పవిత్రభూమి మీది ప్రేమ అంటువ్యాధివలె దగ్గఱ నెవరున్నను వారిలోనికి సంక్రమించును.

* * *

ఒకసారి స్వామి "భారతదేశముపై నాకున్న ప్రేమయే నాలోని గొప్పదౌర్బల్యము" అని చెప్పెను. అది దౌర్బల్యమే అగునేని, పరమ భవ్యమైన అత్యంతధన్యతావహమైన దౌర్బల్యమది.

శ్రీవివేకానందస్వామికుండిన భారతదేశ ప్రేమ, ఆయనకుండిన విశ్వప్రేమలో నొక యంగమే.

వివిధసమయములలో శ్రీవివేకానందస్వాముల మనఃపరిస్థితియు వివిధముగ నుండెడిది. ఐనను ఏపరిస్థితియందైనను సరే ఆయన యుదాత్తత ఇంతంత కాదు.

శ్రీవివేకానందస్వాముల దృక్పథములో భారతదేశ మనిన నొకభాగోళిక భాగము గాదు. భారతదేశ మనగా ఆధ్యాత్మికాశయమునకు లక్ష్యము.

* * *

శ్రీవివేకానందస్వామి భారతదేశచరిత్రమున చాలలోతునకు దిగి పరిశీలించినవాడు. చరిత్రమును వైజ్ఞానికమార్గమున అవగాహనచేసికొనుటయే కాదు. చరిత్రలోతుపాతులకు ప్రసరించు మిక్కిలి చుఱుకైన చూపుకలవాడాయన.

* * *

శ్రీవివేకానందస్వాముల దృష్టి చాలగొప్పది. కాని ఆయన వట్టికలలు గనువాడు కాదు.

* * *

శ్రీవివేకానందస్వామి రాజకీయములలో పాల్గొన లేదు. తాను నెలకొలిపిన సంస్థ రాజకీయములకు దవ్వుగ నుండునట్లు గట్టికట్టుదిట్టములు అయన చేసియుండెను. కాని విదేశీయుల పరిపాలనవలని దుఃఖములకు ఆయన ఎంతగానో మనోవ్యథ చెందెను. అనిరీక్షితమైన వింతమార్గములో భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చు నని ఆయన జోస్యముగ చెప్పెను.

* * *

స్వయముగ శ్రీవివేకానందస్వామియే ఒకసారి "నేను ప్రారంభించిన ఈకార్యకలాపముల ప్రభావము కనీసము ఏడుశతాబ్దముల వఱకును ఉండును" అని వక్కాణించెను. ఆయన మహాసమాధి నొంది ఇంకను డెబ్బది సంవత్సరములైనను కాలేదు.

* * *

శ్రీశంకరాచార్యులు తనవిద్వత్ప్రతిభచే వేదాంతసిద్ధాంతమును ప్రతిపాదించెను. దానిని స్వామిజి ప్రతిమానవుని సాంఘికజీవనమున అన్వయపఱచెను. శ్రీవివేకానందస్వాముల ప్రజాస్వామ్యవాద (సోషలిజము) హృదయము ఈయనుష్ఠానవేదాంతమే.

* *

శ్రీవివేకానందస్వామి ద్రష్టయగుటయే గాక వ్యవస్థానిర్మాతయు నయ్యెను. శ్రీరామకృష్ణతత్త్వప్రకాశక వ్యాఖ్యాతృపరంపరకు చెందినవాడైనను స్వామిజి భారతదేశమున నొక శ్రోత్రసంప్రదాయమును స్థాపించినవారిలో ప్రథముడు.

* * *

పాశ్చాత్యదేశములకు వచ్చిన శ్రీవివేకానందస్వామి స్వకీయసిద్ధాంతము నుద్ఘోషించు ప్రవక్తగా రాలేదు. భారతదేశీయసనాతనోపదేశములకును జ్ఞానభక్తిసంప్రదాయములకును తు.చ.తప్పనిమహావ్యాఖ్యాతగా అరుదెంచెను.

* * *

శ్రీవివేకానందస్వాముల యభిప్రాయమున హిందూత్వమనగా నొకసిద్ధాంతమతము కాదు. ఒకప్రత్యేకసిద్ధాంతమును బోధించుచు ప్రచారముచేయుచు ఇతరమతాలవారిని తనలోనికి మరల్చుకొను మతము కాదు హిందూత్వము. హిందుత్వ మొక సంస్కృతి.

* * *

వివేకానంద జీవిత తత్త్వసారము "దేశభక్తి"యే అని కనీసము కొన్నిసందర్భములలో వివరింపబడినది గాని నిజమునకు ఆయన జీవిత తత్త్వసారము "విశ్వమానవప్రేమ.'

*

శ్రీవివేకానందస్వామి "మీ (రుజీర్ణించుకొనుట)కు 1500 సంవత్సరములకు అగు ఆహారమును ఇచ్చి పోవుచున్నాను" అని తానే చెప్పెను.

* * *

జనసంఘశాస్త్రవేత్తకు, భౌతికాదిశాస్త్రజ్ఞునకు, చరిత్రరచయితకు, తత్త్వశాస్త్రవేత్తకు, మనస్తత్త్వప్రవీణునకు, ఆత్మానుభూతిరసికునకు ఉండవలసిన ప్రతిభ అంతయు కలిసి శ్రీవివేకానందస్వామిలో నుండెను. కావున ఆయన శిల్పిసార్వభౌముడు.

* * *

రోమైరోలాతో శ్రీరవీంద్రనాథుడు "భారతదేశము నెఱుంగగోరెదవేని శ్రీవివేకానందసారస్వతమును చదువు" మని చెప్పినవాక్యము ప్రత్యక్షరసార్థకము.

# స్వతంత్ర కర్మాచరణము

'కర్మ' శబ్దమునకు 'పని' అను అర్థము ప్రసిద్ధమే. కాని మనకష్టసుఖానుభవాలకు కారణములైన వానిని గూడ మనము కర్మశబ్దముచే వ్యవహరించుచుందుము. కావున కర్మసిద్ధాంత మన్నను కార్యకారణసిద్ధాంతమన్నను ఒక్కటే. ఒకపరంపరలో ప్రతిదియు తనకు మునుపటిదానికి కార్యముగాను, తనకు పిమ్మటిదానికి కారణముగాను అమరియుండును. ఈతైత్తిరీయశ్రుతివాక్యములను కనుడు :—

తస్మా ద్వా ఏతస్మా
దాత్మన ఆకాశ స్సమ్భూతః।
ఆకాశా ద్వాయుః।
వాయో రగ్నిః।
అగ్నే రాపః।
అద్భ్యః పృథివీ।
పృథివ్యా ఓషధయః।
ఓషధీభ్యో ఽన్నమ్।
అన్నా త్పురుషః

"ఆత్మనుండి ఆకాశము పుట్టెను, ఆకాశము నుండి వాయువును, వాయువునుండి యగ్నియు, అగ్నినుండి జలమును, జలమునుండి భూమియు, భూమినుండి యోషధులును, ఓషధులనుండి అన్నమును, (రేతస్సుగనైన) అన్నమునుండి పురుషుడును పుట్టుచున్నారు" ఈపరంపరలో

మొదటిదైన ఆత్మకు పుట్టుక లేదు, కావున ఆత్మ కొకజన్మ హేతువు, కారణము, లేదు. 'ఆకాశము'నుండి 'పురుషు'నివఱ కున్న ఏడింటిలో ఒక్కొక్కటియు తనకు మునుపటిదానికి కార్యముగాను తనకు పిమ్మటిదానికి కారణముగాను ఉన్నది. ఆకాశము 'ఆత్మ'కు కార్యము, 'వాయువు'నకు కారణము. వాయువు ఆకాశమునకు కార్యము, అగ్నికి కారణము; అగ్ని వాయువునకు కార్యము జలమునకు కారణము, జలము అగ్నికి కార్యము, పృథివికి కారణము; పృథివి జలమునకు కార్యము, ఓషధులకు కారణము; ఓషధులు పృథివికి కార్యములు అన్నమునకు కారణములు; అన్నము ఓషధులకు కార్యము పురుషునకు కారణము. వంశపరంపరలో ప్రతిప్రాణియు తనతల్లిదండ్రులకు కార్యమును తనసంతతికి కారణముగను అవుచున్నాడు. భగవద్గీతలో ప్రస్తుతమైన మఱొక పరంపరను దిలకింపుడు—

ధ్యాయతో విషయాన్ పుంసః
సఙ్గ స్తేషూపజాయతే
సఙ్గాత్సఞ్జాయతే కామః
కామా త్క్రోధో ఽభిజాయతే।
క్రోధా ద్భవతి సమ్మోహ
స్సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో
బుద్ధినాశా త్ప్రణశ్యతి॥

విషయములనుగూర్చిన ధ్యానమునుండి విషయాసక్తి ఏర్పడుచున్నది. విషయాసక్తినుండి కామము గలుగుచున్నది, కామమునుండి కోపము పుట్టుచున్నది, కోపమునుండి మోహముప్పతిల్లుచున్నది, మోహమునుండి విస్మృతి సిద్ధించుచున్నది, విస్మృతినుండి బుద్ధినాశము పాటిల్లుచున్నది, బుద్ధినాశమువలన పురుషునకు వినాశము మూడుచున్నది. పైని వివరించిన కార్యకారణసంబంధము ఈ పరంపరలోను స్పష్టమే.

కార్యకారణములకు ఉన్నసంబంధము అవినాభావసంబంధము. ఈరెండింట నొకటియుండి రెండవది లేకుండుట పొసగదు. కారణము లేని కార్యముండదు. కార్యమునకు కారణముండకుండదు. ఇదొకనియతి. ఇది కార్యకారణసిద్ధాంతము. ఇట్లే సుకృతదుష్కృతములకును వాని శుభాశుభఫలితములకును ఉన్న సంబంధము అవినాభావసంబంధమే. సుకృతము లేనిదే శుభము ఫలింపదు. శుభము గల్గినప్పుడు అందుకు హేతువైన సుకృత ముండకుండదు. దుష్కృతము లేనిదే అశుభము గలుగదు. అశుభము వాటిల్లినప్పుడు అందుకు హేతువైన దుష్కృతము లేకుండదు. ఇదొక నియతి. ఇది కర్మసిద్ధాంతము.

మనయింద్రియగోచరమగు ప్రతివిషయమును మనచిత్తమునందంతకు ముందేయున్న విషయములతో సంసర్గమొందును. దానిని వానితో మన మనస్సు సమన్వయించుకొటచే రూపొందునదే కార్యకారణాదికసంబంధము. కావున ఏనియతియైనను గానిండు, ప్రకృతిలోనున్న దనుట సరి కాదు. మన మనఃప్రభవమే అది. 'ఈనియతి విశ్వనియతి, ఇది విశ్వసూత్రము' అనుచుందుము. ఇచట విశ్వమనగా వ్యక్తమై నామరూపాత్మకమై మన యింద్రియములకు గోచరించుచున్న ప్రపంచమే. ఇది అనంతమైన విశ్వములో చాల చిన్నదైన యొకభాగము. దీనినే మనము విశ్వమని వ్యవహరింతుము. కార్యకారణాదికసంబంధమును దేశకాలనిమిత్తబద్ధతయు నియతియు సోపాధికమైన యీవిశ్వమునమాత్రమే సాధ్యమగును. మనోగోచరప్రపంచమున కవ్వల కార్యకారణాదికనియమము వర్తింపనేరదు.

ఏలయన ఇంద్రియాతీతమగు తావున విషయముల నన్వయించు మనోవ్యాపార ముండ నేరదు కదా!

సర్వము నియమబద్ధ మయిన యీ ప్రపంచమున దేనికిని స్వతంత్రత లేదు. 'స్వతంత్ర సంకల్ప' మనున దొకటి యుండుట పొసగదు. కాని ఏది యింతకు మునుపు సంకల్పము కాకుండి, దేశకాలనిమిత్తములందు తగుల్కొని మానవసంకల్పరూపము నొందినదో అది స్వాతంత్రము. ఈసంకల్పము దేశకాలనిమిత్తముల నెడి పంజరమునుండి వెలువడి నంతనే మరల స్వతంత్ర మగును—

యతో వా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి।
య త్ప్రయ న్త్యభిసంవిశన్తి।

'ఎవ్వనిచే జనించు జగ? మెవ్వని లోపల నుండు? లీనమై యెవ్వని యందు డిందు?' అను ప్రశ్న లేపబడినది. పుట్టినది స్వాతంత్ర్యములో, ప్రసుత ముండునది బంధనములో, ఇందుండి విడివడి పోయి లీన మగునది స్వాతంత్ర్యములో - అని సమాధానము చెప్పబడినది. కర్మభూమియగు భూలోకము మాత్రమే కాక భోగభూము లనబరగు స్వర్గాది లోకములు గూడ 'దేశకాల నిమిత్తబద్ధములే'. ఈలోకాలలో ఒకదానినుండి మఱొకదానికి చేరుట, పెక్కులోకాలు సంచరించి మరల తొంటి లోకానికి మరలుట — ఇదంతయు సుడిగుండములోని నీటిత్రిప్పటవంటిది. ఈ గమనాగమనములు కర్మఫల ప్రవాహవేగకారితములే కాని ఇం దేదియు ఐచ్ఛికము కాదు. ఈ విషయమే భగవద్గీతలో,

ఆబ్రహ్మభవనా ల్లోకా
పునరావ ర్తినో ఽర్జున
మా ముపేత్య తు కౌన్తేయ
పునర్జన్మ న విద్యతే. (VIII-16)

"అర్జునా, భూలోక మాదిగ బ్రహ్మలోకము వఱకు గల లోకము లన్నియు పునరావృత్తితో గూడుకొనినవి. కాని కౌంతేయా, నన్ను బొందినవారికి మరల జన్మము లేదు" అని చెప్పబడినది. దేశకాలనిమిత్తబద్ధమగు నీ ప్రపంచమున అశాశ్వతము కానిది లేదు. దుఃస్థితి కలుగునేని అదియు క్షణికమే, సుస్థితి కలుగునేని అదియు క్షణికమే. అశాశ్వతమైన దానిని శాశ్వత మని భ్రమించుట ఒక యజ్ఞానము. ఈ యజ్ఞానముచే - దుఃస్థితి ననుభవించుచుండువారు దాని నంత మొందించుకొనుటకై పలుపాట్లు పడుచుందురు. అశాశ్వతమైన దానిని శాశ్వతమైనదానినిగా మార్చుకోవచ్చునని యెంచుట మఱియొక యజ్ఞానము. ఈయజ్ఞానముచే — సుస్థితియందుండువారు ఇప్పుడున్నదే తమ కెల్లప్పుడు నుండవలయు నని కోరుచు, అట్లుంచుకొనగలందులకై పలుపాట్లు పడుచుందురు. దేశకాల నిమిత్తబద్ధములైన వానికి పరిణామరహితత యనెడి శాశ్వతత్వమును గలిగించుకొనుటకై పడుశ్రమ మెల్ల వ్యర్థమే.

అసతో మా స ద్గమయ
తమసో మా జ్యోతి ర్గమయ
మృత్యో ర్మా అమృతం గమయ.

"అసత్తుగ నున్న నన్ను సత్తుగ నొనర్పుము, చీకటిలో నున్న నన్ను వెలుగులోనికి చేర్పుము. మృత్యుగోచరుడనై యున్న నన్ను అమృతత్వ మొందింపుము." అను ప్రార్థన వాక్యములలో ప్రస్తుతమైన లక్ష్యమును అధిగమింపవలయునని అందులకు దేశకాలనిమిత్తబద్ధమగు నీ ప్రపంచపు అవధుల నతిక్రమింపవలయును. ఈ క్షుద్రజగము ముగియుచోట పరమార్థధర్మము

ప్రారంభమగుచున్నది. ఔపాధిక భంగుర విశ్వమందున్న దృఢసంగమును మనము విడనాడునంతవఱకు ఆవల నున్న నిరవధికవిముక్తిని జాడగా కాంచు ఆసపాటైనను మనకు లేదు. కావున మానవుల మహోదాత్తాభిలాషల కెల్ల లక్ష్యమగు ఆవిముక్తిని బొందుట కొక్కటే మార్గమున్నది. ఏదనగా ఈక్షుద్రజీవితమును విడనాడుట, ఈ క్షుద్రజగమును విడనాడుట, భూమిని విడనాడుట, దివిని విడనాడుట, దేహమును విడనాడుట, మనస్సును విడనాడుట, పరిమితమును సోపాధికమునైన వాని నెల్ల విడనాడుట — క్షుద్రమగు ఈ యింద్రియజగమున ఈమనోజగత్తున మనమోహమును త్యజించినచో వెంటనే విముక్తుల మగుదుము.

కాని ఆ త్యజించుట చాల దుష్కరము. అందుకు రెండు మార్గా లున్నవి. మొదటిది జ్ఞాన మార్గము, రెండవది కర్మ మార్గము. మొదటిమార్గమున నెగ్గగలవారు అసాధారణ సంకల్పశక్తి సంపన్నులు అత్యల్పసంఖ్యాకులు. సామాన్యుల కెల్ల రెండవమార్గమే సుగమము. ఇందు కర్మల విడనాడక చేయుచు వానియందలి సంగమును వదలుకొను యత్నము మెట్టుమెట్టుగా సాగుచుండును.

బంధమును ద్రెంపుకొని స్వేచ్ఛ నందవలెనను కోరిక సకలప్రాణులందును ఉన్నది. తెలిసియో తెలియకో అందఱు పాటుపడుచుండునది ఆ లక్ష్యసిద్ధికే. ఆ లక్ష్యసిద్ధికి కర్మశక్తిని వినియోగించుకొను విధానమును మనకు తెలుపునదే కర్మయోగశాస్త్రము.

అది మనకు నేర్పు మొదటి పాఠము — మానుకోవలసినది కర్మాచరణమును గాదు, అందలి సంగమును. ఒక చక్కని చిత్రపటమునకు రెండుప్రతు లున్న వనుకొనుము. అందొకదానిని నీవు కొంటివి. రెండవదానిని పొరుగింటివాడు కొనెను. రెండును చక్కని పటములే. అగ్నిప్రమాదము సంభవించి పొరుగింటివాని పటము తగులబడిపోయినచో ఏరవంత 'అయ్యో పాప' మనుకొందువో గాని, అందు కాయన దుఃఖించినంతగా నీవు దుఃఖింపవు. ఆ యగ్నిప్రమాదముచే తగులబడిపోవుట నీపటమునకే సంభవించియుండినచో నీ వెంతగా దుఃఖపడియుందువో ఊహించుకో. విమర్శించి చూచినప్పుడు దుఃఖాతిశయమునకు కారణము తెల్లమగుచున్నది కదా. 'నాది' అనుకొనుటే దుఃఖమూలము. అదే సంకెల. 'మమకారమును తలయెత్తనీయక అణచిపెట్టుము' అని కర్మయోగము బోధించుచున్నది. మమకారత్యాగమే వైరాగ్యము.

వైరాగ్య మలవడుమార్గములు రెండు. దేవునందు నమ్మకము లేక, కేవలము 'నేను విరక్తుడను కావలయు'నను దృఢనిశ్చయముతో దానిని సాధించుట ఒకమార్గము. ఇది మనోబలసంపన్నులకు తగిన మార్గము. దేవునందు నమ్మకము గలవారు అనుసరింపదగినమార్గమింతకంటె సుకరమైనది. వారు కర్మలను తామొనర్చుచు కర్మఫలములను భగవంతునకు సమర్పింతురు. దేని నవలోకించినను, దేని ననుభవించినను, దేని వినినను, దేని నొనర్చినను సర్వము వారు భగవదర్పితబుద్ధితోడనే యొనరుదురు. మనము జగన్నాథుని సేవకులమనియు, అతని యాజ్ఞలను నిర్వర్తించుచున్నామనియు, కర్మమొనర్ప ప్రతిక్షణమును అతడే మనల ప్రేరించుచున్నాడనియు భావించి కర్మఫలములయెడ నిర్లిప్తులై యుందురు. ఫలములను భగవంతునకర్పించి వానిని తాను కోరకుండుటను సాధకుడు అలవఱచుకోవలయును. భగవదర్పితబుద్ధి స్థిరముగ నలవడు

వలయును, ఆలాగు తలంచుట మనస్స్వభావముగా పరిణమించువలయును రాత్రింబగళ్లు.

సిరిని వెదకిన నేఁ గన్న సిరివి నీవె,
ప్రేమభాజను వెదకి తీపృథ్వియందు,
నిన్ను నొక్కనినే గంటి నిక్కువముగ-
నన్ను నీకిదే యర్పించుచున్నవాఁడ.

అని అనుసంధించుచుండవలయును.

శరీరమును సంగమును బలాత్కరించి మనచే చేయించు నులను మన కర్తవ్యము లని పేర్కొనుచుందుమే, ఆ కర్తవ్యములు జఘన్యములు. ఆలాగు కర్తవ్యములను నిర్వర్తించువారు బానిస లనుట నిజము. పుణ్యము పాపము సుఖము దుఃఖము మున్నగు ద్వంద్వములు నాణెపు టిరువైపులవంటివి. ద్వంద్వములో ఒకదానిని రప్పించుకొని రెండవదానినుండి తప్పించుకొనుట సాధ్యము కాదు. పుణ్యమును కోరితివా, దాని నంటుకొని పాపమును గలుగును. పాప మంటకుండ వలయుననిన పుణ్యమును గూడ వదలుకొనవలయును. సుఖమును గోరితివా, దాని నంటుకొని దుఃఖమును వచ్చి పడును. దుఃఖము కలుగకుండవలయు ననిన సుఖాభిలాషనుకూడ మానవలయు. ఫలాభిసంధి లేక కర్మల ననుసరించువాడు స్వతంత్రుఁడు. ఆలాగు నిర్వర్తింపబడు కర్తవ్యము ఉత్తమము. వేయించిన గింజ అంకురించు శక్తిని కోల్పోయినట్లుగా భగవదర్పితఫలము లగు కర్మలు బంధకత్వమును కోల్పోయి కర్తకు విముక్తిదాయకము లగును. విముక్తియే కర్మయోగమునకు లక్ష్యము.

# జడభరతోపాఖ్యానము

## శ్రీమత్ప్రభవానందస్వామి

ఋషభరాజర్షి పుత్త్రుఁడగు భరతుఁడు మహిమాధికుఁడైన ప్రభువు. ఆమహిమచేతనే మన దేశము అతనిపేర భారతవర్షమన బరగెను. ఈ దేశమున కంతకుముందుండినపేరు అజనాభము.

బిడ్డలందఱిక్షేమము నభిలషించు కృపాళువైన తండ్రివలె, సకలప్రజలశ్రేయ మపేక్షించుచు భరతుఁడు రాజ్య మేలెను. స్వలాభము పైని తలంపించుకేనియు లేక సమష్టిలాభమునకై అతడు నిర్విరామముగా పాటుపడెను. ఎంత చిన్నపనినైననుగాని చేయునప్పుడు, అది భగవంతుని సేవయే అను తలంపుతో నతడు చేసెడివాఁడు. అందుచే ప్రతిపనియు భక్తికార్యమే ఆయెను; హృదయవిశుద్ధికర మాయెను, సర్వసంగవిమోచక మాయెను, జీవబ్రహ్మైక్యసంపాదక మాయెను.

వార్ధక్యమందు భరతమహారాజు తనరాజ్యమును పుత్త్రులైదుగురికిని పంచి యిచ్చి, కర్మబంధములను తెగతెంపులు చేసికొనగోరి, దైవధ్యానమునకై అడవికి చేరుకొనెను. విధుల నన్నిటిని నిర్వర్తించుటయు సత్కార్యముల నొనర్చుటయు సకలబంధవిముక్తికి మనల సంసిద్ధులనుగా చేయుటకే అని ఆయన యెఱుగును.

హిమాచలప్రాంతారణ్యమున గండకీనదీతీరమున అతడొక పర్ణకుటీరము నిర్మించుకొని

అచ్చట సర్వాంతర్యామియైన ప్రేమనాథుని గూర్చి సదా ధ్యానింపసాగెను. ఆంతరమైన యేశాంతిని కోరి ఆయన బ్రతికినన్నినాళ్లు పాటు పడెనో ఆ శాంతి ఆయనకు చేకూఱినది,

ప్రతిదినము ప్రొద్దున ఆయన భగవంతు నారాధించుచు ఇట్లు ప్రార్థించెడి వాడు—

ఆపరంజ్యోతిస్వరూపుని ధ్యానింతము గాక. ఆ జ్యోతినుండియే విశ్వ ముద్భవించెను. అందఱి డెండములం దున్నది ఆ జ్యోతి. సమస్తమును ఆ జ్యోతిలోనే లయించును, సకలప్రాణు లందును ఉన్న బుద్ధి ఆ జ్యోతియే. బుద్ధికి మార్గప్రదర్శకము ఆ జ్యోతియే, ఆ జ్యోతిని శరణు జొచ్చుచున్నాము.''

ఈవిధముగా దినములు నెలలు సంవత్సరములు గడచినవి. అంత నొకనాడు ఆ రాజర్షి ధ్యాననిమగ్నుడై యున్నచోటికి సమీపమున నొక హరిణాంగన నీరు ద్రాగుటకు వచ్చెను. అప్పుడే యించుకంతదూరమున నొక సింహము గర్జించెను. హరిణము మిక్కిలి భయపడి, నీరు ద్రాగుటకై ఆగక, నదిని దాటగోరి ఒక్కదూకుదూకెను. అది గర్భముతో నుండెను. మిక్కుటమైన యీ యూపుచేతను ఆకస్మిక భయాతిరేకముచేతను, ఆ జింక ఒక చిన్న శిశువును గని తత్‌క్షణమే విగతజీవమై నేల ద్రెళ్లెను. ఏటిలో బడి వెల్లువలో కొట్టుకొని పోవుచున్న జింకపిల్ల రాజుగారి కంట బడెను. అయన తత్‌క్షణమే ధ్యానాసనమునుండి లేచి అప్పుడే పుట్టిన హరిణశిశువును వెల్లువనుండి తప్పించెను; పర్ణశాల కెత్తుకొనిపోయి, మంట రాజజేసి వెచ్చన గలిగించి జాగరూకతతో శ్రద్ధతో హరిణశిశుజీవమును నిల్పెను. కరుణాళువైన ఆ ప్రభువు ఆహరిణశిశువును తన రక్షణలో ఉంచుకొని పండ్లను పచ్చికను తిన బెట్టి పోషించెను. ఆయన పితృహృదయముతో పర్యవేక్షించుచుండ ఆ శిశువు సుందర హరిణముగా వర్ధిల్లెను. యావజ్జీవము అంటి పెట్టుకొని ఉండిన రాజ్యపదవినుండియు కుటుంబమునుండియు విరక్తమైన ఆతని దృఢమనస్సు – తాను వెల్లువనుండి కాపాడిన హరిణము నందు సక్తమయ్యెను. జింకమీది ఆయన ప్రేమ నానాటికి వర్ధిల్లెను. అది వర్ధిల్లినకొలది పరమాత్మధ్యానమున అతని యేకాగ్రత క్షీణింపసాగెను. మేతకై కాననమున కేగిన జింక మరలివచ్చుట కాలస్యమైనచో ఆరాజర్షి తహతహపడుచుండెను. ''పాపము నా చిన్ని కూన మీదికి ఏ వ్యాఘ్రము వచ్చిపడెనో, ఏ ఆపద సంభవించెనో, లేకున్న మరలి రా నాలస్యమేల'' అనుకొనెడివాడు.

ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను. ఒక నాడు తనకు మరణము సన్నిహితమైనట్లు గుర్తించి ఆరాజు మేనిని నేలపై వ్రాల్చెను. మనస్సు పరమాత్మయందు నెలకొనక హరిణమునుగూర్చియే స్మరించుచుండెను. తన ప్రియ హరిణముపై చూడ్కి నిలిపి చూచుచుండగనే జీవ మతని దేహమునుండి వెలువడెను. ఇందుల ఫలితముగా నతడు మరుజన్మమున హరిణముగా పుట్టెను. ఐనను కర్మఫలము రిత్తవోదు. రాజుగాను ఋషిగాను ఆయన చేసిన సుకృత మెల్ల ఫలవంతమయ్యెను. తత్ప్రభావమున హరిణముగ పుట్టినను ఆయనను పూర్వజన్మస్మృతి యుండెను. నోరులేని మృగశరీరమున నున్నప్పటికిని గతజన్మ చరిత్రమంతయు స్మృతిలో నుండెను. సదా అది తక్కినజింకలతో కూడక మేతకై తపోవనములందును యజ్ఞభూము లందును ఉపనిషత్తు లుపదిష్టములగు తావు లందును సంచరించుచుండెడిది.

జింకజన్మము ముగిసెను. మఱుజన్మమున అత డొక సంపన్నబ్రాహ్మణుని కనిష్ఠపుత్రుడుగా జన్మించెను. ఈజన్మమందును అతనికి పూర్వజన్మజ్ఞాన ముండెను. జీవితసుఖదుఃఖాలలో తగుల్కొనగూడ దను నిశ్చయ మతనికి పసితనముననే కుదిరెను. అతడు ఎదిగి ఆరోగ్యవంతుడు బలవంతుడు నయ్యెను, కాని నోరు తెఱచి ఒక్కమాటైనను పలుకడు. ఐహిక విషయాలలో తగులము దాపరించునేమో అని వెఱచి యతడు సోమరిగాను మందబుద్ధిగాను కననగుచుండెను. అతని మనసు సదా బ్రహ్మము నందు నెలకొని యుండెను. ప్రారబ్ధకర్మానుభవము పూర్తియగుటకే అతడు జీవించి యుండెను. కాలక్రమమున అతని తండ్రి మరణించెను. ఇతరపుత్రులు ఆస్తిని పంచుకొనిరి. కనిష్ఠుడు మూగ యనియు వ్యర్థుడనియు నెంచి అతని భాగమును గూడ వారే హరించిరి. ప్రాణము నిలుపుకొనుటకు కావలసిన అన్నము నతనికిపెట్టుచుండిరి. అతనిపట్ల వారి యౌదార్య మంతే. వదినె లతనివిషయమున చాలక్రూరలై ప్రవర్తించుచుండిరి, కష్టములైన పనుల నన్నిటిని అతనిచే చేయించుచుండిరి. తాము కోరినంత అత డెన్నడేని చేయజాలక పోయినచో ఆనాడు వా రతనిని మఱింతగా కాల్చుకొని తినుచుండిరి. అత డేమో విసుగుకొనడు, భయపడడు, నోరు తెఱచి మాటాడడు. వా రాతనిని మితిమీఱి పీడించినప్పుడు, అత డిల్లు విడిచి పోయి వారి దురాగ్రహము చల్లబడువఱకు ఎటనేని చెట్టునీడలో కూర్చుండును, పిమ్మట మెల్లగ ఇంటికి మరలును.

ఒకనాడు వదినెలు అతనిపట్ల మామూలు కంటె ఎక్కువ క్రూరముగా ప్రవర్తించిరి. అంత నతడు ఇల్లు విడిచి పోయి ఒక చెట్టునీడలో విశ్రమించెను. అప్పుడు రహూగణమహారాజును పల్లకీలో కూర్చుండబెట్టుకొని బోయీలు ఆ మార్గమున పోవుచుండిరి. పల్లకీవాహకులలో నొకనికి ఆకస్మికముగ అస్వాస్థ్యము కలిగినది. అతనికి బదులు వేఱు మనుష్యు డెవరైన దొరకునా అని రాజసేవకులు వెదకుచుండిరి. చెట్టునీడలో కూర్చున్న భరతుడు వారి కంటబడెను. అతనిఆకారపుష్టిని గుర్తించి వారు "జబ్బుపడిన పల్లకీమోపరిస్థానమునకు నీవు వచ్చెదవా?" అని యడిగిరి.

భరతుడు జవాబు చెప్పలేదు. అంతట నా రాజసేవకులు అతనిని పట్టి లాగుకొనిపోయి పల్లకీబొంగు అతని భుజముపై నుంచిరి. ఒక్కమాటయైనను పలుకక భరతుడు తక్కిన మోపరులతోబాటు తానును నడచెను. పల్లకీ ఇంతకు మునుపువలె సమముగా నడువక ఎగుడు దిగుడుగ నడచుచుండెను. రాజు వెలుపలికి తొంగిచూచి క్రొత్తమోపరితో "ఓరీ మూర్ఖా, నీభుజములు నొప్పి ఎత్తుచున్నచో రవంతసేపు విశ్రమింపుమురా" అని యదలించెను. భరతుడంత పల్లకీబొంగును నేలదింపి ఈజన్మ కంతటికిని మొదటిసారిగ నోరు తెఱచి ఇట్లు ప్రసంగించెను.

"రాజా, ఎవరిని మూర్ఖా అని పిలిచితివి? పల్లకీని దింపు మని నీ వన్నది ఎవరితో? బడలినాడని నీవు చెప్పుచున్న దెవరిని? "నీవు" అని నీ వనుచున్న దెవరిని? "నీవు" అని నీ వన్నది ఈ దేహము నగుచో ఇదియు నీ దేహమును ఒక్కపదార్థమునుండి రూపొందినవే. దానికి చైతన్యము లేదు. దానికి బడలిక తెలియదు. నొప్పి తెలియదు. నామనస్సు నుద్దేశించి యుంటివేని అదియు నీ మనస్సు వంటిదే, విశ్వవ్యాప్తమైనది. మనసునకు సైతము అవ్వలనుండు ఆత్మను "నీవు" అని యుంటివేని నాయందున్న ఆ తత్త్వమును

నీయందున్నట్టిదియు విశ్వమంతటికిని ఏకైక ముగనుండునదియు ఒక్కటే. ఆత్మకు బడలిక ఉండు నని తలంచితివా, రాజా, నీవు? ఆత్మకు ఎపుడుగాని బడలికగాని వ్రణముగాని కలుగు నని తలంతువా? రాజా, భువిపై సంచరించు చిన్నక్రిములను పాదములక్రింద త్రొక్కుటకు నా కిష్టము లేదు, నా దేహమున కిష్టము లేదు. అవి నలుగుడు చెందకుండవలయునని నేను ప్రయ త్నించుచుండుటచేత పల్లకీ ఎగుడుదిగుడుగ నడచినది. అంతే గాని ఆత్మకు బడలిక ఎప్పు డును లేదు, దౌర్బల్యము ఎప్పుడును లేదు. పల్లకీ బొంగును అది మోయ లేదు. అది సర్వశక్తియు విశ్వవ్యాప్తమునైనది.''

రఘూగణమహారాజు పండితుడ నని, జ్ఞాని నని, తత్త్వవేత్త నని అభిమానము కలవాడు. అట్టి ఆయన ఇప్పుడు పల్లకీనుండి దిగి భరతుని పాదములపై వ్రాలి ''ఓ మహానుభావా, నన్ను క్షమింపుము. నాపల్లకీని మోయు మని నిన్ను కోరినప్పుడు నీ వొక ఋషి వని నే నెఱుంగను. నీతో నాకు లభించిన సమాగమము నా మహా భాగ్యమే. దయచేసి నాకు ఆత్మజ్ఞానము నుప దేశింపుమా'' అని ప్రార్థించెను.

భరతు డుపదేశింప నారంభించెను. ''రాజా, జ్ఞానము లన్నిట ఉన్నతతమమైనది ఆత్మ జ్ఞానము. క్షణభంగురమగు నీవిశ్వమున సౌఖ్యము వడయగలనని మానవుడు తలంచు చున్నంతకాలము అతనికి ఆత్మజ్ఞాన ముద యింపదు.

సత్త్వరజస్తమోగుణములతో ఆత్మ ఏకీభ వించుటచే మానవుడు తన సుకృతదుష్కృత ములచే బద్ధుడైయుండును. సుకృతముగాని దుష్కృతముగాని మనసున కంటునే గాని ఆత్మ కంటదు. మనసు ఆత్మతోక యనుబంధము వంటిది. పరమాత్మ మనసుతో సంసర్గమొందు టచే జీవాత్మగా కనవగుచున్నది. మనసున కంటు సుకృతదుష్కృతముల కనుగుణముగ ఉన్నతయోనులందును నిమ్నయోనులందును జన్మ మొందుచుండును. మానవునకు కలుగు సుఖదుఃఖములు అతని కర్మఫలితములే. కావున బంధనమునకుగాని బంధవిముక్తికి గాని కార ణము మనస్సే.

గుణములతో సంసర్గమందిన మనస్సు బంధనమును దుఃఖానుభవమును కలిగించును. గుణసంసర్గమునుండి విడుపొందిన మనస్సే విముక్తిని శాంతిని సమకూర్చును.

నిత్యద్రష్టయు, నిత్యసాక్షియు ఆత్మయే. ఏకర్మలుగాని తలంపులుగాని ఆత్మ కంటవు. ఇంద్రియాతీతమైనది ఆత్మ. అది స్వయంప్రకాశ మగు జ్యోతి. అదే దైవము. సర్వప్రాణుల కంతర్యామిగ నుండుటచే నారాయణుడనియు, సర్వప్రాణులకు ఆశ్రయమై యుండుటచే వాసు దేవు డనియు దైవమును పేర్కొనుచుందురు. తన మాయకు ఆయనయే పరిపాలకుడు. పరి పాలకుడుగ ఆయన తాను సృజించిన సర్వ ప్రాణుల హృదయములందు నెలకొనియుండును.

మానవులు మేలుకొని ఇంద్రియముల నణచి మాయపట్టునుండి తమ్ము విడిపించుకొని ఆత్మతత్త్వము నెఱుంగు వఱకు జనన మర ణావర్తమున సుడియుచుందురు. మానవుడు మన స్సును తన యదుపులోనికి తెచ్చుకొని మనసు కంటె ఆత్మ వేఱు అనెడి తత్త్వము నెఱుంగు వఱకు అతనికి ముక్తి లేదు. దుఃఖానుభవ మును, భ్రాంతిని, రోగములను, కామక్రోధ లోభములను కలిగించునది మనస్సే. ఈ యన్నింటికిని ఉనికిపట్టు మనస్సే. జ్ఞానఖడ్గము నకు గురువులకు గురువగు ప్రేమనాథుని భజన

ముచే పదునెక్కించి, ఆ ఖడ్గముచే మనస్సును వశపఱచుకొనవయును.

ఉన్న పరమార్థము సత్త్వము ఒక్కటే. అది జ్ఞానస్వరూపము. ఏకైకచైతన్యము. విశుద్ధము. పరిణామాసహము. ద్రష్టకు దృశ్యమునకు అతీతము. దానినే దేవు డని ప్రేమనాథు డని పేర్కొందురు.

కేవలము వేదాధ్యయనముచేతను తపస్సుచేతను సత్కర్మానుష్ఠానముచేతను ఈ జ్ఞానము నధిగమింప జాలము. మహాత్ములగోష్ఠియందు మెలగుటచేతనే ఈ జ్ఞానము కలుగును. మనసు విశుద్ధ మైనపుడు ప్రేమనాథుని ధ్యానము ఆనందకర మగును. జ్ఞానాగ్నిచే అజ్ఞానదురితమును భస్మ మొనర్చి మానవుడు బ్రహ్మముతోడి తన యైక్యమును సాక్షాత్కరించుకొని ప్రేమనాథుని ప్రాపించుచున్నాడు. అదే జీవిత లక్ష్యము.

నిజముగ ఈ ప్రపంచమును, మానవులు దారితప్పిన సాంద్రారణ్యముతో పోల్పవచ్చును. ఈ యరణ్యమున చోరులు, దోపిడిగాండ్రు ఉన్నారు. ఇంద్రియములును ఇంద్రియానుభూతులునే ఆ చోరులు దోపిడిగాండ్రు. వీరు నిజమైన మన దాయధనమును ఆంతరమైన దివ్యతను దోచుకొందురు. మన ఎదుట ఎండమావు లున్నవి. దానిని చూచినంతనే దప్పి తీర్చుకొంద మని మనము పరు లెత్తెదము. మనలో భోగతృష్ణ యున్నది ఆ తృష్ణను తీర్చుకొనుటకు బాహ్యప్రపంచమున పరువు లెత్తుదుము. ఆ ప్రపంచము ఎండమావులవలె భ్రాంతిజనకము. ఇహలోకమున అభిలషణీయ మేమియు లే దని ఒక్కొక్కప్పుడు మన జ్ఞప్తికి వచ్చుచుండును. కాని వెంటనే దానిని మఱచి పోవు చుందుము. ఈ గహనమున మనము చుట్టు తిరుగుచుందుము. దయాళువైన బాటసారి యొకడు మహాత్ము డొకడు వచ్చి చూపువఱకు ఈ యరణ్యమునుండి బయటపడు దారి మనము కనుగొనలేకుందుము. తమ్ము తాము అదుపులో నుంచుకొని తమ విముక్తిని సాధించుకొన్న వివేకులు విముక్తి మార్గమును మనకు చూపుదురు.

రాజా, రఘుగణా, అగాధమైన ఇహలోకారణ్యమున దారితప్పినవాడవే నీవును. సర్వసంగములను విడనాడుము. సకలప్రాణులందును దయ కలిగి యుండుము. ఉపాసనధ్యానసేవలచే పదును పెచ్చిన జ్ఞానఖడ్గముచే అజ్ఞానబంధములను ఛేదించుకొనుము.''

ఇట్లు భరతుడు తన ప్రసంగమును చాలింపగనే రాజు అతని ఎదుట సాగిలబడెను. అంత వా రిద్దఱును ఒకరినొకరు వీడ్కొనిరి. తాను సాక్షాత్కరించుకొన్న తత్త్వము నుపదేశించు పనిని భరతుడు సాగించుచుండెను. రాజు తన కుపదిష్టమైన తత్త్వమును సాక్షాత్కరించుకొనువాడై మరలి తనరాజ్యమునకు చేరుకొనెను.

# చిత్తశుద్ధి - చిత్తనిగ్రహం

## కీ. శే. కులపతులు ముట్నూరు కృష్ణారావు

### I

సోదరా, నీ యున్నతి అంతా, నీ అంతఃకరణను అనగా నీ లోపలి పనిముట్టును ఉపయోగించుకోవడంలో ఉన్నదని నీవు సరిగ గ్రహించి ఉంటే, నీ విన్ని కష్టాలపాలయ్యేడివాడవు కావు. నీ మనస్సును దారం తెగిన గాలిపటంవలె

వదలివేయడంవల్ల, ఒక దారీతెన్నూ లేకుండా, ఏ కంచెల్లోనో, ఏ అపథాల్లోనోపడి తికమకలు పడుతున్నావు.

తుదకు నీ శరీరం ఆరోగ్యంగా, బలంగా ఉండాలన్నా, ముందుగ నీ మనస్సునే బలపఱచుకోవాలె సుమా. ఎందుకంటె, నీ శరీరంలో కనబడే రుగ్మతలన్నీ శారీరకములే అని భ్రమపడుతున్నావు. కాదు. రోగాలన్నీ ముందుగా నీ మనస్సులో అంకురించి క్రమంగా నీ స్థూల శరీరాన్ని దెబ్బకొట్టుతున్నాయి. ఇందాకా ఎందుకు? నీ శరీరారోగ్యం చాల వఱకు నీ అభ్యాసాలను బట్టేగా ఉండేది? కొంచెము ఆలోచించుకో.

నీ కజీర్ణబాధ వచ్చిందంటే, ఎందుకని? మితాహారం అభ్యసించకపోవడంవల్ల. నీ జిహ్వామీదే నీ యధికారాన్ని వదులుకొన్నావు. జిహ్వాచాపల్యం మూలంగా, తినరాని తిండ్లన్నీ తింటున్నావు. త్రాగరాని పానీయాలన్నీ త్రాగుతున్నావు. నీ జిహ్వను కట్టుబాటులో ఉంచే నిగ్రహాన్ని అలవఱచుకొని ఉంటే, నీ శరీర మిట్లా రోగపంజర మయ్యేదా?

మన వైద్యులు రోగంవచ్చిందంటే, చేతి నాడి చూస్తారు. చంకలో గాజుపుల్ల పెట్టి ఉష్ణం కొలుస్తారు. గుండెలు పరీక్షచేస్తారు. ఊపిరితిత్తులను కొట్టి చూస్తారు. అంతేనేకాని, నీ మనస్తత్వాన్ని, నీ అభ్యాసాలను, నీ యభిరుచులను, నీ వ్యసనాలను పరిశోధించరు. నీ మనస్సుకు, నీ శరీరానికి సంబంధంలేదని వాళ్ళ అభిప్రాయము. రోగాలన్నీ ముందు నీ సూక్ష్మ శరీరంలో బుట్టి, క్రమంగా నీ స్థూలశరీరంలోకి ఉబుకుతాయని వాళ్ళకు తెలియదు.

జ్ఞానంగల వైద్యుడైతే ముందుగ నీ మనస్సును, నీ తత్త్వాన్ని పరీక్షచేసికాని, రోగ నిదానం చేయడు. పూర్వకాలంలో మన జ్ఞానులేమిచేసేవారు? వారి శరీరాన్ని శుద్ధిచేసి వజ్రకాయంగా చేసుకొనేవారు. శరీరం మనస్సుకు బాహ్యోపకరణం. నీ మనస్సెంత పదునుగా ఉంటేనేమి, నీ బాహ్యోపకరణం బండబాఱిఉంటే! అందుకని శరీరాన్ని ఆరోగ్యవంతంగా, సాత్వికంగా చేసుకొనేవారు. ఎట్లా?

మందులుతినా వారు జవసత్వాలను సంపాదించింది? కాదు. యోగాభ్యాసంవల్ల. యోగం రెండు విధాలు. మనస్సును పైకి, ఊర్ధ్వలోకాలకు తీసుకొనిపోయేది రాజయోగం. మనోబలంచేత శరీరాన్ని కాయకల్పంచేసేది హఠయోగం. హఠయోగం అంటే, ఏమిటో అని భయపడకు. కారణశరీరం ద్వారా, నీ స్థూలశరీరాన్ని స్వాధీనంచేసుకొని, దానిని శక్తివంతంగా చేసుకొనే విధానమే హఠయోగం. మనస్సుకు శరీరానికిగలఅన్యోన్య సంబంధం వారికి తెలిసినట్లుగ ఇంకొకరికి తెలియదు. నీ శరీరంయొక్క పునాది నీమనస్సులో ఉన్నదని గ్రహించావా, నీ శరీరాన్ని ప్రబలాయుధంగా చేసుకొనే రహస్యం అవగతమవుతుంది.

నీ శరీరంలోని ప్రధానభాగాలేమిటి? రక్తంతో గూడిన మాంసం, ఎముకలు, నరాలు. నీ నరాలు సరిగ్గా ఉన్నాయా, నీ శరీరమంతా బాగుంటుంది. నీ నరాలు నీ మనస్సుకు లోకువ. నీవేదిచేయాలన్నా, ముందు నీమనస్సులో ఒక సంకల్పం బయలుదేఱుతుంది. ఆ సంకల్పం నీ నరాలను కదిలిస్తుంది. నీ నరాలు నీ అవయవాలను ఇంద్రియాలను ఆడిస్తాయి. కాబట్టి నీ మనస్సుకు నీ శరీరానికి సంబంధం కలిపేది ఏది? నరం. అది ఎలెక్ట్రికు తీగవంటిది, మనస్సును "స్విచ్" చేశావా,

వెంటనే ఒక కరెంటు నరాలద్వారా శరీరాన్నంతా క్రమ్మివేస్తుంది. నీ నరాలు సరిగ్గా ఉండవా, నీ మనస్సును నీవెంత స్విచ్ చేస్తే ఏమి? నీ మనస్సులోని విద్యుత్తు వెలుగునుగాని, వేడిమినిగాని నీ నరాలు శరీరంలోకి తీసుకొని పోలేవు. అప్పుడు నీ శరీరం ప్రాణంలేని గుడ్డపేలికవలె వ్రేలాడుతూ ఉంటుంది. హఠయోగం చేసేదేమిటి? నీ మనస్సుకు నీ నరాలకుగల సంబంధాన్ని బలపరుస్తుంది, సున్నితపరుస్తుంది. వీణెమీది తీగెలను వైణికుడెట్లా శ్రుతిపెట్టి ఉంచుతాడో, యోగికూడా తన మనోబలంచేత తన నరాలను సున్నితంగా బిగువులో ఉంచి, తద్వారా శరీరాన్ని తేజస్వంతంగా చేసుకొంటాడు.

నీ మనస్సు ఎప్పుడైనా ఊరుకొని ఉంటుందా? నీటిలోనుండి బుడగలు బయలుదేరునట్లుగా, నీ మనస్సులోనుండి ఎన్నితలంపులు, ఎన్ని భావనలు, ఎన్ని వికారాలు, ఎన్ని ఆవేశాలు విచ్చలవిడిగ చెలరేగుతూఉంటాయి! ఇవన్నీ నిరంతరం నీ నరాలద్వారా, నీ శరీరంమీద దెబ్బలు కొట్టుతూనే ఉంటాయి. నీ మనస్సులో కలవరం ఉన్నదా, నీ ముఖంకూడా ఎఱ్ఱబాఱి, ముడతలుపడి, చెమర్చి, సుళ్లుపడుతూ వికారంగా ఉంటుంది. నీ మనస్సు నిర్మలంగా, శాంతంగా ఉంటుందా, నీ ముఖమండలంకూడా ఉదయభానునివలె ప్రకాశవంతంగా శోభాయమానంగా ఉంటుంది. నీ ముఖంచూస్తే తెలుస్తుంది నీ మనస్సెట్లా ఉన్నదీ. కాబట్టి నీ శరీరం ఆరోగ్యవంతంగా, తేజస్వంతంగా, సౌందర్యవంతంగాఉండాలంటే, ముందు నీ మనస్సును నిర్మలంగా, శాంతంగా, రసవంతంగా, జ్ఞానవంతంగా, మంగళమయంగా చేసుకో.

అంతేనేకాని, ముఖాన్ని ఎన్నిమార్లు సబ్బుపెట్టి రుద్దుకొన్నా, ఎన్నిపౌడర్లు కొట్టుకొన్నా లాభంలేదు. నీ మనస్సులో ప్రేమామృతం తొణుకులాడుతూ ఉంటుందా, నీ నేత్రాలలో కరుణాజ్యోతులు వెలుగుతూ ఉంటాయి. నీ పెదవులమీదనుండి సఖ్యరస ముట్టిపడుతూ ఉంటుంది. నీ చెక్కిళ్ళమీద గులాబీలు పూస్తాయి. నీ ఫాలతలంపై బ్రహ్మవర్చస్సు ప్రతిఫలిస్తూ ఉంటుంది.

కాబట్టి నీ శరీరసాధనకోసమైనా, నీ మనస్సును జక్కబఱచుకో. నీబుద్ధి పైపైన తిరుగుతూఉంటే లాభంలేదు. నీ మనస్సు అజాగ్రత్తగ ఉండడంవల్ల, నీ ప్రకృతిలో ఎన్నో దురభ్యాసాలు పాదుకుపోయి యున్నాయి. వానిని పెకలించివేయడం కష్టమవుతోంది. చీటికి మాటికి కోపం తెచ్చుకోడంవల్ల, కోపిష్ఠివైపోయినావు. మాట్లాడితే నీ ముఖం కందగడ్డ అయిపోతుంది. నీ నరాలెట్లా ఉబికి ఉన్నాయో చూచుకో—ఎందుకా ఏడుపుకొట్టుముఖం? ప్రతిదానికి దిగులుపడడం, నిరుత్సాహం చెందడం, దురదృష్టుడనని ఏడవడం-ఈ అభ్యాసంమూలంగా ముఖంలో దారిద్ర్యం ఓడుతూ ఉంటుంది. నీవు ఒకవేళ నవ్వినా నీముఖం ఏడుస్తున్నట్లుంటుంది. నీ స్నేహితులు నిన్నుచూచి అసహ్యించుకొంటూ ఉంటారు, తుమ్మల్లో ప్రొద్దువలె, నీముఖంమీద చీకట్లు క్రమ్మిఉంటే నీ సహవాసం ఎవరుకోరుతారు? నీముఖాన్నిట్లా వికారంగా చేసుకొని, ఇతర్లు నిన్నాదరించడం లేదని ఎందుకు వారిని నిందించడం?

నీ మనస్సులో భావరత్నాలు, సంతోషవీచికలు, ఉత్సాహపు నురుగులుఉంటే, నీ ముఖమూ, నీ మూర్తీ ఎంత శోభయమానంగా ఉంటుందో ఆలోచించుకో. నీలో ఒక అపూర్వ

మైన వశీకరణశక్తి సమ్మోహనాస్త్రం పుట్టుకొనివస్తుంది. నిన్ను జూచేటప్పటికల్లా, నీ మిత్రులకు ప్రాణం లేచివచ్చినట్లుంటుంది. నీనగు మోమునుండి సూర్యరశ్మి బయల్వెడలి, నీ పరిసరాలను ప్రకాశవంతంగా జేస్తుంది. నీమోము పూలతోటగ మాఱుతుంది. నీ హాసం, నీ మాట, నీ నడక, నీ చేష్టలు సర్వం ఆకర్షవంతంగా ఉంటాయి. మురళీధరునివలె నీవు చెలికాండ్రను నృత్యశీలురనుగ జేసి, నీ జీవితాన్ని ఒక క్రీడారంగంగా చేసుకోగల్గుతావు.

నీ మనస్సును పదిలపఱచుకోవాలంటే, పైపైన శుద్ధిచేసి లాభంలేదు. నీ బుద్ధిలోపల ఎన్నోపొరలున్నాయి. భూమిలోపల ఎన్ని పొరలు యుగయుగాంతరాలనుండి పేరుకొని వస్తున్నాయో, అట్లాగే నీలోగూడా ఎన్నో పొరలు గడ్డకట్టుకొని బిగుసుకుపోయిఉన్నాయి. అవి సునాయాసంగా పొమ్మంటే పోయేవికావు. వానిలో నీ అభ్యాసాలు, నీ వ్యసనాలు, నీ సంస్కారాలు గూళ్లుకట్టుకొని ఉన్నాయి. ఆ గూళ్ళను వదిలిస్తేనేకాని, నీ చిత్తం నీవు చెప్పినట్లుగ వినదు, నీ అభ్యాసాలే నిన్ను బానిసగ జేసివేయడంవల్ల, ఏ అభ్యాసాన్ని వదిలిపెట్టలేకుండా ఉన్నావు. నీ నోములు, వ్రతాలు, తీర్మానాలు, నీశపథాలు నీ పూర్వవాసనలను సంస్కరించలేకుండా ఉన్నాయి. బాహ్యశుద్ధి నిరర్థకం. నీ లోపలి పొరలలో ప్రవేశించి, అట్టడుగునుండి క్రొత్తకట్టడాలు కట్టడం ప్రారంభించు. చిత్తశుద్ధిఅంటే, ఏమనుకొంటున్నావు, సోదరా? నీమనస్సులోపల మురిగిఉన్న ప్రాత కూపాలను తోడివైచి శుభ్రపఱచడానికి స్థిర సంకల్పుడవుకమ్ము.

నీ స్వప్నాలను పరీక్షించుకో. నీలో ఎట్టి కోరికలు, తలంపులు అణగారిఉండి, సెలలు వేస్తున్నాయో పరిశోధించుకో. నీలోపల ఎన్నో చెదల పుట్టలున్నాయి—అవే నీబుద్ధిని, నీశరీరాన్ని గుల్లచేస్తున్నాయి. నీమనస్సులోని లోతులోకిదిగి పునాదులను భద్రపఱిస్తేనేకాని, నీమనస్సు—నీలోపలి పనిముట్టు నీ వశములో నుండి, నీకు సుందరభవనాన్ని నిర్మించిపెట్టి, అందు కనులపండువుగనుండే అలంకారాలను దిద్దిపెట్టలేదు. జయదేవుని మనోమందిరంవలె నీదికూడా ''వాగ్దేవతా చరిత చిత్రితచిత్తసద్మ'' అయితే, నీకంటె భాగ్యశాలి ఎవరు?

## II

సోదరా, ఎంత పిచ్చిపనిచేస్తున్నావు? నీ మనస్సు నీవు చెప్పినమాట వినటంలేదని, దానిని కృశింపజేస్తున్నావా? అది దుర్బలమైపోతే, అది నీకు లోకువగా ఉంటుందని కాదూ నీ ఉద్దేశం? నీ మనస్సును నీవట్లా నీరసింపజేస్తే, అది నిన్నుకూడా క్రుంగదీసి, నీరసింపజేస్తుందని నీవు గ్రహింపలేకున్నావు. నీ వెంత పిచ్చిధోరణిలో పడిపోయినావు?

సోదరా, నీపని ఎట్లా ఉన్నదో తెలుసూ? ఒక రౌతు తన గుఱ్ఱంపై స్వారీచేయలేక, అది తన్ను తన్ని క్రింద బడవేస్తుందని, దానికి మేత పెట్టడం మానివేశాడట. అది బక్కచిక్కితే, అది తన కెదురు తిరుగకుండా, తాను చెప్పినట్లు నడుస్తుందని వాని ఆశ. అది చివరకు ఏమి చేసిందీ? గడ్డంతలేక, నడ్డంత ఎండి, ఏమి చెసనే గుఱ్ఱం దేవలోకం అన్నట్లు ఎత్తుపడి పోయింది. ఇక ఆ గుఱ్ఱాన్ని తానే ఈడ్చుకొని పోవాలసి వచ్చింది. అట్లాఉంది నీపని కూడా.

మంచి బలంలోఉన్న గుఱ్ఱాన్ని స్వారీచేయడంలో ఉన్నది రౌతు తెలివితేటలన్నీ. దానిని చంపితే తాను రౌతు ఎట్లా అవుతాడు? నీవు కూడా నీ మనస్సును శక్తివంతంగా, పుష్టికరంగా, ఉత్సాహవంతంగాచేసి, దానిని నీ

స్వాధీనంలో ఉంచుకుంటే, నీ జీవితంకూడా సమృద్ధంగా, ఐశ్వర్యవంతంగా, శోభాయమానంగా ఉంటుంది. అంతేకాని మనస్సుకు నీళ్ళూ మేతా లేకుండాచేశావా, నీ పనికూడా ఉత్తదవుతుంది.

కాబట్టి నీ మనస్సును నీ స్వాధీనంలో ఉంచుకోమంటే, దానిని నీరసింపజేయమని కాదు. నీకు మనస్సనేదే లేకపోతే, వట్టి జడమైపోతావు. రాయిరప్పాకంటెకూడా కనాకష్టమైపోతావు. మనస్సు నీలో వెలుగుతూండడంవల్లనే, నీవు మనిషివై లోకానికంతకు సమ్రాట్టు కాగలుగుతున్నావు. నీవు పైకిరావాలంటే, నీ జీవితాన్ని ఫలప్రదంగా చేసుకోవాలంటే మనస్సును బాగా పోషించుకో. అది ఎంత విశాలమై, గంభీరమైతే, నీ సామ్రాజ్యంకూడా అంత విశాలమై దృఢమైన దవుతుంది. నీమనస్సును సంకుచిత పఱచుకొన్నావా, నీవెందుకూ కొఱగాని దరిద్రుడవైపోతావు.

నీ మనస్సు అంటే అదేదో నీకు శత్రువు అని భ్రమపడి, దానిని జూచి భయపడుతున్నావు. అది నీ శత్రువు కాదు. అది నిన్ను ఉద్ధరించడానికి, సృష్టికంతకు నిన్ను ప్రభువునిగ జేయడానికి, నీ జీవనాన్ని ఆనందమయంగా జేయడానికి నీకది వరంగా ప్రసాదింపబడినది. నీ మనస్సు ఒక మహాశక్తి అని నమ్ము. ఏ భౌతికశక్తి దానిముందు నిలవలేదు. విద్యుచ్ఛక్తికంటెగూడా, రాసాయనికశక్తులకంటెగూడా, ప్రాణశక్తికంటెగూడా అది ప్రబలమైనది, అమోఘమైనది. ఈ భూతలంలోని సమస్తశక్తులను అది లోబఱచుకోగలదు. వాయువేగమెందుకు మనోవేగం ముందు? ఇంద్రుని వజ్రాయుధం పర్వతాల రెక్కలను విఱగగొట్టితే, నీ మనస్సు నీకు రెక్కలనిచ్చి, పర్వతశిఖరాల నెక్కిస్తుంది - ఆకాశవీథుల నూరేగిస్తుంది. పాతాళగంగను చేదుతుంది. మరుభూములను సస్యవంతంగా చేస్తుంది. నిన్ను త్రిలోకవిజేతనుగ జేస్తుంది. అట్టి మహాశక్తి నీ మనస్సు.

మనస్సుయొక్క పైపొరలను జూచి, అది ఇంతేనా అని చులకనచేస్తున్నావు. నీవు పైన చూచేది వట్టి నురుగు. ఆ నురుగును తప్పించుకొని లోపలకు పోయినావా అంటే, అది పెద్ద అఖాతం. దానిలోతును కనుపెట్టగలవారెవరు? దానిలో ఎన్ని ప్రవాహాలో ఉన్నాయి. సముద్రాలనుకూడా ఘూర్ణిల్లజేసే జలపాతాలున్నాయి. అది అపారమైన శక్తి అని విశ్వసించి, నీవు శక్తివంతుడవుకమ్ము.

పాము చుట్టచుట్టుకొని పడుకున్నంతసేపూ, అది చైతన్యంలేని తాడువలె గనుపడుతుంది. ఆ సర్పాన్ని లేపావంటే, అదేమిచేస్తుంది? చుట్టవిప్పుకొని బుసలుకొట్టుతూ పైకిలేచి నిలబడుతుంది. పడగల నన్నిటిని విప్పుకొని ఆడడం మొదలుపెట్టుతుంది. ఎట్టి ఆట అది? నీ మనస్సుకూడా సర్పంవంటిదే. ప్రస్తుతం అది చుట్టచుట్టుకొని నిద్రపోతోంది. దానిని కదిపావంటే, అది మేల్కొంటుంది. గర్భితాలుగాఉన్న శక్తులన్నీ లేస్తాయి. ఎంత భయంకరం! ఎంత సుందరం!

నీ మనస్సు అనేబుట్టలోపల ఒక మహాశక్తి దాగిఉంది. అది చుట్టచుట్టుకొని పడుకొని ఉన్నది. కనుక దానిని ''కుండలినీ'' శక్తి అన్నారు. ఆ పైమూత తీసి దానిని లేపావా అంటే, నీలో ప్రవహించేశక్తి అపారం. నీ శరీరం, నీ యవయవాలు చైతన్యంతో తొణికిపోతూ ఉంటాయి. నీ ఇంద్రియాలు విచ్చుకొన్న పుష్పాలవలె విలసిల్లుతూ ఉంటాయి. నీ ఇచ్ఛాశక్తి, నీ జ్ఞానశక్తి, నీ క్రియాశక్తి

వేయిమడుంగులు పెరుగుతాయి. నీవు సర్వ శక్తిమంతుడవవుతావు. నీకిక బాహ్యోపకరణా లెందుకు? మానసిక సిద్ధులు లభించిన తర్వాత, నీకే విషయంలోను కొదువ అనేది ఉండదు.

ఓ సోదరా, నీవు దుర్బలుడవని అనుకొం టున్నావు, కాదు. ఎందుకీ కించిజ్జ్ఞత, కృప ణత్వం ఆవహించిందో తెలియకున్నది. నీవు శక్తిమంతుడవు – నీదేహం శక్తి, నీప్రాణం శక్తి, నీ మనస్సు శక్తి – సర్వం శక్తిమయం. నీ మనస్సును మనస్సుగా జూడక, అది ఒక మహాశక్తిగ భావించి, పూజించావా, నీ జీవిత మంతా శక్తివంతమైపోతుంది.

ఆశక్తి నీకెట్లా గోచరిస్తుంది అని అడుగు తావా? ప్రథమంలో అది ఉత్సాహశక్తిగ కనబడుతుంది. ఎట్టి ఉత్సాహమది! అపూర్వ మైన ఉత్సాహం–ఆ ఉత్సాహంముందు అన్ని విఘ్నాలు పలాయనమైపోతాయి. ఏ పనీ కష్ట మనిపించదు. ఏ శ్రమా, శ్రమగ తోచదు. దేనిని జూచి నీవు భయపడవు. నీలో ఉత్సాహ తరంగాలు లేచిపడుతూంటే, ఇంకా దిగులు, మాంద్యం, నీరసం ఎక్కడ? నీ కాలినడకకూడా చురుకై పరుగులెత్తుతుంది. నీ చూపులు కలుకుబాటి మర్మాలను ఛేదించివేస్తాయి. మనస్సు మేల్కొని, సహస్రాక్షులతో లోకాన్ని తిలకిస్తుంది. నీలో ఇంతవఱకు మంద గించిఉన్న నాడీచక్రాలన్నీ కదలబాటి, క్రొత్త క్రొత్తభూములు నీ కంటపడతాయి. నీలో ఇంతవఱకు ముఱిగిఉన్న ప్రాతకూపాలన్నీ పొంగి, నిర్మలములైపోతాయి. ఆలోచనలు ఎంత నిశితంగా సూక్ష్మంగా పరంపరలుగ సాగుతాయో చూడు. నీ స్మృతికూడా మేల్కొంటుంది. ప్రచండమారుతానికి వీధుల లోని చెత్తా చెదారమంతా ఎలా కొట్టుకొని పోతుందో, అల్లాగే నీలో ఉబికే ఉత్సాహానికి నీలో గూడుకట్టుకొనిపోయిన, ప్రాతబూజులు, వాసనలు, సంస్కారాలు జలజల రాలిపోతాయి. ఆఉత్సాహశక్తి నీకొక క్రొత్తజన్మ ఇచ్చిందా అనిపిస్తుంది. ఎట్టి ఉల్లాసం! ఎట్టి విలాసం! ఎట్టి సంబరం!

నీలో ఉత్సాహశక్తి ఎప్పుడుబయలుదేఱి, నీ జీవనాన్నంతను ఉత్సాహవంతంగా చేస్తుందో, అప్పుడు నీ చింతనాపటిమకూడా బలిష్ఠమవు తుంది. ఎట్టి గహనవిషయాలైనా నీ కవలీలగ సుబోధములైపోతాయి. నీ బుద్ధి ప్రతివిషయం లోను చొచ్చుకొనిపోయి, అపూర్వములైన రహస్యాలను కనిపట్టుతుంది – నీ జ్ఞాపకానికి మఱుగైన ప్రాత కథలన్నీ తిరిగి స్మృతిపథంలో బడుతాయి. ధారణాశక్తి హెచ్చుతుంది. అంతకుపూర్వం చీకిరిబాకిరిగనున్న భావాలన్నీ క్రమంగా బారులుతీర్చి, వీథులుదిద్ది, సోపానా లను నిర్మించి, జ్ఞానసౌధాలకు ద్వారాలెత్తు తాయి. ఉత్సాహంమూలంగా జ్ఞానశక్తి బలిష్ఠమగుతుంది.

అంతేనా? ఉత్సాహం నీలోని క్రియాశక్తిని గూడ వేయిమడుంగుల పెంచుతుంది. ఉత్సాహం కష్టాలని లెక్కించనీయదు. అధైర్యం చెందనీయదు. ఎంత ఎత్తులనైనా ఎగబ్రాకేటట్టుచేస్తుంది. ఆత్మవిశ్వాసాన్ని ఉత్సాహం ఉద్దీపనచేసినట్టుగ ఏదీ చేయలేదు. ఎందుకు? నీవు కార్యకుశలుడ వవుతావు. కర్మవీరుడుగ విజృంభిస్తావు. కర్మభూమి నీకు నాట్యరంగంగా మాఱిపోతుంది. ఉత్సాహం కార్యాన్ని పరిశ్రమగా ఉంచదు. కార్యాన్ని సృష్టి విలాసంగా మార్చివేస్తుంది. గర్భితశక్తుల నన్నిటిని వెలికిదీసి నిన్ను భాగ్యశాలినిగ, ఐశ్వర్యవంతునిగ, విజేతనుగ జేసివేస్తుంది.

"ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత"

# అద్వైతం

## శ్రీ మూర్తిగారు

(గతసంచిక తరువాయి)

చిన్న యేనును బద్దలు కొట్టడం దుస్సాధ్యము. రామకృష్ణపరమహంసకు తోతాపురి, నామదేవులకు బాలగోపాలస్వామీ ఆచార్యశంకరులకు విశ్వనాథదేవుడూ సాయ పడవలసివచ్చింది ఈ పరమవిధ్వంసకార్యానికి. వివేకానందులు ఈ యత్నములో కంగారుపడి 'నాశరీర మేదీ?' అని అరిచినారట. అద్వైతాన్ని విమర్శించేవారు పెద్ద నేను అనవలసిన 'అహం బ్రహ్మాస్మి'ని చిన్న నేనుకు పూర్తిగా అంట గట్టి 'ఇదుగో ఎంత పొగరో చూడండి' అంటారు గాని ఉన్నది ఆయనే అని చెపుతూ అహంఅన్న అభిప్రాయాన్ని పూర్తిగా నశింపు చేయగల ప్రపత్తిని, ధైర్యాన్ని గుర్తించరు. యోగారూఢుల అనుభవాలు వింటే, 'ఎక్కడికో అగాధంలోనికిపడిపోతున్నట్టుంటుంది'అంటారు. అహంకారపు ఈ మహాపతనానికి అందరు ద్వైతులూ విశిష్టాద్వైతులూ తట్టుకో లేరు. రామయోగిగారికి ఒక అమెరికను సాధకుడు 'ఏదో పెద్ద గోతిలో పడిపోతున్న అనుభవము వస్తున్నది' అని ఉత్తరము వ్రాశారట. ఈ వాక్యమును వినగానే ఆయన లేచి పోయి 'అదిగో అదే ప్రారంభము; పట్టుకుని ముందుకు పొమ్మను' అన్నారట. సాహసేలక్ష్మి! తన్ను తుడిచేసుకోవడము మాటలా? అది అయిన తర్వాతనే 'అహమస్మి.'

కనుకనే పరమభక్తులు సాక్షాత్కారముతో ఆగిపోతారు. రమణమహర్షుల వారికడకు ఒక కృష్ణభక్తుడువచ్చి 'నాకు అద్వైతముతో నిమిత్తము లేదు. కృష్ణా, మహాస్వామీ' అని ఆయన సన్నిధిలో నాకు ఉన్నసుఖమే నేను కోరేది. అంతకు మించిన దేమిటి?' అని అడిగితే మహర్షులవారు అన్నారట పక్కనున్న రామయోగిగారితో 'చూడండీ ఈయన పరమేశ్వరుని: ఆయన్ని చూస్తూంటే కలిగే ఆనందము ఎక్కువ అనుకుంటున్నారు!' అని. మొదటి ఆనందము కొనుక్కోడానికి 'దాసోహం' చాలదు. చిన్న 'నేను' ఇచ్చేసి కొనుక్కొని నేను పూర్తిగా కర్చు అయిపోయింది. ఇక మిగిలినదే అసలు నేను వేఱే నేను లేదు. ఉన్నదొకటే నేను' అని అనుభవించ గలగాలి. ఈ అనుభవము ఇంద్రియానుభవము కాదు. కనుక మాటలతో 'అహం బ్రహ్మాస్మి' అన్నప్పటి పొగరుబోతుతనము కాదు అది. ఆ అనుభవములో ఇంద్రియాలూ మనస్సూ అణగారి చచ్చిఉంటాయి. ఆ మట్టమే వేఱు. నేను నీవు అది ఇది అన్న స్ఫురణ లేని ఇంద్రియాతీత స్థితి అది. సర్వభూతాత్మ తానే అయిఉండే స్థితి అది. 'అహమస్మి' కాక ఇంకేమి మిగులుతుంది అప్పుడు? మన లౌకికానుభవాలు ఇంద్రియానుభవాలూ మనస్సు పొందే అనుభవాలూనే ఆయెను. ఇంద్రియాతీతమైన యోగానుభవమును ఇంద్రియాల మట్టానికి దించి 'ఏమిపొగరు?' అనుకోడము తప్పే కాదా? అయితే మఱి కర్తవ్యము? ఆ అనుభవాన్ని పొంది చూడడమే. అస్తు. భక్తకోటికి పరమేశ్వరుడా ధైర్యము నిచ్చును గాక.

ఏమిటీ, పరమేశ్వరు డిస్తాడా? అవును. భక్తుడు కావాలంటే ఇస్తాడు. కరుణాసముద్రుడు కాడా ప్రభువు? రామకృష్ణపరమహంస తోతాపురి శిష్యత్వము చేయడానికి

అమ్మవారి నడిగితేనే ఆమె అనుమతించినది. నామ దేవులకు బాలగోపాలస్వామీ, శంకరులకు విశ్వనాథస్వామీ వేచియున్నందు కే ఇచ్చారు ఆఖరుతలుపు తాళము చెవిని. అప్పుడు ఉప్పు బొమ్మగా పరిణమించిన జీవుడు సముద్రములో మునుగుతాడు. ఫలితము ఏమిటి? జీవుని లోక యాత్రాపరిపూర్తి. ఇదే నిజమైన ఆట! నిస్స్వార్థపు లీల!

# జయరాంబాటిలో శ్రీశ్రీ జగద్ధాత్రిపూజ-II

బ్రహ్మచారిణి అనసూయ

క్రీ. శ. 1891 సం॥ కార్తీకమాసము. జయరాంబాటిలో శ్రీ జగద్ధాత్రి పూజను చూచుటకై శ్రీ శారదానందస్వాములు పూజోపకరణములను తీసికొని కలకత్తానుండి బయలుదేఱిరి. సన్యాలు మహాశయులు, హరమోహను మిత్ర, కాళీకృష్ణ (విరజానందస్వాములు), గోలాప్‌మా, యోగీన్‌మాకూడ వారివెంట నుండిరి. కలకత్తానుండి వర్ధమానువఱకు రైలుబండిలోను, అటనుండి కామార్పుకూరువఱకు ఎడ్లబండిలోను ప్రయాణముచేసి, శ్రీరామకృష్ణుల జన్మస్థానమును దర్శించి, ప్రఫుల్లచిత్తములతో కాలినడకన జయరాంబాటిని చేరుకొనిరి. వారినందఱిని తమగ్రామములో చూచిన శ్రీ మాతృదేవిగారి ఆనందము వర్ణింపనలవి కాకుండెను. ఏవిధముగ అతిథిసత్కారములు చేయవలయునో, ఏమివంటలుచేసి వారికి తినిపింపవలయునో ఏమో! సంతోషములో మాతృదేవి కేమియు తోపలేదు. ఆమెయే స్వయముగ కూరగాయలు తఱిగి, వంటచేసి, వారికందఱికి వడ్డించి, వారు తృప్తిగ, కడుపునిండుగ భోజనము చేయువఱకు దగ్గఱనే ఉండువారు. శ్రీ శారదాదేవిస్నేహప్రేమలను చూఱగొని వారందఱి హృదయములు ఆనందముతో పరవశములాయెను.

కాళీకృష్ణుడు వయస్సులో అందఱికన్నను పిన్నవాడు కాబట్టి మాతృదేవియొద్ద నిస్సంకోచముగ మెలగువాడు. ఆమెకూడ ఆ అబ్బాయిని అల్లారుముద్దుగ ఆదరించెడివారు. చిన్న చిన్న పనులు ఆతనిచే చేయించువారు.

శారదాదేవితల్లి శ్యామసుందరిదేవి అతిథులను మనుమలవరుసన చూచుకొనుచు, రాత్రివేళ శ్రీరామకృష్ణులకు సంబంధించిన ఘటనలను కథలుగా ముచ్చటించెడిది. వారుకూడ ఆమెను ఆదరముతో 'అమ్మమ్మ' (దీదిమా) అనిపిలిచెడువారు. అమ్మమ్మ ఎప్పుడును ఏదో ఒక పనిలో—ఆవులకొట్టములోనో లేక కూలివారికి భోజనములుపెట్టించుటలోనో లేక ధాన్యము దంపించుటయందో నిమగ్నురాలై యుండెడిది. అయినను ఆమె ముఖము శాంతముతో చిఱునవ్వుతో కళకళలాడెడిది. అమ్మమ్మ సంవత్సరము పొడుగున 'మనుమల' కొఱకు కావలసిన వస్తువుల నన్నిటిని జాగ్రత పఱచెడిది. ఆమె భక్తులను, తన 'భక్త-భగవానుల సంసారము' అని అందఱితో చెప్పెడిది.

మూడుదినముల జగద్ధాత్రి పూజ తరువాత అతిథులతోసహా శ్రీ శారదానందస్వామి మలేరియా జ్వరముతో పడక వేసిరి. ఆహా! మాతృ

దేవి దుఃఖమునకంతు లేదు! నిత్యకృత్యముల నడుమ వీలుచేసికొని రోగులవద్ద నీరవముగ నిలుచుకొని ఉండువారు. పల్లెటూరున పాలు దుర్లభము. శ్రీ శారదాదేవి ఇంటింటికి తిరిగి రోగుల పథ్యముకొఱకు పాలు సంగ్రహించెడువారు. అతిథులు కొద్దిగ ఆరోగ్యము చేకూరిన వెంటనే మాతృదేవికి కష్టము కలుగుచున్నదని విచారించి కలకత్తాకు పోదలచిరి. కాని, తల్లి హృదయము కదా! ఆమె మాత్రము వారిని మరల మరల "ఇంకను కొన్ని రోజులుండి, బలము చేకూరిన తరువాత వెళ్లుదురు కాని" అని బ్రతిమాలసాగిరి. ఆమె హృదయమునకు అదేసాటి! కాని వారందఱు నిర్దిష్ట సమయమున ఎడ్ల బండిలో బయలుదేఱిరి. మాతృదేవి కిటికీతలుపువద్ద నిలువబడి తదేక దృష్టితో వారు కనుమేరదాటి పోవువఱకు చూచుచుండిరి. కంటినుండి ఏకధారగ అశ్రువులు ప్రవహించుచుండెను. చాల దూరము పోయినతరువాత కాళీకృష్ణుడు తిరిగి చూడగ శారదాదేవి ఒక్కతీరుననే నిలుచుండి వారి వైపే చూచుచుండిరి!

క్రీ. శ. 1904 సం॥ మాత్రము శారదాదేవికి కలకత్తానుండి జయరాంబాటికి జగద్ధాత్రి పూజ సమయమున పోవుటకు వీలుకాలేదు. పూజసామగ్రి సహోదరుడగు వరదాప్రసాదు చేత గ్రామమునకు పంపి, పూజ జరిగిన తరువాత అన్ని వివరములను గుచ్చి గుచ్చి అడిగి తెలిసికొనిరి. అటుపిమ్మట భక్తబృందముతో జగన్నాథక్షేత్రమునకు తీర్థయాత్ర చేసిరి.

మఱుసటి సంవత్సరము ద్విగుణోత్సాహముతో జగద్ధాత్రి పూజ కేర్పాట్లుగావింపబడెను, క్రిందటి సంవత్సరము శ్రీమాతృదేవి లేని కొఱతను తీర్చుటకా యేమి అనితోచెను! శారదానందులు వలయుసామగ్రినంతయు కలకత్తానుండి పంపిరి. శారదాదేవి స్వయముగా పూజాకలాపములను పర్యవేక్షించుచుండిరి. ఆ మాఱు శ్రీరామకృష్ణుల సహాధ్యాయి గణేశ ఘోషాలు మహాశయుడు మాతృదేవిని సందర్శించుటకు జయరాంబాటికి వచ్చిరి. ఆయనను చూచిన తత్క్షణమే పాదవందనము చేయుటకు శారదాదేవి ముందుకుపోయిరి. వెంటనే ఆయన వారించుచు "మీరు మా జననిస్వరూపులు. తల్లి, సంతానమునకు నమస్కరించిన అమంగళమగును," అని పలికెను. ఈ ఘటనవల్ల మాతృదేవి నమ్రతయు, ఆ దేశవాసులు ఆమెపట్ల చూపు శ్రద్ధాభక్తులు విశదమగుచున్నవి.

క్రీ. శ. 1911 సంవత్సరపు పూజసమయమున కోయల్పాడా గ్రామపు భక్తులు మంచి కూరగాయలను తీసికొని జయరాంబాటికి పోయిరి. తెచ్చిన వస్తువులు ఇతరులదృష్టిలో సామాన్యమే కావచ్చు. కాని, కరుణామయియగు శారదాదేవి ఎంతో ఆనందముతో "తాజా కూరగాయలు ఇక్కడ ప్రతిరోజా దొరకవు. ఆహా! శ్రీరామకృష్ణులు మీద్వారా ఇవన్నియు పంపినారు కదా!" అని పలికిరి. పూజ తరువాత కలకత్తాకు రాను సంకల్పించిరి. ప్రతిసారి కోయల్పాడా ఆశ్రమము త్రోవలోనే కాబట్టి అక్కడ ఆగి ప్రయాణపు బడలిక తీర్చుకొనుట మాతృదేవికి అలవాటు. ఈ మారుకూడ కావలసిన ఏర్పాటులను చేయుటకై ఆశ్రమాధ్యక్షులగు కేశవానందస్వాములు అన్ని వివరములు తెలిసికొనుటకుగాను ఒక బ్రహ్మచారిని జయరాంబాటికి పంపిరి. బ్రహ్మచారి వచ్చినపుడు శారదాదేవి తమలపాకు చిలకలను చుట్టుచుండిరి. అంతయువిన్న తరువాత "చూడు బాబూ, మీరు శ్రీరామకృష్ణుల పూజకొఱకు, నా విశ్రామముకొఱకు కొంత స్థానమును ఏర్పఱచియున్నారు. ఈమారు

అక్కడ శ్రీ ఠాకూరును ప్రతిష్ఠ చేయదలచు చున్నాను. కావలసిన ఏర్పాట్లుచేసి ఉంచండి. పూజ, ఆనైవేద్యము, హారతి మొదలగు నిత్యానుష్ఠానములు సక్రమముగ నడపవలెను. ఊరకే 'స్వదేశము' అని ఆందోళనచేసి ఏమి లాభము? మన ఆదర్శము ఠాకూరు. వారే మన సర్వస్వము. ప్రతికార్యములోను వారిని శరణుజొచ్చినచో పెద్దత్రోవ పట్టము.'' అని ప్రబోధించిరి.

అసలు విషయము – ఆరోజులలో కోయల్పాడా ఆశ్రమములో స్వదేశపు చర్చ, ఆలోచన మహాప్రబలముగానే జరిగెడిది. పూజ,జప ధ్యానములకన్న రాట్నమువడకుట, దేశవస్తువులు వాడుట మున్నగువానిపై ఎక్కువ ధ్యాస. వీనిని గమనించి పోలీసువారు ఆశ్రమమును, అచటికి వచ్చిపోవువారినందఱిని తనిఖీ చేసెడివారు. అంతర్యామిని, మాతృదేవి సంతానము పెడద్రోవ పట్టుచున్నదని గ్రహించి వెంటనే చాల సున్నితముగ సరిదిద్దుచుండును.

మాతృదేవి గ్రామవాసుల రీతినీతులను మానెడువారు. కాని భక్తబృందముతోడి ఆమె వ్యవహారమే వేఱు. వారితో సమాజములోని సంకీర్ణతను, కృత్రిమతను పాటించెడువారు కారు. ఒకమారు జగద్ధాత్రిపూజసమయములో వంటకు, నైవేద్యమునకు వలయు వస్తువులను అందజేసి సహాయపడువ్యక్తి హఠాత్తుగ జబ్బుపడెను. అప్పుడు గత్యంతరములేక కోయల్పాడ గ్రామ బాలకునొకని ఆపనికి నియమించిరి. ఆతడు బ్రాహ్మణేతరుడు కాబట్టి శ్రీ శారదాదేవి ''బాబూ కొంచెము దూరదూరముగ, ఉండి పనిచేయి.'' అని హెచ్చరించిరి.

ఇంకొకమారు జరిగిన ఘటనవలన, గ్రామవాసుల సంకీర్ణత ఎంత ప్రబలముగ ఉండెనో, మాతృదేవి ఎంతటి సహనశీలయో, నమ్రమూర్తియో తెలియనగును. అదికూడ ఒక జగద్ధాత్రి పూజ సమయముననే జరిగినది. భోజనములపుడు రెండవమామ (శారదాదేవి రెండవ తమ్ముడు) వడ్డనలను చేయునపుడు ఒకసాధువు ఆయన నొసట హోమపు తిలకము దిద్దెను. ఇంకేమి! ఆ స్పర్శచేత అనాచారము కలిగినదనియు, జాతినాశనము కలుగుననియు వాదించుచు భోజనముచేయుచున్న ఆ గ్రామ బ్రాహ్మణ జమీందారుమున్నగువారు లేచి గొడవచేయసాగిరి, శ్రీ శారదాదేవి చేతులు జోడించి ఎంతప్రార్థించినను భోజనము చేయలేదు. పైపెట్టు రూ. 25/– జరిమానా వసూలు చేసిరి! ఈఘటన మాతృదేవి శిష్యుడగు లలిత మోహన చట్టోపాధ్యాయ జయరాంబాటికి వచ్చినపుడు విని అగ్నిశర్మయై జమీందారును గట్టిగ బెదరించి ఆ రూప్యములను తిరిగి మాతృదేవికి ఇప్పించెను.

ఒకమారు రాంచీనుండి ఒక అబ్బాయి దీక్షకొఱకు జగద్ధాత్రిపూజ సమయములో జయరాంబాటికి వచ్చెను. కాని ఆ భక్తజన సమూహములో దీక్షవిషయమై మాతృదేవితో ప్రస్తావించుటకే వీలుకాలేదు, ఇక చేయునదిలేక పూజాంతమున తిరిగి వెళ్ళిపోవు సమయమున నలుగురితోపాటు ఆ అబ్బాయికూడ శ్రీశారదాదేవి పాదపద్మములకు నమస్కరించుటకై వేచియుండెను. అందఱి ప్రణామములయిన తరువాత చిట్టచివరకు ఆతడు లోపలకిపోయి మాతృదేవికి నమస్కారము చేయునపుడు హృదయములోని దుఃఖము ఇక సహింపలేక కన్నీరు మున్నీరుగా ఏడువసాగెను. ఆ కంటినీరు ఆమె పాదములపై ప్రవహింపసాగెను. వెంటనే మాతృదేవి ఆ బాలకుని లేవనెత్తి ''ఎందుకు నాయనా అంత దుఃఖము? నీకేమి కావాలి? మంత్రోపదేశం చేయించుకుంటావా?'' అని అడిగి, తలుపులుమూసి అప్పటికప్పుడే ఆతనికి దీక్షను ఇచ్చిరి.

## 35

రామకృష్ణమిషను సేవాశ్రమము
కంఖాలు, సహారన్పూరు
ఉత్తరప్రదేశ్

ప్రియ—— 15 జూలై 1912

నీజాబు చేరినది. సంగతులు తెలిసినవి ఇప్పుడు చేయుచున్నట్లే ధ్యానజపములను సాగించుచుండుము. దానివలన ఎట్టి చెడుగును లేదు. (శ్రీరామకృష్ణుని) ప్రతిమను ఎదుట నుంచుకొనుము. కన్నులు మూసికొని ఆ రూపమే నీ హృదయమున నున్నట్లు భావించుచు భక్తిప్రేమలతో ఆస్థతో ప్రార్థింపుము. ఈ క్రిందిగుణములు కలవానినిగ ఆయనను గూర్చి ధ్యానింపుము. సచ్చిదానందమూర్తి యనియు, పరముడనియు, పూర్వయుగములలో వలె ఈ యుగమునను మానవతతికి మోక్షమార్గమును శుద్ధపఱచుటకై మానవరూపము దాల్చినాడనియు భావింపుము. ఈనాడు ఆ సర్వేశ్వరుడే శ్రీరామకృష్ణునిరూపమున నవతరించి అసంఖ్యాకులలో భక్తివిశ్వాసముల ప్రబోధించెను. ఈ ప్రబోధకార్యమును ఇప్పటికిని ఆయన చేయుచున్నాడు. ఇకముందును చేయగలడు. ఆయన మనతండ్రి,మనతల్లి,మన మిత్రము, మనసర్వస్వము. ఈరీతిగా ఆయన పావనపాదయుగళిని శరణుజొరుము. ఈ యాశయములను నీవు భావనచేసినకొలదియు మెట్టుమెట్టుగా ఆయనయందలి నీప్రేమవిశ్వాసములు ఇంతంతనరానంతగా అభివృద్ధి నొందును. ఇది ముమ్మాటికిని నిజమని ఎఱుంగుము. జపకాలమునగూడ నీ వాయన మూర్తిని ధ్యానింపవలయును.నీధ్యానలక్ష్యము నాభియందున్నట్లు డెందమందున్నట్లు కనుబొమలనడుమనున్నట్లు మూర్ధముపై సహస్రదళపద్మమున నున్నట్లు భావింపుము. ఏకాగ్రమును విశుద్ధమును ప్రయోజనాంతరనిరపేక్షమునగు భక్తియొక్కటే అభిలషణీయము. ఆ యభిలాష యితరాభిలాషల నన్నిటిని తనయం దిముడ్చుకొనును. అందుకు సందేహము లేదు. తన్ను శరణొందినవానిని పెడదారిని బట్టనీయక శ్రీరామకృష్ణుడు తప్పక కాపాడును. ఇందులకు స్పష్టమైన నిదర్శనము నీ జీవితమే. శ్రీరామకృష్ణుని శిష్యవరేణ్యుడగు శారదానందస్వామి (శరత్తుమహారాజు) పెడదారినుండి సరిదారికి నిన్ను మరల్చిన దందులకే. భగవంతునందు ఆత్మరక్షాభరమును సమర్పించిన ఋజుభక్తునకు ఏ భయమును లేదు. భగవంతుడు సకలాపదలనుండియు అతనిని కాపాడి మరల సరిదారికి తెచ్చి విడుచును. నీ యోగక్షేమభారమును భగవంతునకు సమర్పించి దృఢచిత్తముతో అచటనే యుండుము. క్రమముగా భగవంతుడే అన్ని చిక్కులను తొలగించును. భక్తులసహవాసము నీకు లభించును. తక్కినవానిని గూర్చిన యేర్పాట్లును చేయబడును. నీ యిచ్చవచ్చిన రీతి భగవత్సేవచేయుచు నుండవచ్చును. తొందరపడకుము.

శ్రీమద్బ్రహ్మానందస్వామికి నీయందు అప్రీతి లేనేలేదు. ఆయన మహాత్ముడు, అనుగ్రహమయుడు. కరుణాసాగరుడు. నీకు మా ప్రేమయు శుభాకాంక్షలును.

నీశ్రేయోభిలాషి
శివానంద

# సత్ప్రవర్తనకు మార్గాలు

మూలము :
శ్రీ శ్రీ శ్రీ కామకోటి పీఠాధిపతులు :

అనువాదము :
యల్లంరాజు చెంచుసుబ్బారావు

ఏ దేశపు సంస్కృతి అయినా, ఆ దేశంలో జన్మించిన మహాకవుల రచనల్లో ప్రతిఫలిస్తూ ఉంటుంది. శాశ్వతములైన వారి కావ్యాలు విశాల హృదయాల్లోనుండి వెలువడి, విశిష్ట సంస్కృతితో తొణికిసలాడుతుంటాయి. ఈ కోవకు చెందిన కవులు స్వార్థరహితులు; జాతి, మత, కులతత్త్వాలకు అతీతులు. సత్యాన్వేషణే వారి ధ్యేయం. సంస్కృతిరంగంలో వారి గ్రంథాలే ప్రామాణికాలుగా ప్రసిద్ధికెక్కాయి. పాశ్చాత్య దేశాల్లో హోమరు, షేక్స్పియరు ఈ తరగతికి చెందిన మహాకవులు. మన దేశంలో కాళిదాసు, బాణుడు ఈ స్థాయికి చెందిన కవిపుంగవులు. కేవలం సంస్కృతిరంగంలోనే గాక, ధార్మిక మీమాంసల్లోకూడా వారి రచనలు ప్రామాణికాలుగా ఖ్యాతి గడించాయి.

నిత్యజీవితంలో ఆచరించవలసిన విధులను గూర్చి మనము పేర్చుకొనవలసి ఉంది. ధర్మ మనగా నేమిటి? ఏ గ్రంథాల్లో నిర్వచింపబడింది? అనే ప్రశ్నలు తఱచు ఉత్పన్నమవుతుంటాయి, సాధారణంగా, శాసనసభలు తయారుచేసిన చట్టాలు ప్రజారంగంలో మన నడవడినిగూర్చి కట్టుదిట్టాలు చేస్తాయి. ప్రజా ప్రతినిధులే ఈ చట్టాలను నిర్మిస్తూ ఉంటారు. ప్రతినిధులను ఎన్నుకొనే ఓటర్లు రకరకాలుగా ఉంటారు. ఆధ్యాత్మిక, సాంస్కృతిక రంగాల్లో వారిలోని భేదాలే తఱచు వారు ఎన్నుకొనే అభ్యర్థులమధ్య కనబడుతూ ఉంటాయి. అందువలన ప్రజలు ఎన్నుకొనే సభ్యులంతా ఉత్తమ పాలకులని, శాసనకారులని చెప్ప వీలు లేదు. ఈ నశ్వర ప్రపంచంలో అలాంటి వ్యవస్థ తప్పనిసరి అయింది. కొన్ని శాసనాలు నైతికదృష్టిలో అవాంఛనీయాలు కావచ్చు. న్యాయమూర్తులు సహితం తఱచు తాము నైతికంగా కొన్ని చట్టాలను సమర్థించలేక పోయినప్పటికి, చట్ట ప్రకారం తు. చ. తప్పకుండా తీర్పులు చేస్తున్నామని పేర్కొనుట మనం వింటూనే ఉన్నాము.

ధర్మంలో – మానవుని వైయక్తిక, నైతిక ప్రవర్తనయే యిమిడిఉంది. వేదాల్లో నిర్ణయించబడిన విధులనే మనం ఆచరించవలయునని మన మతము వక్కాణిస్తున్నది. అన్ని ధర్మాలకు వేదమే మూలమని నిర్ణయింపబడింది. (వేదోఽఖిల ధర్మమూలమ్)

ఇప్పుడు ప్రచారంలో ఉన్న వేదాలవల్ల మనకు కలిగిన సందేహాలు నివృత్తి కాకపోయినచో, స్మృతులు మనకు చక్కని మార్గాన్ని సూచించి సహాయకారులవుతాయి. స్మృతులను రచించిన మను, యాజ్ఞవల్క్య, పరాశరులను కేవలం శాసననిర్మాతలుగా గ్రహించడం గొప్ప అవివేకం. వేదార్థాలను సంగ్రహరూపంలో పొందుపఱచిన వ్యాఖ్యలే స్మృతులు. వేదాల్లో (శ్రుతుల్లో) లేని క్రొత్తవిషయాలుగాని, మార్గాలుగాని స్మృతుల్లో కనిపించవు. పై సిద్ధాంతానికి కాళిదాసే ప్రమాణం. మేపుటకు నడిపించుకొని వెళ్లుతున్న నందినిని(ఆవును) దిలీపమహారాజును సుదక్షిణ యను అనుసరించిన విధాన్ని వర్ణిస్తూ, కాళిదాసు ఇలా పేర్కొన్నాడు – స్మృతులు శ్రుతి ననుసరించినరీతిగా సుదక్షిణ నందిని అడుగుజాడల ననుసరిస్తూ వెళ్లింది. (శ్రుతేరివార్థమ్ స్మృతిరన్వగచ్ఛత్) వేదాలనుండి స్మృతులకు ప్రమాణం లభించినదని కాళిదాసు ట తెల్లంగా నిరూపించాడు.

శ్రుతులు, స్మృతులు మనకు సాహాయ్యకారులు కాలేకపోయినచో, స్మృతులను తెలుసుకొని సంచరిస్తున్న పెద్దలమార్గాన్ని

మనం అవలంబించవలసి ఉంటుంది - శీలాశ్చ తద్విదామ్. ఈ మార్గంకూడా మనకు లభ్యం కాకపోతే, అవలను, స్వార్థాన్ని జయించి, నిర్మల మనస్కులైన సజ్జనుల మార్గాన్ని అను సరిస్తూ మనము ప్రవర్తనను మార్చుకొనవలసి ఉంటుంది-ఆచారాశ్చసాధూనామ్. ఇలాంటి వ్యక్తులుకూడా మనకు గోచరించకపోతే, మన అంతఃకరణప్రబోధాలనే మనం పాటించవలసి ఉంటుంది-

శకుంతలను చూడగనే తన హృదయంలో కలిగిన ప్రేమను దుష్యంతుడు పైరీతిగా సమ ర్థించుకొన్నాడు. పూర్వం తాను ఎలాంటి దుష్టా లోచనలు కలిగియుండనందున, అంతఃకరణ తన్ను పెడత్రోవన పెట్టదనియు, తాను సరి యైన కన్యనే ప్రేమించితిననియు ఆయన భావిం చాడు. పైమార్గాన్నే కాళిదాసు ఈ క్రింది శ్లోకంలో చక్కగా వివరించాడు.

శ్లో॥ సతాంహి సందేహపదేషువస్తుషు
ప్రమాణమంతః కరణప్రవృత్తయః

"రహస్యత్రయసారము" అనే గ్రంథంలో ప్రముఖ విశిష్టాద్వైతాచార్యులైన శ్రీవేదాంత దేశికులుకూడా కాళిదాసుపై ప్రమాణాన్ని తాము ప్రతిపాదించిన విషయాన్ని నిరూపించు టకు ఉదహరించారు. ధర్మాన్నిగూర్చి ప్రస్తా విస్తూ తమ గ్రంథంలో ఒకచోట ప్రముఖ మీమాంసకులును, శ్రీ శంకరాచార్యులవారి సమకాలికులును అయిన కుమారిల భట్టు కాళి దాసు ప్రమాణాన్ని ఆదర్శంగా పేర్కొ న్నారు.

కాని, ఈయుగంలో. ప్రస్తుత సాంఘిక వాతావరణంలో అంతఃకరణకే ప్రాధాన్యాన్ని యిచ్చి, తక్కినమార్గాలను వదలివేయడమో, లేక వాటికి తగిన ప్రాముఖ్యాన్ని ఇవ్వకపోవ డమో ఆచారంగా పరిణమించింది. పైన ప్రస్తా వించిన మార్గాలన్నీ అర్థరహితములనీ, జ్ఞాన హీనములైనపథములనితలచడంకూడామనము గమనిస్తూనేఉన్నాం. కాని శాస్త్రాలననుసరించి, పైన చెప్పబడిన మార్గాలన్నీ మానవుల సత్ప్ర వర్తనకు దోహదకారులుగాక విఫలమైనప్పుడే, మానసప్రబోధం చివరిమార్గంగా ప్రస్తావించ బడింది. ధర్మానికిగల ప్రమాణాల్లో ఆధునికుల దృష్టి, ప్రాచీనులమతంకంటే చాలా భిన్నంగా ఉంది. కాని ప్రాచీనుల దృక్పథము అనేక యుగాలనుండి ప్రచారంలోఉంటూ, కాలాన్ని సహితం తట్టుకోగలిగి, సత్ప్రవర్తనకు సరియైన మార్గమని, ప్రామాణికమని నిరూపించుకొన గలిగింది. ఈభావనే కాళిదాసాది మహాకవుల రచనల్లో వివరించబడింది. సత్య వాక్కును అందించడం, మిథ్యనుండి సత్యాన్ని వేఱుపఱచి మానవుల కందించడమే మహాకవుల ధ్యేయం. దాన్నే వారు విశిష్టలక్షణంగా భావించారు.

ఈసందర్భంలో, ముగ్గురు ప్రముఖవ్యక్తులు, జగత్తులోని మూడు భిన్నప్రదేశాల్లో, విభిన్న కాలాల్లో, వ్యక్తపఱచిన ఏకైకభావన స్ఫుర ణకు వస్తున్నది. టెన్నిసన్ మహాకవి ఇలా అన్నాడు - ప్రాచీనసృష్టి, నూతనానికి తావు ఇస్తూ మాఱుతూఉంటుంది. (The old order changeth yielding place to new) కాళిదాసు కూడ తన రచనల్లో ఒక పాత్రద్వారా ఇలా వ్యక్తపఱచాడు - ప్రాచీనమైన వస్తువులన్నీ మంచివనీ, నూతనంగా వ్రాయబడినంతమాత్రం చేత కావ్యం చెడ్డదని చెప్పుటకు వీలులేదు.

—పురాణమిత్యేవనసాధుసర్వం
నచాపికావ్యం నవమిత్యవద్యమ్

ఒక ప్రాచీన తమిళ వైయాకరణుడు ఇలా పేర్కొన్నాడు-ప్రాచీన మార్గాలనుండి బయట పడు, నూతనపథంలో సంచరించు.'

పైవాటిని పరిశీలిస్తే, ఎప్పుడో నిర్ణయింప బడ్డవస్తువు అన్నికాలాల్లో సరియైనదిగా ఉండ డానికి వీలుపడదని తేలిపోయింది. పై సిద్ధాం

తాన్ని దృష్టిలో ఉంచుకొని ఆధునికులు ఇలా వాదిస్తుంటారు - మనశాస్త్రాల్లో కొన్ని మంచి విషయాలున్నప్పటికీ, కాలానుగుణంగా కొన్ని కలుపు మొక్కలుకూడా వాటి ననుసరించి పెరిగిపోయాయి. ఈ కలుపు మొక్కలను ఎప్పటి కప్పుడు పెరికివేస్తూఉండాలి. కాని ఇలా కలుపుతీయడమనే పథం చాలా క్లిష్టంగా గోచరిస్తుంది. ఏదిపంటో, ఏదికలుపో - యే యిద్దఱు వ్యక్తులమధ్యా ఏకాభిప్రాయం కుదరడంలేదు. ఒకనిదృష్టిలో కలుపుమొక్కగా కనిపించినది మఱియొకనిదృష్టిలో పైరుమొక్కగా కనిపించడం జరుగుతున్నది, అందువల్ల కలుపు తీయడమనేపేరుతో అన్ని మొక్కలను పీకివేయడం తటస్థిస్తే, మనం నడుచుకొనవలసిన మార్గమేమిటో తేలకుండా శాస్త్రాలన్నీ మఱుగుపడి నశించిపోగలవు.

మంచిదిగా నిర్ణయించుటకు ప్రాచీనమైన విషయాన్నిమాత్రమే దృష్టిలో ఉంచుకొనగూడదనేభావమే కాళిదాసు-పురాణమిత్యేవన సాధుసర్వం అన్న శ్లోక పాదంలో ప్రతిపాదించాడు. మంచిని ఎన్నుకోవడంలో ప్రాచీనత ఒకటే సహాయకారి కాగూడదు. శాస్త్రాలు నిర్ణయించిన విధులన్నీ ప్రాచీనాలే. అవి ప్రాచీనాలైన కారణంగానే విధులుగా గుర్తింపబడలేదు. అవి శాశ్వతమైనవికూడా. పురాణమనేశబ్దంలోనే ఆ అర్థంకూడా ఇమిడింది. పురా అపినవమ్ (పురాణం) పురాతనమైనప్పటికి ఎప్పుడూ నూతనంగా కనిపించేదనిభావం. శాస్త్రధర్మాలన్నీ సనాతనధర్మాలని పేర్కొనబడతాయి. అవే ప్రాతిపదికవిలువలను ప్రసాదిస్తూ, సత్ప్రవర్తనకు మూలకందాలుగా నిలిచిపోయాయి. క్రొత్త అవసరాలనుబట్టి ఏర్పడిన క్రొత్తవిధులుకూడా సనాతనధర్మంలోని సాధారణ నియమాలను అతిక్రమించగూడదు. యుగధర్మాలు అవసరాలనుబట్టి మార్పుచెందవచ్చు. కాని సనాతనధర్మాన్ని అతిక్రమించలేవు.

కాళిదాసు శ్లోకంలోని అన్ని పాదాలు కలిపి అర్థం చెప్పుకొనవలసిఉంటుంది. శ్లోకం పూర్తిపాఠం.

శ్లో॥ పురాణమిత్యేవ న సాధుసర్వం
న చాపికావ్యం నవమిత్యవద్యమ్ ।
సః పరీక్ష్యాన్యతరత్ భజన్తే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః॥

ఒక కావ్యాన్నిగూర్చి ప్రసావిస్తూ కాళిదాసు పై శ్లోకాన్ని రచించాడు. ఆయన ఇలా పేర్కొన్నాడు-కావ్యం ప్రాచీనమైన కారణం చేత మంచిదని, నూతనమయిన దైనందున చెడ్డదని నిర్ణయించుట సమంజసంకాదు. సజ్జనులు జాగ్రత్తగా పరిశీలించిన తర్వాతనే దాని బాగోగులు నిర్ణయిస్తారు. అవివేకులు ఇతరుల యభిప్రాయాలకే ప్రాధాన్యమిచ్చి వారి పథమునే అనుసరిస్తారు. మనకు సంబంధించినంతవఱకు కావలసినభాగం-సన్తఃపరీక్ష్యాన్యతరత్ భజన్తే. 'సన్మార్గం' 'సత్ప్రవర్తన' అనే విషయం నిర్ణయించుకోవడంలో మనం వివేకవంతుల, సాధుజనుల వాక్కులనే ప్రమాణాలుగా తీసుకొనవలసిఉంటుంది. మహాభారతంలో యక్షుడు ధర్మజున్ని ఇలా ప్రశ్నిస్తాడు-

కఃపన్థాః? మానవుడుజీవితంలో ఏమార్గాన్ని అవలంబించవలెను? దీనికి యుధిష్ఠిరుడు ఇలా ప్రత్యుత్తరమిస్తాడు.

మానవుని వివేకం - విభిన్నాభిప్రాయాలను సూచిస్తున్నది. దీనివల్ల మానవుల మనస్సులు సంశయాత్మలుగా తయారవుతున్నాయి. శాస్త్రాలమధ్యపరస్పరం వైరుధ్యమేర్పడి ఒకదాన్నొకటి ఖండించుకొంటున్నప్పుడు, ప్రజలు భిన్నదృక్పథాలు కలిగి సంచరిస్తున్నప్పుడు శ్రేయోమార్గం - వివేకవంతులు, సజ్జనులు అనుసరించినమార్గమేనని ధర్మరాజు చెప్పాడు-

మహాజనోయేనగతఃసపన్థాః. ఈరీతిగానే కాళి దాసుకూడా దుష్యంతునినోట అదే సత్యాన్ని నిరూపించాడు – సతాంహి సందేహపదేషు వస్తుషుప్రమాణ మన్తఃకరణ ప్రవృత్తయః । ఇప్పుడు సంతః, సాధవః, మహాజనః – ఈ ముగ్గురిలో ఎవరు నిజమైన సన్మార్గులనే ప్రశ్న? గీతపైముగ్గురినిగూర్చి ఇలా వర్ణిస్తుంది—

శ్లో॥ తితిక్షవః కారుణికాః
సుహృదః సర్వదేహినామ్ ।
అజాతశత్రవః శాన్తాః
సాధవః సాధుభూషణాః॥

(III-XXX-21)

శత్రువులను సమదృష్టితో చూచువారు, కరుణాసముద్రులు, సమస్తప్రాణికోటియందు సమభావనకలవారు జీవరాశికంతామిత్రులును, శత్రువులు లేనట్టివారును, శాంతచిత్తులును, సాధుప్రవర్తనకలిగి సజ్జనులుగా వ్యవహరింప బడుదురు. ఇతరశాస్త్రమార్గాలు గోచరించ నపుడు, సంశయాలు కలిగినపుడు పైసాధు జనులు కర్తవ్యపథాన్ని నిర్ణయించ గలుగు తారు.

నీతిశాస్త్రమంతా జగత్తుకు సంబంధించిన విషయమే. అనశ్వరాలై, ప్రాతిపదికలైన నైతికసూత్రాలను త్రుంచిపారవేయదలిస్తే, జగత్తే నశింపగలదు. నైతికవ్యవస్థకు ప్రమాదం వాటిల్లితే, యీ జగత్తే నశించగలదనే సత్యాన్నే తమిళకవికంబర్ తన రామాయణంలో వివరించాడు – రావణుడు సీతను లంకకు తీసుకొనివెళ్లి చెరబెట్టినప్పటికి చెరచ లేదని పూర్వపక్షంచేస్తూ, పై వాదాన్ని సమర్థించడానికి హనుమంతునినోట రామచంద్రునికి ఈ వాక్యాలు వినిపిస్తాడు మధుర కవి కంబర్.

హనుమంతుడు రామచంద్రునికి ఇలా నివేదిస్తాడు. ఆకాశంలో సూర్యచంద్రాదులు ఇంకా ప్రకాశిస్తున్నందువల్ల, నక్షత్రాలు జారి భూమిమీదపడనందున, సముద్రాలు చెలియలికట్టదాటి ప్రవహించనందున–ప్రభూ. రావణుడు సీతను తాకలేదని తెలుసుకో.

శాస్త్రాలు పవిత్రములై అనశ్వరములైన ధర్మాలవైపు మానవులదృష్టినిమరల్చి ఎల్లప్పుడూ ఎల్లకాలాల్లో వాటినే అనుసరిస్తూ ఉండమనే ప్రబోధాన్ని వారికి కావిస్తాయి. అందుచేతనే శ్రీకృష్ణపరమాత్మ అర్జుని ద్వారా మానవులకంతా ఇలా ఆదేశం ఇస్తాడు–

శ్లో॥ తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే
కార్యాకార్యవ్యవస్థితౌ॥
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం
కర్మకర్తు మిహార్హసి॥

కాబట్టి కర్తవ్యాకర్తవ్యములు నిర్ణయించుకోవడంలో శాస్త్రాన్నే ప్రమాణంగా ఎంచుకోవలసింది. శాస్త్రాల్లో చెప్పబడ్డ విధులను తెలుసుకొని ఆచరించవలసింది.

శ్రుతి, స్మృతుల్లో నిర్ణయింపబడ్డ ధర్మాలను ఆచరించినందువల్ల మానవునికి ఈ జీవితంలో ఖ్యాతి, పైలోకంలో ఉత్తమసౌఖ్యం లభిస్తుంది.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితంధర్మ
మనుతిష్ఠన్హిమానవః
ఇహకీర్తిమవాప్నోతి
ప్రేత్యచానుత్తమం సుఖమ్॥

(భవన్పత్రిక సౌజన్యంతో)

ఓం తత్సత్

# వార్తలు - విశేషాలు

## మద్రాసుకు శ్రీమద్వీరేశ్వరానందస్వాముల ఆగమనం

బొంబాయి, కాలడి, తిరుచూరు, కళ్లికోట మంగళూరు, బెంగళూరు, మైసూరు నగరములలోని రామకృష్ణమఠ మిషనుల కేంద్రములను దర్శించి మఠ మిషనుల సర్వాధ్యక్షులైన శ్రీమద్వీరేశ్వరానంద స్వాములు మదరాసుకు విచ్చేసి డిసెంబరు 21 వ తేదీనాడు మీనంబాకం విమానాశ్రయంలో దిగారు. మదరాసు భక్తులు ఎదురేగి గౌరవించారు. స్వామి మద్రాసులో డిసెంబరు 28 వ తేదీ వఱకు ఉండినారు. ఆదినానలో పెక్కుండ్రు భక్తులకు దర్శనం ఇచ్చారు. శ్రద్ధాళువులగు సాధువులకు దీక్ష ప్రసాదించారు. కాంచీపురంలో శ్రీ రామకృష్ణమఠంలో పునర్నిర్మితమైన గుడికిని, పెద్ద కూటమునకును 24, 25 తేదులలో ఆవిష్కరణోత్సవం చేశారు. 27 వ తేదీ సాయంకాలము మద్రాసు మఠమండపంలో స్వామి స్వక్రమసాధనల ఆవశ్యకతపై ఊనికతో ఆధ్యాత్మిక జీవితపథమునుగూర్చి ఉపన్యసించారు. అసంఖ్యాకులగు శ్రోతలు సమావేశమై విన్నారు. స్వామి 28 వ తేదీ కల్కత్తాకు తరలినారు.

## క్రైస్తు జయంతి

మదరాసు మైలాపూరు శ్రీరామకృష్ణమఠంలో 1969 డిసెంబరునెల 24 వ తేదీ బుధవారం సాయంకాలం క్రిస్ట్మసీవ్ మహోత్సవము కొనియాడబడినది. ఆరాత్రికం తర్వాత మఠమండపంలో జీసను క్రైస్తుపఠమును చక్కగ అలంకరించి పీఠముపై నెలకొల్పినారు. ఎదుట మైనపువత్తి దీపములను నివేదన పదార్థములను పఱచిపెట్టారు. శ్రీ విరూపాక్షానందస్వామి బైబిలునుండి కొన్ని ఘట్టాలు చదివి వినిపించారు. పర్వతాగ్రప్రవచనమునకు (సెర్మన్ ఆన్ ది మౌంట్) సమాంతరములను సంస్కృత సారస్వతములోంచి ఎత్తి చూపారు. శ్రీ ఆర్. రామకృష్ణన్ గారు జీసను క్రైస్తుసందేశమునుగూర్చి ఉపన్యసించారు. జీసను హిందువులహృదయమునకు ప్రియుడని ఆయన ఆదర్శాన్ని ఎంతగా అవలంబిస్తే మానవతతికి అంతశ్రేయస్సు కలుగుతుందని వాక్రుచ్చారు. ప్రసాద వినిమయంతో నాటి కార్యక్రమం ముగిసింది.

## మాతృశ్రీ జయంతి మహోత్సవము

మాతృశ్రీ శారదాదేవి 117 వ జయంతి తిథిపూజ 1968 డిసెంబరు 31 వ తేదీ బుధవారమునాడు మదరాసు మైలాపూరు శ్రీరామకృష్ణమఠంలో అత్యంత శ్రద్ధోత్సాహములతో నిర్వర్తింపబడింది. మధురనాదస్వరంతో దిన కార్యక్రమం ప్రారంభం అయింది. మంగళహారతి కనంతరం భజన వేదపారాయణం ప్రత్యేకపూజ హోమం అనే కార్యక్రమంలో పెక్కుండ్రు భక్తమహిళలును మహాజనులును పాల్గొన్నారు. భక్తులచేతులనిండుగ ప్రసాదం ఇవ్వడంతో మధ్యాహ్న కార్యక్రమం ముగిసింది. సందె ఆరాత్రికానంతరం మఠమండపంలో సమావేశమైన భక్తసదస్సులో శ్రీ విరూపాక్షానందస్వామి మాతృదేవి జీవితచరిత్రనుంచి కొన్ని ఘట్టాలు చదివి వినిపించారు. శ్రీమత్పరమాత్మానంద-కైలాసానంద స్వాములు మాతృదేవి వ్యక్తిత్వవిశేషమును జీవితవైలక్షణ్యమునుగూర్చి ఉపన్యసించారు.

బహిరంగమహోత్సవం 1970 వ సంవత్సరం జనవరి 11 వ తేదీ భానువారం మధ్యాహ్నానంతరం 3 గం॥ నుండి రాత్రి 9 గం॥ వఱకు చెల్లింది. విశాలమైన వివేకానంద సెంటినరీ హాలులో ఈ కార్యక్రమమునకు ఏర్పాటు చేయబడింది. వేదికపై మాతృశ్రీ ప్రతిమను అలంకరించి లోగడ 1911 లో బెంగుళూరు శ్రీరామకృష్ణాశ్రమమునకు వెనుకవైపున్న

గుట్టను పవిత్రీకరిస్తూ ఆమె జపము చేసిన ఐతిహ్యాము ను స్మరింపజేసేరీతిగ అమర్చిపెట్టినారు. శ్రీమణిఅయ్యరు కాసేపు వేణుగాన వినోదం సమకూర్చారు. బ్రహ్మశ్రీ తిరువారూరు ఎన్. రామచంద్రశర్మగారు శ్రీ ఆండాళమ్మ వైభవమును వీనులవిందుగా హరికథా కాలక్షేపం జరిపారు.

5-30 గంటలకు పౌరసభా కార్యం ప్రారంభమైంది. ప్రార్థనగేయం మంత్ర పుష్పానుసంధానం కాగానే మదరాసు శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు సదస్సునకు స్వాగతాశీస్సు అనుగ్రహిస్తూ నాటి ఉత్సవప్రాముఖ్యాన్ని వివరిస్తూ ప్రసంగించారు. వారి ప్రసంగసంక్షేపము:-చరిత్రలో మాతృశ్రీ మహోదాత్త వ్యక్తివిశేషము. ఉత్సాహజనక దివ్యచరిత. మనదేశచరిత్రలోగాని విశ్వచరిత్రలోగాని ఆమెతో తులతూగువారు అరుదు. 1853 నుండి 1920 వఱకు ఆమె ఈలోకమున జీవించియుండెను. కాని విశ్వమానవతతికి నిత్యశ్రేయః ప్రదాత్రిగా ఆమె వెలుగొందినది. ఆమె పల్లెపడుచు. సర్వసామాన్య కుటుంబ సంజాత. కాని విశ్వవ్యాప్తమై నిత్యప్రవర్ధమానముగనున్న రామకృష్ణమిషనుకు ప్రభవస్థానం ఈ పల్లెపడుచే. రామకృష్ణమిషను ఆమూలాగ్రం మతసంస్థ. ఆత్మస్వరూపిణియైన మాతృదేవి దానికి మూలశక్తి. పల్లెలో పుట్టి పల్లెలోపెరిగిన ఆమె పైకి ఏమియు ఎఱుగనిదే. బడిచదు వామెకు లేదు. చదువు విషయంలో భర్తయు ఆమెకు సమానుడే. కాని ఎందఱెందఱో మహాతత్త్వవేత్తలు జ్ఞానజ్యోతికై ఈ యిద్దఱిని దరిసి సఫలమనోరథులయ్యారు. మాతృదేవిని అర్థం చేసుకోవడం కష్టమే. పుస్తకం చదువామెకు సున్న. ఐనప్పటికి ఆమె ఆధ్యాత్మిక జ్ఞాననిధి. వైదిక సనాతనాచారపరాయణ. ఐనప్పటికి అతివిశాలమును అధునాతనమును ఐన దృక్పథం ఆమెకుంది. విదేశీయ మహిళా సంపర్కం ఆరోజుల్లో అప్రాయశ్చిత్తీయమైన కళంకం. కాని శ్రీ శారదాదేవి సోదరి నివేదిత ప్రభృతులను ఆత్మీయకోటిలో చేర్చుకుంది. అందుకు కావలసిన నైతిక ధీరత ఆమెకుండింది. శ్రీరామకృష్ణుని జీవితంలో క్లిష్టఘట్టాలు పెక్కింటిలో సరళామాయకురాలగు మాతృదేవి పల్కిన పల్కులు సమస్యలకు పరిహారములను సమకూర్చినవి. గురుదేవుని ప్రత్యక్షశిష్యు లొక్కొక్కరు ఆధ్యాత్మిక తత్త్వ నిధులైనప్పటికి మాతృదేవి ఎదుటపడుటకు జంకెడివారు. 1911 లో ఆమె మద్రాసుకు విచ్చేసింది. ఇంగ్లీషుగాని తమిళముగాని ఆమెకు తెలియదు. మదరాసీయులకు బెంగాలీభాష తెలియదు. కాని వారినామె కలిసికొన్నప్పుడు ఉభయులును సంతుష్టి చెందిరి. గురుదేవుడు జీవించియున్నంతకాలము మాతృదేవి ఆయనకు పరిచర్య చేస్తూవచ్చింది. తదనంతరం ఈ ఉద్యమానికే తాను కేంద్రస్థానీయురాలై తన సాధనంచేతను సలహాలచేతను ఈ రామకృష్ణ సంస్థకు సేవచేసింది. విదేశాలకు పోయి దిగ్విజయం సాధించిన శ్రీవివేకానందస్వామి అందుకు ముందుగా మాతృదేవి దీవెనలను పొందియే పోయెను. ఈ సంస్థకు ఆమెమాట వేదవాక్యం. ఇటీవల స్థాపితమైన శారదామఠంకూడ ఆమె సంకల్ప పరిపాకమే. మానవతతికి అమె ఆదేశాలు తారకములు. అందఱికామె "నామసంకీర్తనం చేయండి. జపం చేయండి ధ్యానం చేయండి" అని కఱపింది. ఎవరిలోగాని తప్పులెన్నరాదని నిషేధించింది. ఆ ప్రథమోపదేశము ఆత్మాభివృద్ధికి సాధకం. ఈ రెండోది సంఘబలమునకు సాధకం.

తమిళ ఎన్సైక్లోపేడియా ముఖ్య సంపాదకులైన శ్రీ ఎం. పి. పెరియస్వామి తూరన్ గారు మాతృదేవి సందేశాన్ని గూర్చి తమిళంలో ఈ

లాగన్నారు:— భగవదంకితమున్ను పరమ పవిత్రమున్ను అయిన జీవితసారం శ్రీ శారదా దేవి చరిత్రలో కనవచ్చు. ఆమెకుండిన గ్రంథ జ్ఞానము అల్పము. తత్త్వజ్ఞానమనల్పము. సనాతనాచారపరురాలై యుండియు ప్రేమ వాత్సల్యప్రేరితురాలై ఆమె అవధులను అతిక్రమించెడిది. నిమ్న ప్రజలపై ఆమె కుండిన ఉత్కట ప్రేమ లోకమాతకు సహజమే. ఎంతటి పతితులును ఆమె అనుగ్రహమునకు బాహ్యులు కారు. శ్రీరామకృష్ణునకు ఆమె యందుండిన ఉత్కటకోటిక భక్త్యాదరములు చాలు, ఆమె గారి ఆత్మోన్నతిని సూచించడానికి. ఆయనకు ఆమె అక్షరాలసహధర్మిణి. ఆయన కనంతరం ఆయన జీవితకార్యాన్ని ప్రశస్తరీతిలో ఈమె నిర్వహించింది. ఈమె మాతృప్రేమకు స్వదేశ విదేశాదులనెడి పొలిమేరలు లేవు.

వివేకానంద కళాశాల గణితశాఖకు మాజీ అధ్యక్షులైన శ్రీ ఎస్. నారాయణన్ గారు ఆంగ్లంలో ఇట్లుపన్యసించారు:— "శ్రీశారదా రామకృష్ణులుదివ్యదంపతులు. మాతృదేవిని గురుదేవుడు ఆరాధ్యపీఠం అధిష్ఠింపజేశాడు. మహోన్నత మాతృభావం ఆమెలో రూపు దాల్చింది. ఒకరీతిలో శ్రీ శారదా రామకృష్ణులు స్వయంవర దంపతులు. శ్రీశారదా దేవి మానవత్వ దేవత్వములకు కలయిక చోటు. ఆమె సీతాదేవియొక్క పునరవతారము అని చెప్పవచ్చు. ఆమె మాతృహృదయసన్నిధిలో ఎంతటి పాపమైన భస్మమై పోతుంది. మంచివారికి ఆమెతల్లి. చెడ్డవారికిని ఆమె తల్లియే. వెలుపలి సరళత, లోపల ప్రగాఢత ఆమె జీవితంలో విశేషాలు. ఒక వైపు గృహకృత్యాలలో శ్రద్ధాళువైనగృహిణి. ఒకవైపు ఆధ్యాత్మిక నిశ్రేణిశిఖరమైన నిర్వికల్ప సమాధిని అధిరోహించినది ఆమె."

స్కూళ్ళలో పోటీలలో గెలిచిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టబడ్డాయి. శ్రీ అణ్ణా ఎన్. సుబ్రహ్మణ్య అయ్యరుగారి వందనోపచారంతో సభాకార్యం ముగిసింది. మఠ భజనబృందంవారు శ్రీ ప్రియానందస్వాముల ఆధ్వర్యంలో గంటన్నరసేపు కాళీకీర్తనం చేశారు, ప్రసాద వినిమయంతో దినకార్యక్రమం ముగిసింది.

## గ్రం పరిచయం

### నివేదన

రచయిత : శ్రీ మేకా సుధాకరరావుగారు
ప్రాప్తిస్థానం: శ్రీ రాణీగారు, బొబ్బిలి రాజభవనం, బొబ్బిలిపోస్టు, శ్రీకాకుళంజిల్లా ఆంధ్రప్రదేశ్. పుటలు 67+38.

ఇదొక సీసపద్యాలశతకం. 67 పద్యాలు మొదటిభాగంగాను 38 పద్యాలు రెండోభాగంగాను వెలువరింపబడ్డాయి, ఇందు ప్రతిపద్యము భక్తిరసభరితం. భావుకతానిబిడం, ప్రౌఢతాసంపన్నం. హృత్ప్రభవమై అనర్గళంగాసాగిన భావతరంగిణి ఇది. ఇది స్వానుభూతిప్రవాహం కావడమే దీని మాధుర్యమర్మం 'వాక్యంరసాత్మకం కావ్య ' అను లక్షణానికి అన్యూనాతిరిక్తలక్ష్యమైన యీ చిఱుత కృ స్వాగతం.

ప్రభాకర్.

# భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

క్రొత్తగా వెలువడినది !!

# శ్రీ రామకృష్ణోపనిషత్

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# జ్ఞానయోగము

అనువాదకులు :

శ్రీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! | ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము – రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హిరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హిరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషన్ (సేవాసంస్థ):
# తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

---

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ ౧౯౭౦ - మార్చి : సౌమ్య - ఫాల్గుణము సంచిక ౯

## విషయసూచిక



ఫోన్ : 71231 శ్రీ రామకృష్ణ ప్రభ పోస్టు బాక్సు : 635

1. 1969 జూలై నుండి శ్రీరామకృష్ణప్రభ ఇరవై ఆఱవసంపుటం జరుగుతూ ఉంది.
2. చందావివరాలు : ఇండియాలో రూ. 5-00 ; సిలోనులో రూ. 7-00 ; ఇతరవిదేశాలలో రూ. 7-50 ; విడిసంచిక 50 పైసలు.
3. చందాదారులు జాబులలో తమచందాదారుసంఖ్యను చిరునామాను స్పష్టంగా వ్రాయాలి.
4. సంచిక అందకపోతే వారంరోజులలో తెలియజేయాలి.
5. మేము ప్రచురించిన తెలుగుగ్రంథాలలో అనేకములు శ్రీరామకృష్ణప్రభ చందాదారులకు తక్కువవెలకు అందజేయబడును. వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.
6. శ్రీరామకృష్ణప్రభ ప్రముఖసంస్కృతీకేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మికవిజ్ఞానపత్రిక. అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకం. రేట్లకు వ్రాయండి.
7. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపాలని గ్రంథకర్తలకు, ప్రకాశకులకు మా ప్రార్థన.

తక్కిన వివరాలకు ఈ చిరునామాకు వ్రాయండి :—

మేనేజరు : శ్రీరామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీరామకృష్ణమఠం, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు ; కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము—సర్వవిధముల నమూల్యమైన గ్రంథ రాజము. —శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * * —శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * * —శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

526 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 5-00

# శ్రీ శారదాదేవి చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును....చదువవలసిన గ్రంథ మిది ...అమృతకలశము !....అనన్య సామాన్య నీతిమంజరి....తియ్యని తెలుగు....పాలవంటి శైలి.... —ఆంధ్రప్రభ.

246 పుటలు (ముచ్చటయిన మూడవ కూర్పు) వెల : రూ. 2-75

# శ్రీ శారదాదేవి

రచయిత :

శ్రీ నండూరి బంగారయ్యగారు, బి. ఏ.

శ్రీ శారదాదేవి జీవితచరిత్రయందు గ్రంథస్థములుగాని విషయములెన్నియో యిందు విపరింప బడియున్నవి. ఆమె పవిత్ర చరిత్రమున కాధారభూతములగు గ్రంథములు, పత్రికలు మున్నగు వాని ద్వారా గడించిన విశేష విషయము లిందు గలవు.

143+16 పుటలు (ప్రథమ ముద్రణము) వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హాక్స్లి) అను ఘోగ ద్ధగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేట తెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేక ప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ } ౧౯౭౦ - మార్చి : : సౌమ్య - ఫాల్గునము { సంచిక ౯


శ్రీః

## బ్రహ్మస్తోత్రము

(గతసంచిక తరువాయి)


మూలము :

మహాకవి కాళిదాసు

వ్యాఖ్యాత :

కీ. శే. ఆదికళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు


ఆత్మాన మాత్మనా వేత్సి, సృజ స్యాత్మాన మాత్మనా,
ఆత్మనా కృతినాచ త్వ మాత్మన్యేవ ప్రలీయసే.

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓ భగవంతుఁడా) |
| త్వమ్‌ఆత్మానమ్ | నీవు నిన్ను |
| ఆత్మనా వేత్సి | నీచేతనే ఎఱుంగుదువు |
| ఆత్మానం ఆత్మనా | నిన్ను నీచేతనే |
| సృజసి | నిర్మింతువు |
| కృతినా ఆత్మనా | సమర్థుఁడవయిన నీచేత |
| ఆత్మన్యేవ | నీయందే |
| ప్రలీయసే | లయ మొందెదవు. |

తా. ఓ భగవంతుఁడా, నిన్ను నీవు స్వయముగానే ఎఱుంగుదువు, నిన్ను నీయందే స్వయముగానే సృజించుకొందువు, నీవు నీయందే స్వయముగానే అడంగెదవు. ప్రపంచమునకుం బోలె నీకు జ్ఞానసృష్టిలయముల విషయమై ఒకరియపేక్ష లేదు.

ద్రవ స్సఙ్ఘాత కఠినః స్థూలః సూక్ష్మో, లఘుర్గురుః,
వ్యక్తో వ్యక్తేతరశ్చాసి,—ప్రాకామ్యం తే విభూతిషు. 8

| | |
|---|---|
| (హేభగవన్ త్వం) | (ఓ భగవంతుఁడా నీవు) |
| ద్రవః | రసాత్మకుఁడవు |
| సంఘాత | దట్టంపుఁ గూర్పుచేత |
| కఠినః | గట్టివాఁడవు |
| స్థూలః | లావయినవాఁడవు |
| సూక్ష్మః | ఇంద్రియములకు గోచరింపనివాఁడవు |
| లఘుః | తేలికవు |
| గురుః | బరువవు |
| వ్యక్తః | కార్యరూపుండవును |
| వ్యక్తేతరశ్చ | వ్యక్తముకంటె వేఱగువాఁడవును అనఁగా కారణరూపుఁడవునుగా |
| అసి | ఉన్నావు. (ఇట్లు) |
| విభూతిషు | ఐశ్వర్యములందు |
| తే | నీకు |
| ప్రాకామ్యమ్. | యథేచ్ఛత్వము (కలదు) |

తా. ఓ భగవంతుఁడా, నీవు నదీసముద్రాదులవలె రసస్వరూపుఁడవు, కొండలు లోనగు వానివలె చిక్కని కూర్పుచేత కఠినుఁడవు, కన్నుల కగపడు ఘటాదులవలె లావయిన వాఁడవు, పరమాణ్వాదులవలె ఇంద్రియాగోచరుఁడవు, దూదిలోనగు వానివలె తేలికయైన వాఁడవు, బంగారులోనగు వానివలె బరువయినవాఁడవు, కార్యరూపుఁడవు, కారణరూపుఁడవును. ఇట్లు నీకు అణిమాద్యైశ్వర్యములు ఇచ్ఛానుసారులుగా నున్నవి 8

ఉద్ఘాతః ప్రణవోయాసాం, న్యాయై స్త్రిభి రుదీరణమ్
కర్మయజ్ఞః, ఫలంస్వర్గ, స్తాసాం త్వం ప్రభవో గిరామ్. 9

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓ భగవానుఁడా) |
| యాసాంగిరాం | ఏ వాక్కులకు |
| ప్రణవః | ఓంకారము |
| ఉద్ఘాతః | ఆరంభమో |
| త్రిభిఃన్యాయైః | మూఁడు స్వరములతో |
| ఉదీరణం | ఉచ్చారణమో |
| కర్మ యజ్ఞః | పని జన్నమో |
| ఫలం | ప్రయోజనము |

| | |
|---|---|
| స్వర్గః | స్వర్గమో |
| తాసాం (గిరాం) | ఆ వాక్కులకు |
| త్వం | నీవు |
| ప్రభవః | కారణమవు. |

తా. ఏ వాక్కులకు ఆరంభము ఓంకారమో, ఉదాత్తానుదాత్త స్వరితముల నెడు మూఁడు స్వరములలో ఉచ్చారణమో, పనియజ్ఞమో, ఫలముస్వర్గమో ఆ వేదవాక్కులకు నీవే కారణమవు. 9

త్వామామనన్తి ప్రకృతిం పురుషార్థప్రవర్తినీమ్
తద్దర్శిన ముదాసీనం త్వామేవ పురుషం విదుః. 10

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓ భగవంతుఁడా) |
| త్వాం | నిన్ను |
| పురుష | ఆత్మయొక్క |
| అర్థ | ప్రయోజనమునకై |
| ప్రవర్తినీం | ప్రవర్తిల్లునట్టి |
| ప్రకృతిం | మూలకారణముగా |
| ఆమనన్తి | చెప్పుదురు |
| త్వామేవ | నిన్నే |
| తత్ | ఆ ప్రకృతిని |
| దర్శినం | చూచుచుండెడి |
| ఉదాసీనం | కూటస్థమయిన |
| పురుషం | ఆత్మనుగా |
| విదుః | తలంతురు |

తా. ఓ భగవంతుఁడా, నీవే సత్త్వరజస్తమోగుణాత్మికయై పురుషునికి భోగమోక్షములు సమకూర్చుటకు ప్రవర్తిల్లుచుండు ప్రకృతివని చెప్పుదురు. నీవే ఆ ప్రకృతిని సాక్షివలె నుదాసీనుఁడై చూచుచుండు నాత్మవనియు భావింతురు. 10

త్వం పితౄణామపి పితా, దేవానా మపి దేవతా,
పరతోఽపి పరశ్చాసి, విధాతా వేధసామపి. 11

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓ భగవానుఁడా) |
| పితౄణాం అపి | పితృదేవతలకుకూడ |
| త్వం పితా | నీవు పితృదేవతవు |
| దేవానాం అపి | వేల్పులకు సయితము |

| | |
|---|---|
| దేవతా | వేల్పవు |
| పరతఃఅపి | పైవానికంటె |
| పరశ్చఅసి | పైవాఁడవును అగుదువు |
| వేధసామ్అపి | ప్రజాపతులకు సయితము |
| విధాతా | స్రష్టవు. |

తా. ఓభగవంతుఁడా, నీవు అగ్నిష్వాత్తాది పితృదేవతలకు సయితము తర్పణీయుఁడవు. ఇంద్రాది దేవతలకు సయితము యజనీయుఁడవు, పయివానికెల్లను పయివాఁడవు, దక్షాది సృష్టికర్తలను సయితము సృజించినవాఁడవు. 11

త్వమేవ హవ్యం హోతా చ, భోజ్యం భోక్తా చ, శాశ్వతః,
వేద్యంచ వేదితా చాసి, ధ్యాతా ధ్యేయం చ యత్ పరమ్. 12

| | |
|---|---|
| (హేభగవన్) | (ఓభగవంతుఁడా) |
| శాశ్వతః | సదాఉండువాఁడవయిన |
| త్వమేవ | నీవే |
| హవ్యం | ఆహుతివి |
| హోతాచ | వేల్చువాఁడవును |
| భోజ్యం | ఆహారమవు |
| భోక్తాచ | భుజించువాఁడవు |
| వేద్యం | ఎఱుంగనగువస్తువవు |
| వేదితాచ | ఎఱుంగువాఁడవును |
| అసి | అగుదువు |
| యత్ పరంధ్యేయం | ఏయుత్కృష్టమైన వస్తువును ధ్యానింపవలయునో ఆ వస్తువవు |
| ధ్యాతాచ | ధ్యానించువాఁడవును. |

తా. ఓ భగవంతుఁడా, సదా ఉండునట్టి నీవే, ఆహుతివియు వేల్చువాఁడవును, అన్నమవును భోక్తవును, ఎఱుఁగనగు వస్తువవు ఎఱుఁగువాఁడవును, అన్నిటికంటె పైదగు ధ్యేయమవును ధ్యాతవును. 12

మ. హరినాభీకమలంబునం బొడమి భాషాధ్యక్షుణం బత్నిగాఁ
గర మర్థిం గొని తత్సమేతముగ వేడ్కన్ బద్మపీఠస్థుఁడై
పరమప్రీతి సనందనాదులు భజింపన్ నేర్పుమీఱన్ ద్రయీ
సరణిన్ ముజ్జగముల్ సృజించిన జగత్స్రష్ట న్విధిన్ గొల్చెదన్.

—గోపీనాథం వేంకటకవి.

శ్రీః

# రామకృష్ణాష్టోత్తర శతనామావళి

## శ్రీ విమలానందస్వామి

ఓమ్ శ్రీచన్ద్రమణీదేవీ
తుదిరామాప్తసూనవే నమః 1
ఓమ్ అకర్మాయత్తదేహాయ ,, 2
ఓమ్ ధర్మసంస్థితిహేతవే ,, 3
ఓమ్ గదాధరాయ 4
ఓమ్ ధీరాయ 5
ఓమ్ సౌమ్యాయ 6
ఓమ్ అమిత తేజసే 7
ఓమ్ సర్వానవద్యగాత్రాయ ,,
ఓమ్ సర్వచేతోఽపహారిణే ,, 9
ఓమ్ మాతృభక్త్యేకనిష్ఠాయ ,, 10
ఓమ్ మాతృవాత్సల్యభూమయే ,, 11
ఓమ్ పూర్ణబ్రాహ్మణ్యయుక్తాయ ,, 12
ఓమ్ శూద్రాభిక్షాసుతోషిణే ,, 13
ఓమ్ నాట్యగానవినోదాయ ,, 14
ఓమ్ మిత్రబృన్దాగ్రగామినే ,, 15
ఓమ్ శుష్కవిద్యావిహీనాయ ,, 16
ఓమ్ ప్రాజ్ఞశ్లాఘ్యసుమేధసే ,, 17
ఓమ్ క్రీడాచిత్రకళాకృష్టజనవిస్మయ
హేతవే 18
ఓమ్ బలాకాలక్ష్యకృతాకాశ
విలోకనసమాధయే 19
ఓమ్ శివవేషనటోద్దీప్త
శివైక్యానుభూతయే ,, 20
ఓమ్ స్వనుష్ఠితస్వధర్మాయ ,, 21
ఓమ్ శారదాగృహమేధినే ,, 22
ఓమ్ స్వర్ధునీవారినిర్ధౌత
దక్షిణేశ్వరవాసినే ,, 23
ఓమ్ అవధూతార్థకామాయ ,, 24
ఓమ్ పరవిద్యైకకాఙ్క్షిణే ,, 25
ఓమ్ రాధాగోవిన్దదేవాయ ,, 26

ఓమ్ భవతారిణ్యుపాస్తయే నమః 27
ఓమ్ దక్షిణాకాళికాపూజావిస్మృత
స్వాన్యకర్మణే ,, 28
ఓమ్ ఆజన్మపూర్ణసిద్ధాయ ,, 29
ఓమ్ సాధనోద్బుద్ధసిద్ధయే ,, 30
ఓమ్ తపోయోగాప్తదివ్య
క్షణే ,, 31
ఓమ్ సర్వతన్త్రక్రియాసాధ్య
సిద్ధ్యుద్భాసితచేతసే 32
ఓమ్ రాధాభావనిమగ్నాయ 33
ఓమ్ [illegible]తానిధ్యానమోదినే 34
ఓమ్ ఆఞ్జనేయాత్మభావాయ 35
ఓమ్ రామచన్ద్రోపసేవినే 36
ఓమ్ తోతాపురి గురుప్రాప్త బ్రహ్మై
క్యా[illegible] 37
ఓమ్ పుష్పశష్పనృపక్ష్మాది
సర్వభూతాన్తరాత్మనే 38
ఓమ్ సర్వభూతాత్మభూతాయ 39
ఓమ్ సర్వభూతానుకమ్పినే 40
ఓమ్ సాక్షాత్కృతేసునాథాయ 41
ఓమ్ నబిరూపావలోకినే 42
ఓమ్ బాలగోపాలభావాయ 43
ఓమ్ గౌరాఙ్గాభిన్నమూర్తయే 44
ఓమ్ బుద్ధబోధప్రబుద్ధాయ 45
ఓమ్ హరాకృతివిభాసినే 46
ఓమ్ రాస్మణీమథురాదిష్టగురు
దైవతమూర్తయే 47
ఓమ్ భగవద్భక్తధుర్యాయ 48
ఓమ్ గానమాధుర్యసిన్ధవే 49
ఓమ్ శమాదిషట్కాశ్రయాయ 50
ఓమ్ యతిధర్మస్వరూపిణే 51

| | | |
|---|---|---|
| ఓమ్ దమ్భాహఙ్కారహీనాయ | నమః | 52 |
| ఓమ్ వాత్సల్యౌదార్యవార్ధయే | ,, | 53 |
| ఓమ్ కామక్రోధవిదూరాయ | ,, | 54 |
| ఓమ్ మార్దవార్జవశాలినే | ,, | 55 |
| ఓమ్ ఏషణాత్రయముక్తాయ | ,, | 56 |
| ఓమ్ హేమమృత్తుల్యదర్శినే | ,, | 57 |
| ఓమ్ స్థితప్రజ్ఞాయ | ,, | 58 |
| ఓమ్ శుద్ధాయ | ,, | 59 |
| ఓమ్ లోకసఙ్గ్రహకారిణే | ,, | 60 |
| ఓమ్ గుణాతీతాయ | ,, | 61 |
| ఓమ్ శాన్తాయ | ,, | 62 |
| ఓమ్ సర్వతీర్థస్వరూపిణే | ,, | 63 |
| ఓమ్ అమానినే | ,, | 64 |
| ఓమ్ మానదాయ | ,, | 65 |
| ఓమ్ పుణ్యశ్లోకాయ | ,, | 66 |
| ఓమ్ యోగినే | ,, | 67 |
| ఓమ్ సర్వానుస్యూతచిన్మాత్రదర్శినే | ,, | 68 |
| ఓమ్ అమృతమూర్తయే | ,, | 69 |
| ఓమ్ లోకశిక్షణదక్షాయ | ,, | 70 |
| ఓమ్ జీవసేవావిధాయినే | ,, | 71 |
| ఓమ్ గృహమేధినిదర్శాయ | ,, | 72 |
| ఓమ్ నైష్ఠికబ్రహ్మచారిణే | ,, | 73 |
| ఓమ్ అప ృతాశేషధర్మతత్త్వ ప్రకాశినే | ,, | 74 |
| ఓమ్ విద్వద్వర్యసుపూజ్యాయ | ,, | 75 |
| ఓమ్ కేశవస్తుత్యకీర్తయే | | 76 |
| ఓమ్ సాధుసజ్జనజుష్టాయ | | 77 |
| ఓమ్ వేదవేదాన్తభానవే | | 78 |
| ఓమ్ గిరీశాదిసముద్ధర్త్రే | | 79 |
| ఓమ్ వివేకానన్దదాయినే | | 80 |
| ఓమ్ బ్రహ్మానన్దశివానన్దాద్యన్తే వాసా(శి)తాఙ్ఘ్ర | , | 81 |
| ఓమ్ సర్వార్హణీయశీలాయ | నమః | 82 |
| ఓమ్ దేవాయ | ,, | 83 |
| ఓమ్ అభీష్టవర్షిణే | ,, | 84 |
| ఓమ్ ఆచణ్డాలవితీర్ణస్వప్రేమ పీయూషసమ్పదే | ,, | 85 |
| ఓమ్ సమాధినిష్ఠచిత్తాయ | ,, | 86 |
| ఓమ్ భక్తహృత్పద్మవాసినే | ,, | 87 |
| ఓమ్ జన్మమృత్యుజరాతప్తజన విశ్రాన్తిభూమయే | ,, | 88 |
| ఓమ్ ఆత్మసంస్థాయ | ,, | 89 |
| సత్యాయ | ,, | 90 |
| ఓమ్ శరణ్యగుణశాలినే | ,, | 91 |
| ఓమ్ దురాచారవిఘాతాయ | ;, | 92 |
| ఓమ్ సదాచారప్రవర్తినే | ,, | 93 |
| ఓమ్ సంసారకర్ణధారాయ | ,, | 94 |
| ఓమ్ సంశయగ్రన్థిభేదినే | ,, | 95 |
| ఓమ్ అష్టపాశవిముక్తాయ | ,, | 96 |
| ఓమ్ కలిదోషాపహారిణే | ,, | 97 |
| ఓమ్ అవ్యాజకరుణాయ | ,, | 98 |
| ఓమ్ ఆత్మదీపాయ | ,, | 99 |
| ఓమ్ ఆనన్దమూర్తయే | ,, | 100 |
| ఓమ్ విరక్తిభక్తినైర్మల్యభూతిమఙ్గల దాయినే | ,, | 101 |
| ఓమ్ భక్తహార్దతమోభేదిదివ్యజ్యోతి స్వరూపిణే | ,, | 102 |
| ఓమ్ సర్వదేవీస్వరూపాయ | ,, | 103 |
| ఓమ్ సర్వదేవస్వరూపాయ | ,, | 104 |
| ఓమ్ సర్వావతారసారాయ | ,, | 105 |
| ఓమ్ రామకృష్ణైకరూపిణే | ,, | 106 |
| ఓమ్ ప్రపన్నత్రాణదీక్షాయ | ,, | 107 |
| ఓమ్ రామకృష్ణాయఓమ్ నమః | | 108 |

# గురుదేవుని సూక్తిరత్నములు

## పురుషప్రయత్నము : భగవదనుగ్రహము

మనకు ఆహారము సమకూర్చుచున్నాడు కావున భగవంతుడు దయామయుడని చెప్పజాలము. 'అలికి కూడు పెట్టుకొనుట ఊరికి ఉపకారమా' అనునట్లు బిడ్డలకు అన్న మిడుట తండ్రివిధి కదా. కాని మనలను దుష్ప్రేరణల నుండి కాపాడుచు పెడత్రోవ త్రొక్కకుండ రక్షించుపట్ల భగవంతుడు నిజముగా దయామయుడని చెప్ప వలయును. 1

ప్రశ్న : ఎట్టికర్మల నొనర్చుటచే భగవంతుని బొంద నగును?

ఉ. కర్మములలో నేమియు లేదు. 'ఈకర్మ మొనర్చిన భగవంతుని బొందగలము, ఆకర్మ మొనర్చిన బొందజాలము' అని భావింపరాదు.

సర్వము భగవదనుగ్రహముపై నాధారపడియున్నది. వాని యనుగ్రహము పొంద దలచెదవా, నీ వేకర్మ మొనర్చినను మనఃపూర్వకముగా నొనర్పుము, భగవంతుని బొందవలయునను పరితాపముతో నొనర్పుము. వాని కృపవలన నీపరిస్థితు లనుకూల పడగలవు. సాక్షాత్కారమునకు వలయు స్థితిగతు లేర్పడగలవు. నీవు సన్న్యసింప దలచియుండ, కుటుంబము నీపై నాధారపడియుండ, నీ సోదరుడు తద్భారనిర్వాహకుడు కావచ్చు. నీభార్య నీకు అడ్డము వచ్చుటకు బదులు నీకు తోడ్పడవచ్చు. లేదా, నీకు వివాహము జరుగకే పోవచ్చు. అపుడు నీకు సంసారబాధ్యతయే యుండదు. అంతియు దైవానుగ్రహము. 2

శతాబ్దములకొలది గది నావరించియున్న చీకటి, దీపము వెలిగించినంతనే మటుమాయమగుచున్నది. కోట్లకొలది జన్మములలో చేసిన పాపములు భగవానుని కరుణాకటాక్షమొక్కటి ప్రాప్తించినంతనే పటాపంచలై పోవుచున్నవి. 3

కొన్ని చేపలకు పెక్కు వరుసల యెముకలుండును, మఱికొన్నిటి కెముకలొక్కవరుసయే యుండును. అవి హెచ్చుగా నున్నను తక్కువగా నున్నను చేపలను దినువారుమాత్రము వానినన్నిటిని తీసి పాఱవేయుదురు. అటులనే పాపములు కొందఱి కెక్కువగా నుండును, కొందఱికి తక్కువగా నుండును. కాని యీశ్వరానుగ్రహము సకాలమున వానినన్నిటిని తొలగించి నరులను పాపవిముక్తులనుగా జేయును. 4

మలయమారుతము వీచునప్పుడు చేవగల చెట్లన్నియు మంచిగంధపుచెట్లుగా మాఱునట. చేవలేని బొప్పాయి, వెదురు అరటి మొదలగునవి మార్పుచెందక యథాప్రకారముగనే యుండును. అటులనే ఈశ్వరానుగ్రహము లోకమునకు ప్రాప్తించునప్పుడు సౌజన్యపుణ్యాంకురములు గలవారు శీఘ్రముగా మహనీయులగుదురు—భక్తులగుదురు. ఇక నిర్భాగ్యులగు విషయాసక్తులుమాత్రము ఎట్టి మార్పును జెందక ఎప్పటివలెనే యుందురు. 5

ఒకపుణ్యాత్ముడు జపమాల త్రిప్పుచు భగవన్నామస్మరణ చేయుచుండెడివాడు. శ్రీగురుదేవు డాతని కిట్లనియె. "ఒక్కతావునే (సాధననే) అంటిపెట్టుకొనియుండ నేల? ముందునకు సాగిపొమ్ము". అతడు, "అందులకు భగవదనుగ్రహము కావలయును గదా" అనియెను. అంత శ్రీగురుదేవు డాతని కిట్లు బోధించెను.— "భగవదనుగ్రహ మను మారుతము అహర్నిశము నీశిరస్సుమీదుగా వీచుచునే యున్నది సంసారసాగరమును శీఘ్రముగా తరింపగోరెద

వేని నీమన స్సనెడి నౌకయొక్క తెరచాపలను విప్పుము.'' 6

ఈశ్వరానుగ్రహ మను గాలి సర్వదా వీచుచునే యున్నది. సోమరులై సంసారసాగరమున బడియుండువారు దాని లాభమును బొందరు. కాని కార్యదక్షులు బలాఢ్యులు నగు వారు తమమనస్సనెడి తెరచాపను నిండార విప్పుకొని, ఆయనుకూలవాయువును గ్రహించి, శీఘ్రముగా పరమావధిని బొందుదురు. 7

ప్రశ్న: ఆకస్మికముగా నేమియు సిద్ధింపదా?

ఉ. ముకి నొందుటకు సర్వసాధారణముగా అందఱును దీర్ఘకాలము సాధనచేయవలసియున్నారు. ద్వారకనాథబాబు ఒక్కసారిగా హైకోర్టుజడ్జి కాలేదు. ఆపదవిని బొందుటకు ముం దాయన అనేకసంవత్సరములు కష్టపడి పని చేసెను—శ్రమపడి చదువుకొనెను. అట్టి శ్రమ కోర్వ నిచ్చగింపనివారు కక్షిదారులు లేని 'బల్లదండుగి' ప్లీడరులై యుండుటకు సిద్ధపడవలసినదే. ఐనను భగవదనుగ్రహముచే ఆకస్మికముగా అభ్యుదయము నొందుటయు గలదు. కాళిదాసువిషయ మట్టిది. సరస్వతీదేవి యనుగ్రహమున పరమపామరస్థితినుండి యాతడొక్కసారిగా భారతదేశకవీశ్వర డనిపించుకొను స్థితిని బొందెను. 8

ఒకగృహస్థభక్తుడు: దేవా, మీరు భగవంతుని జూచితి రని వినియున్నాము. కావున మమ్మనుగ్రహించి మేము గూడ భగవంతుని జూచునట్లు చేయుడు. ఆభగవానుని చెలిమి సంపాదించు టెటు?

ఉ. సర్వము ఈశ్వరేచ్ఛ ననుసరించి నడచును. భగవద్దర్శనము నొందుటకై సాధన చేయవలయును. కేవలము చెఱువుగట్టున గూర్చుండి, ''ఈచెఱువులో చేప లున్నవి, ఈ చెఱువులో చేప లున్నవి'' అని యఱచుటచే చేపలు చేజిక్కునా? వానిని బట్టుటకు వలయు పరికరములను సంపాదింపుము—గాలపుజువ్వ దారము ఎర—వీనిని దెచ్చి ముందు చేపల నాకర్షించు నాహారము నీటిలో చల్లుము. అంతట లోతున నున్న చేపలు పైకి వచ్చును. అప్పుడు నీవు వానిని పట్టుకొనవచ్చును. ఏప్రయత్నమును చేయక మీ రూరక కూర్చుండియుండ నన్ను మీకు భగవంతుని జూపుమని యడుగుచున్నారా? పెరుగు తోడుపెట్టి వెన్న చిలికి మీనోటి కందీయవలయునా? చేపను బట్టుకొని మీచేతిలో బెట్టవలయునా? ఎంత విపరీతముగా నున్నది మీకోరిక! 9

నడిసముద్రమున బోవు నోడ తెరచాః కొయ్యమీద నొకపక్షి వాలియున్న దనుకొనుడు. అది యచట చాలసేపు కూర్చుండుటకు విసుగుచెందును; మఱియొక తావును వెదకుటకై యెగిరి వెడలును; దేనిని గానక, ఎంతయో అలసి సొలసి తుదకు పూర్వపు ఓడ కొయ్యనే చేరును. అట్లే సామాన్యసాధకుడు తన శ్రేయోభిలాషియు అనుభవశాలియునగు గురువు విధించు శిక్షణమును సాధనములను సాగింప విసుగుచెందును, నిరాశు డగును, గురువునందు విశ్వాసము కోల్పోవును. ఇక స్వప్రయత్నముచే భగవంతుని గనుగొంద మను ఆశతో ఎందెందో తిరుగాడును; ఎంతయో వృథాప్రయత్నము చేసి తుదకు తన పూర్వపు గురునియొద్దకు – అతని యనుగ్రహమును రాాదమును బొందుటకై –తిరిగి వచ్చును. 10

ఉక్కగా నుండగా గాలి వీవనంతకాలము విసనకఱ్ఱతో విసరుకొందుము. ధనవంతులకును

దరిద్రులకును ఎల్లరకును సమానముగా హాయి నొసగు మలయమారుతము వీవ నారంభించినంతనే విసనకఱ్ఱ నావల బెట్టుదుము. పరమావధిని బొందుటకై దైవసాహాయ్యము లేకుండునంత కాలము స్వప్రయత్నము సాగింపవలయును; కాని యదృష్టవశమున ఆతోడ్పాటు లభించినపుడు ఇక శ్రమపడుట — సాధన చేయుట – అనావశ్యకము. అంతవఱకు మాత్రము శ్రమపడక తీరదు. 11

మలయమారుతమే వీచునపుడు విసనకఱ్ఱ ఎందులకు? భగవత్కృపయే లభించునప్పుడు జపతపము లెందులకు? 12

భగవంతుననుగ్రహము గురుననుగ్రహము సద్భక్తుననుగ్రహము ఈమూడు విధములైన యనుగ్రహమును అదృష్టవశమున బొందినను అంతఃకరణపుటనుగ్రహము లేనియెడల — అనగా తరణోపాయమునకై పరితపింపని యెడల—అన్నియు నిష్ఫలములు. 13

నీ వెంతగా ప్రయత్నించినను భగవదనుగ్రహము లేనిదే ఏమియు లభింపదు. వానికృప లేనిదే నీవు వానిసాక్షాత్కారమును బొంద జాలవు. కాని భగవత్కృప సులభముగ చేజిక్కునది కాదు. హృదయమునందలి యహంకారమును నిర్మూలము చేయవలయును. 'నేను కర్తను' అను నహంకార మేమాత్ర మున్నను నీవు భగవంతుని గన జాలవు. (ఇంటిసామగ్రి పెట్టుకొను) గదిలో ఎవరో యొక రుండగా మఱియొకరు ఇంటియజమానుని ఏదియో యొక వస్తువును అందుండి తెమ్మనినయెడల వెంటనే యాతడు "గదిలో ఎవరో ఉన్నట్లున్నారు, చూడు, వాని నడిగి పుచ్చుకో" అని చెప్పును గదా! "నేను కర్తను" అని భావించువానికి భగవానుడు ప్రసన్నుడు కాడు. 14

తన కెపుడు కృప గలుగునో అపుడే భగవంతుడు ప్రత్యక్షమగును. అతడు పరంజ్యోతి జ్ఞానభాస్కరుడు; వానికిరణ మొక్కటి ప్రసరించి లోకమున కంతకును ధీశక్తి నొసగుచున్నది. తన్మూలముననే మనము ఒండొరులను దెలిసికొనగలుగుచున్నాము. తన దివ్య తేజమును తనపై ప్రసరింపజేసికొనునప్పుడే మనము వానిని గాంచగల్గుదుము.

# యుగావతారుడు శ్రీరామకృష్ణుడు

అత్యావశ్యకములైన ఏవిలువల సంపాదనము భారతీయ సంస్కృతికి అనాదికాలముగా ఆదర్శమై యున్నదో, ఆ విలువల కన్నింటికి పరమహంస శ్రీరామకృష్ణుని జీవితమును ఉపదేశములును అనుపేక్ష్యలక్ష్యములుగా నున్నవి. ఆయన రాజకీయసాంఘికసంఘర్షణలకు కడు దూరుడై యుండినవాడు, భౌతికశాస్త్రమున గాని తత్త్వశాస్త్రమునగాని పఠనపాఠనరూపమైన కృషి ఆయన చేసినవాడు కాడు, అయినను ఆయనప్రభావము విశ్వమానవతతి డెందములలో ప్రగాఢముగా ముద్రితమై యున్నదనుట సాటి లేని యొక విశేషము.

ఆయనజీవితచరిత్రమువలన తెలియనగు సారతమాంశ మిది – దేవు డున్నాడు, దేవు నెఱుగుటయే సాక్షాత్కరించుకొనుటయే జీవితమున కేకైకలక్ష్యము. జ్ఞాను లందఱును ఉద్ఘాటించిన విషయమే ఇది. మఱి శ్రీరామకృష్ణుని ప్రత్యేకత ఏమి? ఇందుపై ఆయన ఉంచిన

ఊనిక; ఇందుకై తిరుగులేని రీతిలో ఆయన నిర్వర్తించిన అమోఘసాధన, ఈమార్గమున మానవుడు ఏయే సమున్నతులు సాధింపగలడను వివరములను ఎంతటిసంశయాత్మునకును నచ్చునటు ఆయన తనజీవితమునందే ప్రదర్శించిన రీతి—వీనివలన గలిగిన ప్రత్యేకతయే శ్రీరామకృష్ణునిది.

దేవుడు ఉన్నాడా లేడా అను ప్రశ్నను మనలో మహాప్రతిభానిధులుసైతము తమ్ముతా మడుగుకొనుచుందురు. ఇందునుగూర్చిన తర్కమంతయు తుదకు "ఉపపత్తులు దేవుడున్నాడనుటకును కలవు లేడనుటకును కలవు" అను తీర్మానమునకు మనలను తెచ్చి వదలును. ఈప్రశ్న ఏమో చాలముఖ్యమైనదే. ఇందు మన మవలంబించు పక్షమునుబట్టి మనజీవితపథము రూపొందును. ఈసంశయమును బోకార్చి సుదృఢవిశ్వాసమును గలిగింపగల మహనీయుని జీవితమునకును సందేశమునకును ఇంతంతనరానంత ప్రాముఖ్యము గల్గుట కిదే కారణము.

శ్రీరామకృష్ణునిజీవితమున వెలుపలికి జూచుటకు ఘనసంభవము లేవియు లేవు. ఆయన జీవితచరిత్రము అందఱు యోగుల జీవితచరిత్రమువంటిదిగానే కనిపించును. కాని లోతునకు దిగి చూచినచో అచ్చెరువుగొలుపు ఉపాదేయవిషయసంపద గననగును. భగవదన్వేషణమున ఆయన ఆచారసిద్ధములైన అవధులను గ్రంథప్రతిపాదితక్రమములను అతిక్రమించినాడు. ఆయన భగవత్తృష్ణ గలవా డనుటకంటె, భగవత్తృష్ణయే ఆయనగా రూపొందెనని చెప్పుట సముచిత మగును. నీట మునిగినవాడు ఊపిరికై పడు తహతహ ఎట్టిదో దేవుని గాంచుటకై సాధకుడు పడవలసిన తహతహయు అట్టిదే అని ఆయనయే పలుసార్లు చెప్పియున్నాడు. అట్టి తహతహ అంతటి తహతహ ఎవనికిపుట్టునో వానికి లక్ష్యసిద్ధి తప్పక కలుగు ననుట శ్రీరామకృష్ణుని స్వానుభవము.

తనలో ఆంతరముగ గలిగిన పరివర్తనమును శ్రీరామకృష్ణుడు దృష్టాంతపూర్వకముగా అనన్యాదృశభణితిలో ఇట్లు వివరించెను. "బిడ్డయెదుట కొన్ని బొమ్మలను మిఠాయిముక్కలను వేసి తల్లి వంట మున్నగు తనపనులు నిర్వర్తించుకొనుటకు వంటింటి కేగును. తల్లిని తలచుకొనక బిడ్డ మిఠాయిముక్కలను దినుచు బొమ్మలతో ఆడుకొనుచు నుండును. తల్లియు ఇంటిపనులలో నిమగ్నురాలై యుండును. చాల సేపటికి బిడ్డకు విసుగు పుట్టి అమ్మను బిలుచును. ఆ పిలుపును ఆమె లక్ష్యపెట్టదు. తర్వాత ఆ బిడ్డ ఆకలికి తాళజాలక బొమ్మలను పాఱవేసి అమ్మకై ఏడువ నారంభించును. అప్పుడు బిడ్డకు కావలసినది తానే గాని, వే ఱేదియును గా దని గుర్తించి తల్లి ఱెక్కలు కట్టుకొని బిడ్డయెదుట వ్రాలి బిడ్డ నెత్తుకొని సముదాయించును." ఐహికవిషయాసక్తి మన కున్నంతవఱకు భగవంతు డుదాసీనుడుగ నుండును. "భగవంతుడే కావలయును వే ఱేదియు వల" దను ఏకాగ్రత మనకు కుదిరినప్పుడు భగవంతుడు సన్నిహితు డగును. ఈసత్యమునకు శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర ముత్తమ లక్ష్యము.

దేవీసాక్షాత్కారానుభూతి గలిగిన పిమ్మట శ్రీరామకృష్ణుడు తఱచు సమాధిఅనబడెడి దశలో నుండెడివాడు. అన్నిటికంటె ఎక్కువగ 'సమాధి'నిగూర్చి చాలమంది అపార్థముచేసికొనుచుందురు. కేవలము బాహ్యలోకజ్ఞానమును గోల్పోవుటయో వింతదృశ్యములను గనుచుండుటో సమాధి కానేరదు. భగవదనుభూతి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలో దేనిలోనైన

గలుగవచ్చును. ఆ యనుభూతికి మార్గము భౌతిక దేహమే. సమాధిలో అట్లు కాదు. సాధకునకు దేహమునుగూర్చిన తలంపు అంతరించి- ఏటిలో ముంచిన కుండ పగిలినప్పుడు అందలి నీరు ఏటినేటితో ఏకమైనట్లు—జీవాత్మ విశ్వాత్మలో ఐక్య మొందుటే నిర్వికల్పసమాధి. ఆస్థాయి నధిరోహించినవారు సాధారణముగా శరీరస్మృతికి మరలిరా రని గురుదేవుడు వక్కాణించియున్నాడు. కాని అవతారపురుషులును జగదాచార్యులు నగు కొందఱు సమాధిస్థాయి నధిరోహించిన పిమ్మట లోకహితార్థము అపర మార్గసందేశమును జిజ్ఞాసువులకు వెదజల్లుటకై ఆశిఖరమునుండి అవరోహించి మామూలు సాయికి వత్తురు. "నిర్గుణబ్రహ్మములో లీనుడవు గాకుము. పారమార్థిక వ్యావహారికరంగముల నడుమ, పారమార్థికజ్ఞానద్వారమున 'భావముఖ'మున నుండు మని దేవి శ్రీరామకృష్ణు నాదేశించెను. తంత్రశాస్త్రము చెప్పిన ఆఱవఆధారమున ఆయన నిలువవలసినవాడయ్యెను. అందుండి ఆయన ఏడవఆధారమహిమనే గాక, క్రిందిస్థానములలో కుండలినీదివ్యావిష్కృతులనుగూడ కనగలిగెను. ఆసరిహద్దు నెలవునుండి ఆయన మెల్లగ నొకపరి ముందునకును ఒకపరి వెనుకకును అడుగిడుచుండును. లోకమాతయెడ భక్త్యావేశము, నెమ్మదిగ అద్వితీయబ్రహ్మసాగరమున మునిగియుండుట-అను ఈరెండనుభూతులును ఆయనకు దానివెనుక ఇది దీనివెనుక అదిగా మాటి మాటి కలుగుచుండినవి. ఈవిధముగ సగుణబ్రహ్మమునకును నిర్గుణబ్రహ్మమునకును శ్రీరామకృష్ణుడు ఏకత్వమును సాధించినాడు. అంతర్యామిబ్రహ్మమునకును సర్వవ్యాపిబ్రహ్మమునకును అభిన్నతను సాధించినాడు. లోకమున ప్రమాణగ్రంథముల కెక్కిన ఆధ్యాత్మికచరిత్రములో ఇట్టి అనుభూతి అపూర్వము.

బ్రహ్మ మొక్కటే సత్యము. తక్కినదెల్ల మిథ్య. బ్రహ్మానుభూతియే సమాధి. సమాధి సత్యమూలకమైనందున అది మూర్ఛరోగము వంటి రోగము కానేరదు.

ఆధ్యాత్మికానుభూతులవలన ఆయనజీవితములో కలిగిన పరిణతియే ఆయనభూతుల యాథార్థ్యమునకు కొలగఱ్ఱ. అందుచే నిరక్షరాస్యుడుగనుండిన పల్లెవాడు జ్ఞానిగ మార్పొందెను. ఆయనవాక్కులు శ్రోతలకును పఠితలకును జ్ఞానజ్యోతిని ఉత్సాహమును కలిగించుచున్నవి. ఆయనుభూతులవలన ఆయనకు మహిమవ్యక్తిత్వము కలిగెను. ఆయనకెదుట ఆకాలపు హేమాహేమీలు తమ్ము శిశువులనుగా భావించుకొనిరి. ఆయనకు కలిగిన విశ్వాసశక్తికి ముందు ప్రబలమేధానిధులు గడగడలాడుచుండిరి. "మీరు దేవుని జూచితిరా?" అను సవాలుప్రశ్న విమర్శకజిజ్ఞాసువగు వివేకానందుడు అడిగెను. ఇంచుకైనను వెనుబాటు లేక శ్రీరామకృష్ణుడు చెప్పిన జవాబు :— 'దేవుని నేను చూచియున్నాను, సదా చూచుచునే యున్నాను. నిన్ను చూచినంతకంటె స్పష్టతరముగ చూచుచున్నాను. నాచూపు మార్గము ననుసరింతువేని దేవుని నీకుకూడ చూపగలను. చాల చిక్కైన ప్రశ్నకు అది చక్కనిజవాబు.' ఆజవాబు ఆవిజ్ఞానిని సంతృప్తిపఱచి ఆయనకు శిష్యునిగ నొనర్చెను.

ఆయనకు కలిగిన ఆధ్యాత్మికానుభవములు ఆయనను జ్ఞానజ్యోతికిని ఆనందమునకును కేంద్రముగ నొనర్చినవి, ఆప్రభావము ఆయనను డాసినప్రతియొక్కనిని ముంచెత్తినది. జీవితమున ఎంతటిచిక్కులు కలిగినప్పుడును ఆయనుభూతుల ప్రభావము ఇంచుకైనను తగ్గ

లేదు. కంఠవ్రణముచే ఆయన మరణించె ననుట ఎల్లరును బాగుగ నెఱిగిన విషయమే. అంతటిసాధువునకు, అంతటిపరమపావనునకు అట్టిఘోరవ్యాధిబాధ ఏల కలుగవలె నను ప్రశ్న తఱచు అడుగబడుచుండును. విధినిర్ణయమునకు కారణము కనుగొనుట మానవులకు శక్యము గాదు. ఐనను జగదాచార్యుడగు శ్రీరామకృష్ణునికి కలిగిన శరీరబాధలు ఆయనకు కలిగిన ఆధ్యాత్మికసిద్ధిమహిమను చూపునవయ్యెను. సామాన్యమానవునకు దేహబాధ రవంత కలిగినను దేహమునుగూర్చిన తలంపు తప్ప వేఱేదియు నుండదు. అది అతని సిద్ధాంతాలను ధ్వంస మొనర్చును. అతనిని దుఃఖనిరుత్సాహములకు భాజనునిగ చేయును. శ్రీరామకృష్ణుని జీవితమందన్నన్నో ఆయన ప్రగాఢబాధల ననుభవించిన సమయమే ఆధ్యాత్మిక సమున్నతిని బ్రహ్మానందమును ఆయన అనుభవించిన కాలము. దేహము బాధలుపడినది. కాని ఆబాధ మనసును క్షోభిల్లచేయలేదు, విశ్వాసములను సడలింపలేదు. ఆధ్యాత్మికశిఖరారోహణానందమునుండి ఆయనకు చ్యుతిని కూర్పలేదు. ఆయన కుండిన యాధ్యాత్మికశక్తులు నిజమునకు మహోన్నతస్థాయిలో నుండిన దప్పుడే. అప్పు డాయన తన్ను సమీపించిన అసంఖ్యాకులజీవితములను మార్పొందజేసి వారిని ఆధ్యాత్మికప్రవణులనుగ జేసెను. ఆయనకు వైద్యము చేయుచుండిన డాక్టరుసర్కారు వట్టిసంశయాత్ముడు, హేతువాదపరుడు. ఆయన సైతము గురుదేవుని సంపర్కమహిమచే మాఱిపోయెను. సవాలుచేయుశిష్యుడగు వివేకానందుడు ఆయనసంకల్పముచే నిర్వికల్పసమాధి ననుభవించెను. సాధనమార్గములో శ్రమపడుచుండిన పెక్కండ్రు భక్తులకు ఆయన దనయాశీర్వాదముచే శాంత్యానందములను లక్ష్యసిద్ధిని సమకూర్చెను. తనయాదర్శముచేతను తనతోడిసంసర్గముచేతను ఆయన తనయాశయాలను దృక్పథమును మహోన్నతవంశసంజాతులును విద్యాసంపన్నులునగు నొకజట్టుయువకులలో నెలకొల్పెను. తత్ప్రభావమున వారు తమసర్వస్వమును త్యాగముచేసి పేదఱికమును వరించి గురుదేవుని అడుగుజాడలలో భగవదన్వేషణమును సాగింప సంసిద్ధులైరి. ఆభ్రాతృవర్గమునుండియే అనంతరకాలమున రామకృష్ణోద్యమము రూపుదాల్చినది.

కావున ఆధునికమానవతతికి పరతత్త్వము ను ప్రత్యక్షమొనర్చినవా డాయన.

శ్రీరామకృష్ణుని జీవితచరిత్రమునకు పీఠిక వ్రాయుచు గాంధిమహాత్ముడు ఆయనసందేశమును అనుభవాలను సరళమును సమర్థమును అగు వక్కణమున ఇట్లు పొందుపఱచెను. 'శ్రీరామకృష్ణునిజీవితచరిత్ర మనగా నిత్యానుష్ఠానమున ప్రదర్శింపబడిన ఆధ్యాత్మికధర్మమే. ఆయనజీవితచరిత్రము దేవుని మన ఎట్టయెదుట నిలుపును. ఆయనజీవితచరిత్రమును చదివిన ఎవనికిగాని బ్రహ్మ మొక్కటే సత్యము, తక్కిన దెల్ల మిథ్య అనెడి దృఢవిశ్వాసము కలుగక మానదు. భగవత్పరత శ్రీరామకృష్ణునిలో రూపుదాల్చినది. సంశయబహుళమైన యుగమిది. ఈకాలమున శ్రీరామకృష్ణుడు ఉజ్జ్వలసజీవవిశ్వాసమునకు లక్ష్యమై యున్నాడు. ఆ విశ్వాసము వేలకొలది మగువలకును మగవారికిని పరమనిర్వృతిని కూర్చుచున్నది. అది లేకుండిన ఆధ్యాత్మికమైన వెలుగే వారికి లేకుండెడిది.

# శ్రీరామకృష్ణతారావళి

శ్రీ తుమ్మూరి నరసింహరావుగారు

అంచితపుణ్యమూర్తి, విబుధార్చిత, బ్రహ్మవిదాంవరిష్ఠ, అ
భ్యంచితజీవయాత్రను నిరాధి సమాధిజితేంద్రియుండవై,
పంచవటీప్రదేశమున పావనమైన సమాధినిష్ఠలోఁ
గాంచితి వంతరాత్మను నఖండమమేయమునైన బ్రహ్మమున్.

ఓమహనీయతేజ, సుగుణోజ్జ్వల, పుణ్యయశోధనా, భవ
న్నామము విశ్వమానవమనః కుహరాంతర కశ్మలాంబుదో
ద్దామరవిప్రకాశసమధామము దిక్కులఁ దేజరిల్లుచున్
పామరపండితాగ్రణుల భక్తిరసాప్లుతులం బొనర్చెడున్.

ఓమహనీయతేజ, కరుణోదధి, మీకమనీయజీవితా
రామములో సుమించినవి రంజిలుభక్తి సుబోధపుష్పముల్,
క్షేమకరుండవై, సుజనసేవ్య తపోధనమండనుండవై,
ప్రేమను చాటినావు పృథివిన్ భవబంధ విమోక్షదీక్షమై.

పరమోదారము భక్తిపూరము భవద్వాక్యామృతాసార, మ
ర్వరసోత్తమ బోధనాపదవిలో రాణించు నీభావబం
ధుర బోధామృత మాని మానిరి నరుల్దుష్కార్యచాపల్య, మో
కరుణామూర్తి, నివారితార్తి, త్రిజగత్కల్యాణకీర్తీ, ప్రభూ.

నీమహనీయజీవితము నేలకు నింగికి పూజనీయమా,
నీమహనీయమూర్తి యవనీతలి నిల్చి చిరప్రసిద్ధమై,
నీమహనీయబోధలు పునీతమొనర్చును మానవాళిబా
ధామయకశ్మలప్రకృతి, ధర్మవినోది, గదాధరప్రభూ.

శాశ్వతధర్మరక్షక, విశాలమతీ, జగదేకపావనా,
విశ్వమతానుసారిపదవీప్రతిబోధకళావిచక్షణా,
ఆశ్వధిరూఢభూమిక, మహామహితాత్మ, జగద్గురూత్తమా,
విశ్వశుభంకరా, విదితవేద్య, భవాంబుధితారకోత్తమా.

గాఢధ్యానమహాబ్ధిమధ్యమున మున్గన్ లభ్యమౌరత్న స
ద్గూఢార్థంబులు భక్తలోకమునకు న్గోప్యమ్ముగా దంచువా
క్ప్రౌఢిన్ జాటుచు శిష్యవర్గమును జక్కందిద్దివైరాగ్యసం
లీఢాంతర్ముఖులం బొనర్చిన భవల్లీలన్ మదిన్గొల్చెదన్. 7

ఆసమ్మోహనమైన రూపమును, విద్యాప్రౌఢినిం జాటునా
యాసౌజన్యవచోవిలాసమును, శిష్యశ్రేణిపైఁజూపు నా
యాసౌశీల్యదయామయత్వమును, నాయా భక్తవాత్సల్య, మా
యాసాన్నిధ్య మహత్త్వముం-దలఁపరోమాంచమ్ముగల్గున్, ప్రభూ. 8

# స్వామిజి లేఖలలో గురుదేవుని ప్రశంస

శ్రీరామకృష్ణుని సరిగా అర్థముచేసికొనగల వారు కొలదిమంది, కొలదిమందిమాత్రమే. 1

ఆదర్శశాస్త్రము నాకు లభించినది. ఆదర్శ పురుషుని దర్శించితిని. 2

నిండుచున్నకుండ గుడగుడ మను శబ్దము చేయును. గాని, నిండినకుండ నిశ్శబ్దముగా నుండు నని మా గురుదేవుడు చెప్పుచుండెడి వాఁడు. 3

శ్రీరామకృష్ణుని నామజపము చేయువా డెవడైనను నీకు గురువే అని ఎఱుంగుము. 4

నా గురుదేవునిబిడ్డలు నాసేవ లందుకోవల సినవారు. ఈ విషయమునమాత్రమే నా కింకను కర్తవ్యశేష మున్న ట్లనిపించును. 5

తుదకు తేలిన గొప్పనిర్ణయ మిది:— శ్రీరామకృష్ణునకు సాటి లేరు. అపూర్వమైన ఆ పరిపూర్తి, ఆగి అర్హత పరికింపక అందఱి మీఁదికిని ప్రసరించు ఆ మహాద్భుత కరుణ, బద్ధ జీవులపట్ల ప్రగాఢమగు ఆ సానుభూతి – భువి నిం కెవరియందును లేవు. ఆయనే చెప్పుచుండి నట్లుగ ఆయన అవతారమైన కావలెను, లేదా, నిత్యపరిపూర్ణుడగు ఏ పరమపురుషునిగూర్చి 'ప్రజాయమాను' డనియు 'బహుధావిజాతు' డనియు వేదాంతము చెప్పునో ఆ పరమపురుషు డైన కావలెను. ఇది యెడలని సడలని నా విశ్వాసము. 'యోగిని ధ్యానించుటచేత గమ్యము చేరవచ్చు' నను సూత్రమున అట్టి పరమపురుషునుపాసనమునే పతంజలి చెప్పి యున్నాడు. ఆయన జీవితకాలములో నాకోరి కల నొక్కదాని నైన నిరాకరింప లేదు. కోట్ల కొలదిగ నా తప్పులను ఆయన క్షమించి యున్నాడు. నాయందు ఆయన కున్నంత మహా ప్రేమ నా తల్లిదండ్రులకు సైతము లేదు. ఈమాట అతిశయోక్తియు కాదు, ప్రౌఢో క్తియు కాదు, కేవలసత్యసూక్తి. ఆయన శిష్యులలో ప్రతియొక్కనికిని తెలిసిన విషయ మిది. గొప్పవిపత్తులు నాకు వాటిల్లినప్పుడు గొప్పవంచనలు నన్ను లోగొన్నప్పుడు మహా వ్యథతో విలపించుచు 'ఓ దేవా, నన్ను రక్షింపు' మని ప్రార్థించియున్నాను. కాని యెందుండియు సాయము లభింప దాయె, ఈయన మహాద్భుత యోగి కానిండు, అవతారము కానిండు,

ఏమైన కానిండు, ఈయన జీవులహృదయము లలో జొచ్చి చూడ గల తన దివ్యదృష్టిచే నా సర్వదుఃఖమును గుర్తించి నన్నిచ్చటికి రప్పించుకొని నేను వల దన్నను నా దుఃఖముం బోగొట్టెను... నేను కనుగొన్న యేకైక నిర్హేతుకకృపాసముద్రు డాయన 6

నా దేహము తిలతులసీదళసహితముగ శ్రీరామకృష్ణుని చరణములకు అర్పిత మనియు కావున నేను ఆయనకు దాసుడ ననియు మీ కీవఱకే తెలుపుకొనియున్నాను. ఆయన యాజ్ఞను నేను తలదాల్పకుండజాలను. జ్ఞానమందును భక్తియందును ప్రేమయందును సిద్ధులందును అతిమానుషోన్నతుల నధిగమించి నలువదేండ్ల కాలము కఠోరవైరాగ్యనిస్సంగతా పావిత్ర్యములను తపస్సాధనలను జరిపి ఆమహాయోగి తనప్రాణ మర్పించుటెల్ల వ్యర్థమే యగునేని ఇక మన కాధారము కాగల దేది కాని ఎం దున్నది? కావున ఆయన మాటలు పరతత్త్వముతో ఐక్య మొందినవాని మాటలుగా నమ్ముట నా కనివార్యము. తాను నెలకొల్పిన ఈ సన్న్యాసభక్తసంఘసేవకు నేను నన్నర్పించుకోవలె ననుటే శ్రీరామకృష్ణుడు నా కిడిన యాజ్ఞ. నాకు స్వర్గము కలుగనీ, నరకము కలుగనీ, మోక్షము కలుగనీ, వే ఱేది రానీ, అందుకు సంసిద్ధుడనై ఈ సంఘసేవయందు దీక్ష కలిగి యుండవలెను. 7

శ్రీరామకృష్ణుని అవతరణముచే వంగజాతి పవిత్రమైనది, వంగదేశము పావన మైనది. వాగాడంబర బాహ్యాపటాటోపయుతమైన పాశ్చాత్యసంస్కారవ్యామోహమునుండి భారతీయుల నుద్ధరించుటకే ఆయన అవతరించెను. అందుకే తన సన్న్యాసశిష్యులలో అత్యధిక సంఖ్యాకులను ఆయన విశ్వకళాపరిషత్తును చెందినవారినుండియే యెన్నుకొనెను. 8

ప్రాచీనకాలములో పెక్కుసదాచారము లుండినవి. సదాచారముల నుంచుకోవలెను. కాని భవిష్యద్భారతము ప్రాచీనభారతమున కంటె చాలగొప్పదిగ నుండవలెను. శ్రీరామకృష్ణు డవతరించిన దినమే నవ్యభారతాభివృద్ధికిని స్వర్ణయుగమునకును ప్రారంభదినము. 9

చరిత్రలో వచ్చు ప్రవక్త లందఱికంటె నూఱంత లెక్కువ పవిత్రుడగు తమగురువును కొందఱా రాధింతురేని, అం దేమి సేగియున్నది. క్రీస్తునుగాని కృష్ణునిగాని బుద్ధునిగాని ఆరాధించుట హానికరము గానప్పుడు పనులందు గాని తలంపులందు గాని అపవిత్రత ఎప్పుడును లేనట్టియు పాశ్చిమదృష్టి గల తక్కిన ప్రవక్త లందఱికంటెసహజబోధముచే అత్యధికతరమైన ప్రతిభగలట్టియు ఈయనను ఆరాధించుటవలన ఎట్టిహానియేని ఏల కలుగవలయును? మతములో సత్య మున్న దనుటే కాక ప్రతిమతమును సత్యమే అనెడి ఆశయమును మొట్టమొదట ప్రపంచమునకు తెచ్చినవా డీయనయే. 10

విశ్వాసము అద్భుత మగు నంతవరలోకనము. అది అద్వితీయతరణోపాయము. కాని యది పురోవృద్ధి నరికట్టు స్వమతదురభినివేశమును గలుగ జేయవచ్చును. అందలిప్రమాద మది. జ్ఞానము మంచిదే, కాని యది శుష్కవేదాంతముగా బరిణమింపవచ్చును. ఇది యిందలి ప్రమాదము. భక్తి దొడ్డదే, ఉదాత్తమైనదే, కాని యది నిరర్థకభావపరత్వమై నశింపవచ్చును. వలయునది వీనియన్నిటిసామరస్యము. రామకృష్ణు డట్టిసమరసమూర్తి. ఇట్టి మహనీయులు చాల అరుదు. కాని యీ మహనీయు నాదర్శముగా గొని – ఈతని యుపదేశములను ఆదర్శముగాగొని – మనము ముందున కేగ వచ్చును. మనలో ప్రతి

వ్యక్తియు నాతని పరిపూర్ణతను బొందజాలకపోయినను, అన్యోన్యలోపపరిహారమూలమున అన్యోన్యవ్యత్యయ సమీకరణమూలమున, అన్యోన్యాశయపూరణమూలమున సరుదుపాటు మూలమున నట్టి పరిపూర్ణతను సాధింపవచ్చును గదా. 11

రామకృష్ణునంతటి పరిపూర్ణుడైన వ్యక్తి మున్ను ఎన్నడును లేడు. అతని శీలవ్యక్తిత్వములనే మనము ఆశ్రయింపవలెను. మఱియు ప్రతివ్యక్తియు దన దృక్పథము ననుసరించి యాతని భగవంతునిగనో రక్షకునిగనో ఆచార్యునిగనో ఆదర్శమూర్తిగనో మహాపురుషునిగనో పరిగణింప మనము అంగీకరింపవలయును. 12

క్రొత్తకేంద్రము చేతనే ప్రాతమతమునకు మరల చైతన్యము కలుగును. అట్టి కేంద్రభూతుడు మానవరూపము దాల్చిన దేవుడు లోకమునకు మార్గమును చూపుటకై భారతదేశమున అవతరించెను. అతడే మహానుభావుడగు రామకృష్ణపరమహంస. 13

శ్రీరామకృష్ణునిజీవితము ఒక యసాధారణ జ్యోతి. దానివెలుగున హిందుసిద్ధాంతసర్వస్వమును నిజముగ నర్థము చేసికొనుటకు శక్యమగును. శాస్త్రములు ప్రతిపాదించు సిద్ధాంతజ్ఞానమున కంతటికిని దృష్టాంతమూర్తి ఆయనే. ఋషులును అవతారమూర్తులును నిజముగ దేనిని బోధింప గోరిరో దానిని ఆయన తన జీవితమున ప్రదర్శించెను. గ్రంథములు సిద్ధాంతములు. ఆ సిద్ధాంతములకు సిద్ధి ఆయనలోనే. మనదేశపు అయిదువేలేండ్ల ఆధ్యాత్మికజీవితమును ఆయన ఏబదొక్క-సంవత్సరములలో జీవించెను. 14

పరమహంస శ్రీరామకృష్ణుడు భగవంతు నవతారమే. ఆ విషయమున నాకించుకయు సందేహము లేదు. శ్రీకృష్ణభగవాను డవతరించెనో లేదో నిజముగ మనకు తెలియదు. బుద్ధ-చైతన్యుల యవతారములు విసుగు కలిగించును. అన్నిటికంటె కడపటిదియు పరిపూర్ణమైనదియు పరమహంసరామకృష్ణునవతారము. జ్ఞానము భక్తి త్యాగము ఔదార్యము మానవసేవాభిరతి - ఇవన్నియు కలిసి రామకృష్ణునిలో రూపుదాల్చినవి. కావున ఆయనకు సాటి ఎందున్నాడు? ఆయనను తెలిసికొనలేని వాని జన్మము వ్యర్థమే. జీవితకాలమునను అనంతరమును ఆయనకు నేను సేవకుడను. ఇదే నా మహాభాగ్యము. అన్ని వేదములకంటెను, వేదాంతములకంటెను నే నెక్కువగ ఆదరించునది ఆయన నోట వెలువడిన మాట, అదొక్కటైనను సరే. 'తస్యదాసదాసోహం' అతనికి నేను దాసదాసదాసుడను ... ఆయనపేరు విస్మృతిలో మునిగిపోయినను పోవును గాక. ఆయన ఉపదేశములు సఫలము లగును గాక. ఎందుకు? ఆయన, కీర్తికి దాసుడా? నిరక్షరాస్యులగు బెస్తలు కొందఱు జీససుక్రీస్తును దేవు డనిరి. చదువుకొన్నవా రాయనను జంపివేసిరి. బుద్ధుని జీవితకాలమున కొందఱు వైశ్యులును గొల్లలును అతనిని గౌరవించిరి. కాని శ్రీరామకృష్ణుని ఆయన జీవితకాలములో - పందొమ్మిదవ శతాబ్దచరమభాగమున - విశ్వకళాపరిషత్పట్టభద్రులైన దైత్యదానవులు దేవుడని ఆరాధించిరి... వారిని (కృష్ణ బుద్ధ క్రైస్తవ ప్రభృతులును) గూర్చి ఏవో కొన్ని విషయములు మాత్రమే గ్రంథములలో వ్రాసిపెట్టబడియున్నవి. మఱి శ్రీరామకృష్ణుని సన్నిధానములో మనము రాత్రింబగళ్లు కలిసియుంటిమి. అయినను వా రందఱికంటె ఈయన ఎంతో అధికుడైన మహాపురుషు డను నభిప్రాయము మనకున్నది. 15

శ్రీరామకృష్ణు డవతరించిన దినమే సత్యయుగమునకు ప్రారంభదినము. ఈయవతారములో నాస్తికాశయములు...జ్ఞానఖడ్గముచే రూపుమాపబడును. భక్తిప్రేమలచే సకలలోకమును ఒక్కటిగా చేయబడును. పైగా ఈయవతారములో రజస్సు (కీర్తియశఃకాంక్షమున్నగునవి) బొత్తిగా లేనే లేవు. అనగా గురుదేవునిబోధనల అనుసరించువాడు ధన్యుడు. గురుదేవు నీతడు అంగీకరింపకున్నను పరవా లేదు. మహిళల పరిస్థితిని బాగుపఱచిననే తప్ప లోకక్షేమప్రాప్తికి అవకాశము లేదు. ఒక్కరెక్కతో ఎగురుట పక్షికి సాధ్యముకాదు. శ్రీరామకృష్ణుడు ఒక మహిళను తన కాచార్యగా స్వీకరించుటకును సాధనల కాలమున స్త్రీవేషమును తాల్చుటకును స్త్రీచిత్తవృత్తిని ఆవహిల్ల చేసికొనుటకును, మహిళలందఱును లోకజనని ప్రతిరూపములు, మాతృత్వమహితలు అని ఆయన ఉపదేశించుటకును – ఇదే కారణము. 16

శ్రీరామకృష్ణుని జీవితప్రభావమును గ్రహింపక ఎవ్వరును వేదములను వేదాంతమును అవతారములను మఱేయాధ్యాత్మికవిషయములను గ్రహింపజాలరు. ఏలయన, ఆయనయే వ్యాఖ్యానము. ఆయన అవతరించిననాటినుండి సత్యయుగ మారంభమైనది. ఇక ముందు వివిధభేదములును కడముట్టును. చండాలుని వఱకు ఎల్లరకు దైవీప్రణయమున పాలుండును. స్త్రీపురుషు లందుగల వ్యత్యాసములను ధనవంతులకును నిరుపేదలకును గల భేదములను విద్వాంసులకును విద్యాగంధము నెఱుగనివారికిని గల తేడాలను, బ్రాహ్మణులకును చండాలురకును గల విభిన్నతలను సమగ్రముగ తొలగించుటకే ఆయన జీవించినది. ఆయన శాంతిదూత. హిందూమహమ్మదీయులనడుమను, హిందూక్రైస్తవులనడుమనుగల వ్యత్యాసములు విస్మృతిలో మునిగిపోయెను. ఈ విభేదములను గుఱించి ఈవరలో పోరపొచ్చెములు చెలరేగుచుండెడివి. అవి కడచినయుగమునకు సంబంధించినవి. ఈ సత్యయుగమున శ్రీరామకృష్ణుని ప్రణయప్రవాహము ఎల్లవిభేదములను ముంచివేసినది, ఇప్పుడెల్లరును ఏకైకస్నేహసూత్రమున గ్రువ్వబడియున్నారు. 17

పరమహంస శ్రీరామకృష్ణుడు ఎట్టి నూతనసత్యమును గాని బోధించుటకు అవతరింపలేదు. సనాతనసత్యములను వెలుగులోనికి తెచ్చుటకే ఆయనయవతారము. అనగా సనాతనభారతీయాధ్యాత్మికభావతతి ఆయనలో మూర్తీభవించినది. శాస్త్రముల నిజమైన యర్థమును ప్రాచీనశాస్త్రముల పదకమును అవధులను నాకర్థమగునట్లు చేసినది ఆయనజీవితమే. 18

దేనినిగాని మాటతో పోనీయక అనుష్ఠానమున నెలకొల్పుకొనవలెననుకోరికయుఅందుకై బ్రతికినన్నినాళ్లుప్రయత్నించుదీక్షయునే శ్రీరామకృష్ణుడు మాకిచ్చిన గొప్పవరములు. ఈనాడు భారతదేశము మా గురుదేవుని అర్థము చేసికొనుచున్నది. ఆరాధించుచున్నది. ఆయన బోధించిన సత్యములు దావాగ్ని జ్వాలలవలె వ్యాపించుచున్నవి. పదేండ్లకు మునుపు ఆయన జయంతిమహోత్సవమునకుఒకవందమందినైనను నేను సమావేశపఱుపజాలకుంటిని. క్రిందటి సంవత్సరము ఆ ఉత్సవమునకు ఏబదివేలమంది ప్రజలు సమావేశమైరి. 19

శ్రీరామకృష్ణుడు భారతదేశమునకు మాత్రమేనా రక్షకుడు? ఈ సంకుచితభావమే భారతదేశవినాశమునకు కారణము. దానిని నిర్మూలింపకుండు నంతవఱకు భారతదేశమునకు క్షేమము అసాధ్యము. 20

పరమహంసదేవుడు ఒకఅవతారము అని ఎవడేని అంగీకరించిన సరే, అంగీకరింపడేని అదియు సరియే. నిజము ఏ మనగా – పరమహంస దేవుడు, గుణమును శీలమునుబట్టి పూర్వులనందఱిని మించిపోవును. ఉపదేశవిషయమున సకలపూర్వులకన్న ఉదారతరుడు. నూతనమార్గము త్రొక్కు ప్రతిభ ఎక్కువగగలవాడు, ఎక్కువపురోగామి. పూర్వాచార్యులందఱు ఒక్కపక్షమును అవలంబించినవారు. ఈ క్రొత్తయవతారముయొక్క బోధన, ఈ క్రొత్తయాచార్యునియొక్క బోధన మిది — యోగభక్తిజ్ఞానకర్మలన్నింటిలోను ఏది యుత్తమమో దానిని కలిపి యిపుడొక క్రొత్తసంఘము నేర్పఱుపవలయును. ప్రాతవి బాగుగనే ఉండినవి, సందేహము లేదు. కాని యీనాల్గింటిసమ్మేళనము, భక్తిజ్ఞానములను ఎల్లవారికి, అత్యధములకుకూడ, స్త్రీపురుష భేదములేకుండ, ప్రచారము చేసి పర్వించుట- ఇది ఈకాలమునకు తగినది, క్రొత్తమతము. పూర్వావతారము లన్నియు సరియైనవే, మఱి అవి అన్నియు రామకృష్ణునియందు మేళనము బొందినవి. 21

స్మృతులును పురాణములును పరిమితజ్ఞానులగు మనుష్యులు వ్రాసినవి. వానిలో హేత్వాభాసములు ప్రమాదములు జాతిద్వేష (దోష)ములు అసూయాద్రోహచింతలు నిండియున్నవి, వానిలో హృదయౌదార్యప్రేమలతో నిండిన కొన్నిభాగములే ఉపాదేయము లగును, తక్కినవి పరిహరింపదగును. ఉపనిషత్తులును భగవద్గీతయుమాత్రమే నిజమునకు పవిత్రగ్రంథములు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, చైతన్యుడు, నానక్కు, కబీరు మొదలగువారే నిజమునకు అవతారమూర్తులు. ఏలన వారిహృదయములు ఆకాశవిశాలములుగా నుండినవి. ఇక అందఱికి పైవాడు రామకృష్ణుడు. రామానుజ శంకరాదులు వట్టిపండితులుగను సంకుచిత హృదయులుగను చూపట్టుదురు ఏదీ ఆ ప్రేమ, ఇతరుల దుఃఖముల గాంచి కరగి యేడ్చు ఆ హృదయము ఏదీ? వట్టిశుష్కపాండిత్యపు బడాయి. తాను ఒక్కడే మోక్షము నొందుదునను గడబిడ! అది సాధ్యమా? సాధ్యమై ఎప్పుడైన నుండెనా, ఇక నుండబోవునా? ఏ విధమైన అహంభావపుజాడయైనను మిగిలియున్నచో దేనినేని ప్రాపింప శక్యమగునా? 22

# శివానంద స్మృతులు — 33

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరు మఠము, క్రీ. శ. 19-3-1929, మంగళవారము.

పూజనీయ మహాపురుషులశరీర మంతగ బాగుగలేదు. శ్రీరామకృష్ణుల సర్వజనసాధారణోత్సవము రెండుదినములకృతము మహావైభవముతో ముగిసెను. ఆదినము సుమారు 1½ లక్షలప్రజలు ఉత్సవమున పాల్గొనిరి. శ్రీ మహాపురుషుల దర్శనార్థమై అసంఖ్య స్త్రీ పురుష భక్తులు ఉదయమునుండి రాత్రివఱకు నిరాటంకముగ వచ్చి కృతార్థులైరి. శ్రీవారిఆరోగ్యము అంతగ సరిగ లేకున్నను, దైవబలాన్వితులై, ప్రసన్నవదనులై భగవాన్ శ్రీరామకృష్ణుని గూర్చి పెక్కువిషయముల అనర్గళముగ ఎల్లరతోడను చెప్పదొడంగిరి. భక్తులఅంత రాళముల..

ఆనందవాహినిని ప్రవహింపజేసిరి. ఆనాటి శ్రమ మూలమున వారిఆరోగ్యము మఱింత చెడెను. కాని వారిమనస్సు సర్వదా ఆనందసాగరమున నోలలాడుచుండెను.

నేడు ఉదయము మొదలుకొని, మఠము లోని సాధుబ్రహ్మచారులు వచ్చి మహాపురుషులగదిలో గుమికూడిరి. స్వామివారు వారల క్షేమసమాచారముల నరయుచుండిరి. అట్టితఱి ఒకసాధువు చినిగినవస్త్రము ధరించియుండుటను గుర్తించి, వెంటనే ఒకసేవకుని పిలువనంపి, ఆసాధువునకు ఒకనూతనవస్త్రము సమర్పింపవలసిన దని ఆజ్ఞాపించి ఇట్లనిరి–''సాధువులకు ఏమేమి అవసరమో మీరు గుర్తింపజాలక పోతిరికదా!''

ఇంతలో ఒకవృద్ధసన్న్యాసి గదిలో ప్రవేశించెను. వారిని చూచుటతోడనే మహాపురుషులు–''ఓం నమ శ్శివాయ: జయమా!'' అనుచు వారికి స్వాగతము చెప్పిరి. మాటల సందర్భమున దక్షిణేశ్వరవిషయము వచ్చెను. నవదీక్షితులగు సన్న్యాసులు బ్రహ్మచారులును, నేడు దక్షిణేశ్వర కాళికాదేవిని దర్శింపబోవుదు రనియు,—దినమంతయు అచ్చటనే-సాధనభజనలతో గడప సంకల్పించి రనియు - ఆలయధర్మకర్తలు నేడు ముప్పదిమంది సాధువులకు దేవీ ప్రసాదమును భోజనముపెట్టింతు రనియు చెప్పెను. ఇదంతయు విని శ్రీమహాపురుషులు ఆనందమున ఉప్పొంగుచు ఇట్లనిరి–దక్షిణేశ్వరము మనకు భూలోకస్వర్గము సుమా! మనకు అదే కైలాసము, అదే వైకుంఠము–అదేమి తీసిపోయిన చిన్నస్థలమా ఏమి? పంచవటి మహత్తరమగు సిద్ధపీఠస్థానము. పంచవటిమూలమున శ్రీపరమహంసలవారికి ఎన్నెన్నిదివ్యానుభూతులు కల్గినవి! శ్రీరామకృష్ణులు ఎడతెగక, పంద్రెండుసంవత్సరముల పాటు, సకలమతముల–సమస్తసంప్రదాయముల ననుసరించి, కఠోరసాధనలను–తపస్సును కావించిరి, అచ్చటనే లెక్కకుమిక్కుటమగు దివ్యదర్శనములగాంచిరి–పెక్కుదేవతల సాక్షాత్కారమునుబడసిరి. ఇవన్నియు లెక్కింపశక్యముకాదు. శ్రీరామకృష్ణులు చేసిన కఠోరసాధనలవంటి సాధనలుగాని–పరస్పరవిరుద్ధములవలె తోచు–భిన్నములగుమతములను, సంప్రదాయముల ననుసరించి–ఆయామతముల తాదాత్మ్యము పొందుటకాని వేఱొకఅవతారపురుషుని జీవితమున గానరాదు. వేయేల? సర్వమతచరిత్రల గాలించినను, ఇట్టిఉత్కృష్టవివిధమత సాధనానుభూతుల బడసినట్టివాడు ఉదాహరణమునకైనను ద్వితీయ మహాపురుషుడు కానరాడు. శ్రీరామకృష్ణులు తఱచు ఇట్లు పల్కెడివారు ''ఇక్కడి (తన్ను ఉద్దేశించి చెప్పుచు) అనుభూతులన్నియు, వేదవేదాంతములనెల్ల అతిక్రమించినవి.'' వీనినెల్ల గుర్తించియేకదా వివేకానంద స్వామి శ్రీరామకృష్ణుల ''అవతారవరిష్ఠు'' లని కీర్తించినది! శ్రీ రామకృష్ణులు శ్రీబృందావనమృత్తికను కొని తెచ్చి, పంచవటిప్రదేశమందు చల్లిరి. దక్షిణేశ్వరమందలి ప్రతిధూళిరేణువుసైతము కడుపవిత్రమైనది. స్వయముగ శ్రీభగవానుల (రామకృష్ణ) చరణస్పర్శచే అది మహాతీర్థమై వెలసినది. అద్వైతవాదులకేమి, ద్వైతవాదులకేమి, శాక్త వైష్ణవ శైవ తాంత్రిక ప్రముఖ సమస్త సంప్రదాయక సాధకులకు దక్షిణేశ్వరము మహాపీఠము. ఎందుచేత ననగా, పైని పేర్కొనబడిన సర్వసంప్రదాయ భావముల ననుసరించి, శ్రీరామకృష్ణులు సాధనల కావించి, సిద్ధి నొందిరి. ఈమాఱు శ్రీభగవానుడు తనశుద్ధసాత్త్వికభావమును ఆశ్రయించి భూమిపై అవతరించెను.

స్వయముగ ఆద్యశక్తి, సమస్తవిశ్వబ్రహ్మాండ మునకు ఆధారభూతురాలగు, ఆజగజ్జననియే,

రామకృష్ణునిశరీరమును ఆశ్రయముగ కైకొని లీల సల్పెను! శ్రీరామకృష్ణుని అలౌకికతపస్సుద్వార కేవలము ఈభూమండలము నకేకాక, భూరాది చతుర్దశ భువనంబులకును మేలొనగూడెను. ఆహా! ఆశక్తిస్వరూపిణి యొక్క లీలానాటక మెట్టిదో తెలిసినదా! అని పల్కుచు-చేతులు జోడించి తల వంచి-నమస్కరించుచు-శ్రీమహాపురుషులు గంభీర ముగ నుండిరి. వారు మాటలాడుచుండిన తటి వారిముఖము దేదీప్యమానమై వెల్గెను.

మధ్యాహ్నము భోజనముచేయుచున్నసమ యమున ఒకసన్న్యాసి శ్రీమహాపురుషులకడకు వచ్చి నమస్కరించి "మీఆరోగ్య మెలాగున్న దని" ప్రశ్నించెను. మహాపురుషులు నిశ్చేష్టులై సన్న్యాసివైపు కొంతవడి చూచు చుండిరి. అటుపై నిద్రనుండి లేచినవానివలె తటాలున ఉలికిపడి, మెల్లమెల్లగ ఇట్లనిరి- "ఓ! ఈ శరీరారోగ్యముగూర్చి అడుగు చున్నావా? ఈ శరీరము సడలిపోవుచున్నది. ఎప్పు డేమగునో ఎవ రెఱుగుదురు? ఇకమీద మీరెల్లరును శ్రీరామకృష్ణుని కార్యకలాప ములగూర్చి సక్రమముగ తెలిసికొనియుండుట మంచిది. ఈమాఱు శ్రీభగవానులు సెలవు నొసంగు నని తోచు చున్నది. ఒంటిలో ఏమియు సత్త లేదు, ఇసుమంతయు బలము లేదు, కాని మనోబలము దినదినప్రవర్ధమాన మగుచున్నది. నేను ప్రస్తుతము నిర్వాణపు అంచున నిల్చియున్నాను, ఎదురుగ ఆ అనంత ధామము, దృగ్గోచర మగుచున్నది. నాపై కరుణ చూపి భగవానుడు మెల్లగ తెరను తొలగించుచున్నాడు. నిర్వాణమార్గమును తేటపఱచుచున్నాడు. శ్రీభగవానులు సమస్త మును చూపిరి-పరిపూర్ణము కావించిరి (కండ్లు మూసికొని) ఇక ఈశరీరము ఉండనీ, పోనీ— వారిఇష్టము.

సన్న్యాసి:—స్వామీ, ఇదేమి, మీరు ఈలాగు పల్కుచున్నారు? బహుజనకల్యాణా ర్థము, ఈసంఘకల్యాణార్థము శ్రీభగవానులు, మిమ్ముల ఇంకను కొంతకాలము పాటు, తప్పక ఉంచెద రనియే మాదృఢవిశ్వాసము. మీరు ఎక్కువగ అలసిపోవుచున్నారు. అందుచేతనే మీశరీరము ఎక్కువగ చెడుచున్నది. మీకు అలసట కలుగకుండ చేయుటకే మే మెల్లరము ప్రయత్నించుచున్నాము. మీశరీరము ఉన్నంత కాలము పెక్కురకు మేలు చేకూరును. మేమును నిశ్చింతగ ఉండగలము.

శ్రీమహాపురుషులు - ఈవిషయము నేను బాగుగ ఎఱుగుదును. మీరందఱు నన్ను ఎక్కువగ కోరుచున్నారు అని నేనుకూడ మీబోటిసాధువులతోడను, భక్తులతోడను ఆనందముగ దినములు గడపుచున్నాను. ఇంతియేకాక ఇంకొకవిషయము నాకు బాగుగ తెలియును. అ దేమన ఈ శరీరముమూలముగ ఎంతపని జరుగవలసియున్నదో దానినంతయు ఏదో ఒకవిధముగ చేయించుకొనియే తీరును కాని దానికిముందుగ శ్రీభగవానుడు విడు వడు. ఒక్కొక్కపుడు ఇలాగు అనిపించును: ఈ శరీరమును దేవుడు ఇంకను ఎందులకు ఉంచినాడు అని. వాని ఉద్దేశ్య మేమో కలదు. లేకున్న ఇంతటి ఆర్భాట మేల ఈ శిథిలమైన శరీరముతోడ? నాకా, విద్యాబుద్ధులు లేవు, వాక్పటుత్వము లేదు, అటులయ్యు ఈ భగ్న శిథిలయంత్రముద్వారా ఎంతపని జరిపించుకొనుచున్నాడో చూడుడు!

ఈ ప్రసంగమునుండి మహాపురుషుల మనస్సును మరలించు ఉద్దేశ్యముతో సన్న్యాసి వెంటనే వేఱొక విషయము లేవనెత్తెను.

''గంగాధరమహారాజు (అఖండానంద స్వామి)గారిని ఇచ్చటికి కొనివచ్చుటకుగాను ముగ్గురు మనుష్యులు పోయియున్నారు.''

మహాపురుషులు - ఆహా! గంగాధరమహారాజు వచ్చినచో ఎంతయో బాగుండును. (శ్రీ)పరమహంసకు చెందిన వాడుకదా, చూచినంతమాత్రముననే చాల ఆనందము కల్గును. అతడు ఇక్కడికి అంతగా రాడు. ఎవరైన గట్టిపట్టుపట్టి తీసికొని రావలసినదే. నేడు సుబోధానందస్వామి వచ్చుచున్నాడు. అయ్యో! వాని ఆరోగ్యము చాల చెడినది!...నీ భోజనమైనదా?

సన్న్యాసి - లేదండి! ఈ దినము ప్రొద్దుననుండి మీవద్దకు రావలెనని ఎంతో ప్రయత్నము చేయుచుంటిని. కాని సమయమునకు తీరిక చూచుకొని రాలేక పోతిని. ఎప్పుడు చూచినను మీయొద్ద చాలమంది గుమికూడి యుండిరి.

మహాపురుషులు - మంచిది, జాగుచేయకు, వెళ్ళి భోజనము చేయుము.

ఆ సన్న్యాసి వారివద్దనుండి వెడలిపోయిన పిదప (శ్రీ)మహాపురుషులు కండ్లు మూసికొని తనలోతాను ఇట్లు పలుకదొడంగిరి. ''ప్రభూ, ఎల్లరకును మేలొనకూర్పుము. అందఱికిని చైతన్యము కల్గునట్లనుగ్రహింపుము.''

మహాపురుషుల భోజనము ముగిసెను. తనకు తాను ఆసనమునుండి లేచుట చాల కష్టము. అందుచే సేవకుడు ఎంతో జాగ్రత్తగ (శ్రీ)వారిని లేవదీసెను. వారు మెల్లగ కుర్చీపై కూర్చుండిరి.

మహాపురుషుల గదికి ఎదురుగ ఒక సన్న్యాసి కూజానుండి నీరుతీసికొని త్రాగుచుండెను. మహాపురుషులు వాని వంక చూచి ఓ నీవా? నీవు ఈమాఱు వెళ్ళుచున్నావా ఏమి?

సన్న్యాసి - ''అవునండీ! పైగురువారము పోవలెనని'' అది విని నిట్టూర్పు విడుచుచు శ్రీమహాపురుషులు ఈలాగుపల్కిరి. ''అటులేని వెళ్ళుము. అందఱును వెళ్ళిపోవుదురు. ఈ ప్రపంచము అనిన ఇంతేకదా! రెండుదినాల పాటిది ఒకటిగ కలసిమెలసి యుండుట! అటుపై ఎవరికి వారే! ఒక్కపరమానంద స్వరూపిణియగు తల్లియే సత్యము-మిగిలినవారు రెండుదినాలపాటివారు! ఈసృష్టి, ప్రవాహామువలె, నిరంతరము ఎడతెగక ప్రవహించుచునే యున్నది. దానికి విరామమే లేదు. ఈ సృష్టికి వెలుపలి నిత్యానందదాయిని ''అమ్మ'' యున్నది. ఆమె మనోవాక్కులకు అతీతురాలు!

''యతో వాచో నివర్తనే ప్రాప్య మనసా సహ'' (తైత్తిరీయోపనిషత్తు 2-4-1)

## 36

రామకృష్ణ అద్వైతాశ్రమము
లక్స, వారణాసి
ఉత్తరప్రదేశ్
23 ఏప్రిలు 1913

ప్రియ—,

చిరకాలమునకు వచ్చిన నీ జాబును చూచుకొని మహానందము చెందితిని. కోపముచే నీకు నేను జాబు వ్రాయలేదని వ్రాసియుంటివి. అది నిజము కాదు. కోపించుటకు కారణమే లేదే. నాకు మంచి దని తోచినదానిని వ్రాసితిని. అందుకు నీ వాయాసపడకు. మే మింకను ఇచటనే యున్నాము. ఉత్సవదినాలలో మే మందఱము ఇచటనే యుంటిమి. శ్రీ బ్రహ్మానందస్వామి ఈదినమే బేలూరుమఠమునకు తరలుచున్నారు. నేనును తురీయానంద స్వామియు ప్రస్తుతమున కిచ్చటనే యుందుము. పిమ్మట కంఖాలుకు మరలిపోవుదు మేమో.

ప్రాపంచికములైన చిక్కులు నీకెంత గలిగిన భగవంతుని జ్ఞప్తియు అంతగాకలుగుచుండును. దేవునిగూర్చి నీవు భావించినకొలది ధ్యానించిన కొలది ఆయన నీ ఐహికబంధములను త్రెంచి నిన్ను చేరదీసికొనును. ఇది ముమ్మాటికి నిజము. ప్రాపంచిక క్లేశములే భగవద్భక్తిని కలిగించునవి. భక్తులు భగవంతునొద్దకు పురోగమించుట ఆవిధముగానే. తొందరపడి సన్న్యసించినవారిలో త్యాగము, విశ్వాసము, విశ్వప్రేమ అనునవి యించుకేని అంకురించియుండవు. అప్పటికుండిన కొంచెపాటి భక్తియు కొన్నాళ్ల కెండుకొని పోవును. అంతట వారు మునుపటికంటె రెండింతలుగాను, మూడింతలుగాను సంసార నిమగ్నులై మునుగుచు నీదులాడుచుందురు. అలాగు కాకుము. లోకమున జీవితమును గడపుచుండుము. విహితకర్తవ్యములను నిర్వహింపుము. నీ యోగక్షేమభారమును పూర్తిగా భగవంతున కర్పింపుము. అట్లు చేసిన కాలక్రమమున నీప్రేమవిశ్వాసములు సుదృఢతరములగును. నీయాధ్యాత్మికజీవితము ఇటికతోను సిమెంటుతోను కట్టిన భవనమువలె ఎప్పుడును ఏస్థితియందును చలింపకుండును. గట్టిగా నమ్ముము.

ఇంక నేమి వ్రాయదును? నీకు నాప్రేమాశీస్సులు. నీక్షేమమునుగూర్చి అప్పుడప్పుడు జాబులు వ్రాయుచుండుము. నా ఆరోగ్యము ఒకరీతిగ నున్నది. బాగున్నదనలేము. బాగులేదనలేము. ఇక్కడ ఎండలు ఎక్కువగుచున్నవి. కంఖాలులో ఇప్పుడు కొంత చల్లగ నుండును.

నీశ్రేయోభిలాషి
శివానంద

## 37

రామకృష్ణమిషను సేవాశ్రమము
పోస్టుకంఖాలు, జిల్లాసహారన్పూరు
ఉత్తరప్రదేశ్
2 జూన్ 1913

ప్రియ—,

నీజాబు చేరినది. నీ విప్పుడు చేయుచున్నట్లే గురుదేవుని (శ్రీరామకృష్ణుని) పూజను ప్రతిదినము సాగించుచుండుము. విధానాంతరములకు ఆవశ్యకత లేదు. వైధీభక్తి (=బాహ్యపరికరములచే పూజాద్రవ్యముచే కలుగు క్షణికమగు ఆచారార్థమైన భక్తి)కంటె రాగభక్తి (=దేవుని దర్శింపవలె నని తహతహపడుచు

ప్రగాఢాసక్తి సహజప్రేమ) శ్రేయము. గురు దేవునిమూర్తి కెదుట పూజాద్రవ్యములను విశుద్ధచిత్తముతో అమర్చిపెట్టి భక్తితో హృదయపూర్వకముగ "వీనిని చిత్తగింపు" మని ప్రార్థించిన చాలును. మఠములో మే మనుసరించుక్రమ మదే. ఆయన నామజపము, ధ్యానము, కథామృతపారాయణము, నామ సంకీర్తనము భక్తులతో ఆయనవిషయములనే ముచ్చటించుట వీని నన్నిటిని నీవు చేయుదు వేని నీకు శాంతి కలుగును. భగవంతుడు నీపై అనుగ్రహమును వర్షించును. నిజమునకు భగ వంతునికృప కలుగలేదే యని తహతహపడుట మంచిదే. ఆ తహతహపాటు లేనిదే భక్తుడు భగవంతునొద్దకు పురోగమించు టెట్లు? ఎవని కింకను విశుద్ధి కలుగ లేదో, ఎవనిమనస్సు ఐహికసుఖములకై ఆత్రపడునో, అది రవంత కలుగగనే సంతృప్తిచెందునో, భగవంతుని కృప కలుగనందులకు ఎవడు మనోవ్యథ చెందడో అతని కింకను భగవత్ప్రేమభక్తి శ్రద్ధాసామ్రాజ్యములోనికి ప్రవేశించు కాలము రాలేదని గ్రహింపవలయును. భగవద్విరహ ముచే భక్తునకు కలుగు తహతహపాటే భగవద్రాజ్యములోని కతడు చొచ్చుకొనుటకు సాధనము.

అక్కడనే నీవు ప్రేమానందస్వామిని దర్శిం చితివి కదా. నిజముగ నీ వెంతో అదృష్ట వంతుడవు. నిజముగ ఆస్వామి శ్రీరామకృష్ణ మయుడు. ఆయనప్రేమకు నీవు భాజనుడ వయితివి. నీపట్ల దేవు నను గ్రహమునకు ఇది స్పష్టమైన తార్కాణము.

ఇక్కడినుండి మేము బెంగాలుకు ఎప్పుడు మరలి వత్తుమో నాకు సరిగా తెలియదు. దేవుని సంకల్పము నెఱవేఱుగాక. నీ క్షేమమును గూర్చి అప్పుడప్పుడు వ్రాయుచుండుము. నా దేహస్థితి ఒకప్పుడు బాగుండును. ఒకప్పుడు బాగుండదు. ఎట్లో కాలము గడచుచున్నది. నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. కొన్నాళ్లలో నేను అల్మోడాకు తరలవలసి యుండునని తోచుచున్నది.

సీ శ్రేయోభిలాషి
శివానంద

## 38

చిల్కాపేటహౌసు
అల్మోడా, ఉత్తరప్రదేశ్
12 జూలై 1913

ప్రియ——,

నీజాబు చేరినది. ఇక్కడికి రావలె నను ఉద్దేశము నాకు లేనే లేదు. ఆకస్మికముగా రావలసివచ్చినది. సమస్తము ఈశ్వరేచ్ఛ. శ్రీరామకృష్ణకథామృతములో నీవు పాల్తు అనువానినిగూర్చి చదివియుందువు. అతనికి కొడు కొక్కడే. కొడుకునకు వయస్సు పందొ మ్మిదిసంవత్సరములు. విద్యార్థులలో అతడు ప్రతిభాశాలి. దురదృష్టవశమున అతనికి చాల జబ్బుచేసినది. కావున పాల్తు తనకుమారుని తోను భార్య సోదరి మేనల్లుడు మొదలుగా కుటుంబమున నున్న యితరులతోను గడచిన ఏప్రిలు నెలలో ఇక్కడికి వచ్చినాడు. కల్కత్తా లోని వైద్యనిష్ణాతులు ఇక్కడికి పొమ్మన్నా రట. అతడిక్కడ ఒంటరిగ నున్నాడు. అతనికి వేఱుకార్యక్రమ మేదియు లేదు. చాల కష్ట ములతో అతనికి దినములు గడచుచుండినవి. కావున కంఖాలులో నున్న నన్ను ఇక్కడికి రమ్మని జాబు వ్రాసినాడు. శ్రీరామకృష్ణుని గూర్చిన సంభాషణలద్వారాను శాస్త్రవిష యిక చర్చలద్వారాను అతని భయములను పోగొట్టి ప్రేమవిశ్వాసములను వర్ధిల్ల జేయ

ప్రయత్నింత మని నాయుద్దేశము. అందుకై నేను జూను 16 వ తేదీ ఇక్కడకు వచ్చితిని. దైవకృపవలన వారి పరిస్థితి యించుక మెఱుగుగా నున్నది. శాలునిస్థితిలోను రవంత మేలిమి కనన గుచున్నది. అతడును చాల భక్తిగలవాడే.

నీవు క్షేమముగా నున్నావని తెలిసినది. చాల సంతోషము. అట్లుగాక మఱొకరీతి ఎట్లుండ గలదు? ఎవరిని శరణుపొందియున్నావో ఎఱుగుదువు గదా. ఆయన యుగావతార మూర్తి, మహోజ్జ్వలుడు, ప్రబుద్ధుడు, కలియుగమానవుల నుద్ధరింప మానవరూపమున నవతరించిన సాక్షాత్సర్వేశ్వరుడే. ఆయన సముద్ధరణశక్తిప్రభావము భూమండలమున నలుమూలలలో స్పష్టముగ కనవచ్చుచున్నది. ఆ ప్రభావము ఇంకెంతకాలము చెల్లుచుండునో ఎఱుగము. ఆయనను శరణుజొచ్చితివి గావున నీకు క్షేమము కలుగక తప్పదు. ఇది కేవలము ప్రారంభదశ. ఇంకను ఎంత అభివృద్ధి నొందుదువో పిదప నీకే తెలియును. నిజమునకు నీవు పూర్తిగా ఆయనపై ఆధారపడియుందువేని యథార్థానందము నందుదువు. "ఆయనను శరణుజొచ్చితిని. ఆయనకు దాసుడను. ఆయన బిడ్డను. నేను వ్యథ చెందు టెందులకు? నా సంరక్షణము నెఱవేఱిపోయినది. ఆయనను శరణుజొచ్చిన నాకు ఇక నేమి భయము?" అను నిట్టి తలంపు నీమనసున సదా వెలుగొందుచునుండనిమ్ము. ఇంకను ఇట్లు తలంపుము. "ఆయన ప్రత్యక్షశిష్యులకు, శిష్యులకు నాపై ప్రేమ. వారు నాకు బోధించుచున్నారు. హృదయపూర్వకముగ నన్నాశీర్వదించుచున్నారు. ఇక నా కేమి భయము?" నీమనస్సున ఇట్టి తలంపులు సదా నిండియుండనిమ్ము. ముఖ్యముగ భక్తిప్రేమశ్రద్ధలు ఇంచుక సడలుచున్నట్లు నీకు తోచినప్పుడు ఈ తలంపులను మనసునకు తెచ్చుకొందువేని ఆ ప్రేమభక్తిశ్రద్ధలు నూఱంతలుగ సంజీవితము లగును. ఆసపాటును శాంతియు ఆనందమును నీ హృదయమున నిండును. నీ హృదయాభీష్టమును సర్వేశ్వరుడు సఫల మొనర్చుగాక యని హృదయపూర్వకముగ నాశీర్వదించుచున్నాను.

సంవత్సరమున కొకసారి ఉత్సవము చేయుట మంచి దనుటకు సందేహము లేదు. కాని నా అభిప్రాయ మేమనగా ఏకాభిప్రాయులగు మీరు కొందఱు మీ అనుకూలముల ననుసరించి, ప్రతిదినము కాకపోయినను, రెండు మూడుదినముల కొకసారి కలసికొనుచు గురుదేవుని (శ్రీరామకృష్ణుని) గుఱించి సంభాషించుకొనవలెను. పవిత్రగ్రంథభాగములను పారాయణము చేయవలెను. వానినిగూర్చి చింతన చేయవలెను. భజనసంకీర్తనలను జరుపవలయును. అప్పుడప్పుడు గురుదేవునికేదైన నివేదించి ప్రసాదమును మీరందఱును కైకొనవలెను.

నీయొద్దనుండి నే నేమి కోరుదును? నేను కోరున దిదే. నీవు తఱచు ఠాకూరును స్మరించుచుండవలయును. నానాటికి మఱింతగా తత్ప్రేమోన్మత్తుడవుగ కావలయును. నీకు నా ప్రేమాశీస్సులను మరల నందజేయుచున్నాను.

నీ శ్రేయోభిలాషి
శివానంద

అనుబంధము :—ఈచోటు ఉత్తరఖండము. బదరికాశ్రమమునకు రానుపోను ఇదొక్కటే దారి. కైలాసమునకు పోవలెనన్నను ఇందుగుండ పోవలసినదే. ఇచ్చట బదరికాశ్రమ కేదారనాథ కైలాసనాథ హిమసానువులు అత్యంతదర్శనీయములుగ నుండును.

## 39

చిల్కాపేట హౌసు
క్ష్యామోను పోస్టు, అల్మోడా జిల్లా,
20 ఆగస్టు 1913.

ప్రియ మాస్టరు మహాశయా,

సుదీర్ఘ కాలానంతరము నీజాబు వచ్చినది. చదివి చాల ఆనందమొందితిని. బృందావనములో ప్రస్తుతము ఝూలన్యాయాత్రోత్సవ సమయము. అక్కడ నీ వెంత బ్రహ్మానందము ననుభవించుచున్నావో నేను బాగుగ నూహింపగలను. బృందావనములో నందోత్సవ సమయము మహానంద సమయము. బృందావనమునం దంతట...

నందునానంద మింక నంత మొందఁబోదు
అంత మన్న దె మెఱుఁగ కయ్యది బరగును
'పడయఁగంటిమి గోవిందు, భాగ్య' మనుచు
గోకులంబున నర్తింత్రు గొల్ల లెల్ల

అను పాట ప్రతిధ్వనించుచుండును.

విజనుని ఆరోగ్యములో నెలదినముల కృతము కొంత మెఱుగు కనిపించుచుండినది. ప్రస్తుత మది కనిపించుటలేదు. ఇక్కడి ప్రస్తుత శీతోష్ణస్థితి అతని ఆరోగ్యము మేలొందుట కనుకూలించునది కా దని వైద్యుల యభిప్రాయము, ఈ ప్రాంతీయుల యభిప్రాయము. వానకాలము ముగిసినవెంటనే సెప్టెంబరు నెల నడిమినుండి అతని యారోగ్యము మరల బాగుగా మెఱుగుదేఱును. శ్రీగురుమహారాజు ననుగ్రహముచే పాల్తుబాబు చిత్తచాంచల్యము రవంత తగ్గినది. ఈ దినాలలో నతడు ఎక్కువగ ఠాకూరును (శ్రీరామకృష్ణుని) గుఱించి ధ్యానించుచు ప్రార్థించుచు నున్నాడు.



ఔను,- ఆనందుడు కైలాసమానస సరోవరాది ప్రఖ్యాతస్థలములకు యాత్రచేసి క్షేమముగా మరలి వచ్చినాడు.

సేవాశ్రమ నివేదికను గవర్నరుగారు ఆసక్తితో చదివినా రని తెలియవచ్చినందున ఎంతో సంతోషముగ నున్నది. నిజముగ కార్యనిర్వాహకులకు ఇది ఉత్సాహజనకముగ నుండును.

బిల్వమంగళుని చరిత్రము జరిగినచోటనే బిల్వమంగళనాటకము ప్రదర్శింపబడగా దర్శింపగనుట విశేషము. అది నీకు మిక్కిలి ప్రీతికరముగ నుండియుండు నని అనుకొనుచున్నాను. సముజ్జ్వలకీర్తిమంతుడవైన గిరీశా, నీవు ధన్యుడవు. నిత్యోజ్జ్వలమైన నీ ప్రతిభచే ఈ భూలోకవాసులు ఎంత లాభపడుదురో! శ్రీరామకృష్ణుడు గిరీశునకు ప్రసాదించిన దృఢ విశ్వాసమునే మనకును ప్రసాదించుగాక. మన జీవితములకు కూడ ధన్యత గూర్చుగాక. ఇది మనఃపూర్వకమైన నా ప్రార్థన.

బృందావనములో నీ కారోగ్యము సరిగా లేదని తోచిన, ఆలసింపక కాశీ పొమ్ము. భాద్రపదమాసములో బృందావనమున ఆరోగ్యము సరిగా ఉండనే యుండదు. ఆసమయమున తీవ్రమైన మలేరియా జ్వరము వ్యాపించి యుండును. దయచేసి నా ప్రేమ ప్రణామాదులను చేకొనుము.

నీ
శివానంద

అనుబంధము:-దయచేసి నందప్రముఖ కార్యనిర్వాహకులకు నాశుభాకాంక్షల నందజేయుము. నా మంగళాశాసనములను హేమ్బాబునకు అందింపుము.

## 40

చిల్కాపేట హౌసు
అల్మోడా, కూమోన్
ఉత్తరప్రదేశ్
17 సెప్టెంబరు 1913

ప్రియ—,

నీవు తొమ్మిదవ తేదీ వ్రాసిన జాబు యథాకాలము చేరినది. చదివి అందలి సంగతులకు చాల సంతోషించితిని.

నిజము చెప్పుచున్నాను. ఈశ్వరుడు నిన్ను ప్రస్తుతస్థితిలో పెట్టియున్నది నీ ఐహిక సంగమును విచ్ఛిన్న మొనర్చుటకే. సంసారమధ్యమున నున్నను దేవు ననుగ్రహమున, ఆయనను గూర్చిన విస్మృతి నీకు కలుగనే కలుగదు. అంతే కాదు, నీ భక్తివిశ్వాసములు మఱింతగా వర్ధిల్లును.

జన్మాష్టమినాడు నీ వొక చిన్నయుత్సవమునకు ఏర్పాటుచేసితి వని తెలిసి చాల ప్రీతుడ నైతిని. సర్వేశ్వరుడే సర్వమును అనుకూలపఱచును. దేవుని కోరుదునా ముక్తిని కోరుదునా అని యడిగియుంటివి. అందుకు జవాబు "కోరవలసినది దేవునే." దేవుని మాత్రమే నీవు కోరవలసినది. దేవుని ప్రాప్తి కలిగిన మోక్షప్రాప్తి కరతలామలకమే. దేవుడు సాకారుడు, నిరాకారుడు, సాకారతా నిరాకారతలకు అతీతుడును. మనము భావింపగల అన్నింటికంటె ఆయన అతీతుడు. నీకు నచ్చిన విధమున నియతకాలమున దేవుని స్మరింపుము. అందుంగూర్చి అనుమానింపకుము. ఏస్థితిలో నిన్ను దేవుడుంచునో అదొక్కటే నీకు శుభస్థితి. తన మనోభవనమున నిన్నుంచుకొని ఆయన సదా నీసేవల నందుకొనునేని అది సర్వశ్రేష్ఠము. ఆయన నిన్ను తన నిరాకారచిన్మయతత్త్వమునకు చేర్చుకొనునేని అదియు మంచిదే. అందుకై యించుకేని మనోవ్యథ చెందకు. ఆయన నీకు ఏమనఃప్రవృత్తి గల్గించునో అదే శ్రేష్ఠమైనది.

నీవు ఆరోగ్యముగా నున్నా వని తెలిసి చాల సంతోషించితిని. నేనును ఇక్కడ చాల కష్టపడుట లేదు. కాని ఠాకూరు (శ్రీరామకృష్ణుని) భక్తుడగు పాల్తుబాబుగారి యింట నేనున్నాను. వారికుమారు డింకను బాధ ననుభవించుచున్నాడు. అతడును మునుపటి కంటె రవంత మెఱుగుగా నున్నాడు. ఈ వ్యాధి నయ మగుటకు చిరకాలము పట్టును. బెంగాలుకు పోవుటకు ముందో పోయినతర్వాతనో నీకు జాబు వ్రాసెదను. జగద్ధాత్రిపూజ ముగిసినపిమ్మట పోవుటకు నాకు వీ లుండదనుకొనెదను. దేవుడు సంకల్పించినట్లు జరుగును. నీకు నాహృదయపూర్వకప్రేమాశీస్సులు. ఈశ్వర సంకల్పానుసారము నీకీ లోకమున దారిద్ర్యబాధ ఉండదు. గట్టిగా తెలిసికొనుము. ఆవశ్యకములైన వన్నియు సరఫరా యగుచుండును. గాఢధ్యానము, దేవస్మరణము, మననము, నామజపము, సంకీర్తనలు, పవిత్రగ్రంథపారాయణము మున్నగువానిని అభ్యసించుచుండుము. ఎపుడు గాని నీకు ఏకొఱతయు నుండదు. హృదయము భగవత్ప్రేమపూర్ణముగ నున్నచో లౌకికములైన లోటుపాట్లు మనలను కదల్పవు. హృదయమున ఆనందము నిండి తొనకుచుండును. భక్తునకు కావలసిన దానినెల్ల భగవంతుడు స్వయముగా ప్రసాదించును.

నీ శ్రేయోభిలాషి
శివానంద

# సురేశ్వరాచార్యుని నైష్కర్మ్య సిద్ధి

శ్రీ చోడవరపు పట్టాభి సీతారామ శర్మగారు

అద్వైతవాఙ్మయమున మండన మిశ్రుని బ్రహ్మసిద్ధి, విముక్తాత్ముని 'ఇష్టసిద్ధి', మధుసూదనుని అద్వైతసిద్ధి, సురేశ్వరాచార్యుని నైష్కర్మ్యసిద్ధి సుప్రసిదములై విలసిల్లుచున్నవి. వీనియందు నైష్కర్మ్యసిద్ధికి ఒక విశిష్టస్థానము గలదు. ఇందులకు తార్కాణము అద్వైతప్రచారకుల మన్ననలే గాక ఇతరాద్వైత విమర్శకులచే గూడ పలుమార్లు ప్రస్తావింపబడుటయే.

శంకరవిజయములందు సురేశ్వరుని గురించి పెక్కు ఉదంతములు గలవు. పూర్వాశ్రమమున మండనమిశ్రుడను మీమాంసకుడనియు, శ్రీ శంకరునిచే వాగ్వాదమున నోడింపబడి సన్న్యాసము స్వీకరించి గుర్వాజ్ఞచే శంకరుని బ్రహ్మసూత్ర భాష్యమునకు వ్యాఖ్యానము వ్రాసెనని కొందఱు చెప్పుదురు. కాని అట్టి వాదము కొన్ని సంశయములను రేకెత్తించును. మండనమిశ్రుని బ్రహ్మసిద్ధి అద్వైత వేదాంతమును కూలంకషముగ చర్చించుటచే మండనమిశ్రుడు మీమాంసకుడని కర్మవాదమును బోధించెనని తెలుపుటయు దోషమే యగును. ఈ పరిశీలనపరిధి ఇట్టి సమస్యలను పరిష్కరించుటకు గానందున, సురేశ్వరుని శైలి, తర్కము క్లుప్తముగ తెనుగు పాఠకులకు పరిచయము చేయుటకే పరిమితము చేయబడినది.

సురేశ్వరునికి ప్రఖ్యాతిని దెచ్చు గ్రంథములలో మానసోల్లాసకావ్యము, దక్షిణామూర్తి స్తోత్రము, పంచీకరణవార్తిక, బృహదారణ్యకోపనిషద్వార్తిక, బాదరాయణ సూత్రభాష్యము నైష్కర్మ్యసిద్ధి ముఖ్యములు. నైష్కర్మ్యసిద్ధి అద్వైతసారమును పొందుపఱచిన స్వతంత్ర వ్యాఖ్య. సురేశ్వరునితర్కము సంపూర్ణ భావనా స్వాతంత్ర్యము గల్గినదై, కొన్ని యెడల ఆదిశంకరుని సైతము ఎదిరించును.

ఈగ్రంథము పేరు నైష్కర్మ్యసిద్ధి యగుటకు మూడుకారణములు కనబడుచున్నవి. సిద్ధి యనగా స్థిరస్థమగు ఒక గమ్యము. నైష్కర్మ్య మన ద్వంద్వాతీత మగు స్వేచ్ఛాపూరితమైన ఆత్మగను గుర్తింపవచ్చును. కర్మపరిత్యాగమునకు వలయు జ్ఞానసిద్ధిగను తెలియ నగుచున్నది. అర్థములు పొందుపఱుపబడియున్న యెడల అది పరమసత్యమనియు, గమ్యమనియు దానికి వలయు కర్తవ్యమనియు కానంబడును.

'నైష్కర్మ్యసిద్ధి' తొలుదొలుత భగవద్గీత నుండి పరిగ్రహింపబడినది. అందువలననే సురేశ్వరుడు మొదటి అధ్యాయమునందే కర్మమార్గమును పరిశీలించి, జ్ఞానతత్త్వ పరాకాష్ఠను వెలుగును తెచ్చెను. సురేశ్వరుడు తనగ్రంథము ''అశేషవేదాంతసారసంగ్రహ''ముగ ప్రకటించియున్నాడు.

నైష్కర్మ్యసిద్ధి చతురధ్యాయ సంపుటమై శ్లోకములనడుమ 'సంబంధోక్తి' యనెడి గద్యభాగములచే కూర్పబడినది. జ్ఞానోత్తముని చంద్రికవలె బ్రహ్మసూత్రములు ఒకపథములో నడువవు. ప్రథమాధ్యాయమున ఉపనిషత్తుల వ్యాఖ్యానము, రెండవ అధ్యాయమున పూర్వపక్షముల విమర్శ, తృతీయాధ్యాయమున ప్రత్యేకమగు సాధనను గురించిన వివరములు తుదకు నాలుగవ అధ్యాయమున మోక్షమును గురించిన మీమాంస యిందు కనబడవు. అందుచే సురేశ్వరుడు కడు స్వతంత్రుడై ఈ

బృహత్కార్యమును పూర్తి చేసెనని తెలియ వచ్చుచున్నది.

ప్రస్తుతము 'నైష్కర్మ్యసిద్ధి' యొక్క పథక మును పరిశీలింతుము. తొలుదొలుత కర్మజ్ఞాన మార్గములు మోక్షసాధన కెట్లుపకరించునో పరిశీలింపబడి, విజ్ఞానమే సర్వథా ప్రయో జనకారిగ నిర్ణయింపబడినది. జ్ఞానములో కూడ యోగము కూడియుండుననెడి యపోహ తొలగించును. రెండవ మూడవ అధ్యాయ ములు జ్ఞానస్వరూపమునకై కేటాయింప బడినవి. 'తత్త్వం అసి', 'అహం బ్రహ్మాస్మి' వంటి మహావాక్యములను సమ గ్రముగ పరికించుట జరుగును. సురేశ్వరుడు శబ్దప్రమాణావశ్యకత లేకయే జ్ఞానము మోక్ష మును కలిగించుననెడి భావనను నిర్భీతితో వెల్లడించును.

సురేశ్వరుడు అద్వైత సంప్రదాయమును అంత మర్యాదతో స్వీకరింపలేదు. ప్రతి భావ మును తీవ్ర పరీక్షలకు గుఱిచేసి తాను ఆమో దించిన పరిధినే స్వీకరించిన ప్రజ్ఞాశాలి. ఇతడు ఉపనిషత్తుల నేల ప్రమాణముగ స్వీకరింపవలె నని ప్రశ్నించును. ఒకచో, "జ్ఞానమే ఆత్మకు బ్రహ్మ మునకు గల సంబంధమును తెలియజేయదా?" అని ప్రశ్నించును. మఱియొకచో ఉపనిష ద్వాక్యమును ఎట్లు గ్రహింపవలెనో తెలియ జేయును.

సురేశ్వరుని శైలి కడు ఆసక్తిదాయకముగ నుండును. విమర్శితులపాలిట కఠోరముగ వర్తించు వాక్యములను విసరును. మీమాంసకులు యజ్ఞ ధూమముచే నంధులై జ్ఞానమార్గమును చూడ జాలని వారెరి యని పరిహసించును. మెట్ట వేదాంతులను కుక్కలని సంబోధించును. శరీర మును విసర్జింపని అజ్ఞానుల కనువిప్పుకై మల మూత్రములను సైతము సుదీర్ఘముగ విశదపఱ చును. మీమాంసకులు జ్ఞానజ్యోతి గాంచలేని గుడ్లగూబ లని కొంచెపఱచును. సురేశ్వరుడు క్షుణ్ణముగ తాను చెప్పవలసినవిషయమును చదువరులను మంత్రముగ్ధులుగ చేసి నెత్తు టలో దిట్ట. అతనిభాష గంగాప్రవాహమువలె నురకలు వేయును. సురేశ్వరుని ఉదాహరణ ములు అతనిధోరణని పెడదారిపెట్టక భావ స్పష్టీకరణ కుపకరించును.

బ్రహ్మదత్తుడు, మండనమిశ్రుడు అద్వైత వేదాంతమున కర్మమార్గమును జోడించి ప్రసంఖ్యానవాదమును ప్రతిపాదించిరి. సురే శ్వరుడు కర్మకు జ్ఞానమునకు పొత్తుకుదరదని ధ్యాన జ్ఞానములలో ఒకటి కొకటి మార్గ ముగనుండి ధ్యానమే జ్ఞానమునకు మార్గమని లక్ష్యముమాత్రము కాజాలదని దెలుపును.

సురేశ్వరుడు ప్రతిషిద్ధకర్మలు నిషేధించి నను కామ్యకర్మలను సరిగ గుర్తించెను. నైతికమగు నిత్యానైమిత్తికకర్మలు జీవుని హృదయమును శుద్ధపఱచును. ఆవిధముగ కర్మమార్గము తెలియజెప్పును. పరమపురు షార్థమగు మోక్షసాధనకు మధురమగు జ్ఞాన ఫలమే కారణము గాని కర్మమాత్రము తుది వఱకు నిలువజాల దని వక్కాణించును.

వేయేల? సురేశ్వరుని నైష్కర్మ్యసిద్ధి పండి తులనే గాక పామరులనుసైతము ఆకర్షించు నుద్గ్రంథ మని నిర్ణయించిచెప్పుట అతి శయోక్తి కాజాలదు.

# వార్తలు - విశేషాలు

శ్రీరామకృష్ణమిషను ఆశ్రమం, మహారాణిపేట,
విశాఖపట్నం-2, ఆంధ్రప్రదేశ్

## శ్రీ అవిముక్తానందస్వామి సమర్పించు 1968-69 సంవత్సర నివేదిక

ఈ ఆశ్రమం 1938 లో స్థాపితం. స్థానిక మిత్రులయు ప్రభుత్వమువారియు సాయమున మహారాణిపేటలో సముద్రతీరప్రాంతమున కొంత నేల సంపాదించబడింది. 1941 లో శ్రీ కంచర్ల రామబ్రహ్మంగారు ఆశ్రమానికి ప్రధానభవనం నిర్మించారు. తర్వాత ఆయన కుమారులు మరొక కట్టడాన్ని దానికి చేర్చారు. ఈవిధంగా నిలువ నీడ అనే ముఖ్యమైన అక్కఱ తీరింది. యుద్ధకాలంలో విశాఖపట్నాన్ని ఖాళీ చేయవలసివచ్చినప్పుడు, ఈ ఆశ్రమం పశ్చిమగోదావరిజిల్లాలో తణుకులో ఉండి తనకార్యాన్ని నిర్వహించుకుంటూ వచ్చింది. పిల్లలకు బస ఇచ్చి చదువు చెప్పే ఉన్నతపాఠశాల ఒకటి సాగుతుణ్ణింది. 1946 లో యథాపూర్వపరిస్థితులు కలుగగానే ఆశ్రమం విశాఖపట్నంలోని స్వకీయభవనానికి మాఱింది. 1946-1947 లో కొన్ని నెలలపాటు నాటి సర్వమతాధ్యక్షులైన శ్రీమద్విరజానంద స్వాములవారు ఇక్కడ పర్యటించారు. అందు మూలంగా ఆశ్రమతేజశ్శక్తులు పునర్నవీకృతము లయ్యాయి. చల్లని వాతావరణమూ ప్రకృతిరామణీయకమూ స్వాములవారికి ప్రత్యేకంగా నచ్చాయి. అనంతరసంవత్సరాలలో ఆశ్రమానికి చాలా చేర్పులు అభివృద్ధులూ గలిగాయి. పర్యవేక్షకులుగా ఉండిన స్వాములయూ పౌరమహాజనులయూ కృషిచేత ఆశ్రమం ప్రస్తుతస్థాయికి పెంపొందింది. ఆశ్రమంలో ప్రభాతప్రదోషవేళలలో పూజ భజన ప్రతిదినం జరుగుతాయి. ఊరివారు విశేషంగా అందు పాల్గొంటారు. ఏకాదశదినాలలో రామనామసంకీర్తనం జరుగుతుంది. అసంఖ్యాకులగు భక్తులు అందు అన్వయిస్తారు. శ్రీరామకృష్ణ - శారదా - వివేకానంద-బుద్ధ-శంకర ప్రముఖుల జయంతిమహోత్సవాలు సమగ్రవైభవంతో జరిగాయి.

వైజ్ఞానిక కేంద్రంలో పురజనులకు ముఖ్యంగా పిల్లలకు సరళపద్ధతులలో సంస్కృతభాష నేర్పబడుతున్నది. విద్యాపాదకములైన చలనచిత్రాల ప్రదర్శనానికి ఏర్పాట్లు చేయబడ్డాయి. శిశుగ్రంథాలయంలో బొమ్మల పుస్తకాలు చక్కగ వినియుక్తం అయినాయి. గ్రంథాలయం అభివృద్ధిచేయబడుతున్నది.

వివేకానందహాలులో సాయంవేళలలో భారతరామాయణభాగవతప్రవచనాలు జరుపబడినవి. పురజనులు అత్యధికసంఖ్యాకులు వింటూ వచ్చారు.

గ్రంథాలయంలో ఉన్నపుస్తకాలసంఖ్య 2,345. 6 వార్తాపత్రికలు, 20 ఇతరపత్రికలు ఉచితపఠనాలయంలో పురజనులకు అందజేయబడుతున్నాయి.

ఆంగ్లభాషద్వారా విద్యకఱపే ప్రాథమిక పాఠశాల 1958 జనవరిలో ప్రారంభింపబడినది. దానికి ఇప్పుడు పండ్రెండవ సంవత్సరం జరుగుతున్నది. చదువుతూన్న పిల్లలసంఖ్య 324. ఉపాధ్యాయులసంఖ్య 13.

ప్రాంతీయప్రజల వైద్యసాహాయ్యమునకై ఉచితహోమియోపాథిక్కు వైద్యశాల ప్రారంభించబడినది. అచ్చటి సేవను హోమియోపాథిక్కు సేవకసమాజంవారు నిర్వహిస్తున్నారు.

సమావేశాలకు ఉపయుక్తమయ్యే సభాభవననిర్మాణం 1961 లో ప్రారంభింపబడి 1963 జనవరిలో పూర్తిచేయబడింది. అందుకు

కావలసిన నేలను మహారాణిపేటలో రాష్ట్ర ప్రభుత్వమువారు సమర్పించారు.

3-1-1963 తేదీనాడు అప్పుడు రాష్ట్రపతిగా నుండిన డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారు ఆవిష్కరణోత్సవం చేసి, అప్పుడు శ్రీవివేకానందస్వాముల శతతమజయంతి మహోత్సవాలు దేశమంతటా జరుగుతూండినకారణంచేత స్వామిజీ స్మృతికంకితంగా ఆ కట్టడమునకు వివేకానందహాలని పేరుపెట్టారు. ఆ భవనంలో మతివైజ్ఞానికవిద్యాకార్యక్రమాలను నిర్వహించేందుకు తగిన కుర్చీలు బల్లలు వగైరాల ఆవశ్యకత ప్రస్తుతం జరూరుగా ఉంది.

శ్రీశారదబాలవిహారమునకై నిర్మించబడిన భవనం చాలనిదై ఏర్పడినది. కాబట్టి 40,000 రూపాయలు వెచ్చించి మిషనువారు మఱొక్క భవనమును నిర్మించారు. అందుకు విశాఖపట్నంలోని లయన్సు క్లబ్బువారు 10,116 రూపాయలు విరాళ మిచ్చారు.

ఆ స్కూలు క్రొత్తకట్టడంమీద 25,000 వ్యయించి మఱొక్క అంతస్తు లేపవలె నని మిషనువారు సంకల్పించియున్నారు.

ఈ కేంద్రానికి ఆర్థికాధార మిత్రులయు భక్తులయు ఉదారమహాజనులయు విరాళములే.

ఆశ్రమం వివిధకార్యకలాపాలను నిర్వహించేందుకు కావలసినసహాయాన్ని ఉదారమహాజనులు అందజేస్తారని నమ్ముతున్నాం. ఇక్కడి ప్రస్తుతపు అక్కరలు :-

1. సభాభవనమునకు కుర్చీలు బల్లలు వగైరా రూ. 30,000
2. స్కూలు భవనంమీద క్రొత్త అంతస్తుకు రూ. 25,000
3. గ్రంథాలయ పఠనాలయాలలో పుస్తకపత్రికాదిపరికరాలకు రూ. 5,000
4. శిశుగ్రంథాలయానికి రూ. 5,000
5. పరికరసంపన్నమైన పిల్లల ఆటతోటకు రూ. 5,000
6. ఉచితహోమియోపాథిక్కు వైద్యశాలకు రూ. 10 000
7. కట్టడముల మరమ్మత్తుకు రూ. 10,000

ఆశ్రమరవాణావసతులకు రూ. 20,000

మొత్తము రూ. 1,10,000

వస్తురూపంగాగాని రొక్కరూపంగాగాని లభించు విరాళాలను ఆశ్రమసెక్రటరీగారుస్వీకరించి కృతజ్ఞతతో రశీదు అందజేస్తారు. వదాన్యులు తమ బంధువులలో ఎవరి పేరిటనైన వస్తువిరాళములుగాని భవన భాగనిర్మాణమును గాని జరిపించి వారినామములను చిరస్థాయులుగా చేసికోవచ్చును. విరాళాలు రామకృష్ణ మిషను కేంద్రాలలో దేనికి ఇయ్యబడినను అందుపై వరుమానపు సుంక ముండదు.

## ఒక విజ్ఞప్తి

పూజ్యశ్రీరామకృష్ణానందస్వామి (శశిమహారాజు) వారి జన్మస్థానమున ఒక గుడి కట్టవలెనని అచట నిత్యపూజకును వార్షికోత్సవమునకును ఒకమూలధననిధి నేర్పఱుపవలె నని సంకల్పింపబడినది, పూజ్యశ్రీ శారదానంద స్వాముల శిష్యుడైన శ్రీ ఎమ్. ఎన్. కోనారు గారు ఇందుకై 5,000 రూపాయలు విరాళ మిచ్చారు. వారి బంధువే శ్రీ ఎమ్. ఎన్. రాయి గారు ర్పూ 1,000 లు ఇచ్చారు. గుడి నిర్మాణమునకు ర్పూ. 10,000 లు ఖర్చగును. మూలధనంగా ఉంచుటకు ర్పూ. 20,000 కావలసి ఉంటుంది.

శ్రీరామకృష్ణానందస్వాముల జీవిత వివరాలు తెలిసినవారు శ్రీరామకృష్ణసంస్థను అభివృద్ధి చేయడంలో ఆయన ఎంత ప్రాముఖ్యం వహించి యుండినారో ఎఱుగుదురు. ఈసంస్థకు శశిమహారాజు మాతృస్థానీయుడని శ్రీవివేకానందస్వామి చెప్పారుకదా. 1886 నుండి 1911 వఱకు శశిమహారాజు జీవితచరిత్ర మన్నా దక్షిణోత్తర భారతదేశములలో రామకృష్ణమిషను చరిత్ర మన్నా ఒక్కటే. శశిమహారాజు నిర్వహించిన సేవల పారమార్థిక వైజ్ఞానికపు విలువలకు ఇప్పుడు నిర్మింపనెంచిన భవనం తగిన స్మృతిచిహ్నం అవుతుంది. అందఱూ సాయపడి ప్రోత్సహించదగిన ప్రణాళిక ఇది.

భక్తులు శ్రేయోభిలాషులు విరాళము లిత్తురు గాక యని ప్రార్థించుచున్నాము.

గౌరీశ్వరానందస్వామి,
ప్రెసిడెంటు, శ్రీ శ్రీ మాతృమందిరము,
జయరాంబాటీ పోస్టు, బంకురా జిల్లా,
పశ్చిమ బంగాళము.

## అశ్రుతర్పణం

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో శ్రీ అశోకానందస్వామి మహాసమాధి నొందినారనుట ఎంతయు విషాదకరమైన వార్త. రామకృష్ణసంస్థ జ్ఞానవయోవృద్ధసన్యాసులలో వారొకరు. 1969 డిసెంబరు 13-వ తేదీనాడు సాన్ఫ్రాన్సిస్కోలో హృద్రోగముచే మరణించు నప్పటికి ఆయనకు వయస్సు 77. 1920 లోనే ఆయన ఈ సంస్థలో చేరారు. మూడేండ్లకనంతరం పరమహంసశ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యవరేణ్యులైన శ్రీ శివానందస్వామియొద్ద ఈయన సన్న్యాసదీక్ష స్వీకరించారు. అశోకానందస్వామి మదరాసు శ్రీరామకృష్ణమఠముతో సన్నిహితసంబంధంగలవారు. అక్కడ ఐదేండ్లకాలం అన్నిశాఖలలో ఆయన పనిచేస్తూ వచ్చారు. మదరాసు మఠపురోభివృద్ధియందు తమ జీవితాంతంవఱకు ఆయన ఎంతో అక్కఱ కలిగియుండినారు. మదరాసునుండి ఆయన మాయవతి అద్వైతాశ్రమానికి బదిలీ అయినారు. 1927 నుండి 1930 వఱకు మూడేండ్లకాలం ప్రబుద్ధభారతపత్రికకు సంపాదకులుగ నుండినారు.

1932 లో సాన్ఫ్రాన్సిస్కో ఉత్తరకాలిఫోర్నియాలోని వేదాంతసొసైటీకి ఈయన పర్యవేక్షకుడుగ నియమించబడ్డారు. భక్తితో ఈయన నిర్వర్తించిన కృషిద్వారా ఆ సొసైటీ ఎంతయు అభివృద్ధి గాంచినది. రెండు శాఖాకేంద్రాలు, ఒక విడిది, ఒక గుడి, పిల్లలకు భానువారాలలో చదువుచెప్పే స్కూలు మొదలగునవి అభివృద్ధి గాంచినవి. స్వామి చక్కని రచయిత, వక్త, యువతీ యువకుల నెందఱినో ఆధ్యాత్మిక మార్గానికి మళ్లించారు. ఆయన ఆత్మకు శాంతి.

# గ్రంథపరిచయం

## అంబుజోదర శతకము

రచయితయు ప్రాప్తిస్థానమును విద్వాన్ నడాదూరి విజయరాఘవాచార్యులు, 1/A శ్రీనివాసయ్యంగారువీధి మద్రాసు 33, పుటలు 24, వెల 25 పైసలు.

ఇది నలభై రెండు ఉత్పలాలతోను అఱువై చంపకాలతోను 'అంబుజోదరా' అనే మకుటంతోను గ్రథితమైన శతకం. పద్యాలలోని విషయం ప్రాయికంగా నిందాస్తుతి, ఎత్తిపొడుపు, దాంభికనిరసనం, స్వకీయదైన్య

కథనం, ప్రార్థనం. ప్రతివాక్యంలోను సరస చమత్కారసంపద ఉంది. అల్లికలో కృతహస్తత స్పష్టం. మధురమైన యీ రచనకు స్వాగతం.

### శ్రీవేంకటేశ శతకము

రచయితయు ప్రాప్తిస్థానమున్నూ డాక్టరు ముడుంబ నరసింహాచార్య, ఎమ్. ఏ., పిహెచ్. డి., 127 వేంకటరంగంపిళ్లెవీధి, మద్రాసు 5 పుటలు 39+32. వెల రూపాయి.

వేంకటేశమకుటంతోడి ఆటవెలదుల శతకం యిది. రచయిత దీన్ని శతక మని కావ్యమని (చూ. ఉపో. పుట 38) కూడా నిర్దేశించి ఉత్తమకావ్యాలను ముద్రింపించు నవ్యరీతిలో ముద్రింపించియున్నారు. గ్రంథపు విలువను వర్ధిల్లజేసే అధోజ్ఞాపికలు పుటలలో ఉన్నాయి. శ్రీనివాసవిభూతి అను పేర ఉన్న ఉపోద్ఘాతం బహువిషయసంపన్నం. స్తుతిపరములుగాను నిందాస్తుతిపరములుగాను అవతారప్రశస్తి పరములుగాను ప్రార్థనాపరముగాను ఉన్న యీ నూఱుపద్యాలలో ధారాసంపద ఉంది. స్తుతిలో ఏపద్యాని కాపద్యమే స్వతంత్రంగా కైకొనబడుతగును కాబట్టి 19-37 పద్యాల ఆశయాలు పరస్పరవిరుద్ధాలు అని తలంప వలసింది లేదు. విరామచిహ్నాల వాడకం ఆంగ్ల విద్వదుపజ్ఞకమైనా రామకృష్ణప్రభలో ఇది తొలుత ముద్రితమైనప్పుడు విరామ చిహ్నాలు విహితక్రమంలో నెలకొల్పబడి ఉన్నా, తత్క్రమోల్లంఘనంగా 'ఇంక సిద్ధి యెట్లు? వేంకటేశ!' 'డొంకతిరుగు డేల? వేంకటేశ!' ఇత్యాదివాక్యాలలో వాక్యాంతంలో చుక్కస్థానంలో ఉంచవలసిన ప్రశ్నార్థకచిహ్నాన్ని వాక్యమధ్యంలో వేయడం అపూర్వతను సమకూర్చే విశేషం.

ప్రభాకర్

## SRI RAMAKRISHNA PRABHA

Statement about ownership and other particulars about *Sri Ramakrishna Prabha* (according to Form IV, Rule 8, circulated by the Registrar of Newspapers for India.)

1. Place of Publication ... ... Sri Ramakrishna Math, Mylapore, Madras-4,
2. Periodicity of its Publication ... Monthly.
3. Printer's Name ... ... M. Balasundaram.
   Nationality ... ... Indian.
   Address ... ... Freedom Press, 138, T. H. Road, Madras-21.
4. Publisher's Name ... ... Swami Hirananda.
   Nationality ... ... Indian.
   Address ... ... Sri Ramakrishna Math, Mylapore-4.
5. Editors' Names ... ... Swami Hirananda and Prof. N. Bhaktavatsalam, M.A., B.O.L.
   Nationality ... ... Indian.
   Address ... ... Sri Ramakrishna Math, Mylapore, Madras-4.
6. Names and address of individuals who own the newspaper and partners or shareholders holding more than 1% of the total capital. Sri Ramakrishna Math, Mylapore, Madras-4.

I, Swami Hirananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Signature of the Publisher,
(Sd.) SWAMI HIRANANDA.

*Date: 15—3—1970.*

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ హిరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ హిరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషన్ (సేవాసంస్థ): తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

# శ్రీ రా మ కృ ష్ణ ప్ర భ

సంపుటము ౨౬ ౧౯౭౦ - ఏప్రిల్ : సాధారణ - చైత్రము సంచిక ౧౦

## విషయసూచిక



ఫోన్ : 71231 శ్రీ రామ కృష్ణ ప్రభ పోస్టు బాక్సు : 635

1. 1969 జూలై నుండి శ్రీరామకృష్ణప్రభ ఇరవై ఆఱవసంపుటం జరుగుతూ ఉంది.
2. చందావివరాలు : ఇండియాలో రూ. 5-00 ; సిలోనులో రూ. 7-00 ; ఇతరవిదేశాలలో రూ. 7-50 ; విడిసంచిక 50 పైసలు.
3. చందాదారులు జాబులలో తమచందాదారుసంఖ్యను చిరునామాను స్పష్టంగా వ్రాయాలి.
4. సంచిక అందకపోతే వారంరోజులలో తెలియజేయాలి.
5. మేము ప్రచురించిన తెలుగుగ్రంథాలలో అనేకములు శ్రీరామకృష్ణప్రభ చందాదారులకు తక్కువవెలకు అందజేయబడును. వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.
6. శ్రీరామకృష్ణప్రభ ప్రముఖసంస్కృతీకేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మికవిజ్ఞానపత్రిక. అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకం. రేట్లకు వ్రాయండి.
7. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపాలని గ్రంథకర్తలకు, ప్రకాశకులకు మా ప్రార్థన.

తక్కిన వివరాలకు ఈ చిరునామాకు వ్రాయండి :—

మేనేజరు : శ్రీరామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీరామకృష్ణమఠం, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేక ప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

‘అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ } ౧౯౭౦ – ఏప్రిల్ : : సాధారణ – చైత్రము { సంచిక ౧౦


## వేల్పులు కావించిన శ్రీరామనుతి

1. బ్రహ్మ—

మాయాతీతం మాధవ మాద్యం జగదాదిం మానాతీతం మోహవినాశం మునివన్ద్యమ్

యోగిధ్యేయం యోగవిధానం పరిపూర్ణం వన్దే రామం రఞ్జితలోలం రమణీయమ్.

శ్రీరామునికి మ్రొక్కుచున్నాను. ఆయన రమారమణుడు, సుందరుడు, భక్తప్రియుడు, పరిపూర్ణుడు, యోగవిధాత, ఆద్యుడు, జగత్కారణుడు మాయను మితిని దాటినవాడు, మోహమును రూపుమాపువాడు, మునులకు నమస్కారార్హుడు, యోగులధ్యానమునకు లక్ష్యము.

2. పరమశివుడు—

నమో ఽస్తు రామాయ సశక్తికాయ నీలోత్పలశ్యామలకోమలాయ

కిరీటహారాంగదభూషణాయ సింహాసనస్థాయ మహాప్రభాయ.

అహం భవన్నామగుణైః కృతార్థో వసామి కాశ్యా మనిశం భవాన్యా

ముమూర్షమాణస్య విముక్తయే ఽహం దిశామి మన్త్రం తవ రామ నామ.

శక్తి (=సీతా) సమేతుడవును నల్లకలువను బోలిన మేనివన్నెయు సౌకుమార్యమును గలవాడవును కిరీటహారనూపుర ప్రముఖభూషణములు గలవాడవును మహాతేజస్వివియు సింహాసనాధిరూఢుడవు నగు ఓ రామా నీకు నా వందనములు. నీ నామగుణములచే నేను ధన్యుడను.

మరణింపనున్న వారికి, విముక్తికై, ఓ రామా, నీ నామమంత్రము నొసంగుచు భవానీసమేతుడనై నేను కాశిలో వసించుచున్నాను.

3. దేవేంద్రుడు—

భజే ఽహం సదా రామ మిన్దీవరాభం భవారణ్యదావానలాభాభిధానమ్
భవానీహృదా భావితానన్దరూపం భవాభావహేతుం భవాదిప్రపన్నమ్.

ఇందీవరశ్యామలుడును, సృష్టిసంహారకారకుడును, రుద్రాదులకాశ్రయుడును, పార్వతికి ధ్యానగోచరుడగు ఆనందరూపుడును, చిచ్చు అడవిని దహించినట్లు సంసారమును రూపుమాపు మహిమాంచితనామము గలవాడు నగు శ్రీరాముని సదా భజింతును.

4. వినాయకుడు—

తావ దేవ మద స్తేషాం మహాపాతకదన్తినామ్
యావ న్న శ్రూయతే రామనామపఞ్చాననధ్వనిః.

సింహగర్జనము చెవినిబడువఱకే యేనుగులకు మదము, శ్రీరామనామము ఉచ్చరితమగువఱకే మహాపాతకముల విజృంభణము. సింహగర్జనము చెవినిబడినంతనే యేనుగుల మదమడగును. శ్రీరామనామ ముచ్చరితము కాగానే మహాపాతకముల యే పడంగును.

## ఆంధ్ర శ్రీరామనవరత్నమాలిక

ఉ. సత్త్వరజస్తమోగుణవశస్థితిఁ గైకొని నీవ లీల బ్ర
హ్మత్వము దాల్చి లోకముల కన్నిటికిన్ జననం బొనర్తు, వి
ష్ణుత్వము దాల్చి వానికి మనోజ్ఞతమస్థితివృత్తిఁ జేర్తు, రు
ద్రత్వము దాల్చి వాని కుచితంబుగ సంహృతిఁ గూర్తు రాఘవా.

కవిబ్రహ్మ తిక్కన.

మ. అమలాంభోజదళాక్షుఁ డక్షతఘనశ్యామాంగుఁ డాజానుదీ
ర్ఘ మహాబాహుఁడు సంహతోరుకఠినోరస్కుఁడు సింహోరువి
క్రమణుం డుద్ధతశౌర్యధైర్యకలనాకల్పుండు కల్యాణధీ
రమణీయుండు వెలుంగు రాముఁడు గుణారాముండు భూమండలిన్. 2

ప్రబంధపరమేశ్వరుడు చదలవాడ ఎఱ్ఱాప్రెగ్గడ.

సీ. జనకాజ్ఞకును లోకజనవాదమునకుఁగా నుర్వీజయగు లక్ష్మి నుజ్జగించి,
తజుని బుత్త్రునిఁ జేసి, తట్టి నెయ్యముపొంటె నజునిపౌత్రుండవై యవతరిలితి,
ధాత్రి నిక్ష్వాకుసంతతి నుద్భవంబొంది యాశ్రయించినవారి కమృత మిత్తు,
వాలాయముగ విశ్రవసుకుమారకున్నెకు విశ్రవస్త్వము గూర్ప వేడ్కపడితి,

గీ. పెద్దకాలంబు వాసితి ప్రియవధూటి, ననుజు నొకనాఁడు వాసి దేహంబు దొఱఁగి,
తెవ్వఁ డెఱుఁగును నీచంద మిట్టి దనఁగ, రాజితానేకగుణభద్ర, రామభద్ర? 3

కవిసార్వభౌముడు శ్రీనాథుడు.

ఉ. రామ, గుణాభిరామ, దినరాజకులాంబుధిసోమ, తోయద
శ్యామ, దశాననప్రబలసైన్యవిరామ, సురారిగోత్రసు
త్రామ, సుబాహుబాహుబలదర్పతమఃపటుతీవ్రధామ, ని
ష్కామ, కుభృల్లలామ, గరకంఠసతీనుతనామ, రాఘవా. 4

క. అమరేంద్రసుతవిదారణ, కమలాప్తతనూజరాజ్యకారణ, భవసం
తమసదినేశ్వర, రాజోత్తమ, దైవతసార్వభౌమ, దశరథరామా. 5

సహజపాండిత్యుడు పోతనామాత్యుడు.

మ. పవిధారాపతనంబు గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులన్ దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నా, సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగున్ సిరుల్, రఘుకులస్వామీ, రమావల్లభా. 6

ఆంధ్రకవితాపితామహుడు అల్లసాని పెద్దన.

క. పరమంబగు నీనామము కర మామ్నాయములు తారకబ్రహ్మముగా
నిరతిన్ వినుతింపఁగ, నాతరమే నిను నభినుతింప, దశరథరామా? 7

పింగళిసూరన.

శా. శ్రీరామాంశజమైన జానకి నురస్సీమాంతరాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణీ సందృశ్యమానస్వకా
కారం బారసి యన్యకాంత యని నిక్కం బెంచు నంచున్ సదా
తా రమ్యంబుగ నంకపీఠి నిడు సీతాభర్త నన్ బ్రోవుతన్. 8

అయ్యలరాజు నారాయణామాత్యుడు.

శా. శ్రీరామావనిజానిజాయత భుజాశృంగార శాఖామిళ
త్సారాకారలతాస్తనస్తబకభాస్వద్దంతవాసఃకిసా
లారాళాలకభృంగ రంగ దఖిలాంగాంచత్ప్రసూనోత్కర
శ్రీరామాకృతికల్పకంబు మము రక్షించున్ బుధానందమై.

చిత్రకవి నరసింహకవి.

# రామలీల

## "శారదాచరణ్"

సురుచిరముగ వెల్గెడు నీచరితము వ్రాసిరి యనేకసత్కవివర్యుల్
మరల మరల దానిని సంస్మరియింతు మదీయమానసంబున రామా.

జలచరముగ కూర్మంబుగ నిల బుట్టితి వీవు సూకరేశుడుగా భ
క్తుల బ్రోవ నృసింహుడుగా బలియరిగా బరశుధారివగిదిగ రామా.

కౌసల్యాపుత్రుడవై భాసిల్లగ బుట్టినావు భక్తులు సుజనా
గ్రేసరులు మోదమున క్రూరాసురబాధావిముక్తి నందగ రామా.

ధరణీజననాశినియై పరగెడు తాటకను నొక్కబాణముచే సం
హరణం బొనరించితి వీ ధర ధర్మమునిలుపుపొంటె దశరథ రామా.

మునిశాపవశమునన్ నిర్జనస్థలిన్ దిక్కులేని రాయగు వనితన్
ఘనకారుణ్యాంభోనిధి గని ప్రోచితి వీవు దుఃఖఖండన రామా.

సీతన్ సంతతభాగ్యోపేతన్ సజ్జనమనోబ్జభీత్యపనేత్రిన్
నీతి ధనుర్భంగంబున బ్రీతిగ బెండ్లాడినావు శ్రీరఘురామా.

జనకాజ్ఞ పాలనార్థము జనకజలక్ష్మణులతోడ జనితి వరణ్యం
బునకును నక్కట సర్వేశునకును నీ కిట్టు లౌట చోద్యమ రామా.

నీచుని మారీచుని నారాచంబున సంహరించి రాక్షసమాయం
ద్రోచితి వత్యద్భుతముగ నీచిన్మయలీల లెన్న నేరము రామా.

ధరణీజాతను క్రూరాసురుడు దశాస్యుండు గొనగ శోకించితి వం
తరమున నిన్నున్ వీడక ధరణిజ వెల్గెడిని సంతతంబును రామా.

జాలిగ సుగ్రీవుని గాథాలాపన నిచ్చినాడ వభయ మతనికిం
గోలం గూల్చితి వంతట వాలిన్ దుర్వారగర్వభరితున్ రామా.

హనుమంతుని గరుణాదృష్టిని గని నీచరణపద్మసేవాభాగ్యం
బు నొసంగితి వాతనిచే గనుగొంటివి సీతజాడ కడకును రామా.

సురశత్రుపట్టణంబును జొరగా సేతువును గట్టి చొచ్చితి వావా
నరసేనతోడ, నీకును బరమాత్మకు నవియు సాయపడుటయె రామా.

ధరణీక్షేమార్థంబై తరుణీరక్షార్థమై కుదానవపతి సం
హరణం బొనరించితి వెల్లరును బొగడ సర్వభూపాలలామా రామా.

భరతుడు శత్రుఘ్నుడు చామరము లిడగ లక్ష్మణుండు పవనాత్మజుడుం
బరిసేవింపగ సరసన ధరణిజతో వెల్గు నిన్ను దలతును రామా.

ఉల్లము నవనీతం బగు సల్లలితంబులు గుణములు స్వాంతమునన్ మా
చల్లని రాముని కని ప్రజ లెల్లరు నానంద మంద నేలితి రామా.

రామా రామా రామా రామా రామా యటంచు రమ్యంబగు నీ
నామము జపించు నరునకు ప్రేమంబున నే నమస్కరింతును రామా.

నీనామమె తారకమా నీనామమె సర్వపాపనిధివారకమా
నీనామమె కారకమా శ్రీ నిత్య మనర్గళముగ జేరగ రామా.

నీదు మనోహరరూపము మోదముతో దలచి కొలిచి మోహచ్ఛాయా
చ్ఛేద మొనర్చెడివారల కేది వలయు నిహపరముల నించుక రామా.

జయ జానకీమనోహర జయ భవబంధప్రణాశ జయ జగదీశా
జయ దనుజగర్వనాశక జయ ధర్మైకప్రపోషి జయశ్రీ రామా.

శ్రీమదజ్ఞానానన్దనార్పణమస్తు.

# శ్రీరాముని అభయ సందేశము

ఓ వానరులారా, నాకును మీకువలెనే విభీషణునిగూర్చి మనస్సులో పరిగణనార్హమగు వివక్ష యొకటి కలదు. నాక్షేమమందు నిరతులగు మీరు దానిని వినుడు. విశ్రుతముగ మిత్రభావము వాస్తవముగ లేకయే కేవలము మైత్రి నభినయించుచు ఎవడైన వచ్చునేని వానిని సైతము ఎప్పుడును ఎక్కడను పరిత్యజింప నిష్టపడను. పరునియందు దోష మున్నప్పటికిని అతడు వచ్చి మన మఱుగుజొచ్చినప్పుడు దానినే గుణముగ గ్రహించి అతనిని మనుచుట రాజధర్మము. దురాత్ముడగు రావణునితో కలహించి ఈ విభీషణు డిచ్చటికి చనుదెంచెను. అందుకు సందేహము లేదు. వీని కంఠనాదము భీరునికంఠనాదమువలె వినబడుచున్నది. కావున ఇతడు బలవంతుడగు రావణుని భయమువలన ఆత్మపరిత్రాణము కొఱకు మనయొద్దకు చనుదెంచెను. ఇతనిని పరిగ్రహించుటకు ఏమియు సందియము లేదు. జ్ఞాతిత్వదోషమును రాజత్వదోషమును సర్వత్ర ఉండుననుటను శంకింపవలదు. పితృదత్తమై చేతికి వచ్చిన రాజ్యమును భరతు డంగీకరింపలేదు కదా. అతనివంటి భ్రాత లెవరును లేరు. జ్యేష్ఠత్వమున రాజ్యార్హుడనైనను పితృవచనగౌరవమున కనిష్ఠుడగు భరతునియందు రాజ్యభార ముంచుటకు సమ్మతించితిని. కావున నావంటిపుత్త్రులు లేరు. సుగ్రీవునివంటి మిత్రులు లేరు. వీడు వంచకు డని సుగ్రీవుడు చెప్పుచున్నాడు. అట్లైనను కొదువ లేదు. అమరపన్నగసిద్ధసాధ్యనివహములను కొనగోటితో సంహరింప గల నాకు ఈ దానవుడు చేయ గల యహిత మించుకయు లేదు. మును పోకపావురము తనభార్య నపహరించిన కిరాతుడు తా నున్నచోట తలదాచుకొనగా అతనికి తన దేహమాంసమును ఆహారముగ నిచ్చి సంతృప్తిపఱచె నను కథ ప్రసిద్ధము

కదా. కణ్వపుత్రుడైన కండుమహాముని చెప్పిన నీతివాక్యములను వినుడు. "శరణాగతుడై శిరమున కరములు ముకుళించి నన్ను కావుమనుచు ఆర్తరవమున పలికెడు వాడు శత్రువైనను రాజతనిని రక్షింపవలయును. ఆర్తుడైననేమి తృప్తుడైననేమి శత్రువైననేమి, కావుము అని ప్రార్థించిన వెంటనే రాజు తన ప్రాణమునైన నిచ్చి అతనిని కాపాడవలయును. ప్రీతిచేతగాని మోహముచేతగాని మఱుగుజొచ్చినవానిని కాపాడని తేని ధర్మకౌశలమును లోకులు గర్హింతురు. శరణాగతుని రాజు రక్షింపక తిరస్కరించునేని ఇతని సుకృతము అతనికిని అతని దుష్కృతము ఇతనికిని చెందును. ప్రపన్నులను రక్షింపని ప్రభుని ఐశ్వర్యకీర్తిబలవీర్యములు వినాశ మొందును." ఇట్లు ధర్మశాస్త్రప్రసిద్ధమైన శరణాగతరక్షణరూపధర్మమును తప్పక యనుష్ఠించెదను.

సకృదేవ ప్రపన్నాయ
తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో
దదామ్యేతద్వ్రతమ్ మమ.

మఱుగుసొచ్చితి గృప నన్ను మనుపుమనుచు
దీనరవమున నొక్కమారైననేమి
వినతుడైన నకృపణుడై వేడుకొన్న
వాని కభయం బొసంగుట వ్రతము నాకు.

ఈ రాక్షసునకు నే నభయ మిచ్చితిని. తోడుకొని రమ్ము. ఇక సందేహమే లేదు. సుగ్రీవా, వీనిని కాపాడుటయే కాదు. "అపరాధి నైతిని, నన్ను కావుమటంచు మఱుఁగుచొచ్చినచో రావణునైనను విడువక కాపాడి తీరెదను. ఇతడు నిజముగ విభీషణుడైనను విభీషణవేషధారియగు రావణుడైనను శరణాగతరక్షణవ్రతైకదీక్షాదక్షుడనైన నేను అభయ మిచ్చితిని.

# వివేకానంద రామాయణము*

శ్రీరామాయణమునకు ఋషి, అనగా దానిని వ్రాసినకవి, వాల్మీకి ... రామాయణమేమో చాల చక్కని రచన. అది అట్లే మనకాలమునకు సంక్రమించినది. విశ్వసారస్వతములలో రామాయణమునకు సాటిలేదు.

భారతదేశమున అయోధ్య యను ప్రాచీన నగర ముండెను. ఇప్పటికిని ఉన్నది. ఆ నగరమున్న రాష్ట్రమునకు ఔడ్ అని పేరు. మీలో అనేకులు భారతదేశపటములో దానిని గుర్తించియుందురు. అదే ప్రాచీనమగు అయోధ్య. ప్రాచీనకాలమున అందు దశరథుడను రాజేలుచుండెను. ఆయనకు రాణులు ముగ్గు రుండిరి, కాని బిడ్డలు లేరు. ఆదర్శహిందువు లందఱివలెనే ఆరాజును ఆరాణులును సంతతి గోరి యాత్రలు చేసిరి, ఉపవాసము లుండిరి, ప్రార్థనలు సల్పిరి. కొన్నాళ్లకు నలుగురు కొమారులు పుట్టిరి. వారిలో జ్యేష్ఠుడు రాముడు.

ఆకాలమున జనకుడను మఱియొక రాజు కూడ నుండెను. ఆయనకూతురు సీత చాల చక్కనిది. ఆమె పొలమున లభించినది, భూదేవికి పుత్త్రి వేఱు తల్లిదండ్రులు లేరు. సంస్కృతభాషలో సీత యను పదమునకు నాగంటిచాలు అని యర్థము. భారతదేశ

* కాలిఫోర్నియా - పసడెనలోని షేక్స్పియరుక్లబ్బులో 31-1-1900 తేదినాడు ఉపన్యాసము.

ప్రాచీనపౌరాణికకథలలో తల్లిదండ్రులలో ఒకరు లేక పుట్టినవారు, తల్లిదండ్రు లిద్దఱును లేక పుట్టినవారు, యజ్ఞకుండమున పుట్టినవారు, యజ్ఞభూమినుండి జన్మించినవారు— ఈ మొదలగువారు కానవగుచుందురు, మేఘమండలమునుండి ఊడిపడ్డట్లు. భారతదేశ పురాణేతిహాసకథలలో ఇట్టియద్భుతజననములు మామూలే. సీత భూదేవిపుత్త్రిక కావున కళంకగంధమైనను లేని పరమపవిత్రురాలు. జనకమహారాజు ఆమెను పెంచుకొనెను. ఆమెకు పెండ్లివయస్సు రాగానే రాజు తగిన వరుని సంపాదింపగోరెను.

భారతదేశమున స్వయంవర మను నొక ప్రాచీనాచార ముండెను; రాజసుతలు స్వయముగ తమభర్తల నెన్నుకొను క్రమ మది. దేశమున వివిధభాగములనుండి పలువురు రాజకుమారులు ఆహ్వానింపబడుదురు. రాజకుమారి వివాహాలంకారభూషితయై, మాలాహస్తయై ఆసీనులయియున్న ప్రభువులమధ్య వారిని జూచుచు పోవును. ఒకచేటి ఆమెతోకూడ పోవుచు హాజరయియున్న రాజుల విశిష్టయోగ్యతలను దెలుపుచుండును. రాజకుమారి తనకు నచ్చిన రాజన్యునికంఠమున పుష్పమాలను వేసి తన వరణమును సూచించెడిది. అంతట వారిపెండ్లి విభవోత్తరముగ జరుగును. సీతను పెండ్లాడ గోరిన రాజకుమారులు లెక్కకు మిక్కిలిగ నుండిరి. ఆమెను బెండ్లాడుటకు నిర్ణయింపబడిన వీర్యశుల్కము హరధను వను మేటివింటిని వంచుట. ఈ యద్భుతమును నెగ్గింప సకలరాజకుమారులును తమ యావచ్ఛక్తిని వినియోగించిరి, కాని విఫలమనోరథులైరి. తుదకు రాముడు ఆ ప్రబలధనువును చేతులతో నెత్తి సునాయాసముగా వంచెను, అది రెండుగా తునిగెను. ఈవిధముగ సీత దశరథరాజనందనుడైన శ్రీరాముని తనభర్తగా నెన్నుకొనెను. సీతారాములవివాహము మహావైభవముతో జరిగెను. రాముడు సీతను తననగరమునకు బిలుచుకొని వచ్చెను.

అప్పుడు శ్రీరాముని యువరాజుగా చేసి తాను విశ్రాంతి నొంద దగిన సమయము వచ్చిన దని తండ్రి వృద్ధుడు తలంచెను. పట్టాభిషేకమహోత్సవమునకు సర్వసన్నాహము లయినవి. దేశమంతయు ఆ శుభమును గూర్చి మహానందము నొందెను. అప్పుడు రాణులలో అందఱికంటె చిన్నదియగు కైకేయికి ఆమె పరిచారికలలో ఒకతె "చిరకాలము నాడు రాజు నీకు రెండు వరముల నిచ్చియుండెను కదా" అని జ్ఞప్తిచేసెను. మును పొకనాడామె తనసేవచేత రాజునకు మహాప్రీతిని గలిగింపగా ఆయన ఆమెకు రెండువరముల నీయ బూనెను. "నాకు శక్యమైనవానిని ఏవేని రెంటిని కోరుము. వానిని నీకిత్తును" అని అనెను. అప్పు డామె ఏమియు అడుగలేదు. అందుంగూర్చి ఆమె పూర్తిగా మఱచి పోయెను. ఆమెపరిచారికలలో పాపచిత్తయగు నొకతె ఆమెకు దుర్బోధ చేయ దొడగెను. రామునకు కలుగు రాజ్యప్రాప్తినిగుఱించి ఆమెకు అసూయ హెచ్చునట్లు చేసెను. భరతుడే రాజైన ఎంతబాగుండునో బాగుగా తలకెక్కించెను. కైకేయి ఈర్ష్యచే ఉన్మత్తురాలాయెను. అంత నా పరిచారిక "నీ రెండు వరములను రాజు నిప్పు డడుగుము. భరతునకు రాజ్యాభిషేకము చేయవలె ననుట ఒకవరము. రాము నడవుల కంపి పదునాలుగేండ్లచట వసింపజేయవలె ననుట రెండవవరము" అని బోధించెను.

వృద్ధుడైన రాజునకా, రాముడే ప్రాణము, రాముడే ఆత్మ, దురుద్దేశ్యముతో ఆయనను

ఈ వరము లడుగగనే, రాజు గావున మాట తప్పలేక పోయెను. కింకర్తవ్యతామూఢు డయ్యెను. కాని శ్రీరాముడు రాజ్యమును మానుకొని అడవికిపోవుటకు పరమసంతోష ముతో పూనుకొని అసత్యదోషము కలుగ నీయక తండ్రి నుద్ధరించెను. ఆ విధముగ రాముడు అడవులలో పదునాలుగేండ్లు వసింప నేగెను. ప్రియురాలగు సీతయు భక్తసోదరు డగు లక్ష్మణుడును ఆయనతోనే పోయిరి. ఏమి చెప్పినను వా రాయనను వెంబడింపక మానరైరి.

ఘోరారణ్యములలో వసించుచుండిన ప్రజలను ఆర్యు లెఱుగరు. ఆ వనవాసిగణము లను ఆర్యులు వానరు లని పేర్కొనిరి. వారిలో అసాధారణబలపరాక్రమవంతులుగ నున్న వారిని రాక్షసు లని పేర్కొనిరి

రాక్షసులును వానరులును వసించెడి అడ వులలోనికి సీతారామలక్ష్మణులు వచ్చి చేరిరి. సీత రామునితోకూడ అడవులకు వత్తు నన్న ప్పుడు "అడవులలో మన మెఱుగని యాపదలు మెండుకొనియుండునే, నావెంబడి వచ్చి రాజ కుమారివైన నీవు ఆ కష్టముల నన్నింటి నెట్లు భరింపగలవు ?" అని రాము డడిగెను. సీత "రాముడుపోయినచోట్లకెల్ల సీతయు పోవును. రాజకుమారినని ఉత్తమజన్మనని ఈమాట లన్నియు ఎందులకు? నీకు ముందుగా నేను పోవుచుందును" అని చెప్పెను అట్లే పోవు చుండెను. ఇక తమ్ముడా, అతడును వారితో కూడ పోయెను. వా రడవిలో చొచ్చి చాల దూరముపోయి గోదావరితీరమును చేరుకొనిరి. అచ్చట చిన్నకుటీరమును నిర్మించుకొనిరి. రామలక్ష్మణులు జింకలను వేటాడి పండ్లను సేకరించుకొని వచ్చుచుందురు. ఇట్లు వారు కొంతకాలము గడపిన పిమ్మట అచ్చటి కొక రాక్షసి వచ్చెను. ఆమె లంకేశ్వరుని చెల్లెలు. స్వేచ్ఛగ అడవిలో తిరుగుచు రాము డున్నెడకు వచ్చెను. అతని దివ్యాద్భుతసౌందర్యమును చూచినప్పుడు తక్షణమే ఆమెకు వలపు కలి గెను. కాని రాముడు పరమపవిత్రజీవి, వివా హితుడు, కావున ఆ రాక్షసిప్రేమకు బదులు ప్రేమ చూపలేకపోయెను. ఆకసి తీర్చుకొను టకై యామె రాక్షసరాజగు తన యన్నయొద్దకు పోయి రామవల్లభయు, భువనమోహినియు నగు సీతనుగూర్చిన సకలవృత్తాంతమును దెల్పెను.

మానవులందఱిలో రాముడు జగదేక వీరుడు. దైత్యులుగాని దానవులుగాని వేఱెవరు గాని అతనిని గెలువగల బలవంతులు కారు. కావున రాక్షసరాజు కుట్ర పన్నవలసివచ్చెను. అతడు మాయావియగు మఱియొకరాక్షసుని తోడ్పఱచుకొని అతనిని సుందరసువర్ణహరిణ ముగమార్చెను. ఆ హరిణము రామునినివాసము నకుచుట్టును దుముకుచుండెను. సీత దాని చక్క దనమును జూచి ఆశపడెను. దానిని పట్టి తెమ్మని రాముని కోరెను. సీతను లక్ష్మణుని రక్షణలో నుంచి రాముడు జింకను తఱుముచు అడవిలోనికి పోయెను. అప్పుడు లక్ష్మణుడు తమకుటీరము చుట్టు నొక యగ్నివలయము నేర్పఱచి "ఈ దినము నీ కేదేని ఆపద కలుగవచ్చు నని తోచుచున్నది. కావున నీకు నేను చెప్పున దేమనగ, ఈ మాయావలయమునకు వెలు పలికి పోకుండుము. పోయితివా ఏదేని ఆపద కల్గును" అని సీత నెచ్చరించెను. ఇంతలో రాముడు మాయామృగముపై బాణమును ప్రయోగించెను. అది తత్క్షణమే జింకరూపమును బాసి మానవరూపము పొంది మరణించెను.

తత్క్షణమే 'ఓ లక్ష్మణా, రమ్ము, తోడ్పడు' మని రామునిగొంతుతో నొకపిలుపు పర్ణ

శాలకు వినవచ్చెను. 'లక్ష్మణా, వెంటనే వెడలుము, అడవిలో రామునకు తోడ్పడుటకు' అని సీత త్వరపెట్టెను. 'అది రాముని కంఠధ్వని కాదు' అని లక్ష్మణుడనెను. కాని సీత ప్రార్థనలను కాదనలేక లక్ష్మణుడు రాముని వెదకుచు పోవలసియే వచ్చెను. అతడు వెడలి పోవగానే రాక్షసరాజు సన్న్యాసిరూపమున ద్వారమునొద్ద నిలిచి భిక్ష మడిగెను. 'ఇంచుక సేపుండుడు, నాభర్తయింటికి మరలి వచ్చును. అప్పుడు సమృద్ధిగ భిక్షము నర్పింతును' అని సీత చెప్పెను. అతడు 'కల్యాణీ, నేను వేచి యుండలేను. ఆకలి తీవ్రముగా నున్నది. నీదగ్గఱ ఉన్నదానినే పెట్టుము' అనెను. అంతట సీత కుటీరమున తనయొద్ద నుండిన కొన్ని పండ్లను తీసికొని బయటికి వచ్చెను. 'నేను సన్న్యాసిని, నీకెట్టిభయమును అక్కఱ లేదు. భిక్షమును గొని నాసమీపమునకు రమ్ము' అని యతడు పెక్కురీతుల నచ్చ జెప్పెను. సీతయు మాయావలయమును దాటి వెలికి వచ్చెను. తత్క్షణమే సన్న్యాసి రాక్షస రూపమును ధరించి చేతులతో సీతను గట్టిగా పట్టుకొని తనమాయారథమును ఆహ్వానించెను. విలపించుచున్న సీతను ఆ రథముపై నుంచు కొని అతడు పరారి యయ్యెను. పాపము సీత కేవలము అసహాయురాలు. తోడ్పడుట కచ్చట నెవ్వరును లేరు. రాక్షసుడు అట్లు ఆమెను కొనిపోవుచుండగా ఆమె తనచేతులనుండి నగలను కొన్నింటిని తీసి అప్పుడు కొన్ని అప్పుడు కొన్నిగా నేలమీదికి జాఱ విడుచుచుండెను.

రావణుడు సీతను తన లంకారాజ్యమునకు (సింహళద్వీపమునకు) కొనిపోయెను. అతడు అచ్చట పెక్కు ఆశలు చూపి తన్ను పెండ్లాడు మని ఆమెను కోరెను. కాని సీతామహాదేవి పాతివ్రత్యధర్మమునకు మూర్తీభావము. కావున ఆమె ఆరాక్షసునితో పలుకనైన పలుకదు. తనకు పత్ని యగుటకు సమ్మతించువఱకు ఆమె కొకశిక్షగా అత డామె నొక చెట్టుక్రింద అహోరాత్రములు వసింపజేసెను.

రామలక్ష్మణులు పర్ణశాలకు మరలి వచ్చిరి. అచ్చట సీత లేకుండుటను జూచినప్పుడు వారి దుఃఖము మితిమీఱెను. ఆమె కేమి వాటిల్లి నదో వా రూహింపలేకైరి. సోదరు లిద్దఱును ప్రతిచోటను ఆమెను వెదకుచునేపోయిరి. ఆమె జాడను కనుగొనలేకపోయిరి. చాలదూరము వెడలిన పిమ్మట వారొక వానరసమూహమును సంధించిరి. ఆవానరులమధ్య దివ్యవానరు డగు హనుమంతు డుండెను. వానరోత్తము డగు హనుమంతుడు శ్రీరామున కత్యంతభక్తుడును దాసుడు నయ్యెను. సీతను మరల పడయుట కత డెట్లు తోడ్పడెనో మనము చూడ నున్నాము. శ్రీరామునందతనిభక్తి యంత గొప్పదగుటచేతనే హిందువులు ఇప్పటికిని ఆయనను ఆదర్శభగవద్దాసునిగా పూజించు చున్నారు. వానరులు, రాక్షసులు అనగా 'దక్షిణహిందూదేశమందలి ఆదిమనివాసులే' అని మీ రెఱుగుదురు.

అట్లు రాముడు వానరుల మైత్రిని సంపాదించెను. తా మొకనాడు ఆకాశమున భువనసుందరి యగు నొక వనితను రథమున కొంపోవు చున్న రాక్షసుని జూచితి మని ఆ వానరులు తెలిపిరి. ఆమె మిక్కిలి విలపించుచుండె ననియు తా మున్నచోటికి పైభాగమున ఆ రథము పోవుచున్నప్పుడు తమచూపును తనవైపునకు మరలించుకొనుటకై ఆమె తన నగలలో నొక దానిని క్రింద పడవేసె ననియుకూడ వారు చెప్పిరి. అంతట వారు ఆ నగను రామునకు చూపిరి. లక్ష్మణుడు దానిని గైకొని 'ఇది ఎవరిదో నే నెఱుగను' అని చెప్పెను. అంతట

రాముడు దానిని గైకొని గుర్తించి "ఔను ఇది అని చెప్పెను. లక్ష్మణుడు దానిని గుర్తింపలేక పోయెను. ఏల యన వదినె పూజ్యురాలు. కావున మఱది ఆమెభుజముల వైపుగాని కంఠమువైపుగాని కన్నెత్తిచూడడు. అది భారతదేశాచారము. అది కంఠహార మైనందున లక్ష్మణుడు గుర్తింపలేకపోయెను. ఈఇతిహ్యాములో సనాతనభారత దేశాచారము వ్యంజితమై యున్నది. అంతట వానరులు ఆ రాక్షసరాజెవ్వరైనదియు అత డెచ్చట నుండు నదియు రామునకు దెల్పిరి. అందఱును బయలు

అప్పుడు రాజ్యము నిమిత్తము వానర రాజైన వాలికిని, అతనితమ్ముడైన సుగ్రీవుని కిని పోరాటము జరుగుచుండెను. వాలి సుగ్రీవుని రాజ్యమునుండి తఱిమి యుండెను. రాము డిప్పుడు తోడ్పడగా, సుగ్రీవుడు వాలినుండి రాజ్యమును మరల సంపాదించెను. ఈ యుపకారమునకు ప్రత్యుపకారముగా సుగ్రీవుడు రామునకు తోడ్పడుదునని వాగ్దానము చేసెను. వారు చుట్టునున్న దేశ మంతయు వెదకిరి, గాని సీత అగపడ లేదు. తుదకు హనుమంతుడు భారతదేశదక్షిణసముద్రతీరమునుండి ఒక్క ఎగురు ఎగిరి దాటి సింహళమునుజేరి అచ్చట నలువైపులను సీతను వెదకెను. కాని ఆమె కనిపింపలేదు.

రాక్షసరాజు సకలమానవులను జయించిన వాడు వేల్పులను జయించినవాడు, వేయేల, లోకమంతయు జయించినవాడు. లభించిన యందగత్తెల నందఱిని సమకూర్చుకొని అతడు తనకు ప్రియురాండ్రనుగా చేసికొని యుండెను. కావున 'సీత రావణాంతఃపురమున నుండ' దనియు 'అట్టిచోట ఉండుటకంటె ఆమె ఆత్మహత్య చేసికొనియుండు' ననియు హనుమంతు డూహించెను. కావున హనుమంతు డామెను వేఱుచోటలో వెదకబోయెను. తుట్టతుద కతడు ఒకచెట్టుక్రింద కృశించి వెల్లనై కృష్ణపక్షచంద్రరేఖవలె నున్న సీతను చూచెను. అప్పుడు హనుమంతుడు చిన్నవానరరూపమును దాల్చి ఆచెట్టుపై కూర్చుండెను. రావణుడు పంపిన రాక్షసస్త్రీలు సీతను భయపెట్టి వశపఱచుకొనుటకు చేయుచున్న ప్రయత్నములను ఆమె రాక్షసరాజు పేరునే ఎత్తనీయకుండుటను హనుమంతుడు చూచుచుండెను.

అంత హనుమంతుడు సీతను సమీపించి తాను రామదూతననియు, సీత యున్నచోటును కనుగొను మని రాముడు తన్ను పంపె ననియు తెలిపి గుర్తుగ రాముడు తనచేతి కిచ్చిన అంగుళీయకమును ఆమెకు చూపెను. 'నీవు ఇచ్చట నున్నా వని తెలిసిన తత్క్షణమే రాముడు సేనా పరివృతుడై ఇచ్చటికి వచ్చి రాక్షసుని పడ గొట్టి నిన్ను పిలుచుకొనిపోవును' అనియు చెప్పెను. ఆమెకు ఇష్టమగునేని ఆమెను తన భుజములపై నెక్కించుకొని ఒక్కయెగురున సముద్రమును దాటి రామునొద్దకు చేర్తు నని హనుమంతుడు చెప్పిచూచెను. కాని, సీతరూపు దాల్చిన పతివ్రతాధర్మమే. కావున పరపురుష శరీరస్పర్శను సహింపని ఆమెకు ఆయుపాయము సహ్యముగ నుండ లేదు. కావున సీత అచ్చటనే యుండెను తన చూడామణిని మాత్ర మతని చేతి కిచ్చి రామునొద్దకు పంపెను. హనుమంతుడు రామునొద్దకు మరల వచ్చివేసెను.

సీతనుగూర్చి హనుమంతుడు తెలిపిన సకల వృత్తాంతము నెఱిగి సేనలను కూర్చుకొని శ్రీరాముడు భారతదేశదక్షిణాగ్రమునొద్దకు చనెను. అచ్చట రాముని పరివారమగు వానరులు భారతదేశమును సింహళముతో కలుపు సేతుబంధ మనెడి పెద్దవంతెనను కట్టిరి. లోతు తక్కు

వగా నున్న యా వైపు ఇసుకదిబ్బలమీదుగ భారతదేశమునుండి దాటి సింహళమును చేరు కొనుట ఇప్పుడుకూడ సాధ్యమే.

రాముడు దేవుని యవతారమే. కానున్న ఆపనుల నన్నిటిని ఆయన చేసియుండజాలడు. ఆయన దేవునవతార మనియే హిందువుల నమ్మకము. దశావతారములలో రామావతారము ఏడవ దని భారతీయుల విశ్వాసము.

వానరులు పెద్దపెద్దకొండలనే యెత్తుకొని వచ్చి సముద్రములో పడవేసి, రాళ్ళతోను చెట్లతోను కప్పి ఒకపెద్దవంతెనను నిర్మించిరి. చిన్నఉడుత ఇసుకలో పొర్లాడుచు మాటి మాటికిని సముద్రములోనికి పోయి తన దేహము లోని యిసుకను విదిలించుచు వచ్చుచుండెను. ఇట్లు అదిసైతము తన శక్తికొలది సముద్రములో ఇసుకను చల్లి సేతునిర్మాణమునకు తోడ్పడినది—అని యొక ఐతిహ్యమును చెప్పుచుందురు. పెద్దకొండలను పూర్తి అడవులను ఇసుకమొత్తములను తెచ్చి వేసి వంతెన కట్టుచున్న వానరులు తనదేహము నిసుకలో పొర్లించి ఆయిసుకను సముద్రములో విదిలించుచున్న చిన్న ఉడుతను జూసి నవ్విరట. రాముడు దానిని జూచి 'శుభమొందును గాక ఈచిన్నఉడుత! తనశక్తికొలది అది పాటు పడుచున్నది. కావున మీలో చాల గొప్ప వారికి కలంత గొప్పతనము దానికిని కలదు.'' అని చెప్పి రాముడు ఉడుతవీపును చేతితో నిమిరెనట. రాముని వ్రేలి గుర్తులుగ పడిన మూడు నిలువుచారలు ఇప్పటికిని ఉడుతల వీపుపై కనవగుచుండును.

సేతుబంధనము పూర్తికాగానే రామలక్ష్మణుల నాయకత్వమున వానరసేనయంతయు లంకలో ప్రవేశించెను. తరువాత పెక్కు నెలల కాలము ఘోరయుద్ధము రక్తపాతము జరిగినవి. తుట్టతుదకు రాక్షసరాజు నిర్జితుడును నిహతుడు నయ్యెను. భవనములు మున్నుగా సమస్తమును బంగారముతో నిర్మితములై యున్న యాతని రాజధాని వశపడెను. భారతదేశములో దూరప్రాంతమున నున్న గ్రామము లందు ''నేను లంకకు పోయి యుంటి'' నని చెప్పినప్పుడు అమాయక ప్రజలు 'అచ్చట ఇండ్లన్నియు మన గ్రంథములు చెప్పిన ప్రకారము బంగారుమేడలే' యని యనుచుందురు. ఈ విధముగ ఈ బంగరుపట్టణము లన్నియు శ్రీరామునకు వశములయ్యెను. ఆయన వానిని రావణుని తమ్ముడగు విభీషణున కిచ్చెను. యుద్ధములో విభీషణుడు రామునకమూల్యమైన సాహాయ్యము చేసియుండెను. అందులకు ప్రత్యుపకారముగ రాముడు విభీషణుని రావణుని స్థానమున లంకారాజ్యపీఠిపై నెలకొల్పెను,

అంతట రాముడు సీతతోను తన అనుచరులతోను లంకనుండి బయలుదేరెను. కాని అనుచరులలో నొకగొణుగు ప్రాకినది. 'రావణుని యింట నుండిన సీత తన శీలవిశుద్ధిని రుజువు చేసికోలేదు. కావున పరీక్ష, పరీక్ష కావలెను' అని వారు ఘోషించిరి. 'విశుద్ధురాలు, రూపు దాల్చిన పరమపతివ్రతా ధర్మమే సీత' అని రాముడు చెప్పెను. ''అయినను పరీక్ష మాకు జరూరు'' అని ప్రజలు పట్టుపట్టిరి. అంత నొక పెద్ద యాగాగ్ని సిద్ధపఱుపబడెను. సీత అందు లోని కుఱుకవలసి యుఱికెను. ఆమె భస్మమైపోయెనేమో అని రాముడు వ్యథ చెందెను. కాని ఒకక్షణములో అగ్నిదేవుడు ప్రత్యక్షమయ్యెను. అగ్నిదేవుని తలపై నొక సింహాసన ముండెను. దానిపై సీత అధివసించియుండెను. అప్పుడు లోకమంతయు ఆనందమున నోలలాడెను. ప్రతివానికిని సంతృప్తి కలిగెను.

వనవాస ప్రారంభమప్పుడు తమ్ముడైన భరతుడు రామునొద్దకు వచ్చి వృద్ధరాజమరణ వార్తను దెల్పి 'రాజ్యపీఠమును నీ వధిష్ఠింప వలసినదే' అని రాముని నిర్బంధించి చేసి యుండెను. రాముడు వనవాసము చేసినంత కాలము భరతుడును సింహాసన మెక్కలేదు. భక్తితో రామునికిబదులు రామపాదుకలకు పట్టాభిషేకము చేసెను. అనంతరము రాముడు రాజధానికి వచ్చెను. సర్వప్రజానుమతితో అత డయోధ్యాపతి యయ్యెను.

రాజ్యపునఃప్రాప్తి కనంతరము రాముడు ప్రజలమేలుకై ఆకాలమున రాజులు చేయవల సిన ప్రతిజ్ఞల నన్నిటిని చేసెను. రాజు ప్రజలకు బంటు. ప్రజల యభిప్రాయమునకు రాజు తల యొగ్గ వలసినదే. ఈ విషయము మనకు ముందు ముందు స్పష్ట మగును. సీతతోకూడి రాముడు కొన్ని సంవత్సరములు హాయిగ గడపెను. సీత రాక్షసునిచే అపహరింపబడి దనియు, సముద్ర మున కావలికి కొంపోవబడిన దనియు ప్రజలు తమలో మరల గొణుగుకొనసాగిరి. ఇంతకు మునుపు జరిగిన పరీక్ష వారికి సంతృప్తికరముగ లేదు. 'మరల నొకతూరి ఆమెను పరీక్షింప వలయును. లేదా నగరమునుండి ఆమెను వెలి కంపివేయవలెను' అని వారు ఘోషపెట్టిరి.

ప్రజల అపేక్షితమును దీర్చుటకై రాముడు సీతను బహిష్కరించెను. కవియు మునీంద్రుడు నగు వాల్మీకియాశ్రమ ముందు అడవిలో ఆమెను విడిచిపెట్టించెను. అసహాయురాలై గతి లేక విలపించుచున్న సీతను గని ఆమె విషాద వృత్తాంతమును విని ముని ఆమెకు తన ఆశ్రమ మున నిలువ నీడ నొసంగెను. సీత అప్పుడు పూర్ణగర్భిణి. అచిరకాలములోనే ఆమె కవల పిల్లవాండ్రను కనెను. కవి ఆ శిశువులకు వా రెవరిబిడ్డలైనదియు తెలుపనే లేదు. బ్రహ్మ చారులుగ వారు ఆయన పోషణలో నెదిగిరి. అంతట ఆయన రామాయణ మనెడి కావ్య మును రచించి దానిని గానాభినయయోగ్య ముగ కావించెను.

భారతదేశమున రూపకములకు ఎంతో పవి త్రత కలదు. రూపకమును సంగీతమునే మత ధర్మము లనితలంపబడుచుండెను. ప్రేమగేయ ములో గాని ఏపాటలో గాని తన ఆత్మను పూర్తిగ లీన మొనర్పగలవాడు విముక్తి నొందును. అతడు వే రేమియు చేయ నక్కఱ లేదు. ధ్యానశీలురు చేరు లక్ష్యమునే గాన శీలురును చేరుదు రని చెప్పుదురు.

రామాయణమును అభినయార్హముగా నొనర్చి దానిని పఠించుటకును పాడుటకును రాముని కుమారుల కిద్దఱికిని వాల్మీకి నేర్పెను.

కొన్నాళ్లకు రాముడు ప్రాచీనప్రభువులు సాధారణముగ చేయు నొక గొప్పయజ్ఞమును చేయ తలపెట్టెను. భారతదేశమున వివా హితుడైనవాడు పత్నిని తనప్రక్కనే ఉంచు కొనక ఏ క్రతువునుగాని చేయగూడదు. పత్ని పెనిమిటిప్రక్కనే ఉండవలెను; సహధర్మిణి అనునది పత్నికి వాచకము. హిందుగృహస్థుడు అనుష్ఠింపవలసిన కర్మకలాపాలు నూర్లకొలది గ నున్నవి. కాని తనవంతును తాను నిర్వ హించుటకు అతని కొకపత్ని యుండకపోయి నచో సక్రమముగా ఏ కర్మమును జేయుటకును శాస్త్రప్రకార మతనికి యోగ్యత లేదు.

ఇప్పుడు రామునిభార్య వివాసిత అయి యున్నందున ఆమె అతనిప్రక్కన లేదు. కావున ప్రజలు రాముని పునర్వివాహము చేసికొ మ్మనిరి. కాని ప్రజల యీ కోరికను మాత్ర మాయన ప్రతిఘటించెను. ప్రభువుగా ఆయన ప్రజలకొఱకు ప్రతిఘటించుట కిదే

మొదలు. 'అన్నిటికిని కానేరదు, నా జీవితము సీతదే' అని ఆయన చెప్పెను. కావున యజ్ఞకరణార్థమై అప్పుడు సీతాదేవికి బదులు బంగారముతో నొక సీతాప్రతిమ చేయబడెను. ఆ మహోత్సవసందర్భమున భక్తిని పెంపొందించుటకై రూపకప్రదర్శనమునకుకూడ ఏర్పాట్లు చేయబడినవి. మహర్షియు కవియు నగు వాల్మీకి తనశిష్యులగు కుశలవులతో వచ్చెను. వారు రాముని పుత్రు లనుట ఎవ్వరికిని తెలియని విషయము. నాటకమున కొకరంగము నిర్మిత మయ్యెను. ప్రదర్శనమునకు సర్వము సిద్ధముగ నుండెను. ప్రేక్షకమండలి విశాలమై యొప్పెను. రాముడును ఆయనతమ్ములును ఆస్థానమందలి దొరలును సకలప్రజలును అందుండిరి. వాల్మీకిదర్శకత్వమున కుశలవులు రామాయణమును పాడిరి. వారి రూపమును జూచి మధురకంఠమును విని సదస్యు లందఱును ముగ్ధులైరి. పాపము రాము డించుమించు వెఱ్ఱివా డయ్యెను. నాటకములో సీతావివాస ఘట్టము వచ్చినప్పు డేమి సేయుటకును ఆయనకు తోపలేదు. అప్పుడు ముని 'దుఃఖింపకు, నీ సీతను నీకు జూపెదను' అని రాము నూఱడించెను. సీత రంగముమీదికి వచ్చినది. ఆమె దర్శనముచే రాము డానందించెను. కాని తటాలున 'పరీక్ష' 'పరీక్ష' అను ప్రాతగొణుగు ఉప్పతిల్లెను. ఇట్లు మాటిమాటికిని ప్రజలు నిర్దయముగా తన ప్రతిష్ఠ నవమానింపగా పాపము సీత పరవశురా లయ్యెను. ఇక నోర్చుకోలేక పోయెను. తనశీలవిశుద్ధిని నిరూపింపు డని ఆమె వేల్పులను ప్రార్థించెను. అప్పుడు భూమి తెఱచుకొనెను. 'ఇదిగో రుజువు' అని బిగ్గఱగా చెప్పుచు సీత భూగర్భమున అంతర్హితురా లయ్యెను. ఈ విషాద పర్యవసానమునకు ప్రజలు నిర్విణ్ణులైరి. రాముడు దుఃఖమున మునిగిపోయెను.

సీత అంతర్ధానమైపోయినపిదప కొన్నాళ్లకు ఒకదేవదూత రామునొద్దకు వచ్చి 'నీ యవతారకార్యము ముగిసినందున నిత్యధామమునకు వేంచేయవలసిన' దని దేవతల సందేశమును అందజేసెను. ఈ సందేశముచే తాను భగవంతు డను జ్ఞప్తి ఆయనకు కలిగెను. తన నగరపార్శ్వమున ప్రవహించుచుండు సరయూనదిలోని కుఱికి రాముడు పరలోకమున సీతను కలిసికొనెను.

ఇది భారతీయుల ప్రాచీనేతిహాసము. గొప్ప ఇతిహాసము. సీతారాములు భారతదేశీయులకు లక్ష్యములు. శిశువు లందఱును, ముఖ్యముగా బాలికలు, సీత నారాధింతురు. విశుద్ధురాలును భక్తురాలును సర్వంసహాయు నగు సీతను పోలియుండుటకంటె భారతీయమహిళ కోరదగిన యున్నతి వేఱొకటి లేదు. ఈపాత్రలను పరిశీలించినప్పుడు పాశ్చాత్యుల లక్ష్యముకంటె భారతీయుల లక్ష్యము ఎట్లు వేఱైనదో మీకు స్పష్ట మగును. జాతి కంతటికిని సహనమునకు ఆదర్శమై సీత ఉన్నది. 'పనిలో శక్తి చూపు' డనుట పాశ్చాత్యుల ఆదేశము. 'ఓర్పులో శక్తిచూపు' డనుట భారతీయుల ఆదేశము. మానవు డెంత సంపదను గడింపగల డనెడి సమస్యను పరిష్కరించినవారు పాశ్చాత్యులు. మానవుడు సంపద నెంతెంతగ త్యాగము చేయగల డను సమస్యను పరిష్కరించినవారు భారతీయులు. ఒకటి ఒకవైపు పరమావధి, రెండవది వేఱొకవైపు పరమావధి. చూచితిరా? ఆదర్శభారతీయతకు సీత ఉత్తమోదాహరణము. సీత అను నొకతె నిజముగ నొకప్పు డుండెనా, ఆమెకథ నిజమా, కల్పితమా అను ప్రశ్నలజోలి మనకు లేదు. సీత

అనెడి లక్ష్య మున్న దని మన మెఱుగుదుము. సీతాలక్ష్యమువలె యావద్దేశవ్యాప్తమై జీవితములోనికి అంతగాఢముగ చొచ్చుకొని పోయి భారతీయుల ప్రతిరక్తబిందువులోను కలిసిపోయిన పౌరాణికగాధ వేఱొకటి లేదు. మంచికి గాని, పవిత్రతకు గాని, విశుద్ధికి గాని, భారతీయమహిళాధర్మమునకుగాని సీత పెట్టినది పేరు. పురోహితు డొక మహిళ నాశీర్వదింప వలసివచ్చినప్పుడు 'సీతవలె నుండు' మనియే ఆశీర్వదింపవలెను. ఒకశిశువును దీవించునపుడు సైతము అతడు 'సీతవలె నుండు' మనియే అనును. వా రందఱును సీతబిడ్డలు, సీతలుగా అగుటకై ప్రయత్నించుచున్నారు. ఎటువంటి సీత యనగా, క్షమాశీల, సర్వంసహ, సదా విశ్వాసపూర్ణ, సదాపరమసాధ్వి. ఎంతెంత కష్టములో అనుభవించునప్పుడుసైతము రాముని గూర్చి కటువైన మాట ఒక్కటైనను ఆమె నోట రాలేదు. అంతయు తనవిధి అని భావించి తనవంతును ఆమె నిర్వహించును. ఆమెను అడవిలో విడిచిపెట్టుట ఎంత ఘోరాన్యాయమో ఆలోచింపుడు. కాని ఆమెలో పరుషత లేదు. అదియు భారతీయాదర్శమే. ప్రాచీనుడైన బుద్ధు డిట్లన్నాడు — ఎవడేని నిన్ను హింసించినపుడు ప్రతిహింస చేయుటకు నీవు మరలుదువేని తొలిహింస కది ప్రతిక్రియ కాదు. లోకములో ఉన్న దౌర్జన్యములతో బాటు నీచేష్టయు నొకదౌర్జన్య మగును! సీత సహజముగ స్వచ్ఛమైన భారతీయధర్మము గలది, అపకారమునకు ప్రత్యపకార మెప్పుడును చేయదు.

పాశ్చాత్యదేశములలో వెలికి ప్రకాశించు శక్తియు బలమును లక్ష్యములు. ప్రాచ్యదేశములలో 'ఆపదలందు ధైర్యగుణము' లక్ష్యము—ఈలక్ష్యములలో మేలైన దేదో ఎవ రెఱుగుదురు?

ఆపదను అణచిపెట్టి దానిని తగ్గింతు మని పాశ్చాత్యులు చెప్పుదురు. భారతీయులు "మేము ఆపదల ననుభవించుచునే యుందుము. ఆపద ఆపద కాకుండపోవువఱకు అది యొక భోగముగ మాకు తోచువఱకును మాఅనుభవము సాగుచునే యుండును. ఆపదలను మేము రూపుమాపుపద్ధతి అది." అని చెప్పుదురు. రెండును గొప్పలక్ష్యములే. రెండింటలో తుద కేది దీర్ఘకాల ముండునో ఎవరు చెప్పగలరు? ఏవైఖరి మానవజాతి కధికలాభకరమో ఎవ రెఱుగుదురు? మృగస్వభావమును నిరాయుధముగ నోనర్చి గెలువగలది ఈరెంట నేదో ఎవ రెఱుగుదురు, సహనమా? నిరంహణమా?

ఇంతలో మన మొకరొకరి లక్ష్యమును ధ్వంసము సేయ ప్రయత్నింపకుందుము గాక. మన ముభయులము సాధింప నెంచిన పని యొకటే, ఏ మనగా ఆపదలను అంతరింపజేయుట. మీ దారిని మీ రనుసరింపుడు. మా దారిని మ మ్మనుసరింపనిండు. మనము లక్ష్యమును చెడగొట్టుకొనకుందము గాక. మా మార్గము ననుసరింపు డని పాశ్చాత్యులను నేను కోరను, మిమ్మాటికిని కోరను. గంతవ్యమేమో ఒక్కటే గాని దారు లెప్పుడును ఒక్కటిగ నుండలేవు. కావున భారతీయుల ఆదర్శములను విన్న పిమ్మట "మీ లక్ష్యము మీఆదర్శము మీకు బాగున్నవి. మాలక్ష్యము మాఆదర్శము మాకు బాగున్నవి. మీ లక్ష్యమును మీ రనుసరింపుడు. మీకు నచ్చినట్లుగ మీదారిని మీరు పొండి, మీకు దేవుడు తోడ్పడును గాక" అని మీరు భారతీయులతో చెప్పుదు రనుకొందును. ప్రాచ్యులకును పాశ్చా

త్స్యలకును ఉన్న లక్ష్య మొక్కటే. ఎంతవిరుద్ధముగ నైన అది పైకి కనిపింపవచ్చును. లక్ష్య మొక్కటే అనియు, లక్ష్యములు వేఱు వేఱనెడి భ్రాంతిచే కలహింపకుడు అని వారికిని వీరికిని బోధించుటయే నాజీవితసందేశము. గహనమైన యీ జీవితపుకనుమలో సంచరించు మనము ఒండొరులకు శుభమును ఆశాసించుచుండుము గాక.

# అమరజ్యోతి శ్రీరామాయణము

ఇతిహాసరత్నమైన రామాయణమునకు గల విలువయు ప్రాముఖ్యమును సార్వకాలికములు సార్వలౌకికములు దానిప్రసక్తి ఏకొందఱికి మాత్రమే కాదు. ఏదో యొక యుగమునకే కాదు. అది సర్వకాలములవారికిని సమకాలికము. ఉపనిషత్తుల సందేశమువలె శ్రీరామాయణ సందేశమును విశ్వమానవతతికి ఉద్దేశింపబడినది. అన్ని దేశములలోనికి ప్రవహించి సకల భూములను సారవంతముచేయు నిత్యతత్త్వనదీప్రవాహ మది.

> వేదవేద్యే పరే పుంసి
> జాతే దశరథాత్మజే
> వేదః ప్రాచేతసా దాసీత్
> సాక్షా ద్రామాయణాత్మనా.

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగ నవతరించినప్పుడు వేదము వాల్మీకి వాక్కునుండి సాక్షా ద్రామాయణరూపమున వెలువడినది—అను ఈ సుభాషితమును బట్టి హిందువులకు వేద మెంతప్రమాణమో శ్రీమ ద్రామాయణమును అంతటి ప్రమాణమే అని తెలియుచున్నది. వేదప్రతిపాదితములైన వరిష్ఠార్థములే పురాణములందు సకలజనులకును సుబోధమైన శైలిలో అందజేయబడినవి. నిత్యమైన పరతత్త్వము ప్రత్యక్షపాత్రలద్వారా దేశ కాల సందర్భోచితముగ ప్రకటితమైనది. నిరవధికమైన తత్త్వము సావధికమైన రూపమున తన్ను ఇముడ్చుకొన్నది.

అజాయమానో బహుధా విజాయతే.

జన్మరహితుడు బహుజన్మము లెత్తుచున్నాడు. భగవదవతారరహస్య మే మనగ అది ఐచ్ఛికము, స్వకీయసంకల్పసిద్ధము, కర్మఫలభూతము కాదు. ప్రజోద్ధరణ జ్ఞానప్రదానములు అవతారప్రయోజనములు. కర్మవశ్యత కాని మాయాధీనత కాని పరమపురుషునకు లేదు. ఆయనచే వినియుక్తమగు శక్తియే మాయ. కర్మబంధచ్ఛేదకుడునుఆయనయే. ఐనను మానవరూపమున అవతరించినప్పుడు ఐహిక సుఖదుఃఖానుభవములకు స్వయముగనే ఆయన తన్ను గుఱి కావించుకొనుచు తనప్రవర్తనమును లోకులకు ఆదర్శముగ వెలయజేయుచున్నాడు.

రామాయణము అందఱికిని ఇంపుగొలుపును. సారళ్యకథారుచులచే శిశువులకు ప్రీతిగూర్చుచున్నది. రసభరితతచే ప్రతిభావిహారముచే కవుల కాసక్తిగొలుపుచున్నది. పరతత్త్వమును భోగ్యసుందరరూపమున సాక్షాత్కరింప జేయుచు అది ఆధ్యాత్మికసాధకులకును తత్త్వవిచారపరులకును భగవదనుభవతృషితులకును ప్రీతిగూర్చుచున్నది.

పండితమ్మన్యులు రామాయణమందలి 'తు' 'చ'' లను గూర్చి వాదించుకొన

వచ్చును. అర్థవిశేషములను అర్థవిభేదములను తలకొకరీతి ప్రతిపాదింపవచ్చును. "ఈ పని చేయుట రామునకు తగునా? "ఈ దుఃఖానుభవములు సీతకు కలుగదగినవేనాః" "విభీషణుడు స్వార్థపరుడును భ్రాతృద్రోహియు కదా?" అను ఈరీతి ప్రశ్నలను ఎన్నింటినైనను లేవదీయవచ్చు. కాని పరమపురుషుని వివేకానుగ్రహములు సామాన్య మానవుల ఖండనమండనరూప మనఃప్రవృత్తులకు అందునవి కావనెడి దృఢవిశ్వాసము భక్తులకు సడలదు.

రామాయణకథ ఎంతో కొంత తెలియని వారు బడిపిల్లలలోనైనను ఉండరు. శ్రీరామాయణకథయందు వచ్చు వ్యక్తులు కొన్ని ఆదర్శములకు కొన్ని గుణములకు లక్ష్యభూతు లనియు పితృభక్తికి రాముడును రామభక్తికి హనుమంతుడును, అన్వయోదాహరణము లనియు కామక్రోధాహంకారపూరితుడగు రావణుడును తిండిపోతును నిద్రపోతును ఐన కుంభకర్ణుడును వ్యతిరేకోదాహరణము లనియు, అందఱెఱిగినదే.

రామాయణ మొకనీతికోశమని చెప్పవచ్చు. సమస్య కలిగినప్పుడెల్ల అందుకు పరిష్కారమును రామాయణమును చదివి తెలిసికొనవచ్చును. ధర్మమునకు అవిరుద్ధముగ ఏసందర్భమున ప్రవర్తించు టెట్లో రామాయణము తెలుపుచుండును. మచ్చునకు ఈసందర్భమును కనుడు :— రామునిగొంతుతో మారీచుడు కూయిడుచు చచ్చెను. "పరుగునపో. తక్షణమే పో. రామునకు తోడ్పడు" మని సీత లక్ష్మణుని నిర్బంధించినది. అతడు తన్ను ఒంటిగా విడిచిపోయిన తనకు కలుగగూడిన ఆపదను ఆమె లెక్కింపలేదు. "శ్రీరామునకు హాని యొనర్పగల ప్రాణి పదునాల్గులోకములలో లేడు. మనకు వినరైన రాముని కంఠము రాక్షసమాయాకల్పితము. నీయొద్దనుండి నన్ను చీలదీయుటకు రక్కసుడు పన్నిన జిత్తు ఇది." అని లక్ష్మణుడు ఎంత చెప్పినను సీత వినిపించుకొనలేదు. లక్ష్మణుడు పోవలెనా? పోకుండవలెనా? పోయినచో "సీతయొద్దనే యుండుము. విడిచి కదలకుము." అనెడి శ్రీరాముని యాజ్ఞను మీఱినట్లగును. పోకుండినచో సీతమనసుకు అత్యంతమైన బాధను కలిగించినవాడును తనపై ఆమె ఆరోపించుచున్న లేనిపోని నేరములకు ఆస్పదముకూర్చినవాడును అగును. లక్ష్మణునకు పోక తప్ప లేదు. అట్లు నిర్బంధించి అతనిని పంపివేసినందుల ఫలితమును సీత అనుభవింపవలసివచ్చెను. ఇచట లక్ష్మణునిమాటలు హితాభిలాషియగు ఆచార్యుని మాటలుగను, సీత ప్రవర్తనము ఆచార్యుని ధిక్కరించి దుఃస్థితి తెచ్చుకొను శిష్యుని నడవడికి లక్ష్యముగను గొనదగియున్నవి.

రామాయణమున అంతర్నిహితమైన తత్త్వమును కనుగొనవలె నన్నచో జిజ్ఞాసువు ఈరీతి పురోగమింపవలెను. సీతకు ఒంటరితనము కలుగుటకును రావణునిచే అపహరింపబడుటకును అంతరార్థ మిది :—విషయసక్తిచే జీవుడు దేవుని నుండి విరహితు డగును. మాయలేడి తళుకులకు సీత మోసపోవును. దానిని పడయవలయునని యాశయే ఆమెకు కలిగిన సకలదుఃఖములకును మూలము. లంకలో సీత అనుభవించిన చెఱ సంసారమున జీవాత్మ అనుభవించు బంధములకు సూచకము. సత్త్వగుణ మడుగునపడి రజస్తమోగుణములు తల ఎత్తినపుడు గలుగు క్షణికైహికభోగానుభవములకు లంకావాసుల సుఖజీవనము ఉదాహరణము. సీతను బడయవలయు నని రావణుడు నయభయమార్గములలో బహుధా ప్రయత్నించెను. కాని సీతకు గల రామభక్తి అప్రకంప్యమైనందున రావ

ణుడు నెగ్గజాలక పోయెను. అతని బెదరింపులకు గాని ప్రార్థనలకు గాని ఆమె లోబడలేదు. మాయ తొలగి బ్రహ్మైక్యము కోరు జీవాత్మ స్థితికి అశోకవనమందలి సీతప్రవర్తనము ఉదాహరణము. రామునకును లంకాస్థితయగు సీతకును మధ్య మహాసముద్ర ముండెను. ఈ దూరము బద్ధునకును ముక్తునకును గల అంతరమును సూచించును. హనుమంతుడు రామదూతగ సముద్రమును దాటి సీతను డాసి ఆత్మహత్యనుండి ఆమెను మరల్చి ఆశాసందేశమును అందించును. ''రాముడు సర్వసన్నాహములు చేయుచున్నాడు. అచిరకాలములో ఇచటికి వచ్చి రావణుని సబాంధవముగ హతమార్చి నిన్ను అయోధ్యకు నిత్యశాంతినిలయమునకు జైత్రస్థానమునకు చేర్చుకొనును. త్వరలోనే నీకు రామునితో పునస్సమాగమము కలిగి తీరును.'' అని ఊరడించును.

హనుమంతుడు నెరపినది ఆచార్యకృత్యము. శిష్యునందు భక్తిశ్రద్ధలను కలిగించి సారాసారములను తెలిపి అతనికి బంధవిముక్తిని చేకూర్చుటలో ఆచార్యుడు నిర్వహింపవలసిన వంతు ఎంతయు ముఖ్యమైనది. జీవునకు దేవునితో సంయోగమును సాధించువాడు ఆచార్యుడు. ఆచార్యుడు మాటచేతను నడవడిచేతను బోధించును. ఆచార్యుడు వివేకశాలిగను విశుద్ధహృదయుడుగను వినిర్మలమనోభావణుడుగను నిష్ఠావంతుడుగను అప్రకంప్యభగవద్భక్తుడుగను శాస్త్రపండితుడుగను ఉండవలయును. హనుమంతునిలో ఈ గొప్పలే కాక ఇంకనెన్నియో గొప్ప లుండినవి. ఆయన ఆదర్శగురువు, ఆదర్శభక్తుడు, ఆదర్శదాసుడు, ఆదర్శశూరుడు. భక్తియు జ్ఞానమును ఆయనలో పరమోచ్ఛ్రితి అందుకొన్నవి. ఆయన తన్ను పూర్తిగా శ్రీరామున కర్పించుకొనెను. వేఱు దైవము నత డెఱుగడు. వేఱుకాంక్షిత మతనికి లేదు. ''భావో నాన్యత్ర గచ్ఛతు'' 'నా మనసు నిన్ను వీడి వే ఱెద్దానివంకకును పోకుండునుగాక'' అనున దొక్కటే హనుమంతుడు రాముని కోరిన కోరిక.

భక్తికిని భగవదంకితజీవితమునకును హనుమంతునివలె లక్ష్యభూతులైనవారు శ్రీమద్రామాయణమున ఇతరులును కలరు. వీరందఱును ప్రబుద్ధాత్ములే, స్థిరభక్తులే, దృఢవిరక్తులే, సమగ్రప్రపన్నులే, సంగరహితరామసేవాపరులే. కాని ఒక్కొక్కరిలో ఒక్కొక్క శుభగుణము దీపించినది. తపశ్చర్యయందును, వైరాగ్యమందును భరతు నెవడు మించగలడు? పారతంత్ర్యధర్మమున శత్రుఘ్నుని ఎవడు మించగలడు? కైంకర్యజాగరూకతయందు లక్ష్మణుని మించినవా రేరి? వీరిలో ఒక్కొక్కడును తనమార్గమునకు మహోన్నతశిఖరమువంటివాడు. కైంకర్య పారతంత్ర్య వైరాగ్యములు ప్రపత్తిధర్మసారములు. రామాయణమునుండి నేర్వ దగిన పాఠములు పెక్కు లున్నను వానిలో భక్తిప్రపత్తులు ప్రముఖగణ్యములు. భక్తిప్రపత్తులకు నిక్కముగ వేఱుపాటు లేదు. ప్రపత్తి లేనిచో భక్తి అసమగ్రము. భక్తి లేనిచో ప్రపత్తి సారహీనము. అంతఃప్రబోధము కలిగినప్పుడే భక్తిప్రపత్తులు కలుగును. కైంకర్యతృష్ణయు అప్పుడే ఉప్పతిల్లును. నిస్స్వార్థముగ ఏకాగ్రతతో కావించు సేవయే కైంకర్యము. పారతంత్ర్యజ్ఞాన మున్నప్పుడే కైంకర్యతృష్ణ జనించును. ప్రపత్తి అనగా శాస్త్రవిహితక్రమమునచేసి క్షణములో ముగించు పని కాదు. 'దేవుడు స్వామి. సర్వము అతని సొమ్ము' అనెడి నిరంతరజ్ఞప్తి కలిగియుండుటే ప్రపత్తి. తా నెంతో కష్టపడి తిట్లకు గుఱియై సంపాదించిన రాజ్యమును

కైకేయి భరతునకు ఈయ జూపినప్పుడు "రాజ్యంచ అహంచ రామస్య" "రాజ్యము రాముని సొమ్ము. నేనును రాముని సొమ్ము. నేను రాజ్యము నేలుటయా? రాజ్యము నన్నేలిన నెట్లుండునో నేను రాజ్యము నేలినను అట్లే యుండును" అనుట భరతుని ఆశయము. ఎంత ప్రగాఢము భరతుని పారతంత్ర్యము! ఇదే శ్రీమద్రామాయణహృదయము. తాను దేవుని సొమ్మనెడి జ్ఞానము జీవునిలో మేల్కొన వలయును.

---

# భారతీయ సాహిత్యము - రామాయణ ప్రాశస్త్యము

'ఆర్షవిద్యాలంకార' మాన్యశ్రీ - కల్లూరి చంద్రమౌళి

ప్రాచీన కాలమునుండియు మహాకవుల వాఙ్మయమును భారతీయులు – 'సాహిత్యము' అనుపేర వ్యవహరించుచుండెడివారు. అంతే కాదు–ఆ సాహిత్యమును సహృదయు లందఱును సమాదరించి, అందలి సందేశములను ఆచరణ యందిడి, సత్ఫలితములను పొందుచుండెడివారు. కాని, ఆంగ్లేయుల పాలనములో–భారతీయు లనేకులు ఆంగ్ల భాషకు వశు లగుటచే, పాశ్చాత్య సంస్కృతికి వివిధ రంగములలో ప్రవేశము లభింపసాగెను. తత్ఫలముగా–ఆర్ష సంస్కృతి మఱుగునఁ బడవలసిన దుఃస్థితి సంభవించెను. త దాది, వివిధ రూపములతో వెలువడిన వాఙ్మయ మంతయు సాహిత్య మనియే వ్యవహరించుట పరిపాటి యయ్యెను. ఆ వాఙ్మయమును కొందఱు అనేక విధములుగా విభజించి, ఆ విభాగములకు ఏవేవియో పేరులు పెట్టి, ఇది యంతయు సాహిత్యమే యని వక్కాణింప సాగిరి. కాని, ఇట్టి వాఙ్మయమును సాహిత్య మనఁజెల్లునా? సాహిత్యమేయని నిర్వచించుటకు, ఈ వాఙ్మయమునకు తగిన అర్హత యున్నదా? అసలు–సాహిత్య మననేమి? అను విషయములను నేటి మన స్వతంత్రభారతమున సాకల్యముగ సమాలోచించి, ప్రాచీనమైన భారతీయ సాహిత్య స్వరూపమును బాగుగా గుర్తింపవలసియున్నది.

ఉదాత్తభావ సహితమై, అన్యోన్యత గల్గి యుండు వాఙ్మయమే సాహిత్యమని, ప్రాచీన గ్రంథములవలన మనము గ్రహింపవచ్చును. ఇట, అన్యోన్యతయనఁగా — రెండు విషయములుకాని, రెండు పదార్థములుకాని కలసి మెలసి యుండుటయే. జీవాత్మ పరమాత్మలను నర నారాయణులనుగా ప్రదర్శించి, ఆ రెంటికిని సమైక్యమును కూర్చునదియే సాహిత్యమనియు, జీవాత్మ పరమాత్మల కలయిక, హృదయమునందే కలదనియు మన మహర్షులెన్నడో నిర్ణయించిరి. ఈ నిర్ణయమును భగవద్గీత ఇట్లు ధ్రువపఱచుచున్నది:—

"ఈశ్వర స్సర్వభూతానాం
[illegible]
భ్రామయన్ సర్వభూతాని
యన్త్రారూఢాని మాయయా"

(18-61)

సర్వేశ్వరుఁడు, సర్వభూతములను శరీరము లనఁబడు యంత్రములయందు అధిరోహింపఁజేసి, తన మాయచేత తిరుగునట్లుచేయుచు

సర్వభూతముల హృదయము లందును అధివసించియున్నాఁడు. అని దీని తాత్పర్యము. హృదయ మనఁగా.

"హృది అయం నివసత ఇతి హృదయమ్."

సర్వేశ్వరుఁడు నివసించు నదియే యని ఛాందోగ్యోపనిషత్తు (8-3-3) హృదయ పదవ్యుత్పత్తిని సాధించుచున్నది. కావున, ఆత్మ పరమాత్మల నివాసస్థానమే హృదయ మనియు, అట్టి జీవాత్మ పరమాత్మల కలయికను ప్రస్ఫుటింపఁజేయు నదియే సాహిత్యమనియు మనము గ్రహింపనగును.

సాహిత్య మర్మములను బాగుగా నెఱింగి, ఆనందించువాఁడు సహృదయుఁడు. సహృదయునకు తన్మయత్వమును ప్రసాదించునదియే సలక్షణమైన సాహిత్యము. అట్టి ప్రసాదగుణముగల ఉత్తమ సాహిత్యము, ప్రేమతత్త్వముతో సముల్లసించుచుండును.

ప్రేమకు నిలయము హృదయము. ఆనందమును గల్గించునదియే ప్రేమ. భగవానుఁడు ఆనందస్వరూపుఁడు.

"రసో వైసః రసగ్గ్ హ్యేవాయం
లబ్ధ్వాఽనన్దీభవతి."

అని, ఉపనిషత్సూక్తి. తదనుసారముగా-ఆనంద స్వరూపుఁడైన భగవానుఁడు ఉత్తమ సాహిత్యమునం దంతటను దర్శన మిచ్చుచుండును. అట్టి ఉత్తమ సాహిత్యము-ప్రకృతి సంబంధములైన విషయములను విస్మరింపఁజేసి, అప్రాకృతములైన జ్ఞాన విజ్ఞానములను చేకూర్చి, అవ్యక్తమైన ఆనందమును ప్రసాదించుచుండును.

ఇట్టి సాహిత్య స్వరూపమును సమగ్రముగా గ్రహించి, తత్స్వరూపమును లోకమున ప్రకటించుటకై, ప్రాచీన విద్వాంసులు కొందఱు ప్రయత్నించియుండిరి. ప్రయత్నసాఫల్యమునకు తమ తమ ప్రజ్ఞాపాటవములను పరిపూర్ణముగ వెచ్చించిరి. అట్టి వారి నిరంతరకృషికి దివ్య ఫలములుగా-సాహిత్య మీమాంస సాహిత్య చింతామణి, సాహిత్యదర్పణము, సాహిత్య రత్నాకరము మున్నగు సాహిత్య శాస్త్రము లెన్నియో వెలువడి, భారతీయ సాహిత్యమున కెంతగనో పరిపుష్టిని, ప్రఖ్యాతిని చేకూర్చినవి. కావున, అట్టి సాహిత్య గ్రంథములలోని యంశములను మన మిపుడు కొలదిగనైన గ్రహించుట మిగుల నవసరము.

సాహిత్యమీమాంసలో—

"వృత్త్యాదీనాం సమష్టిః
స్యాత్ సాహిత్యమ్."

వృత్తుల సమష్టి స్వరూపమే సాహిత్య మని నిర్వచింపఁబడినది.

"రసోచితార్థ సమ్బద్ధ
పదసన్తానశాలినీ
మనో వికాస సఙ్కోచ
వర్తనాత్ వృత్తి రుచ్యతే."

రసానుగుణమైన అర్థముతోఁగూడిన పద సముదాయమే వృత్తియనియు, అది - మనస్సునకు వికాస సంకోచములు గల్గింపఁ గలదు గనుక, వృత్త మనఁబడుననియు ప్రకాశవర్షుఁడు రసార్ణవాలంకార గ్రంథమున నిర్వచించి నాఁడు.

"వ్యవహారో హి వృత్తిరుచ్యతే."
"రసోచిత ఏవ చేష్టావిశేషో వృత్తిః."

వాగ్వ్యాపారమే వృత్తియనియు, రసమునకు తగిన చేష్టావిశేషమే వృత్తియనియు ఆనందవర్ధనుఁడు ధ్వన్యాలోకమున విశదీకరించినాఁడు.

"వృత్తిర్నియత వర్ణగతో,
రసవిషయో వ్యాపారః."

ఆ యా రసవ్యంజకములుగా నియతము లైన వర్ణములతోఁగూడినవా గ్వ్యాపారమే వృత్తియని, మమ్మటుఁడు కావ్యప్రకాశములో నుట్టంకించినాఁడు.

భరతమునిచే నాట్యశాస్త్రములో చెప్పఁబడిన భారతి, సాత్వతి, కైశికి, ఆరభటి అను నాల్గింటితో-'లలిత' అను దానినిగూడ ప్రకాశ వర్షుఁడు చేర్చి, వృత్తులైదుగా చెప్పుచు-

'సర్వార్థ విషయా హృద్యా
నానామార్గ విసారిణీ
ఇయంతు లలితా నామ
కవీనాం చిత్తహారిణీ.''

ఈ లలితవృత్తి-కవుల చిత్తాపహారిణి యని, రసాలంకారములో ప్రశంసించినాఁడు.

కావ్యమునకు శైలి ఆత్మవంటిది. అట్టి శైలీ సౌభాగ్యముగల కావ్యమే లోకమున శ్లాఘ్యమగును. కనుకనే-

''రీతయ స్త్వఙ్గ సౌన్దర్యమ్.''

అన్నాఁడు ప్రకాశ వర్షుఁడు. అంగసౌందర్యమే కాదు-

''రీతి రాత్మా కావ్యస్య.''

అది ఆత్మయే యగునని, వామనుఁడు నొక్కి-వక్కాణించినాఁడు. రీతి - కవి స్వభావముపై ఆధారపడియుండును. అట్టి స్వభావమును-సుకుమారము, విచిత్రము, మధ్యమము అని, మూఁడు విధములుగా సాహిత్యవేత్తలు విభజించిరి. ఇందు-సుకుమారమార్గము సహజమైనది. ఈ మార్గమున - కృత్రిమములగు పోకడ లుండవు. ఇందు - కేవలము ఉత్తమకావ్య నిర్మాణదృష్టియే ముఖ్యమైనది. కవికి గల ప్రతిభా వ్యుత్పత్తు లన్నియు ఇందు ప్రస్ఫుటించుచుండును.

''సుకుమారాభిధ స్సోఽయం
యేన సత్కవయో గతాః
మార్గే ణోత్ఫుల్లకుసుమ
కాననే నేవ షట్పదాః.''

విరిసిన పూలతోఁటల్లోవన తుమ్మెదల వలె, ఈ సుకుమారమార్గమున సత్కవులు సంచరింతురని వక్రోక్తి జీవితము వర్ణించుచున్నది.

ఈ సుకుమారశైలికి ప్రధానమైనది మాధుర్యగుణము. రెండవది ప్రసాదగుణము. మూఁడవది లావణ్యము. నాల్గవది ఆభిజాత్యము. ఈ నాల్గు గుణములతో గూడినది-సుకుమార మార్గము. వాల్మీకి-ఈ మార్గము ననుసరించియే మహాకవి కాఁగల్గెను.

''అపారే కావ్య సంసారే
కవి రేకః ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం
త థేదం పరివర్తతే.''

అపారమైన కావ్య ప్రపంచమునకు కవియే బ్రహ్మ. ఆతఁడు తలంచిన ట్లెల్లను ఆ ప్రపంచము మాఱుచుండు నని, ధ్వన్యాలోక మనుచున్నది. కనుక, మహాప్రతిభావంతుఁడైన వాఁడే కవి యనఁబడుట కర్హుఁడనియు, అట్టి కవిచే రచింపఁబడిన కావ్యమే కావ్యమనఁబడు ననియు తెలియనగును.

నిత్యనూతనమై ప్రకాశించు బుద్ధియే ప్రతిభ. అట్టి ప్రతిభతోఁగూడి, వర్ణనమునందు నేర్పుగలవాఁడే కవి. కవు లందఱకును రచనావ్యాసంగము సమానమే యైనను, కావ్యకళలో-వారు వారు చేయు కృషినిబట్టియు, వారికిఁగల సంస్కారమును బట్టియు, వారిలో తరతమ భావము లేర్పడుచుండుట సహజము.

"ముక్తకే కవయోఽనన్తాః
సఙ్ఘాతే కవయ శ్శతమ్
మహాప్రబన్ధేతు కవి
రేకో ద్వౌ, దుర్లభా స్త్రయః."

సామాన్యముగ శ్లోకములనో, పద్యములనో వ్రాయుకవులు అసంఖ్యాకులుగ నుందురనియు, శతకములు, ఖండకావ్యములు వ్రాయువారు శతసంఖ్యాకులుగ నుందురనియు, మహాప్రబంధ రచయితలు ఒకరిద్దఱుమాత్రమేయుందురనియు సాహిత్య మీమాంస స్పష్టీకరించుచున్నది. కావున, ఉత్తమకావ్యమును నిర్మించుటకు రచయితలందఱును అర్హులు కాఁజాలరని వేఱుగాఁ జెప్పనేల? అయినచో — ఉత్తమ కావ్యమును రచింపఁబూనిన కవికి, అర్హత లెయ్యవి యుండవలెనో మన మిపుడు గ్రహింప వలసియున్నది.

రాగద్వేషాది విరహితుఁడును, సత్త్వగుణ సంపన్నుఁడు నగువాఁడు — 'ఋషి' యని చెప్పఁబడును. తత్త్వజ్ఞానముగల కవియు ఋషివలెనే యుండును. అట్టి కవి తన భావనా ప్రపంచమున, లోకాతీతమైన పదార్థమును పరిశీలింపఁగల్గును. అపు డతఁడు శబ్దబ్రహ్మ సాక్షాత్కారమునుగూడ పొందఁగల్గెనేని, అతని కవిత రసప్లావితమై విరాజిల్లును. కావుననే, ఋషిధర్మములు లేనివాఁడు కవి కానేరఁడని నిర్ణయింపఁబడినది. 'నానృషిఃకురుతే కావ్యమ్' అనునూక్తియే ఇందులకు పరమ ప్రమాణము. ఈ యంశమునే 'కావ్యకౌతుకము' అనుగ్రంథమః ఇట్లు ధ్రువపఱచుచున్నది.

"నానృషిః కవి రిత్యుక్త
మృషిశ్చ కిల దర్శనాత్
విచిత్ర భావ ధర్మాంశ
తత్త్వప్రఖ్యాత దర్శనమ్."

ధర్మస్వరూపమును బాగుగా దర్శించి, తత్సూత్రములను తాత్త్వికమైన ప్రజ్ఞావిశేషముతో ఇతరులకు దర్శింపఁజేయవలెనన్న, ఋషియైన కవికే సాధ్యము కాఁగలదనియు అసలు-ఋషి కానిదే కవి కానేరఁడనియు దీని తాత్పర్యము.

తత్త్వద్రష్టలైనవారు – కేవలము ఋషులుగానే వ్యవహరింపఁబడుదురుకాని, కవులుగా మాత్రము చెప్పఁబడరు. ఋషులైనవారు– వర్ణనరూపమైన వాగ్వ్యాపారమును సాగించినపుడే కవులని వ్యవహరింపఁబడుదురు. తత్త్వదర్శకులై, వర్ణనముచేయఁగలవారే కవులనఁబడుదురని దీని సారాంశము.

కావ్యమునకు ముఖ్యప్రయోజనము ఆనందము. కావున, అట్టి ఆనందమును గల్గింపఁజాలనికావ్యము నిరర్థకము. కావ్యము ఆనందమును ప్రసాదింపవలెనన్న, అది-శబ్దాలంకార సంశోభితమై, అర్థగాంభీర్య సమలంకృతమై, చిత్ర విచిత్ర పదవిన్యాస విలసితమై, ధ్వని ప్రధానమై, నవరసభరితమై, మధురమధురమై యొప్పుచుండవలెను. అదియునుగాక — 'విశ్వశ్రేయః కావ్యమ్' అన్నట్లు అట్టి కావ్యము విశ్వశ్రేయోదాయకమై యుండవలెను. వాల్మీకిరామాయణము–ఇట్టి గుణసంపదతోఁగూడినది గనేకనే, మహాకావ్యముగ నేఁటికిని సంభావింపఁబడఁగల్గుచున్నది. నేఁటి వఱకే కాదు–

"యావత్ స్థాస్యన్తి గిరయః
సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణకథా
లోకేషు ప్రచరిచ్యతి."

ఈ భూమండలమున పర్వతములు, నదులు ఎంతకాలముండునో–అంతవఱకును ఈ రామాయణ మహాకావ్యమునందలిగాథ, సర్వలోకము

లందును సమాదరింపఁబడఁగల్గుచుండునని, బ్రహ్మదేవుఁడే ప్రశంసించియుండెను.

వాల్మీకి రామాయణమునందుఁగల గుణ సంపదను సందర్శించిన ప్రాజ్ఞులు–కావ్యవైభవ మును వేనోళ్ళ కొనియాడియున్నారు కావున, అట్టి మహాకావ్యమునందలి యలంకారవిశేష ములను కొన్నింటినైన మనమిపుడు స్థాలీపులాక న్యాయముగ పరిశీలించి, తత్ప్రాశస్త్యమును తెలిసికొనుట మిక్కిలి యవసరము.

సుందరకాండములో పంచమసర్గయంతయు– శబ్దాలంకారమునకు, అంత్యప్రాస నియమ మునకు ఒక మచ్చుతునుక. కనుక, ఆ సర్గ యందలి ఆదిమధ్యాంతములలోని శ్లోకములను మూడింటిని మాత్రము ఇట ఉదాహరణముగ గ్రహింతము.

తత స్సమధ్యంగత మంశుమన్తం
జ్యోత్స్నా వితానం మహదుద్వమన్తమ్
దదర్శ ధీమాన్ దివి భానుమన్తం
గోష్ఠే వృషం మత్తమివ భ్రమన్తమ్.

"రక్షాంసి వక్షాంసి చ విక్షిపన్తి
గాత్రాణి కాన్తాసు చ విక్షిపన్తి
రూపాణి చిత్రాణి చ విక్షిపన్తి
దృఢాని చాపాని చ విక్షిపన్తి."

"సీతా మపశ్యన్ మనుజేశ్వరస్య
రామస్య పత్నీం వదతాం వరస్య
బభూవ దుఃఖాభిహత శ్చిరస్య
ప్లవఙ్గమో మన్ద ఇవాచిరస్య."

ఇందలి శబ్దవైచిత్ర్యము మిక్కిలి హృద్య మైనది. ఇఁక అర్థాలంకారముల నాలోకింతము.

"స్పృశంస్తు విమలం శీత
ముదకం ద్విరద స్సుఖమ్
అత్యంత తృషితోవన్యః,
ప్రతిసంహరతే కరమ్."

(ఆరణ్యకాండ 16–21)

అడవియేనుఁగు – చాల దప్పికగలిగి యున్నను, అతి శీతలముగ నున్న నీటిని స్పృశించి, తొండమును ముడుచుకొనుచున్నది.

దండకారణ్యములో–శీతల జలప్రపూర్ణము లైన సరస్సులు, మత్తేభములును ఉన్నవని ఇందు సూచింపఁబడినది. ఇందలి అర్థాలంకా రము–అత్యంత మనోహరమైనది. అనంతరము– ఉపమాలంకారమును సమాలోకింతము. రావణ వధానంతరము రాముఁడు సీతనుజూచి–

"ప్రాప్తచారిత్ర సందేహా
మమ ప్రతిముఖేస్థితా
దీపో నేత్రాతుర స్యేవ
ప్రతికూలాసి మేదృఢమ్."

(యుద్ధకాండ : 118–17)

జానకీ, జనులు నీ చరిత్రను శంకించు చున్నారు. కనుక, యెదుట నిల్చియున్న నీవు నాకు–కండ్లకలక గలవానికి ముందున్న కాంతి వంతమైన దీపమువలె, ప్రతికూలముగ నుంటి వనుట నిశ్చయము' అన్నాఁడు. ఇందలి ఉప మాలంకారము – అనన్యాదృశము. ఇటుపై, ఉత్ప్రేక్షాలంకారమును పరిశీలింతము.

లంకా పట్టణములో – అశోకవనమున ఒక వంక సెలయేరొకటి ప్రవహించుచుండెను. దాని తీరమునఁగల చెట్లకొమ్మలు – ఆ నీటి లోనికి వ్రేలాడుచుండుటచే, నీరు వెనుకకు మరలసాగెను. ఈ సామాన్యవిషయమును వాల్మీకి – ఎంత రమణీయముగ వర్ణించెనో చూడుఁడు :—

"దదర్శ చ నగాత్తస్మా
న్నదీం నిపతితాం కపిః
అంకా దివ సముత్పత్య
ప్రియస్య పతితాం ప్రియామ్
జలే నిపతితాగ్రైశ్చ
పాదపై రుపశోభితామ్

వార్యమాణా మివ క్రుద్ధాం
ప్రమదాం ప్రియ బంధుభిః
పునరావృత్తతోయాం చ
దదర్శ స మహాకపిః
ప్రసన్నామివ కాంతస్య
కాంతాం పునరుపస్థితామ్.

(సుందరకాండ : 14-29 నుండి 31 వఱకు)

ఆ పర్వతాగ్రము నుండి భూభాగముపైకి ప్రవహించు సెలయేటిని గాంచినచో-భర్తపై అలిగినభార్య, కోపముతో అంకము (తొడ) నుండి దిగి, వెళ్లునట్లుండెను. ఆ సెలయేటిలో వ్రేలాడు చెట్ల ఊడలు - ఆమె కోపమును వారించు ఆప్తబంధువులవలె నుండెను. అపుడా ప్రవాహవేగము వెనుకకు మరలుటచూడ, కోపము ఉపశమించి, భార్య భర్తను చూచుటకు మెల్లగా మరలుటవలె నుండెనట! ఎంతటి మనోహరమైన వర్ణనమిది! శ్లేషాలంకారమును గాంతము.

'మా నిషాద ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునా దేక
మవధీః కామమోహితమ్.''

(బాలకాండ . 2-15)

ఒక బోయవాఁడు-క్రౌంచమిథునమునందు మగపక్షిని చంపగా, ఆడుపక్షి దుఃఖింపసాగెను. అపుడు-పరమ దయార్ద్రహృదయుఁడైన వాల్మీకి - ఆ సన్నివేశము చూచినవాఁడగుటచే, బోయవాఁడు చేసిన దారుణకృత్యమునకు మిక్కిలి వ్యథజెంది-'ఓ బోయవాఁడా, కామమోహితమైన క్రౌంచ మిథునమునందు, ఒకదానిని చంపుటచే, అనేక సంవత్సరములు నీవు భూమియం దుండఁజాలవు' అని, అతనిని శపించెను - శోకము శాపముగా ప్రకటమయ్యెను. శోకప్రపూరితమైన వాక్యమే ఈ శ్లోకముగ రూపొందెను. అంతేకాదు - మహర్షియైన వాల్మీకి వదనారవిందమునుండి వెలువడిన ఈ శ్లోకమునకు, భగవత్పరమైన అర్థముకూడ మఱియొకటి ఇట్లు సిద్ధమయ్యెను.

మానిషాద = లక్ష్మీనివాసా, క్రౌంచమిథునాత్ = మండోదరీ రావణులనుండి, కామమోహితం ఏకమ్ = కామమోహితుఁడైన రావణునొకనిని, త్వం = నీవు, అవధీః = చంపుటచే, శాశ్వతీస్సమాః = అనేక సంవత్సరములు, ప్రతిష్ఠాం = కీర్తిని, త్వం = నీవు, అగమః = పొందిన వాఁడవైతివి.

ఇందలి శ్లేష - అతి గంభీరమైనది. ఇందే కాదు- కావ్యమం దంతటను ఇట్లతి గంభీరములైన అలంకారములు కన్పట్టుచుండును.

(సశేషం)

# శివానందస్మృతులు—34

## శ్రీమత్ప్రవ్రాజికశ్యామాప్రాణ

బేలూరుమఠము

క్రీ. శ. 1929 మార్చి 20 వ తేదీ

(బుధవారము)

నేటిఉదయము దక్షిణదేశీయుఁడగు ఒక సన్న్యాసి వచ్చి శ్రీమహాపురుషులకు ప్రణమిల్లుటతోడనే స్వామివారు ఇట్లనిరి- "Blessed are those who have not seen me but have faith in me" ''నన్ను చూడకయు, నాపై విశ్వాసము కలవారే పరమధన్యులు.'' మీరెల్లరును నిజముగా ధన్యులు, మీరు భగ

వానుని చూడ లేదు. కాని ఆయనపై విశ్వాసము మీకు కలదు.

మధ్యాహ్నము ఒకభక్తుడు వచ్చి 'స్వామిజీ, నన్నాశీర్వదింపుడు' అని పలుకుటతోడనే మహాపురుషులు 'ఆశీర్వదించుచున్నాను నాయనా, మావద్ద ఆశీర్వాదములే కలవు కాని శాపములు లేవు. మావద్ద ఆశీర్వాదములు వినా వేఱేమియు లేవు సుమా.''

# శివానంద లేఖావళి

## 41

చిల్కాపేటహౌస,
కూమోన్, అల్మోడా
27 అక్టోబరు 1913

ప్రియమాస్టరు మహాశయా,

నీజాబు చేరి మహానందము కలిగినది. నీవు మఠములోనే ఉండ నిశ్చయించుకొన్నా వని తెలిసి మఱింత సంతోషించితిని. ఠాకూరు (శ్రీరామకృష్ణుని) ప్రియశిశువు నీవంటివాడు మఠసభ్యుడుగా చేరునేని మాకందఱికిని కలుగు ఆనందమును ఇంతంతని మాటలలో ఎట్లు చెప్పగలను? ఇది నీకును మఠసభ్యులకును క్షేమంకరము. నీఆదర్శముచే సముత్సాహితులై నీకుటుంబమువారును కల్కత్తాలోని విద్యార్థి బృందమును సంఘములో చదువుకొన్నవారును నీవు ప్రదర్శించిన మానాను అనుసరించి తమ జీవితములను రూపొందించుకొన ప్రయత్నింతురు. మఠములో నుండ మని నీవు సంకల్పించుకొంటి వను వార్త విన్నంతనే నాకు కలిగిన ఆనందమును ఈ చిన్నజాబులో ఇముడ్చుట కష్టము. మఠములో నుండ నారంభించి కొంతకాలమైన పిదప నీవు నిర్వహింపవలసిన బాధ్యత ఎంత మహత్తరమైనదో మఠయాజమాన్యమున నీవంతు ఎంత ప్రముఖమైనదో నీకు తెలిసివచ్చును.

(శ్రీ)మాతృదేవియు ఉద్బోధనభవనమునను మఠమునందును ఉన్న ఇతరులును క్షేమముగా నున్నా రని తెలిసి సంతోషించితిని. కొన్నాళ్లుగ బాబురాముమహారాజునకు (ప్రేమానందస్వామికి) ఆరోగ్యము బాగులేదు. ఆయన స్థితి తెలిసికొనవలయు నని నాకు ఆత్రముగా నున్నది. ఆయన క్రమముగా తేఱుకొన్నాడనియు ప్రస్తుతము యథాపూర్వము ఠాకూరు (శ్రీరామకృష్ణుని) పూజారాధనలలో వ్యగ్రుడై యున్నా డనియు తెలియవచ్చినవార్త ఆనందదాయకముగ నున్నది.

చలికాలములో పాల్తుబాబు ఇక్కడనే ఉండునా అను విషయము ఇంకను నిశ్చితము కాలేదు. సమస్తము విజనుని ఆరోగ్యముపై నాధారపడియున్నది. అతనికి ఆరోగ్యము బాగున్నచో ఇచ్చటి చలి అతనికి సహ్యముగ నున్నచో వారు చలికాలము ఇక్కడనే గడపగలరు. అతడు చలికాలమున ఇచ్చట ఉండుటే మేలని వైద్యుడు చెప్పుచున్నాడు. ఇక్కడ ఇప్పటికే చాలినంత చలి యున్నది. రాత్రులందు క్విల్టును వాడుకొనుచున్నాము. పగటి వేళలందును లావైనదుస్తులనే ధరించుచున్నాము.

మఠములో సమస్తమును బాగుగా జరిగిపోవుచున్న దని అనుకొనుచున్నాను. నా హృదయపూర్వకప్రేమప్రణామములను దయచేసి, నీవు స్వీకరించి బాబురాముమహారాజునకును, కోకామహారాజునకును (శ్రీసుబోధానందస్వామికిని) అందజేయవలసినది. ఇతరసన్న్యాసులకును, బ్రహ్మచారులకును నాహృదయపూర్వకప్రేమయు, మంగళాశాసనములును.

ప్రేమలో నీవాడను,
శివానంద

అనుబంధము:—ఫ్రాంకుగారికిని నా ప్రేమ శుభాకాంక్షలు. తన ప్రేమప్రణామాలను బాబు రాము మహారాజునకును, కోకా మహారాజునకును అందజేయవలసిన దని పాల్తు నన్ను కోరియున్నాడు. శి.

## 42

చిల్కాపేటహౌస్,
అల్మోడా,
కూమోన్, ఉత్తరప్రదేశ్,
1 నవంబరు 1913

ప్రియ—,

నీ రెండు జాబులును ఒకదాని వెంబడి నొకటి చేరినవి. నీదృష్టికి సమస్తము మాయగా కనిపించుచున్నది. సమస్తమును మాయ అనుట నిజమే. ఈ జగమంతయు నొకమాయ. మాయయనుట నెఱిగి లోకములో జీవించు వారికి అందు సంగము ఎప్పుడును కలుగదు. గురుదేవుడు (శ్రీరామకృష్ణుడు) చెప్పుచుండెడి వాడు, "చేతికి నూనె యలదుకొని తరువాత పనసపండు తఱుగుడు" అని. సమస్తమును మాయ అనుట తెలిసియుండుటే చేతికి నూనె యలదుకొనుట. పనసపండును తఱుగుట యనగా లౌకికకర్తవ్యములను నిర్వర్తించు చుండుట.

నిస్సంగత్వముతో నిస్స్వార్థరీతిలో నీవు నన్ను ప్రేమింపగోరుచున్నావు. నిజమున కది చాల బాగున్నది. గురుదేవుడు రామకృష్ణుడే నాహృదయమందలి ఏకైకనిధానము. విశుద్ధికి ధర్మమునకు దయకు ఆయన నిధానము. సామాన్యమానవుల నుద్ధరించుటకై సపరివారముగ ఆయన అవతరించినాడు. స్వలాభాపేక్ష ఇంచుకయు లేదు. అవాప్తసమస్తకాముడు ఆయన ఒక్కడే. ఈ పాత్రను నీవెంతగా ప్రేమింతువో అదంతయు ఠాకూరునకే చెందును. (తన్ను నిర్దేశించుకొనుచు) దీని పైని ప్రేమకూడ నీకు ఆయనయొద్దనుండియే వచ్చును. భక్తిప్రేమపూర్ణులగు నీవంటికుఱ్ఱవాండ్రను ఆయనే స్వయముగా ఎన్నుకొనును. భళి! ఆయన నిన్ను స్వకీయునిగ చేసికొన్నాడు. ఆయనను గాఢముగ ప్రేమింపుము. నీవు భాగ్యశాలివి. గురుదేవుని దివ్యక్రీడారంగమును చూచితివి, అంటితివి, మీ అమ్మకు సైతము చూపితివి. అట్టిచోటును ప్రపంచమున మఱెచ్చటను మేము చూచియుండలేదు. మేము సుదూరము పర్యటించితిమి. దర్శనీయములగు పెక్కు క్షేత్రరాజములకు పోయితిమి, కాని గురుదేవుని క్రీడారంగమునకు సొంపులో వైభవములో విశుద్ధిలో దీటుగాగల చోటును ఎక్కడను చూడమైతిమి. అదే మాకు కైలాసము, కాశి, వైకుంఠము, గోలోకము. ఇంతకంటె ఏమి చెప్పుదును ?

మాతృదేవి (శ్రీశారద) ఎవరిముందైనను మేలిముసుగు తీసివేయదు. మా యెదుటనైనను అంతే. స్త్రీవిషయము వేఱు లెమ్ము, ఆమె నిన్ను దీవించినది. ఇక నీవు దేనినిగూర్చియు వంత నొంద నక్కఱలే దని గట్టిగా తెలిసికొనుము. అమ్మ సామాన్యమహిళ కాదు అని దృఢముగ విశ్వసింపుము. శ్రీ ఠాకూరు (శ్రీరామకృష్ణుడు) దక్షిణేశ్వరములో నుండినకాలము మొదలుగా మాలో ఎవరు గాని మాతృదేవిపాదములనే తప్ప వేఱేమియు చూచినవారము కాము. ఆమె వదనమును మేము చూచినదే లేదు. ఆమె మేలిముసుగు వేసికొనుచుండుట ఇప్పుడుమాత్రమే కాదు. నీప్రార్థనకు ఆమె ఔ నని తల ఊపినది. నిస్సందేహముగ నీవు ధన్యాతిధన్యుడవు.

నీవు ఆరోగ్యము గలిగియున్నా వని విని సంతోషించితిని. ఇక్కడ నా దేహపరిస్థితిలోను చెడు పేమియు లేదు. ఐనను ఇక్కడ చలి చాల హెచ్చుచున్నది. ప్రకృతిసౌందర్య సంపన్నములును సదామంచుచే కప్పబడినవియు నగు పర్వతశిఖరములు ఇక్కడికి చాలదగ్గఱనే, దాదాపు ఇరువదియైదో ముప్పదియో మైళ్ళ దూరమున నున్నవి. మంచు వర్ధిల్లు కాలము గావున ప్రస్తుతము ఆ పర్వతశిఖరములు మఱింత జాజ్వల్యమానములుగ నున్నవి. ఒకటిరెండునెలల కనంతరము చుట్టుపట్ల నున్న మహోన్నత పర్వతప్రాంతములందు మంచు పడును. ఇచ్చటను ఇంచుక మంచు పడును. అప్పుడు ఓర్చుకొనరానంత చలిగా నుండును.

నీకు నాహృదయపూర్వకప్రేమాశీస్సులు. నీక్షేమమునుగూర్చి అప్పుడప్పుడు వ్రాయుచుండుము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 43

చిల్కాపేటహౌస్,
అల్మోడాపోస్టు,
కూమోన్, ఉ. ప్ర.
23 జనవరి 1914.

ప్రియ——,

నీజాబువలన అన్ని విషయములును స్పష్టపడినవి. నిజమే, లోకరీతి అంతే. దీనిని పూర్తిగా తెలిసికొని ఈప్రపంచమున మనము జీవింపవలెను. ఇందుంగూర్చి కలవరపడి లాభము లేదు. భారము దేవునిమీద పెట్టి నీవిధులను నిర్వర్తించుచుండుము. ఈలోకముగుండనే నీవు బ్రహ్మసాక్షాత్కార మందుదువు. నీ వీలోకమునకు మరలిరా వని గట్టిగా తెలిసికొనుము. ఏచోటికైనను పోయి అచ్చట పాటుపడి నీఋణములను తీర్చుకొనవలె ననుట ఈశ్వర సంకల్ప మగు నేని అన్నివిధముల ఆలాగే చేయుము. అది ఈశ్వరసంకల్ప మగునేని అట్లే కానిమ్ము. అందుకై నీవు వ్యథచెందుట ఎందులకు? నీకు భయము లేదు. ఠాకూరు నీకు శరణ మిచ్చి యున్నాడు. గృహస్థుడవుగ నీవు మరల జన్మింపబోవు, భయపడకు. జయ శ్రీ రామకృష్ణ! ఇంచుకైనను భయపడకు. దృఢచిత్తముతో నీవిహితకర్తవ్యములను నిర్వర్తించుచుండుము. దేవునిగూర్చిన తలంపును మనమున నిడుకొని, ప్రతిపనిని చేయుము. ఇందు భక్తిశ్రద్ధలు చాలముఖ్యము. ఈలోకములోని సుఖసంతోషము లేమి, కష్టదుఃఖము లేమి రెన్నాళ్ల పాటివే. ప్రపంచమున సదా సుఖపడువాడును సదా కష్టపడువాడును లేనే లేడు. లోకములోని సుఖదుఃఖములు క్షణికము లని గుర్తించి భగవద్భక్తుడు తనమనస్సును దేవునందే స్థిరపఱచుకొనును. కష్టసుఖములపట్ల ఉదాసీనుడుగ నుండును. సుఖము కలిగినపుడు పొంగిపోడు. కష్టమువచ్చినపుడు క్రుంగిపోడు. శిశువువలె అత డిట్లు ప్రార్థించును:- "దేవా, దేనిచేతగాని నాకు నీతో ఎడబాటు కలుగకుండుగాక. దేహధారులకు సుఖదుఃఖములు తప్పవు. కాని నాశ్రద్ధను భక్తిని ప్రేమను హిమాలయములవలె స్థిరములుగను, అప్రకంప్యములుగను ఉండునట్లు చేయుము."

ఇంతకంటె ఏమి వ్రాయుదును? నీ వెచ్చట నున్నను నిన్ను ఠాకూరు కనుపెట్టి యుండును.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 44

చిల్కా పేటహౌసు,
అల్మోడాపోస్టు,
కూమోర్, ఉ. ప్ర.
26 ఫిబ్రవరి 1914.

ప్రియ——,

నీజాబులు రెండును చేరినవి. రెండవ జాబులో నీవు వ్రాసినది ఠాకూరు నను గ్రహముచే పరిపూర్ణ సత్యమే. నీవు వ్యథ చెందవలసిన కారణము లేనే లేదు. ఠాకూరును గాఢముగా ధ్యానించి ప్రార్థింపుము. ఆయన నీ కొదువల నన్నిటిని తీర్చును. నీడెందమున ఉద్రిక్తభగవత్ప్రేమ జ్వాల వెలుగొందుచుండును గాక. దివ్యప్రేమలో పూర్తిగ అవగాహించియుండుము. నీకు ఏకొదువయు నుండదు. నన్ను పంపుమని నీవుకోరిన వస్తువుల నన్నిటిని పంపెదను, ఒక్కదానిని తప్ప. అక్కడ సుందరకుసుమములు నిండార వికసించియుండు నని విన్నప్పుడు నే ననుభవించిన యానందమును, ఆహా, నీ కెట్లు వర్ణించి చెప్ప గలను! నీహృదయమునకు సంతృప్తికలుగు నట్లు ఠాకూరును (శ్రీరామకృష్ణుని) అలంకరింపుము. ఆయన దక్షిణేశ్వరమున పూదోట లోనే నివసించుచుండెను. పుష్పము లాయనకు ప్రియములు. వసంతర్తు వచ్చునేని వికసిత సుందరకుసుమ సమృద్ధి మఱింతగా కలుగును. దండిగా వానిని ఠాకూరునకు సమర్పింపుము.

నీతండ్రిగారు భక్తులు. ఆ పుణ్యఫలముగా ప్రకృతయుగావతారమూర్తియగు శ్రీరామకృష్ణునియందు భక్తి నీకును అలవడినది. ఠాకూరును నీవు బాహ్యాభ్యంతరములందు తిరముగ నెలకొల్పుకొనవలయును. లోపల ఆయన నెలకొనునేని వెలుపల ఏకొదువయు నుండదు. నీకు నా హృదయపూర్వకప్రేమాశీస్సులు. నీ క్షేమవార్తల నప్పుడప్పుడు వ్రాయుచుండుము. దేవు నను గ్రహమున నాశరీర స్థితియు పర్వా లేకున్నది.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

అనుబంధము.——ఏడెనిమిది దినములు ప్రబలవర్షము కురిసినది. కడపటి రెండుదినములలో మంచు పడినది. మొదటిదినము పడిన మంచు నాలుగైదంగుళములు. రెండవదినము పడినది సుమారు ఏడంగుళములు. ఇక్కడ చలి భయంకరముగ నున్నది. కాని మంచు పడినపిమ్మట హిమాలయముల అద్భుతోజ్జ్వల రామణీయకము వర్ణనాతీతముగ నున్నది. అవి పరమశివునితో నిబిడముగ నిండినట్లు కనిపించుచున్నవి. గ్రామసస్యములకు అది చాల మంచిది. ఆరోగ్యమునకు చెప్ప నక్కఱ లేదు. ఈశ్వరసంకల్పముచే ఈవర్షములవలన ఈ ప్రాంతములకు క్షామబాధ తప్పినది. వానలు కురియకుండిన ఇక్కడి ప్రజలయు జంతువులయు దుస్థితికి అంతు ఉండియుండదు. తిండి లేక ఎందఱు ప్రాణులు చచ్చియుందురో దేవుడే ఎఱుగును.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణుని జయంతి మహోత్సవములు

### శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-4.

1970 వ సంవత్సరం మార్చి నెల 9 వ తేది సోమవారంనాడు పరమహంస శ్రీరామకృష్ణ దేవుని 135-వ జయంతి మహోత్సవతిథిపూజ మదరాసు మైలాపూరు శ్రీ రామకృష్ణమఠ సాధువులచేతను భక్తులచేతను నిర్వర్తింపబడినది. మఠావరణ మంతా చక్కగా అలంకృతమైనది. నాటిప్రభాతమున మంగళవాద్యములతో హారతితో కార్యక్రమం ప్రారంభమైనది. జన్మగ్రామావరణ స్మారకములైన పరిసరములమధ్య గురుదేవునిపటము స్వలంకృతమై పెట్టబడినది. పూర్వాహ్ణమంతయు భజనలతో గీతోపనిష ద్దేవీమాహాత్మ్యాది గ్రంథపారాయణంతో ప్రత్యేకపూజతో గడచినది. హోమముతోను ప్రసాదవినిమయంతోను అప్పటికార్యక్రమం ముగిసింది. వివేకానంద కాలేజి ఎన్సీసివిద్యార్థులు కార్యనిర్వహణమున మిక్కిలి సహకరించారు. సాయంపూజానంతరము మఠమండపంలో సమావిష్టమైన భక్తసదస్సులో శ్రీవిరూపాక్షానందస్వామి గురుదేవుని జీవితచరిత్రమున ముఖ్యఘట్టములను ప్రసుతించారు. శ్రీమత్పరమాత్మానందస్వామియు శ్రీమత్కైలాసానందస్వామియు గురుదేవుని జీవితసందేశాల ప్రాముఖ్యమును గూర్చి ఉపన్యసించారు.

మార్చి నెల 15-వ తేది భానువారంనాడు వివేకానంద సెంటినరీహాలులో బహిరంగోత్సవమునకు ఏర్పాట్లు చేయబడినవి. హరికథాకేసరి శ్రీ వి. ఎస్. వెంకటరమణరావుగారు మధ్యాహ్నానంతరం 2-30 గంటలనుండి 5-30 గంటలవఱకు ప్రహ్లాదచరిత్ర హరికథాకాలక్షేపం వినిపించారు. తరువాత పౌరసభ సమావేశమైంది. రిజర్వుబాంకి మాజీగవర్నరయిన శ్రీమాన్ హెచ్. వి. ఆర్ అయ్యంగారు సభాధ్యక్ష్యం వహించారు. ప్రార్థనగేయం మంత్రపుష్పానుసంధానం ముగిశాక మఠాధ్యక్షులైన శ్రీమత్కైలాసానందస్వాములు సభాధ్యక్షులకు వక్తలకు సదస్యులకు స్వాగతమంగళాశీస్సు అనుగ్రహించి శ్రీరామకృష్ణజయంతి ప్రాముఖ్యాన్ని గుఱించి ఈలా గన్నారు. రామకృష్ణక్యాలెండరులో శ్రీరామకృష్ణజయంతి అన్నిటికంటె ముఖ్యదినం. శ్రీరామకృష్ణుని జీవితోపదేశములప్రభావము ఈనాడు వేలకొలదిమానవులపై ప్రత్యక్షముగ అగపడుతున్నది. పరమహంసదేవుని జీవితమును ఉపదేశాలను వ్యాఖ్యానించే ఈలాటి సమావేశాలు చాల లాభదాయకాలు. శ్రీరామకృష్ణుడు మానవజాతికి ఉమ్మడిసొమ్ము. ఈనాడు శ్రీరామకృష్ణసామ్రాజ్యంలో సూర్యుడు అస్తమించడు అనడం యథార్థసూక్తి. రామకృష్ణసరస్వతం వర్ధిల్లుతున్నది. రామకృష్ణోద్యమం వ్యాపిస్తున్నది. నూతన రామకృష్ణకేంద్రాలను నెలకొల్పవలసిం దని బహుప్రాంతాలవారు ప్రపంచమంతటా అడుగుతున్నారు. "నాశిష్యులు చాలామంది. వారిభాష నే నెఱుగను." అని శ్రీరామకృష్ణుడే పల్కియున్నాడు. ఆమాట మిథ్యకాదు తథ్యమే యనుట కాలక్రమాన నిరూపితమవుతున్నది. శ్రీవివేకానందస్వామి మునుముందు మాతృశ్రీగారి అనుమతిని శ్రీరామకృష్ణుని అనుమతిని సంపాదించియే పాశ్చాత్యదేశాలలో పర్యటించారు. శ్రీరామకృష్ణు డప్పుడు భౌతికదేహంలో లేనప్పటికీ స్వామీ

జీకి దివ్యదర్శనంలో కనిపించి తాను కడలి కెరటాలపై సంచరిస్తూ తన్ననుసరించమని సైగచేశాడు. అదే అనుమతి. శ్రీరామకృష్ణుని సందేశం ఆధునికలోకానికి ఎంతైనా ఆవశ్యకం. విదేశీయసంస్కృతి మనదేశాన్ని ఆవరిస్తున్నప్పుడు అవతరించాడు శ్రీరామకృష్ణుడు. ఐహికపరమైన ఆ విదేశీ సంస్కృతి ధాటిని ప్రతిఘటింపనెంచిన విధినిర్ణయమే శ్రీరామకృష్ణుని అవతారము. దేశీయ విదేశీయశక్తులకు కలిగిన సంఘర్షణలో దేశీయశక్తులు తమస్థానమును నిలుపుకొనగలిగాయి శ్రీరామకృష్ణుని ప్రభావం చేత. ఐనా, శ్రీరామకృష్ణుడు మనదేశంకొఱకు ప్రాచ్యదేశాలకొఱకు మాత్రమే అవతరించినవాడు కాడు. యావన్మానవతతిశ్రేయస్సుకై ఘటిల్లిన అవతారం ఆయనది. ఐరోపా అమెరికాలుకూడ ఆయనకు స్వక్షేత్రాలే. అవతారం అనేది అరుదైన సంభవం. శ్రీచైతన్యునకు చిరము తర్వాత శ్రీరామకృష్ణుడు అవతరించాడు. అద్భుతమైన స్వకీయప్రతిభచే ఈనాటి విద్యావిధానవ్యర్థతను ఆయన గుర్తించాడు. దేవుని ఉనికిని గుర్తించాడు. బ్రహ్మసాక్షాత్కారమే మానవజన్మకు ఏకైకలక్ష్యమనిన్నీ సాధనలు సాగింపనిదే అది సిద్ధించదని ఆయన ఉద్ఘాటించాడు. ఆయన స్వయము పండ్రెండేండ్లు సాధన చేశాడు. ఊపిరికిగాను ప్రాణి కొట్టుకలాడినట్లుగా దైవసాక్షాత్కారమునకై తహతహపడితే అది తప్పక సిద్ధిస్తుందని ఆయన ఉపదేశము. దానిని తలదాల్చి సద్వినియోగపఱచుకోవడం మనకు ప్రాప్తం.

స్కూలువిద్యార్థులు ఆంగ్లప్రముఖ భాషలలో కంఠస్థముచేసిన స్వామీజీ ఉపన్యాసాలను వల్లించారు.

షికాగోనుండి విచ్చేసిన ప్రొఫెస్సరు ఆడెమ్సు సదస్యుల కోరిక కాసేపు ప్రసంగించారు.

ఆయన ఉపన్యాససంక్షేపం:—భారత సోదర సోదరీమణులారా, అమెరికాసంయుక్తరాష్ట్రాల ప్రజలఅభినందలను మీకు అందజేస్తున్నాం. భారతదేశమును దర్శించేందుకు హిందూసిద్ధాంతమును గుఱించి తెలుసుకునేందుకు రామకృష్ణ మిషను అంటే ఏమో దాని కార్యకలాపాలేవో కనుగొనేందుకు నేను మాశ్రీమతి ఇక్కడికి వచ్చాం. విశ్వమంతా, మానవతతి సమస్తము ఒక్కకుటుంబమే. ప్రాంతీయంగా భేదాలు పైకి కన్పించినా ఒకరి కొకరు అందఱూ సొంతమే. ఈదేశంలో ఎక్కడికి పోయినా మేము నిరీక్షించినంతకంటె ఎక్కువ ఆదరంతో ప్రజలు మమ్ము సత్కరిస్తున్నారు. విదేశీయులనుగా మమల్ను ఎవరూ భావించడం లేదు. సోదరులుగానే అంగీకరిస్తున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్రాలలో ప్రజలకు శ్రీరామకృష్ణునందు శ్రీవివేకానందస్వామియందు రామకృష్ణమఠమిషనుల కార్యకలాపములందు అభిరుచి నానాటికి వర్ధిల్లుతున్నది. అమెరికాలో రామకృష్ణమఠమిషను కేంద్రాలు పదింటికంటె ఎక్కువే ఉన్నాయి. ఆ కేంద్రాలనుండి గ్రంథాలు ఉపన్యాసాలు ఇతరప్రభావాలు వెలువడి అమెరికాప్రజలలో వ్యాపిస్తున్నాయి. అమెరికాలో కళాశాలవిద్యార్థులు ఇతరులు స్వాముల ఉపన్యాసాలు ఆలకిస్తుంటారు. హిందూసిద్ధాంతంలో జెన్బౌద్ధసిద్ధాంతమందు వారికి ఆసక్తి కలుగుతున్నది. పాశ్చాత్యదేశాలలో ఐహికపరత ఎంత ఉండినా జీవితాన్ని గూర్చిన అక్కఱకూడా పెంపొందుతున్నది. జీవిత మంటే ఏమిటి? విశ్వకళాపరిషత్పట్టములను, ఉద్యోగాలను పొంది ధనం గడించడమా? వీని ఉపయోగ మేమి? మనజీవితం ఎందుకు? వస్తుసంపాదనకేనా?—అని ప్రజలు తమ్ము ప్రశ్నించుకుంటున్నారు. అమెరికాలో

యువకోద్యమమును చాలమంది నిందిస్తుంటారు. ఆనిందకు కారకులు యువకోద్యమమునకు సంబంధించిన అతివాదులే. ఆ ఉద్యమమేమో మంచిదే. తదనుసారులలో అనేకులు అనితరస్థలోపలభ్యములైన విలువలకై వేదాంతాన్ని జెన్బౌద్ధసిద్ధాంతాన్ని భారతీయులను జపానీయులను ఆశ్రయిస్తున్నారు.

'కలైమగళ్' పత్రికాసంపాదకులైన శ్రీ కి. వా. జగన్నాథన్ గారు తమిళంలో ఉపన్యసిస్తూ ఈలా గన్నారు. ఆధ్యాత్మికక్షుత్తును తీర్చుకొనేందుకు సర్వదేశాలవారు పరమహంసను ఆశ్రయిస్తున్నారు. ఆయన ఆధ్యాత్మికశిఖరారూఢు డనేందుకు ఇది స్పష్టమైన తార్కాణము. భారతదేశంలో కవులు, కాటకాలూ ఎన్నో వచ్చాయి. ఆధ్యాత్మికశక్తికి మాత్రం క్షామం ఈదేశంలో ఎన్నడూ లేదు. రాజకీయంగా ఆర్థికంగా మనదేశం బానిసస్థితిలో ఉన్న కాలంలో విశ్వకళ్యాణకరులైన శ్రీరామకృష్ణవివేకానందు లనెడి పరంజ్యోతులు మన దేశంలో ఉదయించారు. బ్రతికినన్ని నాళ్లు శ్రీరామకృష్ణుడుభగవన్నిమగ్నుడుగనేడుండెను. బాల్యంలోనే భావసమాధి అనుభూతులు ఆయనకు కలిగాయి. పొట్టకూటిచదువు తనకక్కఱలేదని దృఢనిశ్చయంతో తెలిపాడు. పవిత్రతాస్వరూపిణియైన శ్రీశారదాదేవిని పెండ్లాడడం కూడా సొంతానికి ఆయన నిర్ణయించుకొన్న ప్రణాళికలో చేరిందే. శ్రీశారదారామకృష్ణవివేకానందత్రయము సోమస్కంధసిద్ధాంతము దాల్చిన మానవరూపమే. కనిపించిన ప్రతి ఒక్కరిని మీరు దేవుణ్ణి చూచారా అని అడుగుతుండినాడు వివేకానందస్వామి. పరమాత్మతో ఐక్య మందడానికి జీవాత్మపడెడి తహతహపాటును సూచించే ప్రశ్న అది. చూచారా అనే ప్రశ్నకు చూచాను అను జవాబు దక్షిణేశ్వరయోగిపుంగవుడొక్కడే చెప్పగలిగాడు. నిర్వికల్పసమాధిలో మునిగియుందమని స్వామిజీకోరినప్పటికి విశ్వమానవకళ్యాణమును సాధించవలసిన నీకు ఈలాటి కోరిక తగదు. అని చెప్పి శ్రీరామకృష్ణుడు ఆకోరికను వెంటనే తీర్పలేదను అంశము గమనార్హము.

తర్వాత జరిగిన వివేకానందకాలేజీప్రొఫెస్సరు కె. లక్ష్మీనారాయణగారి ఆంగ్లోపన్యాస సంగ్రహం. జీవితకాలంలోను తర్వాతను ప్రపంచాన్నంతా తనవంకకు ఎలయింపగలిగిన ప్రభావం శ్రీరామకృష్ణునిది. నచికేతునివలె రామకృష్ణుడును ప్రేయస్సును విడిచి శ్రేయస్సును అవలంబించాడు. కాళీగుడిలో ఆయన నిర్వహించిన పూజారికృత్యం కాళీమాతతో సాక్షాత్తుగా జరిగినచుట్టఱికపుకథయే. ప్రకృతయుగమును లోకజననియుగమని శ్రీరామకృష్ణుడు పేర్కొనుచుండెడివాడు. మహిళను పూజాపీఠముపైనుంచి ఆరాధించినవా డాయన. అన్నిమతమార్గాలు అనుసరించి అన్నియు మనలను ఒక్కగంతవ్యందగ్గఱకే చేర్చు ననెడి సత్యమును ఆయన స్వానుభవంచేత తెలుసుకొన్నాడు. క్రుంగిపోవుచుండిన ఆధ్యాత్మికపరతకు ఆయన పొంగు సమకూర్చినాడు. నాస్తికతాగర్తంలో పడిపోనీయక వివేకానందస్వామిని నిలిపాడు. రామకృష్ణవివేకానంద సమాగమవృత్తాంతము చదువరులకు రోమాంచం కలిగించకమానదు. గురువు స్థాణువు, శిష్యుడు నిత్యప్రవర్ధమాన విశ్వశ్రేయఃప్రవాహము. క్రీస్తుదేవునకు పాలుయోగీంద్రుడును బుద్ధదేవునకు ఆనందుడును ఎట్లో పరమహంసదేవునకు వివేకానందుడును అట్లే. రామకృష్ణవివేకానంద సారస్వతాధ్యయనకంటె ఆధునిక మానవునకు శ్రేయస్కరమైనది వేఱొకటి లేదు.

వక్తృత్వంలోను వ్యాసరచనలోను వివిధ విద్యాలయాలు జరిపినపోటీలలో నెగ్గిన విద్యార్థులకు విద్యార్థినులకు బహుమతులు పంచిపెట్టబడాయి.

సభాధ్యక్షులైన శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగారు తమ నిగమనోపన్యాసంలో ఈలాగు వాక్రుచ్చారు:-నేటి సంఘజీవితంలో అసుఖకరవిప్లవాలు కనిపిస్తున్నాయి. యువకులు ఆలోచించాలి. ఇలాంటి సందర్భాలలో ఆస్తిక్యం ఎంత విలువకలదో వారు గుర్తించాలి. అత్యంతక్లిష్టపరిస్థితులు కలిగినప్పుడు జగదుద్ధారకులు అవతరిస్తుంటారు. శ్రీవివేకానందస్వామిని శ్రీరామకృష్ణుడు ఆనాడు నిర్వికల్పసమాధిలో మునిగిపోనీక ఆపినందుల సత్ఫలితమే ఈనాడు రామకృష్ణమఠమిషనుల రూపంలో కనిపిస్తున్నది.

శ్రీ కృ. బాలసుబ్రహ్మణ్య అయ్యరుగారు సదస్యులకు వందనోపచారం నిర్వర్తించారు. అనంతరం మఠమండపంలో మఠ భజనబృందం వారు గంటసేపు కాళీకీర్తన చేశారు. ప్రసాద వినిమయంతో నాటికార్యక్రమం ముగిసింది.

## శ్రీ గీతాగ్రంథాలయం, మలక్పేటకాలని, హైదరాబాదు

శ్రీ గీతాగ్రంథాలయ కార్యవర్గము, సన్మానసంఘము తరఫున హైదరాబాదు మలకపేట రిక్రియేషనుక్లబ్బునందు 15-3-70 తేదీ ఆదివారము సా॥ 4 గంటలకు గీతావ్యాస శ్రీ శిష్టా సుబ్బారావు M.A. గారికి ఘనమైన సన్మానము గావింపబడెను. శ్రీ వి. సూర్యనారాయణ స్వాగతవాక్యములు పల్కెను. శ్రీ K.N. అనంతరామన్ I.C.S. గారు అధ్యక్షత వహిస్తూ గ్రంథాలయ విభాగమునకు ప్రారంభోత్సవము గావించిరి. ఎండోమెంటుకమిషనరు శ్రీ K- వాసుదేవరావు I.A.S. శ్రీ సుబ్బారావుగారి ఆంగ్లవ్యాఖ్యానసహిత భగవద్గీతను ఆవిష్కరించిరి. గీతోపన్యాసముల పరిసమాప్తి సందర్భమున శ్రీ సుబ్బారావుగారికి వేయిన్నినూటపదహారు రూపాయలు. వారికి, వారి కుటుంబమునకు నూతనవస్త్రములతో సన్మానము గావింపబడినది. డా॥ పి. రామచంద్రుడు గీతాపరముగ మనప్రస్తుత కర్తవ్యమునుగూర్చి ఉత్తేజకరమైన సందేశమునిచ్చిరి. అటవీశాఖామాత్యులు గా॥ రాజా సాగి సూర్యనారాయణరాజుగారు గీతలపోటీలందలి బాలబాలికలకు బహుమతులు,ప్రశంసా పత్రములు పంచిపెట్టుచు, గ్రంథాలయము చేయుచున్న సేవను, విశ్వవిఖ్యాతమైన గీతయందలి బాలల ఆసక్తిని ప్రశంసించిరి. కార్యదర్శి శ్రీ వై. విశ్వనాథము వందన సమర్పణగావించిరి

# గ్రంథపరిచయం

## దివ్యభజనసంగ్రహము

(శ్రీ శివానందాశ్రమమునందు ప్రతినిత్య మొనర్పబడు ప్రార్థన భజన కీర్తనల సార సంగ్రహము.

ప్రకాశకులు దివ్యజీవనసంఘము, శివానంద నగర్, (హిమాలయములు) పుటలు 168, వెల మూడు రూపాయలు.

భక్తి తొమ్మిదివిధము లన్నారు. అందు 'కీర్తనము' సార్వత్రికము ప్రముఖగణ్యము, దుర్బల మనశ్శరీరులకు కలికాలమానవులకు విహితమైన యేకైకతరణోపాయము అమోఘమైనది భగవన్నామసంకీర్తనము. కావున దేశంలో ఉన్న ఆధ్యాత్మికసంస్థలు భజనావళులను సంకలించి ప్రచురించియున్నారు. ఇది శివానందాశ్రమము వారి తరఫున విద్యానందస్వాములవారు సంకలించిన భజనావళి. ఉపోద్ఘాతముగ తెలుపనెంచిన విషయాలను తొలి పందొమ్మిది పుటలలో పొందుపఱచారు. సూత్రాలు మంత్రాలు స్తోత్రాలు–జపనియమ వివరణసమేతంగా – ఒక యిరవైయాఱు మొదటిభాగంలో క్రోడీకరింపబడ్డాయి. (శ్రీ) శంకర – జయదేవ –తులసీదాస – సదాశివ బ్రహ్మేంద్ర – వల్లభాచార్య – హసామలక – హృదయనంద – కాళిదాస – వ్యాస–పురందరదాస–రామదాస–త్యాగరాజ – మీరాబాయి–తుకారామ–నరసీమెహతా–ప్రముఖగ్రథితములైనవి భజనావళులు డెబ్బైయొక్కటి రెండవభాగంలో చేర్పబడ్డాయి. ప్రతిదానిలోను శ్లోక – గేయ – నామకీర్తనలనే మూడు విభాగాలు చూపబడిఉన్నవి. అచ్చు తప్పులున్నా, ఆంగ్లవాక్యముల ఆంధ్రీకరణంలో ఆంధ్రజాతీయత వెలితిగాఉన్నా – ఈ భజన స్తోత్రగేయావళి మాధుర్యం అపారం అగాధం అనిర్వచనీయం లోకోత్తరం అనడం అత్యుక్తి కాదు.

రచయిత, ప్రాప్తిస్థానము : శ్రీ తుమ్మూరి నరసింహారావు, నేతివారిపాలెము, నెల్లూరుజిల్లా. చిన్నసైజు, పుటలు 55, వెల తెలుపబడలేదు.

'గీతమాలికాశతకము లిఖించి తావకీన పాదపద్మముల నంకితము జేసికొంటి భక్తిశ్రద్ధలతోడ' అని రచయితయే తెల్పుకొన్నట్లు ఇది గీతికాఛందోగ్రథితమైన శతకం. భక్తిప్రవాహమే ఈ శతకముగా రూపుదాల్చినందువల్ల నిరర్గళధారాశుద్ధి ఈ ఫణితిగుణాలలో ప్రముఖగణ్యము. రూపప్రశంస, గుణకీర్తనం, దశావతారనుతి, బ్రహ్మోత్సవప్రస్తుతి – ఏవమాది విషయవిభాగమున్నూ ఇందు పాటించబడి ఉంది. గట్ల నతిక్రమించడం వెల్లువపొంగుకు గుణమైనట్లుగా ఈ శతకంలోనూ అక్కడక్కడ పద్యపాదాలసంఖ్యానాలుగు అనే హద్దు అతిక్రాంతం కావడం గుణమే. శ్రీ వేంకటేశ్వర భక్తులకు ఈ శతకానుసంధానానుభవమున్నూ బ్రహ్మానందానుభవమున్నూ అభిన్నములు.

ప్రభాకర్

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి...

—ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50 క్యాలికో : రూ. 5-50

---

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! | ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము - రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హిరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ హిరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషన్ (సేవాసంస్థ): తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు                వెల : 50 పైసలు

---

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు     దివ్యమగు ద్వితీయ ముద్రణము     వెల : రూ. 2-50

---

అడ్రెసు : **మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**

# రామకృష్ణప్రభ

సంపుటము ౨౬ ౧౯౭౦ - మే : సాధారణ - వైశాఖము సంచిక ౧౧

## విషయసూచిక



ఫోన్ : 71231 **శ్రీరామకృష్ణప్రభ** పోస్టు బాక్సు : 635

1. 1969 జూలై నుండి శ్రీరామకృష్ణప్రభ ఇరవై ఆఱవ సంపుటం జరుగుతూ ఉంది.
2. చందావివరాలు : ఇండియాలో ర్వూ. 5-00 ; సిలోనులో ర్వూ. 7-00 ; ఇతరవిదేశాలలో ర్వూ. 7-50 ; విడిసంచిక 50 పైసలు.
3. చందాదారులు జాబులలో తమచందాదారుసంఖ్యను చిరునామాను స్పష్టంగా వ్రాయాలి.
4. సంచిక అందకపోతే వారంరోజులలో తెలియజేయాలి.
5. మేము ప్రచురించిన తెలుగుగ్రంథాలలో అనేకములు శ్రీరామకృష్ణప్రభ చందాదారులకు తక్కువవెలకు అందజేయబడును. వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.
6. శ్రీరామకృష్ణప్రభ ప్రముఖసంస్కృతీకేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మికవిజ్ఞానపత్రిక. అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకం. రేట్లకు వ్రాయండి.
7. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపాలని గ్రంథకర్తలకు, ప్రకాశకులకు మా ప్రార్థన.

తక్కిన వివరాలకు ఈ చిరునామాకు వ్రాయండి :—

మేనేజరు : శ్రీరామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీరామకృష్ణమఠం, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు; కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము—సర్వవిధముల నమూల్యమైన గ్రంథ రాజము. —శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * * —శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * * —శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

526 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 5-00

# శ్రీ శారదాదేవి చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును....చదువవలసిన గ్రంథ మిది....అమృతకలశము!....అనన్య సామాన్య నీతిమంజరి....తియ్యని తెలుగు....పాలవంటి శైలి.... —ఆంధ్రప్రభ.

246 పుటలు (ముచ్చటయిన మూడవ కూర్పు) వెల : రూ. 2-75

# శ్రీ శారదాదేవి

రచయిత :

శ్రీ నండూరి బంగారయ్యగారు, బి. ఏ.

శ్రీ శారదాదేవి జీవితచరిత్రయందు గ్రంథస్థములుగాని విషయములెన్నియో యిందు వివరింప బడియున్నవి. ఆమె పవిత్ర చరిత్రమున కాధారభూతములగు గ్రంథములు, పత్రికలు మున్నగు వాని ద్వారా గడించిన విశేష విషయము లిందు గలవు.

143 +16 పుటలు (ప్రథమ ముద్రణము) వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను ప్రాగల్భ్యగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వాచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సణ్డే స్టాణ్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు    వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు    మూడవ కూర్పు    వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ } ౧౯౭౦ - మే : : సాధారణ - వైశాఖము { సంచిక ౧౧

## పరమార్థస్తుతి

మూలకర్త : శ్రీ వేదాంత దేశికులవారు

వ్యాఖ్యాత : శ్రీమత్కాంచీ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి.

౧

శ్రీమాన్ వేఙ్కటనాథార్యః కవితార్కికకేసరీ
వేదాన్తాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

కవిసింహమును తార్కికసింహమును వైష్ణవశ్రీమంతుడును వేదాంత దేశిక బిరుదాంచితుడు నగు ఆర్యుడు వేంకటనాథుడు నా డెందమున నెల్లప్పుడు నెలకొనియుండును గాక.

### అవతారిక

శ్రీవేదాంత దేశికులవారు వేదవేదాంతరహస్యార్థసారమును పలుస్తోత్రముల రూపమున అనుగ్రహించియున్నారు. వానిలో పరమార్థస్తుతి యను నిది పరమవిలక్షణమైనది. శ్రీకాంచీక్షేత్ర పరిసరమున 'గృధ్రసరము' (తిరుప్పుట్కుళి) అను దివ్యదేశము ప్రసిద్ధమైనదే. అచట వెలసియున్న భగవంతునిగురించి కావింపబడిన స్తోత్ర మిది. జటాయువును సంస్కరించిన శ్రీరామచంద్రునందు పదునాల్గువేల రక్కసులను వ్రక్కలించిన మహావీర్యగుణము పరకాలసూరికి తిరుమంగయాళ్వారుకు ఎంతయు నచ్చినందున ఆయన 'పెరియతిరుమడల్' అను ప్రబంధమున భగవంతుని 'పుట్కుళియెమ్పోరేత్తై' అని పేర్కొనిరి. 'పోరేఱు' అను పదమును శ్రీవేదాంత దేశికులవారు ఈస్తోత్రమున 'సమరపుంగవ' 'రణపుంగవ' 'ఆహవపుంగవ' అను రీతుల అనువదించి ప్రయోగించుకొన్నారు. శ్రీరాముడు జటాయువును గర్తముననిడి సంస్కరించిన

చోటట ఇది. కావున 'పుట్కుళి' 'గృధ్రసరము' అను పేర ప్రసిద్ధి నొందినది. ''పరమార్థ స్తుతి రన్వహం ప్రపన్నైః'' అను తుదిశ్లోకమున శ్రీదేశికులవారే ఈస్తోత్రమును 'పరమార్థస్తుతి' అని పేర్కొనిరి. పరమార్థ మనగా మోక్ష మనెడి పరమపురుషార్థమే. దానిని ప్రసాదింపగలది యను నభిప్రాయముతో స్తుతికి ఈపేరు పెట్టబడినది. కాయికకైంకర్య మొనర్చిన జటాయువు నకు లభించిన మోక్షము ఈస్తోత్రానుసంధానముచేతను గలుగు ననుట. 'సత్యేన లోకాన్ జయతి' 'సత్యప్రభావముచే సకలలోకములను వశపఱచుకొన్నవాడు' శ్రీరాముడు. కావున ''మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్'' 'నాచేత ననుమతుడవై, పక్షి రాజా, జటాయూ, అత్యుత్తమలోకముల కేగుదువు గాక'' అని జటాయువునకు మోక్ష మీయ గల్గెను. అట్టి సత్యవాక్యప్రభావశాలియగు భగవంతునిగూర్చిన దగుటచే ఈస్తోత్రమునకు 'పర మార్థస్తుతి' అను పే రిడబడె ననియు గ్రహింపవచ్చు. లేదా ప్రతిశ్లోకమునను గల వరిష్ఠార్థ సంపదచే దీనికి 'పరమార్థస్తుతి' అను పే రేర్పడిన దని సంతోషింప నగును.

శ్రీమద్గృధ్రసరాస్తీరపారిజాత ముపాస్మహే
యత్ర తుఙ్గై రతుఙ్గైశ్చ ప్రణతై ర్గృహ్యతే ఫలమ్. 1

యత్ర = ఏభగవంతునకు, ప్రణతైః = నమస్కరించిన వారైనంతమాత్రముచేతనే, తుఙ్గైః అతుఙ్గైః చ = ఉన్నతులు నిమ్నులు అను భేదములేక అందఱిచేతను, ఫలమ్ గృహ్యతే = (కోరిన) ప్రయోజనము పొందబడుచున్నదో, శ్రీమద్ గృధ్రసరఃతీర పారిజాతమ్ = సుసంపన్న మగు గృధ్రసరముగట్టున వర్ధిల్లు కల్పవృక్షమువంటివాడగు ఆభగవంతుని, ఉపాస్మహే = ఆరాధించుచున్నాము.

గృధ్రసర మనునది అచటి సరస్సునకును ఆదివ్యదేశమునకునుగూడ పేరై యున్నది. ఆపుష్కరిణీతీరమున వేంచేసియున్న శ్రీవిజయరాఘవస్వామిని కల్పవృక్షముగ నిట రూపించు చున్నారు. సరస్తీరసంజాతత్వముచే ఫలప్రదత్వమునకు లోటుండదు కావునను, ''ఎనక్కే తన్నై తన్ద కఱ్పగమ్'' 'నాకే తన్ను ఇచ్చుకొన్న కల్పవృక్షము' అని ఆళ్వార్లు ప్రస్తుతించి యున్నారు కావునను, ప్రత్యేకముగ ఈక్షేత్రనాథుని వరప్రసాదవైభవము విశిష్టమైనది కావునను —ఈయనను 'పారిజాత' మనుట ఎంతయు నుచితమే. ఈకల్పవృక్షము మహోన్నతమైనదే అయినను అర్చావతారమున కనుగుణముగా తన్ను కుఱుచపఱచుకొని యున్నది. కావున ఇందలి ఫలమును అందుకొనుటకు ఎవరును ప్రయాసపడ నక్కఱ లేదు. పైగా నిగుడుకొని నిలుచువారి కందక 'ప్రణతైః' వంగినవారికి మాత్రమే ప్రపన్నులకుమాత్రమే ఫలము అందుట ఇచటి విశేషము. 'ఫలము' అనగా పరమపురుషార్థమగు మోక్ష మని కాని, వారు వారు కోరు 'ఫలము' అని కాని గ్రహింపవచ్చు.

గురుభి స్త్వదనన్యసర్వభావై ర్గుణసిన్ధౌ కృతసంప్లవ స్త్వదీయే
రణపుఙ్గవ, వన్దిభావ మిచ్ఛ న్నహ మస్మ్యేక మనుగ్రహాస్పదం తే ॥ 2

రణపుఙ్గవ=ఓయుద్ధవీరా, త్వదనన్యసర్వభావైః = నీయందుతప్ప వేఱెద్దానియందును మనసునుజొనుపనివారగు, గురుభిః = ఆచార్యులచే, త్వదీయే గుణసిన్ధౌ = నీకల్యాణగుణసాగర మున, కృతసంప్లవః=ముంపబడినవాడనై (అందుచేతనే) వన్దిభావం ఇచ్ఛన్ = నిన్ను స్తుతించువా డనుగ నుండగోరు, అహం = నేను, తే = నీ, అనుగ్రహాస్పదం = అనుగ్రహమునకు పాత్రుడనై అస్మి=ఉన్నాడను, అనుగ్రహించి నన్ను నీస్తుతిపాఠకునిగా తీర్చిదిద్దుకొమ్మనుట.

నిన్ను ధ్యానించుట తప్ప వేఱేమియు నెఱుగని ఆచార్యులు "పయనన్ఱాగిలుమ్ పాఙ్గలరాగిలుమ్ శెయల్ నన్ఱాగ తిరుత్తి ప్పణికొళ్ళుమవర్గళ్" "ఇతరులు చక్కబడుటవలన తమకొక ప్రయోజనము లేకపోయినను చక్కబడుటకు తగినట్లు వారుండక పోయినను, స్వకీయానుష్ఠానముచే బాగుగా శిక్షించి వారిని ఏలుకొనువారు" కావున నన్నును చక్కజేసి నీగుణసాగరమున నవగాహింపజేసిరి. అవగాహించినంతనే, నాలుక యున్నందుకు ప్రయోజన ముగ నిన్నుగూర్చి స్తుతివాక్యములను గొన్నింటిని పల్కకున్నచో ప్రాణము నిలువని దశలో నున్నాను. "తామ్ తమ్ పెరుమె అఱియార్" "తామునైతము తమమహిమ నెఱుగరు" "తనక్కుం తన్ తన్మై అఱివరియాన్" గ్రహించుటకు తనకునైత మందని స్వరూపము గల వాడు" "నాన్మఱైగళ్ తేడి ఎన్ఱుమ్ కాణ మాట్టా చ్చెల్వ" "వెదకి సాక్షాత్కరించుకొన నాల్గువేదములకు నైత మందుబాటుకాని యైశ్వర్యముగలవాడు" అని యిట్లంతయు చెప్పబడు చున్న నిన్ను స్తుతించుసామర్థ్యము మూఢుడనగు నా కెక్కడిది? నలుచును సగముగా జేయ గల సర్వశక్తివగు నీవు అనుగ్రహింతువేని సిద్ధింపని దేదియు నుండదు. కావున దయచేసి కొన్ని స్తుతివాక్యములను నాచే పల్కింపుమా అనుట.

భువనాశ్రయభూషణాస్త్రవర్గం మనసి త్వన్మయతాం మ మాతనోతు
వపు రాహవపుఙ్గవ త్వదీయం మహిషీణా మనిమేషదర్శనీయమ్॥ 3

ఆహవపుఙ్గవ=ఓయుద్ధవీరా, భువన + ఆశ్రయభూషణ + అస్త్రవర్గం = లోకములకు ఆశ్రయములైన దివ్యభూషణములయును దివ్యాయుధములయు సమూహముగలదియు, మహి షీణాం అనిమేషదర్శనీయమ్= దేవేరులు రెప్ప వ్రాల్పక దర్శించుచుండదగినదియు నగు, త్వదీయం వపుః=నీమేను, మమమనసి=నాడెందమున, త్వన్మయతాం ఆతనోతు=నిన్నుగూర్చిన భావనా ప్రాచుర్యమును గల్గించును గాక. నామనసు నీ దివ్యమంగళవిగ్రహమునే ఎడతెంపులేక చింతిం చుచు తన్మయముగనే యుండవలెననుట.

సాధారణముగా ఆకర్షించుట ఆభరణముల గుణము. బెదరగొట్టుట ఆయుధముల గుణము. కాని భగవంతునొద్ద నన్ననో ఆయుధములును ఆభరణములతో సమానములుగ ఆకర్షకములుగ నుండును. తిరువాయ్ మొழி (1-5-1) లో 'వళవేழులగు' అను పాశురముమీఁది వ్యాఖ్యలో "అస్త్రభూషణాధ్యాయమున శ్రీకౌస్తుభముద్వారా జీవకోటిని ధరించు ననియు, శ్రీవత్సముద్వారా ప్రకృతిప్రాకృతములను ధరించు ననియు చెప్పబడియున్నదికదా" అను సూక్తి నిట ననుసంధించుకొనవలయును. భూషణము లేవేవి యనగా గద్యమున "కిరీట

మకుట చూడావతంస మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదా మోదరబన్ధన పీతామ్బర కాఞ్చీగుణ నూపురాదిగా'' భగవద్రామానుజులవారు పేర్కొన్నవి. 'చూచు కన్దోయి తనియని సొగసు' కాబట్టి దేవేరులు తెప్పవ్రాల్పక చూచు చుందురు. 'మహిషీణాం' అనుటకు ''దేవేరు'' లనియే కాక 'మహర్షు' లనియు అర్థము చెప్ప వచ్చును. యజుర్వేదమున (i-1-28) 'మహిషీవ త్వద్రయిః' అనుచోట 'మహిషి' అనుటకు 'మహర్షి' అనియే భట్టభాస్కరులు భాష్యము వ్రాసియున్నారు. వేదాంతదేశికుల వేదగంధి శ్రీసూక్తికి వేదచ్ఛాయలో అర్థముచెప్పుటయు ప్రాప్తమే. భగవంతుని దివ్యసౌందర్యము దేవే రులచూపుల నాకర్షించుటే కాక (శ్రీరామావతారమున దండకారణ్యవాసి) మహర్షుల చూపుల నెంతగా ఆకర్షించెనో శ్రీరామాయణమున చెప్పబడియున్నది. 'ఆతనోతు' అనుదానికి బదులు 'ఆతనోతి' అను వర్తమానార్థకరూపమును కొందఱు పఠింతురు. అది సరసతరము.

అభిరక్షితు మగ్రతః స్థితం త్వాం ప్రణవే పార్థరథే చ భావయన్తః
అహితప్రశమై రయత్నలభ్యైః కథయ న్త్యాహవపుఙ్గవం గుణజ్ఞాః 4

అభిరక్షితుమ్=సంరక్షణకార్యమును నిర్వహించుటకై ప్రణవే (అగ్రతః) = ప్రణవ మున మొదటను, పార్థరథేచ అగ్రతః=అర్జునుని రథమునముందువైపును స్థితం త్వాం = నెల కొనియున్న నిన్ను, భావయన్తః గుణజ్ఞాః=భావనసేయు దివ్యసూరులు (ఆళ్వారులు), అయత్న లభ్యైః=నీయొద్దనుండి సులభముగ పొందదగియున్న, అహితప్రశమైః=అనిష్టనివారణములనుబట్టి ఆహవపుఙ్గవం=యుద్ధవీరు డను పేర, కథయన్తి=(నిన్ను) వ్యవహరింతురు.

విజయరాఘవస్వామికి (తిరుమంగ) ఆళ్వారు ('పోరేఱు'=) ఆహవపుంగవు డని పెట్టిన పేరు ఎంతయు ఉపపన్నమైనదే. అనిష్టనివృత్తిపూర్వకముగా ఇష్టప్రాప్తిని గూర్చుటే సంరక్షణము. కావున విరోధినిరసనమే - రక్షణమున ముఖ్యమైనది. విరోధినిరసనసామర్థ్యము చక్కగ ద్యోతిలజేయు సమరపుంగవనామము దేవుని సర్వరక్షకత్వమునే తెలుపును. సర్వరక్ష కత్వమునకు శబ్దప్రమాణమును ప్రత్యక్షప్రమాణమును చూపుచున్నారు - దేవుడు అకార వాచ్యుడు, 'అ+ఉ+మ్=ఓమ్' అను ప్రణవమున అకారమునకు గల అగ్రస్థానము శబ్దప్రమా ణము. 'అవరక్షణే' అను ధాతువునుండి నిష్పన్నమైనదే అకారము. అర్జునునిరథమున సర్వేశ్వ రుడు సారథి స్థానమున నెలకొనియుండె ననుట ప్రత్యక్షప్రమాణము. లేదా - దీనినిసైతము శబ్ద ప్రమాణముగనే కొనవచ్చును. సర్వరక్షకత్వమును శాస్త్రముఖమున ప్రసిద్ధిపఱచుటకై ప్రణ వాగ్రమునను, సర్వరక్షకత్వమును క్రియాపర్యసాయిగా చూపుటకై పార్థరథాగ్రమునను స్వామి నెలకొనియున్నా డనుట. శ్లోకమున నున్న ''గుణజ్ఞాః'' అనుపదము భగవద్గుణానుభవమే ధారకపోషకములుగా గల దివ్యసూరులను (ఆళ్వార్లను) తెలుపును. శ్రీ వేదాంతదేశికులవారు ముఖ్యముగ తిరుమంగయాళ్వార్లనే గుణజ్ఞశబ్దముచే వివక్షించియుందురు. భగవంతుడు రణా గ్రముననుండె నని రామావతారమునను చెప్పవచ్చును కృష్ణావతారమునను చెప్పవచ్చును.

గృధ్రసరః క్షేత్రనాథుడు విజయరాఘవస్వామియై యుండ, రణాగ్రస్థితిని రామావతారపరముగ చెప్పక పార్థసారథ్యరూపమున కృష్ణావతారపరముగ చెప్ప నేల అని యడుగుదు రేమో. ధర్మి యొక్క ఐక్యముచే రాము డన్నను కృష్ణు డన్నను ఒక్కడే. కార్ణైవరుగ నున్న కృష్ణునిలో ప్రకాశించిన భక్తపరాధీనత యను మహాగుణము దేశికులవారి దివ్యచిత్తమున కెంతయు నచ్చె నేమో. 'అయత్నలబ్ధైః' అనక, 'అయత్నలభ్యైః' అను టేల యనిన – విరోధినిరసనము అవలీలగ నిర్వర్తితమగుట విభవావతారమునమాత్రమే కాదు, అర్చావతారమునను నిర్వర్తిత మగుచుండు నని సూచించుటకు. (4)

(సశేషము)

# అభయదగర్జనము

శారదాచరణ్

(మంజరీ ద్విపద)

వరవీరభట మహోత్కర నాదములకు
యుద్ధసన్నద్ధ సైన్యోద్ధృతంబులకు
సమదఘోటక మహోచ్చైః స్వనమ్ములకు
సంకుశైకవశాళి ఘీంకారములకు
ఢమరుకా భేర్యాది ఢమఢమ ధ్వనికి
నదరిపోవుచునుండె నా రంగ; మంత
ఘోరసంగ్రామముం గొంచెంబు నిల్పి,
ధీరుడై పార్థు ను త్తీర్ణు జేయంగ
నిఖిలసైన్యము మధ్య నిల్చె నల్లడుగో
అఖిలేశ్వరుం డెల్ల రాశ్చర్య మంద!
మహనీయశాంతితో మంజులంబుగను
మాటాడ దొడగె; నమ్మధురవాక్కులను
గ్రోలు చర్జునుడు లోకాలను మఱచె॥

విన రండు! విన రండు! వినరండు! రండు!
విబుధులార, మనోజ్ఞ విశ్వేశుగీత
"సర్వధర్మంబులన్ సన్న్యసింపుండు
నన్నొక్కనే శరణం బంద రండు,
సర్వపాపముల సంక్షయ మంద జేసి,
యుత్కృష్టమోక్షంబు నొసగెద మీకు."
ఈవిధంబునను జీవావళి కయ్యె
ధైర్యసాహస మహోత్సాహబలములు
ప్రోత్సాహజనకముల్ సత్సౌఖ్యదములు
విశ్వేశుగీతలు విన రండు! రండు!
పారాయణం బొనర్పగ రండు! రండు!
అమృతసాగరమందు నలరంగ రండు!
ఇహపరంబులను సర్వేచ్ఛలం దీర్చు
విమల విముక్తిధామమునకుం జేర్చు॥

ఓమ్ తత్ స్సత్.

# దక్షిణేశ్వరమున "కాళి" గుడి

క్రిందటి శతాబ్దమున కలకత్తాలో రాణీరాస్మణి అను నొకతె యుండెను. ఆమె వితంతువు, సంపన్నురాలు, ఆమెది శూద్రజాతి. వర్తకవ్యాపారముల నైపుణ్యమునకే గాక బుద్ధిబలమునకును ధైర్యౌదార్యములకును శ్రద్ధాభక్తులకును దేశమంతటను ఆమె పేరు పొందియుండెను. జమీనుపనుల నిర్వాహమున ఆమె అల్లుడు మధురామోహనుడు ఆమెకు తోడ్పడుచుండెను.

1847 లో రాణీరాస్మణి దక్షిణేశ్వరమునొద్ద ఇరువదియెకరముల భూమినికొనెను. దక్షిణేశ్వర గ్రామము కలకత్తాకు ఉత్తరమున 4 మైళ్ల దూరమున నున్నది. ఆమె అచ్చట నొక యారామమును అందు పెక్కు దేవాలయములను కట్టించెను. లోకజననియైన ఆమె కిష్టదైవము.

ఆ దేవాలయారామము సూటిగ గంగకు తూర్పుగట్టున నున్నది. కొన్న భూమిలో ఉత్తర భాగమందును, తూర్పున కొంతవఱకును ఫల వృక్షములతోపును పూదోటలును రెండు చిన్న తటాకములును గలవు. దక్షిణభాగమున ఇటి కలపఱపును సున్నపుగచ్చును గలవు. అచ్చటి స్నానఘట్టము హృదయాకర్షకము. పడవలో వచ్చు యాత్రికుడు మొదట దాని మెట్లనే ఎక్కును. ఆ మెట్లదారి చాందినీకి చేర్చును. అది యొక మేడ. మేడపైని ఇల్లున్నది. దానికి ఉభయపార్శ్వములందును ఒకటే వరుసగా ఆఱు శివాలయము లున్నవి. ఆ మేడకును శివాలయములకును తూర్పున విశాలమైన ఖాళీస్థల మున్నది. అది యుత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించి దీర్ఘచతురస్రాకారము కలిగి యున్నది. దాని నేల గచ్చే. ఆ స్థలమునకు నట్టనడుమ రెండు దేవాలయా లున్నవి. అందు పెద్దది దక్షిణపువైపునను, దక్షిణాభిముఖముగను ఉన్నది. అందు ప్రతిష్ఠనంది యున్న వేల్పు కాళి. చిన్న దేవాలయము గంగకభిముఖముగ నున్నది. అందు వెలసియున్న వేల్పు రాధాకాంతుడు, అనగా రాధకు వల్లభుడైన కృష్ణుడు. కాళిగుడిమీద శిఖరాలతోడి గోపురాలు తొమ్మిది యున్నవి. దాని కెదుట విశాలమైన నటమందిరమును సంగీతశాలయు నున్నవి. దాని మేడ పెద్ద స్తంభాలపై నెలకొని యున్నది. దేవాలయప్రాకారపు వాయవ్యమూలలో నొకటియు, నైరృతిమూలలో నొకటియునుగాక నహబత్తులు (సంగీతగోపురాలు) రెండున్నవి. వివిధకాలాలలో, ముఖ్యముగ ఆలయపూజావేళలలో అనగా త్రిసంధ్యలయందును సంగీతము ఆ గోపురాలనుండి వెలువడుచుండును. ప్రాకారములో పడమటివైపున తప్ప, తక్కిన మూడువైపులను వరుసగా గదు లున్నవి. వంటకును, వస్తువులను భద్రపఱచుకొనుటకును, భోజనాలకును ఆలయ కైంకర్యపరులును సేవార్థులును వసించుటకును ఆ గదులు ఏర్పఱుపబడియున్నవి. కడపటి శివాలయమున కావల, వాయవ్యమూలలో నున్న గది, మనకు ప్రత్యేకముగ చాల ముఖ్యము. ఏల యన శ్రీరామకృష్ణుడు తన జీవితమున విశేషభాగమును గడపిన దచ్చటనే. ఆ గది పడమరగాను, నదికి ఎదురుగాను అర్ధవలయాకారముగ నొక మండపము (పోర్చ్) ఉన్నది. ఆ మండపమున కెదుట ఉత్తరదక్షిణములుగ పర్వైన కాలిబాట యున్నది. దానికి ఆవల పెద్ద తోటయు తోటకు క్రింద గంగయు నున్నవి. కట్టడమునకు ఉత్తరమున నున్న పండ్లచెట్లతోటలో శ్రీరామకృష్ణుని యాధ్యాత్మికసాధనలకు దావలమైన పంచవటి అను మఱ్ఱిచెట్టును మారేడుచెట్లును ఉన్నవి. గుడి

ప్రాకారమునకు బయట ఉత్తరమున నున్న భవనమును రాణీరాస్మణికుటుంబమువారు తోటకు వచ్చినప్పుడు వాడుకొనుచుండిరి. గుడితోటకుత్తరముగ, ఎత్తైనగోడ కావల, ప్రభుత్వమువారి తుపాకిమందుకొట్టున్నది.

## శివుడు

పన్నెండు శివాలయాలలోను మహాభిక్షువైన పరమశివుని వివిధమూర్తులును చిహ్నములు(లింగములు)ను ప్రతిష్ఠితములైయున్నవి. అచ్చట నిత్యారాధన యథావిధిగ జరుగుచుండును. శివపూజకు కావలసిన వస్తువులు తక్కువే ఆ కృపామయుని తృప్తిపఱచి, ఆయన యొద్దనుండి మోక్షమనెడి వరమును గడింపవలెననిన, తెలిపూలను, బిల్వదళాలను కొంచెము గంగాతీర్థమును భక్తితో అర్పించిన చాలును.

## రాధాకాంతుడు

రాధాకాంతాలయమునకు విష్ణుదేవాలయమనియు మఱియొక పేరు గలదు. అందు రాధాకృష్ణుల విగ్రహా లున్నవి. ఆ దేవీదేవుల కలయిక ఉత్కటప్రేమసిద్ధికి లక్ష్యము. విగ్రహములు రెండును పశ్చిమాభిముఖములై ఏక పీఠమున నెలకొనియున్నవి. నేలయంతయు చలువరాళ్ల పఱపే. ముందఱి మండపము పైకప్పునుండి దీపాలసెమ్మెలు వ్రేలుచుండును. వానిపై దుమ్ముపడకుండుటకై ఎఱ్ఱగుడ్డల కప్పడము లున్నవి. సూర్యాస్తమయమప్పుడు ఎండ విగ్రహాలపై పడకుండుటకై కిత్తనార తెర లున్నవి. గర్భగృహపు గడపకు సమీపముగా చిన్నయిత్తడిపాత్రలో పవిత్రతీర్థముండును. సేవార్థులు భక్తితో ఆ పాత్రనుండి కొన్ని తీర్థబిందువులను సేవింతురు.

## కాళి

ప్రధానాలయమున వెలసియున్న వేలుపు లోకజనని కాళియే. ఆమె కిచట భవతారిణి (సంసారమును దాటించునది) అని పేరు. ఈ గుడిలోను నేల చలువరాళ్ల పఱపే. దేవి శిలాప్రతిమ తళతళని బంగారుసరిగ యుడుపులతో, సాగిలబడియున్న యొక చలువరాతి ప్రతిమపై నిలబడియున్నది. ఆ సాగిలబడియున్న ప్రతిమ, దేవీవల్లభుడును పరాత్పరుడునైన శివుని ప్రతిమయే. దేవిపాదములకు తక్కిన నగలతో బాటు పైడిఅందెలు గలవు. భుజములకును సువర్ణాభరణములు గలవు. స్వర్ణమౌక్తిక కంఠహారములును, సువర్ణనిర్మితమైన మానవ శిరముల మాలికయును, మానవహస్తముల ఒడ్డాణమును, బంగారు కిరీటమును, బంగారు కమ్మలును, ముత్తెములు తాపిన బంగారు ముక్కుపుడకయు ఆ దేవి ధరించియుండును. ఆమెకు నాలుగుచేతు లున్నవి. ఎడమప్రక్కచేతిలో ఖండితమానవశిర మొకటియు, మఱియొక ఎడమచేతి రక్తసిక్తఖడ్గము నున్నవి. కుడిచేతులలో నొకటి తనబిడ్డలకు వరము లిచ్చునది. వేఱొకటి అభయ మిచ్చునది. ఆమె రూపవైభవము వాగతీతము. అందు జగత్సంహారోచితమైన భయంకరత్వమును మాతృహృదయోచితమైన ధైర్యకరత్వమును రెండును మిళితములై యున్నవి. ఆమె విశ్వశక్తి, విశ్వస్వరూపిణి. ద్వంద్వముల కన్నిటికిని మహోజ్జ్వలమైన ఏకావాసము. సంహరించునదియు ఆమెయే. సృజించి సంరక్షించునదియు ఆమెయే. ఆమెకు మూడుకన్నులు, మూడవది దివ్యజ్ఞాననేత్రము. భక్తులమీద వాత్సల్యము కురిసెడి ఆ నేత్రములే దుర్జనులను ణు లను చేయును.

ఆ గుడితోటలో స్థూలజగత్తంతయు చిత్రితమై యున్నది. ప్రకృతిమాత (కాళి) పరమపురుషుడు (శివుడు) ప్రేమ (రాధాకాంతుడు) అను తత్త్వములు మూడును ఉన్నవి. భూమ్యాకాశముల నొరసికొను కమాను ఒకటి ఉన్నది. తంత్రప్రతిపాదితమైన భీకరశక్తియు, భాగవత ప్రతిపాదితుడై ఆత్మకు తన్మయత నొసంగు మురళీగానవినోదియు, వేదప్రతిపాదితమై ఆత్మనిష్ఠమగు పరబ్రహ్మము నొక్కచోటగూడి, సర్వమతములకును ఆత్యంతిక సామరస్యమును కలిగించుచున్నారు. సర్వప్రకారములలోను పరమార్థ మచ్చట రూపొంది యున్నది. కాని ఈ దివ్యకుటుంబమునకు మూలభూతురాలు సర్వేశ్వరియైన కాళియే. ఆమెయే ప్రకృతి, ఆమెయే సృష్టికర్త్రి, ఆమెయే సంహారకారిణి, అంతే కాదు, చూడ గల కన్ను గల వారికి ఆమె మహిమ ఇంకను ఉన్నతము. ఇంకను అగాధము, ఆమె విశ్వజనని, సర్వేశ్వరి. "నాతల్లి" అని శ్రీరామకృష్ణుడు ఆమెను పేర్కొనువాడు. ఆమె వివిధరూపములలోను దివ్యావతారములలోను తనబిడ్డలకు తన్ను చూపుకొనును. తాను ఎన్నుకొన్న వారిని అప్రత్యక్షసత్యమునకుచేర్చు ప్రత్యక్షదైవతము ఆమెయే. ఆమె వేడుకపడినచో ప్రాణుల అహంకారమును నిర్మూలించి, అభిన్నపరబ్రహ్మమున లయింపజేయును. ఆమెకృపచే పరిచ్ఛిన్నాత్మ అపరిచ్ఛిన్నాత్మలో లీనమగును.

ఆ దేవాలయారామనిర్మాణమునకై రాణీ రాస్మణి ఒకింత మిక్కుటముగ ధనమును వ్యయించినది, ప్రతిష్ఠ చేయించుటకై మతింత మిక్కుటముగ ధనమును వెచ్చించినది. ప్రతిష్ఠా మహోత్సవము 1855 సంవత్సరము మేనెల తే 31 దివాడు జరిగినది.

## జ్ఞానసూక్తులు

చమురు లేనిదే దీపము వెలుగనట్లుగ దేవుడు లేనిదే మానవుడు జీవింపజాలడు.

దేవుడు సకలమానవులలోను ఉన్నాడు. కాని సకలమానవులును దేవునియందు (జ్ఞప్తి గలిగి) లేరు. వారి బాధలకు వ్యధలకు కారణమదే.

మన కున్న యవతార మొక్కటే. జీవిత మహార్ణవమందు మునిగి ఒకచోట తలయెత్తినప్పుడు ఆ దేవుని కృష్ణుడందుము. మరల మునిగి మఱొకచోట తలయెత్తినప్పుడు ఆ దేవునే క్రైస్తు అందుము. అనుసంధించి ధ్యానించి దేవుని సమీపించుటకు ఆయన నామములును రూపములును అసంఖ్యాకములు. ఏ పేరుతో ఏరూపమున ఆరాధించినను ఆయనను సాక్షాత్కరించుకొనవచ్చును.

నీ నమ్మిన మతమందు సదా సుదృఢాధ్యవసాయము కల్గియుండుము. కాని స్వమతదురభిమానమును పరమతాసహనమును తుడిచివేసికొనుము.

నమ్ము. దేవునిపై నాధారపడి యుండుము. ఇక నీవు చేయవలసిన దేమియు నుండదు. పూర్తిగా నీవు దేవుని శరణొందితివేని రేపటి నీ యోగక్షేమమును ఆయనే చూచుకొనును.

మానవజన్మము దుర్లభము. అటువంటి జన్మము నొందియు దేవుని సాక్షాత్కరించుకొనుటకు ఎవడు ప్రయత్నింపడో వాని జీవితము వ్యర్థము...ఆధ్యాత్మిక పురోగతికి ముఖ్యావశ్యకములలో నొకటి సాధుజనసాంగత్యము.

శ్రీరామకృష్ణుడు

# శ్రీమద్వివేకానందస్మృతి

## సంగ్రాహకులు : శ్రీ తపస్యానందస్వామి

### జి. యస్. భటేగారు

శ్రీమద్వివేకానందస్వామివారు 1892సం॥లో బెల్‌గాం వచ్చిరి. అప్పటికి వారు జగద్విఖ్యాతిని బడసియుండలేదు. కొల్హాపూరుసంస్థానప్రముఖులగు శ్రీగోల్‌వాల్‌కారుగారి పరిచయలేఖతో వారు బెల్గాంలో మాయింటికి

శ్రీస్వామివారు ప్రతివారికి నసామాన్యవ్యక్తివలె గాన్పించునంతటి విలక్షణతాసంపన్నులై యుండిరి. నేనుకాని, మానాయనగారుకాని, స్వామివా రింతటి జగద్విఖ్యాతు లగుదురని మొదట దలంచియుండలేదు. శ్రీస్వామివారితో బరిచయ మెక్కువయగుకొలది, వారిని గుఱించిన మాఅభిప్రాయము లెంతో మాఱిపోయెను.

శ్రీస్వామివారు సన్యాసులైనను, వారిదుస్తులును, వారిజీవితవిధానమును సామాన్యవాసులవలంబించురీతిగా నుండక, యెంతో స్వతంత్రపద్ధతిలో నుండెను. ఆయన బనియను వేసికొని చేతిలో దండమునకు బదులు, గట్టికఱ్ఱను బూని యుండెడివారు. ఆయనయొద్ద నొక కమండలము భగవద్గీత, రెండుపనిషద్గ్రంథములు నుండెడివి. ఆయన యాంగ్లమున సంభాషించుచుండెడివారు. అన్నివిషయములందును నమితపాండిత్యము గల ప్రపంచానుభవవేత్తగా నాయన యుండుట యందఱికి నాశ్చర్యమును గలిగించెను.

మొదటిదినము భోజనమైనతర్వాత, శ్రీస్వామివారు, వక్క కావలయునని కోరిరి. రెండవనాడు ఆకువక్కతోపాటు కొంచెము పొగాకును గోరిరి. సన్న్యాసి యావిధముగ గోరుట యప్రశస్తమని మేమను కొనుచుండగా, తాను కలకత్తా విశ్వవిద్యాలయపట్టభద్రుడనని, శ్రీరామకృష్ణభగవానునితో బరిచయము గలుగకముందు, తన కట్టియలవాట్లుండెడివని, ప్రస్తుతము వానిని విడువజాలకున్నానని, అట్టియలవాట్లవలన విశేషనష్టము తనకు గలుగుటలేదని వివరించి, మా సంశయములను నివారించిరి. భోజనవిషయమై ప్రశ్నింప శ్రీవారీవిధముగ జవాబుచెప్పిరి. "మేము పరమహంస సంప్రదాయపరులము. కనుక భోజన ప్రత్యేకత మాకేమియు లే"దని తెల్పుచు, అయాచితముగ లభించినదాని నీశ్వరప్రీతిగా భుజించుచుందుమని వివరించిరి. ఏమియు లభింపనిచో కూడ మేము సంతృప్తులమై యుందుము. హైందవేతరులభిక్షనుగూడ మేము స్వీకరింతుము. ఎన్నోపర్యాయములుమహమ్మదీయులు మా కాతిథ్యము నిచ్చిరి."

శ్రీస్వామివారి సంస్కృతపాండిత్య మసామాన్యమైయుండెను. నేనాకాలమున అష్టాధ్యాయిని వల్లించుచుంటిని. మాతండ్రిగారికి నే నాసూత్రముల నప్పగించుచుండగా, నెన్నో తప్పులు వచ్చినవి. వానినన్నిటిని శ్రీస్వామివారు సవరణగావించిరి. వారి యద్భుతజ్ఞాపకశక్తి నన్నెంతో విస్మయమొందించెను.

రెండుమూడురోజులైనతర్వాత, మాతండ్రిగారు శ్రీస్వామివారిని బహుముఖముల బ్రశ్నించి శ్రీవారి యసాధారణ ప్రజ్ఞావిశేషములను గుర్తించి, గ్రామములోని పెద్దలనందఱిని, మా యింటి కాహ్వానించి, శ్రీస్వామివారి వాఙ్మాధుర్యమును గ్రోలుట కందఱికిని అవకాశము నిచ్చిరి. అతిత్వరలో శ్రీస్వామివారినిగుఱించి, పెద్దలందఱికిని తెలిసిపోయెను. వాదప్రతివాదయులయందు శ్రీస్వామివారి ప్రశాంతత, హాస్యదృష్టి యంద

జేని ముగుల నొనరించెను. మాగ్రామమున నొక ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు, పెద్దపండితు డను విఖ్యాతిని బడసినవారుండిరి. ఆయన సనాతనధర్మానుష్ఠానపరునివలె గన్పట్టుచుండెను. కాని యాయనకు భగవద్విశ్వాసము లేనట్లు స్వామీజీ గ్రహించెను. ఆయనతో నెంత యుక్తియుక్తముగ వాదించినను, ప్రచారము నందలి మతవిధానము దైవనిర్ణీతము కాదనియు, బహుకాలమునుండి ప్రజామోద మును బడసిన సూత్రములే మతవిధానమునకు మూలమనువిషయము ఆయన మార్చుకొన జాలక పోయెను. పైగా వాదనయందు సక్రమ కారణములను జూపజాలక కోపతాపములకు వశపడి అందఱికి నసంతృప్తిని గలిగించి యుండెను.

అట్టివారినిగుఱించి శ్రీస్వామివా రిట్లు వచించిరి. గుఱ్ఱములకు స్వారినేర్పువారి ముందు గుఱ్ఱము వారిని బడద్రోయుట కెంతో ప్రయత్నించి, తనబలము నంతయు వ్యయపఱచును. పిమ్మట గదలలేనిస్థితికి వచ్చును. అప్పుడు స్వారి నేర్పువారు, దానికి క్రమశిక్షను గఱపుదురు. అటులనే హిందూమత మనుష్ఠానయోగ్యమైన దని రుజువుచేయుట కనువగుతరుణమువచ్చినది. ప్రతీకారము చేయకుండుటయందు విశేష మున్నది. కాని కారణాంతరములకులోనై, యుద్ధముచేయననిన అర్జునునికి, యుద్ధము చేయుట ముఖ్యకర్తవ్యమని ప్రబోధించుటయే భగవద్గీతకు ముఖ్యోద్దేశముకదా? అటులనే నోరు మెదలింపకుండుట కాదు మన మభ్యసింప వలసినది. ప్రతివారికికూడ సంతోషమును గలిగించువిధానమును బ్రబోధించుట కనుకూల తరుణము వచ్చినది. అంతియేకాని ప్రతివాదిని వాదనయం దోడించుదృష్టి యేమాత్రము పనికి రాదని శ్రీవారు వివరించిచెప్పిరి. శ్రీస్వామివారు మాయింటియం దున్నకాల మెంతో మాకు వికాసమును గలిగించినదని సంతోషముతో దెలియజేయుచున్నాను.

## శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రిగారు

1892 సం॥లో, శ్రీ వివేకానందస్వామివారు అమెరికాఖండప్రయాణము చేయుటకుముందు త్రివేంద్రములోను, 1897 సం॥రములో, అమెరికానుండి అఖండవిజయముతో వారు తిరిగి వచ్చినపిమ్మట మద్రాసులోను, శ్రీస్వామివారిని సేవించుమహాభాగ్యము నాకు కలిగినది. శ్రీస్వామీజీతో కలిగిన పరిచయము, నాజీవిత మును పరమార్థపర మొనరించినది. స్వామీజీ సంభాషణము మృదుమధురస్వరయుక్తమై, ఆత్మబలము నతిసరళతతో వెలువరించు దివ్య సాధనమై యుండెను. ఆయనయందు విశిష్ట రాజలక్షణములేగాక యావన్మానవహృదయ సామ్రాజ్యాధికాంక్షకు విశిష్టలక్షణములును కాన్పించెను.

శ్రీవారు మాయింటియందు త్రివేంద్రములో తొమ్మిదిదినములుండిరి. నేను కుమారసంభవ పాఠమును చదువుచుండగా, శ్రీవారొక ఉద యము నాగదిలోనికివచ్చి, "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా, హిమాలయోనామ నగాధి రాజః" అను శ్లోకభావమును నాకీక్రిందివిధ ముగ బోధించిరి "హిమాలయములు కేవలము భారతరక్షణనిమిత్తమేర్పడినవేగాక, అవి దివ్య శక్తినిలయములై భారతీయాదర్శములను సం రక్షించుకోటలవలె నున్నవి." శ్రీవారిబోధ నాయం దెంతో చైతన్యమును కలిగించి దేశ భక్తిని రేకెత్తించెను.

దేశభక్తి యననేమో శ్రీవారీవిధముగ వివరించిరి. "సోదరమానవులను సేవింపకున్న నేను బ్రతుకజాలను. దుష్కర్మవలన బాధ

పడుచున్నవారిని సేవించుటయే సత్కర్మ. భగవదనుగ్రహము దరిద్రనారాయణ-దిగంబర మహాదేవుల సేవవలననే లభించును. మానవ సేవ నిర్వికల్పసమాధికంటెను ఆనందమును చేకూర్చును.''—ఇట్టి వచనములు దైవభక్తికి దేశసేవ ముఖ్యమనువిషయమును సుస్పష్ట మొనరించి, రంతిదేవునియొక్క హృదయమును ప్రకటించెను. సంస్కృతవిద్య నభ్యసించి, అద్దాని కలంకారభూయిష్ఠమగు ప్రస్థానత్రయ మును-ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రములను, భగవద్గీతలను పఠించి వానియందు గర్భితమై యున్న అభయ అహింస, అసంగ ఆనంద తత్త్వపరిచయము గావించుకొమ్మని శ్రీవారు నాకు తెల్పిరి.

శ్రీవారును, మాతండ్రిగారును, అత్యంత క్లిష్టమగు తత్త్వవిషయములను గుఱించి చర్చించుచుండెడివారు. శ్రీవారి సమాధాన ములు మాతండ్రిగారి కెంతో సంతృప్తిని కలి గించుచుండెడివి. ''అనుభవజ్ఞులకును, పండితుల కును గలతేడా యిట్టిదే. అనుభవజ్ఞుల సమా ధానములు సర్వసంశయనివారకములై, విషయ మును స్పష్టమొనరించు దివ్యసాధనము'' లని మాతండ్రిగా రనియుండిరి. అంతచిన్నవయస్సు ననే, అట్టిదివ్యానుభవము కలుగుట యెంతటి యదృష్టమో అని శ్రోతలు ఆశ్చర్యపడిరి.

శ్రీస్వాములవారు, 1897 సం॥లో అమెరికా నుండి తిరిగివచ్చునప్పుడు, మద్రాసులోదిగి, ''కాసిల్ కెర్నను'' అనుతావున బసచేసిరి. నేను అప్పుడు మద్రాసులో బి. ఎల్. పరీక్షకు చదువుచున్నందున, వారచటనున్న తొమ్మిది రోజులు, నేను వారిసేవయందుంటిని. అప్పుడు మాతండ్రిగారుకూడ మద్రాసులోనే యుండిరి. 1892 సం. లోని వివేకానందుడు హైందవ విజయమునకు బహుముఖవ్యూహములను నిర్మించు సామాన్యసేవకునివలె నుండెను. 1897 సం॥ లోని వివేకానందుడు అపూర్వ హైందవసంస్కృతి సంప్రదాయ విజయభాసి సమ్రాట్టువలె, యోధానుయోధాగ్రణివలె ప్రకాశించెను. ఆయన భక్తిపరవశత్వముతో పాడెడిగీతా-గోవిందకీర్తనలు, శ్రీరామకృష్ణ భగవానులంతటి అంతర్ముఖుని మన్ననలకు పాత్రములాయెను. శ్రీవారిపారవశ్యగానమును విను మహాభాగ్యము నాకప్పుడు లభించెను

ఆసమయమున నొకబ్రాహ్మణపండితుడు మీరు బ్రాహ్మణులు కారుగదా. సన్న్యా సాశ్రమస్వీకరణము మీ కనర్హమే'' అని, యేమేమో స్వాముువారితో వాదించుటకు వచ్చెను. ప్రతినిత్యము సంధ్యోపాసనయందు అందఱును - బ్రాహ్మణులతో సహా-ఏచిత్ర గుప్తుని ఉపాసింతురో, ఆ చిత్రగుప్తుని వంశ మునకు చెందినవాడను నేను. మీకు సన్న్యా సాశ్రమాధికారమున్నచో, నాకు అట్టిఅధికార మేల యుండ''దని జవాబుచెప్పగ ఆబ్రాహ్మణు డెట్లనుటకును దోచక వెళ్ళిపోయెను.'' నాయుద్ధ విధానము'' ''వేదాంతము-హైందవలక్ష్యము'' ''భారతీయమహాఋషులు'' అను శ్రీవారి ఉప న్యాసత్రయమును వినుభాగ్యము నాకుకలిగెను.

1952 సం. లో నేను తీర్థయాత్రలుచేయుచు, శ్రీరామకృష్ణమఠ కేంద్రమగు బేలూరుమఠ మునకు వెళ్ళితిని. శ్రీస్వామివారితో నాకు గల పరిచయమును బురస్కరించుకొని అచటి మఠాధిపతులు నన్నెంతోగౌరవించి, శ్రీస్వామి వారి గదియందు నాకు ప్రవేశమునిచ్చిరి. అచట వెలుగుచున్న శ్రీవివేకజ్యోతులు నాహృదయాంతర్గృహమునకొక క్రొత్తవెలుగు నిచ్చెను. ఇట్టివిషయము లనంతముగ నాజ్ఞప్తి యందున్నవి.

(శ్రీరామదర్శన పత్రికాధిపుల సౌజన్యంతో)

# భారతీయ సాహిత్యము - రామాయణ ప్రాశస్త్యము

'ఆర్షవిద్యాలంకార' మాన్యశ్రీ - కల్లూరి చంద్రమౌళి

(గత సంచిక తరువాయి)

అలంకార వైచిత్రిని గాంచుఁడు :

రావణుఁడు సీతాదేవి నపహరించి వెళ్లిన పిమ్మట-శ్రీరాముఁడు ప్రియురాలి వియోగ మును సహింపఁజాలక, పరిపరివిధముల దుఃఖిం చుచు, అరణ్యము జనులు లేనిదగుటచే, కను లకు గన్పట్టుచున్న పక్షులను, వృక్షములను, మృగాదులను సీతాదేవిని గుఱించిన జాడ నడుగుచు, పోయిపోయి, రావణుఁడు జటా యువుతో యుద్ధముచేసిన చోటుకు దగ్గఱగ నున్న ప్రస్రవణగిరిని చూచి—

"కచ్చిత్ క్షితిభృతాం నాథ
దృష్టా సర్వాంగసుందరీ
రామా రమ్యవనోద్దేశే
మయా విరహితా త్వయా."

(అరణ్యకాండ : 64)

క్షితిభృతాంనాథ = ఓ పర్వతరాజా, రమ్య వనోద్దేశే = రమ్యమైన వనప్రదేశమునందు, మయా విరహితా = నన్నెడబాసిన, సర్వాంగ సుందరీ = సర్వాంగసుందరి, రామా = స్త్రీ, త్వయా = నీచేత, కచ్చిత్ దృష్టా = చూడఁ బడినదా ? అని ప్రశ్నించెను. కాని, ఆ పర్వతము ప్రత్యుత్తరమీయఁగల్గునా? ఈయఁ జాలదుగదా ! అయినచో - ప్ర [ ]నించు స్వభావము మాత్రము పర్వతములకు సహజ ముగ నుండును. కనుక, రాముని ప్రశ్నకు - పర్వతరాజప్రత్యుత్తరమును ఆ శ్లోకమునందే వాల్మీకి మహర్షి, ఇట్లు ప్రతిధ్వనింపఁజేసెను :-

క్షితి భృతాంనాథ = ఓ రాజశ్రేష్ఠుఁడా, రమ్యవనోద్దేశే = రమ్యమైన వనప్రదేశము నందు, త్వయా = నిన్ను, విరహితా = ఎడబాసిన, సర్వాంగ సుందరీ = సర్వాంగ సుందరియగు, కాచిత్ = ఒకానొక, రామా = స్త్రీ, మయా - నాచేత, దృష్టా = చూడఁబడినది.

ఎంత చిత్రమైన యలంకారమిది ! ఇట్టి చిత్రాలంకారములను చిత్రించు నైపుణ్యము - సామాన్యకవులకు అబ్బునదికాదు. తపస్సం పన్నులైన మహాకవులకు మాత్రమే ఇట్టి కవితా నైపుణ్యముండును. వాల్మీకి రామాయణమున ఇట్లే-అలంకారము లన్నియు అట నట గన్ప ట్టుచు, రసజ్ఞులకు ఆహ్లాదమును గల్గించు చుండును.

కేవలము ఇట్టి అలంకారములే గాక, ఉన్నతాశయములతో-ఉదాత్త భావములతో విరాజిల్లెడు ఆదర్శభూతులైన నాయికా నాయ కులు కావ్యమున నున్నపుడే, ఆ కావ్యమునకు ఔచిత్యము కల్గును.

రామాయణములో - సీ తా రా ము లు నాయికా నాయకులు. వీరి కల్యాణ గుణము లను-దేవర్షియైన నారదుఁడే, వాల్మీకి మహా మునికి ఇట్లుటెంగించెను :—

'ఇక్ష్వాకువంశ ప్రభవో
రామోనామ జనైశ్శ్రుతః
నియతాత్మా మహావీర్యో
ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ
బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ
శ్రీమాన్ శత్రునిబర్హణః
విపులాంసో మహాబాహుః
కంబుగ్రీవో మహాహనుః
మహోరస్కో మహేష్వాసో
గూఢ జత్రు రరిందమః
ఆజాను బాహుః సుశిరాః

సులలాటః సువిక్రమః
సమః సమ విభక్తాఙ్గః
ప్రజానాం చ హితే రతః
యశస్వీ జ్ఞాన సంపన్నః
శుచి ర్వశ్యః సమాధిమాన్
ప్రజాపతి సమః శ్రీమాన్
ధాతా రిపునిషూదనః
రక్షితా జీవలోకస్య
ధర్మస్య పరిరక్షితా
రక్షితా స్వస్యధర్మస్య
స్వజనస్యచ రక్షితా
వేదవేదాంగ తత్త్వజ్ఞో
ధనుర్వేదే చ నిష్ఠితః
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః
స్మృతిమాన్ ప్రతిభానవాన్
సర్వలోక ప్రియః సాధుః
అదీనాత్మా విచక్షణః
ఆర్యః సర్వసమశ్చైవ
సముద్ర ఇవ సింధుభిః
స చ సర్వగుణోపేతః
కౌసల్యానందవర్ధనః
సముద్ర ఇవ గాంభీర్యే
ధైర్యేణ హిమవా నివ
విష్ణునా సదృశో వీర్యే
సోమవత్ ప్రియదర్శనః
కాలాగ్ని సదృశః క్రోధే
క్షమయా పృథివీసమః
ధనదేన సమస్త్యాగే
సత్యే ధర్మ ఇవాపరః.'
(బాలకాండ : 1-8 నుండి 19 శ్లో. వఱకు)

ఇక్ష్వాకువంశమునఁ బుట్టిన రాముఁడను ప్రసిద్ధిగల నామముచే జనులలో వినఁబడు చున్నాఁడు. ఆయన-నియతాత్ముఁడు, ధైర్య వంతుఁడు, ప్రకాశముగలవాఁడు, ఇంద్రియము లను నిగ్రహించినవాఁడునై యున్నాఁడు. ఆ రాముఁడు ఐశ్వర్యవంతుఁడు, బుద్ధిమంతుఁడు, నీతిగలవాఁడు, మాటలలో నేర్పరి, శత్రువులను సంహరించువాఁడు, ఎత్తైన మూఁపులుగల వాఁడు, గొప్పభుజములు గలవాఁడు, శంఖము వంటి కంఠముగలవాఁడు, గొప్పగొప్ప చెక్కిళ్లు గలవాఁడునై యున్నాఁడు. మఱియును ఆ రాముఁడు - విశాలమైన ఱొమ్ముగలవాఁడు, శ్రేష్ఠమైన ధనువుగలవాఁడు, కనఁబడని మెడ సంధిలోని యెముకలుగలవాఁడు, విరోధిని జయించినవాఁడు, ఆజానుబాహుఁడు, మంచి శిరస్సు, మంచి ఫాలస్థలము - మంచి పరా క్రమము గలవాఁడు, చక్కని శరీరము గల వాఁడు, హెచ్చుతగ్గులు లేక యేర్పఱుపఁ బడిన అవయవములు గలవాఁడు, నిగనిగ లాడు కాంతిగలవాఁడు, బలమైన ఱొమ్ము గలవాఁడు, విశాలమైన కన్నులుగలవాఁడు, ఐశ్వర్యముగలవాఁడు, శుభంకరములైన లక్షణ ములు గలవాఁడు, ధర్మము లెఱిఁగినవాఁడు, సత్యసంధుఁడు ప్రజల హితమునం దాసక్తిగల వాఁడు, కీర్తిజ్ఞానములు గలవాఁడు. భక్తులకు వశుఁడైనవాఁడు, శుచిగలవాఁడు, నియతిగల వాఁడు, బ్రహ్మతో సమానుఁడు, శ్రీమంతుఁడు, పోషకుఁడు, శత్రువులను సంహరించువాఁడు, ధర్మములను రక్షించువాఁడు, తన క్షత్రియ ధర్మమునకు-తన జనులకు రక్షకుఁడు, వేద వేదాంగము లెఱిఁగినవాఁడు, ధనుర్వేదమందు నిష్ఠయున్నవాఁడు, అన్ని శాస్త్రములలోని సారమెఱింగినవాఁడు, మఱపు లేనివాఁడు, మిక్కిలి తెలివి తేటలుగలవాఁడు, అన్నిలోక ములను ప్రేమించువాఁడు, సజ్జనుఁడు, దీనము గాని స్వభావము-యుక్తియు గలవాఁడు, నదుల చేత సముద్రమువలె పెద్దలతోఁ గూడుకొన్న

వాఁడు, పూజ్యుఁడు, అందఱియందును ఏకాభిప్రాయముగలవాఁడు, ఎల్లవేళలయందును ఏక విధమగు ప్రేమను చూపుచుండువాఁడు, ఆ శ్రీరాముఁడు సకల సద్గుణసంపన్నుఁడు, తల్లియైన కౌసల్యకు సంతోషమును వృద్ధిపొందించువాఁడు, సముద్రునివలె గంభీరస్వభావముగలవాఁడు, ధైర్యస్వభావములో హిమవత్పర్వతము వంటివాఁడు, పరాక్రమమందు విష్ణువుతో సమానుఁడు, చంద్రునివలె ఇష్టముతో చూడఁదగినవాఁడు, కోపమునందు ప్రళయాగ్నివంటివాఁడు, ఓర్పుచే భూమివంటివాఁడు, దానమిచ్చుటలో కుబేరసమానుఁడు, సత్యమునందు ఇతర ధర్మదేవతవంటివాఁడు.

ఇది–నాయకుఁడైన శ్రీరాముని గుణాభివర్ణనము. ఇఁక, నాయకియైన సీతాదేవి సద్గుణ సంపదను గమనింతము.

'రామస్య దయితా భార్యా
నిత్యం ప్రాణ సమాహితా
జనకస్య కులే జాతా
దేవమాయేవ నిర్మితా
సర్వలక్షణ సంపన్నా
నారీణా ముత్తమా వధూః
సీతాప్యనుగతా రామం
శశినం రోహిణీ యథా.''

(బాలకాండః 1 సర్గ)

రాముని ప్రియురాలును, భార్యయు, ప్రాణముతో సమానురాలు, అనుకూలురాలు, జనకవంశమునందుఁబుట్టి, దైవశక్తిచే సృజింపఁబడి, ఉత్తమ లక్షణములుగలదై, స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీత–చంద్రు ననుసరించు రోహిణివలె, రాము ననుసరించెను.

ఇట్టి కల్యాణగుణగణ పరిపూర్ణులైన నాయికా నాయకులు కావ్యమున నున్నందుననే, వాల్మీకి రామాయణమునకు గొప్ప ఔచిత్యమేర్పడెను. ఈ మహాకావ్యము నిత్య పారాయణ యోగ్యముగా - విశ్వశ్రేయో దాయకముగా విలసిల్లుటకు, కావ్యమున నాయికా నాయకులైన సీతారాములుండుటయే కారణము. ఇట్టి కావ్యమే లోకమున సర్వదా సమాదరింపఁ బడుచుండును.

ఇట్టి వాఙ్మయమును మాత్రమే 'సాహిత్య' మని నిర్వచింపనగును. ఉత్తమ సాహిత్యముతో సముల్లసించిన వాల్మీకి రామాయణము–'పాఠ్యే గేయేచ మధురమ్' అని, బహుధా ప్రశంసింపఁ బడినది. ఆదికవియైన వాల్మీకి మహర్షి–ఉత్తమ సాహిత్యస్రష్ట యగుటచే, లోకమునకు చిర స్మరణీయుఁడుకూడ నయ్యెను.

ఇటీవల, గ్రంథములు కోకొల్లలుగా వెలువడినవి. వర్తమానకాలమునందును ఎన్నియో గ్రంథములు వెలువడుచున్నవి. కాని, వాల్మీకి రామాయణమును దృష్టిలో నిడుకొని జూచినచో - ఈ గ్రంథము లెన్ని నిలువగలవు? ఎన్ని గ్రంథములు పఠింపయోగ్యములుగ నుండును? అందు - ప్రయోజనకరములుగా నెన్ని గన్పట్టును? అట్టివి - చాల తక్కువ యనియే నిస్సంశయముగా జెప్పవచ్చును.

రామాయణ భారతేతిహాసములు, భాగవత పురాణము, భగవద్గీతాశాస్త్రమువంటి కతిపయ గ్రంథములు మాత్రమే ఉత్తమ సాహిత్యమని ప్రాజ్ఞులు గుర్తింపగలరు. అవియే సాహిత్య పరీక్షకు నిలువగల్గునవి, అవి–పాఠకుని హృదయమును ద్రవింపఁజేసి, ఆత్మోత్తేజమును గల్గించి, నిత్యసుఖమును - శాశ్వతానందమును ప్రసాదింపగల్గును.

కేవలము లౌకిక విషయములను బోధించు గ్రంథములు - ఎంతటి ఉన్నతశ్రేణికి జెందిన

వని తలంచినను, అవి - తాత్కాలిక ప్రయోజనమును మాత్రమే గల్గించునవిగా నుండును గాని, శాశ్వత ప్రయోజనమును చేకూర్పఁజాలవు. అందువలన, అట్టి గ్రంథములు-అచిర కాలములోనే కాలగర్భమున లీనమైపోవుచుండును.

నిత్యసత్యమును బోధించు గ్రంథములు - నిరంతర పఠనయోగ్యములై, ఆధ్యాత్మిక చైతన్యదాయకములై, విజ్ఞాన ప్రదములై విలసిల్లుచుండును. సత్యాన్వేషికి, అట్టి విజ్ఞానము అత్యంతప్రయోజనకరము. విజ్ఞానమువలన, బాహ్యదృష్టి దూరదూరమగును. దివ్యదృష్టి లభించును. అపుడు - సత్యస్వరూపము సంపూర్ణముగా దర్శనమిచ్చును. కనుక, ఇట్టి సత్యస్వరూప సందర్శనమునకు - ఉత్తమ సాహిత్యములో సముల్లసించు వాల్మీకి రామాయణము వంటి సద్గ్రంథములే ఉపయుక్తము లగుననుట-నిర్వివాదాంశము.

''సత్యమేవ పరం బ్రహ్మ
సత్యే ధర్మః ప్రతిష్ఠితః
సత్యమేవాక్షయా వేదాః
సత్యేనైవాప్యతే పరమ్.''

బ్రహ్మపదమే సత్యమైనది. ధర్మమునందే సత్యము సుప్రతిష్ఠితమై యున్నది. సర్వవేదముల స్వరూపమే సత్యము. సత్యముచేతనే జీవులు పరమును పదిలపఱచుకొనఁగల'రని, లోకకల్యాణకాంక్షులైన మహర్షులు ప్రబోధించియున్నారు. కావున, భగవత్సన్నిధికిఁ జేరుమార్గములను జూపెట్టుగ్రంథములే ఉత్తమ సాహిత్యమని నిర్వచింపఁదగును. ఇట్టి సాహిత్యమున మకుటాయమానమై ప్రకాశించునది - ఆదికావ్యమైన వాల్మీకి రామాయణమే.

''ఇదం పవిత్రం పాపఘ్నం
పుణ్యం వేదైశ్చ సమ్మితమ్
యః పఠేత్ రామచరితం
సర్వపాపైః ప్రముచ్యతే.
-(బాలకాండ 1-98)

వేదతుల్యమైన ఈ రామాయణము - సర్వపాపములను బోగొట్టి, చదువరులను పుణ్యవంతులఁజేయును. అంతేకాదు—

'శృణ్వన్ రామాయణం భక్త్యా
యః పాదం పదమేవవా
స యాతి బ్రహ్మణః స్థానం
బ్రహ్మణా పూజ్యతే సదా.
—(ఉత్తరకాండ 11-24)

ఈ రామాయణమును పూర్తిగా గాని, కొలఁదిగఁగాని విన్నవారు, పఠించినవారు భగవత్సాన్నిధ్యమును పొందఁగలరు.

''వాల్మీకే ర్ముని సింహస్య
కవితావనచారిణః
శృణ్వన్ రామకథానాదం
కో నయాతి పరాంగతిమ్ ?''

కవితా వనమున సంచరించు వాల్మీకిముని సింహుని రామకథానాదమును విన్నవాఁడు - ఎవఁడు పరమపదమును పొందకుండును ?

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

# శివానందస్మృతులు—35

## శ్రీమత్ప్రవ్రాజికశ్యామాప్రాణ

క్రీ.శ.1929 (శుక్రవారము) మార్చి 22-వ తేది

శ్రీమహాపురుషమహారాజుగారు మిద్దెపై తమగదిలో మధ్యాహ్నభోజనము చేయుచున్నతఱి కిటికీగుండ మఠావరణమువైపు దృష్టి ప్రసరింపజేసిరి. అప్పుడే మఠావరణములోని మామిడిచెట్టుక్రింద, మఠవాసుల చెప్పులు కుట్టుచున్నవానిని చూచిరి. తమభోజనమైన వెంటనే ఒకసేవకుని పిలిపించి "చూడుము, మిట్టమధ్యాహ్నమైనది. మనఅందఱిభోజనములు ముగిసినవి. ఆహా! పాపము. అతడు తిండి తినకయే పనిసాగించుచున్నాడు. వానికి దండిగ, మిఠాయితోసహా శ్రీభగవానుని ప్రసాదమును ఇచ్చి రమ్ము" అనిరి. శ్రీవారిఆజ్ఞ శిరసావహించి చెప్పులు కుట్టువానికి ఆసన్న్యాసి ప్రసాద మిడి తిరిగి వచ్చెను. ఇంతలోపుగ స్వామివారు తమఆసనమును వీడి లేచి వచ్చి కడ నిలిచి తదేకదృష్టితో ఆచెప్పులుకుట్టువానిని చూచుచుండిరి. వారిచేత అర్ధరూపాయ నాణె మొకటి యుండెను. ప్రసాదము దొరకుటతోడనే అతడు తనపనిని ఆపి తిన నారంభించెను. అది చూచి మహాపురుషులు-ఆహా! వానికి ఎంతఆకలి వేసినదో చూడుము. అందుచేతనే చేతిలోని పనిని ఆపి ఆత్రముతో ప్రసాదము తినుచున్నాడు. నేను ఒకతమాషా చేసెదను చూడుము అని పల్కి చేతిలో నున్న రూకను వానిముందుకు విసరెను. తటాలున పైనుండి అర్ధరూపాయ నాణెము తనముందు వచ్చి పడుట చూచి, విస్మయముతో అతడు తల పైకెత్తి చూచుసరికి మిద్దెపైగదిలో కిటికీకడ స్వామివారు అగపడిరి. వారే ఈరూక పడవేసిరి అని తెలిసికొనెను. ఆనందముతో అతడు చేతులు జోడించి తనకృతజ్ఞతను తెలుపుకొనెను. అటుపై ఒకసాధువు వచ్చి చెప్పులు కుట్టినకూలి విషయములో బేరమాడ జొచ్చెను అది విని వెంటనే మహాపురుషు లిట్లనిరి—చూడు, అతడు పేదవాడు సుమా! వానివద్ద నీవేల బేరము లాడుచున్నావు?"

* *

రా ట స్వామివారు ఆహారమును చాల స్వల్పముగ భుజింతురు. నేటిరాత్రి వారు పాలుత్రాగునపుడు ఒకసన్న్యాసి వచ్చి స్వామివారికి నమస్కరించి నిలిచెను. ఆయనతో నానావిషయముల ముచ్చటించుచు, శ్రీవారు మఠ సేవాకేంద్రముల (మిషనుల) కార్యకలాపములగూర్చి పలుకదొడంగిరి.

"ఆహా, మీరందఱు వచ్చినారు. నాకు మహానందము గలుగుచున్నది. శ్రీభగవానుడు తమ సంఘశక్తిని పట్టి ఎటుల ఊచి ఊచి చైతన్యము కల్గించిరి. అంతే కాక తమపని ఏదో ఒకవిశిష్టవ్యక్తిద్వార సంపన్నముకాదని గుర్తించి సాధువు లెల్లరును కూడి సమష్టిగ తమపనిని చేయవలయుననిరి. అప్పుడే చక్కగ నియమానుసారముగ ఎట్టి తప్పటడుగులును లేక పను లన్నియు యథావిధి జరుగును. ఎన్ని విఘ్నములు, ఎంతటి బాధలు, ఎన్నిఆపదలు విపత్తులు వాటిల్లునో అంత ఎక్కువగ సంఘశక్తి జాగరితమగును. "శ్రేయాంసి బహువిఘ్నాని" ఎన్ని బాధలు, ఆటంకములు కల్గునో, అన్నిరెట్లుగ లోకులకు శ్రీభగవానునిపట్ల, భక్తి, విశ్వాసము, నిబ్బరమును హెచ్చుగును. భగవానుని యుగధర్మప్రవర్తనకార్యార్థమే ఈసంస్థ స్థాపింపబడినది. ఈయుగధర్మప్రవర్తనాకార్యము పెక్కుశతాబ్దములవఱకు

నిరవచ్ఛిన్నముగ కొనసాగును. ఈప్రవాహ వేగమును అడ్డగించుటకు ఎవరికి సామర్థ్యము లేదు. నాయనా, నే నాడు మాట లెల్లను త్రికాలజ్ఞ ఋషిపుంగవుడగు శ్రీవివేకానందుని వాక్యములే సుమా.'

సన్న్యాసి "స్వామీ, తమరు సెలవిచ్చుచున్నదియును, శ్రీవివేకానందస్వామిగారు నుడివినట్టి వేదవాక్కులును ఎన్నటికిని అసత్యములు కాజాలవు. కాని స్వామీ, ఏ మని చెప్పను? చుట్టుపట్ల వాతావరణము, చూచుకొలది, ఈ విశ్వాసమును మామనఃఫలకమున స్థిరముగ నిలుపజాలకున్నాము-కార్యకలాపములందు ఉత్సాహమును కోల్పోవుచున్నాము. ఏదో చెప్ప లేని భయము మమ్ముల నావరించి మామనంబుల నెల్ల అవిశ్వాసముతో నింపి వేయుచున్నది.

మహాపురుషులు-ఇలాగు జరుగుట నైజమే. పనిచేయబోయినచో ఒకపరిభయము - ఒక్కొక్కమారు విసుగు కల్గును - కాని మరల మెల్ల మెల్లగ తమంతతామే అవి తొలగిపోవును. ఇవెల్లను కర్మకు నైజగుణములు. ప్రపంచములో ఏఒక్కచిన్న మంచిపనినైనను సరే, చేయ నమకట్టినచో వెంటనే పెక్కు విఘ్నముల తప్పక ఎదుర్కొన వలసివచ్చును. ఇక పని ఎంతగొప్పదో అన్ని రెట్లుగ విఘ్నములు వాటిల్లును. కాని ఈవిఘ్నప్రతిఘాతముల నిరంతరసంఘర్షణ మూలముననే ఆత్మశక్తి జాగరితమగును. ఈశక్తి ఆసాక్షాత్ జగజ్జననియే కాని వేఱొండు కాదు. ఈపనిపాటలెల్ల ఆజగదంబకు చెందినవే - మన మెల్లరము ఆతల్లిబిడ్డలమే. సత్యమార్గమునుబట్టి పోవుచు - ఈజ్ఞానమును సుస్థిరము కావించుకొనవలెను. ఇది తేలికపని కాదు - యుగధర్మసంస్థాపనా కార్యమే, అని ఎఱుగవలెను. అందుచేతనే శ్రీభగవానులు మమ్ములకూడ బలాత్కారముగ ఈపనిలోనికి దింపిరి. లేకున్నచో సాధనానుష్ఠానములందే నిమగ్నులై యుండియుండక పోతిమా ఏమి? మేము అలాగే తపోనిష్ఠారతులై యుంటిమి కూడను. కాని శ్రీరామకృష్ణభగవానునిచే ఆదేశింపబడిన వాడైన శ్రీవివేకానందస్వామిగారు ఈకార్యప్రణాళిక నేర్పఱచి, మమ్ముల నెల్ల బలత్కారముగ ఈ పనిలోనికి దింపిరి. అంతియే కాక స్వయముగ స్వామిజీకూడ ఎట్టి విధి విరామము లేక, జీవితము కడపటిక్షణము వఱకు ఈపనికే సర్వస్వము ధారబోసెను కదా! ఆహా! అట్టి కఠోరపరిశ్రమ మూలముననే కదా స్వామిజీశరీరము శిథిలమై పోయినది! వారైనను పలురకములగు జంజాటకముల నెల్ల ఎదుర్కొనకయే పని కొనసాగింప గల్గిరా ఏమి? వారు పాశ్చాత్యఖండములకు బోవు ఒక్కచిన్న విషయమునుగూర్చియే ఆలోచింపుము - ఎట్టి చిక్కులు సంభవించెను! ఎంతటి ఇక్కట్లకు పాలు కావలసి వచ్చెను! శ్రీభగవానుల కార్యమును ఎట్టి దుఃఖకష్టముల దగుల్కొని అందుండియే పనిచేయవలసివచ్చెను! ఇంతేల నాకుకూడ మధ్యమధ్య ఈలాగు అనిపించును - ఇకమీద నైన ఎక్కువగ శ్రీభగవానుని సగుణభావముల నాశ్రయింపను, ఒక్కపెట్టున నిర్గుణభావము నవలంబించి - సమాధిస్థితిలో నిమగ్నుడనై యుండ నిచ్ఛగింతును. కాని భగవానుడు నన్ను ఆలాగు ఉండనీయ లేదే? వాస్తవము సర్వమును అతడే! అతడు సగుణుడును - నిర్గుణుడును కూడ. "పాదో అస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" ఋగ్వేదము-10-90 —— ఇదంతయు అనగా త్రికాలవర్తియగు సమస్తజగత్తు - ఆపురుషుని మహిమయే - వాస్తవమునకు ఆపురుషుడు, ఆమహిమకన్న ఎక్కువశ్రేష్ఠుడు. ఎందుచేత

ననగా – ఈకాలత్రయవర్తియగు సమస్తచరాచరము ఆయనయొక్క ఏకపాదమునకు సమానము మిగిలిన మూడు పాదములతో-అవినాశమును స్వప్రకాశమునగు స్వస్వరూపమున నెలకొని యున్నాడు.]

ఆయన ఇచ్ఛ లేనిదే మన మేమియు చేయజాలము సుమా! వారు మనల నెపుడు ఏపరిస్థితిలో నుంతురో మనము ఆలాగుననే యుండవలెను. వారే కృపజూపి అంతయు ఎఱుకపఱచుచున్నారు. ఆ అమృతధామము చేరు మార్గమును తెలిపి యుంచిరి. ''యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'' (తైత్తిరీయ ఉపనిషత్తు-2-4-1). దేనిని అందుకొనుటకు అసమర్థమై – మనస్సుతోపాటు వాక్కుకూడ – తిరిగివచ్చునో!

# శివానంద లేఖావళి

## 45

చిల్కపేటహౌస్,
అల్మోడా పోస్టు,
కూమోన్, ఉ. ప్ర.
7 ఏప్రిలు 1914.

ప్రియ——,

నీవు క్రిందటినెల 23-వ తేది వ్రాసిన జాబు చేరినది. నాజీవితమును గుఱించి తెలిసికొన గోరితివి. వ్రాయుటకు నాజీవితసంభవములలో మిక్కిలి యసాధారణమైన దేదియు లేదు. కాని ప్రత్యేకములైన అన్నింటికంటెను ప్రత్యేకమైన సంభవము ఒకటి కలదు. ఏది యనగా శ్రీరామకృష్ణునితో కలిసికొనుటయు, ఆయన యనుగ్రహమును. అందుకు కారణము ఆయన సౌజన్యమే. ఆయన యనుగ్రహమునకు అర్హత కలిగించు సుగుణ మేదియు నాలో లేదు. ఆయన స్వతంత్రుడు అమోఘసంకల్పుడు. స్వసంకల్పప్రేరితుడై ఆయన నన్ను ధన్యునొనర్చెను. నాజీవితమున చెప్పదగిన సంభవ మిదొక్కటే.

ఎవనికైనను దేవుని వేషము వేసి అతనిని దేవునిగా తయారుచేయుట ఎన్నటికైనను సాధ్య మగునా? దేవుడు సదా దేవుడే. దానిని ఉద్ఘోషించి నిరూపింపవలసిన ఆవశ్యకత లేదు. సూర్యునకు వెలుగునిచ్చుటకు మఱొక దీప మక్కఱ లేదు. సూర్యుడు స్వయం ప్రకాశుడు. అందుకై నీ వెప్పుడును వ్యథ చెందకు. ఇతరులు వారి కిష్టము వచ్చినట్లెల్ల మాటాడుచుందురుగాక. గురుదేవుడు శ్రీరామకృష్ణుడు నీకు శరణ మనుగ్రహించెను. నీవు ధన్యుడవు. వేఱు దేనినిగుఱించియు నీవు వెత జెంద నక్కఱ లేదు. నిండుహృదయముతో ఆయనను ప్రార్థింపుము. ఈజన్మముననే నీవు ఆయనను సాక్షాత్కరించుకొనగలిగియుందువు.

ప్రేమానందస్వామి తూర్పుబంగాళమున వివిధప్రదేశముల పర్యటింప నేగియున్నాడని వింటిని. ఆయన ఢాకూరునుగుఱించి చాల చోట్లలో ప్రచారము చేయుచున్నాడు. వసతి పడినచో ఎక్కడనైన ఆయనను కలసికొన ప్రయత్నింపుము.

నీవివిధప్రశ్నలకు జవాబులుగా ఏమేమి వ్రాయవలయునో నే నెఱుగను నాకు తెలిసిన దింతే. నేను శ్రీరామకృష్ణుని కింకరుడను.

ఆయన శ్రీచరణములను శరణుజొచ్చితిని. అంతకంటె నేమియు నేను నిజముగ నెఱుగను. ఆయన కృపతో తన్ను గూర్చి తలంపించినప్పుడు తలచుకొనుచుందును. ఆయన నాచేత పుస్తకములు చదివించినప్పుడు పర్యటనములు చేయించినప్పుడు, ఎవరితోనైన ఆధ్యాత్మికవిషయములను గూర్చి సంభాషింపజేసినప్పుడు— ఆయన చేయించినట్లు చేయుచుందును. అదే నాపని. శ్రీరామకృష్ణుని దయయే ఏకైకతరణోపాయము. అది నాదృఢవిశ్వాసము. ఇక నీజన్మలో నాది అనుకొనదగినది నాకు వేఱేదియు లేదు, వేఱు దేనినిగాని నేను కోరుట లేదు. అదెల్ల అతనియనుగ్రహామే.

నిండుహృదయముతో నీవు ఆరామకృష్ణుని ప్రార్థింపుము. నిక్కముగ నీకు నెమ్మది చేకూరును. ఇంతకంటె నేమి వ్రాయుదును? నీకు నాహృదయపూర్వకప్రేమాశీస్సులు.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 46

చిల్కపేటహౌస్,
అల్మోడాపోస్టు,
కూమోన్, ఉ. ప్ర.
26 ఏప్రిలు 1914.

ప్రియ—,

నీజాబు మఱొక్కటికూడ చేరినది. చాల సంతోషము. నీవు మొదట కన్న స్వప్నమును గూర్చి నాయభిప్రాయమును క్రిందటిజాబులో తెలిపితిని. ఈస్వప్నముకూడ చాల ఉత్సాహజనకముగ నున్నది. ఠాకూరు గోపాలునిరూపమున నీకు ప్రత్యక్షము కాగోరె ననుట నిజము. గోపాలుని దర్శించి నీవు శ్రీనందుని భావననో శ్రీయశోదభావననో అవలంబించి ఉపాసింతు వేమో. ఆయభ్యాసముచేత నీకు బ్రహ్మానందము కలుగగలదు. నీహృదయము నిర్మలమును విశుద్ధము నగును. నిజముగ నీవు భాగ్యవంతుడవు. కావుననే ఠాకూరు నీకు అప్పటమైన గోపాలునిరూపమున తన్ను చూపుకొనుచున్నాడు. ఇందువలన నీకు పరమనిశ్శ్రేయసము కల్గును. గట్టిగ నమ్ము.

వేసవివిరామదినములలో సర్వవిధముల ప్రయత్నించి కల్కత్తా, మఠము (బేలూరు మఠము) ఇతర పవిత్రస్థలములు—ఈచోట్లకెల్ల పోయి అచ్చట వసించు విశుద్ధాత్ములను కలసికొనుము. అప్పుడు ఠాకూరు నన్నెచోట నుంచునో అచ్చట నుందును. నాకు సొంత సంకల్ప మేదియు లేదు. ఆయన నాచేత ఏమేమి ఎట్లెట్లు చేయించునో ఆయాపనులను అట్లట్లు చేయుచుందును.

ఈచోటు చాలదూరము, మార్గము దుర్గమము, ప్రయాణమున కగు వ్యయప్రయాసలింతంత కావు. కావున ఇచ్చటికి రానక్కఱ లేదు. పరమపూజ్యురాలగు మాతృదేవి శ్రీశారదాదేవి కల్కత్తాలో నున్నది. శ్రీ శారదానందస్వామియు మాస్టరు మహాశయుడును ఇతరభక్తులును అక్కడనే ఉన్నారు. వారిని కలసికొనుము. మఠములో నీకు శ్రీప్రేమానంద సుభోధానందస్వాములయు ఇతరభక్తులయు దర్శనము లభించును. వారిని కలసికొంటివేని ఠాకూరునందలి నీభక్తి హెచ్చును. నీవు నన్ను కలసికొనుట ఠాకూరు ఎప్పుడు సంకల్పించిన అప్పుడు ఘటిల్లును. సమస్తమును ఆయనకు విడిచిపెట్టుము. భగవత్పరతంత్రతనుబోలిన ఆనందమును శాంతియు వేఱొకటి లేదు. ఇంటనుండియే తన భక్తిప్రేమలను నిన్ను ఆయన అనుభవింపజేయునేని

వే తెచ్చుటకిని పోనక్కఱలేదు. ఐనను సెలవు దినములలో రవంత చోటుమార్పు నిజముగ మంచిది. భక్తసమాగమము మనశ్శరీరములకు క్షేమము నొనగూర్చును.

నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. ఇప్పుడు నా యారోగ్యము మునుపటియంత బాగుండుట లేదు. ఇక్కడ చలి చాల మిక్కుటము. వెచ్చదనము దుర్లభము. ఎండతీక్షణముగ నున్నప్పుడుసైతము వీచు గాలి సదా చల్లగానే యుండును. నీళ్లు బాగున్నవి. ఇచటి దృశ్యము రమణీయముగను ఉదాత్తభావోద్బోధకముగను నున్నది.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 47

చిల్కాపేటహౌస్,
అల్మోడాపోస్టు,
కూమోన్, ఉ. ప్ర.
15 మే 1914.

ప్రియ——,

నీజాబు చూచి చాల సంతోషించితిని. నిన్ను యశోదగా భావించుకొని గోపాలపరబ్రహ్మమును భజించుచున్నావు. ... మైన మిగుల నుదాత్తమైన స్వచ్ఛమార్గము. అది మనోమాలిన్యమును జాడగానైన నుండనీయక తుడిచివేయును. శ్రీ శ్రీ ఠాకూరు (శ్రీరామకృష్ణుడు) యశోదభావనలో చాల దినము లుండెను. ఆయనజీవితచరిత్రములో నీకా విషయము కననగును. నీవు స్వప్నములో మాతృదేవిని దర్శించితివి. అది ఎంతయు శుభము. కాలక్రమమున గురుదేవుడు ఇంకను ఎన్నిరూపములలో తన్ను చూపుకొనునో నీవే చూడగలవు. నిజముగ నీవు ధన్యుడవు. అందుకించుకంతయు సందేహము లేదు. నీవు మఠములో కొన్నాళ్లు ఉందువనియు అక్కడి వారి గోష్ఠి భాగ్యమును బడయుదు వనియు నేను ప్రేమానందమహారాజునకు జాబు వ్రాసితిని.

ముల్లోకములలో నాకు శిష్యుడు లేడు. నేను ఠాకూరుదేవుని సేవకుడను. కావున నాశిష్యుడనని నీవు చెప్పుకొనవలసిన యావశ్యకత లేదు. నీవు ఇంతమాత్రము చెప్ప వచ్చు :—నీమీద నాకు వాత్సల్య మని, భగవదారాధనము గూర్చి నీ వడుగు ప్రశ్నలకు నాకు తెలిసిన దానిని జవాబుగా చెప్పుచుందు నని, నీయాధ్యాత్మికపురోభివృద్ధికై నేను నిండుహృదయములో ప్రార్థించుచుందు నని, ఇంతమాత్రము చెప్పిన ఇదే హెచ్చు. వారు గొప్పభక్తులు, నిన్ను సులభముగా గుర్తింప గలరు. నీపట్ల మిక్కిలి ప్రేమయు, దయయు కలిగియుందురు.

నీకు ఇంకను మంత్రోపదేశాదికము అక్కఱలేదని నాయభిప్రాయము. ప్రస్తుతము నీవు ఆయనను (గురుదేవుని) ప్రేమింపుము. మనసార ఆయనకు సేవ చేయుము. మేలైన పుష్పఫలములతో నీ వాయనను భజించుచున్నా వని విని నే నపరిమితముగ నానందించితిని. ఆయన సేవలో మునిగియుండుము.

జాతాశౌచమృతాశౌచములను పాటించుటలో ఇంతవఱకు ఉన్న యాచారమునే అనుసరింపుము. అందులో చెఱు పేమియు లేదు. అది మంచిదే. ఆచారమున నున్న సంఘునియమములను ఉల్లంఘించుట మంచిది కాదు. అములులో నున్న యాచారమును అనుసరించుటే ఉచితము. గురుదేవుని శాసనమును అదే.

నీవు ఆరోగ్యము కలిగియున్నా వని తెలిసినది. సంతోషము. నాఆరోగ్యము మునుపటికంటె రవంత మెఱుగుగా నున్నది. నీకు నా

హృదయపూర్వక ప్రేమాశీస్సులు. నీ క్షేమ వార్త అప్పుడప్పుడు తెలియవచ్చుచుండిన నాకు నెమ్మదిగ నుండును; ఠాకూరు నీకు శ్రేయము లొసంగు గాక.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 48

చిల్కాపేటహౌస్,
అల్మోడాపోస్టు, ఉ. ప్ర.
27 జూన్ 1914.

ప్రియ——,

నీజాబు యథావిధిగా చేరినది. సంగతులు తెలిసినవి. సెలవుదినాలలో నీవు నవద్వీపము, కాళీఘట్టము, దక్షిణేశ్వరము, బేలూరుమఠము మున్నగుచోట్ల కేగి అనేకభక్తుల పుణ్యగోష్ఠిలో నుంటివని తెలిసి చాలసంతోషించితిని. అవకాశము లభించినపుడెల్ల అప్పుడప్పుడు ఆలాగు చేయుట చాలమంచిది. ఇది నీమనశ్శరీరముల సంక్షేమమునకు సాధకము కాగలదు.

ఠాకూరు అచిరకాలములోనే నీ కుటుంబ కష్టములను తొలగించునను పూర్తినమ్మకము నాకున్నది. దేనినిగూర్చియు వెత జెంద నక్కఱలేదు. నీ ప్రేమ భక్తివిశ్వాసములు వర్ధిల్లు నవకాశము కూర్చుటకే ఈ కష్టములు కలిగినవని నమ్ముము. అవి నీకు చెఱుపు నెన్నడును చేయవు.

ఠాకూరునకర్పించిన పంచదారలో రవంతనే నుంచుకొని మిలిగిన ప్రసాదమును నేను ధరించుచుండిన ప్రాతవస్త్రఖండమును నీకు త్వరలోనే పంపెదను. నీవు నన్ను కలిసికొనుటకు ముందే ఠాకూరు నీపట్ల కరుణాళువుగ నుండెనని నే నెఱుఁగుదును. ఆయనపట్ల ప్రేమవిశ్వాసములు వర్ధిల్లి స్థిరపడవలయునని నేను ఆస్థతో హృదయపూర్వముగ ప్రార్థించుచున్నాను. శ్రీరామకృష్ణుని కోరిన వారిని గుఱించి నేను తప్పక అట్లు ప్రార్థించుచుందును. గురుస్థానము నధిష్ఠించుట నాకశక్యము. గురుదేవుడు ఆరీతిగనే నన్ను తర్బీదు చేసియున్నాడు. గురువ నగుదమను తలంపు నాకెప్పుడును కలుగదు. కావున ఆ పదవికి నేనాయనను ప్రార్థించుటయు లేదు. ఈ యుగమున మానవతతికి ఆదర్శమును ఆచార్యుడును గురుదేవుడే. ఆయనపట్ల ప్రజలకున్న భక్తివిశ్వాసములు వర్ధిల్లవలెనని మాత్రమే మేము మనఃపూర్వకముగ ప్రార్థించుచుందుము. వారికి మాబోధనలచే ధైర్యోత్సాహములను కలిగించుచుందుము. ఆ భక్తివిశ్వాసములే వారిని రమలక్ష్యమునొద్దకు చేర్చునని నా విశ్వాసము.

నీకు నా హృదయపూర్వకాశీస్సులు. నా పంపు వస్తువులు నీకు చేరినవెంటనే ఆ సంగతిని నాకు తెలుపుము. నీ క్షేమవార్తలనుకూడ తెలుపుము. నా ఆరోగ్యము మందముగా నున్నది. ఠాకూరు సంకల్పముచే ఏది సంభవించునో అదే శ్రేష్ఠము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 49

చిల్కాపేటహౌస్,
అల్మోడాపోస్టు, ఉ. ప్ర.,
12 జూలై 1914.

ప్రియ శరత్ (బాంగాల్),[1]

సుదీర్ఘకాలమునకు ఆకస్మికముగ నీయొద్ద నుండి వచ్చిన జాబును చూడగానే నాకు కలి

1. తూర్పుబంగాళమువారిని హేయభావముతో నిర్దేశించుపదము "బాంగాల్". కాని ఇచ్చట అది ప్రేమ వాచకముగా ప్రయుక్తము, శరత్ = శరచ్చంద్ర చక్రవర్తి, శ్రీవివేకానందస్వాముల శిష్యుడు.

గిన సంతోషమును ఏమని చెప్పుదును? బాలే శ్వరవిలాసమునకు నీకొకజాబు వ్రాయనెంచి యుంటిని. కాని నీ విప్పుడు గయకు వచ్చి యున్నట్లును డెప్యూటీపోస్టుమాస్టరునౌకరీ నీకు ఖాయమైనట్లును తెలిసినది. గయకు నీవు వచ్చుట నాకు చాలసంతోషకరము. అక్కడ విష్ణుదేవాలయమునకు అప్పుడప్పుడు పోవు చుండుము. శ్రీగురుదేవుని (శ్రీరామకృష్ణుని) స్మరించుచుండుము, తప్పకుము. శ్రీరామకృష్ణుని తండ్రికి కల[1] వచ్చినది అక్కడనే. అవన్నియు తప్పక నీజ్ఞప్తిలో నుండును. గయలో నీవు వానిని స్మరింతువు అని నే ననుకొనుచున్నాను. నీసోదరునివార్తకూడ నా కత్యంతముప్రీతిని కూర్చినది. వివాహమాడు మని అతని నిక నిర్బంధింపకుము. కుటుంబభారమును అతడు నిర్వహించునేని ఠాకూరు సంకల్పానుసారము నీవు లౌకికకార్యకలాపమునుండి విరామము నొంది స్వామీజీపనిని మఱింత హెచ్చుగా చేయుచుండ వచ్చును.

నీవు కాశికి పోయితివనియు మహారాజును (శ్రీబ్రహ్మానందస్వామిని) కలసికొంటి వనియు విని చాల ప్రీతుడనైతిని. నీ వద్వైతాశ్రమమున బసచేసితి వని విని మఱింతగా సంతుష్టుడ నైతిని. స్వామీజీ (శ్రీవివేకానందస్వాముల) కీర్తికి అది చరమస్మారకము. ఆశ్రమమును రిపేరు చేయుటయు గనులను క్రొత్తపఱచుటయు— ఈ మొదలైన పనులుమాత్రమే ఇన్నాళ్లును జరుగుచువచ్చినది. ఒక రిద్దఱు బ్రహ్మచారులు సాగించు ఆధ్యాత్మికసాధనలు శ్రీరామకృష్ణునకును స్వామీజీకిని కావించు ఆరాధనా నైవేద్యములును తప్ప ఈ కేంద్రమున జనుల

ఏమైన చేయుటగాని

...దేశప్రచారముగాని విశేషముగ జరుగ లేదు. ఐనను ఠాకూరుసంకల్పానుసారము అటువంటి కార్యక్రమములు జరుగు నని నా నమ్మకము. మఱొకమాట: ఆశ్రమమునకు నిలుకడగా వచ్చు ఆదాయము లేదు. అయాచితముగ లభించుదానిమీదనే ఆశ్రమము చాల వఱకు ఆధారపడి యున్నది. నీవు వివేకభాష్యమును వ్రాయుచున్నావట. ఆ సంగతి ఇంతకు పూర్వమే వినియున్నాను. అది చాలమంచిదే. నీకే అది సాధ్య మగు నని నా దృఢవిశ్వాసము. స్వామీజీప్రత్యేకాశీస్సులు నీపట్ల నున్న వని నే నెఱుగుదును. వివేకభాష్యముద్రణమునకు వలసినధనమును మహారాజుగారు ఎట్లో ఒకట్లు సమకూర్తు రని విని చాల సంతోషించితిని. సంకల్పించునేని ఆయన దానిని నిర్వహింప గలడు.

ఔను "స్వామి శిష్యసంవాదము"[2] రెండు సంపుటములును నాయొద్ద నున్నవి. మొదటి నుండి తుదివఱకు నేను ఆగ్రంథమును క్షుణ్ణముగ చదివితిని. ఇప్పుడుకూడ అప్పుడప్పుడు చదువుచుందును. ఆగ్రంథము చాలరమ్యమైన కూర్పు. దానిని చదువుచున్నప్పుడు ఆసంభవము లన్నియు మనోనేత్రమునెదుట ప్రత్యక్ష మగును. నిజముగ స్వాములవారి సార్థక ప్రగాఢములైన ఉపదేశములందున్నవి. దానిని

1. వచ్చిన కల ఇది:– శ్రీరామకృష్ణుని తండ్రి క్షుదిరాంచట్టోపాధ్యాయ విష్ణుదేవాలయమున ఉపహారములను అర్పించుచుండెను. పితృదేవతలు చుట్టునుండి అర్పించినదానిని స్వీకరించుచు దీవించుచుండిరి. వారు గదాధరదేవుని ఆరాధించుచుండిరి. వారినడుమ ఉన్న ఆసనముపై ఉన్న గదాధరస్వామి క్షుదిరాముని పిలిచి అతనిభక్తిప్రపత్తులను మెచ్చుకొని "నీయింట నీకు పుత్త్రుడనుగా జన్మింతు" ననెను. "అయ్యో, నేను పేదనే" అని క్షుదిరాము డనగా స్వామి "భయపడకు. నీ వేమర్పించినను అదే నాకు మేరుసమానము" అని యూరడించెను.

2. సంపూర్ణగ్రంథావళి ఆంగ్లసంపుటములు. V VI VII

చదువుచున్నప్పుడు హృదయ ముప్పొంగును. వెలుగొందును. ఉత్సాహపూర్ణ మగును. ఈ సమ స్తమును స్వానుభవమున నేను చూచితిని. నాకరీసంకెళ్ళనుండి విడుపొంది నీజీవితము నంతటిని స్వామిజీపనికై విశుద్ధచి త్తముతో అంకిత మొనర్చుకొంటివేని నాకు కలిగెడి సంతోషము ఇంతంత గాదు. మిషనులో చేరు చున్న విద్వాంసులగు బ్రహ్మచారులు నీరచన లను చదువుచు ఏకగ్రీవముగ ఇట్లనుచున్నారు. "శరత్బాబు సన్న్యాసదీక్షను స్వీకరించి స్వామీ జీకై మఱింతగ పాటుపడు నేని చాల బాగుండును. సన్న్యసించు నేని ఆయనకు కావలసినంత వ్యవధి లభించును. ఆయనతోడి గోష్ఠిచే మాజీవిత ములు మేలొందును. స్వామిజీపని మఱింతగా నిర్వ ర్తితమగును." వారు చెప్పుచున్న దినిజమే అని నాయభిప్రాయము. ఠాకూరు సంకల్పించు నేని అట్లే జరుగును.

నే నిచ్చటికి వచ్చి సంవత్సరమునకంటె ఎక్కువ కాలమైనది. కాశీలోను కంఖాలులోను బేలూరు మఠమునందును ఉండినంతకంటె నాయారోగ్యము చాల మెఱుగుగా నున్నది. ఠాకూరు ననుగ్రహమున మనఃపరిస్థితి బాగు న్నది. నే నున్నచోట ఎట్టయెదుట కేదార నాథబదరికాశ్రమములను సదా చూచుచుండ వచ్చును. అవి సదా మంచుకప్పిన వెండి కొండలశ్రేణులు. ప్రస్తుతము ఆకాశము మేఘ చ్ఛన్నమై యున్నందున అవి ఎల్లప్పుడును కన వచ్చుట లేదు. ఇచ్చటి శీతోష్ణస్థితి చాల ఆరోగ్యకరము. చోటు చాల ఏకాంతమైనది. పవిత్రమైనది. ఇది యుండునది ఉత్తరఖండము లోనే. పురాణములలో ఈ చోటునకు "రామ పర్వత" మని పేరు.

ప్రాంకుమహాశయుని ఎఱుగుదు వను కొందును. తొమ్మిదిపదినెలలుగ అతడును అల్మోడాలోనే ఉన్నాడు. కొంతఆధ్యాత్మిక సాధన చేయుచున్నాడు. సాయంప్రాతర్వేళ లలో నన్ను కలసికొనుచుండును. కొంతమంచి సంసర్గము నా కిచ్చట నున్నది.

నీకు నాహృదయపూర్వక ప్రేమాశీస్సులు అప్పుడప్పుడు నీవా ర్తలు తెలియుచుండిన నాకు సంతోషముగ నుండును.

నీ శ్రేయోభిలాషి,
శివానంద

## 50

చిల్కాపేట,
అల్మోడా, ఉ. ప్ర.,
30 అక్టోబరు 1914.

ప్రియ——,

సాదరముగా నీవు వ్రాసిన చక్కనిజాబు చేరినది. చాలసంతోషము. ఠాకూరు రామ కృష్ణదేవుడే అపారకరుణచే తన బానిసనైన నారూపమును కలలోనీకు కనబఱచి ఆశీస్సులను నీచెవిని పడవేసెను. అందునుగూర్చి నాకేమియు తెలియదు. గురుదేవు నెదుట శిశువువలె విల పించుచు ప్రార్థింపుము. తనవి తీర ప్రార్థింపుము. నీప్రార్థనలకు ఆయన తప్పక చెవియొగ్గును. అందుకు నేను పూచీ. సరళమైన శ్రద్ధయున్న నే ఆయనను పడయవచ్చు ననుట నిజము,నమ్ముము. ఠాకూరుమహిమలను కీర్తింపుము. ఆయన నామమును ననుసంధింపుము. ఆయననుగూర్చి చదువుము. ఆయనజీవితమును గూర్చి చింతన చేయుము. ఈపనుల నన్నిటిని చేయుము.

ఆయనను ఆశ్రయించుటకు ప్రత్యేకమైన పద్ధతి లేదు. ఆయనను ప్రేమింప ప్రయత్నిం పుము. ఆయనను ప్రేమించు టెట్లు అని యడుగుదువేని అందుకు జవాబు: "ఆయనను పేర్కొనక ఆయనను స్మరింపక నీ వెప్పు డుండ

లేవో అప్పుడు ఆయన నిన్ను ప్రేమించు చున్నాడని తెలిసికొనుము. ఆయన ప్రేమకు భాజనము కానిదే ఎవరును ఆయనను ప్రేమింప జాలరు. జీవితమునను జీవితానంతరమునను ఆయనయే మన సర్వస్వము. ఈ విశ్వము ఆయనది. ఈ మాయాజగమున ఆయనయే నన్నుంచి యున్నాడు. కావున నేనిందున్నాను. ఆయన చేయించినపెల చేయుచున్నాను. ఎడ తెంపు లేక ఆయనను పేర్కొనుచుందువేని ఈ భావనయే కాలక్రమమున ప్రేమగా పరిణ మించును. అందుంగూర్చి మిక్కిలి తొందరపడి ఉపయోగము లేదు. మెల్లగానే ముందునకు సాగవలయును. విశుద్ధమైన జీవితమును గడః వలె నను ప్రత్యేకమైన మెలకువ కలిగి యుండ వలయును. కామినీ కాంచనములే సంసారము. ఎల్లెడల చెడగొట్టు ప్రభావము వానిదే' గురు దేవుని సదా ఇట్లు ప్రార్థింపుము. ''దేవా, విశ్వమోహనమైన నీ మాయలో నేను తగు ల్కొనకుండునటుల చూడుము. నీ శ్రీచరణ ములందు నిస్స్వార్థమైన భక్తిని శ్రద్ధను నాకు ప్రసాదింపుము.'' ఈ రీతిని ప్రార్థించితివేని గురు దేవుడు నిన్ను సన్మార్గమున కొనిచనును. సందేహము లేదు.

ఇక నేమి వ్రాయుదును? అప్పు డప్పుడు జాబు వ్రాయుచుండుము. నీకు నా హృదయ పూర్వక ప్రేమాశీస్సులు.

నీ లాషి,
శివానంద.

## 51

రామకృష్ణ అద్వైతాశ్రమము,
లగ్సా, వారణాశి,

ప్రియ—, 28 నవంబరు 1914.

నీజాబు చేరినది చాలసంతోషము. ఇచ్చట నా ఆరోగ్యము పర్వా లేకున్నది. గురుదేవు ననుగ్రహమున బాబురాము మహరాజునకు (శ్రీప్రేమానందస్వామికి) కూడ క్షేమమే. ''అశ్వాక్'' చేరినదని హరిమహరాజు వ్రాసిన జాబువలన తెలిసినది.

నేను నాతో హరిమహరాజును పిలుచుకొని పోవుట అనునది చాలవరకు తప్పక జరుగును. హరిమహరాజు మహిజములో కొన్నా ళ్లుండ వలయునని భువనబాబును, భూషణబాబును ప్రత్యేకముగ ప్రార్థించియున్నారు. మహిజ ములో కొన్నాళ్లుందుమేమో. తర్వాత జంతా రాకు పోయి భూమినిగుఱించిన కొన్ని ఏర్పాట్లు చేయవలయును. ఇటికరాళ్లు కాల్పించి అక్కడ ఒక చిన్నఇంటిని నిర్మించుటకు ఏర్పాట్లు చేయ వలసి యున్నది.

నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. ఇప్పుడు మీరందఱును గురుదేవుని సంరక్షణ లోను తద్భక్తుల సంరక్షణలోను కుదురు కొంటిరి కాబట్టి ఆధ్యాత్మిక జీవితములో పరి పూర్ణతను మీరు తప్పక సాధింతురు. నిజముగ మీ బాధ్యత మాది. ఈ విషయమును సదా జ్ఞ యుంచుకొనుము. ఇంతకంటె ఏమి వ్రాయుదును

నీ శ్రేయోభిలాషి.
శివానంద.

## 52

చిల్కాపేట,
అల్మోడా, ఉ. ప్ర

ప్రియ—, 28 జూను 1915

నీ జాబు యథావిధిగా చేరినది. సంగతులు తెలిసినవి. మఠమునుండి కొందఱు సన్న్యాసు లును, బ్రహ్మచారులును అచ్చటికి వచ్చినట్లు తెలిసినది. రామకృష్ణునిపేర నుండు సేవా సంఘము ఆయనదే. ఆయన కృపచే మిషను

వారు క్షామబాధిత నారాయణులకు కొంత సేవ చేయగలుగుదురేని అది ఎంతయు సంతోషింపదగిన విషయము. దేశపరిస్థితి దుఃఖకరముగ నున్నది. ఎంతటి విపత్తు! తిండి లేక ప్రజలు మరణించుచున్నారు. గురుదేవుడు ప్రసన్నుడై వారి కష్టములను తొలగించును గాక అని ఆయన శ్రీచరణములయొద్ద మేము మనఃపూర్వకముగ ప్రార్థించుచున్నాము. సాహాయ్య కార్యక్రమము నిర్వహింప బోయిన వారికి గురుదేవుడు ఆరోగ్యము నిచ్చుగాక. వారు సముత్సాహముతో పాటుపడుదురుగాక. వారికి ధనాభావము కలుగకుండు గాక.

నీ మానసిక వ్యథను విన్నప్పుడు నే నింకను ఎక్కువగా దుఃఖించితిని. గురుదేవుడు నీకు తప్పక తనదర్శన మనుగ్రహించును. శిశువువలె గాఢముగ ప్రార్థింపుము. ఏకాంతమున కన్నీరు మున్నీరుగా కార్చుచు ప్రార్థింపుము. వెలుపలి ప్రజలకు ఇందుంగూర్చి ఏమియు తెలియనీయకుము. అది యందఱికి తెలిసిపోయినచో భక్తిప్రేమల వేగము తగ్గిపోవును. ఏకాంతముననే దేవుని ధ్యానించు విషయమున జాగరూకుడవై యుండుము. సంకీర్తనము మున్నగునవి ఇతరులతో కలిసి చేయవలసినవే. దేవుని మహిమలను కీర్తించునప్పుడు బాష్పములు రాల్చుట మున్నగునవి భక్తులకు సహజమే. కాని భావోద్రేకములను ప్రకటము కానీయక ఎంతగా అణచుకోగలవో ఆంతరమున అది తదనుగుణముగా వర్ధిల్లును. లోపల ఇంచుకగ ప్రబుద్ధమైన భావము వెలుపలికి ప్రసరించునేని అది రూపుదాల్చజాలదు. దేవుడు సర్వమునకును అంతర్యామిగా నున్నాడు. ఈ నిమిషముననే పెక్కు రూపములలో ఆయన తన్ను ఆవిష్కరించుకొని యున్నాడు. అలాగు ఇంక నింకను ఆవిష్కరించుకొనగలడు. సాక్షిమాత్రుడవుగా నుండి ఈలాగనుచుండుము. “దేవా, భగవంతుడా, శ్రీ రామకృష్ణా, విశ్వాంతర్యామీ, గురూ, అవతారమూర్తీ, నను కృపజూడుము. నాలో ప్రేమను నింపుము. భక్తిని నింపుము. నేను కేవలము అకించనుడను. దీనుడను. భక్తిహీనుడను. జ్ఞానహీనుడను. తపస్సాధనలు గాని, వివేకముగాని, సారగ్రహణసామర్థ్యముగాని నాకు లేవు. ప్రార్థనలు సలుపజాలను. నన్ను కరుణింపుము. ప్రజల అలికిడి లేని ఏకాంతమున కన్నీటిపోటుతో ఈలాగున ప్రార్థింపుము. అప్పుడు నీకు సమస్తము సిద్ధించును. గురుదేవుడు నీకు దర్శన మనుగ్రహించును. కనికరించును. ప్రేమను భక్తిని సమస్తమును ప్రసాదించును. ఐహికములైన చిక్కులను ఆయన ఇక ఉండనీయడు. భయపడవలసిన సందర్భమే ఉండదు.

నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. యథార్థభక్తజీవనమును గడపుము. దేవుడు సరియైన కాలమున సమస్తమును చక్కబఱచును. భక్తుని లక్షణము లివి—గడ్డిపఱకకంటెను తన్ను తక్కువగా నెంచుకొనును. వృక్షముకంటె అధిక సహనశక్తి కలిగియుండును. గౌరవానర్హులపట్లకూడ గౌరవము కలిగియుండును. గౌరవార్హులను గూర్చి చెప్పనక్కఱ లేదు. ఈరీతిగ ప్రవర్తించువాడు యథార్థభక్తుడు. గురుదేవుడు మూడు “స” కారము లున్నవని చెప్పుచుండెడి వాడు. (సకార శకార షకారములు బెంగాలీలో ఏకరీతిగ నుచ్చరింపబడును.) అనగా సహనము, సహనము, సహనము. దుష్టులు బాధించుకొలదియు భక్తులు దేవుని మఱింతగా స్మరింతురు. స్మరించినకొలది వారి భక్తి విశ్వాసములు పెంపొందును. భక్తి విశ్వాసములు

పెంపొందినకొలది శాంత్యానందములు వర్ధిల్లును. భక్తు లందున్న ఆ శాంత్యానందము లను చూచినప్పుడు ప్రతిపక్షుల మనసులు సైతము భగవదభిముఖముగ నుఱవడించును. ద్వేష మంతరించును. అడ్డములు ఆలంకములు లేనిదే మానవుడభివృద్ధి నొందలేడు. కావుననే మహాపురుషులు మహాత్ములందఱును తమ దారిని వచ్చు విఘ్నములను అత్యంత మిత్ర మునుగ భావించిరి.

ఇంకను ఏమి వ్రాయుదును. ఇప్పటికే జాబు పొడుగు పెరిగినది. నీకు భయములేదు. కట్టు కొనుటకు వస్త్రములేక నీ వున్నావను వార్త వినుట నాకెంతో కష్టముగ నున్నది. ఒక వస్త్రఖండమును నేను పంపుచున్నాను. నాయొద్ద నొకగుడ్డ ఎక్కువగా నున్నది. నీకు నా హృదయపూర్వక ప్రేమమంగళాశీస్సులు. మఠమునుండి వచ్చినవారి కందఱికిని నా యాశీస్సులను అందజేయుము. మీరందఱును వారిని చక్కగా విచారించుకొనుడు. ఆమాట నేను చెప్పవలసినది లేదు లెండి.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 53

చిల్కపేట,
అల్మోడా, ఉ. ప్ర.
28 జూన్ 1915

ప్రియ——;

నీజాబు చేరినది. సకలవృత్తాంతము అర్థమైనది. నేను సుఖముగానే ఉన్నాను. కాని ఆప్రాంతీయములు కాటకముచే అంతంతలేసి బాధలుపడుచున్నా రనియు తిండి లేక కొందఱు మరణించుచున్నా రనియు విన్నప్పుడు నా కడుపు తఱుగుకొనిపోవుచున్నది.

నీవు నిజముగ ధన్యుడవు. అందుకు సందేహము లేదు. దేవునిదర్శనము నీకు కలలో కలిగినను, అది నిన్ను పవిత్రీకరించును. భగవత్ప్రాప్తి నీకు కలుగును. నామాట నమ్ము మనసు విశుద్ధము కానిదే భగవత్ప్రాప్తి చేకూరదు. కలలలో తఱచు భగవంతుని సందర్శించుచుండువారికి పూర్వజన్మలనుండి సంక్రమించిన సత్ప్రవృత్తు లుండియుండును. కావున ఇవన్నియు మంగళసూచకములు. భగవంతుడు నీకు భక్తిని, ప్రేమను, జ్ఞానమును, శ్రద్ధను, పవిత్రతను సమృద్ధిగ ప్రసాదించి నిన్ను పరిపూర్ణు నొనర్చు గాక అనుటయే హార్దమైన నాప్రార్థన...చాల మంచిపిల్లవాడు. అతనికిని దేవుడు ఉత్కటప్రేమను, భక్తిని, శ్రద్ధను ప్రసాదించును గాక అని నే నెంతయు హృదయపూర్వకముగ ప్రార్థించుచున్నాను. శ్రీబ్రహ్మానందస్వామికి జాబు వ్రాయుద మని నీకు తోచిన వ్రాయుము. అందును గూర్చి న న్నడుగు టెందులకు? సమస్తమును నీ కనుకూలించును గాక. ప్రగాఢభక్తిశ్రద్ధాప్రేమ జ్ఞానవివేకములు నీయందు పెంపొందునుగాత మనుటె నాప్రార్థన. ఎడబాయక సాధుసాంగత్యముననే యుండుటకు ప్రయత్నింపుము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద

# వార్తలు - విశేషాలు

## రామకృష్ణమఠమిషనుల సమష్టి నివేదిక

(1967–వ సంవత్సరము ఏప్రిలునుండి 1968–వ సంవత్సరము మార్చివఱకు.
1969–వ సం॥ సెప్టెంబరునెలలో బేలూరునుండి జెనరలు సెక్రెటరిగారిచే వెలువరింపబడినది)

### రామకృష్ణమఠము - రామకృష్ణమిషను

'మఠము'ను దానిశాఖలును 'మిషను' దాని శాఖలును ప్రత్యేకములైనవే. కాని 'మఠ' 'మిషను'లకు సన్నిహితసంబంధ మున్నది. ఎట్లనగా—మఠధర్మకర్తలే మిషను నిర్వాహకపరిషత్సభ్యులుగ ఉన్నారు. మిషనుకార్యకలాపాలను నడపువారిలో ప్రముఖులు మఠసభ్యులే. 'మఠము'నకు 'మిషను'నకు—రెంటికిని కేంద్రస్థానము బేలూరుమఠమే. మఠకార్యక్రమాలుగూడ 'మిషను'కు సంబంధించినవే అని సామాన్యంగా ప్రజలు అనుకుంటుంటారు.

ఈ విషయం గుర్తించాలి — ఎక్కడైనా ఏసంస్థకైనా శ్రీరామకృష్ణునిపేరునో శ్రీవివేకానందస్వాములపేరునో పెట్టుకోవచ్చు. పెట్టినంతమాత్రంచేత అది బేలూరికేంద్రసంస్థ అధికారావరణంలో చేరింది కాదు.

ఆర్థికాధారాలు మఠానికి వేఱు, మిషనుకు వేఱు. ఆయవ్యయాల లెక్క దీనిది వేఱు, దానిది వేఱు. మిత్రులు భక్తులు సమర్పించే విరాళాలును గ్రంథవిక్రయంవల్ల వచ్చే ధనమున్నూ మఠానికి అర్థికాధారం. విద్యార్థులు కట్టే జీతాలు ఉదారమహాజను లర్పించు విరాళాలు చందాలు మిషనుకు ఆర్థికాధారం. ప్రభుత్వంవారున్నూ ప్రజాసంస్థలున్నూ ఇచ్చే గ్రాంట్లు 'మఠమిషను'లకు ఉమ్మడి. మఠమిషనుల ఆదాయవ్యయపట్టికలను ఏటేటాసమర్థులైన ఆడిటర్లు తనిఖీచేస్తుంటారు.

### కార్యక్రమాలసంక్షేపం

ఆర్థికంగాను రాజకీయంగాను కొన్ని రాష్ట్రాలలో సందిగ్ధపరిస్థితు లేర్పడిఉండడంచేత 1967–68 సంవత్సరములో కార్యకలాపాలను పెంచుకొనే విషయంలో మితినీ మెలకువనూ పాటించవలసివచ్చినది. ఐనా భారతదేశంలో వివిధ ప్రాంతాలలో ఆపదలపాలైనప్రజల కష్టనివారణకై సాహాయ్యకార్యక్రమాలు విరివిగా అవిచ్ఛిన్నంగా నిర్వర్తించబడ్డాయి. అంతకు మునుపే కావించియుండిన కొన్నివాగ్దానాల పూర్తిచేయటం జరిగింది. మధ్యప్రదేశ రాయిపురంలోని వివేకానందాశ్రమాన్ని మిషను అధీనంలోకి తీసికోవడం 8–4–1968 వ తేదినాడు నిర్వర్తితమైంది.

ఈ సంవత్సరంలో లేపబడ్డ క్రొత్తకట్టడాలు:- బేలూరు మిషను డిస్పెన్సరికి ఒక పైఅంతస్తు, బేలూరు విద్యామందిరమున మూడంతస్తుల హాస్టలుభవనం, భువనేశ్వరంలో వివేకానంద స్కూలుభవనం, దేవగడంలో క్రొత్తశయనాగారం, మద్రాసువివేకానందకాలేజి కొక క్రొత్తలైబ్రరీభవనం, నరేంద్రపూరులో వివేకానందసెంటనరి హాలు, జంషెడ్పూరులో సిస్టరు నివేదిత గరల్సుహైయరుసెకండరిస్కూలు బయాలజి (జీవశాస్త్ర) శాఖ కొకభవనం. ఈ కట్టడాలను పూర్తిచేయడమే కాక, దేవగడంలో క్రొత్తభోజనమందిరానికి, జంషెడ్పూరుసాక్చీలో స్టూడెంట్సు హోముకు, ఆగ్నేయ సరిహద్దురాష్ట్రంలోని ఆలోంగులో స్కూలు భవనానికి–పునాదులు వేయబడ్డాయి.

మఠశాఖలో – కల్కత్తా బాగ్బజారు రామకృష్ణమఠమువారు ఒకక్రొత్తభవననిర్మాణం ప్రారంభించారు. మద్రాసుమఠంవారు రామకృష్ణసెంటినరీప్రైమరీస్కూలుకు క్రొత్తభవనం

నిర్మించుకున్నారు. వైద్యశాలభవనాన్ని మఱి కొంత పెంచుటకై పునాదులు వేశారు. ఉదక మండలమఠంవారు శ్రీవివేకానందస్వాముల ప్రియశిష్యుడును వారిచే గురుదాసని పిలువబడు చుండినవాడునగు జేజే గుడ్విన్‌మహాశయుని స్మారకభవనం నిర్మించారు. మైసూరాశ్రమం వారు వేదాంతకళాశాలభవనానికి పునాదులు వేశారు. బెంగుళూరాశ్రమంవారు వివేకానంద సెంటినరీస్మారకభవనాన్ని ఆవిష్కరించారు, బృందావనాశ్రమంవారు ఒకగుడిని నిర్మించ డానికి పునాదివేశారు. బేలూరుమఠంవారు పురాతనమఠభవనమును సరిక్రొత్తదానినిగ జేశారు. సేవార్థులు వేచియుండడాని బేలూ రులో ఒకహాలును కట్టినారు. మఠసాధువులు తపస్సుచేసికొనేందుకు ఉత్తరకాశిలో ఒక కుటీరం నిర్మించారు.

క్రిందటిసంవత్సరంలో వలెనే ఈసంవత్సరం లోను తూర్పుపాకిస్థాన కేంద్రాలతో మాసంబం ధాలు చాల పలుచగా నుండినవి. పాకిస్థాన సంజాతులగు నలుగురు సాధువులు గృహస్థ ప్రేల మిత్రుల తోడ్పాటుతో తమ కార్య ప్రణాళికలను ఎట్లో ఒకట్లు కొనసాగిస్తూ వచ్చారు.

బర్మాలో ఒక్క కేంద్రమే శేషించియున్నది. అదిరంగూన్‌రామకృష్ణమిషన్‌సొసైటీ. స్థానిక మిత్రులు బేలూరుమఠాధ్యక్షులచేత నియుక్తులై కార్యనిర్వాహక పరిషత్తుగ ఏర్పడి ఆకేంద్ర మును కొనసాగిస్తూ ఉన్నారు.

## కేంద్రాలు

1968 సంవత్సరం మార్చినెల యప్పటికి బేలూరుమఠం గాక శాఖాకేంద్రాలు మొత్తం 112 ఉండినవి. వానిలో 50 మిషన్ కేంద్రాలు, 41 మఠకేంద్రాలు, 21 మఠమిషనులఉమ్మడి కేంద్రాలు. ప్రాంతీయంగా ఇవి ఈ క్రింది విధంగా విభక్తములై యున్నాయి:- తూర్పు పాకిస్థానంలో 2 మిషన్ కేంద్రాలు 3 మఠ కేంద్రాలు 5 మఠమిషనుల ఉమ్మడికేంద్రాలు ఉన్నవి. బర్మా, ఫ్రాన్స్ సిలోను సింగపూరు ఫిజి మారీషస్ అను దేశాలలో ఒక్కొక్క దానిలో ఒకమిషను కేంద్రం ఉన్నది. స్విజర్లండు ఇగ్లండు, ఆర్జంటైనా అనుదేశాలలో ఒక్కొక్కదానిలోను ఒకమఠ కేంద్రం ఉంది. అమెరికాసంయుక్తరాష్ట్రాలలో మఠకేంద్రాలు 10 ఉన్నాయి. ఇక శేషించిన 42 మిషన్ కేంద్రాలు, 25 మఠకేంద్రాలు 16 మఠమిష నులఉమ్మడికేంద్రాలు (మొత్తం 83) భారత దేశంలో ఉన్నాయి. పశ్చిమబంగాళంలో 29, ఉత్తరప్రదేశ్‌లో 11, తమిళనాడులో 11, బీహార్‌లో 7, కేరళములో 5, అస్సాము మైసూరులొక్కొకదానిలో 4 కేంద్రాలు, ఒరి స్సాలో 3 కేంద్రాలు, ఆంధ్రమహారాష్ట్ర లొక్కొక్కదానిలో 2 కేంద్రాలు, గుజరాతు రాజస్థానము, , నెఫా (ఆగ్నేయపు సరి హద్దురాష్ట్రం) చండీగడ్ అనుప్రాంతా లొక్కొక్కదానిలో ఒక్కొక్క కేంద్రం. ఈశాఖాకేంద్రాలతో సంబంధపడిన ఉప కేంద్రాలు 23 ఉన్నాయి. వానిలోను సన్న్యా సులు సదా ఉంటూనే ఉన్నారు.

1-4-1969 తేదీనాడు ఈక్రింది రెండుక్రొత్త శాఖాకేంద్రాలు ఏర్పడినవి. 1. మధ్యప్రదేశ రాయపూరులో రామకృష్ణమిషను వివేకానం దాశ్రమము. 2. అస్సాము, కామరూపజిల్లా గౌహాటీఛత్రిబాడిలో రామకృష్ణాశ్రమము.

## నిర్వర్తితములైన సేవాకార్యాలు

వైద్యసేవ :—భారతదేశంలోను పాకి స్థానంలోను మఠమిషనుకేంద్రాలు జాతిమత

విచక్షణ లేకుండా ప్రజల ఆరోగ్యాన్ని పెంపొందించే పనులు సాగించారు. ఉదా:— కల్కత్తా, వారణాశి, బృందావనము, కంఖాలు త్రివేంద్రము, రాంచీ అను చోట్లలోనున్న వైద్య శాలలు. 1967–68 సంవత్సరంలో పాన్పులు సమకూర్చి రోగులను అక్కడనే ఉంచుకొని వైద్యం చేసే ఆస్పత్రులు మొత్తం 10 ఉండినవి. వానిలో పాన్పులసంఖ్య మొత్తం 1,208. రోగుల సంఖ్య 25,740. ఏనాటికానాడు వచ్చి చికిత్స చేయించుకొనిపోయిన రోగుల సంఖ్య మొత్తం 30,35,148. సేలము, బొంబాయి కాన్పూరు క్రొత్తఢిల్లీ, మున్నగుచోట్లలో ఆస్పత్రులకు అనుబంధంగా పరీక్షా కేంద్రాలున్నవి. శ్యామలతల ఆశ్రమములోని జంతు వైద్యశాఖలో 1,840 జంతువులకు వైద్యము కావించబడినది. రాంచిలో క్షయవ్యాధి చికిత్సకు ప్రత్యేకవసతులున్నాయి. కల్కత్తాసేవా ప్రతిష్ఠానంలో విశేషభాగం ప్రసూతిశిశుసంక్షేమాలకు అంకిత మైనది.

విద్యాసేవ:—మద్రాసులో రహార (24 పర్గణాలజిల్లా)లో బేలూరు(హౌరాజిల్లా)లో, నరేంద్రపూరు (24 పర్గణాలజిల్లా)లో మఠమిషనుల ఆధ్వర్యమున డిగ్రీకాలేజీలు 4 నడుస్తున్నాయి. బేలూరు నరేంద్రపూరు కళాశాలలు విద్యార్థులను అక్కడనే ఉంచుకొని విద్య గఱపేవి. 4 కాలేజీలలో కలిసి విద్యార్థులసంఖ్యమొత్తం 3,579 కొన్ని విద్యాసంస్థల వివరాలు :—

| సంస్థపేరు | సంస్థఉన్నఊరు | విద్యార్థులసంఖ్య |
|---|---|---|
| ప్రీయూనివర్సిటి కాలేజి | పెరియనాయకన్పాళెం (కోయంబత్తూరు) | 200 |
| రెండు బి. టి. కాలేజిలు | బేలూరులో పెరియ నాయకన్పాళెములో | 253 |
| రెండుబేసిక్ ట్రైనింగుస్కూళ్ళు | పెరియనాయకన్పాళెములో మద్రాసులో | 234 |
| పోస్టుగ్రాడ్యుయేట్ బేసిక్ ట్రెయినింగుకాలేజి | రహార | 111 |
| నాలుగుజూనియరు బేసిక్ ట్రెయినింగుకాలేజీలు | రహార, సరీష, సార్గాచి | 303 |
| వ్యాయామకళాశాల | పెరియనాయకన్పాళెం | 107 |
| జానపదోన్నతపాఠశాల | ,, | 288 |
| వ్యవసాయపాఠశాల | ,, | 144 |
| కర్షకశిక్షణకేంద్రం | నరేంద్రపూరు | 87 |
| ఇంజినీరింగుస్కూళ్ళునాలుగు | బేలూరు, బెల్ఘూరియ, మద్రాసు, పెరియనాయకన్పాళెం | 1,519 |

ఇవి గాక జూనియరు టెక్నికలు స్కూళ్లు 14 ఉన్నాయి. అందలి విద్యార్థుల సంఖ్య 700, విద్యార్థినుల సంఖ్య 647. విద్యార్థుల విడుదులు 90 ఉన్నాయి. అందు కొన్నింటిలో అనాథశిశుశరణాలయా లున్నవి. వానిలో ఉన్న బాలుర సంఖ్య 8,882, బాలికల సంఖ్య 983. చతుష్పాఠులు 41, అందు విద్యార్థులు 38, మల్టిపర్పస్ హైయరుసెకండరిస్కూళ్లు 15, అందు బాలురు 6,644, బాలికలు 493. హైయరుసెకండరిస్కూళ్లు 8, అందు బాలురు 3,126, బాలికలు 1,654. సెకండరిస్కూళ్లు 16, అందు బాలురు 6,636, బాలికలు 4.621. సీనియరుబేసిక్ M.E స్కూళ్లు 36, అందు బాలురు 4,764, బాలికలు 3,750. జూనియరుబేసిక్ U.P ఎలిమెంటరి స్కూళ్లు 45, అందు బాలురు 6,846, బాలికలు 3,171, L P మొదలైన గ్రేడుస్కూళ్లు 101, అందు బాలురు 5,480, బాలికలు 3,400. కల్కత్తా లోని సేవాప్రతిష్ఠానములోనున్నా ట్రివేండ్రములోని మఠవైద్యశాలలలోను దైన నర్సుల ప్రసూతిసహాయల సంఖ్య 212. ఇండియా పాకిస్థానము సింగపూరు ఫీజి, మారీ షస్సు – ఈ అన్నిచోట్లలో కలిసి మఠమిష నల ఆధ్వర్యంలో సాగుతున్న విద్యాసంస్థలలో 49,486 విద్యార్థులు 19,486 విద్యార్థినులు ఉంటున్నారు. కల్కత్తా కల్చరు ఇన్స్టిట్యూటు వారు 800 విద్యార్థులతో ఒక డే హాస్టలును 99 విద్యార్థులతో ఒక సంస్కృతి విద్యాలయాన్ని 1264 విద్యార్థులతో బహుభాషాబోధకవిద్యాల యాన్ని నడిపారు. నరేంద్రపూరాశ్రమంవా రొక విద్యాలయాన్ని నేత్రవిహీనబాలురకై నడిపారు. అందున్న విద్యార్థుల సంఖ్య 95.

## వినోద కార్యక్రమాలు

కొన్ని మఠమిషను కేంద్రాలలో స్కూలు గంటలు ముగిశాక విద్యార్థులకు వినోదసాం స్కృతికాధ్యాత్మిక కార్యక్రమాలను జరుపుతూ వచ్చారు.

ఉదా:—బెంగుళూరాశ్రమ బాలకసంఘము మైసూరాశ్రమం.

## మహిళాకార్యక్రమం

భారతీయమహిళలకు తాము చేయవలసిన విధులను మిషనువారు సదా జ్ఞప్తియం దుంచు కొన్నారు. వారు నిర్వర్తిస్తూ వచ్చిన మహిళా సేవాకార్యక్రమానికి ఉదాహరణాలు కల్కతా సేవాప్రతిష్ఠానంలోను ట్రివేండ్రము మఠ వైద్యశాలలోను ప్రసూతిశాఖలు, జల్పైగురి లోను, ఖేత్రిలోను ప్రసూతివైద్యశాలలు, వారణాశి బృందావనవైద్యశాలలలో మహిళా శాఖలు. వారణాశిలోని రోగిణులవిడిది. మద్రాసులో శారదావిద్యాలయ. జమ్షెడ్పూరులో గరల్సుహైస్కూళ్లు సరిష (24 పర్గణాలజిల్లా) లో శారదామందిరం. ఇది గాక యితర వైద్యశాలలలో విద్యాలయాలలో మగువలకు ప్రత్యేకములైన యేర్పాట్లున్నాయి.

## నిమ్నగ్రామీణ ప్రజల సముద్ధరణము

చెఱ్ఱాపుంజి సరిష రామ్హరిపూరు, మానస ద్వీపం, జయరామబాటి కామార్పుకూరు సార్గాచి ఆలోంగు పెరియనాయకన్పాళెం కాలాడి తిరుచ్చూరు అనుచోట్లలో ఉన్న ప్రధానాశ్రమాలే కాక ఉపకేంద్రాలు-కొన్ని తాత్కాలికాలు కొన్ని ఎప్పుడూ ఉండేవి-కూడ నిమ్నగ్రామీణప్రజల సముద్ధరణ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నవి. అస్సాము కొండ ప్రజలలో ఆగ్నేయసరిహద్దుప్రాంతీయప్రజలలో మనమిషను కేంద్రాలు సాగిస్తున్న విద్యావ్యాప్తి సంస్కృతికార్యక్రమాలు ఉదాహరణాల్వాలు. చలనచిత్రాల సాహాయ్యంతో విద్యావ్యాప్తికై పర్యటనలుకూడా సాగింపబడినవి.

పైవివరాలనుబట్టి ఈ సంస్థకార్యక్రమాలు నగరాలలో మాత్రమే జరిగినవి కావని అన్ని

రంగాలలో వ్యాపించాయని స్పష్టమవుతూంది. రామకృష్ణవివేకానందసందేశం భారతదేశంలో అన్నివైపుల వ్యాపిస్తున్న దనడానికి వార్షికోత్సవాలలో పాల్గొంటూండే ప్రజల అత్యధిక సంఖ్యయే తార్కాణము. సంవత్సరంపొడుగున ప్రజలు గుడులలో ఆశ్రమాలలో వేలకొలదిగా సమావేశం కావడమే గాక ధర్మవైద్యశాలలలో చికిత్సకై వస్తూ ఉంటారు. విద్యాసంస్థలలోకూడ పేదవిద్యార్థులకు ఉచితంగా అన్నవస్త్రముల నిచ్చి విద్యగఱపే యేర్పాట్లున్నాయి. పెక్కుగ్రామాలలో వయోజనవిద్యాకేంద్రాలు నడపబడుతూన్నాయి. గ్రంథప్రచురణశాఖలు చిన్న పుస్తకాలను సామాన్యప్రజలకు చాల తగ్గింపు ధరలకు అందజేస్తున్నాయి.

## విపత్సమయములలో సాహాయ్యకార్యక్రమం

సంవత్సరంపొడుగున మిషనువారు సాహాయ్యకార్యక్రమాలను నిర్వహిస్తూవచ్చారు. 1967-68 సంవత్సరంలో సాగింపబడిన సాహాయ్యకార్యక్రమం క్రిందటిసంవత్సరంలోకంటె దాదాపు మూడింతలు హెచ్చు. ఇందుకై ఈ సంవత్సరం వ్యయింపబడ్డ రొక్కం 15,98,311 రూపాయలు. క్రిందటి సంవత్సరం 5,87,462 రూపాయలే. బీహారులోను ఉత్తరప్రదేశంలోను పశ్చిమబంగాళంలోను అనావృష్టిబాధితులకు సాహాయ్యం చేయబడింది. సాహాయ్యకార్యక్రమం బీహారులో 1966 లో ప్రారంభమై 1967 అక్టోబరు కడపటివఱకు సాగింది. ఉత్తరప్రదేశంలో 1967 సెప్టెంబరు వఱకు సాగింది. పశ్చిమబంగాళంలో 1967 అక్టోబరు తుదవఱకు సాగింది. అన్ని రాష్ట్రాలలో 1967-68 సంవత్సరంలో అనావృష్టిబాధితజనోద్ధరణకై వ్యయింపబడ్డ రొక్కం మొత్తం 7,23,215.17 రూపాయలు. 1967 సెప్టెంబరు నుండి డిసెంబరువఱకు పశ్చిమబంగాళం మిద్నపూరు జిల్లాలో వఱదబాధితులకై సాహాయ్యకార్యక్రమం 3,05,141.72 రూపాయల వ్యయంతో నిర్వర్తింపబడినది. 1967 నవంబరులో ఢిల్లీ కేంద్రంవారు వఱదబాధితులకై సాహాయ్యకార్యక్రమాన్ని పరిమితంగా కావించారు. ఒరిస్సారాష్ట్రంలో కటకజిల్లాలో తుఫాను బాధితులకు సాహాయ్యకార్యక్రమం 1967 నవంబరులో ప్రారంభమై 1968 మార్చి కడపటివఱకు సాగింపబడినది. అందుకైన రొక్కవ్యయం 12,848 49 రూపాయలు. రాంచిలో కొట్లాటలవలన నష్టపడిన వారికై కోయినానగరులో భూకంపబాధితులకై సాహాయ్యకార్యక్రమాలు 1967 నవంబరు డిసెంబరులనుండి 1968 మార్చి కడపటివఱకు సాగుతూనే వచ్చాయి. బాధితప్రజలకు పంచిపెట్టబడ్డ ఆహారధాన్యం 2,398 టన్నులు 7 క్వింటలులు. పాలపొడి 54 టన్నులు 11 క్వింటలులు 42 కిలోగ్రాములు. వస్త్రములు ఉడుపులు 91,291; కంబళ్లు 17,509. ఎనామిలుసామగ్రి 5,004. ఈ కార్యక్రమాలలో మిషనువారికి వివిధరాష్ట్రప్రభుత్వాలు మిక్కిలి తోడ్పడినవి. ప్రధానమంత్రి సాహాయ్యనిధినుండి కూడా విరాళం లభించింది. ఉదారమహాజనులు రొక్కరూపంలోను వస్తురూపంలోను తోడ్పడడమే గాక శ్రమదానం చేశారు. అందటిపట్ల మిషనువారు కృతజ్ఞులై యున్నారు.

## విదేశాలలో కార్యక్రమం

ఉత్తరదక్షిణ అమెరికాలలోను ఐరోపాలోను ఆసియాలోను వివిధకేంద్రాలు భారతదేశసందేశాన్ని ఉపదేశంద్వారా గ్రంథప్రచురణద్వారా వ్యాపింపజేస్తున్నాయి.

## ఆధ్యాత్మిక సాంస్కృతిక కార్యక్రమం

మతమిషనులు రెండును తమ వివిధకార్యక్రమాలగుండ అన్నిమతములును సత్యమే అనెడి శ్రీరామకృష్ణు నుపదేశమును కార్య

రూపంలో ప్రదర్శించారు. ఉత్సవాదిసందర్భాలలో ప్రతికేంద్రంవారు వివిధమతాలవారిని సమావేశపఱచేవారు. గ్రంథాలయాలు పత్రికా పఠనాలయాలు సంస్కృతచతుష్పాఠులు నిర్వహింపబడ్డాయి. కనీసం 10 కేంద్రాలవారు వివిధభాషలలో గ్రంథాలను మాసపత్రికలను ప్రచురిస్తున్నారు. గ్రంథప్రచురణం చురుకుగా సాగిన కేంద్రాలు మాయావతి, బాగ్బజారు (కల్కత్తా), మదరాసు, నాగ్పూరు, మైసూరు, రాజ్కోట, భువనేశ్వరం, తిరుచూరు. ముఖ్యంగా కల్కత్తాలోని కల్చరిల్ ఇన్స్టిట్యూటువారు విశ్వమానవులకు సాంస్కృతికసౌభ్రాత్రం వర్ధిల్లజేసే కార్యక్రమాలు సాగిస్తున్నారు.

### వార్షికోత్సవాలు

మఠ కేంద్రాలలో మిషను కేంద్రాలలో శారదా-రామకృష్ణ-వివేకానంద ప్రముఖ యోగుల ప్రవక్తల జయంతిమహోత్సవాలు జరుపబడ్డాయి. ఆ ఉత్సవాలలో ముఖ్యకార్యక్రమాలు ప్రత్యేకపూజ హోమం పవిత్ర గ్రంథాలపారాయణం భజన సంకీర్తనలు, దరిద్రనారాయణ దిగంబరమహాదేవ సంతర్పణలు ప్రముఖుల ఉపన్యాసాలు. ఈవిధంగా శ్రీరామకృష్ణునియొక్క ప్రత్యక్షశిష్యులయొక్క సందేశం వ్యాపిస్తూ ఉంది. యువకులలో మఠ మిషనుల ఆదర్శాల పరిజ్ఞానం పెరుగుతూంది.

సాయపడిన ఉదారమహాజనులకు మా విజ్ఞప్తులను నివేదికలను ఆదరంతో ప్రచురించిన పత్రికాధిపతులకు వైద్యాదిసేవను ఉచితంగా చేసిన వైద్యులకు ఇంజనీర్లకు లాయర్లకు మా కృతజ్ఞతను తెలుపుకుంటున్నాం. వీరి తోడ్పాటు ఈలాగే ఎప్పుడూ లభిస్తుండగలదని విశ్వసిస్తున్నాం. భగవదనుభవప్రాప్తికి సోదర మానవసేవ అద్భుతావకాశం. యువకులందఱు వివేకానందస్వాముల శంఖారావము నాలకించి దీనప్రజోద్ధరణసేవకు తమ జీవితాల నంకితం చేసికోవలసిందని ప్రార్థిస్తున్నాం.

## గ్రం పరిచయం

### శ్రీమదుమామల్లేశ్వరశతకము

రచయిత కీ. శే. విప్పర్తి శ్రీరాములుగారు
ప్రచురణకర్తయూ ప్రాప్తిస్థానమునూ విప్పర్తి హరెప్ప, కన్నాయకుముదవల్లి, తణుకు తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా. మూలం పుటలు 38, లఘుటీక పుటలు 26, వెల 1-50

ఇది శ్రీమదాదిశంకరుల శివానందలహరికి ఆంధ్రానువాదం. 108 సీసపద్యాలు. ప్రతిదానికన్నీ అనుబంధం తేటగీతి. ప్రతిపద్యానికి మకుటం "గిరిసుతాకాంత, విప్పర్తిపురనిశాంత, భానుసంకాశ, మల్లేశ, భవ, మహేశ." 11-వ, 12-వ పుటలలో 'నిరోష్ట్య' మనెడి అశుద్ధరూపమును త్రోసి 'నిరోష్ఠ్య' మనెడి సాధురూపమును నెలకొల్పడం ప్రాప్తం. ప్రతి పద్యమూ ధారాసంపన్నంగాను శబ్దార్థాలంకారమండితంగాను, 'పాఠ్యే గేయ చ' మధురంగాను పొందువడియున్న యీశతకం స్పృహణీయమైనది. 'గర్భ' 'బంధ' కవిత్వాలలో రచయిత సిద్ధహస్తులు. భక్తజనులందఱూ బ్రహ్మానందానుభూతికై తప్పక చదవవలసిన శతకం ఇది.

ప్రభాకర్

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# శ్రీరామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల గావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

---

నూతన ముద్రణము : | ఇప్పుడే వెలువడినది :

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో గావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము – రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

---

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషను (సేవాసంస్థ): తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషను ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికాధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధక్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్షవీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము ౨౬ ౧౯౭౦ - జూన్ : సాధారణ - జ్యేష్ఠము సంచిక ౧౨

## విషయసూచిక



ఫోన్ : 71231 శ్రీ రామకృష్ణప్రభ పోస్టు బాక్సు : 635

1. 1969 జూలై నుండి శ్రీరామకృష్ణప్రభ ఇరవైఆఱవసంపుటం జరుగుతూ ఉంది.
2. చందావివరాలు : ఇండియాలో రూ. 5-00; సిలోనులో రూ. 7-00. విడిసంచిక 50 పైసలు.
3. చందాదారులు జాబులలో తమచందాదారుసంఖ్యను చిరునామాను స్పష్టంగా వ్రాయాలి.
4. సంచిక అందకపోతే వారంరోజులలో తెలియజేయాలి.
5. మేము ప్రచురించిన తెలుగుగ్రంథాలలో అనేకములు శ్రీరామకృష్ణప్రభ చందాదారులకు తక్కువవెలకు అందజేయబడును. వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.
6. శ్రీరామకృష్ణప్రభ ప్రముఖసంస్కృతీకేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మికవిజ్ఞానపత్రిక. అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకం. రేట్లకు వ్రాయండి.
7. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపాలని గ్రంథకర్తలకు, ప్రకాశకులకు మా ప్రార్థన.

తక్కిన వివరాలకు ఈ చిరునామాకు వ్రాయండి :—

మేనేజరు : శ్రీరామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీరామకృష్ణమఠం, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాండర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

**అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు**

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకులవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

**232 పుటలు** మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: **మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**

'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనిక్కృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౬ } ౧౯౭౦ - జూన్ :: సాధారణ - జ్యేష్ఠము { సంచిక ౧౨

## పరమార్థస్తుతి

మూలకర్త:
శ్రీ వేదాంత దేశికులవారు

వ్యాఖ్యాత:
శ్రీమత్కాంచీ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి.

(గత సంచిక తరువాయి)

కమలా నిరపాయధర్మపత్నీ కరుణాద్యా స్స్వయ మృత్విజో గుణాస్తే
అవనం శ్రయతా మహీన మాద్యం స చ ధర్మ స్త్వదనన్యసేవనీయః. 5

కమలా=శ్రీమహాలక్ష్మి, నిరపాయధర్మపత్నీ=ఎన్నడును ఎడబాయని ధర్మపత్నిగా నున్నది. కరుణాఅద్యాః=కరుణ మొదలయిన, తేగుణాః=నీగుణములు, స్వయం=తామే, ఋత్విజః=ఋత్విక్కులుగ నున్నవి. శ్రయతాం = ఆశ్రయించినవారిని, అవనం = రక్షించుటే, అహీనం ఆద్యం=ఉత్తమఫలముగ నున్నది. సః ధర్మః చ=ఆశ్రితరక్షణ మనెడి ఆధర్మము త్వత్ అనన్య సేవనీయః = నీకంటె నితరులయినవారికి అనుష్ఠింపశక్యము కానిది.

'ఆహవ' మను పదమునకు యుద్ధ మనియు యజ్ఞ మనియు రెండర్థము లున్నవి. ఆహవపుంగవు డనగా యుద్ధసమర్థుడు యాగసమర్థుడు అను రెండు విధముల అర్థము గ్రహింప వచ్చును. అందలి రెండవయర్థమును చిత్తగించి ఈశ్లోకమున సమర్థించుచున్నారు. యజ్వకు పత్ని ప్రక్కనే యుండవలయును, భగవంతు నెడబాయక లక్ష్మి ప్రక్కనే యున్నది. ఋత్విక్కు లుండ వలయును, ఆస్థానమున నిట భగవంతుని కరుణాదిగుణము లున్నవి. ఆశ్రితసంరక్షణమే పరిష్ఠమయిన యీ యజ్ఞఫలము 'అహీనం ఆద్యం' అనియు 'ఆద్యం అహీనం' అనియు రెం డన్వయక్రమములు పొసగును. మొదటిక్రమమున అర్థము ''తఱుగనిఫలము.'' రెండవ క్రమ

మున అర్థము "పరిష్కృతమైన అహీన మనెడి యాగము". అహీనసత్రమునుగూర్చిన విచారము పూర్వ మీమాంసలో మూడవఅధ్యాయమున మూడవపాదములో ఉన్నది. యజుర్వేదమున ఆఱవకాండలోని "త్రిస్రో ఽహీనస్య యజ్ఞస్య" "ద్వాదశాహీనస్య యజ్ఞస్య" అనెడి వాక్యాలను గుర్తింపుడు. ఈశ్లోకపూర్వార్థమును లోతునకు దిగి చూతు మేని లక్ష్మీసాన్నిధ్యముననే భగవంతుని కృప మెఱుగుదేఱు నను నర్థము దేశికులవారికి ఇట వివక్షిత మని తెలియును. రామబాణహతుడైన వాలి రామునితో "సీతాదేవి నీపజ్జ నుండె నేని ఇట్లు క్రూరముగ ప్రవర్తించియుండవు, ఆమె ఎడసి యున్నందుననే ఇట్లు క్రూరముగ నడచుకొంటి" వని చెప్పినట్లు కంబమహాకవి తన రామాయణమున తెల్పియున్నాడు. మహాకవి వేంకటాధ్వరియు లక్ష్మీసహస్ర మను గ్రంథమున "త్వయ్యే వాయతతే కృపా రఘుపతే ర్దేవస్య సత్యం యతో వైదేహి, త్వదసన్నిధా భగవతా వాలీ నిరాగా హతః నిన్యే కాపి వధం వధూః, స్తవ తు సాన్నిధ్యే త్వదఙ్గవ్యథాం। కుర్వాణో ఽప్యవితః పత న్నశరణః కాకో వివేకోజ్ఝితః" అను శ్లోకమును వ్రాసియున్నాడు. దీని తాత్పర్యము:- వైదేహి, రఘునాథదేవుని కృప నీయధీన మనుట నిజము. మగువను జంపుటయు నిరపరాధియగు వాలిని జంపుటయు రాముడు నీ పరోక్షమున చేసినాడు. వివేకహీనుడైన కాకాసురుడు నీమేనిని గాయపఱచిన మహాపాతకియైనను నీవు సమక్షమున నుండుటచే కాపాడబడినాడు."

> కృపణా స్సుధియః కృపాసహాయం శరణం త్వాం రణపుఙ్గవ ప్రపన్నాః
> అపవర్గనయా దనన్యభావా వరివస్యారస మేక మాద్రియన్తే. 6

రణపుఙ్గవ = ఓయుద్ధవీరా, కృపణాః = అకించనులైన, సుధియః = వివేకులు, కృపాసహాయమ్ = కారుణికుడవగు; త్వాం = నిన్ను, శరణం ప్రపన్నాః = రక్షకునిగ ఆశ్రయించినవారై, అనన్యభావాః = పరమైకాంతులై, అపవర్గనయాత్ = మోక్షదశకంటెను, వరివస్యారసమేకమ్ – ఇహలోకమందే నీకు కైంకర్యము చేయుచుండుటయందలి ఆనందానుభూతిని మాత్రమే ఆద్రియన్తే = అభిలషింతురు.

అకించను లనగా "న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ" "నాకు ధర్మమందు నిష్ఠ లేదు, ఆత్మజ్ఞానము లేదు" అని యుండువారు. "సుధియః" వివేకులు అనగా [illegible] ము తప్ప వేఱొక్క తపశ్చర్యకు పూనకుండు అధ్యవసాయము కలవారు. "పాషాణకల్పతయే ముక్తి" అని కొంద ఱనిరి. "ఆత్యంతికదుఃఖధ్వంసమే ముక్తి" అని కొంద ఱనిరి. అట్లుకాక పరమ సామ్యాపత్తియే ముక్తి అని యుండువారికి కైంకర్యసామ్రాజ్యమే బ్రహ్మానంద మగు నని తెల్పబడినది. ఆ బ్రహ్మానందమును ఇహలోకముననే అనుభవింపగోరుదు రట పరమైకాంతులు. శ్రీకూరనాథులు శ్రీవైకుంఠస్తవమున "త్వత్సామ్యమేవభజతామభివాంఛసి త్వమ్" అనుశ్లోకమున "త్వద్దాస్య మేవ విదుషాం పరమం మతం తత్" అనిన శ్రీసూక్తిని ఇచ్చట అనుసంధించుకొనవలెను.

అవధీర్య చతుర్విధం పుమర్థం భవదర్థే వినియుక్తజీవిత స్సన్
లభతే భవతః ఫలాని జన్తు ర్నిఖిలా న్యత్ర నిదర్శనం జటాయుః. 7

జన్తుః = ఏప్రాణియైనను, చతుర్విధమ్ పుమర్థం = ధర్మార్థకామమోక్షము లనెడి పురుషార్థములు నాల్గింటిని, అవధీర్య = లక్ష్యపెట్టక, భవదర్థే = నీకొఱకు, వినియుక్తజీవితఃసన్ = జీవితమును సమర్పించినవాడగునేని (అతడు) భవతః = నీయొద్దనుండి, నిఖిలాని ఫలాని = సకల ప్రయోజనములను, లభతే = పొందును. అత్రనిదర్శనమ్ = ఇందుల కుదాహరణము, జటాయుః = జటాయువే.

నాలుగుపురుషార్థములలో ఏదియు నక్కఱ లేదు. భగవంతునకు ఉపయోగపడుటయే ఆత్మకు కావలసినది అనెడి అధ్యవసాయము కలవారికి భగవంతునొద్దనుండి సకలఫలములును లభించును. అట్లు లభింపగన్నవారు ఎవరైన నున్నారా అనిన జటాయుమహారాజున్నాడు అనుచున్నారు. ధర్మము అర్థము కామము అనెడి త్రివర్గమును అపేక్షింపకుండుట ముముక్షువులకు సహజమే. మోక్షముసైత మపేక్షింపకుండుట భగవత్కైంకర్యరసజ్ఞులవిశేషము. 'జటాయువును పిళ్ళైతిరునఱైయూరరయరును దేహము నుపేక్షించిరి' అనెడి శ్రీవచనభూషణ దివ్యసూక్తి నిచ్చట ననుసంధించుకొనవలయును.

శరణాగతరక్షణవ్రతీ మాం న విహాతుం రణపుఙ్గ వార్హసి త్వమ్
విదితం భువనే విభీషణో వా యది వా రావణ ఇ త్యుదీరితం తే. 8

రణపుఙ్గవ = ఓ యుద్ధవీరా, శరణాగతరక్షణవ్రతీ = మఱుగుజొచ్చినవారిని కాపాడుటయే వ్రతముగా గల, త్వం = నీవు, మాం = నన్ను, విహాతుం నార్హసి = త్యజించుట తగదు. "విభీషణో వా యది వా రావణః = ఓ సుగ్రీవా, విభీషణుడే కాని స్వయముగ రావణుడే కాని, ఇతి = అని, తేఉదీరితం = నీవు వాక్రుచ్చిన వాక్యము, భువనే విదితమ్ = లోకమున ప్రసిద్ధమై యున్నది.

స్వామీ, రణపుంగవా. శరణాగతులను తప్పక రక్షించువ్రతము పూనిన నీవు నన్ను విడుచుట తగదు అని దేశికులవారు చెప్పిరి. అందుకు భగవంతుడు "నాయనా, శరణాగతులను తప్పక రక్షించువ్రతము నా కుండుట నిజమే, కాని నీవు శరణాగతుడవు కావే, నీరక్షణము నాకెట్లు కర్తవ్య మగును?" అని యడిగినట్లు భావించుకొని దేశికులవారు అందులకు జవాబును ఈశ్లోకమున ఉత్తరార్ధమున చెప్పుచున్నారు. నిజముగ శరణాగతులు కాక శరణాగతుల వేషము వేసికొని సమీపించినవారిని సైతము కాపాడుటకు భగవంతు డుబలాటపడుచుండు ననుట శ్రీరామాయణప్రసిద్ధము కదా. విభీషణుడు వచ్చి శ్రీరాముని శరణు జొచ్చెను. 'వీనిహృదయము శుద్ధము కాదు. వీని నంగీకరింపరాదు' అని సుగ్రీవప్రముఖులు చెప్పిరి. అప్పుడు శ్రీరాముడు "మిత్రభావేన సమ్ప్రాప్తం న త్యజేయం కథఞ్చన" "నీకు మిత్రుడను అని చెప్పుకొనుచు వచ్చువానిని ఎంతమాత్రమును త్యజింపను" అని స్వసిద్ధాంతమును చెప్పి "ఆనయైనం హరిశ్రేష్ఠ దత్త మస్యాభయం మయా। విభీషణో వా సుగ్రీవ యది వా రావణః స్వయం" "వాన

రోత్తమా, వానిని పిలుచుకొనిరమ్ము. అతనికి నే నభయ మిచ్చితిని. అతడు విభీషణుడైనను పిలుచుకొనిరమ్ము. నన్ను వంచించుటకై విభీషణుని వేషమున వచ్చిన రావణుడే యైనను పిలుచు కొనిరమ్ము.'' అని యానతిచ్చెను. మనఃపూర్వకముగ కాక కేవలము వాఙ్మాత్రముగ శరణు అని చెప్పినను తప్పక కాపాడువాడవు కదా నీవు. మహాపరాధియగు రావణునే కాపాడ సిద్ధ పడిన నీవు న న్నంగీకరించుట చెప్పవలెనా?

> భుజగేన్ద్రగరుత్మదాదిలభ్యై స్త్వదనుజ్ఞానుభవప్రవాహభేదైః
> స్వపదే రణపుఙ్గవ స్వయం మే పరిచర్యావిభవైః పరిష్క్రియేథాః. 9

రణపుఙ్గవ = ఓయుద్ధవీరా, భుజగ + ఇన్ద్రగరుత్మద్ + ఆదిలభ్యైః = ఆదిశేషుడు గరుత్మంతుడు మున్నగు నిత్యసూరులకే లభింపదగినవియు, త్వత్ = నీ, అనుజ్ఞా + అనుభవ ప్రవాహభేదైః = అనుజ్ఞాకైంకర్యవిశేషములును, స్వపదే=భగవత్పాదారవిందవిషయములును అగు మేపరిచర్యావిభవైః = నాకైంకర్యములచే, స్వయం = నిన్ను నీవే, పరిష్క్రియేథాః = పరిష్కరించుకొమ్మా.

భగవత్కైంకర్యము ఆజ్ఞాకైంకర్య మనియు అనుజ్ఞాకైంకర్య మనియు ఇరుతెఱంగులు. శ్రుతిస్మృతివిహిత నిత్యనైమిత్తికకర్మములు ఆజ్ఞాకైంకర్యములు. దీపసమర్పణము మాలార్పణము మున్నగునవి అనుజ్ఞాకైంకర్యములు. ఉపాయనిష్ఠులు ఆజ్ఞాకైంకర్యములం దెక్కువ ఊనిక గల్గి యుందురు. ఉపేయపరులు అనుజ్ఞాకైంకర్యములం దెక్కువ ఊనిక గల్గియుందురు. 'ఉపేయపరులలో నన్ను చేర్చుకొ' మ్మని శ్రీదేశికులవా రిందు ప్రార్థించుచున్నారు. దేవతాంతర్యామి యగు భగవంతు డాజ్ఞాకైంకర్యములకు లక్ష్యము. అర్చారూపియగు భగవంతు డనుజ్ఞాకైంకర్యములకు లక్ష్యము. అర్చావతారమం దత్యంతప్రతిపత్తి గలవా రగుటచే దేశికులవారు అనుజ్ఞాకైంకర్యనిష్ఠను కోరుట సహజమే కదా. నిత్యసూరులగు అనంతగరుడవిష్వక్సేనాదులు సదా అనుజ్ఞాకైంకర్యమందు కదా ఆసక్తి గల్గియుండునది. స్తోత్రరత్నమున శ్రీయామునాచార్యులవారు ''కదాఽహ మైకాన్తిక నిత్యకిఙ్కరః ప్రహర్షయిష్యామి'' ''ఏకాంతిక నిత్యకింకరుడనై దాసుడను (నిన్ను) ఆనందింపజేయు టెన్నడో'' అని ఆనతిచ్చియున్నారు. అచటి యర్థవిశేషము తెలియగ శ్రీదేశికులవారి స్తోత్రభాష్యమును గనవలయును. తదనుగుణముగానే శ్రీదేశికులవా రిచ్చటను 'మే పరిచర్యావిభవైః పరిష్క్రియేథాః' 'నాసేవలచే పరిష్కరించుకొమ్మా' అని ప్రార్థించిరి. శేషభూతుని కైంకర్యముచే ఆనందము శేషికే అనుట సత్సంప్రదాయ సారార్థము. కావున ఇట 'మే' అనుటకు బదులు ఎల్లెడల గానవచ్చుచున్న 'మాం' అను పాఠాంతరము అసంగతము.

> విమలాశయవేఙ్కటేశజన్మా రమణీయా రణపుఙ్గవప్రసాదాత్
> అనసూయుభి రాదరేణ భావ్యా పరమార్థస్తుతి రన్వహం ప్రపన్నైః. 10

రణపుఙ్గవప్రసాదాత్ = విజయరాఘవస్వామి యనుగ్రహముచే, విమల+ఆశయ = విమలమతియగు వేఙ్కటేశజన్మా = శ్రీవేంకటనాథునినుండి అవతరించిన రమణీయా = పరమ భోగ్యమగు, పరమార్థస్తుతిః = ఈ పరమార్థస్తుతి, అనసూయుభిఃప్రపన్నైః = అసూయారహితులగు ప్రపన్నులచే, అన్వహం = ప్రతిదినమును ఆదరేణభావ్యా = ఆదరముతో అనుసంధింపబడతగినది.

ఈస్తుతిలో మొదటిశ్లోకమే ఫలశ్రుతిరూపమున అవతరించియున్నందున కాబోలు తుదిశ్లోకమున ఫలమును చెప్ప లేదు.

పరమార్థస్తుతి సమాప్తము.

# బుద్ధదేవు నుపదేశము

బుద్ధదేవుని అవతారమేమి, మహాభినిష్క్రమణమేమి, మహాపరినిర్వాణమేమి—సంభవించినదినము వైశాఖపూర్ణిమ. లోకకల్యాణమే లక్ష్యముగా స్వీయజీవితమును గడపిన ఆ లోకోద్ధారకుని సంస్మృతిసమావేశములు మహోత్సవములు లోకమంతట వైశాఖమాసమున జరుగుచుండును కదా. ఈ శుభసమయమున మా ప్రార్థన: విశ్వమానవు లందఱును మే లొందుదురుగాక.

'సర్వే జనా స్సుఖినో భవన్తు' అను మంగళాశంస సాధారణసముదాచారమై ఏర్పడినది. మనలో అధికసంఖ్యాకులకు కోరిన సుఖములు కలుగకున్నను నిరీక్షింపని కష్టపరంపరలు ముంచుకొనివచ్చుచున్నను 'సుఖము కలుగత' అను ఆశంస చేయబడుచునే యుండును. కలహకల్లోలములతో ద్వేషాసూయలతో పిక్కటిల్లుచున్న యీ లోకమున 'అందఱికిని సుఖము కలుగుత' అని పల్కుట కేవలాచారమాత్రమే కాని దానికి వేఱెట్టి సార్థకతయు లేదని తోచును. కాని ప్రజల సహజచేష్టయైన యీశుభాశంస మోఘమైనది కాదు. 'అందఱు సుఖంతురు గాత' మను నభిలాష వట్టినోటిమాట గాక హృదయపూర్వకమైనదగునేని అది అమోఘ మగుట కడ్డు లేదు.

ఇతరులకు సుఖము కలుగుగాక అను కోరిక మన మనస్సులకు చక్కని వ్యాయామమగును. ఈ యలవాటు దుఃఖానుతాపభుగ్నమగు మనస్సును సరిపఱచు నౌషధము. విశుద్ధహృదయులమును సత్యనిష్ఠితులమును కానిచో ఎవరికి శుభమును మనము కోరుదుమో వారికి మనకోరిక కార్యకరము కాజాలదు. ఇతరులు సుఖపడవలె నను మనకోరిక హృదయపూర్వకమగునేని, అందుచే మనమే లాభపడుదుము. మన సంకుచితహృదయములకు వ్యాకోచము కలుగ నారంభించును.

ఇతరులకు శుభమును గోరుట నలవఱచుకొనవలసిన మనము, మొదట సన్నిహితులకును ప్రీతిపాత్రులకును సుఖమును కోరుటతో ఆరంభింపవలయును కాని అది అంతతో ఆగ

కూడదు, సకలవిశ్వమును తనలో నిముడ్చుకొనగలంతగా అది పెంపొందవలెను.

నిజమునకు ప్రపంచమంతయు మనకు సొంతమే. ఎవరినేని పరాయివానినిగా భావించుట అజ్ఞానమును క్రూరతయునే. అందఱికిని సుఖమును కోరగలవారముగ మనము పరిణమించువఱకును, నిజమైన సుఖము మనకు దుర్లభము.

ఏ కారణముచేతగాని కొందఱిని పరాయివారని శత్రువులని మనము భావించినను వారికిని సుఖము గలుగవలెనని మనఃపూర్వకముగా మనము కోరవలెను.ఇది చాలముఖ్యము. ఆలాగు కోరు హృదయౌదార్యము తొలుత మనకు లేకున్నను వివేకముచేతనైనను ఆలాగు కోరుదుముగాక. యుద్ధములో కాని శాంతిలో కాని సుఖములో కాని దుఃఖములో కాని ఆశలో కాని నిరాశలో కాని అన్యులతో మనము పాలు పంచుకొనక తప్పదు. కష్టములు మనశత్రువులకు గలుగునేని అందొకపాలు మనకును కలుగక తప్పదు. కావున శత్రువులకు నైతము సుఖములే గలుగవలెనని హృదయపూర్వకముగ నభిలషింప మనము నేర్చుకొందము గాక.

శత్రువునకు సుఖము కలుగుగాక అని హృదయపూర్వకముగా కోర నలవఱచుకొనుట అంత సులభమైన పని కాదు. కాని అన్నిపనులును సులభములుగనే ఉండునా, ఏమి? ఉన్నతుల నందగోరినప్పుడు మనము నేర్చుకొనవలసిన పాఠములు కష్టములుగ నుండును.సోపానములు నిట్రములుగ నుండును. ఎంతో సాహసము కావలయును. కాబట్టి ఇందు నెగ్గుటకు మనము వివేకమును కౌశలమును సౌజన్యమును సేకరించుకొనవలయును. హృదయమును విశుద్ధమొనర్చుకొనుటకు ఎంతో పాటుపడవలయును. పడినచో మనఃపరిణతి కలుగును. విశ్వశ్రేయఃకాంక్షలు మంగళాశంసలు హృదయమునుండి యుప్పొంగును.

లోకమునకు సర్వశ్రేయములు కలుగవలెననిన అటువంటి మనఃపరిణతిని మనలో కలిగించుకొన ప్రయత్నింపవలయును. ఈ మనఃపరిపాకము గడించు టెట్లు అనునది నేడు ముఖ్యమైన ప్రశ్న. నేడే కాదు. ఎల్లప్పుడును అదే ముఖ్యప్రశ్నగా నుండగలదు. అమోఘమైన రీతిని లోకకళ్యాణము నభిలషించుశక్తి మన మనసులలో ముందే యున్నది కాని కృషిలోపముచే వాడుపాటు చెందియున్నది. ఈశక్తిని, నిరంతరసాధనలచే మేలుకొలుపవలయును. ఈ సాధనలను ఒక ఆధ్యాత్మిక మహాచార్యునొద్దనుండి మెలకువతో గ్రహింపవలయును. ఆ మహాచార్యుడు తనలో ఇట్టి మనఃపరిపాకమును పెంపొందించుకొన్నవాడుగ నుండవలయును. అటువంటి మహాచార్యుడు గౌతమబుద్ధదేవుడు.

వ్యష్టిమనస్సులచే సమష్టిసంక్షేమమును సాధించుటెట్లు అనుటనుగూర్చి బుద్ధదేవుడు కావించిన గంభీరోపదేశములు 'మెత్తసుత్త'లో అత్యంతసరళవాక్యములలో పొందుపఱుపబడియున్నవి. సాధకుని ధ్యానమునకు కొన్ని సూచనలు అందు కావింపబడియున్నవి. నీతిశాస్త్రసారమును పారమార్థికపరత్వపు హృదయమును ఆ సూచనలలో కలవు:— చెప్పియున్నారు. సకలప్రాణులకును సౌఖ్యభద్రతలు చేకూరునుగాక. అందఱును అందఱి సుఖమును కోరువారుగ నుందురుగాక. దుర్బలములు ప్రబలములు, పొడుగైనవి గొప్పవి నడితరమువి పొట్టివి చిన్నవి పెద్దవి అగపడు

నవి అగపడనివి సన్నిహితములు దూరస్థితములు పుట్టినవి పుట్టనున్నవి—అగు సకల ప్రాణులును సకలప్రాణుల సుఖమును నభిలషింతురు గాక.

ఇతరులకు లేక మనకుమాత్రమే సుఖము కలుగవలె నని కోరుకొనుట దుఃఖములు తప్పక వచ్చిపడుటకు తలుపు తీసియుంచుటే. అందఱు కష్టపడుచుండగ మనకు మాత్రము సుఖము కలుగునేని ఆ సుఖమును దక్కించుకొనుటకు మనము పడు కష్టములు ఇతరులనుభవించుచున్న కష్టములను మించిపోవును. కావున సుఖము అందఱికిని తప్పక కలిగినప్పుడే మనసుఖము మనకు దక్కును. విశ్వమునంతటిని మనము సుఖముతో నింపుదుమేని ఆ సుఖములో మనభాగము నిర్బాధము.

కావున అందఱును సుఖపడవలె నని కోరుటను అలవఱచుకొనుటే మన మెక్కవలసిన మొదటి మెట్టు. అందఱును అందఱి సుఖమును కోరుదురు గాక అని మహాచార్యుడు బోధించి యున్నాడు. అనగా ప్రతిమనస్సును సౌఖ్యమును అందఱికిని తనకును కలిగించుకొనవలె ననుట. ఇందుకు సాధకములైన పనులను నిర్వహింప మన జీవితముల నంకితము చేసికొనవలయును.

అందఱును సుఖపడవలె నను కోరిక మనఃపూర్వకముగ మనకుండునేని అప్పుడు అన్యులను వంచింప దూషింప హింసింప ప్రసక్తి ఏది? 'మెత్తసుత్త'లో ఇంకను ఇట్లు కలదు: "ఎవడును ఎవనినిగాని వంచింపకుండునుగాక. ఎవడును ఎవనిని ఎచ్చటను దూషింపకుండును గాక. కోపముచేత ఎవడును ఎవనిని హింసింపకుండును గాక."

కేవలము అభిలషించుట మాత్రము కాదు ఇచ్చట బోధింపబడుచున్నది. బహిరంతరముల నిరంతరముగ సాగవలసిన సాధనయే ఇది. "తల్లి తనప్రాణమునకైనను తెగించి శిశువును, ఏకైకశిశువును ఎట్లు రక్షించుకొనునో అట్లు ప్రతిప్రాణియు సర్వప్రాణులపట్ల నిరవధిక ప్రేమను అలవఱచుకొనునుగాక." ప్రపంచమున నేడు మనకు కావలసినది సర్వప్రాణులపట్ల నిరవధికమును త్యాగప్రవణమును అగు ప్రేమ, ప్రాణప్రియమగు ప్రాణిని కాపాడుటకై నిర్భయముగ మృత్యువునైనను ఎదిరింపించు ప్రేమ. ప్రపంచమున మానవుల సంబంధబాంధవ్యములలో ప్రస్తుతవాతావరణమున మార్పును తేవలయునేని సకలప్రాణుల పట్ల ఇటువంటి మాతృహృదయమును అలవఱచుకొనవలయును.

నేనిట్లు నడచుకొన్నను ఇతరులిట్లు నడచుకొనకపోయినచో అప్పు డెట్లు అని అడుగకుడు. శిశుప్రాణమునకు ఆపదమూడినప్పుడు తల్లి అటువంటి ప్రశ్న లడుగదు. ఈ జగత్తు నీ భావనాశిశువు. నీవు తల్లివి. దాని కాపద కలిగినప్పుడు కాపాడుటకు ఇతరు లురవడించుచున్నారా లేదా అని నీవు నిరీక్షించుచుండవు. తల్లివైనచో నీవు తప్పక ఉరవడింతువు. తల్లిగ నుండు మని గురువుగ నుండు మని రక్షకుడవుగ నుండు మని సేవకుడవుగ నుండు మని నిన్ను కోరుచున్నారు. ఇది తర్కాతీతమైన భూమిక.

మనశక్తులు అమోఘములైనవి స్పష్టములైనవి. ప్రపంచమును క్రోధముతో ద్వేషముతో అసూయతో వంచనతో దుఃఖాపాదకములన్నింటితో నింపియున్నాము. ఇట్లు చేయగలిగిన మనము సంకల్పింతుమేని ఇందుకు విపరీతమైనదానినికూడ చేయగలము. మన

మిందులకు సమర్థుల మనెడి విశ్వాసము మహా చార్యునకు గలదు. కావున చెప్పుచున్నాడు. ''సకలప్రాణుల క్షేమమును గోర నలవఅచు కొందువు గాక. పైనగాని క్రిందగాని సమతల మునగాని అడ్డులేని ద్వేష శత్రుత్వరహిత నిరవధికప్రేమపూర్ణ మనస్సు నలవఅచు కొనుము.'' రవంత జాలి ఇంచుక యుపకారము అణుమాత్రౌదార్యము మనకు చాలవు. మన అక్కఅలనుబట్టి ప్రేమ నిరవధికముగ నుండ వలయును. మన ప్రేమతో ప్రపంచము పెక్కటిల్లవలయును.

ఇటువంటి మనఃపరిపాకమును పెంపొందించుకొనుట సుకరము కాదు. ఇందులకు శ్రద్ధయు సాధనయు ఆవశ్యకములు. బుద్ధదేవుడు కావించిన బోధనము ఈ లోకమున అందఱును శ్రేయమునొందుటకు అమోఘమైనది. కావున విశ్వక్షేమపరులకు ఆయన యుపదేశము అనుపేక్ష్యమైనది.

# శంకర సారస్వతము

## శ్రీ జాస్తి నరసరాజుగారు

శంకరాచార్లవారు క్రీస్తుశకం 788-వ సంవత్సరమునకున్నూ 820-వ సంవత్సరమునకున్నూ మధ్యకాలంలో వెలసియుండినా రని విద్వాంసులలో అధికసంఖ్యాకులు అంగీకరించుచున్నప్పటికీ, నిర్ణయానికి నిరాక్షేపములయిన దృఢాధారములు లభింపకున్నాయి. కొన్ని గ్రంథాల శంకర కర్తృత్వమునుగూర్చికూడా అవు నని కా దని అభిప్రాయభేదా లున్నాయి. విశ్వవిఖ్యాతములైన వ్యాఖ్యానాలు స్వతంత్ర గద్యపద్యగ్రంథాలు పెక్కులు అత్యంతమధుర ములైనస్తోత్రము లనేకములు శంకరాచార్య ప్రణీతము లని తలదాల్పబడుతున్నాయి.

శంకరాచార్లవా రవతరించినకాలంలో బౌద్ధసంప్రదాయం క్షీణదశలో ఉండింది, బౌద్ధమతప్రాబల్యం అతివేగంగా తగ్గిపోతూ ఉండింది. అద్వైతసిద్ధాంతప్రతిపాదకులైన శంకరులు బౌద్ధుల 'సంఘ' 'మఠ' వ్యవస్థలను చక్కగా వినియోగించుకొన్నారు.

తనకు ముందుండిన ద్రావిడాచార్యుల గ్రంథమును శంకరాచార్లవారే పేర్కొనిఉన్నారు. కాబట్టి శ్రీశంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమునకు ప్రవర్తకులును ప్రవర్ధకులునే కాని, అంతవఱకు లేని సిద్ధాంతమును తాము క్రొత్తగ కల్పించినవారుకాదు అనుట స్పష్టము. అద్వైతసిద్ధాంతం అనాదిగా ప్రసిద్ధమే.

ఆయనకాలంలో సూర్య - దేవీ-గణనాథ-శివ - విష్ణువు లనెడి పంచమూర్తుల పూజ అములులో ఉండింది. ఆ విధానాలను శ్రీశంకరులు సంస్కరించి సక్రమపఱచి అద్వైతసిద్ధాంతంతో జతపఱచారు. దీనికి పంచాయతనపూజ అని పేరు. ఇది ఇప్పటికీ పెక్కండ్ర ఆచరణలో ఉంటున్నది. నేపాళమునందలి గండకీగర్భమున లభ్యమగు సాలగ్రామరూపమున విష్ణుదేవుడు పూజింపబడుతాడు. సాలగ్రామారాధనము స్మృతులలోను ప్రస్తుతమైనది.

'నన్ను ఏయేచోట్ల స్మరిస్తుంటారో, వేదాంత సిద్ధాంతప్రవచనానుష్ఠానా లెక్కడెక్కడ సాగుతుంటాయో అక్కడ నా సాన్నిధ్యం ఉంటుంది.'' అని శ్రీశంకరులు స్వకీయశిష్యులకు చెప్పారు. వేదాంతసిద్ధాంతహృదయం ఈ క్రింది గేయంలో ఉంది.

> కాను నే బుద్ధిని, కాను నే మనము,
> కా నహంకారమన్, గాను చిత్తమను,
> కాను శ్రోత్రంబను, గాను జిహ్వాఖ్యను,
> కాను ఘ్రాణంబను, గాను నేత్రమను,
> కానుగా మన్ను నేఁ, గానుగా మిన్ను,
> కా నయా వాయువఁ గా నయా తేజు,-
> సచ్చిదానందుండ శంభుండ శివుఁడ.

శ్రీశంకరులకృతులలో అగ్రగణ్యములు ప్రస్థానత్రయముపై వారు వ్రాసిన భాష్యములు. ప్రస్థానత్రయ మనగా ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత. వేదాంతశాస్త్రమునకు ఇవి మూలప్రమాణగ్రంథములు.

వేదాంతసిద్ధాంతములను వేదవ్యాసులవారు చక్కని సూత్రములలో పొందిపఱిచారు. పరమార్థము అద్వైత మని చెప్పు వేదాంతశాస్త్రమునకు జగత్తు లేనే లేదనుట అర్థము కాదు. ఈవిషయమును శ్రీశంకరులు వేదాంతసూత్రభాష్యమున ఈలాగు స్పష్టపఱచియున్నారు :- పంచభూతములతోను జీవరాసులతోను పిక్కటిల్లుచుండు జగత్తునకు అభావమును కల్పించడం ఎవనికిని సాధ్యము కాదు. సాధ్యం అయ్యేటట్లుంటే తొట్టతొలి విముక్తినొందిన ఆత్మ, జగత్తును ఎన్నటికిని లేకుండా చేసి ఉంటాడు. సర్వమూ శూన్యమై యుండేది. బ్రహ్మసాక్షాత్కారం కలుగనంతవఱకు 'ఉన్నదంతా బ్రహ్మమే అని గుర్తించు, జగత్తును లయింపజేసుకో' అని లక్షసార్లు చెప్పినా అదీ సాధ్యం కాదు. ఇదీ సాధ్యం కాదు.

కలగంటూ ఉన్నంతసేపూ కలలో కనిపించేవన్నీ నిజములే. అల్లే, జీవబ్రహ్మైక్యానుభూతి కలుగకుండునంతవఱకున్నూ జగత్తు సత్యమే.

తాము విస్తరింపనున్న దానిని ముందు సంక్షిప్తంగా చెప్పడంలోనూ, గ్రంథోపోద్ఘాత ప్రకరణోపోద్ఘాత పరామర్శలలోనూ, పూర్వాపరవిషయాల సంబంధపఱచడంలోను శ్రీశంకరుల నేర్పు అద్వితీయం. వారి రచనలలోని గాంభీర్యవ్యంగ్యమహిమలను శైలీసముజ్జ్వలతను స్పష్టతను, ఆయనకు శిష్యుడును భక్తుడు నగు పద్మపాదుడు ప్రస్తుతించినంతకంటె ఎక్కువగ ప్రస్తుతించి ఎవరు చెప్పగలరు?

శ్రీశంకరులసూత్రభాష్యానికి వ్యాఖ్యాతలు ప్రతిభోజ్జ్వలులు ఎందఱో ఉన్నారు—భామతికారుడు వాచస్పతిమిశ్రుడు, కల్పతరుకర్త అమలానందస్వామి, పరిమళప్రణేత అప్పయ్యదీక్షితులు. వేదాంతశాస్త్రం అంటే (1) బ్రహ్మసూత్రములు, (2) శంకరభాష్యము, (3) భామతి, (4) కల్పతరువు. (5) పరిమళము—అనే ఈ ఐదు గ్రంథాలే అని గ్రహించడం సర్వసాధారణమై ఏర్పడింది.

తనవ్యాఖ్యాగ్రంథం మురికినీటి కాల్వవంటిదనిన్నీ శంకరభాష్యం గంగానదివంటిదనిన్నీ ఆగంగతోటి సంబంధంచేతనే ఈకాల్వకు పవిత్రత కలిగిందనిన్నీ వాచస్పతిమిశ్రుడు వ్రాశాడు. దుర్గ్రాహవిషయాలను స్పష్టపఱచవలసి వచ్చినప్పుడు (సాక్రటీసువలె) శ్రీశంకరులు ప్రశ్నోత్తరవిధానమును అనుసరిస్తారు. తార్కికుల పద్ధతికంటె ఈ పద్ధతి మిన్న యని శంకరులే చెప్పియున్నారు.

ఈశ - కేన - కఠ - ప్రశ్న - ముండక - మాండూక్య - తైత్తిరీ-యైతరేయ-ఛాందోగ్య బృహదారణ్యకము లనెడి ఉపనిషత్తులు పదింటి మీద శ్రీ శంకరులు భాష్యం అనుగ్రహించి యున్నారు. ఈ ఉపనిషద్భాష్యాలలో బృహదారణ్యకోపనిషద్భాష్య రోత్తమం అన్నారు. సర్వశ్రుతిసారార్థమును ఏతదుపనిషత్సారార్థమునైన జీవబ్రహ్మైక్యము ఈ ఉపనిషద్భాష్యంలో ప్రతిపాదింపబడినంత పౌంకంగా వే తెందునూ ప్రతిపాదింపబడలేదట.

శ్రీశంకరుల భగవద్గీతాభాష్యసౌందర్యం సర్వాతిశాయి యైనది. ప్రముఖగణ్యములైన వారి కృతులలో అదొకటి. వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధు లనెడి వ్యూహచతుష్టయప్రస్తావము భగవద్గీతలో లేదు. కాని ఆచతుర్వ్యూహములందు భక్తిప్రపత్తులు చెల్లించడం భాగవతసంప్రదాయసముదాచారం. శ్రీశంకరులు భగవద్గీతను భాగవతసంప్రదాయ గ్రంథముగా గణించి రన వచ్చు. నారాయణ పరత్వప్రస్తుతిపరమగు పురాణశ్లోకముతో కదా వారు భాష్యము నారంభించారు. వైదిక ధర్మం ప్రవృత్తి అని నివృత్తి అని యిరుదెఱంగులు. గీతోక్తక్రమమున శ్రీశంకరులు పరబ్రహ్మస్వరూపాన్ని విపులంగా వివరించి యున్నారు.

కురుక్షేత్రకదనరంగ పరిసరాలలో ఉప్పతిల్లిన శాస్త్రం భగవద్గీత. అది ధర్మసంస్థాపనకు అధర్మనిర్మూలనానికి కత్తికట్టుకొని ముందుకుఱుకు మనెడి శంఖారావం. ఫలాసక్తి లేక భగవదర్పితంగా అనుష్ఠితమగు ప్రవృత్తిధర్మం చేత చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధిచేత బ్రహ్మవిద్యాప్రాప్తి కర్హత కలుగుతుంది. బ్రహ్మవిద్యచేత ముక్తి చేకూరుతుంది. జ్ఞానయోగమునకు అందించుమెట్టు కర్మయోగమని శ్రీశంకరులు ప్రదర్శించారు. భగవద్గీత యందలి విశ్వరూపదర్శనయోగంలోని 55 వ శ్లోకం భగవద్గీతాసారమని శ్రీశంకరుల దివ్యచిత్తం—

మత్కర్మకృ న్మత్పరమో
మద్భక్త స్సఙ్గవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు
య స్స మామేతి పాణ్డవ. (XI-55)

"ఓయిపాండవా, ఎవడు నాకొఱకు సత్కర్మలు చేయునో, ఉత్కృష్టగతి నేనే అని నమ్మునో, అనేకప్రకారముల నన్నే ధ్యానించునో, తనబంధుపుత్త్రమిత్రకళత్రాదులయందు సంగమును సర్వప్రాణికోట్లయందు వైషమ్యమును లేకున్నాడో, — వాడు నన్ను బొందుచున్నాడు."

శ్రీశంకరుల గద్యగ్రంథములు-(1) బోధిని (2)ఆత్మజ్ఞానోపదేశవిధి(3)ఆత్మానాత్మవివేకము (4) పంచీకరణం. వారి స్వతంత్ర పద్యగ్రంథములు—(1) వివేకచూడామణి (580 శ్లోకములు) (2) ప్రబోధసుధాకరము (257 శ్లోకములు) (3) వేదాంతకేసరి (100 శ్లోకములు) (4) ఆత్మబోధ (68 శ్లోకములు) (5) అపరోక్షానుభూతి (144 శ్లోకములు).

ప్రారంభకుల కుపయోగపడు గ్రంథము అజ్ఞానబోధిని. జ్ఞానమార్గసాధకులకు మార్గదర్శకమైన గ్రంథము ఆత్మజ్ఞానోపదేశవిధి. ఆత్మ శుద్ధజ్యోతివంటి దట. బుద్ధి పటికమువంటిది. సాధకునకు ఉత్తేజకరముగ నుపయోగపడునది "ఆత్మానాత్మవివేకము". విషయవిభజనము ఈలాగు చక్కగ జేయబడినది: కామక్రోధ లోభమోహమదమాత్సర్యాలకు కారణము

అహంకారము. అహంకారానికి కారణము అవివేకము. అవివేకమునకు కారణము అవిద్య. అవిద్య అనిర్వాచ్యము, అనాది. సత్త్వరజస్తమోగుణములు మూడింటిచే రూపొందునది అవిద్య. అవిద్యను రూపు మాప గలది పరమార్థజ్ఞానము. "పంచీకరణ" మనునది గద్య గ్రంథము, అన్నిటికంటె చిన్నది, ఇది ఆత్మపరిణామక్రమమును వర్ణిస్తుంది. ఈ గ్రంథమునకు సురేశ్వరాచార్యులు వ్రాసినవృత్తియు ఆనందగిరి వ్రాసిన టీకయు ఉన్నవి. అద్వైతమును అనన్యాదృశదక్షతతో ప్రతిపాదించు గ్రంథము వివేకచూడామణి. రచయిత ప్రారంభంలో ఆనందస్వరూపియైన తనగురుదేవునకు గోవింద భగవత్పాదునకు ప్రణమిల్లాడు. జ్ఞానభక్తి మార్గాలను చక్కగా సమన్వయించే గ్రంథము "ప్రబోధసుధాకరము". వైరాగ్యము ఆత్మజ్ఞానము భక్తి అను మూడును ముక్తిసాధనములు, వేదాంత కేసరికి "శతశ్లోకి" అని మఱియొక పేరు. ఆనందగిరి దాని కొక వ్యాఖ్యానమును వ్రాసియున్నాడు. సాక్షాత్కారమునకు సహాకరించు శ్రవణమనననిదిధ్యాస లనెడి మూడును ఆత్మబోధయను గ్రంథములో వివరింపబడియున్నవి. ఉపనిషత్తులలో లేపబడిన "కోహమ్" "నే నెవరను" అను ప్రశ్నకు ప్రత్యుత్తరమును సమకూర్చునది "అపరోక్షానుభూతి". పర్వతాగ్రమునుండి క్రిందికుఱుకు జలప్రవాహవేగమునుబోలిన అనర్గళధాటి గల స్తోత్రాలను పెక్కింటిని శ్రీశంకరులు రామునిమీద కృష్ణునిమీద పరాశక్తిమీద గణపతిమీద సుబ్రహ్మణ్యునిమీద హనుమంతునిమీద మీనాక్షి మున్నగు వేల్పులమీద రచించియున్నారు. అందులో "సౌందర్యలహరి" యనునది దేవీభాగవతసారార్థసముచ్చయమే.

శంకరసారస్వతముయొక్క లోతును వివరియు ఇంతం తనలేము. శ్రీశంకరులు, శ్రీమన్నిఖిలానందస్వామి చెప్పినట్లు తత్త్వవేత్త, కవి, కళాభిజ్ఞుడు, యోగి, అనుభవరసికుడు, సంస్కర్త, అనన్యసామాన్య శక్తియుక్తుడగు వక్త, భగవద్భక్తుడు.

# వేదాంతమనగా ఏమి?

వక్త:
శ్రీ అభేదానందస్వామి

అనువక్త్రి
శ్రీమత్ప్రివ్రాజిక వరదాప్రాణ

వేదాంత మను పదమునకు అర్థము వేదముయొక్క అంతము, లేదా జ్ఞానముయొక్క చివర. ఇటువంటి వ్యాఖ్యానమువలన జ్ఞానము కూడ అంతమగునా ఏమి యను భ్రాంతి మనకు కలుగకూడదు. జ్ఞానముయొక్క చివరిసోపాన మనినచో జాగృతిగ ఇంద్రియజమగు అనుభూతియొక్కసీమ, ఎక్కడ విజ్ఞానము ప్రవేశించుటకు ప్రయత్నించినను ప్రవేశింపలేకున్నదో అది. ఈ జ్ఞానముయొక్క పరాకాష్ఠ ఎక్కడ? ఇదియే జడపదార్థజ్ఞానముగ పరిణామము చెందియున్నదా? కాదు; ఏ జడపదార్థము దృగ్గోచరమగు జగత్తని పరిచితమో దానియొక్కజడ అణుసంయోగపరిణామము ఈ విశ్వబ్రహ్మండముయొక్క అర్థ భాగము మాత్రమే! మిగిలిన అర్ధభాగము జడము కాదు. అది జడముయొక్క అనుభోక్త్రు-చేతన

బోధశక్తి–దేనిసహాయమున మనము బాహ్య విషయములను తెలిసికొనగలుగుచుంటిమో అది. ఎప్పుడు మనము బాహ్యానుభూత జ్ఞానము (Knowledge of objective world) చేత అనుభోక్తృజ్ఞానమును (Knowledge of subjective world) సమ్మిలితముచేయుదుమో, అప్పుడు ఒక మహత్తర జ్ఞానసంధానము మనకు కలుగును. అది దేశకాలాతీతము. ఆ జ్ఞానమునే దివ్యజ్ఞానము లేదా అనంతజ్ఞాన మని తెలియవచ్చును. ఆ జ్ఞానమే సమగ్రవిశ్వముయొక్క ఆదియును అంతమును కూడ.

ఈ జ్ఞానము ఎక్కడ ఉన్నది? ఈ విశ్వబ్రహ్మాండమునకు వెలుపలనా? మన శరీరభాండమునకు వెలుపలనా? కాదు. ఇది సర్వత్ర వెలసియున్నది. బయటను లోపలను కూడ. మన ఆత్మయందు ఉండునది జ్ఞానమే. అసలు మన ఆత్మ అధిష్ఠానస్వరూపమగు అనంతజ్ఞానముయొక్క ప్రకాశస్వరూపము. విభిన్నావస్థలయందు విభిన్ననామధేయములు కలిగినను జ్ఞానసముద్రము ఒక్కటే. దీనియొక్క సమగ్రరూపము మనకు అగోచరము కావచ్చు తెలియకపోవచ్చును. కాని మన జీవితములో కొన్ని కొన్ని మహత్తర ముహూర్తములందు ఏకొద్దిఅంశమో క్షణకాలము కొఱకై ప్రకాశింపవచ్చును' 'నే నెవరు? స్వరూప మేమిటి?' అని తెలియగోరినప్పుడే దివ్యభావాంతర్నిహితమైన ఒక అగ్నికణము అనంతమున ప్రజ్వలించుచున్న దని స్ఫురించును. ఆజ్ఞానము అనంతజ్ఞానసూర్యుని వద్ద నుండి ప్రసూతము, ప్రసారితము.

వేదాంతమున మూడు ప్రణాళిబద్ధములైన మతవాదములు కలవు, ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అని.

మన శరీరమే మన స్వరూప మని నమ్మిక కలిగి ఇంద్రియగ్రాహ్య జగత్తువిషయమున సచేతనముగ నున్నంతవఱకు విశ్వస్రష్ట, శాసకుడు ఒకడు ఉన్నాడని మనకు తోచును, అప్పుడు మనకు ఈశ్వరుడు ఈ విశ్వమునకు ఆవల అతిదూరమున మనకు అందరాని మేఘములకావల స్వర్గమున ఉన్నా డనిపించును. అతడు అతిమహిమాసంపన్నుడు. ఈ విశ్వమునకు అధిష్ఠానస్వరూప మనిపించును. ఇది జ్ఞానోపలబ్ధికి ప్రథమసోపానము.

తరువాత క్రమక్రమముగ ఈశ్వరుని ప్రకృతినిగూర్చియు ఆతనితోడి మనకు గల సంబంధముగుఱించియు చింతించిన కొలది నికటముగ నున్నా డనిపించును. అతడు విశ్వవ్యాపి, మన అంతరాత్మ యని అనుభూతి కలుగును. శరీరముపై ఆత్మప్రభుత్వము చేయునట్లు ఈశ్వరుడుకూడ ఈ [illegible] అవస్థానముచేయుచు ప్రతిపరమాణువునుకూడ నియంత్రించుచున్నాడు. మన ఆత్మ ఆ విరాట్ శక్తియొక్క అంశము. కాని పూర్ణమునకు సమానము కాదు. ఇది ఆధ్యాత్మికక్రమవికాసమునకు రెండవసోపానము.

తరువాత ఏవ్యక్తి ఇంద్రియానుభూతికిని చింతాశీలతకును ఆవలికిపోగలుగునో ఆతడేఆత్మయొక్క పరమాత్మ సామీప్యమును ఉపలబ్ధి పొందగలడు. మనము ద్వైతద్వంద్వ భావములకు ఆవలికెప్పుడు చేరగలమో అప్పుడే మనకు తోచును – అవును, ఏదో ఒక వస్తువు ఉన్నది. అదియే వివిధనామరూపములద్వార ఉపాసింపబడు ఈశ్వరునిగుఱించి వలయుధారణశక్తికి పునాదిస్వరూపమువంటి దని–ఆ చింతాశీలత కలిగినప్పుడే మనము అద్వైతరాజ్యమున ప్రవేశింపగలము. అప్పుడే జ్ఞానములు స్పష్టమైపోవును. వర్ణనాతీతమగు సమాధి

యొక్క ఆనందానుభూతి కలుగును. సర్వ ప్రకారములగు భేదదర్శనములు తిరోహితము లగును.

వేదాంతధర్మమే ప్రపంచములోని అన్ని ధర్మములకన్నను అనుష్ఠానసాధ్యము (Practical). ఏవో కొన్ని తత్త్వములు, యుక్తిహీనములగు మతవాదములును కేవలము విశ్వాసముద్వార పాలింపబడు ఉపదేశములే ధర్మముయొక్క ఉద్దేశ్యమని వేదాంతము నేర్పదు. ఈశ్వరీయభావమును పొందుట, జీవితమున పూర్ణతను గనుట, దైనందిన కార్యకర్మలలో దివ్యభావమును వికసింపజేయుటయే వేదాంతముయొక్క యథార్థకర్తవ్యము!

వేదాంతధర్మముయొక్క ముఖ్యోద్దేశ్యము ఏమిటి? మనము అమరాత్మస్వరూపులుగనే జన్మించితిమి. పాపఫలముగనో అన్యాయాచరణవలననో కాదు. మనము అమృతానందముయొక్క సంతానము! అట్లైనచో మనము ఆ ఆనందమును అనుభవించుచున్నామా? అనుభవించుచున్నను, లేకున్నను లాభనష్టము లేమియు లేవు. ఎందులకనగా అదియే మన జన్మగతాకారము. ఈనాడు కాకపోయిన మఱునాడైనను మనలో చైతన్యము కలుగును. ఆనందము ననుభవింపగలుగుదుము. మనలోని ప్రతివ్యక్తియు ఈశ్వరునివలె అనంతుడు, అమృతుడు, పవిత్రుడు. వ్యక్తిగతఆత్మకును విశ్వగతపరమాత్మకును భేద మేమియు లేదు.

ఆత్మ అనంతము, జన్మహీనము, మృత్యుహీనము, అపరివర్తనీయము. శరీరవినాశనము వలన శరీరములోనుండు ఆత్మకు వినాశము కలుగదు. ఆత్మకు మరణము లేదు. మనము ఈ సత్యమును సదా జ్ఞప్తియందుంచుకొనినచో ఇక మృత్యుభయ మెక్కడిది? నిర్భయతయే మన ఆదర్శము; ప్రతియొక్కరికిని నిర్భయత ఆదర్శ మగుటయే ప్రయోజనము.

# ఉపనిషత్కథావళి*

## శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తిగారు

**అశ్వినీదేవతలు—వారిగురువు దధ్యఙ్మహర్షి :-** అశ్వినీదేవతలు దేవవైద్యులు. వీ రిరువురు సోదరులు. ఒకనిపేరు నాసత్యుడు, రెండవవాని పేరు దస్రుడు. వీరు సూర్యపుత్రులు. ఆడుగుఱ్ఱమురూపము ధరించిన సూర్యపత్నియగు సంజ్ఞాదేవిపుత్రులు, యమధర్మరాజు అశ్వినీదేవతలకు అన్న, యమున అక్క. అశ్వినీకుమారులు దేవతలు, దేవతలలో చక్కనివా రని పేర్గాంచిరి. వీరు ఎల్లప్పుడు సింగారించుకొనుటయం దాసక్తి కలిగియుండెడివారు. తమవిద్యలకు, తమ యోగ్యతలకు మురిసిపోవుచు ఇతరదేవతల నవమానించెడివారు. ఒకపర్యాయము త్రిలోకాధిపతియైన దేవేంద్రు నవమానించుటకుకూడ వీరు సందేహింపలేదు. అందుల కింద్రుడు కోపించి యజ్ఞములందు వీరిని బహిష్కరించెను. అందుచేతనే వీరికి హోమక్రియలయందాహ్వానము తక్కువగా నుండుటకాని, యసలే లేకుండుట కాని జరుగుచున్నది. ఇంద్రునితో అశ్వినీదేవతలకు శత్రుత్వము పెంపొందినది.

---

* రామప్రతాప త్రిపాఠిశాస్త్రిగారి హిందీ మూలమునుండి అనువాదము.

అశ్వినీకుమారుల గురువు దధ్యఙథర్వణర్షి. ఆయన గురువు అథర్వర్షి. దధ్యఙృషి మంత్రద్రష్టలైన మునులలో నొకడు. ఆయన బ్రహ్మజ్ఞాని యగు మహాత్ముడు. తనశిష్యులం దఱిలోను అశ్వినీకుమారులు మిగుల ప్రతిభావం తులగుటచే దధ్యఙ్మహర్షికి వారియం దెక్కువ ప్రీతి యుండెడిది. కాని సమస్తవిద్యలు పూర్తి యైనపిదపకూడ ప్రియశిష్యులకు బ్రహ్మజ్ఞాన ముపదేశించుటకు గురువు సుముఖత చూప లేదు. అందుకు హేతు వశ్వినీదేవతలు సదా లౌకికసంపదలపైనను సింగారించుకొనుటయం దును వ్యామోహము కలిగియుండుటే. అట్టి విద్యార్థులకు బ్రహ్మజ్ఞాన ముపదేశించుట కుక్కకు గంగాస్నానమువలె నిష్ప్రయో జనము.

లౌకికవిద్యలలో ముఖ్యముగా వైజ్ఞానికవిద్య యందు వైద్యవిద్యయందు అశ్వినీకుమారులకు గల ప్రావీణ్యము విద్యార్థిదశయందే సర్వత్ర ప్రసిద్ధిబడసెను. ఇట్టి లౌకికవిషయములందు మునిగి వీరు బ్రహ్మవిద్య నభ్యసించు ప్రయత్న ముకూడ చేయలేదు. ఇంద్రు నవమానించుట చేత దేవత లందఱు వీరిపై కక్షవహించిరి. దేవత లందఱు కట్టుకట్టి యజ్ఞములందు హవి ర్భాగములు లేకుండచేసినప్పు డశ్వినీదేవతలు కళ్లుతెఱచిరి. మరల యజ్ఞములందు హవిర్భా గములు పొందుటకు వీరు ప్రయత్నించిరి. కాని వారిప్రయత్నములు నెఱవేఱలేదు. బ్రహ్మ జ్ఞానము లేనియెడల భౌతికవిద్యలయం దెంత ప్రావీణ్యమున్నను యజ్ఞములందు భాగమిచ్చుట యజ్ఞము నవమానించుటే. అన్నిప్రయత్న ములు విఫలము లగుటచే నశ్వినీదేవతలకు నిరాశ కలిగినది. తాము చేసిన పొరపాటునకు విచారించి తమగురువైన దధ్యఙృషిని సమీ పించిరి.

గురువు ప్రియశిష్యుల నాదరించి వారిరాకకు గల కారణ మడిగెను. సోదరు లిరువురు తమకు గలిగిన పరాభవమునకు మిగుల దుఃఖించిరి. గురువుగారితో మాట్లాడునప్పుడు వారికన్నుల నుండి యెడతెగని కన్నీటిధారలు కాఱసాగి నవి. కంఠములు రుద్ధములైనవి. మోము లెఱ్ఱ వడినవి. కొంతసేపు సమాధాన మేమియు చెప్పలేక యూరకుండిన తరువాత కంపితస్వర ముతో అన్నయైన నాసత్యుడు "గురుదేవా, దేవేంద్రుడు మాపేరు చెప్పిన మండిపడు చున్నాడు. మావైపు కన్నెత్తి చూచుటకు కూడ ఇష్టపడుట లేదు. మామొఱ వినిపించు కొనుట లేదు. యజ్ఞయాగాదులనుండికూడ మమ్ము బహిష్కరించెను. ఇట్టి యవమానకర మైన స్థితిలో దేవలోకమున నివసించుటకూడ దుర్భరముగ నున్నది. మాకు జరిగిన యవ మానమునకు తగిన ప్రతీకారము చేయగోరు చున్నాము" అని విన్నవించెను.

దధ్యఙృషి లౌకికవ్యాపారములందు విము ఖుడు. శిష్యునియుత్తేజకరమైన మాటలను ఆయన యంతగా పట్టించుకొనలేదు. ఆయన ముఖమున మార్పుకాని మాటలలో సాను భూతికాని యెంతమాత్రము గోచరింపలేదు. సహజగంభీరస్వరముతో "వత్స, స్వర్గాధిపతి యైన ఇంద్రునిపై చెడుతలంపు కలిగియుండుట మీరు చేసిన ఘోరమైన తప్పు. ఒకరిపై నీర్ష్యాద్వేషములు కలిగియుండుట మీకు శోభ దెచ్చువిషయము కాదు. సంసారవిరక్తులైన దేవతలకే యజ్ఞమున భాగము లభించును. యజ్ఞమున భాగము పొందువారు బ్రహ్మజ్ఞాన సంపన్నులై యుండవలెను. మీయుభయులకు నట్టి యర్హతలు లేవు. మీకు యజ్ఞమున హవిర్భాగము లీయనందున కలుగుప్రత్యవాయ మేమియు లేదు. కామక్రోధేర్ష్యాదిదుర్గుణము

లను ముందు పరిత్యజింపవలెను. మీహృదయములు స్వచ్ఛములు కావు. లోకవ్యాపారములం దింత మమకారము, ఆసక్తి కలిగిన మీరు యజ్ఞములందు పూజింపబడు నర్హత పొందజాలరు. ఈవిషయమున నింద్రునిగూర్చి మీరు చెప్పునేరములను వినుట నాకిష్టము కాదు.'' అని పలికెను.

అన్నదమ్ము లిద్దఱు గురువుపై బెట్టుకొన్న కొండంతయాశ అడియాస యైనది. వారి మేలు గోరువారు గురువుతప్ప వేఱెవ్వరు లేరు. ఒక్కనాడు పొందినశిక్షణతో జన్మించినది మొదలు కొనియున్న దురభ్యాసములు దూరము కాజాలవు. సోదరులమనస్సులలో తుఫాను చెలరేగినది. చాలసేపటివఱకు ఎవ్వరును మాట్లాడలేకపోయిరి. ఎట్టకేలకు తమ్ముడైన దస్రుడు చేతులు జోడించి ''పూజ్యగురుదేవ, ఇంద్రుడు మా కొనరించిన ఘోరావమానమునకు తగిన ప్రతీకారము చేయనిదే మాహృదయములలోని మంట చల్లాఱదు. మాకు యజ్ఞమున హవిర్భాగము లభించినను లభింపకున్నను మాకు సమ్మతమే కాని యింద్రునకు ప్రతీకారముమాత్రము తప్పక చేయవలెను. అందుకు తగిన మందు కాని మంత్రముకాని మాకు తెలియజేయుడు. ఇంద్రునకు ''బుద్ధి'' చెప్పిన పిదపనే మాదురభ్యాసములు పరిత్యజింతుము'' అని విన్నవించెను.

శిష్యునిమాటలు విని గురుదేవుడు నవ్వుచు దక్షిణహస్తము పైకెత్తి ''చిరంజీవులార, ఇంద్రునిగర్వ మణచుటకు కాని, ఇంద్రునిపై పగదీర్చుకొనుటకుకాని తగినమంత్రౌషధములు మీగురువునకు తెలియవు. సంతోషము, ఇంద్రియనిగ్రహము, వాంఛారాహిత్యము అను వాని వలన దురభ్యాసములు దుర్గుణములు నశించును. ప్రతీకారమువలన మీరు శాంతిని పొందజాలరు. ఇంద్రుడు దేవతలకు రాజు. అతని శక్తిసామర్థ్యములు సాధారణములుకావు. అతడజయ్యుడు. మీ రింద్రునిపై పగదీర్చుకొన్నవత దూరకుండునా? అట్టిస్థితిలో మీకు మనశ్శాంతి శాశ్వతముగ దూర మగును. క్రొత్త క్రొత్త చెడుపనులు చేయవలసివచ్చును. జీవితము నరకసదృశ మగును. నాసలహా నాలకించి పాటింపుడు. మీరు మనస్సును ఇంద్రియములను వశమం దుంచుకొనుట నభ్యసింపుడు. ప్రపంచములో నెవ్వనియందును ఈర్ష్యాద్వేషములు కలిగియుండకుడు. సంతోషముగా నుండుచు హింసాప్రవృత్తిని శాశ్వతముగా పరిత్యజింపుడు'' అని హితోపదేశము చేసెను.

నాసత్యుడు చేతులుజోడించి ''పూజ్యగురుదేవ, మీయుపదేశము శిరసా వహింతుము. కాని ఇంద్రుడు మాకు చేసిన యవమానము మఱచుట మాకు సాధ్యము కాదు. హృదయము మండుచుండగా సంతోష మెట్లు కలుగగలదు. వైరభావము విడచిన మాకింద్రునితో పోరాడ నవసర ముండదనియు మాజీవితమున శాంతి యేర్పడు ననియు మేమెఱుంగుదుము. కాని మేము కోల్పోయిన యధికారము తిరిగి పొందునుపాయము మీరు తప్పక సెల వీయవలయును. ఇంద్రునితో విరోధము కలిగియుండుట సంతోషకరమైన విషయము కాదు. కాని మాయధికారము కోల్పోయి జీవించుటకూడ సులభమైన పని కాదు. గురుదేవ, జాతియందు కలిగిన యవమానము దుర్భరమైనది. అవమానము సహించుట మీవంటి బ్రహ్మర్షులకే కాని మావంటివారికి సాధ్యము గాదు'' అని విన్నవించినాడు.

దస్రుడు అన్నగారి ముఖము పరిశీలనగా చూచినాడు. అన్నగారి మాటలు తమ్మునకు రుచింపలేదు. కాని చేయగల దేమి?

దధ్యఙ్మహర్షికి ప్రియశిష్యుని ప్రార్థనలో సత్యము సహజత్వము గోచరించినవి. క్షణము ఏదో యోచించి 'చిరంజీవులార, మీ మాట నంగీకరించి యుపాయము చెప్పుచున్నాను. నేను చెప్పునది అంగీకరింపవలెనను మాట గుర్తుంచుకొనుడు' అని పలికెను.

నాసత్యుడు చేతులు జోడించి వినయముగా "గురుదేవ, మీయాజ్ఞ నతిక్రమించుట మాకు సాధ్యమగు విషయము కాదు" అని చెప్పెను.

దధ్యఙ్–"చిరంజీవులార, యజ్ఞములయందు మీరు కోల్పోయిన అధికారము మరల పొందుటకు రెండు ఉపాయములు కలవు. మొదటి యుపాయము మిగుల సులభమైనదే కాని మీ రంగీకరింతు రని నాకు నమ్మకము కలుగుట లేదు."

నాసత్యుడు–"గురువర్య, ప్రాణములైన న్డి మీయాజ్ఞ పాలింతును."

దధ్యఙ్–"నాయన, మీరు బ్రహ్మవిద్య పొందు నధికారము సంపాదించి తరువాత యజ్ఞభాగములను పొందుడు. కాని మీ జీవితము సాత్త్వికము కాదు. సాత్త్వికజీవనము లేనివారు బ్రహ్మవిద్య నెప్పుడును పొందజాలరు. మీరు కామక్రోధాదిదుర్గుణములను జయించి, అల్పసంతోషులై లౌకికప్రవృత్తులయం దాసక్తి పరిత్యజించి వచ్చినయెడల బ్రహ్మవిద్య నుపదేశింతును. అట్టి సాధనకు పండ్రెండు సంవత్సరములవఱకు అవధి నిచ్చుచున్నాను. మెల్ల మెల్లగా నింద్రియములను వశముచేసికొని 12 సంవత్సరములు పూర్తియగుసరికి బ్రహ్మవిద్య పొందు నర్హత సంపాదింతురు.

ద్రసునకు గురువు చెప్పిన మొదటి యుపాయము రుచింపలేదు. గురువుగారి మాటలు పూర్తికాకముందే మధ్యలో కల్పించుకొని "గురుదేవ, రెండవ యుపాయము సెలవిండు" అని పలికి చేతులు జోడించినాడు. నాసత్యుడు తమ్మునివైపు చూచుచు మౌన మవలంబించినాడు.

దధ్యఙ్–"నాయన, ద్రస, రెండవ యుపాయము కొంచెము కఠినమైనది. అయినను మీరు మఱికొంచెము కష్టపడిన సాధ్యము చేసికొనగలరు, వినుడు. చ్యవను డను నొక మహర్షి కలడు. ఆయన ధర్మపత్నియైన సుకన్య యొక మహారాజుకూతురు. చ్యవనుడు తన తపస్సుచే ముల్లోకములను చలింపచేసిన మహాత్ముడు. ఇంద్రుడుకూడ చ్యవనునిపేరు విన్న గడగడవణకిపోవును. చ్యవనునకు నేత్రదృష్టి లేకపోవుటచే నైహికజీవితము దుఃఖమయమైనది. ఈ విచారములోనే శరీరము కూడ పాడైనది. ఆ మహర్షి కన్నులు బాగుచేసి, శరీరమును రోగరహితముగ చేయగలిగినయెడల నా మహానుభావుడు మీకు యజ్ఞములందు భాగ మిచ్చు నేర్పాటు చేయునని నమ్ముచున్నాను ఆయన తపశ్శక్తికి ప్రపంచమున సాధ్యముకానిది లేదు. మీ కోరిక నెఱవేర్చుట చ్యవనునకు సులభసాధ్యమైన పని.

గురువుగారు చెప్పిన రెండవ యుపాయము విని ద్రసు డానందముతో నెగిరి గంతువేసినాడు. పోయిన నేత్రదృష్టి రప్పించుట, రోగము పోగొట్టుట, శరీరమునకు బలము కలిగించుట అతనికి మిక్కిలి సులభము. ద్రసు డన్నవైపు చూచుచు గురువుతో "తండ్రీ, నాకు రెండవ యుపాయమే సులభముగా తోచుచున్నది. మేము మిగుల తొందరలోనే చ్యవన మహర్షి కారోగ్యము కలిగించి మా కోరిక నెఱవేర్చుకొనగలము. ఇక నాలస్యము చేయవలసిన పని లేదు" అని తన యుద్దేశము వెల్లడించినాడు.

నాసత్యునకుగూడ తమ్మునిమాట నచ్చినది. అతడు చేతులు జోడించి ప్రయాణానుమతి కోరుచు "గురుదేవ, చ్యవనమహర్షి యాశ్రమ మార్గ మెఱింగింపుడు. మీరు చెప్పిన యుపాయము ననుసరించి మహర్షికి స్వస్థత చేకూర్చి మాపని నెఱవేర్చుకొందుము" అని విన్నవించెను.

దధ్యఙ్-"చిరంజీవులార, చ్యవనమహర్షి యాశ్రమము బదరీవనమున గంగాద్వారము దగ్గఱ నున్నది. మీ రింతవఱకు ఆచ్యవనుని యాశ్రమ మెఱుగరా? వెళ్ళి మీవాంఛితములు నెఱవేర్చుకొనుడు. కాని బిడ్డలార, మీకు తెల్పిన రెండుఉపాయములలో ఏయుపాయము మీరు పాటించినను, ప్రతీకారము, ప్రతిహింస అనువాని కెంతమాత్రము తా వీయక మీరు పోగొట్టుకొన్న యజ్ఞభాగాధికారము పొందవలె నను సత్కాంక్షతోనే ప్రయత్నింపవలె నను విషయము నెప్పుడును జ్ఞాపక ముంచుకొనుడు, అప్పుడే నిజమైన సఫలత సిద్ధించును. ఈర్ష్యాద్వేషములు మనస్సులో నేమాత్రము చేరినను, కార్యసాఫల్యము సిద్ధించినను నిజమైన శాంతి లభింపదు. శాంతి లేనిచో నిజమైన సుఖము కలుగదు," అశ్వినీదేవతలు గురుచరణములపై శిరము లుంచి మ్రొక్కి బదరీవనమునకు బయలుదేఱిరి. వారిమనస్సులలో ఆనందతరంగములు చిందులాడసాగినవి.

దేవరాజగు నింద్రుడు సహస్రాక్షు డని యందురు. ఇంద్రుడు గొప్పనేర్పరి యనియు, నీతిమంతు డనియు త్రిలోకములలోని విషయములు ఎల్లప్పుడును గమనించి పాలించుననియు, సహస్రాక్షు డనుటచే స్ఫురించును. అశ్వినీదేవతల మనస్సులలోని సమస్తభావములను మొదటినుండియు గమనించుచున్నాడు. దధ్యఙ్మహర్షితో వారు సమాలోచనలు చేయుటగూడ ఆతడు గ్రహించినాడు. దధ్యఙ్మహర్షి బ్రహ్మజ్ఞానత్యాగములవిషయము, చ్యవనమహర్షి తపశ్శక్తినిగూర్చియు, బ్రహ్మతేజముగూర్చియు బాగుగా నెఱింగిన ఇంద్రుడు ఆ మహర్షుల కెప్పుడును మనస్సులో భయపడుచుండువాడు. అశ్వినీకుమారుల అసద్భావము ఇంద్రునకు తెలియనిది కాదు. అశ్వినీదేవతల ప్రయత్నము తెలిసినప్పటినుండియు వారి ప్రయత్నములు సఫలము కాకుండుటకు ప్రయత్నింపసాగెను. రాత్రి పురోహితునితో సమాలోచనలు చేసి యింద్రు డుదయము దధ్యఙ్మహర్షి దగ్గఱకు వెడలుటకు నిశ్చయించుకొనెను. ప్రాతఃకాలమున పుష్పకవిమాన మధిరోహించి మహర్షి యాశ్రమము నింద్రుడు చేరెను. ఆసమయమున మహర్షి శిష్యులకు విద్య గఱపుచుండెను. ఇంద్రు డాశ్రమమునకు వచ్చిన సమాచారము సంచలనము కలిగించినది. ఎక్కడివా రక్కడే తమపనులు కట్టిపెట్టి పరుగుపరుగున ఆశ్రమము చుట్టు చేరిరి. దధ్యఙ్మహర్షి కూడ ఇంద్రునిరాక తెలిసికొని అతిథిసత్కారములు చేయుటకు శిష్యులను వెంటబెట్టుకొని వెళ్ళి స్వాగతమిచ్చినాడు. స్వాగతమిచ్చిన దధ్యఙ్మహర్షికి ఇంద్రుడు సాష్టాంగదండప్రణామము చేసినాడు. ఇంద్రుని వినయవిధేతలు విరాగియైన దధ్యఙ్మహర్షిపై మంచిప్రభావము చూపినవి. మహర్షి ఇంద్రుని లేవదీసి యాలింగనముచేసి కొని కుశలప్రశ్నలు వేసినాడు. రాజనీతివిశారదుడైన యింద్రు డందఱియెదుట తన మనోభావ మెందుకు వెల్లడించును? ఇంద్రుడు నవ్వుచు "బ్రహ్మర్షీ, ఎంతోకాలమునుండి మిమ్ము దర్శింపవలె నని కుతూహలపడు

చుంటిని. నాకోరిక నేటికి సఫలమైనది. ఊపిరి పీల్చుకొనుటకుకూడ తీరుబడి లేనంత జంజాటము నాతలపై నుండుట మీరెఱుంగుదురు. ఎంత యభిలాషయున్నను మీవంటి బ్రహ్మర్షుల సన్నిధికి తఱచు వెళ్ళజాలకున్నాను'' అని వినయ ముట్టిపడునట్లు పలికినాడు.

దధ్యఙ్ నవ్వుచు కుటీరమువైపు చూచి ''దేవేంద్ర, అధికారము రక్షించుకొనుట సామాన్యవిషయము కాదు. ఇంతపెద్దసామ్రాజ్యభారము వహించువారు సుఖసంతోషము లెట్లు పొందగలరు? మాయాశ్రమమునకు విచ్చేసి మాపై గల దయను వెల్లడించితిరి. మీవంటి గొప్పయతిథి శుభాగమనముచే నాశ్రమవాసు లెల్లరు కృతార్థులైరి.''

మాట్లాడుచు మాట్లాడుచు బ్రహ్మర్షి కుటీర ద్వారము సమీపించెను. శిష్యు లింద్రుడు సుఖాసీను డగుటకు ఆసనము వేసిరి. సమయోచితోపచారములతో ఇంద్రున కతిథిసత్కారములు చేసిరి. కొంతసేపైనతరువాత గురుకులమునకు త్రిలోకాధిపతి విచ్చేసిన శుభావసరము పురస్కరించుకొని మహర్షి సెలవు ప్రకటించెను. అధ్యయన మాపియవేయబడెను. శిష్యులెల్లరు ఆటపాటలలో మునిగిరి.

కొంతసేపు విశ్రమించిన పిదప బ్రహ్మర్షి యింద్రుని జూచి ''దేవేంద్ర, మనశాస్త్రము లతిథిపూజయొక్క మహిమను పెక్కురీతుల వివరించినవి. మీవంటి త్రిలోకాధిపతులు విచ్చేయుటచే వనవాసులమైన మామనస్సులకు మిగుల సంతోషము కలిగినది. మీసేవ చేయుటకు మే మెప్పుడును సంసిద్ధులమే. మేము మీకెట్లు ఆనందముకలిగింతుమో సెలవీయుడు'' అని పలుకగా నింద్రుడు క్షణకాలము మౌనమవలంబించి మహర్షివైపు చూచి యిట్లు పలుకసాగెను.

''బ్రహ్మర్షీ, నేనొకయభిలాషతో మీ సన్నిధికి వచ్చితిని. నాకోరిక నెఱవేర్చి నాకు సంతోషము కలిగింపుడు.''

దధ్యఙ్–''ఇంద్ర, మీసేవ చేయుటకు మేము అన్నివిధముల సంసిద్ధులమే. సామాన్యాతిథినికూడ మేము పూజింతుము. మీవంటి గొప్పయతిథులకోరిక నెఱవేర్చుట మాకర్తవ్యముగా నెంచెదము. మీరేవిధమైన సంకోచము లేకుండ మీకోరిక తెలియజేయుడు.''

ఇంద్రునకు మహర్షిమాటలు చాలసంతోషము కలిగించినవి. తన మాయాజాలములో మహర్షి చిక్కుకొన్నాడు. రెండుచేతులు జోడించి ఇంద్రుడు వినయముగా విన్నవింపసాగెను. మహర్షీ, మీదగ్గఱ బ్రహ్మజ్ఞానము పొందగోరుచున్నాను. ఈ ప్రపంచములో పెక్కుమంది బ్రహ్మజ్ఞాను లున్నను మీవంటి విరక్తులు, ఉదారులు, బ్రహ్మనిష్ఠకలవారునైన గురువు లెచ్చటను లభింపరు. బ్రహ్మజ్ఞానమునిమిత్తమై రాజకార్యముల జంజాటము నుండి విముక్తి పొంది మిమ్ము సేవించుటకు వచ్చితిని. ఇక నేమాత్రము ఆలస్యము చేయకుడు. నేడు చాల మంచి ముహూర్తము కలదు. నేడే నా కా పావనవిద్య నుపదేశించి కృతార్థుని చేయుడు.''

బ్రహ్మర్షి దధ్యఙ్ ఇప్పుడు పూర్తిగా చిక్కులో పడినాడు. లౌకికవ్యాపారములందు, మాయలయందు రాత్రిందివములు మునిగియుండి, కూటనీతిజ్ఞుడై, విలాసప్రియుడై, హింసాపరుడై యుండు దేవేంద్రునకు బ్రహ్మజ్ఞాన ముపదేశించుట మహాపాప మని మహర్షి యుద్దేశము. అది బ్రహ్మవిద్య నవమానించుట యని యాయనభావము. కాని అతిథిని పూజించి కోరిక నెఱవేర్చుటకు మాట యిచ్చి వాగ్దానభంగ మొనరించుట యెట్లు? చాలసేపు

ఆలోచనాసముద్రమున మునిగి తేలసాగినాడు మహర్షి. ఇంద్రునుండి దృష్టి మరలించి ఆకాశమువైపు దృష్టి ప్రసరింపజేసినాడు.

ఇంద్రు డెంతోసేపు మౌనముగా నుండలేదు. దధ్యఙ్ మహర్షి మౌనమును చూచి యింద్రు డిట్లు పలికెను. "బ్రహ్మర్షీ, మాట యిచ్చి యన్యథా యెట్లు చేయగలరు? మీవంటి సమర్థులైన మహర్షులు ఇచ్చినమాట నిలబెట్టుకొనుటకు సందేహించిన లోకమున సత్యమునకు, వాగ్దానమర్యాదలకు తా వెక్కడిది? ఈ యోచనతోనే యమరావతినుండి యిచటకు వచ్చితిని. మీకు దయగల్గిన బ్రహ్మవిద్యోపదేశము పొంది యిచటినుండి వెడలెదను. మీకు దయకలుగనియెడల ఈ యాశ్రమమునందే జీవిత శేషము గడపెదను. మీమౌనము నాకు చింత కలిగించుచున్నది. శీఘ్రమే యంగీకార మొసంగించి నావిచారము తొలగించి నన్ననుగ్రహింపుడు.

ఇంద్రుని గంభీరవాక్యములు మహర్షికి చాల కఠినముగా తోచినవి. ఎంతసేపు యోచించినను సమాధానము స్ఫురింపదయ్యెను. చాలసేపు మౌనముగా యోచించి మహర్షి "సురరాజ, అతిథిగా వచ్చిన నీకు నే నొసంగిన వాగ్దానము తప్పక నెఱవేర్తును. ప్రాణము లుండగా వాగ్దానభంగము జరుగుట యను ప్రశ్నే లేదు. బ్రహ్మవిద్యోపదేశము పొందుటకు ముందు నీకు సాధన యవసరమను విషయమే యింతవఱకు ఆలోచించుటకు హేతువైనది. అభిమానపూరితమైన మనస్సు, చంచలమైన యింద్రియములు కలిగిన నీవు పరమరహస్యమైన బ్రహ్మవిద్యయొక్క మర్యాద నెట్లు నిలుపగలవు? నీత్రిలోకాధిపత్య మెక్కడ? లోకప్రవృత్తులనుండి విరక్తి కలిగించు బ్రహ్మవిద్యయెక్కడ? రెండింటి మర్యాదను నీ వెట్లు నిలుపగలవు? నీవు బాగుగా ఆలోచించుకొనుము. తరువాత బ్రహ్మజ్ఞానోపదేశము విషయము చూడవచ్చును" అని విస్పష్టముగా తనయుద్దేశము తెలియజేసినాడు.

సురరాజున కంతయోరిమి యెక్కడిది? "మహర్షి, ఈ విషయము లాలోచించుచు కూర్చుండుటకు నా కవకాశము లేదు. ఒక విషయము నొకసారి కోరిన తరువాత మాటిమాటికి నావిషయముపై మనస్సు లగ్నము చేయవలసిన యవసరము నా కెప్పుడును కలుగలేదు. మీ రిప్పుడే బ్రహ్మవిద్య నుపదేశింపవలెను. బ్రహ్మవిద్యను పొందక యిచటినుండి కదలను" ఇంద్రుడు తన దృఢనిశ్చయ మొసంగించెను.

మహర్షి కింద్రుని సమాధానపఱచుట కే యుపాయమును తోచలేదు. "సురరాజ, సరియే, నే డాశ్రమమున నాగుము. రే పుదయము బ్రహ్మవిద్యకు దీక్షస్వీకరింపజేయుదును. నీవు రాచదుస్తులను, ఆభరణములను తప్పక పరిత్యజింపవలెను. రథమును, సారథిని, అనుచరులను వెనుకకు పంపివేయుము. కౌపీనము మేఖల ధరింపుము. సమిధ చేతబట్టి నిర్మలమైన మనశ్శరీరములతో బ్రహ్మజ్ఞానోపదేశమునకు రావలయును" అని మహర్షి వివరించెను.

ఇక నింద్రున కేమి సమాధానము చెప్పుటకును అవకాశము లేకపోయినది. మఱునాటి యుదయ మింద్రుడు తనకత్యంతప్రియములగు వస్త్రములు భూషణములు విసర్జించి వటువేషధారియై బ్రహ్మవిద్యోపదేశము పొందుటకు వచ్చుట ఆశ్రమవాసులకు మిక్కిలి కుతూహలము కలిగించినది. కాని యింద్రుని వినీత వేషము మహర్షికి హర్షము కలిగింపలేక

పోయినది. మహర్షి దయ ఇంద్రునకుగూడ సంతోషము కలిగింపలేకపోయినది. ఇంద్రుడు మహర్షికూడ బలాత్కారముతో బ్రహ్మ జ్ఞానోపదేశమార్గమున ఇష్టములేక పయనింప సాగిరి. ఒకరికి (ఇంద్రునకు) ఘోరస్వార్థసాధన ప్రధానము కాగ మఱియొకరికి (మహర్షికి), మాట నిల్పుకొనుట ముఖ్యమైనది.

(సశేషము)

# రసస్వరూపం - రసజ్ఞత - సౌందర్యసృష్టి

కీ. శే. కులపతులు ముట్నూరు కృష్ణరావుగారు

## I

సోదరా, సౌందర్యోపాసకులు నీతినియమములను పాటించనిభోగులను ప్రతీతి ఉన్నది లోకంలో. కాని ఇది నిజం కాదు. నియమమనేది ఎక్కడైనా ఉంటే, అది సౌందర్యోపాసనలోనే విశేషంగా పరాకాష్ఠ చెందుతుంది. కళకు నియమమే మూలము. విశృంఖలత కళకు విరుద్ధము. రసజ్ఞతకొద్దీ నియమము లంతకంతకు సూక్ష్మాతిసూక్ష్మము లగుచుండును. నీతివాది నియమములకును, కళాభిజ్ఞుని నియమములకును విశేషవ్యత్యాసము కలదు. నీతివాదికి ప్రమాణము లోకాచారము, సంఘమర్యాద, శాస్త్రవిహితములైన విధినిషేధములు. కళాభిజ్ఞుని నియమములు బాహ్యములు కావు. ఏ నియమము రసనిష్పత్తికి ఆధారమో, ఏ విధులు రసజ్ఞతకు సహకారములో వానిని కళాభిజ్ఞుడవశ్యము పాటించును.

నీతిపరుడు బయటి ప్రమాణాలనుబట్టి ప్రవర్తిస్తాడు. సౌందర్యోపాసకుని శీలము వాని సహృదయము ననుసరిస్తూ ఉంటుంది.

నీతివాది విధులకు ఒక శిక్షణగ లోబడుతాడు. కళాభిజ్ఞుడు సుఖంకోసం నియమములను కోరి తెచ్చుకొంటాడు.

సౌందర్యోపాసకుని హృదయము బహుసుకుమారము. కోమలము. ఏ అణుమాత్రం రసాభాస కలిగినా వాని హృదయం బాధపడుతుంది. రసవ్యంజకములైన భావములే వానికి ఆలంబనములు.

తంబురా తీగెను వదులియ్యరాదు. చిత్తరువులోని రేఖలు వక్రించరాదు. గీతంలో ఒక అపశబ్దముకూడ పలుకరాదు. నృత్యములో తాళము తప్పరాదు – కళా ప్రపంచములో – సర్వం తూకం – తూనిక – కొలత – మాత్రం – మానం ప్రమాణం.

సౌందర్యోపాసకుడు జ్ఞానయోగి కాక తప్పదు–వాని నేత్రము జ్ఞానాంజన శలాకముచే ఉన్మీలితమైనప్పుడే, వానిచూపు వజ్రభేదియైన సుందరమూర్తిని గాంచును.–శ్రీ శంకరభగవత్పాదులవంటి జ్ఞానులే "సౌందర్యలహరి"లో ఓలలాడగల్గుదురు.

జ్ఞాని కర్మయోగి కాకపోవచ్చును. కాని సౌందర్యోపాసకుడు కర్మకుశలుడు కాకతప్పదు. వాని హస్తము పరుసవేది వంటిది. వాని స్పర్శకు శబ్దము కవితయై ప్రవహించును. దారు శిలా లోహములు మధురరసమును విరజిమ్ము

కుసుమములగును శిల్పభాగ్యము వాని సహజ సంపద.

సౌందర్యోపాసకుడు స్వరూపముచే భక్తి యోగియే. సౌందర్యము ప్రేమయొక్క శోభ. కాంతి, లావణ్యము, మాధుర్యము దాని సహజలక్షణములు.

వేయేల, సౌందర్యోపాసకునియందు జ్ఞాన భక్తికర్మలు సమ్మేళనము చెంది–రససిద్ధియందు పరిపూర్ణత చెందును. ఈ మూడును Knowledge-Power-Beauty ఆత్మజ్యోతియొక్క భిన్న కళలు. సోదరా, సౌందర్యోపాసన నవలంబించుము – నీ జీవనరంగము త్రిలోకసుందరికి నాట్య[illegible] — జగమును సమ్మోహింప జేయును.

## II

సోదరా, సౌందర్యం బాహ్యవస్తువుల లక్షణంకాదు. అది నీ లోపలిది. అది బయటిదే అయితే, అందఱినీ సమానంగా రంజింప చేయాలి. చేయదు. ఒకరి కంటికి అందంగా ఉన్నది, ఇంకొకరికి వికారంగా కనబడుతుంది. రసజ్ఞతే సౌందర్యానికి ప్రమాణం.

సౌందర్యం జ్ఞానంవలె ఆత్మయొక్క స్వరూప లక్షణం – సత్యం, శివం, సుందరం. జ్ఞానం స్వయంప్రకాశం, జగత్ప్రకాశకమూ అయినట్లే, సుందరం స్వయంమధురం, సర్వం మధురమయంగా జేసే ఆత్మశోభ. నీలో ఆత్మశోభ అనుభూతమైనకొద్దీ, నీ రసాస్వాదనపటిమకూడ వృద్ధిచెందుతుంది. ఆత్మశోభ హృద్గతం కావడానికి, ఆత్మనిష్ఠ చాలా అవసరం.

నీ జీవనంలో అనేక పొరలు, తెరలు, అరలు ఉన్నాయి. ఎన్ని దశాంతరాలో రంగాలుగ గడచాయి. ఇంకా గడవనున్నాయి. వీనిలో వీనికి నిరంతరం స్పర్థ, సంఘర్షణ కలుగుతూ ఉండడంవల్ల, నీకు చిత్తవిక్షేపం కలిగి శాంత్యానందములు మృగ్యములగుచున్నవి శాంతియందు కాని సౌందర్యశోభ ప్రకాశించదు.

సంగీతవిద్య శాంతిసౌఖ్యముల నెందు కియ్యగలుగుతున్నదో యోచించుము. సంగీతము కూడ నీ జీవనంవలెనే సంచలన వేగములతో గూడినది. అందునా ఆరోహణావరోహణములు కలవు. స్వరభేదములు కలవు. విరుపులు విశ్రామములు కలవు. కాని అవన్నియు ఒక శ్రుతికి మేళనమై, రాగోన్ముఖమై, తాళయుతముగ ప్రస్తారితమగుచుండుటచే గేయము మధుర మొనర్పగలుగుచున్నది. అట్లే నీ జీవనంలో అనేక అవస్థలు, దశలు, తిరుగుళ్లు సంఘటిస్తున్నా, వానికి సామరస్యముగూర్చి, ఏకలక్ష్యమున కనుసంధానము చేయగలిగితే, నీ జీవనంకూడా భావాత్మకమైన గేయమువలెను ఛందోబద్ధమైన ఋక్కావ్యములవలెను, ఆనందసంధాయకము కాగలదు. సర్వాంగోపాంగ సామరస్యమే సౌందర్యమని మన ఆలంకారికులు నిర్వచించలేదూ?

నీ జీవనంలో రసస్ఫూర్తి కలుగవలెకాని, అది నీ లోపల దాగి ఉండక, నిన్ను సర్వాంగశోభితునిగ జేసి వేస్తుంది. ఇంద్రియముల కతీంద్రియపుష్టి కలుగుతుంది. చిత్తము నిర్మలమై రసోజ్జ్వలమగుతుంది. హృదయాబ్జము వికసించి పరిమళములను విరజిమ్ముతుంది. ప్రేమ, సౌందర్యం, మాధుర్యం, శోభ–ఈ నాలుగూ ఒక్కటే. హృదయం కరిగితే ప్రేమ. చూపులు సుళ్లు తిరిగితే సౌందర్యము. రుచి మత్తెక్కితే మాధుర్యము. విలాసము అలంకారభూయిష్ఠమైతే శోభ. ఎట్టి భాగ్యభోగములోయి, రసిక

శేఖరునివి? మానవుడు స్వరూపముచే ఆనంద పురుషుడు. లోకమును అందచందాలతో దిద్దగల విశ్వశిల్పి. దుఃఖుల, దీనుల జీవనమును సహితము దయారసముతో నింపి, అమృతరస పానమును చేయించగల నిఖిలరసామృత మూర్తి – శ్యామసుందర మదనమోహనుడు, మురళీధరుడు, గోపీవల్లభుడు, బృందావన విహారి – సోదరా, నీలోని ఈ లీలామానుష విగ్రహము నుపాసించి రససిద్ధుడవు కమ్ము

## III

సోదరా, సౌందర్యబోధకలిగితే, నీలో ఒక విధమైన రసజ్ఞత బయలుదేఱి, నిన్ను నిరంతర జాగరితునిగా చేస్తుంది. నీలోనే కాకుండా, నీ పరిసరాల్లోగూడా ఏమాత్రం రసభంగమైన సందర్భంఉన్నా, సహించక దానిని రసస్నిగ్ధంగ సంస్కరిస్తుంది.

రసజ్ఞతలో తన్ను తాను పోషించుకొనే శక్తి ఉన్నది. ఎట్లా ఒక లత తన ఆశ్రయాన్నంతా అల్లుకొని, పెనవేసుకుపోతుందో, అట్లే రసజ్ఞతకూడా నీ జీవితాన్ని, నీ ఇరుగుపొరుగును ఆవరించి, తన సౌందర్యరాజ్యాన్ని విస్తరింపజేసుకొంటుంది.

ఒక వ్యాప్తిలోనే కాదు దాని ప్రయాస. గంభీరతలో కూడా లోతు పాతులలోకి జొచ్చుకొనిపోతుంది. ఆ రసపిపాసకు తనివితీరడమనేది లేదు – రసపానంచేసినకొద్దీ పిపాస హెచ్చుతుందేకాని తరగదు. రసపిపాస నీకు శ్రమా విసుగూ కలిగించేదికాదు. సౌందర్యాన్ని చూచినకొద్దీ చూస్తావు – గానాన్ని విన్నకొద్దీ వింటావు – మాధుర్యాన్ని గ్రోలినకొద్దీ సృష్టిస్తావు. సౌందర్యం అనంతమైనది–దానికి అంతు అనేదిలేదు. మాత్రికం నిరంతరం క్రొత్త క్రొత్త తళుకులను, కాంతులను ఈనుతున్నట్లుగ, లావణ్యాం అవిచ్ఛిన్నంగా క్రొత్తక్రొత్త శోభలను విరజిమ్ముతూ, నీ ఆనందాన్ని అపారంగా చేస్తూవుంటుంది. అందుకనే A thing of beauty is a joy for ever అన్నాడు ఒక ఆంగ్ల కవి.

ప్రకృతి ఎప్పటికైనా ప్రాతగిలుతుందా? ప్రతి సూర్యోదయమూ క్రొత్త ప్రభాపటలి. ప్రతిచంద్రికా పులకితయామిని. వసంతఋతు సమాగమానికి, మోడుపడిన చెట్టుకూడ ఎట్లా చిగిర్చి, పుష్పించి, నూతనవేషం ధరిస్తుందో చూడు. ఆనందరస సముద్భూతమైన ప్రకృతి నవనవోన్మేషశాలినికాకుండా ఎట్లా ఉంటుంది? నీలో సౌందర్యబోధ కలగాలేకాని, అది నిన్ను ప్రపంచంతో ఐక్యంచేసి, సామరస్యం కలిగించే వరకూ ఊరుకోదు. లోకాన్ని ముట్టుకుంటే, నీ సౌందర్యం మాసిపోతుందేమోనని భయపడకు. ఆ భయంతో నీలో నీవు ముడుచుకొనిపోయావా, నీలోని రసజ్ఞత కాస్తా ఆఱిపోయి, నీ జీవితం మరుభూమి అయి ఊరుకొంటుంది.

లోకాన్ని స్పర్శించిన మాత్రాన నీ శౌచం మైలపడేటట్టయితే, నీ శౌచంలో సత్తువలేదన్న మాట. నీ పరిసరాన్నంతా అశుచిగా ఉంచుకొంటే, నీ శౌచంమాత్రం ఎంతకాలం నిలుస్తుంది? నిన్ను, నీ జీవితాన్ని, నీ పరిసరాన్ని శుచిగ జేసుకోగల్గితేనే, నీ శౌచం సంరక్షింపబడుతుందికాని, బయటి గాలి సోకకుండా దాని చుట్టూ మడిబట్ట కట్టితే కాదు.

నీ జీవితం ఒక సౌందర్య దీపికయై లోకాన్ని కళాజ్యోత్స్నతో నింపినకొద్ది సమస్త వస్తుజాలము నీచుట్టును జేరి రాసక్రీడ సలుపుతుంది. విశ్వైకతకు ఆత్మోపలబ్ధికి సౌందర్యబోధకంటె సుఖసాధనము మఱియొకటి లేదు.

# భాసవిలాసుల కథ

## శ్రీ నిర్వాణానందస్వామి

ఈకథ యోగవాశిష్ఠములోని ఉపశాంతి ప్రకరణములోనిది. వశిష్ఠు డిట్లనెను. ''ధీరుడవైన ఓరామా, ధ్యానము చేయుట కలవాటుపడి, ఆత్మానందమును బ్రహ్మానందమును పొందువారు అనేక బాధలనుండి, కష్టముల నుండి, దుఃఖములనుండి విముక్తులై యున్నారు. జీవుడు, గ్రామముపైని విడిచిపెట్టిన తోటపెద్దు వంటివాడు. ఈ ఘోరసంసారపు టడవిలో, వాడు కాలిదురదకై, పనిపాటలులేక తిరుగుచుండును. కోరికలనెడి గట్టిత్రాళ్లతో బంధింపబడినాడు. కర్మయనెడి కొరడాదెబ్బలను తినుచున్నాడు. దుమికి, దుమికి నడిచెడి మానవుల రక్తము పీల్చి జీవించు, రెక్కలులేని, చీడ పురుగుల కరుపుల వలన సంభవించెడి జాడ్యములతో బాధపడుచున్నాడు. దుర్భర సంసార భార బాధలచే మూలుగుచున్నాడు. విరామములేని, ముందువెనుకల నిరంతర సంక్షోభము వలన వానిశరీరము తూట్లుపడిపోయినది. అజ్ఞానముచే లెక్కలేని జన్మల లోతైన అగాధములో పడిపోయినాడు.

సాధకుడు మనోనాశనము గావించుకొనవలయును. తన సహజజ్ఞానము ద్వారా, తన జీవము, శాశ్వతమైన దని యనుభవమునకు దెచ్చుకొనవలయును. అప్పుడు మాత్రమే స్వార్థపరత్వమునుండి, అజ్ఞానమునుండి బ్రతికి బైటపడగలడు. ఆతడు జీవన్ముక్తులతో నిరంతరసహవాసము చేసి ఆత్మానుభవమును పొందు మార్గమును కనుగొనవలయును. దానిని పొందగలుగుటకు, పరిశుద్ధమైన, శిక్షణపొందిన, మనస్సే అర్హమైన, నిశ్చయమైన సాధకోపాయము. మనస్సు ఆత్మలో లీనమైనపుడు తురీయావస్థను బ్రహ్మానందము నొందుస్థితి ననుభవించును. ఈ అనుభవమును సంపాదించుకొనిన పిమ్మట, ప్రాపంచికవస్తువులయందలి వాసనలు సంపూర్ణముగా చచ్చును. వాస్తవమైన పట్టుదలతో నాత్మవిచారణకు ఉపక్రమించునెడల, మనస్సు, క్రమక్రమముగా, గొప్ప వైభవములో పరిశుద్ధతను పొందును. ఎగువ మనస్సు సాహాయ్యముతో దిగువమనస్సును నాశనము చేసి, బ్రహ్మజ్ఞానమును బడయవలయును. అప్పుడుమాత్రమే యీ భయంకరమైన సంసార బాధలనుండి విడుపొందవచ్చును. మనోనాశనమైనపుడు, ఆవిధముగా ''అహం''ను చంపినపుడు ఆత్మతేజస్సు నీపై నుదయించి, తెంపులేని ఆత్మానందము అభివృద్ధిచెందును. ఇట్టి యనుభవమును, ఉదాహరణతో చెప్పుటకు, భాసవిలాసులమధ్య జరిగిన సంభాషణను గుఱించిన ఒక పురాతనమైన కథను చెప్పబోవుచున్నాను గనుక, ఓరామా, శ్రద్ధగా వినుము.

భాసుడు, విలాసుడు అను నామధేయములు గల ఋషులు సహ్యాపర్వతముపై నున్న అత్రి మహాముని పర్ణశాలలో నివసించిరి. అత్రిముని కా యిరువురు పుత్రులు. పుష్పమునకును దాని – పరిమళమునకును ఎటుల వేఱుపాటు లేదో అవ్విధమున, ఆయిరువురుసోదరులు వేఱుపాటు లేక అన్యోన్యప్రేమతో నుండిరి. ఒక్కటే ప్రాణము, ఒక్కటే మనస్సు రెండు శరీరములలో నున్నట్లుగా నుండిరి. ఒక్క చెట్టునుండియే బయలువెడలిన శాఖలా యనునట్లు వీరు కలసి మెలసి యుండిరి. వృద్ధులైన వారితల్లిదండ్రులు మరణించిరి. వారికి శ్రాద్ధక్రియలు జరుపబడెను. – తల్లిదండ్రుల మరణకారణముచే వారు కడుంగడు దుఃఖించిరి. కన్నీరు విస్తారముగా కార్చిరి.

వారు ఒకరినుండి యొకరు సెలవు తీసికొని విడిపోయి వేఱువేఱు దిక్కులకు పయనమై పోయిరి. నిర్జనారణ్యములకు బోయి ఉగ్ర తపస్సు చేసిరి. వారి శరీరములు శిథిలము లాయెను. కాని నిజమైన జ్ఞానమును వారు పొందలేదు. అందుచే వారు మరల కలిసి కొనిరి.

విలాసు డిట్లనెను. "ఓ, భాసుడా, ఓ సోదరా, నిన్ను గాంచినందు కెంతయు సంతోష మైనది. నా హృదయాంతర రహస్యస్థలమున, [illegible] మునకు జీవమై యున్నావు. నీవు నానుండి విడి పోయిన పిమ్మట, ఇంత దీర్ఘకాల మెటుల, నెచ్చోట, గడపితివో చెప్పుము. సోదరా, నీకు శాంతి చేకూరెనా? ఆత్మజ్ఞానము పొంది తివా? నీవు సౌఖ్యముగా నుంటివా? మనో విచారమునుండి, బాధలనుండి, విముక్తుడ వైతివా? అనంతమైనదాని, నిత్యమైనదాని యానందానుభవము కలిగెనా! భాసు డిట్లు జవాబు చెప్పెను. "నే నీ దినమున నిన్ను కలిసికొను టెంతయు ముదావహము. సోదరా, మనోనాశనము కాకుండగా, కోరికల విత్తనము దాని బలీయమైన లోతైన వ్రేళ్లతో పాతుకొని పోయియుండగా, దానిని కూకటి వ్రేళ్లతో పెల్లగించి, 'దుంపనాశనము' చేయ జాలకే, శాంతికొఱకై నిరీక్షించు టెట్లు పొస గును? ఆత్మసాక్షాత్కారము, ఆత్మజ్ఞానము పొందనంతవఱకు, మనము శాశ్వతానందము పొందుటకై నిరీక్షించు టెట్లు?

నిరుపయోగమైన ప్రాపంచిక వ్యాపారముల వలన, స్వార్థపరత్వమువలన, వృథా కాలక్షే పముచే, మనజీవితము లెట్లు నిరర్థకముగా గడిచిపోయినవో చూడుము. ఎండిన వృక్షము వలె నీశరీరము శుష్కించిపోవును. ముడుతలు పడిన శరీరముతోను, పండినశిరోజములతోను, వృద్ధాప్యము వెనువెంట తఱుముకొని వచ్చును. కలతపెట్టు కామక్రోధముల నాశనము చేయ జాలనంతవఱకు, ఆశాపాశము లడుగంటనంత వఱకు, ప్రకృతికి పరముగా నున్న సర్వో త్కృష్టమైన సౌఖ్యానందమును మన మెట్లు పొందగలము? పలువిధములైన వాంఛ లనెడి దుబ్బులను పవిత్రమైన తర్కవివేకము లనెడి పాఱలతో చెక్కిపాఱవేయలేనంతవఱకు కలినీ లేని, నికరైన బ్రహ్మానంద మెటుల లభ్య మగును? జీవనపు సంకెళ్లను సమూలముగా త్రెంచివేయుటకు మరణ మనెడి ఎలుక ఎల్లపు డును తనకు చేతినిండ పని కలిగియేయున్నది. కామక్రోధములనెడి బురదతోను, నుఱుగు తోను పోల్పబడిన భద్రతలతోను, వ్యాకు లతలతోను, మరలమరల ఒక శరీరమునుండి మరియొక శరీరము పొందుచుండుట యను సుడి గుండముతోను ప్రాపంచిక జీవనప్రవాహము ధారాళముగా పాఱుచునే యున్నది. ఇంద్రియ ములతో సమతుల్యముగా మనస్సు నాట్యము చేయును. ఒకనిమిషమైనను దానికి తీఱిక లేదు. అజ్ఞాన మనెడి జాడ్యమునకు నమ్మక మైన మందు ఆత్మజ్ఞానమే. అది పునర్జన్మకు భయంకరమైన - సర్వరోగనివారిణి. బ్రహ్మ జ్ఞానము పొందని వారును, ఇంద్రియవాంఛలను తీర్చుకొనుటయందు కాలము వృథా పుచ్చు వారును, జననమరణముల చక్రములో బడి మరల మరల పెక్కు చావుపుట్టుకలలో చిక్కు కొనుచున్నారు. ఎండుటాకులు గాలి కెగిరి చెల్లాచెదరగునటుల వారు మరణప్రవాహ ములో తుడిచిపెట్టుకొని పోవుచున్నారు."

ఆత్మోత్తేజము కలిగించు భాసుని సంభాషణ

వినిన పిమ్మట విలాసుడు మిక్కిలి సంతసించెను. అంతట ఉభయసోదరులు బ్రహ్మజ్ఞానార్థులై శ్రద్ధగా పాటుపడిరి. నిర్గుణనిరాకార బ్రహ్మముపై ఎడతెగని తీవ్రధ్యానము చేసిచేసి ఆత్మోన్నతిని బడసి జీవన్ముక్తులైరి. అజ్ఞానము ఐహికపరత అనెడి రొంపిలో బడి మునిగిపోయిన వారినిమాత్రమే, కష్టములు, బాధలు, దుఃఖములు అనునవి కలతపెట్టును. ఆత్మజ్ఞానులు అనంతమైన, బ్రహ్మానుభూతిని బడయుచునే యుందురు.

---

# శివానంద లేఖావళి

## 54

చిల్కాపేట,
అల్మోడా, ఉ. ప్ర.,
28 జూలై 1915.

ప్రియ-బాబు,

నీ జాబు చూచుకొన్నంతనే నాకు కలిగిన యానందము వ్రాతమూలముగ ప్రకటించుటెట్లు ? రాంచిలో నేను గడపిన ఆ కొన్నాళ్ళ చిత్రము తుడిపివేయ సాధ్యము కానియంతగా నామనస్సులో ముద్రితమైనది. అది యట్లే యుండగలదు. గురుదేవున కత్యంతప్రీతిపాత్రులగు పిల్లలసాంగత్యమున నుండినట్లు నాకనిపించినది. ఎప్పుడును మిమ్ము నేను మఱవజాలను. మఱచుట అసంభవము. మఱవకుండుటే కాదు. నాహృదయము ఇక నెప్పటికిని మీయందఱికిని వశపడిపోయినది. మాతృశ్రీ కృపచే గురుదేవుని చరణసన్నిధిని శాశ్వతస్థానమును నీవు గడించుకొంటివి. ఇక చింతింపవలసిన విషయమేదియు లేదు. ఐనను ఎంతవఱకు నీకు ఈ భూలోకమున నుండకతప్పదో అంతవఱకు కష్టసుఖములు ఏదో యొక రూపమున అప్పుడప్పుడు సంభవించుచుండుట అనివార్యమే. కాని అందుకై మనోవ్యథ చెందనక్కఱలేదు. కొంతమంది కలసి కూర్చుండి భగవంతుని మహిమలను కీర్తింప జొత్తురేని ఐహికసుఖదుఃఖములు విస్మృతము లగును. హృదయము ఆశానందములతో పిక్కటిల్లును. మాతృదేవి కృప మీయందఱపై సదా ఉన్నది. మీరు నాకు అంతటి ఆంతరంగికు లనిపించుటకు కారణమదే. మీరు నీళ్ళను చెట్టు వేరులయొద్ద పోయుచున్నారు. ఆ నీరు ఆ చెట్టుకొమ్మలకు అంది తీఱును.

హరిమహారాజు పరిస్థితి మునుపటికంటె మేలే. మునుపటికంటె దేహాపటుత్వము ఎంతో హెచ్చినట్లు ఆయన కనిపించుచున్నది. ఆయన రూపము మొత్తముగ ఎంతగానో మాఱిపోయినది. ఐనను మధుమేహావ్యాధి ఆయనలో జీర్ణించిపోయినందున అందులో ఎక్కువ నయము లేదు. కాని మొత్తముమీద మునుపటికంటె చాల బాగుపడినది ఆయన శరీరస్థితి.

తూర్పుబంగాళమందలి క్షామపరిస్థితులను గూర్చి ఊఱటనుగూర్చు వార్తలు నాకు తఱచు అందుచున్నవి. పత్రికలందును ఆవార్తలనే చూచుచున్నాను. అయ్యో, వ్రాతద్వారా నేను దానిని తెలిపి ఏమిప్రయోజనము? హృదయమర్మము లన్నియు హృదయనియంతకు తెలియును. ఈ ఏకాంతహిమాలయప్రదేశమందు కూర్చున్న నామనస్సులోని తలంపులు ఎఱిగినవా డాయన ఒక్కడే. విశ్వమానవకోటి సమష్టిక్షేమమును గూర్చిన తలంపు తప్ప వేఱు ఏ

తలంపును నామనస్సునకు రాదు. ఇంతకంటె ఎక్కువగా వ్రాసి, ప్రయోజనమేమి? సర్వేశ్వరుడు సర్వము నెఱుగును. అంతర్యామిగ ఆయన యున్నాడు. ఈకొండప్రదేశమునకూడ వానలు లేవు. త్వరలో సువృష్టి కలుగకున్న ఈప్రాంతాలపరిస్థితి ఏమగునో పెరుమాళ్ళకే ఎఱుక. ఆయన దయ జూచునుగాక—అనుటే నాప్రార్థన.

హృదయపూర్వకప్రేమాశీస్సులు నావి, తురీయానందస్వామివి నీవును అచటనున్న ఇతరభక్తులును స్వీకరింపుడు. ఈజాబు నందఱికిని చదివి వినిపింపుము. మీయందఱి క్షేమమును నాకు అప్పుడప్పుడు తెలుపుచుండుము. నీజాబులను చూచినప్పుడెల్ల నాకు సంతుష్టి కలుగుచుండును.

దేవదేవుడు భువిపై నవతరించినాడు. లోకమునకు క్షేమము, ఏరూపముననైననుకానిమ్ము, కలిగి తీఱును. గట్టిగా నమ్ము.

శివానంద.

## 55

చిల్కాపేట,
అల్మోడా, ఉ. ప్ర.
10 సెప్టెంబరు 1915.

ప్రియ—,

1322 సంవత్సర భాద్ర 12 తేదీ నీవు వ్రాసిన జాబు చేరినది. పూజ (దుర్గాపూజ)కు ముందుగా భగవత్సంకల్పముచే నీకు నౌకరీ దొరకుట ఆ భగవంతు ననుగ్రహమే తప్ప వేఱుకాదు. ఏలయన నౌకరిని గూర్చి నీవు చాల వ్యథ చెందుచుంటివి.

నిజముగా తూర్పుబంగాళములోని పరిస్థితులు సంతాపకరములుగ నున్నవి. కనికరించి భగవంతుడు విమోచనమార్గము చూపిననే మే లొందు ఆసపాటు కలదు. లేకున్నచో ఏమగునో పెరుమాళ్ళకే ఎఱుక. ఆయన పరమ శివమూర్తి. ప్రజలప్రస్తుతస్థితి మంచికి పురోగామియే. ప్రస్తుతమున కనంతరమైనది మన కగపడదు. కావున మనకు ఆమంచి యిప్పుడు అర్థము కాదు. ఐనను ఇంతమాత్రము స్పష్టపడుచున్నది:—ఈశ్వరసంకల్పముచే ప్రజలలో కనికరమును సేవాపరతయు మేల్కొను చున్నది. ఇది శుభసూచకమే. కాళీమాత ఒక రెండు చేతులతో సంహారకార్యమును సాగించుచున్నది. ఆమెయే తన తక్కిన రెండు చేతులతోను అభయమును అభిలషితములను ప్రసాదించుచున్నది.

నీ సందేహములకు సమాధానము లివిగో. (1) గురుదేవు ననుగ్రహమును ఆయనప్రత్యక్షశిష్యులకృపను పొందగంటి ననెడి గర్వమును అణచుకోన వలయును. అది యణగిన ఈ జీవితము ఉచ్ఛ్రితి నొందును. అంతే కాదు. మామూలుజీవితసంఘకార్యములలో గర్వాహంకార రహితముగ ఉదారమహాజనుల ననుకరించుచు పాటుపడవలయును. సామాన్యుల యెదుట పైని పేర్కొన్న గర్వమును ప్రదర్శించుట సరిగాదు. నిరహంకారతయే భక్తుని ప్ర

(2) ఆస్థతో ఆధ్యాత్మికసాధనను సాగించు వానిని "గురుదేవుని శ్రీరామకృష్ణుని ఆరాధింపుము, స్తుతింపుము" అని కోరుట సంకుచితచిత్తత యని గాని స్వపక్షాభిమాన మని గాని చెప్పలేము. దేవుని మఱొక మూర్తియందు భక్తిగలవానిని "ఆ మూర్తిని వదలుకో, గురుదేవుని భజింపుము." అని కోరుట స్వామత

దురభిమానమే, స్వకీయపక్షపాతమే. గురుదేవుడు నిజముగ ఈయుగమునకు ఆచార్యుడై, రూపుదాల్చిన సామరస్యము. ఇందుంగూర్చి సందేహలేశమైనను లేదు. వివేకులగు భక్తుల గోష్ఠిలో ఈ విషయమును ప్రచారము చేయవచ్చు.

(3) మఠమున సన్న్యాస దీక్షకైకొనినవారు మనోనిగ్రహదక్షులు. ఆధ్యాత్మికముగ పరిణతినందినవారు సమాధిలో క్రిందిమెట్టు నందుకొన్నవారు అనుట నిస్సందేహము. కాని సమాధిలో దానికంటె పైమెట్టు కూడ నిజముగ నున్నదే!

(4) ఔను, పసివాడనుగ నుండినప్పుడు మాయింటి పెద్దలు చెప్పగా నేను వినియున్నాను. నాతల్లిదండ్రులు సోమవారవ్రతము సలిపి తారకేశ్వరశివుని ప్రసాదముచే నన్ను తమ పుత్రునిగ పొందిరట.

గురుదేవుని భజింపుము. నీ వెక్కడనైన నుందువుగాక. గురుదేవుడు నిన్ను కనికరించును. ఆయన ఏచోట నుంచినను ఏస్థితిలో నుంచినను, అది ఆయన యిచ్ఛ, అని గుర్తించి సమస్తమును లోకజననికి విడిచిపెట్టి మార్జాలకిశోరన్యాయమున నిబ్బరముగ నుండుము. "దేవా, కనికరింపుము, కనికరింపుము" అని సదా భావించుచుండుము, పల్కుచుండుము. ఆయనకు నచ్చినప్పుడు నిన్ను మరల తరచ్ఛాయ క్రిందికి చేర్చుకొనును. ఎక్కడనున్నను నీయందు ఆయన కృపాళుడుగనే ఉండును.

ఇంతకన్న నేమి వ్రాయుదును? నాహృదయపూర్వక ప్రేమాశీస్సులను అందుకో. ఈశ్వరసంకల్పానుసారము నా యారోగ్య మొకతీరుగనున్నది. హరిమహారాజునకు క్షేమ

నీ శ్రేయోభి—

౨౨

చిల్కాపేట
అల్మోడా, ఉ. ప్ర
9 సెప్టెంబరు 191

ప్రియతమ బాబురామ్ మహరాజ్
(ప్రేమానంద)

ఏమి? ప్రేమప్రవాహమును ఇటు పారనీక ఆనకట్ట కట్టబడినదా? ప్రేమానందుని ప్రేమప్రవాహము హిమాలయోత్తుంగముగ పొంగజాలదా? మఱి అట్లగుచో గంగాప్రముఖనదులు ఉత్తుంగపరుష శిలామయ హిమాలయములగుండ క్రిందికి ప్రవహించును. ఇక వారి భక్తులమైన మేము ఎంతకాలము మౌనముగ నుండగలము? కావున ఈనాడు ఈ జాబును నేను వ్రాయకుండ లేకపోయితిని. నీవు పూరీనుండి మరలి వచ్చితి వనియు ఇక జాబు వచ్చు ననియు ననుకొంటిని. కాని పెక్కు దినములు గడచిపోయినవి. మఱి నీయారోగ్య మెట్లున్నది? నీవు పోయిన పిదప నాకు మఠము నుండి జాబు లేవియు రాలేదు. మహారాజును చూచుటకు నీవు భద్రక్కునకు పోయియుంటివా?

కుట్టువాండ్రు చాలమంది క్షామబాధిత ప్రజలకు సేవచేయుటకై పోయి రని విన్నాను: ......గారు వ్యాధిగ్రస్తులై రనియు విన్నాను. ఆయన ఇప్పు డెట్లున్నాడో వార్త నీ కేమయిన అందినదా? ఈదినాలలో నీవు మఠములోకంటె ఎక్కువగా కలకత్తాలో నుండిన నేమో.

ఇచ్చట హరిమహారాజు నారోగ్యము మును పటికంటె చాల మెఱుగు. సమష్టి ఆరోగ్యము చాల బాగుపడినను మధుమేహవ్యాధి బాధ అట్లే యున్నది. అది పూర్తిగా నయమగునట్లు లేదు. కాని ఇక్కడి చల్లని వాతావరణము చేతను ఆహారమున వహించుచున్న జాగరూకత చేతను ఆయన కెంతో నయముగ నున్నది... ...ఫ్రాంకు బాగుగనే యున్నాడు. నాస్థితియు ఒకతీరుగ నున్నది. ఒకప్పుడు బాగుండును. ఒకప్పు డుండదు. మా ప్రేమాలింగన ప్రణతు లను గైకొనుము. కుబ్జవాంఛ కందటికి మా హృదయపూర్వక ప్రేమాశీస్సులను అంద జేయుము. మఠవార్తలను తెలుపుము.

ఈవర్షాకాలమున గంగానది వెల్లువ ఎదిగిన గరిష్ఠప్రమాణ మేమి? పశువులు ఆరోగ్యముగ నున్నవా? ప్రభాకరథాకూరు ఎట్లున్నాడు? నాహృదయపూర్వకాశీస్సులను అతనికిని అందిం పుము. "అపునండి" గారు ఇప్పుడు ఎట్లు న్నారు? విన్నవార్తలు ఆయనకు మిక్కిలి ఊఅట కలిగించునవిగా లేవు. మీతల్లి అక్క గారలు పూరీనుండి తిరిగివచ్చిరా? ఇక్కడ చలిప్రారంభ మైనది. వాన లించుమించు ఆగి పోయినట్లే;......

దాసుడు
తారకుడు.

# శివానందస్మృతులు—37

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరు మఠము, 26-3-1939 మంగళవారము.

సాయంకాలము 5 గం॥ గదిలో ఎక్కువ ఉష్ణముగ నుండినందున శ్రీమహాపురుషులు వరండాలో ఆసీనులై యుండిరి. శ్రీ అభేదానంద స్వామివారును, వారితోపాటు ఒక సన్న్యాసి సేవకుడును మఠమునకు వచ్చియుండిరి. అభేదా నందస్వామి సేవకుడు వచ్చి శ్రీ మహాపురుషు లకు ప్రణమిల్లి శ్రీవారి క్షేమసమాచారముల నరయగోరి – "మీ ఆరోగ్యము ఇప్పుడు కొంచెము మెఱుగుగా నున్నది కదా?" అని ప్రశ్నించెను. శ్రీవారు మందహాసముతో – ఓ! నీవు బలేవాడవు! ఈ ముసలివయస్సులో ఆరోగ్య మేలాగు బాగుండును? శ్రీభగవానుని ఇచ్ఛ, ఈలాగే దినములు గడవాలి."

సేవకుడు :—శ్రీరామకృష్ణ భగవానుని పార్షదులు – ఒకరిద్దఱు తప్ప మిగిలినవారు ఒక్కొక్కరుగ వెళ్ళి పోయినారు. మీ ఆరో గ్యము కూడ సరిగా లేదు. మీరు వెళ్ళి పోయిన పిదప మరల జన్మించెదరా? భగవా నుడు మానవరూపమున జన్మింపనిచో పార్షదు లగు మీరును జన్మింపరు కదా!

మహాపురుషులు :—నాయనా, ఈ విషయ ములు మాకేమియు తెలియవు సుమా! (శి)

భగవానుల కెందఱు భక్తులు లేరు? మమ్ము లనే వెంట నిడుకొని రావలెనని నిర్బంధమా ఏమి?

సేవకుడు :—మీరు శ్రీవారి పార్షదులరు కాన, తప్పక రావలసినదే.

మహాపురుషులు :—అట్టి నియమమేమియు లేదు, ఈ వ్యక్తిత్వము నశ్వరమైనది. జగత్తు అనిత్యము. కాని ప్రవాహరూపమున నిత్యము. భగవానుడు ఏకమాత్ర సత్యము. అతడే అనాదికాలమునుండి కలడు. లోకకల్యాణార్థము ప్రతియుగమందును నరదేహము దాల్చును. ఇది ఆయన అహేతుక కృపయే సుమా. ఆయన స్వయముగ పూర్ణుడు. శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడు. ఈప్రపంచమున ఆయన కెట్టి ప్రయోజనము లేదు – ఆయనకు పొందదగినది కాని – పొందవలసినది కాని ఎట్టిదియు లేదు – అటులయ్యు జగత్తులో అధర్మము ప్రబలి-భూమిని క్రుంగదీసినపుడు, పరమ కరుణామయుడగు భగవానుడు పతితుల నుద్ధరించుటకై స్వేచ్ఛగ నరదేహము దాల్చి ప్రపంచములోని కష్ట దుఃఖముల పాఱద్రోలును. భగవానుడు స్వయముగ గీతలో ఇలాగు చెప్పియుండెను—

"నమే పార్థాస్తి కర్తవ్యం
త్రిషులోకేషు కిఞ్చన ।
నానవాప్త మవాప్తవ్యం
వర్త ఏవచ కర్మణి ॥

"ఓ పార్థ, ముల్లోకములలో నా కెట్టి కర్తవ్యమును లేదు. నాకు అప్రాప్యమైన దేదియు లేదు. నేను క్రొత్తగా పొందదగినదియును, ఏదియు లేదు. అటులయ్యు నేను కర్మానుష్ఠాన ప్రవృత్తుడ నగుచున్నాను." ఎందులకు? భగవానుడు కర్మమొనరింపని పక్షమున లోకులు సర్వవిధముల ఆయననే అనుసరింతురు. దాని ఫలమున లోకులు చెడుదురు – వర్ణసంకర మేర్పడును – పలురకములగు అనర్థములకు దారితీయును. ఈ జగత్తు అనిత్యమైనదని భగవాను డెఱుంగును. అటుల ఎఱిగియు లోక కల్యాణార్థము ఆయనకు ఎన్ని కష్టముల నోర్చుకొనవలసి వచ్చుచున్నది! వేయేల, శ్రీరామకృష్ణుని జీవితము పరికింపుము. ఆయన సాధారణ మానవునివలె నడచుకొనెను. కాని ఆ ఏడు జానల శరీరములో సంపూర్ణమైన ఈశ్వరలీల నడచుచుండెను. బయట చూచుటకు మానవదేహము. కాని లోపల విరాడ్భగవచ్ఛక్తి.

"చిత్తమునకు ఏకాగ్రతను సాధించుకొనవలె ననిన అందులకు అభ్యాసము వైరాగ్యము అనువానికంటె సుకరమును అనుకూలమునగు పద్ధతి వేఱొకటి లేదు. నీవు జపమునకును ధ్యానమునకును వినియోగించు కాలము ఎంతైన గావచ్చు. పది పదునైదునిమిషములే కావచ్చు, కాని అప్పుడు నీ హృదయమునకు ధ్యానమున ఏకాగ్రత యుండవలయును. అంతర్యామిగ నున్నవాడును అన్నిటికిని ప్రవర్తకుడును పరమాత్మ. ఆయన నీ హృదయము నెఱుగును. ఎంతసేపు ధ్యానింతువు, ఎన్నితూర్లు జపింతు వనుట కా దతని మానము, నీలోని భగవత్తృష్ణయే అతని మానము."

—శ్రీమద్విరజానందస్వామి.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమిషను స్టూడెంట్సు హోము మైలాపూరు-మదరాసు 1968-69 సంవత్సర నివేదిక

హోములో మూడు శాఖలున్నాయి. హైస్కూలుశాఖ ఒకటి, కాలేజీశాఖ ఒకటి, టెక్నికలు (సాంకేతికవిద్యా)శాఖ యొకటి. మైలాపూరు సంస్కృతకళాశాలకు సంబంధించిన ఓరియంటలుస్కూలులో చదువుచున్న విద్యార్థులను 14 మందిని, నివాసభోజనవసతులిచ్చి హోములో చేర్చుకొన్నారు. హైస్కూలు విద్యార్థులకందఱికి స్కూలు ఇక్కడనే నివాసము ఇక్కడనే. కాలేజీశాఖలోఉన్న విద్యార్థులందఱు వివేకానందకాలేజిలో చదువువారే. టెక్నికలుశాఖలో డిప్లొమాకోర్సు చదువు విద్యార్థులకు భోజనవసతులుమాత్రం సమకూర్చబడినవి. డిప్లొమాకోర్సుకు పైతరగతిలోనికి కూడ కొందఱు విద్యార్థులు చేర్చుకోబడ్డారు. హోము యాజమాన్యమున ప్రాథమిక పాఠశాలలు రెండున్నాయి.

హైస్కూలు:-8-వ తరగతినుండి 11-వ తరగతివఱకు మొత్తం నాలుగుతరగతులున్నాయి. విద్యకఅపుటతోబాటు విద్యార్థులకు శారీరకమానసికాధ్యాత్మికపుష్టిని కలిగించుట ఇచ్చటి లక్ష్యం. ఆత్మవిశ్వాసం సమష్టిజీవితం నాయకత్వం అనువానిలో శిక్షణము సమకూర్చుటేగాక చక్కని శీలమును రూపొందించుటలో ఇక్కడ ఎక్కువశ్రద్ధ వహింపబడుతుంది. స్కూలుగంటలలోకాక ప్రత్యేకవేళలలో విద్యార్థులకు సంస్కృతభాష నేర్పబడింది. వారు అమరభారతీపరీక్షాసమితివారు జరిపిన పరీక్షకు కూర్చున్నారు. అన్నితరగతుల విద్యార్థుల మొత్తం సంఖ్య 154.

కాలేజీశాఖ: ప్రీ యూనివర్సిటీవిద్యార్థులు 13; బి.ఎస్.సి విద్యార్థులు 29; సంస్కృత ఎమ్.ఏ విద్యార్థి 1; బి.టెక్ విద్యార్థి 1.

టెక్నికలు ఇన్‌స్టిట్యూటు:-ఈ శాఖలో రెండేండ్ల మెకానికలు ఇంజనీరింగుకోర్సును ఒకసంవత్సరం ప్రీటెక్నికలుకోర్సును ఉన్నాయి. డిప్లొమాతరగతికి పైన ఒకటిన్నర సంవత్సరపు ఆటో మొబైలు ఇంజనీరింగుకోర్సు ఉన్నది. భోజనవసతులు పొందుచుండిన విద్యార్థులసంఖ్య ప్రీటెక్నికలు విద్యార్థులు 40; డిప్లొమా మొదటి సంవత్సరం విద్యార్థులు 24; డిప్లొమా రెండవ సంవత్సరం విద్యార్థులు 33; డిప్లొమాకు పైతరగతి విద్యార్థి 1. ప్రీటెక్నికలు తరగతి కాక తక్కిన తరగతులలో చదువుకునేందుకు మాత్రం వచ్చిపోయేవిద్యార్థులు 43 మంది ఉండినారు.

సెంటినరీ ప్రైమరీ స్కూలు, మైలాపూరు.- విద్యార్థులమొత్తంసంఖ్య 450; అందు బాలుర సంఖ్య 257; బాలికలసంఖ్య 193; ఇరవైమంది పిల్లలకు మధ్యాహ్నం భోజనం సమకూర్చబడుతూవచ్చింది.

ఉన్నత ప్రాథమిక పాఠశాల మల్లియంకరణై:-విద్యార్థుల మొత్తంసంఖ్య 150. అందు బాలురసంఖ్య 130; బాలికలసంఖ్య 20. ఇక్కడ వ్యవసాయవిద్యకూడ నేర్పబడుతుంది. ఈ స్కూలుకు సంబంధించిన హాస్టలులో ఉండిన విద్యార్థులసంఖ్య 42. వారిలో 35 మంది వెనుకబడిన నిమ్నవర్గాలవారు. మొత్తం నూఱుగురు విద్యార్థులకు మధ్యాహ్నభోజనం సమకూర్చబడుతూవచ్చింది.

## రామకృష్ణమిషను, సింగపూరు
## 1967 సంవత్సరం నివేదిక

రామకృష్ణమిషనువారు ఈ కేంద్రమును 1928 లో స్థాపించారు. అప్పటినుండి ఇది క్రమాభివృద్ధినొంది, నిర్ణయించుకున్న కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉన్నది. 1967 లో నిర్వహింపబడిన కార్యక్రమాలు:-

నారిస్ రోడ్డు 38-వ నంబరు గృహమున వివేకానంద తమిళ పాఠశాల ప్రాతస్సాయం వేళలందు జరుపబడుతూవచ్చింది. చేర్చుకోబడ్డ విద్యార్థులసంఖ్య సాయంవేళ తరగతిలో 60 మంది బాలురు; 50 మంది బాలికలు. ప్రొద్దుటి తరగతిలో 115 మంది బాలికలు; కలైమగళ్ తమిళ స్కూలు ప్రొద్దుటి వేళలలో జరుపబడుతూవచ్చింది. అందలి విద్యార్థులసంఖ్య 64 మంది బాలురు; 109 మంది బాలికలు.

బాలురవిడిది:- బార్ట్లీరోడ్డులో 179-వ నంబరు గృహమున ఉన్నది ఈ విడిది. ఇందు 8 సం॥ములనుండి 17 సంవత్సరములవఱకు వయస్సుగల బాలురు మొత్తం 55 మంది ఉన్నారు. వారు ప్రైమరీ సెకండరీ స్కూళ్లలో చదువుకుంటున్నారు. ఈ విడిదిలో ఉన్న శిశు గ్రంథాలయం చక్కగా వినియుక్తమైంది.

వయోజనులకై రాత్రి తరగతులు :- 2 తమిళ తరగతులలోను ఒక ఇంగ్లీషు తరగతిలోను మొత్తం 53 మంది విద్యార్థులు చదివారు. వారిలో అనేకులు సర్కారువారు జరిపే పరీక్షలకై సంసిద్ధులయ్యారు.

వైజ్ఞానికకార్యక్రమాలు:-సింగపూరులోను మలేసియాలోను స్వాములు వారం వారం తరగతులు జరిపి మత విషయికోపన్యాసాలు కావించారు. సంవత్సరపు తుదిదినాలలో సెరంబెన్ అనుచోట ఆధ్యాత్మిక విషయసమాలోచనకై సమావేశం జరుపబడింది. సాధక జిజ్ఞాసువులకు సలహాలివ్వబడ్డాయి. రామకృష్ణ మఠమిషనుల కేంద్రాధ్యక్షులు శ్రీమద్వీరేశ్వరానందస్వాములు ఏప్రిల్ నెలలో ఈ కేంద్రానికి విచ్చేశారు. శ్రీవారు సెరంబన్, ఐపో, పీనాంగ్, కువాలాలుంపూర్ మున్నగు చోటలకూడా పర్యటించారు. కొందఱు ప్రముఖులు కొందఱు సన్యాసులు ఈ కేంద్రమునకు విచ్చేసి మిషను సభాభవనంలో ఉపన్యాసాలు చేశారు.

శ్రీరామకృష్ణుని జయంతి, శ్రీశారదాదేవి జయంతి, వివేకానందస్వామి జయంతి మఱి కొందఱు ముఖ్యమతగురువుల జయంతులు ఇతరోత్సవవిశేషములు ప్రత్యేక పూజ ఉపన్యాసాలు భజనలు అనెడి కార్యకలాపాలతో నిర్వహింపబడ్డాయి.

గ్రంథాలయ పత్త్రికాపఠనాలయాలు:- వీనిలో 5118 గ్రంథాలున్నవి. 6 దినపత్త్రికలు; 34 ఇతరపత్త్రికలు తెప్పించబడుతున్నాయి. గ్రంథాలయాన్ని ఉపయోగించుకొన్నవారి మొత్తంసంఖ్య 2685.

# గ్రంథపరిచయం

## గాయత్రీమంత్రార్థము - మహిమ

పండిత శ్రీరామశర్మాచార్యుల హిందీ మూలమునుండి శ్రీరాంపల్లి శ్రీరామచంద్రమూర్తిగారిచే ఆంధ్రీకృతము. ప్రాప్తిస్థానము. రాంపల్లి కామేశ్వరి, పోడూరు, పశ్చిమగోదావరిజిల్లా. పుటలు 34, వెల రూపాయి.

మంత్రరాజమైన గాయత్రిఅనంతమహిమో పేత మనడం సుప్రసిద్ధం. నామనిర్వచనమును అవయవభూత శబ్దార్థవిశేష వివరణమునూ పండితశ్రీరామశర్మాచార్యగారు శ్రుతిస్మృతి పురాణప్రమాణాలతో చదువరులకు అందజేశారు. వారివివృతికి శ్రీరాంపల్లిశ్రీరామచంద్రమూర్తిగారు అన్యూనాతిరిక్తమును సరళమునగు ఆంధ్రానువాదమును సమకూర్చారు. ఏతన్మంత్రార్థజిజ్ఞాసువులకు ఈ చిఱుతకృతి కొంగుబంగారం.

## శ్రీ హనుమత్సంజీవనీ స్తోత్రము

'జయహను' మాంతములైన నూటెనిమిది నామాల సంకీర్తన రూపమైన యీ స్తోత్రం ప్రత్యక్షరమధురం, అత్యంతశ్రావ్యం, శ్రీ ధనకుధరం లక్ష్మీనృసింహాచార్య సంకలితం, తెనాలి శ్రీవాణి గ్రంథమాలా ప్రచురితం, దీనికి వెలలేదు, పోస్టేజి పంపినవారికి ఉచితంగా లభిస్తుంది.

—ప్రభాకర్.

---

తూర్పు పాకీస్తానునుంచి వచ్చిన కాందిశీకులకు 'హస్నాబాదు' 'బసిర్హాట్టు'లలో రామకృష్ణ మిషనువారి సాహాయ్య కార్యక్రమం

## జరూరు విన్నపం

తూర్పు పాకీస్తానంలో ఖుల్నా జిల్లానుంచి హస్నాబాదుకు బసిర్హాట్టుకు ప్రతిదినం కాందిశీకులు వేలాదిగా వచ్చి పడుతున్నారు. ఇప్పటికే ఐదువేలమంది నిలువనీడ కుడువ కూడు లేక అలమటిస్తున్నారు. అక్కడ రామకృష్ణ మిషన్ వారు సాహాయ్య కార్యక్రమం ఏప్రిలు 13-వ తేదినాడు ప్రారంభించారు. ప్రతిదినం సుమారు 15 క్వింటళ్ళ బియ్యాం పంచి పెడుతున్నారు. వచ్చిపడే కాందిశీకుల సంఖ్య హెచ్చేకొలది 'కలరా' 'మశూచి' వంటి అంటు వ్యాధులు వ్యాపించే అవకాశం ఎంతైనా ఉంది. ఆహారపదార్థాలు పాలు మందులు తాత్కాలిక విడుదు లేర్పఱచటానికి సామగ్రి—ఇవి మిషన్ వారికి జరూరుగా కావలసి ఉన్నాయి. సర్కారువారు కాందిశీకులను జట్టు జట్టుగా స్థలాంతరాలకు చేర్చివేస్తున్నారు. ఐనా, ఇంకా వంతు తమకు అందక ఎంతోమంది తహతహపడుతున్నారు.

దీన సోదరమానవులకు ఆదుకోడానికి ఉదారమహాజనుల తోడ్పాటు ఎంత ఆవశ్యకమో చెప్పాలా ?

విరాళాలను ఈ క్రింది విలాసాలకు పంపితే, కృతజ్ఞతతో స్వీకరిస్తాం. చెక్కులు పంపేవారు 'రామకృష్ణ మిషను' పేరట పంపాలి.

1. జెనరలు సెక్రిటరి, రామకృష్ణ మిషను, బేలూరుమఠం పోస్టు, హౌరా.
2. అద్వైతాశ్రమం, 5 దెహీఎన్టలి రోడ్డు, కల్కత్తా 14.
3. ఉద్బోధన్, 1-ఉద్బోధన్ లేన్, కల్కత్తా 3.
4. రామకృష్ణ మిషన్, కల్చర్ ఇన్‌స్టిట్యూట్, గోల్పార్క్, కల్కత్తా 29.
5. రామకృష్ణ మిషను ఆశ్రమం, తాకి, 24 పర్గణాలు.
6. శ్రీరామకృష్ణమఠం, మైలాపూరు, మద్రాసు, 4.

గంభీరానందస్వామి,<br>
జెనరల్ సెక్రిటరి,

# శ్రీరామకృష్ణ ప్రభ

## ఇరువదియాఱవ సంపుటము

౧౯౬౯ జూలై సౌమ్య నిజాషాఢము మొదలు ౧౯౭౦ జూన్ సాధారణ జ్యేష్ఠము వఱకు

సంపాదకులు :

శ్రీ హీరానందస్వామి,

నేలటూరి భక్తవత్సలము, ఎమ్.ఏ., బి.ఓ.ఎల్.

శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4.

సాలు చందా రూ. 5 | విడి ప్రతి 50 పైసలు

# విషయానుక్రమణిక

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుఁగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ స్వాంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము – రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషన్ (సేవాసంస్థ): తదాదర్శములు : కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికాధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధక్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్షవీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

# శ్రీ రామ కృ ష్ణ ప్ర భ

సంపుటము ౨౭ ౧౯౭౦ - జూలై : సాధారణ - ఆషాఢము సంచిక ౧

## విషయసూచిక




ఫోన్ : 71231 **శ్రీ రామకృష్ణప్రభ** పోస్టు బాక్సు : 635

1. 1970 జూలై నుండి శ్రీరామకృష్ణప్రభ ఇరవైఏడవసంపుటం జరుగుతూ ఉంది.
2. చందావివరాలు : ఇండియాలో రూ. 5-00 ; పిలోనులో రూ. 7-00. విడిసంచిక 50 పైసలు.
3. చందాదారులు జాబులలో తమచందాదారుసంఖ్యను చిరునామాను స్పష్టంగా వ్రాయాలి.
4. సంచిక అందకపోతే వారంరోజులలో తెలియజేయాలి.
5. మేము ప్రచురించిన తెలుగుగ్రంథాలలో అనేకములు శ్రీరామకృష్ణప్రభ చందాదారులకు తక్కువవెలకు అందజేయబడును. వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.
6. శ్రీరామకృష్ణప్రభ ప్రముఖసంస్కృతీకేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మికవిజ్ఞానపత్రిక. అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకం. రేట్లకు వ్రాయండి.
7. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపాలని గ్రంథకర్తలకు, ప్రకాశకులకు మా ప్రార్థన.

తక్కిన వివరాలకు ఈ చిరునామాకు వ్రాయండి :—

మేనేజరు : శ్రీరామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీరామకృష్ణమఠం, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

## అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సణ్డే స్టాణ్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౦ - జూలై : : సాధారణ - ఆషాఢము { సంచిక ౧

## వాల్మీకిస్తుతి

ఉ. ఏ కవిజిహ్వఁ దొల్త నటియించె సరస్వతి పాదనూపురో
ద్రేకఝళంఝళార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ, నే శుభ
శ్లోకునిమానసాబ్జమున శోభిలెఁ దారకహంస, మట్టి వా
ల్మీకిమహర్షి శేఖరు నమేయగుణాకరు నాశ్రయించెదన్.

—కంకంటి పాపరాజు.

క. పుట్టకుఁ బుట్టెడువేళం, దిట్టపునునుపచ్చిపుట్టతేనియచవితోఁ
బుట్టె నన, నమృత ముట్టెడు పుట్టనిసువు సత్కవిత్వమును పర్ణింతున్.

— తెనాలి రామకృష్ణుడు.

శా. శ్రీరామాయణకావ్యసారలలితశ్రీకల్పశాఖాగ్రమం
దారూఢస్థితిఁ బొల్చి భాసురజనాహ్లాదంబుగా మాధురీ
చారుప్రౌఢిమ 'రామ రామ' యనుచున్ సమ్యగ్వచోవైఖరుల్
మీరం బల్కు పికంబు నాఁబరఁగు వాల్మీకిం బ్రశంసించెదన్.

—మల్లికార్జునభట్టు.

చ. సరసిజగర్భనిర్మితలసచ్ఛతకోటివిశాలరాఘవే
శ్వరచరితంబు లోకహితసంగతి నిర్వదినాల్గువేలుగా
వరుస రచించినట్టి మునివల్లభు, నాదికవీంద్రు, యోగవి
స్ఫురితు, విరించనాంశభవుఁ, బుణ్యుఁ బ్రచేతసపుత్రుఁ గొల్చెదన్.

—గోపీనాథము వేంకటకవి,

# మారుతినుతి

సీ. తరుణార్కకబళనోద్ధతిఁ జూపె నెవ్వాఁడు రుచులచే ఫలమోహరుచులచేత,
నకలంకరామముద్రికఁ బూనె నెవ్వాఁడు శయముచే హృత్కుశేశయముచేత,
మున్నీరు పల్వలంబుగ దాఁటె నెవ్వాఁడు జవముచే గుణగుణార్ణవముచేత,
నక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు రణముచే నియమధారణముచేత,
ధరణి నెవ్వాఁడు దానవద్విరదదళన విహృతిఁ దనకేసరికిశోరవృత్తిఁ దెలిపె
నతని మత్కావ్యభవ్యవాగమృతఘటన మంజులస్వాంతు హనుమంతు మదిఁ దలంతు.

— రామరాజభూషణుఁడు.

సీ. శైశవంబుననె భాస్కరు మ్రింగె నితనితేజమున కేఘనుఁ డింక సదృశుఁ డనుచు
హనుతటోద్ధతి వజ్ర మడఁచె నీతనితనుద్రఢిమ కే మిఁకఁ బోల్పఁ దగునటంచు
నురుధాటిఁ గడలిలో మెఱసె నీతనిగభీరతకు నెయ్యది యింకఁ బ్రతి యటంచు
వాలాగ్రమున గిరుల్ వ్రాల్చె నీతనిధైర్యసంపద కిఁక నేవి సాటి యనుచు
జానకీరామచంద్రు లేశౌర్యవంతు పటుగుణస్ఫూర్తు లప్పటప్పటికి నెంతు,
రా మహాశాంతు నతిదాంతు నరికృతాంతు నతులమతిమంతు హనుమంతు నభినుతింతు.

— కంకంటి పాపరాజు.

సీ. రామనామాంకితరత్నముద్రిక యిచ్చి జనకజప్రాణ మే ఘనుఁడు నిలిపె
మైథిలీవరశిరోమాణిక్య మర్పించి కడిమి నెవ్వాఁడు రాఘవుని బ్రోచె
బ్రతికించె నెవ్వాఁడు పరమదివ్యౌషధీదానంబుచే సుమిత్రాతనూజుఁ
బూని యెవ్వాఁడు రామునిరాక యెఱిఁగించి భరతశత్రుఘ్నుల బ్రతుకఁజేసె
సమరమున మూర్ఛ నొందిన సకలకపులఁ బ్రాణము లొసంగి యేమహాబలుఁడు మనిచె
నట్టి పరమోపకారి జితాఖిలారి నద్భుతవిహారి సామీరి నభినుతింతు ॥

— గోపీనాథం వేంకటకవి.

ఉ. దండము చండముష్టిహతి దండితదానవచక్రవర్తికిన్
దండము వేదచోదితవిధానసమర్చితరామమూర్తికిన్
దండము భానుసూనుసముదంచితసైన్యచయాగ్రవర్తికిన్
దండము భర్జితాశ్రితజనప్రకరార్తికి నీకు మారుతీ.

— కొటికలపూడి కోదండరామకవి

# శ్రీ రా మ మం గ ళ ము

సీ. దండకావనజనస్థానమం దెవ్వాఁడు ఖరదూషణాదిరాక్షసులఁ దునిమె,
నెలయించి కొనిపోవ నెవ్వాఁడు పోనీక తఱిమి మారీచుమ స్తకము ద్రుంచె,
నగములఁ బఱపించి నడవఁగా జలరాశిఁ గట్టించె నెవ్వాఁడు కపులచేతఁ,
గలన రావణకుంభకర్ణాదుల వధించి కాచె నెవ్వాఁడు లోకత్రయంబు,

గీ. నవ్విభీషణవైరనిర్యాతనుండు రామచంద్రుండు శరణార్థిరక్షకుండు
ప్రజలు పొగడ నాచంద్రతారకముగా నయోధ్య సుఖలీలఁ బాలించుచుండు గాత.

—పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు.

## రా ము న కు న తి

సీతాసతి తెచ్చుటకై
దుష్టరాక్షసు ద్రుంచి
కోసల నేలిన గుణోత్తము
భద్రాధిపు నిన్ను ప్రార్థింతు మదిఁ
శరణాగతత్రాణ
సిరితో నేగి కరిని గాచితివి,
పాండుసుతుల పాంచాలిని బ్రోచితి,
ప్రహ్లాదనారదాదుల పరిరక్షించితి, వౌ,
పురుషోత్తమ, లక్ష్మీపతి, పురుహూతవినుత,
లోకకల్యాణమును ప్రసాదించు పుండరీకాక్ష,
నీమహిమల వాల్మీకి విరచించె నేమో!
నీశైశవాదుల దశరథాదులు తెలిసి రేమో!
నీశౌర్యమును సుగ్రీవప్రముఖులు శిరసా వహించి రేమో!
నీమాయ నెఱుగ బ్రహ్మేంద్రాదులకైన నగునా?
శక్యమా సామాన్యులకు? మాఅమ్మజానకమ్మ కెఱిగి
ఆమెమూలమున నిన్నాశ్రయించికొందు నీ దయను,
ఘనులగు దైవతముల కరుణామూర్తివి,
అపరాధసహస్రములను అపరిమితాఘముల నొనర్చితిఁ.

—శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మగారు.

# ఇతిహాస శ్రేష్ఠము

బిడ్డక్షేమమునకు తల్లి ఎటుల సాధకురాలో సకలప్రాణుల క్షేమమునకు 'శాస్త్రము' ఆలాగు సాధకము. ఏయేపనులు చేసిన మేలు కలుగునో వానిని చేయుడనియు, ఏయేపనులు చేయకుండిన మేలు కలుగునో వానిని చేయకుడనియు శాస్త్రము శాసించును. చేయుమనెడి శాసనమునకు విధియనియు చేయకుడను శాసనమునకు నిషేధమనియు పేరు. శాస్త్ర నియమములు విధినిషేధముల రూపములో నుండును.

"ఇవి యివి కర్తవ్యములు, ఇవియివి అకర్తవ్యములు" అని బోధించుట సకల సారస్వతమునకును ఉమ్మడిలక్షణము. విధి నిషేధములను కలుపు పద్ధతిలో భేదము లుండును, ఆ భేదములనుబట్టి వాఙ్మయమున శాఖలేర్పడును. (1) ప్రజలక్షేమముకోరి ప్రభువు వారిని "ఈ యీ పనులను చేయుడు, ఈ యీ పనులను మానుడు" అని శాసించుచుండును. 'చేయుడు' 'మానుడు' అని మాత్రము చెప్పునే కాని ఎందుకు చేయవలెనో ఎందుకు మానవలెనో కారణమును ప్రభువు చెప్పడు. కారణమును ప్రజ లడుగరు, అడుగరాదు, 'ఎందుకు చేయవలె' 'ఎందుకు మానవలె' అని యడుగుట అవినయము. మన క్షేమమును కోరియే ప్రభువు మనల నాజ్ఞాపించుచుండునని నమ్మియుండుట ప్రజల ధర్మము. అట్లు నమ్మి వారు ప్రభుని యాజ్ఞలను తలదాల్చి నెఱవేర్చి యోగక్షేమము లొందుచుందురు. వేదశాసనములు ప్రభుశాసనములవలె నుండును. 'సత్యంవద' 'నిజముపల్కు' మనును వేదము. ఏల పలుకవలెనో వేదము చెప్పదు. 'సత్యాన్న ప్రమదితవ్యం' 'సత్యముపట్ల పొరపడకు' మనును వేదము. పొరపడిన నేమో, ఏల పొరపడకుండవలెనో వేదము చెప్పదు. కావున వేదములను ప్రభుసమ్మితము లన్నారు. (2) ధర్మము ననుష్ఠించి శ్రేయమొందిన వారి చరిత్రములను, ధర్మమును ధిక్కరించి అధర్మప్రవణులై నశించిన వారి చరిత్రములను మిత్రుడు తెల్పిన రీతిలో దెలిపి కథా రుచులచే రంజింపజేసి చదువరులను ధర్మధీరులనుగను అధర్మ భీరువులనుగను జేయునవి యితిహాసపురాణములు. వీనిని సుహృత్సమ్మితము లన్నారు. (3) శృంగారాది రస సంపదచే చదువరులకు రక్తిగొలిపి తాము దిద్దువడుచున్నట్లు వారికి తెలియకుండగనే, వారిని ధర్మసారులుగను అధర్మదూరులుగను రూపొందించునది కావ్యవాఙ్మయము. దీనిని కాంతా సమ్మితమన్నారు. (1) వేదములు శబ్దప్రధానములు, (2) ఇతిహాసపురాణము లర్థప్రధానములు (3) కావ్యము రసప్రధానము - అను రీతిలోను తారతమ్యమును గుర్తించుట కలదు.

ఇతిహాసపురాణములను గైకొందము, శ్రీమద్రామాయణ శ్రీమహాభారతములను ఇతిహాసము లనియు, 'సర్గము ప్రతిసర్గము వంశము మన్వంతరము వంశానుచరితము' అను అయిదు లక్షణములచే లక్షితములైన బ్రాహ్మపాద్మవైష్ణవాదులు పదునెనిమిదియు పురాణములనియు పేర్కొనుట మన దేశాచారము. ఇతిహాసము లిట మన కిప్పుడు ప్రకృతములు. 'ఇతిహాస' మనగా 'హిస్టరి' అనియు శ్రీరామాయణ మహాభారతము లందలి కథలు కల్పితములు కావని చెప్పుట కాధారములు లేవనియు కావున వానిని చరిత్ర (హిస్టరి) గ్రంథములుగా గొనుట ఛాందసమనియు పలుకు విమర్శకులతో కలహమునకు మేము కడంగబోము. కాని ఆ రెండు గ్రంథములను ఇతిహాసము లని పేర్కొను సంప్రదాయమును తలదాల్పక విడువము.

ఈ యితిహాసములు రెంటిలో శ్రీమద్రామాయణము దేవీ వైభవమును దెల్పునదనియు శ్రీమహాభారతము దేవుని (శ్రీకృష్ణుని) వైభవమును దెలుపునదనియు దాక్షిణాత్య శ్రీ వైష్ణవ మహాచార్యులలో నొకరగు శ్రీ లోకాచార్యులవారు శ్రీవచనభూషణ మనెడి గ్రంథమున దెలిపి యున్నారు. వాల్మీకియే శ్రీరామాయణమును 'సీతాయాశ్చరితం మహత్' అనియు శ్రీవేదవ్యాసుడే మహాభారతమును 'నారాయణ కథా మిమాం' మనియు పేర్కొని యుండగా ఇతరులను చెప్పనేల?

శ్రీరామకృష్ణ ప్రభ ఇరువదియేడవ సంపుటమున నీ తొలిసంచిక శ్రీమద్రామాయణమునకే పూజాకుసుమముగా సమర్పితము. కావున, దాని మేలుములనే ఇంచుక తలపోసికొందము. ఆ యితిహాసములో వచ్చు మగవారును మహిళలును నిత్య మహోజ్జ్వలమూర్తులు. ప్రియసుతు నెడబాసిన క్షణముననే ప్రాణముత్క్రమించు నంతటి పితృప్రేమకు దశరథ మహారాజు లక్ష్యము. మగవారిని సైతము మరులు గొలుపు మేనిచక్కదనమునకు, సకల కల్యాణ గుణగణములకు, సత్యవ్రతమునకు, శరణాగత సంరక్షణ నియతికి, పితృభక్తికి, పిత్రాజ్ఞాపరిపాలన దీక్షకు, పతితపావన ప్రభావమునకు శ్రీరామచంద్రుడు లక్ష్యము. 'అహంచ రాజ్యంచ రామస్య' "నేనును రాజ్యమును శ్రీరాముని సొమ్ములము. నన్ను ఏలవలసినవాడు రాజ్యమును ఏలవలసినవాడు శ్రీరాముడే. రాజ్యము నన్నేలిన నెట్లుండునో నేను రాజ్యము నేలిన అట్లే యుండు" ననిన భరతునకు సాటి ఏడీ? శ్రీరామ సేవచేతనే తన జీవితమున ప్రతి క్షణమును సార్థకపఱచుకొన్న వాడు లక్ష్మణుడు. భరతసేవచేతనే తన జీవితమున ప్రతి క్షణమును సార్థకపఱచుకొన్నవాడు శత్రుఘ్నుడు. భగవత్పరిచర్యకు అంకితమైన లక్ష్మణుని జీవితమును భక్తపరిచర్యకు అంకితమైన శత్రుఘ్నుని జీవితమును విశ్వోపజీవ్యములైన పరమాదర్శాలు. రామాయణ మొక మహామాల, అందు నాయకరత్నము హనుమంతుడు. శ్రీ రామాశ్రయ భాగ్యము నధిగమించిన ధన్యులు సుగ్రీవుడును విభీషణుడును.

ఇక నిందు ప్రస్తుతలైన మగువలను పరికింతము: తన కాధారుడుగ నుండుటకై కొడుకును కనును లోకమున సామాన్యురాలగు తల్లి. లోకాధారుడుగ లోకసంరక్షకుడుగ నుండుటకై కొడుకునుగన్న ధర్మవీరమాత కౌసల్య. భగవత్సేవయు భక్తసేవయునే జీవిత పరమార్థములని స్వాచరణలో చూపిన మహాపురుషులను లక్ష్మణ శత్రుఘ్నులను కని సమర్పించిన ధన్యురాలు సుమిత్ర. శ్రీరాముని ప్రాణమునకు ప్రాణమనిపించుకొన్న భవ్యజీవియు లోకోత్తర గుణోత్తరుడు నగు భరతునిగన్న తల్లి కైకేయి. శ్రీరాముని పట్టాభిషేకమునకు విఘ్నకర్త్రినిగా ఈమెను దూషించువారు ఆ నోటితోనే ఈమెను 'భరతమాత' అని పేర్కొన్నంతనే మున్ను దూషించిన యపచారమునకు తా ముద్దేశింపకే అమోఘ ప్రతిక్రియ చేసినవారగుదురు. ఇక సీతాదేవి మహిమకు శ్రీ వివేకానందస్వాముల యీ క్రింది వాక్యములనుమించిన ప్రతిపాదకములుండవు :- "ఆదర్శ భారతీయతకు సీత ఉత్తమోదాహరణము...మంచికిగాని పవిత్రతకుగాని విశుద్ధికిగాని భారతీయ మహిళాధర్మమునకుగాని సీత పెట్టినది పేరు...క్షమాశీల, సర్వంసహా, సదా విశ్వాసపూర్ణ, సదా పరమసాధ్వి" రాతిని నాతిగజేయు శ్రీరామపాదరజఃప్రభావమునకు ప్రఖ్యాపకము అహల్యచరిత్ర–తారయు మండోదరియు 'నివాసవృక్షస్సాధూనామాపన్నానాం

పరాగతిః' 'వ్యక్తమేషమహాయోగీ పరమాత్మా సనాతనః' అని శ్రీరాముని పరమాత్మగా సాక్షాత్కరించుకొన్నవారు.

సాహిత్యదృష్టితోను ఆధ్యాత్మికధర్మదృష్టితోను భారతీయ సంస్కృత్యన్వేషకదృష్టితోను జూచినను రామయణాద్వితీయత తేటతెల్లమగును. శ్రీరామచరిత్రమున భాస కాళిదాస భవభూతి జయదేవ మురారి ప్రముఖ సంస్కృత మహాకవులు ఎంతయు ఆసక్తులై దాని మెఱుగులను తమ రచనలందు ప్రకటించియున్నారు. తెలుగు సారస్వతమునను మంత్రిభాస్కర-తిక్కనసోమయాజి - ఎఱ్ఱాప్రెగ్గడ గోనబుద్ధారెడ్డి-కంకంటి పాపరాజు మొల్ల మున్నగువారు రామకథాసుధారసపానమును మనకు సమకూర్చియున్నారు. భారతదేశమందును పెక్కువిదేశములందును బహుభాషలలోని కీయితిహాస శ్రేష్ఠము అనూదితమై యున్నది, కథలుగ, బుఱ్ఱకథలుగా, గద్యపద్యమిశ్రశ్రవ్యదృశ్య కావ్యాలుగా. అందఱికి మోజు రామకథ మీఁదేనా అను ఆ శంకకు కవులు చెప్పుకొన్న సమాధానాలు వినుడు—

"యదితృణ్ణం పూర్వై
రితిజహాతి రామస్య చరితం
గుణై రేతావద్భిర్జగతి
పునరన్యోజయతికః?"

"అందఱును చెప్పుచున్నకథనే మనమును చెప్పుటయా అని రామకథను వదలుకొందుమేని రామునివంటి కల్యాణగుణసంపన్నుడు మఱొక్కఁడేడీ" అన్నాడు భట్టమురారి.

స్వసూక్తీనాం పాత్రం
రఘుతిలకమేకం కలయతాం
కవీనాం కో దోష?
స్సతుగుణగణానా మవగుణః;

పి.

రపరగుణలుబ్ధై రివజగ
త్యసావేకశ్చక్రే
సతత సుఖసంవాసవసతిః.

"కవులందఱు తమ సూక్తులకు రఘుతిలకు నొక్కనే పాత్రీకరించుచున్నారు, ఇందు వారి తప్పేమి? అది (శ్రీరాముని కల్యాణ) గుణముల అవగుణమే. ప్రతిగుణమును తక్కినగుణముల మీఁది మోజుచేతంబోలె శ్రీరామునందే నెలకొనియున్నది" అన్నాడు జయదేవుడు.

వెలయఁగ నీ కథ విను ధ
న్యులు తక్కినకథలు వినఁగనొల్లరు,
మదిఁ, గా
కులరొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్న కర్ణంబులకున్?

అన్నాడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు. కంకంటి పాపరాజు 'రాఘవేశ్వరుచారిత్రము నెందఱెన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే' అని సమర్థించుకొన్నాడు.

శ్రీకృష్ణుడు గీతాశాస్త్రమును ప్రవర్తింప జేసినట్లు శ్రీరాముడే గ్రంథమును ఉపదేశించి యుండలేదు కాని శ్రీమద్రామాయణమున అయోధ్యాకాండప్రముఖఘట్టాలలో ఆయన నోట వెలువడిన సుభాషితరత్నములు విరళములైనను సరళములు, సోపమానములయ్యును నిరుపమానములు.

ముఖ్యముగ ఆంధ్రదేశప్రజలకు శ్రీరామభక్తి హెచ్చు. త్యాగరాజు రామదాసు మున్నగు వాగ్గేయకారుల రామపరములైన పాటలు సుప్రసిద్ధములు. రాజనీతి దండనీతి పాఠములు శ్రీరామాయణమున మెండుగ నున్నవి.

అన్నిటికంటె ముఖ్యమైన దిందు ప్రతిపాదితమైన ప్రపత్తి:—[1]'సన్నొక్కసారి శరణుజొచ్చినవారికి సకలభూతములబారినుండియు అభయమిచ్చుట నావ్రత'మనెను. శ్రీరాముడు [2]శరణు అడిగించుకొనుటకై వేచియుండక, పాపులు శుభులు అను భేదము పాటింపక అందఱిని కనికరింపవలె నన్నది సీతమ్మ.

పైని ప్రస్తావితములైన వైభవప్రాముఖ్యములఫలితముగా శ్రీరామయణమునకు ఇతిహాసశ్రేష్ఠమను ఖ్యాతి గలిగినది.

# ఆదికవి - వాల్మీకి

## శ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మగారు

1. మానవజాతిచరిత్ర ఒకమహాసముద్రమువంటిది. అప్పుడప్పుడు ధర్మాధర్మపక్షములు రెండు ప్రబలి యొకానొకజాతిని కవ్వముగా నొనర్చి దానిని మథించుచుండును. ఆ మథనమున మొదట నావిర్భవించునది అపారజనవినాశరూపమైన మహాసంగ్రామము. అది హాలాహలమువంటిది. కాని దాని వెన్నంటి అమృతకుంభమువలె మహాకావ్యము ఆవిర్భవించును. ప్రపంచ వాఙ్మయమున మహేతిహాస పూర్వకములుకాని మహాకావ్యములు కన్పింపవు. శ్రీమద్రామాయణమే ఇందులకు మొదటి దృష్టాంతము. త్రేతాద్వాపరసంధియందు భార్గవరాముడు క్షత్రియవంశములను నిర్మూలించెను. అది యదనుగ రావణుని నాయకత్వమున రాక్షసులు చెలరేగిరి. వారిని రఘురాముడు నిర్మూలించెను. ఈ మహావిప్లవములను ప్రతిబింబించుచు రామాయణ మావిర్భవించెను.

2. ఈ కావ్యావిర్భావమునకు, సీతారాముల జీవిత సంఘటనలకు నవినాభావసంబంధము కలదు. జనాపవాదమునకు వెఱచి శ్రీరాముడు సీతను వాల్మీకియాశ్రమప్రాంతమున వదలిరమ్మని లక్ష్మణున కాజ్ఞాపించెను. లక్ష్మణుండట్లు సీతను వదలిపెట్టి వెళ్లెను. మునిబాలకులు వచ్చి ఎవరో యొక స్త్రీ విలపించుచున్నదని చెప్పగా వాల్మీకిమహర్షి తపోలబ్ధమైనదృష్టితో సీత తనయాశ్రమప్రాంతమున పరిత్యజింపబడెనని గ్రహించి యామె యున్నచోటికి పరుగు పరుగున నేగి ఆమెనోదార్చి, "తపోలబ్ధమైన దృష్టితో నీవు పాపరహితవని నేను తెలిసికొనుచున్నాను. నీవు ఇచ్చట సంకోచము లేక విశ్వాసముతో నుండుము. నీవిప్పుడు నారక్షణము నొందితివి." అని పలికెను.

> అపాపాం వేద్మి సీతే త్వాం
> తపోలబ్ధేన చక్షుషా
> విస్రబ్ధా భవ వైదేహి
> సాంప్రతం మయి వర్తసే॥
>
> (ఉత్తరకాండ-సర్గ. 49 శ్లో. 10)

ఈ మాటలవలన సీతాదేవియొక్క యోగక్షేమముల భారమంతయు తనపై నున్నట్లు

---

1. సకృదేవప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ.

2. పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవఙ్గమ, కార్యం కరుణ మార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి.

వాల్మీకి స్పష్టమొనరించెను. వాల్మీకికి సీతారాముల జీవితవిశేషములు క్రొత్తవికావు. సీతారాములు మొదట వనవాసమునకు బయలుదేఱి వచ్చినప్పుడు చిత్రకూటమునొద్ద వారికి స్వాగతమొసంగినవాఁడు వాల్మీకియే. సీతారామలక్ష్మణులు ఆశ్రమము నిర్మించుకొని ఆయనచెంత కొంతకాలము ఉండిరి. భరతుఁడు వచ్చుట, రాముఁడు రాజ్యము నిరాకరించి అతనికి పాదుకల నొసంగుట, మొదలగువాని నన్నింటిని వాల్మీకి చూచుచునేయుండెను, తర్వాత జరిగిన రావణసంహారాది వృత్తాంతమునుకూడ ఆయన వినుచునేయుండెను. కావున సీతారాములు పరమధార్మికులైన యుత్తమదంపతు లనుటలో నాయనకెట్టి సంశయమును లేదు. అదియునుఁగాక లక్ష్మణుఁడు చెప్పినట్లుగా వాల్మీకి దశరథునకుఁ బ్రియమిత్రుఁడు.

> రాజ్ఞో దశరథ స్యైవ
> పితుర్మే మునిపుంగవః
> సఖా పరమకో విప్రో
> వాల్మీకి స్సుమహాయశాః॥
>
> (ఉత్తరకాండ-సర్గ-47. శ్లో. 16-17)

వాల్మీకికి పెద్ద బాధ్యతయే యేర్పడెను. భర్తకు దూరమై పుట్టినింటికిఁ జేరిన పుత్రికనుజూచి నప్పుడు తండ్రికి కలుగు ఆవేదనలవంటి పరితాపమే వాల్మీకికిని కలిగినది. సీతాదేవిని మరల నెట్లు శ్రీరామునొద్దకుఁ జేర్పవీలగునా యను చింత ఆయనకుఁ బ్రబలమయ్యెను. వారివియోగమునకు మూలమైన జనాపవాదమును తొలగించుట ఎట్లో ఆయనకుఁ దోఁపలేదు. ఇది యిట్లుండఁగా నామె కుశలవులను ప్రసవించెను. ఈ సంఘటనముతో నీసమస్య యింకను జటిలమయ్యెను. ఇప్పుడు సీతాదేవివిషయము మాత్రమే కాక యామె బిడ్డలభవిష్యత్తును గూర్చికూడ ఆయన ఆలోచింపవలసివచ్చెను. ఆమెశీలమునే శంకించిన జనులు ఆమె బిడ్డలను రామునిపుత్రులనుగా, రాజ్యార్హులనుగా నంగీకరింతురా యనునది పెద్దసమస్య. ఆయన ఈ సమస్యలతో వేగుచుండఁగా నారదమహర్షి ఆయనయొద్దకు వచ్చెను. అప్పుడు సంక్షుభితమైన యంతరంగముతో వాల్మీకి, "ఇప్పుడీ లోకమున గుణవంతుఁడెవఁడు? వీర్యవంతుఁడెవఁడు? ధర్మజ్ఞుఁడు, కృతజ్ఞుఁడు, సత్యవాక్పరిపాలకుఁడు, దృఢవ్రతుఁడైన వాఁడెవఁడు? ఎవఁడు గొప్పచరిత్రఁ గలవాఁడు? సర్వభూతహితుఁ డెవ్వఁడు?" అని యీ విధముగా ప్రశ్నించెను. (బాలకాండ-సర్గ-1, శ్లో. 2-3)

ప్రజలు సీతారాములఁగూర్చి సందేహించుచున్నారుగదా! మఱి రామునికన్నను గుణవంతుఁడు, ధర్మజ్ఞుఁడు, ధార్మికుఁడు నిప్పుడు లోకమున మఱియొకఁడు గలఁడా అను ఆవేదనమే యీ ప్రశ్నయందు కన్పించుచున్నది. నారదుఁడు వాల్మీకియొక్క సంశయమును తొలగించుచు రామునికన్న గుణవంతుఁడు ధార్మికుఁడు మఱియొకఁడు లేఁడని దృఢముగాఁ జెప్పుచు నాయన చరిత్రమును సంగ్రహముగాఁ జెప్పి వెడలిపోయెను.

౩. ఇట్లు రామునిచరిత్రమును నారదునివలనవినిన వాల్మీకికి, రాముఁడు పరమధార్మికుఁడే యను నిశ్చయ మేర్పడినను సీతాదేవియొక్కయు, కుశలవులయొక్కయు భవిష్యత్తును గూర్చినసమస్యకు సమాధానము లభింపలేదు. ఈయాలోచనముతో సతమతమగుచునే ఆయన భరద్వాజుఁడను శిష్యునితోఁగూడి మాధ్యాహ్నికస్నానమునకై తమసానదీతీరమునకుఁ బోయెను. ఆయన అచ్చటి జలమును జూచి ఇట్లనెను, "భరద్వాజా, నిర్మలమైన ఈ తీర్థమును జూడుము, ప్రసన్నమైన జలము గల

దియై మంచిమనుష్యుని మనస్సువలె రమణీయముగ నున్నది.''

> అకర్ద మిదం తీర్థం
> భరద్వాజ నిశామయ
> రమణీయం ప్రసన్నాంబు
> సన్మనుష్య మనో యథా॥

(బాలకాండ-సర్గ. 2 శ్లో. 5)

ఆయన ఆ సమయమున నిర్మలమైన సీతారాముల చిత్తవృత్తులనుగూర్చి, శంకాకలుషితమైన ప్రజల చిత్తవృత్తులనుగూర్చి భావించుచుండుటవలననే యిట్టియుపమాన మాయనకు స్ఫురించెనని చెప్పవచ్చును. ఆ సమయముననే బోయవాఁడొకఁడు జంటగానున్న క్రౌంచములలో మగపక్షినిసం హరించెను. ఆడుపక్షి విలపింపఁజొచ్చెను. అదిచూచిన వెంటనే యాయన హృదయము కారుణ్యముతో ద్రవించెను. ఆ చిత్తవృత్తి బోయవానిని చూచినంతనే కోపముగాఁ బరిణమించి శాపముగా శ్లోకరూపము నందెను. ఆయన వాని నిట్లు తిట్టెను. ''కామమోహితమైయున్న క్రౌంచమిథునమునం దొకదానిని నీవు చంపితివి. కావున నీవు చిరకాలము మనవు.''

> మా నిషాద ప్రతిష్ఠాం త్వ
> మగమ శ్శాశ్వతీ స్సమాః
> యత్క్రౌంచమిథునా దేక
> మవధీః కామమోహితమ్॥

(బాలకాండ-సర్గ. 2 శ్లో. 15)

4. శ్లోకరూపముగ నీవాక్యము వెలువడినంతనే, ''నే నేమి యిట్లంటిని?'' అని వాల్మీకికే చింతకలిగెను. ఆయన దానినిగూర్చి ఆలోచించి శిష్యునితో నిట్లుచెప్పెను. ''పాదములు కలిగి, ప్రతిపాదమునందును అక్షరములసంఖ్య సమానమై తంత్రీలయాన్వితముగ శోకార్తుఁడనైన నానుండి వెలువడిన యీవాక్యము శ్లోకమే యగునుగాని, మఱియొకటి కాదు.''

> పాదబద్ధోఽక్షర సమః
> తంత్రీలయ సమన్వితః
> శోకార్తస్య ప్రవృత్తో మే
> శ్లోకో భవతు నాన్యథా॥

(బాలకాండ-సర్గ. 2-శ్లో-18)

వేదములలో ఛందస్సులు ప్రసిద్ధములే, వానికసలు 'ఛందస్సులు' అనుపేరును గలదు. అందువలన ఛందోబద్ధమైన వాక్యము క్రొత్తవిషయముకాదు. కాని వేదములకు భిన్నముగ, లౌకిక విషయములందు సాధారణవ్యక్తులు ఛందోబద్ధముగ రచించుట క్రొత్తవిషయమే. కావుననే వాల్మీకికి, భరద్వాజునకు, తరువాత ఆశ్రమవాసుల కందఱకును నూతనమైన యీ శ్లోకావిర్భావము విస్మయమునే కలిగించెను. వాల్మీకి శిష్యునితో ఆశ్రమమునకు తిరిగివచ్చిన తరువాత ఆ వృత్తాంతమును గూర్చియే ఆలోచించుచుండఁగా, చతుర్ముఖుఁడాయనను చూచుటకు వచ్చెను. వాల్మీకి ఆయన నర్ఘ్యపాద్యాదికముల నర్చించెను. అట్లు లోకపితామహుఁ డర్చితుఁడై తనయెదుటఁ గూర్చుండియుండఁగా వాల్మీకి క్రౌంచములవృత్తాంతమునే స్మరించుచుఁదాను చెప్పిన శ్లోకమునే తలంపఁజొచ్చెను. అది గమనించి బ్రహ్మదేవుఁడు నవ్వుచు నిట్టు లనియెను. ''నీవు రచించినది శ్లోకమే. ఇందాలోచింపవలసిన దేమియు లేదు. నా సంకల్పమువలననే నీయం దిట్లు సరస్వతి యావిర్భవించినది. ధర్మాత్ముఁడు, భగవంతుఁడు నైన రాముని చరిత్రమును సమగ్రముగ కావ్యముగ రచింపుము. నీకు నిప్పటికిఁ దెలియనిదంతయు స్పష్టముగఁ గోచరము కాఁగలదు.

కావ్యమున నీవచనమేదియును అనృతము కాదు.''

(బాలకాండ-సర్గ. 2-శ్లో. 31-25)

5. అట్లానతిచ్చి చతుర్ముఖుఁడు వెడలి పోయిన తరువాత వాల్మీకిమహర్షి శ్రీరాముని చరిత్రమును స్మరించుచు తననుండి యావిర్భవించిన శ్లోకమువంటి శ్లోకములతో దానిని కావ్యముగ రచింపవలెనని నిశ్చయించుకొనెను. పిమ్మట నాయన శుచియై ప్రాచీనాగ్రములైన దర్భలయందు కూర్చుండి ప్రాంజలియై బ్రహ్మప్రసాదరూపమైన బుద్ధ్యతిశయము సాధనముగ సీతారామాదులచరిత్రము నుగూర్చి ఆలోచింప మొదలిడెను. అట్టి యోగస్థితియం దాయనకు వారి చరిత్రయంతయు కరతలామలకమయ్యెను. అట్లు ప్రత్యక్షమగుచున్న యా వృత్తాంతమంతయు నేడు కాండములుగ, నైదువందల సర్గములతో, నిరువదినాలుగువేల శ్లోకముల గ్రంథమును రచించెను.

6. ఈ సందర్భమున చతుర్థ సర్గారంభమున నొక శ్లోకముకలదు. ''రాజ్యమునుపొందిన రాముని చరిత్రమును సమగ్రముగ సద్భుతమైన పదసన్నివేశముతో మహార్థయుక్తముగ భగవంతుఁడగు వాల్మీకిమహర్షి రచించెను.''

ప్రాప్త రాజ్యస్య రామస్య
వాల్మీకి ర్భగవానృషిః
చకార చరితం కృత్స్నమ్
విచిత్రపద మర్థవత్ ॥

(బాలకాండ-సర్గ. 4-శ్లో-1)

దీనినిబట్టి రావణసంహారానంతరము రాముఁడయోధ్యారాజ్యమును -రిపాలించుచుండగా వాల్మీకి ఈకావ్యమును రచించెననుట స్పష్టము. 'ప్రాప్తరాజ్యస్య' అను పదమున మఱియొక విషయమును ధ్వనించుచున్నది. శ్రీరాముఁడు పదునాలుగేండ్లు వనవాస మొనర్చుచు రాక్షసుల సంహరించి తిరిగి రాజ్యమును పొందుట ఒకయెత్తు, ప్రజలలో మహారాణినిగూర్చి అపవాదము ప్రబలిన పిమ్మట ఆమెను దూరమొనర్చుకొని మరల ప్రజారంజకుఁడై రాజ్యమును పాలించుట మఱియొకయెత్తు. మొదటిదానికన్నను రెండవసందర్భమే చాల గడ్డైనది. వనవాసమునుండి తిరిగి వచ్చినప్పుడు శ్రీరాముని కొఱకు భరతుఁడు రాజ్యమును సిద్ధముగానే యుంచెను. దాని నాయన స్వీకరించుటలో సమస్య యేదియును లేదు. కాని రెండవసారి జనాపవాదము ప్రబలినపిమ్మట సీతాదేవిని దూరమొనర్చుకొని ప్రజానురంజనరూపముగ రాజ్యమును నిలుపుకొనుటయే మిగుల ప్రశంసార్హము. ప్రాణాధికప్రియురాలగు వైదేహిని దూరమొనర్చుకొని మహావిరహవ్యథావివశుఁడయ్యును స్వధర్మమైన రాజ్యపరిపాలనమును నిలుపుకొనియున్న శ్రీరాముని చరిత్రమును రచించితినని వాల్మీకిమహర్షి 'ప్రాప్తరాజ్యస్య' అనుపదమున ధ్వనింపఁజేయుచున్నాఁడు.

7. కావ్యమును రచించుట ఒకయెత్తు; దానిని లోకమున ప్రకటించుట మెత్తు. కావ్యమును పూర్తిగావించిన వాల్మీకి మహర్షి, ''దీని నెవరు లోకమునఁ బ్రచార మొనర్పఁగలరు'' అని చింతింపఁజొచ్చెను. సరిగా నాసమయమునకే కుశలవులు వచ్చి ఆయన పాదములకు ప్రణమిల్లిరి. వారు అప్పటికే వేదములందు పరినిష్ఠితులు; మంచి కంఠస్వరము కలవారు. కావున వారిని చూడఁగనే వాల్మీకి వీరే తన కావ్యప్రచారమునకు సమర్థులని నిశ్చయించి వెంటనే వారికి ఆ కావ్యము వాచోవిధేయ మగునట్లు నేర్పెను.

8. ఇచ్చట వాల్మీకి, రామాయణకావ్యమునకు రెండువిశేషణములనుపయోగించెను. అది సీతాదేవియొక్క మహనీయమైన చరిత్రయనియు, పౌలస్త్యవధమనియు ఆయన పేర్కొనెను.

> కావ్యం రామాయణం కృత్స్నం
> సీతాయా శ్చరితం మహత్
> పౌలస్త్యవధ మిత్యేవ
> చకార చరితవ్రతః॥

(బాలకాండ-సర్గ-4 శ్లో. 7)

భూషణ వ్యాఖ్యానమున శ్రీ గోవిందరాజ మిశ్రులు పేర్కొనినట్లుగ, "రామాయణ కావ్యము అప్రధానముగ రామచరితమును వర్ణించుచు, ప్రధానముగ సీతాచరితమునే ప్రతిపాదించుచున్నది."

"[ఇదంచ రామచరిత ప్రతిపాదనం అప్రాధాన్యేన, ప్రాధాన్యేన తు సీతాచరిత మేవ ప్రతిపాద్యతే ఇత్యాహ కృత్స్నం సీతాయాశ్చరిత మితి, కృత్స్నం రామాయణం సీతాచరిత పరమ్]

దీనినిబట్టి వాల్మీకిమహర్షి కావ్యమును రామునిచరిత్రముగ రచించుచున్నను, ఆయన మనస్సున ప్రధాన ప్రతిపాద్యముగ మెదలుచున్న విషయము సీతాదేవియొక్క చరిత్రమే యనుట స్పష్టము. రామునిచరిత్రము వాచ్యమగుచో సీతాదేవి చరిత్రము వ్యంగ్య మన్న మాట. ప్రజలీకావ్యమును విని సీతాదేవి ఎట్టి కష్టములు పొందినదో, అట్టికష్టములయందును తనశీల మహత్త్వము నెట్లు నిలుపుకొన్నదో, సకలదేవతా సమక్షమున అగ్నిపరీక్ష నొందిన తరువాతనే శ్రీరాముడామె నెట్లు స్వీకరించెనో చక్కగ గ్రహింపవలయుననియే ఆయన యాకాంక్ష. శ్రీరాముడు, సభాముఖమున, ఈకావ్యమును వినవలసినదని సభ్యులను కోరుచు చెప్పిన మాటలు గమనింపదగియున్నవి. "పార్థివలక్షణాన్వితులైన యీ మునిబాలకు లిరువురును కుశీలవులు. వీరు మహాతపస్వులు. ఈ కావ్యము నాకును శ్రేయస్కరమని చెప్పుచున్నారు. ఇట్టి మహానుభావమైన యీచరిత మును మీరును గ్రహింపుడు."

> ఇమౌమునీ పార్థివలక్షణాన్వితౌ
> కుశీలవౌ చైవ మహాతపస్వినౌ
> మమాపి తద్భూతికరం ప్రచక్షతే
> మహానుభావం చరితం నిబోధతం॥

(బాలకాండ-సర్గ. 4 శ్లో. 35)

రాముడు తన చరిత్రమునుగూర్చి మహానుభావమైనది యని చెప్పుట వింతగానే యున్నది. రాముడు ఆత్మప్రశంస గావించుకొనునా? పరమోదాత్తుడైన శ్రీరామునియందు నిది యసంభవము. అందువలన నాయనదృష్టి యందును, రామాయణము స్థూలముగ తన చరిత్రముగ కన్పించుచున్నను, సీతాదేవి చరిత్రమే ఇందు ప్రధానముగ ప్రతిపాదింపబడుచున్నది. కావున కావ్యమును రచించిన వాల్మీకికి, దానిని సభలో పాడించిన శ్రీరామునకును, మహాజనులందఱును సీతాదేవి మహత్త్వమును గురింపవలయు ననియే ఆకాంక్ష.

9. ఇట్లీకావ్యమును రాముడు పెక్కుదినములు వినెను. ఒకదినమున కథాసందర్భము ననుసరించి, సీతాదేవి కుశలవులను కనెను అను ఘట్టమును కుశలవులే గానమొనర్చిరి. వెంటనే రామునకు మరల నొక సమస్యయేర్పడెను. కుశలవులు రాజపుత్రు లగుటచే రాజ్యమునకు వారసులు. సీతాదేవి పతివ్రతగ, మహారాణిగ ప్రజలచే నంగీకరింపబడినప్పుడే

వారు రాజ్యమునకు వారసు లగుదురు. ఇది ప్రజలకు సంబంధించి వెంటనే నిశ్చయింప వలసినకార్యము. కావుననే రాముఁడు, సీతాదేవి ప్రజలసమక్షమున శపథము గావింపవలె నని వాల్మీకిమహర్షికి వార్త నంపెను. ఆయ నయు నంగీకరించెను. మఱునాఁడే శపథమునకై మహాసభ యేర్పాటుచేయఁబడెను.

10. మఱునాఁడు వాల్మీకి సీతను సభకు పిలుచుకొనివచ్చి రాముని సమీపించి, "నీవు లోకాపవాదమునకు వెఱచి పవిత్రురాలైన యీమెను పరిత్యజించితివి. నాయాశ్రమసమీపమున వదలిపెట్టఁబడుటచే నీమె నాచేత నాదరింపఁబడినది. ఈ కుశలవులు నీకుమారులు. నేను సత్యమును చెప్పుచున్నాను. నేను ప్రచేతసునకు పదియవకుమారుఁడను. అనృతము నెప్పుడును స్మరించి యెఱుఁగను. వేలకొలఁది సంవత్సరములు తపస్సుచేసితిని. ఈ సీతయందు దోషమే యున్నచో నేనాతపః ఫలమును పొందకుందునుగాక. ఈమె పరిశుద్ధురాలనియే నేను గ్రహించితిని. అయినను లోకాపవాదభీతుఁడవైన నీకొఱకీమె మరల శపథము చేయఁగలదు.

(ఉత్తరకాండ సర్గ 96 శ్లో. 15 నుండి 22)

అప్పుడు రాముఁడు ప్రాంజలియై వాల్మీకితో నిట్లనెను. "అయ్యా, తమ వాక్యములందు నాకు విశ్వాసము కలదు. వెనుక దేవతల సన్నిధానమున శపథము చేసిన తరువాతనే నే నీమెను స్వీకరించితిని. అయినను లోకాపవాద భీతుఁడనై ఆమెను పరిత్యజించితిని. ఈ విషయమున తమరు నన్ను క్షమింపవలయును. ఈ కుశలవులు నాకుమారులు అనియు నెఱుఁగుదును. అయినను సీతాదేవి లోకమునకు పరిశుద్ధురాలుగ ప్రకాశించినచో సంతోషింతును"

(ఉత్తరకాండ సర్గ 97 శ్లో. 2 నుండి 5)

11. సీతాదేవి శపథముచేయు నని కుతూహలముతో దేవతలు, మహర్షులు, యక్షరాక్షసపన్నగులు, మొదలుగా నసంఖ్యాకులైన జనులు అచటికి చేరుకొనిరి. వారినందఱను చూచి కాషాయవాసిని యైన సీతాదేవి తల వంచుకొని ప్రాంజలియై, "నేను మనోవాక్కాయ కర్మల రామునిఁదప్ప మఱియొకని భావించి యెఱుఁగనేని నాకు భూదేవి మార్గ మొసఁగును గాక!" అని ముమ్మారు శపథముఁ గావించెను.

(ఉత్తరకాండ సర్గ 97 శ్లో. 13 నుండి 16)

ఆమె శపథము గావించుచుండగనే రసాతలము నుండి దివ్యమైనన సింహాసనము పైకి వచ్చెను. భూదేవి సీతను కౌఁగిలించుకొని అందు కూర్చుండఁ బెట్టుకొని రసాతలమునకుఁ గైకొని పోయెను. ఈ సంఘటనమునకు ఎల్లరును విస్మితులైరి. శ్రీరాముఁడు పరమ దుఃఖితుఁడై భూదేవిపై కోపించి, సీతను మరల తన కొసంగకున్నచో సర్వనాశ మొనరింతునని పలుకఁజొచ్చెను. అప్పుడు బ్రహ్మదేవుడు ఆయనను శాంతింపఁజేసెను.

12. కావ్యపఠనమువలననే సీత, కుశలవులును శ్రీరాముని యొద్దకు మరల చేరుట సంభవించెను. కాని అక్కడ సమావిష్టులైన మహాజను లెల్లరును ఆశించినట్టుగా సీతాదేవి శ్రీరామునితో మరల సహవాసమును పొందలేదు. శపథము చేయునప్పుడు తన్ను రసాతలమునకుఁ గొంపొమ్మని సీత భూదేవిని ప్రార్థించునని ఎవ్వరును ఊహింపలేదు. వారందఱును, శపథము మహత్త్వము వలన భూదేవి ప్రత్యక్షమై సీతారాములకు మరల సహవాస మేర్పఱచుననియే తలంచిరి. శ్రీరాముఁడును అట్లే యాశించెను. అందువలననే ఆయనకు సీతానిర్గమనమున మహాదుఃఖము కలిగెను. ఈ కావ్యము నారంభించినప్పుడు వాల్మీకియైనను ఈ పరిణామమును

ఊహించియుండఁడు. అందువలననే సర్వము నెఱిఁగిన బ్రహ్మదేవుఁడు శ్రీరాము నోదార్చుచు విష్ణుస్వరూపమును స్మరింపవలసినదని. సీతాదేవికిని, ఆయనకును స్వర్గలోకమున మరల సమాగమ మేర్పడఁగల దనియు బోధించెను. ఆ లోకపితామహునిదృష్టియందు సీతారాముల యీ వియోగము చాల అప్రధానమైనది. సీతారాములచరిత్ర అశేష ప్రజానీకమునకు పర్వతములు, నక్షత్రములు నిలుచు పర్యంతము ధర్మప్రబోధకమై యుండుటయే, ఆయనదృష్టిలో నీ కావ్యమునకు పరమప్రయోజనము. అది సీతాదేవియొక్క శపథముచే భూదేవి ప్రత్యక్షమై యామెను రసాతలమునకు గొంపోవుటవలన సిద్ధించెను. దీనివలన సీతారాముల పరమ ధార్మికత్వము అత్యద్భుతముగ నిరూపింపఁబడినది. వారి చరిత్రమును వియోగాంతముగ చూచుచున్న ప్రజలహృదయము కరుణముచే ద్రవించెను. అట్లు ద్రవించిన మనస్సునందు సీతారాముల చరిత్ర చెరగని ముద్రగ నంకితమయ్యెను. కావ్యము సుఖాంతమే యగుచో లోకము వారిని గూర్చి అంత గాఢముగ భావించి యుండరేమో! కరుణరసమునకు గల యీ సామర్థ్యము మఱే యేరసమునకును లేదు. కావుననే లోకపితామహుఁడు ఈ కావ్యము కరుణముననే పుట్టి, కరుణముననే ముగియవలె నని సంకల్పించినట్లు తోఁచును. ఆయన కావ్యారంభమునందును కావ్యముయొక్క ముగింపు నందును కన్పించుట గమనింపఁ దగియున్నది. రావణసంహారమే ప్రయోజనముగ శ్రీరాముని చరిత్ర, విష్ణుదేవుఁడవతరించుసమయముననే ఎట్లు సమాలోచన పూర్వకముగ నిశ్చయింపఁ బడినదో, అట్లే పితామహుఁడు, ఆదికావ్యమైన యీ రామాయణముయొక్క ఆదిమధ్యాంతములను, స్వరూప స్వభావములను ముందుగనే నిశ్చయించి తద్రచనమున వాల్మీకిమహర్షిని సాధనమాత్రునిగ నియోగించెను. ఈయభిప్రాయము నాయన, ''నాసంకల్పమువలననే నీయందిట్లు సరస్వతి యావిర్భవించినది'' అను మాటలలో స్పష్టమొనరించెను. దీనినిఁబట్టి నారదాగమనమే కాక క్రౌంచవృత్తాంతము కూడ ఆయన సంకల్పానుసారముగనే జరిగిన దని మనము గ్రహింపవలసి యున్నది. అనఁగా ఆయన వాల్మీకియందు కవిత్వమును కరుణరసమునందావిర్భవింపఁ జేసి, యాయనచేత రామాయణమును కరుణరసాత్మకముగనే నిర్వహింపఁ జేసె నన్నమాట.

13. ఆయన ఈ కావ్యమునుగూర్చి రామునితో చెప్పిన మాటలు గమనింపఁదగియున్నవి. ''కావ్యములలో నుత్తమమైనది, నీవు విన్నది అయిన యీకావ్యమే నీకు ఇఁకముందు కర్తవ్యమైనదానిని చక్కఁగా బోధింపఁగలదు. నీవు పుట్టినప్పటినుండియు పొందిన సుఖదుఃఖముల వృత్తాంతమును, ఇఁక ముందు జరుగనున్న దానినికూడ వాల్మీకి ఇందు రచించెను. ఈ యాదికావ్య మంతయును నీయందే ప్రతిష్ఠితమై యున్నది. రాఘవుఁడైన నీకన్న నన్యుఁడు కావ్యములలో యశము నందుట కర్హుఁడు కాఁడు''

ఏత దేవ హి కావ్యం తే
కావ్యానాం ముత్తమమ్ శ్రుతమ్
సర్వం విస్తరతో రామ
వ్యాఖ్యాస్యతి నసంశయః॥

జన్మప్రభృతి తే వీర
సుఖదుఃఖోపసేవనమ్
భవిష్య దుత్తరం చేహ
సర్వమ్ వాల్మీకినా కృతమ్॥

ఆదికావ్య మిదం రామ,
త్వయి సర్వం ప్రతిష్ఠితమ్
నహ్యన్యోఽర్హతి కావ్యానాం
(ఉత్తరకాండ-సర్గ-98 శ్లో. 16, 17, 18)

చతుర్ముఖుఁడు, "కావ్యములలో నుత్తమమైనది" అని చెప్పి వెంటనే "ఇది ఆదికావ్యము" అని చెప్పుట వింతగఁ దోఁచును. ఇది కావ్యములలో నుత్తమ మన్నప్పుడు, అప్పటికి కొన్ని కావ్యము లుండినఁగదా నిది వానిలో నుత్తమమగుట? అట్లైనచో నిది యాదికావ్య మెట్లగును? కావున 'ఉత్తమ కావ్య' మనఁగా ఇది యిఁక ముందు రచింపఁబడు సకల కావ్యములయందును శ్రేష్ఠమైనదిగా నుండు ననియే చతుర్ముఖుని యభిప్రాయముగ మనము గ్రహింపవలసి యున్నది. కాని రామాయణమందే నృత్యములు, గీతములు, నాటకములు, మొదలగునవి యచ్చటచ్చట ప్రస్తావింపబడియున్నవి. మఱి ఆ గీతములలో, నాటకములలో కవిత్వమే లేదా? అట్లైనచో నిది ఆదికావ్య మెట్లగును? వాల్మీకిని ఆదికవి యని ఏల చెప్పవలయును? ఇచ్చట ఒకవిషయమును గమనింపవలసియున్నది. ఆద్యత్వము కేవలము కాలముచే నేర్పడదు. రామాయణ రచనకుఁ బూర్వము ఏవేని కొన్ని గీతముల వంటి రచనము లున్న వనుకొన్నను అవి ఆదికావ్యములు కావు: వానిని రచించిన వారును ఆదికవులు కారు. ఏది స్థిరముగ నిల్చి అనంతర కవుల కందఱకును కావ్యరచనమున మార్గదర్శకము కాఁగలదో అట్టి కావ్యమే ఆదికావ్యమగును; తత్కర్తయే ఆదికవి యగును. మొదటిసారి ఈ కావ్యమును వినిన మహర్షులు ప్రశంసించుచు చెప్పినమాటలలో నీ విషయమే వ్యక్తమగుచున్నది. వా రిట్లనిరి. "వాల్మీకిచే రచింపఁబడిన ఈ చరిత యాశ్చర్యముగ నున్నది. యథాక్రమముగ సమాప్తమైన ఈ కావ్యము కవులకు పరమమైన యాధారముగ నున్నది."

ఆశ్చర్యమిద మాఖ్యానం
మునినా సంప్రకీర్తితమ్
(శ్లో. 26)

పరమ్ కవీనా మాధారమ్
సమాప్తం చ యథాక్రమమ్॥
(శ్లో. 27)
బాలకాండ-సర్గ. 4.

రామాయణమునకు పూర్వము గీతముల వంటి రచనము లేవైన నుండినను వానికి నిట్టి సామర్థ్యము లేదు. కావుననే యవి కాలగర్భమున కలిసిపోయినవి. వ్యాసభాసకాళిదాసాది మహాకవుల కెల్లరకును మార్గదర్శకమగుటచే నిది ఆదికావ్య మయ్యెను; వాల్మీకియు నాదికవి యయ్యెను.

14. ఆదికవియైన యీ మహర్షి చరిత్రమును గూర్చి మనకంతగా తెలియవచ్చుటలేదు. ఈయన మొదటిపేరు ఋక్షుఁడు; భృగు మహర్షి వంశమున ప్రచేతసునకు పదియవ కుమారుఁడుగ జన్మించెను. ఈయన పెక్కువేల సంవత్సరములు నిశ్చలముగ తపస్సుచేయుటచే ఈయనకు చుట్టును పుట్ట పెరిగెను. తరువాత గొప్పవర్షము కురిసి ఆ పుట్ట కరిగిపోయి దాని నుండి ఈయన వెలువడుటవలన నీయనకు వాల్మీకియనియు పేరు కలిగెను. వర్షాధిదేవత యగు వరుణునకును ప్రచేతసుఁడను నామము కలదు. అందువలనకూడ నీయన ప్రాచేతసుఁ డయ్యెనని కొందఱందురు. ఈ మహర్షినిగూర్చి

రామాయణతిలకము, శిరోమణి, భూషణము అను మూఁడు వ్యాఖ్యలయందును ఇంతకన్నను విశేషము లేమియు కన్పించుటలేదు. ఇప్పుడు వాల్మీకిచరిత్రగ ప్రసిద్ధమైయున్న బోయవాని వృత్తాంతమును ఈ వ్యాఖ్యాతలలో నెవ్వరును పేర్కొనకుండుట గమనింపఁదగియున్నది.

15. మహాకవిశ్రేష్ఠుఁడు విశ్వకవియునైన యీ మహర్షి తనయందు నింత కవిత్వశక్తి కల దని, అది యావిర్భవించునంతవఱకును ఎఱుఁగనే ఎఱుఁగఁడు. శ్లోకరూపమున కవిత్వము ఆవిర్భవించిన తరువాతకూడ నాయన యొక కావ్యమును రచింపవలయునని తలంపలేదు. చతుర్ముఖుఁడు వచ్చి లోకోత్తరచరిత్రుఁడగు శ్రీరాముని చరిత్రమును కావ్యమునుగ వ్రాయుమని యాదేశించినతరువాతనే యాయన కావ్యరచనకు పూనుకొనెను. శ్రీరాముఁడు మూర్తీభవించిన ధర్మము. వాల్మీకిమహర్షి వేదవేదాంగధర్మతత్త్వనిధానము. అందువలన రామాయణకావ్యము సకలవేదధర్మతత్త్వప్రతిపాదకముగ రూపొందినది. ఈ కారణముననే, ''వేదవేద్యుఁడగు పరమపురుషుఁడు దశరథాత్మజుఁగా జన్మింపఁగా, వేదమే సాక్షాత్తుగా వాల్మీకిముఖమున రామాయణముగ ప్రభవించెను'' అని లోకమున ప్రఖ్యాతి కలిగినది. వాల్మీకిమహర్షి ఈ కావ్యమును కుశలవులకు నేర్పునప్పుడు ఈ యభిప్రాయమే వ్యక్తమగుచున్నది. వేదములయందలి ధర్మతత్త్వములను ప్రకాశింపఁజేయుటకొఱకే ఆ మహర్షి కుశలవులకు ఈ కావ్యమును నేర్పెను.

> వేదోప బృంహణార్థాయ
> తా వగ్రాహయత ప్రభుః॥
>
> బాలకాండ-సర్గ. 4 శ్లో. 6)

కావున ఈ కావ్యమునకు ధర్మతత్త్వప్రబోధరూపమైన లోకహితమే పరమప్రయోజనము ధర్మతత్త్వప్రతిపాదకమై లోకహితమైనదియే మహాకావ్యమగును; తత్కర్తయే మహాకవి యగును.

# శ్రీమద్రామాయణ ప్రాశస్త్యము

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు

> శ్రీమద్దివ్యమునీంద్రచిత్తనిలయం సీతామనోనాయకం
> వల్మీకోద్భవ వాక్పయోధిశశినం స్మేరాననం చిన్మయం
> నిత్యం నీరదనీలకాయమమలం నిర్వాణసంధాయినం
> శాన్తం నిత్యమనామయం శివకరం శ్రీరామచంద్రంభజే॥
>
> యఃకర్ణాంజలి సంపుటై రహరహస్సమ్యక్పిబ త్యాదరాత్
> వాల్మీకేర్వదనారవిన్దగళితం రామాయణాఖ్యంమధు
> జన్మవ్యాధి జరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
> సంసారంసవిహాయ గచ్ఛతిపుమాన్ విష్ణోఃపదంశాశ్వతమ్॥

అని హిందువులచేత నిరంతరము ధ్యానింపబడుచున్న శ్రీమద్రామాయణ ప్రాశస్త్యమును గూర్చి కొన్ని గ్రంథములే వ్రాయవచ్చును. ఎంతవ్రాసినను ఇంకను వ్రాయుటకు మిగిలియే యుండును, ఎంతవ్రాసినను తనివి యుతీరదు. ఇట్టిది సంస్కృత వాఙ్మయమందేగాక, భారతీయ వాఙ్మయములందేగాక ప్రపంచవాఙ్మయమందే విశిష్టస్థానమలంకరించి యున్నది. కవిత్వమందేమి, కథామార్గమందేమి నీతిమార్గోపదేశమందేమి ప్రపంచమునకొక ఆదర్శమై భక్తిమార్గమందు అన్నిటిని మించిన తారకరాజమై యలరారుచున్నది. ఈవిషయమునంతయు ఇట్లు మూడుభాగములుగా పరిగణించి సంగ్రహముగా వ్రాయుచున్నాను — కథామార్గము, కావ్యమార్గము భక్తిమార్గమునని.

1. కథామార్గమందు రామాయణము గృహస్థాశ్రమధర్మమును, లోకనీతిని రాజనీతిని సదాచారమును, సత్ప్రవర్తనమును మానవస్వభావమును స్త్రీధర్మమును అతి విపులముగా బోధించుచున్నది.

2. కావ్యమార్గమందు ఆదికావ్యమై తర్వాతి రచయితలకెల్ల ఆదర్శమై శిక్షకమై యొప్పారుచున్నది. రామాయణమునుండియే కాళిదాసాదికవులు నేర్చుకొనిరి.

3. భక్తిమార్గమున శ్రీరామనామము తారకమంత్రము. శ్రీరాముడు శ్రీమన్మహావిష్ణువు నవతారము. అట్టి మహాపురుషుని చరిత్రమును భక్తితో పఠించువారికి ఇంతింతయనరాని పుణ్యమని పురాణములు చాటుచున్నవి. పూర్తిగా రామాయణమును పఠించినను కొద్దికొద్దిగా అందలి భాగములను పఠించినను ఒక్కొక్క-దానికిని ఒక్కొక్క ఫలము, కార్యసిద్ధి మానసిక శాంతియు పెద్దలు అనుభవించి చెప్పియున్నారు. హిందువుల కందఱికిని, వీరువారనక శైవవైష్ణవాది భేదములకు చోటీయక, నిత్యపారాయణ గ్రంథముగా సకలానిష్టనివారకముగాను, ఐశ్వర్యప్రదముగాను నున్నది.

ఇందలి యొక్కొక్క భాగమునకును వివరణముల్వ్రాసి ఉదాహరణములు చూపుచు రచించినయెడల అదియే యొక పుణ్యకార్యముగా కూడ భావింపదగును.

## 1. కథామార్గమందు :

వేదములలో పురాణములలో భారతభాగవతములలో ఎన్నికథలో కలవు కాని వేదములు ఎల్లవారికి అందవు, అర్థము కావు. పురాణములు బహువిషయ బోధకములై గ్రంథబాహుళ్యాదులచేతను భిన్నవిషయ బోధకతచేతను సామాన్యులను సూటిగా ఒక లక్ష్యముమీద బుద్ధిని నిలుపునట్లు చేయక సమాధిని చెదరగొట్టుచున్నవి. మహాభారతమును ప్రౌఢబుద్ధులకే గోచరించును. భాగవతము ఎంత భక్తిని బోధించి భగవంతుని యవతారములను భక్తుల మహిమను ఉద్ఘాటించినను వస్త్వైక్యము లేనందున లక్ష్యమునకు తప్పిపోవుచున్నది. అట్లుగాక పూర్తిగా గుఱిగా చదివి, ధ్యానించి అనుభవించుటకు రామాయణమందలి కథయు, కథలోని వస్త్వైక్యమును అనుకూలించినట్లు మిగిలినవి అనుకూలింపవు. 'సుఖాత్ అల్పధియామపి' అన్నట్లు మందబుద్ధులకుగూడ, పండితులకేగాక పామరులకు గూడ, వృద్ధులకేగాక బాలురకు గూడ, పురుషులకేగాక స్త్రీలకుగూడ—ఇంతేల వీరువారనక హైందవేతరులకుగూడ సులభగ్రాహ్యమై, చర్విత చర్వణముగుకొలది నవనవోన్మేషమై బుద్ధికి ప్రకాశమిచ్చి ఆనందము కలిగించుచున్నది.

కావ్యమెవరెంత చక్కగా రచించినను దాని ప్రయోజనము నెఱవేఱవలయునుగదా. అట్టి ప్రయోజనములలో ఉపదేశమును ముఖ్యమైనదిగా మనవారు పాటించినారు. అది అతి సుకుమారముగా కాంతాసమ్మితముగా నుండవలయు నన్నారు. పిల్లలుకూడ కథలువిన్నట్లు ఆజ్ఞలను నీతులను వినరు. కథామార్గమున నీతిని బోధించుట చక్కెరపూసి చేదుమందిచ్చుటవంటిది. వట్టి చేదుమందు ఆరోగ్యకరమేయైనను చాలమంది త్రాగరు. కథ అట్టి చక్కెరవంటిది. కావుననే ఆ మహానుభావుడెవడో "యఃకర్ణాంజలి సంపుటైః" అన్నశ్లోకమున రామాయణాఖ్యం మధువని దీనిని తేనెను పోల్చినాడు. కష్టసుఖములు మానవులకు సహజములు. 'మేలుచేయువాడు మేలునుపొందును కీడుచేయువాడు కీడెపొందు' అన్నది కథలో చక్కగా చెప్పవచ్చును. శ్రోతలు కథలు వినునప్పుడు తమ చరిత్రములనుకూడ ఆయా సందర్భములలో స్మరించుచుందురు. రామాయణమును ఆదర్శపురుషుడైన శ్రీరామునియొక్కయు అట్లే పతివ్రతాలలామయైన సీతాదేవియొక్కయు చరిత్రముగా వాల్మీకి చిత్రించినాడు. ఇక్కట్టులలో ఎట్లు మెలగవలయునో ఎట్లు నడుచుకొనవలయునో కథ తెల్పునట్లుగా కవి నిబంధించినాడు. ఇది పాత్ర పరిశీలనచే తెలియును.

దశరథుడు చక్రవర్తి. ఇతనిలో రాజధర్మమును, పితృవాత్సల్యమును, సత్యవాక్యపరిపాలమును కవి ప్రదర్శించినాడు. లోకపాలనమును ధర్మముతప్పక నెఱవేర్చుటయేగాక కైకేయికిచ్చిన మాటను కాపాడుకొనినాడు, కుమారుని తననోటితో నడవికి పొమ్మనలేక బాధపడినాడు. రాముడన్ననో ధర్మబద్ధుడు, తనహృదయము నెఱిగి ఎట్టి అడ్డమును పలుకక అడవికి బయలుదేఱి తండ్రి సత్యమును కాపాడెను. ఎదురుతిరిగి యుండరాదా, ఆక్షేపించియుండరాదా, లేదు. రాజ్యముకన్న ధర్మమేగొప్పది.

రామాయణమందు కైకేయీపాత్ర కీలకస్థానము నాక్రమించుచున్నది. ఆమె వరము లడుగనిచో కథయే లేదు. ఆమెలో తప్పేమి? అది స్త్రీస్వభావము. ఉత్తమక్షత్రియాంగన, రాముని హృదయపూర్వకముగా ప్రేమించినట్టిది, ఆతని ఆధిక్యము నెఱిగినట్టిది, కౌసల్యయందెంతో గౌరవము గలది, రాముని యభిషేకవార్తవిని సంతోషించినట్టిది, నిష్కపటి మంథర దుర్బోధనలచేతగదా దుర్బుద్ధియైనది. అందఱును మంచివారే, సందర్భములనుబట్టి చెడ్డవారగుదురనుటను కవి తెల్పినాడు. తన కుమారునికి రాజ్యమడిగి ఆతడు దానిని వలదని తన్ను దూషించినప్పుడు తెల్లబోయినది. కుమారుని హృదయము నెఱిగియుండినఅడిగియుండదేమో! సమయమునకు భరతుడు లేకపోవుటయు కథ పెరుగుట కవకాశమిచ్చినది. ఆతనిగుఱించి ఎవరును ఆలోచించినట్లు కానరాదు. రాజ్యమును సంతోషముతో గ్రహించునని అందఱు తలంచినట్లున్నారు. ఎంత పొరపాటు! వాల్మీకి స్త్రీపాత్రచిత్రణములో కైకేయిని చిత్రించి కాళిదాసునకే గురువనిపించుకొన్నాడు.

సీతాదేవి ఆదర్శగృహిణి. భర్తచిత్తవృత్తి ననువర్తించినది. సీతయే కైకేయీస్థానమందుండినయెడల ఆవరములను అడిగియుండదు. వరములుగావు, తన సంతోషముగాదు తనకు కావలసినది భర్తయొక్క ఆనందము. తన్ను భర్త త్యజించినందులకు చింతింపలేదు, లోకనిందకు చింతించినది. తనలో దోషములేదని ఋజువుచేసి నిష్క్రమించినది. కౌసల్యాసుమిత్రాదులలో సామాన్యగుణములేగాని విశే

షాంశములకు తావులేదు. కాని వారుకూడ ఎదురుతిరుగలేదు. లోకముతోపాటు చింతించిన వారుమాత్రమే. మిగిలినపాత్రలంతయు ఆదర్శ ప్రాయములుగా నుండియు మానవస్వభావోచి తములుగా నున్నవి. రాముని తర్వాత అంతటి వాడు భరతుడు. అంత సులభముగా అప్ర యత్నముగా తనకబ్బిన రాజ్యమును అన్నమీాది భక్తిచే అనుభవింపక అన్నకొఱకే కాపాడి నాడు.

రావణునియందు వాల్మీకి ప్రతినాయకుని గుణములను భావి నాటకకర్తలకెల్ల ఆదర్శ ప్రాయముగా వర్ణించినాడు. ఎంతటివాడు! ఎంత సుగుణసంపత్తి యుండియేమి, ప్రమాద మునకు లోనైనచో వధ్యుడేగదా. అట్లే వాలియు. లక్ష్మణభరతులలో ఎంతభేదము కలదో విభీషణకుంభకర్ణులలో అంత కలదు. వీరిరువురును సహోదరప్రేమకలవారే. ధర్మ బద్ధులుగాను సందర్భోచితముగాను మెలగి నారు. మూఢులుకారు, ప్రాజ్ఞులు. ఒకడు అన్నను వదలలేదు; ఇంకొకడు భగవంతుని శరణుజొచ్చినాడు. కుటుంబములలో సౌభ్రా త్రము ఎన్నిభంగులో రామాయణము చూపు చున్నది. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు, రావణకుంభకర్ణవిభీషణులు, వాలిసుగ్రీవులు, కుశలవులు, ఎంత వ్యత్యాసము, స్నేహము తోడి అభిప్రాయభేదములు, భీతితోడి కల యికలు, కపటమెఱుగని ప్రవర్తనలు, దుష్ప్రవర్తకునియం దనుతాపము, తనప్రార్థ నను త్రోసిపుచ్చినందులకు దుఃఖము – ఇట్లు త్రోసిపుచ్చరాని ఇఱుకటములు, తప్పరాని పరిణామములు–ఈవిధముగా నిత్యజీవనమున కును మానవస్వభావమునకును, దైవనిర్ణయ మునకును ప్రతిబింబమనదగి రచింపబడినది రామాయణము.

## 2. కావ్యమార్గమందు :

రామాయణము ఆదికావ్యము. ఇది రచ నకు వ్రాయునట్టి వక్కాణకు సంబంధపడినట్టిది. ఎట్లు వ్రాయవలయును, ప్రారంభమెట్లు, విషయ విభజనమెట్లు, వర్ణనాంశములెట్లు, ఏయే రస మునకు ఏయే వృత్తము నుపయోగించిన మనోహరముగా నుండును, పదములకూర్పెట్లు– ఇత్యాదుల నాలోచించి వ్రాయవలసినది కావ్యము. ఛందస్సు అనాది. ఛందస్సనగానే వేదము. అనుష్టుప్పు వేదములలోనే కలదు. కాని మూడుపంక్తులు. అట్టి ఛందములో అప్రయత్నముగా నొక సన్నివేశములో, తన నోట నాలుగుపంక్తుల శ్లోకము వెడలుటయు, అందులకు తానును సమకాలికులును ఆశ్చర్య పడి, తాను కావ్యనిర్మాణాసక్తుడై, ఎవరి చరిత్రము వ్రాయుదునా యని తలంచి—

"కోన్వస్మిన్ సాంప్రతంలోకే
గుణవాన్ కశ్చవీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ
సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణచకోయుక్త
స్సర్వభూతేషు కోహితః
విద్వాన్ కః కస్సమర్థశ్చ
కశ్చైకప్రియదర్శనః,
ఆత్మవాన్ కోజితక్రోధో
ద్యుతిమాన్ కోఽనసూయకః
కస్య
జాతరోషస్య సంయుగే,
ఏతదిచ్ఛామ్యహంశ్రోతుం
పరంకౌతూహలంహిమే
మహర్షేత్వం సమర్థోసి
జ్ఞాతుమేవం విధంనరమ్"

అని నారదమహర్షి నడిగెను. అందులకు నారదుడిచ్చినబదులు, సీతారాములవర్ణనయు చూడగా, ఏకావ్యమందుగాని నాయికా నాయకు లిట్లుండవలయునను నొకభావమో దానిననుసరించి నియమమో సంప్రదాయమో నాటికే కుదిరినట్లు తేటపడుచున్నది. శ్రీరాముడు ఆదర్శపురుషుడు ఏకపత్నీవ్రతుడు. అది నాయకలక్షణము.

ఈ కావ్యము ఆఱుకాండలుగా విభక్తము. 24000 శ్లోకములు, 500 సర్గలు. కావ్యరచనలో కాండములు, పర్వములు, లంబకములు ఇత్యాదులు గలవు. వేదములు సంహితలు, శాఖలు, అనువాకములు ప్రపాఠకములు, అష్టములు పనసలుగా విభక్తములు. పురాణములు సంహితలు, ఖండములు పిటకములుగా విభక్తములు. భారతము శతపర్వములు, తర్వాత పదునెనిమిదిపర్వములు. అమరము రామాయణమువలె కాండలుగా విభక్తము. ఈవిధముగా కవులు వ్రాయుచుండిరి. తమిళములోని పెరుంగదైయనబడుబృహత్కథానువాదము ఆఱుకాండలు; లంబకములును తరంగములును కాశ్మీరపండితులవి. కాళిదాసాది కవులు కాండములనువదలి సర్గములను మాత్రము గ్రహించిరి. మహాభారతముకూడ కావ్యమే. కావ్యవిభజన ఎట్లెట్లు జరిగెనో ంచిన వినోదముగా నుండును. కావుననే విన్నకోట పెద్దనాదులు—

"సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమున
ప్రాకృతంబున నాశ్వాసభాసురంబు,
నాటకములెల్ల నంకసనాథకములు
గద్యముచ్ఛ్వాసలంబకాంకంబయండ్రు."
ఉల్లా 4-7

అని వ్రాసినారు. ఇందు అందఱును వాల్మీకిని అనుసరించినవారే,

తర్వాత అష్టాదశ వర్ణనాదులు—
"పురవారాశి మహీధర ర్తు శశభృ
త్సూర్యోదయోద్యానపు
ష్కర కేళీ మధుపాన మోహన వియో
గక్షేమయాన స్వయం
వరపుత్రోత్సవ మంత్రదూత్య రణ దో
ర్వైక్రాంతి సంకీర్తనా
కరమష్టాదశ వర్ణనాన్వితము త
త్కావ్యంబు భవ్యంబిలన్"

ఈ పదునెనిమిదియు కాళిదాసాదులు వాల్మీకినుండి గ్రహించి పెంపొందింపగా దండ్యాదులు అనుశాసించిరి. గ్రంథగుణదోషములకు ఔచిత్యానౌచిత్యజ్ఞానమునకు, ఎన్నిటికో పూర్వకవులు రామాయణమునుండి ఎంతో గ్రహించిరి. ఒక కాలమున కావ్య ప్రారంభము చేయునప్పుడు రామాయణముతో ప్రారంభించెడువారట. బిల్హణ చరిత్రమందు మదనాభిరామనృపతి తనకుమార్తెకు యామినీపూర్ణతిలకకు సంగీత విద్యానిపుణకు సాహిత్యవిద్యాభ్యాసము చేయించుటకు బిల్హణకవిని నియమించెను. ఆతడు రామాయణముతో ప్రారంభించెను.

"తత్రాగత్యనరాధిపః శుభదినే
ఉమాత్యైః బుధైః
దృష్ట్వాతాం స్వసుతాంచ బిల్హణకవిం
శీఘ్రం సమానాయయత్
వాగ్దేవీపరిపూజనం ప్రథమతః
కృత్వాచరామాయణ
ప్రారమ్భంకృతవాన్ సబిల్హణకవిః
సానుగ్రహః సత్కృతః"

దీనింబట్టి విద్యాప్రారంభదశయందే రామాయణమును చదివించుచుండిరని తెలియుచున్నది. ఒకవేళ నిది బాలరామాయణమైనను కావచ్చును.

పైగా ఈకావ్యమందే కవిమహిమ చెప్పబడినది. మదనాభిరామ నృపతి పండితులను పిలిపించి ఇట్లడిగెను—

"బుధా, యూయంసర్వే
ననుమమసుతాం కావ్యనిపుణాం
రసాలంకారజ్ఞాం కురుత
నితరాం ప్రీతమనసః"

అందులకు వారిట్లనిరి—

"రసజ్ఞానైవస్త్వావయ,
ముతరసజ్ఞాస్తుకవయః"
అందులకు మరల రాజు 'కవిత్వం కింనాస్తి!'

అని యడుగగా వారేమిచెప్పిరో చూడుడు. 'ప్రవిశతికథం చాన్దసకులే?' తర్వాత,

"నైవవ్యాకరణజ్ఞమేతి పితరం,
నభ్రాతరం తార్కికం,
దూరాత్ సంకుచితైవ గచ్ఛతి
యథాచణ్డాలత శ్ఛాన్దసాత్,
మీమాంసానిపుణం నపుంసక ఇతి
జ్ఞాత్వానిరస్యాదరాత్
కావ్యాలంకరణజ్ఞమేవ కవితా
కన్యావృణీతేస్వయమ్'

అనిపలికి బిల్హణుని ఎఱుకపఱిచినారు. అట్టి కవితాకన్య 'మానిషాద' శ్లోకరూపమున ఏ మహాత్ముని వరించినదో, ఎవనికావ్యము కవికుల గురువునకే ఆదర్శమాయెనో ఆతనికావ్య ప్రాశస్త్యమును గుఱించి చెప్పుట సముద్రమునకు ఏతము వేయుటవంటిది. చూచి, చదివి అనుభవింపవలసినదే. అది మధురము, మధురాక్షరము. కవితాశాఖ నధిరోహించిన వాల్మీకికోకిలకూజనము.

3. భక్తిమార్గమందు:

"చరితం రఘునాథస్య
శతకోటి ప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం
మహాపాతక నాశనమ్."

శ్రీరామప్రాతిపదిక
మవశేనాపి సంగృణన్
ముక్తిం ప్రాప్నోతిమనుజః;
కింపున ర్బుద్ధి పూర్వకమ్"

ఇదేవాల్మీకిచరిత్ర. వాల్మీకి తొలుత ఋషిగాదు. ఆయనపేరును అదికాదట. భృగువంశమందు జనించినందున భార్గవుడనియు, ప్రచేతసుని పుత్రుడగుటచే ప్రాచేతసుడనియు, నామధేయము. రత్నాకరుడనియు అధ్యాత్మరామాయణమునందున్నది. బ్రాహ్మణుడుగా జనించియు వ్యాధజీవితము గడపి దారిదోపిడి చేయుచుండ సప్తర్షులు తారసిల్లి శ్రీరామమంత్రోపదేశము చేయగా, ఆ నామమునే నోరు తిరుగనందున వారు 'మరా' యన, నట్లే జపించుచుండెనట. తనచుట్టు పుట్ట (వల్మీకము) పెరిగినందున వాల్మీకియై, ఋషియై, కవియై, 'నానృషిః కురుతేకావ్యమ్' అన్నట్లు నారదోపదేశమున రామాయణకవి యాయెను. ఇదంతయు నామజః మహిమయని పెద్దలు నిర్ణయించినారు. ("శ్రీరామజపమహిమ ప్రకాశకో భగవాన్ వాల్మీకిః...కశ్చిన్నిషాదః సప్తర్ష్యుపదేశేన రామనామజపన్ వనేతస్థౌ. తత్కాలాత శరీరే వల్మీకమభూత్, తతఃకతిపయకాలేగతే సప్తర్ష యస్తద్వనమేత్య కిరాత తపస్థానమితి తత్రాగత్య వల్మీకందృష్ట్వా కిరాతాహ్వానం

చక్రుః...రామనామ జపమహిమ ప్రాప్తముని భావో వాల్మీకిరితి ప్రథితోభూదితి పద్మపురాణే)

అంతేగాదు పారాయణయోగ్యము సంస్కృత రామాయణమే. దాని యనువాదమో, అనుసరణమో, సారమో పనికిరాదు.

"సంస్కృతం రామచరితం
పరిత్యజ్యనరాధమః
పఠేత్ భాషాన్తరకృతం
మృగతృష్ణా జలంపిబేత్"

కించ- "పఠేత్ భాషాన్తరకృతం
కథంతరతిపాపధీః
క్షున్నివృత్తిర్నోభజనేన
వినాతత్కథయాకథమ్?"

ఇట్లేలయన్న, ఇందు గాయత్ర్యక్షరములు గలవు. అవి 24. మొత్త మిరువదినాలుగువేల శ్లోకములలోను ఒక్కొక్క వేయికిని మొదటి దాని అందలి యక్షరములలో నొకటి వరుసగా వచ్చునట్లు రచింపబడినది ఈ కావ్యము. 'అస్య చాధికారిణా స్సదాజప్యం రామాయణమేవేతి దర్శయితుం గాయత్ర్యర్థోఽత్ర ప్రతిపాద్యతే.- తథాహి, బాలకాండే వేదప్రసిద్ధ జగత్ప్రసూతి హేతుభూత భగవత్స్వరూప వర్ణనాత్తత్స వితృశబ్దార్థః, అయోధ్యాకాండ కిష్కింధా కాండయో ర్గుణగణ వర్ణనాద్వరేణ్యశబ్దార్థః, అరణ్యకాండే తేజోమయ శరీరవర్ణనాత్ భర్గశ్శబ్దార్థః, సుందరకాండే దివ్యమంగళ విగ్రహ లక్షణ వర్ణనాద్దేవశబ్దార్థః, యుద్ధకాండేధీమహి శబ్దార్థః శరణాగత్యుక్తేః, ఉత్తరకాండే ముక్తి ఫలకీర్తనా త్తృతీయపాదార్థః ఇతి...

సకలశ్రుతి సారభూత గాయత్రీ మహామంత్ర వర్ణనిబద్ధత్వేన నిఖిలమంత్ర సారభూతత్వా దేతస్య శ్రీరామాయణస్య అహరహర్నియ మతఃపఠనే ద్విజశబ్దవాచ్యాః. తేషుచ బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యేషుశఠా అగురుభక్తా అవిష్ణుభక్తా అనీశ్వరభక్తా శ్చంచలచిత్తా అనృతవాదినః కృతఘ్నా ఆతతాయినః అనియమవ్రతినః అన్యవ్రతనిష్ఠా వేదనిందకాభృత కాధ్యాపకా భృతకాధ్యాయినః ఘాతుకాః పిశునా స్తస్కరా అభిశస్తా దుష్టా ఇత్యాదయో నియమతః పఠనేశ్రవణేచ నాధికారిణః"

ఇందువలననే భారత భాగవతాదులకన్నను లోకములో రామాయణమే ఎక్కువగా పారాయణము చేయబడుచున్నది. బ్రహ్మాండపురాణమందు రామాయణము నిఖిలశ్రుత్యర్థ ప్రతిపాదకమని కలదు. రామాయణ లేఖకునకు గొప్ప ఫలముకలదు—

"భక్త్యారామస్య యే చేమాం
సంహి          కామ్
లిఖంతిచ మహాత్మాన
స్తేషాంవాస స్త్రివిష్టపే"

యు. కాం. స. 131 శ్లో. 124.

తత్త్వసంగ్రహ రామాయణమందు—

"రామాయణస్య
యేలిఖన్తి మహీతలే
తేషాందేవి మయాసార్థం
నివాసః పరమాత్మని."

ఇంకను పఠనాదులకు యోగ్యాయోగ్య వారాదులు, మాసనిర్ణయము, మాధ్యనిషేధము, దేశము, ఆచార్యలక్షణము, స్త్రీ వినువారెట్లు వినవలయును ఇత్యాదులన్నియు పరంపరగా వచ్చునట్టివి పురాణములు చెప్పుచున్నవి. అద్వైతులు విశిష్టాద్వైతులు ద్వైతులు వారివారి సంప్రదాయముల ప్రకారము భక్తితో పారాయణము నేటికిని చేయుచున్నారు. పలు

వురు పూర్వము రామాయణ పుస్తకదానము చేయుచుండిరి.

ఇందు ఒక్కొక్క కాండకును ప్రత్యేకముగా ఫలములు చెప్పబడియున్నవి. రాములవారి తర్వాత ఆంజనేయుడు ఉపాస్యదైవము. పలువురు తాముద్దేశించిన కార్యములసిద్ధికై సుందర కాండమును పారాయణము చేయుచున్నారు.

ఇట్టి యీ మహాగ్రంథము దేశాంతర ఖండాంతరములకు వ్యాపించినది. అనంతరకవుల కావ్యములలో రసానుగుణములైన మార్పుల నందినది బహునాటకకర్తలచే భిన్నరీతుల రచితమై ప్రదర్శితమగుచుండినది. చిత్రలేఖనాదులకును శిల్పములకును ఎక్కి ఊరూరను వీథివీథిలోను రామాయణ కథాభాగములు చిత్రింపబడినవి. ప్రతియింటియందును విగ్రహములు వెలసినవి. ఊరూర దేవాలయములు కట్టబడినవి. ఇట్లు రామాయణ ప్రభావము భారతదేశమందు భారతిజాతిమీద వేళ్లుపాతి నిలిచి భారతీయులను రక్షించుచున్నది. మున్ముందును రక్షింపగలదు.

# రామాయణంపై యోగదృష్టి

## విద్యాభాస్కర శ్రీ యల్లంరాజు సుబ్బారావుగారు

ఉత్తమసాహిత్యగ్రంథాల్లో పాఠకుల్లో జ్ఞానుల నాకర్షించే ఘట్టాలు ఎన్నో ఉంటాయి. రామాయణకావ్యంకూడా ఇలాంటిదే. రామాయణకావ్యాన్ని ఎందరో మహనీయులు ఎన్నో కోణాల్లో పరిశీలించి సమీక్షించారు. ఈ సమీక్షలవల్ల సాధకుల శ్రమతోబాటు ఎన్నో ఆణిముత్యాలు బయటపడ్డాయి.

రామాయణమంటే రామునికథగా ప్రశస్తి కెక్కింది. అయనం అంటే పథము. యోగుల దృష్టిలో రామ పూర్వతాపనిఉపనిషత్తులో రామశబ్దం ఇలా నిర్వచింపబడింది—

'రామపదే నాసౌ పరబ్రహ్మాభిధీయతే'

'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా'

అందుచేత భక్తులసౌలభ్యంకోసం పరబ్రహ్మ రామరూపంలో సాక్షాత్కరించాడని యోగుల నిర్వచనం. ఆలాగే సీతోపనిషత్తులో 'సీతా భగవతీ జ్ఞేయా, మూలప్రకృతిసంజ్ఞితా' అని పేర్కొనబడింది. సీత అంటే పరమాత్మయొక్క మూలప్రకృతి, మాయ. యోగమంటే ఆ మాయావరణాన్ని ఛేదించి పరమాత్మలో లీనం కావడమే.

యోగులదృష్టిలో రామాయణం ఒకవిశిష్టమయిన ఉపాసనాగ్రంథం. వారిదృష్టిలో రాముడు పరమాత్మ; ఆయన జన్మించిన అయోధ్య మనస్సు; సీతయే జీవాత్మ ఐదు జ్ఞానేంద్రియాలు ఐదుకర్మేంద్రియాలస్వరూపమే దశకంఠుడయిన రావణుడు. ఇతని చేతిలోనే సీత బంధింపబడింది. రావణుని చెరనుండి బందీరూపమయిన జీవాత్మకు (సీతకు) వాయునందనుడయిన హనుమంతునిసాయంతో విముక్తి జరుగుతుంది. ఈ హనుమంతుడే యోగము. ప్రాణాయామంద్వారా 24 వేల శ్లోకాలు కలిగిన వాల్మీకిరామాయణమనే

గాయత్రీ మంత్రోపాసనద్వారానే యోగ రూపుడయిన హనుమంతుడు జీవాత్మరూప మయిన సీతను చెరవిడిపించగలిగాడు. గాయత్రీ మంత్రానికి మూలమయిన 24 అక్షరాలే వాల్మీకిరామాయణంలో 24 వేల శ్లోకాలుగా మారాయి. వాల్మీకి రామాయణమంటే గాయత్రీమంత్రోపాసనయే.

బహుళంగా ప్రచారంలో లేని ప్రమాణాలవల్లకూడా ఈ రహస్యం వెల్లడిఅవుతుంది. అధ్యాత్మరామాయణంలో ఆనందరామాయణంలో వాల్మీకిజీవితచరిత్ర వర్ణించబడింది. తొలిజన్మలో వాల్మీకి స్తంభుడనే బ్రాహ్మణుడు. ఈయన 'శకల' అనేపట్టణంలో నివసించేవాడు. ఈయనకు భార్యయు మఱొక వేశ్యయు ఉండేవారు. ఈయన తర్వాత జన్మలో బోయవాడుగా జన్మించాడు. తొల్లి వేశ్యయే భార్యగా జన్మించింది. మూడవజన్మలో కృణుమహర్షి కుమారుడుగా వాల్మీకి జన్మించాడు. కాని తల్లి ఒక ఆడసర్పం. అరణ్యంలోని బోయలు ఆయన్ను పెంచి పెద్దవాణ్ణి చేశారు. తండ్రి బ్రాహ్మణుడయినా, ఈయన శూద్రస్త్రీని వివాహమాడాడు. ఆమెవల్ల చాలామంది సంతానంకూడా కలిగింది. తర్వాత ఆయన దొంగలముఠాలో చేరాడు. ఈ ముఠాలో ఉండగనే యీయనకు సప్తమహర్షుల దర్శన భాగ్యం కలిగింది. పాపపంకిలమయినజీవితాన్ని త్యజించమని వారు ఈయనకు ఉపదేశించారు. ఋషుల ఉపదేశంవల్ల,సంసర్గవల్ల జ్ఞానోదయమైము కికోసం వాల్మీకి వారిపాదాలపై మోకరిల్లాడు. వారు వాల్మీకికి రామమంత్రాన్ని అపసవ్యంగా ఉపదేశించారు. (మరా) బోయడయిన వాల్మీకి ఈ మంత్రాన్ని వేయియుగాలు జపించాడు. తిరిగి ఋషులు వచ్చేసరికి ఈయన పైన పుట్ట పెరిగిపోయింది. ఈ పుట్టవల్లనే ఈయనకు వాల్మీకి అనే పేరు సార్థకమయింది.

వాల్మీకి పై మూడు జన్మలను పరిశీలించి యోగులు మూడు రహస్యాలను వెల్లడించారు. మొదటి జన్మను భక్తియోగంగా, రెండవ జన్మను కర్మయోగంగా, మూడవజన్మను కుండలినీయోగంగా పేర్కొన్నారు. కామవాసనలు మిగిలియున్న కారణంగా ఆయన శూద్రస్త్రీని వివాహ మాడాడని, బోయరూపంలో ఉన్నందున బంధాల నన్నింటిని ఛేదించగలిగాడని వారు నిర్ణయించారు. రామమంత్రాన్ని తలక్రిందులుగా ఉపదేశించడంలోకూడా యోగదృష్టి ఇమిడి ఉంది. 'మ' అంటే సాత్త్వికమాయ. దీనిని అతిక్రమిస్తేనే 'రా' (స్వచ్ఛమైనప్రకాశం) అనే జ్ఞానాన్ని పొందగలము. రామాయణంలోని ఆఱు కాండలు మూలప్రకృతిస్వరూపిణి అయిన సీత గాథనే వర్ణిస్తాయి. ఉత్తరకాండలో రాముడి పరబ్రహ్మస్వరూపం వర్ణించబడింది. సర్పాకారమయిన పుట్టనుండి బయటికి రావడం వల్లనే వాల్మీకి ఈ జ్ఞానయోగాన్ని పొందగలిగాడు.

నారదుడు వాల్మీకికి రామాయణతత్త్వాన్ని బోధించాడు. నారదుడు అంటే మహత్తత్త్వాన్ని ప్రసాదించేవాడు. (నారం దదాతీతి) నారం అంటే మహత్తత్త్వం, నారదుని వీణయే యీమహతి. భగవంతుడే తన స్వరూపాన్ని మాయలో ముంచివేసి, మహత్తత్త్వాన్ని సృష్టించాడని, ఈతత్త్వమే అంధకారాన్ని పాఱద్రోలి స్వయంప్రకాశమయిన ఆత్మను వెలికి తీసిందని భాగవతంలో వర్ణించబడింది. తపస్సువల్ల పునీతుడై, వాల్మీకి పరతత్త్వాన్ని అవలోకించ గలిగాడని, యీరూపంలో నారదుడు ఆయన ముందు సాక్షాత్కరించాడని యిందలి భావం,

రామాయణం తమసానదీతీరంలో జరిగిన సంఘటనతో ప్రారంభమవుతుంది. తమస్సు అంటే అజ్ఞానం. రామాయణంలోని మొదటి

శ్లో. మానిషాద ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీః సమాః,
యత్ క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్

ఈ శ్లోకంవల్లనే కావ్యంలోని ఉద్దేశ్యం - కథావస్తువు, ప్రయోజనాలు విశదమవుతాయి. ఈ రెండు క్రౌంచపక్షులే జీవాత్మ, పరమాత్మలు. జీవుడు కర్మయోగంవలన తరించవలసి ఉంటుంది. అందుచేతనే కర్మాచరణ. బోయడే నిశ్చలమైన వీడని ఆత్మస్వరూపుడు.

రామాయణం ఏడుకాండలుగా విభజింప బడింది. జ్ఞానయోగంలోని యేడు భూమికలే పైకాండలు-సుభేచ, విచారణ తను- మానసి, సత్వాపత్తి, అసమ - శక్తి, పదార్థ - భావన, తుర్యగ.

పై వివరాలనుబట్టి రిశీలిస్తే, రామాయణం ఒక ఉత్తమ యోగశాస్త్ర గ్రంథంగా గోచరిస్తుంది. దీని ధ్యేయం బ్రహ్మసాక్షాత్కారం. ధ్యాన, సమాధి, ధారణవల్లనే గాకుండా - గాయత్రీ మహాయోగం ద్వారా కుండలినీ శక్తిని మేల్కొలిపి పై ధ్యేయాన్ని పొందవచ్చును. దీనికి ప్రమాణంకూడా రామాయణంలోనే లభిస్తుంది—

శ్లో. సత్యమేత ద్వి దిత్వాతు
శ్రోతవ్యం నియతాత్మభిః,
గాయత్ర్యాశ్చ స్వరూపం త
ద్రామాయణ మనుత్తమమ్.

# రాముని ధర్మానుష్ఠానము

## శ్రీ కేతా వసంతరవీంద్రనాథ

ధర్మసంస్థాపనార్థము జన్మించిన శ్రీరామచంద్రునకు మానవజాతి ఎంత ఋణపడి యున్నదో వర్ణింప నశక్యము. శ్రీరామచంద్రుని గొప్పతనమునుగూర్చి ప్రసంగింపని-అతని నామమును జపింపని-అతని జీవితమునకు సంబంధించిన స్థలములను దర్శింపని-హైందవుని చూడజాలము. శ్రీరామునిగూర్చి వెలువడిన సాహిత్యము, అతనిపట్ల భారతీయులకుగల భక్తిభావమును వెల్లడిచేయుచున్నది. శ్రీరాముని ప్రబోధము యుగయుగములుగా ప్రజల మనస్సులను రంజింపచేయుట మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయము. రామాయణము కాల క్రమమున భారతభాషలలోనుండి ఇతరభాషల లోనికి అనువదింపబడి, అత్యంతాదరము నొందుట, ఎంతయేని ఆనందింపదగ్గ విషయము. అణుయుగప్రభావము శ్రీరామునిపట్ల ప్రజలకుగల ఆదరమును ఏమాత్రము తగ్గింపలేక యున్నది. ప్రతిదినము కోట్లకొలది జనులు రాముని గుణగణములను ప్రశంసించుచు అతని పట్ల తమ భక్తిని వెల్లడిచేయుచునేయున్నారు. రామనామజపము వలన మనము పొందు హృదయప్రశాంతతగూర్చి ప్రస్తావింప నవసరములేదు. అది ప్రతియొక్కరికిని ఏదైన నొకసమయమున అనుభవమై యుండును.

అతివేగముగ మాఱుచున్న ఈ ప్రపంచమున శ్రీరామచంద్రుడు శాశ్వతమైన స్థానము నలంకరించుటకు కారణము, వివిధవ్యక్తిత్వములు గల పలువుర ఆకర్షించు అతని శీలమే, పుత్త్రుడుగను, సోదరుడుగను, భర్తగను, స్నేహితుడుగను, వీరుడుగను, ప్రభువుగను, శ్రీరామచంద్రుడు ఆదర్శప్రాయుడు. పుత్త్రుడుగ పితృవాక్యపరిపాలనయే తన కర్తవ్యముగా నమ్మినవాడీ దశరథరాముడు. సోదరుడుగ తన తమ్ములను ఎంతయో ఆదరించి, వారికొఱకై ఏమైన చేయ సంసిద్ధుడైనవాడితడు. భర్తగ తన సతిపట్ల అత్యంతానురాగము కలిగియుండి ఏకపత్నీవ్రతమాచరించినవాడీ సీతారాముడు. స్నేహితుడుగ సుగ్రీవాదులకు హితమొనర్చిన వాడీ రాముడు. జగదేకవీరుడుగ పేరుగని, దశకంఠాది ఘోరరాక్షసులను దునుమాడిన వాడీ కోదండరాముడు. ప్రభువుగ ప్రజల హితమునకె పాటువడి, ఆదర్శవంతముగ పాలననొనర్చెను ఇంతియేకాక ధర్మమును త్రికరణశుద్ధిగా నాచరించి తదనుష్ఠానము వలన ప్రతిమానవునకు ఆదర్శప్రాయుడైనాడు. మానవునకు ధర్మము ఆహారమునకంటె ముఖ్యమైనదని నిరూపించిన మహావ్యక్తి ఇతడు

హిందూమతమును క్షుణ్ణముగ నర్థము చేసికొనుటకు అనేకగ్రంథములు కలవు. కాని, వానిని మధ్యమాధములు అవగాహనచేసికొన లేరు. అట్టివారికి హిందూమతధర్మములను బోధపఱచుటకై పుణ్యమూర్తి శ్రీరాముడు మానవుడై జన్మించి, మానవులతో అతిసన్నిహితముగ సంచరించి, మానవులకు ఆదర్శపురుషుడైనాడు. శ్రీరామచంద్రుడు మతధర్మములను అనుష్ఠించి, ప్రజలకు ఈ విషయమున మార్గదర్శి అయినాడు.

ఆచరింపబడనినాడు ధర్మమునకెట్టి ప్రాముఖ్యమును లేదు. ఒకవ్యక్తి తన జీవితమున సత్యధర్మములను ఆచరించుటచే మతప్రాముఖ్యమును వెలికిదెచ్చును. శ్రీరామచంద్రుడు సత్యధర్మములను త్రికరణశుద్ధిగా నాచరించెను. శ్రీరామచంద్రుడేదిచేసినను అది సత్యప్రకాశమునకును, ధర్మసంస్థాపనకు చేసెననెడిది గమనార్హము. శ్రీరాము డాచరించిన కార్యము ధర్మముగను, అత డాచరింపనికార్యము అధర్మముగను ఎన్నబడుచున్నది.

వేదములను, ఉపనిషత్తులను పఠించి, వాని సారమును గ్రహించుట సులభమైన కార్యము కాదు. వానియందలి ధర్మములను క్రోడీకరించి, జనులకు బోధింపవలసిన యవసరమేర్పడినది. శ్రీరాముని జీవితఘట్టము లనేకములు, ఈ ధర్మములను బోధించుచున్నవి. వేదధర్మములను శ్రీరాముడు పాటించినవిధము మిక్కిలి ఆకర్షకమైనది. మానవజాతిచే వేదసారమును గ్రహింపజేయుటయే రామావతారముయొక్క యుద్దేశ్యము. ఆత్మపరిత్యాగమువలనను, ధర్మానుష్ఠానమువలనను మోక్షము పొందవచ్చునని ఋగ్వేదములోని పురుషసూక్తముచే తెలుపబడినది. ఆత్మపరిత్యాగమును, ధర్మానుష్ఠానమును ఎట్టివ్యక్తియైనను, ఎట్టికష్టమును లేకయే యర్థముచేసికొనుటకు రాముని జీవితము ఉపకరించును. కనుకనే, శ్రీరామచంద్రుడు అందఱకును మోక్షప్రదాయియైనాడు.

అనంతకళ్యాణ గుణాభిరాముని మును సంతృప్తిగావర్ణింప, తగిన పదజాలము కవులకు లభింపలేదు. శ్రీరాముని గుణములను పూర్తిగా నెన్నుట యసాధ్యమయినను కొన్ని గుణములను చూపి, అతడు మనకేవిధముగా మార్గదర్శియైనాడో తెలియజేయుట అవసరము.

శ్రీరాముని రూపము, తేజస్సు అత్యంతాకర్షకములని వాల్మీకి పేర్కొనెను. శ్రీరాముని రూప తేజములచే ఆకర్షింపబడినవారు ఇతర వ్యాపకములను సులభముగామఱచి, ధ్యానము నందు మనస్సును సంపూర్ణముగా లగ్నమొనర్పగలరు. శ్రీరాముని రూప తేజములతో పాటు అతని గాంభీర్యము అతనిపట్ల భక్తిని పెంపొందించును.

శ్రీరాముని రూపమునకు పిదప అతని వాక్కును పేర్కొనవచ్చును. శ్రీరాముడు ఎవరిని కలసినను తానే ముందుగా వారి యోగక్షేమములను కనుగొనుననియు, అతడు మాటాడునపుడు అతని మోము చిఱునగవుతో వెలుగొందుచుండుననియు, వాల్మీకి పలుమార్లు పేర్కొనెను. శ్రీరాముని జీవితమున అతిక్లిష్టమైన ఘట్టములు ఎన్నియో కలవు. అతని ధర్మానుష్ఠానము వివాదాస్పదమైన సందర్భములెన్నియో కలవు. కాని అతడెట్టి పరిస్థితి యందును సత్యమును, తన వాక్కునందు మృదుత్వమును వీడలేదు. శ్రీరామచంద్రుడు ధర్మమునకు ప్రతిరూపమని అతని జీవితము తెలుపుచున్నది.

శ్రీరాముడు నోటిమాటలతో కాక, తన చేతలతో బోధించిన ఆచార్యదేవుడు. ధర్మసంస్థాపనమే తన ముఖ్యకర్తవ్యముగ భావించి, దానిని సాధించిన పుణ్యమూర్తి యతడు. ప్రతి గురువు తన శిష్యుని తన కార్యాచరణచే ఆకర్షించును కాని, మాటలచేగాదు. ఎదురు చూడని పరిస్థితులు ఏర్పడినపుడు, గురువు ఏవిధముగా వర్తించునో, శిష్యుడును అదే విధముగా వర్తించును. శ్రీరామచంద్రుడు ఎదురుచూడని పరిస్థితులు ఏర్పడినపుడు వానిని ధైర్య స్థైర్యములతో నెదుర్కొని, యెట్టి సందర్భమునను తన మాటలకు, చేతలకు భేదము కలుగకుండ వర్తించుటచే ఆచార్యుల కందఱకును ఆచార్యుడైనాడు. శ్రీరాముడు ధర్మమును అనుష్ఠించి చూపెను. అతడా విధముగ వర్తించుట, ప్రజలకు తాను మార్గదర్శి కావలయు ననెడి కోరికవలనకాదు. తన ధర్మమును తాను నెఱవేర్చుటయే యతనికి కావలసినది. శ్రీరామునకు ఆదర్శమే ఆచరణీయము. ఆదర్శమునకును ఆచరణీయమునకును మధ్య భేదము లేదని యతని అభిప్రాయము.

పట్టాభిషేక దినమున శ్రీరామచంద్రుడు తండ్రిమాట నెఱవేర్ప నడవులకు పయనమయ్యెను. తనకై తండ్రినే వధింపబోయిన లక్ష్మణుని వారించి, పితృవాక్య పరిపాలనమే పుత్రధర్మమని బోధించి, అతనిని తన మార్గమునకు ద్రిప్పికొనెను. తనతల్లి కౌసల్యపట్ల తన దండ్రికిగల ప్రేమలేమిని, కైకేయి పట్ల నతనికిగల ప్రేమను ఎఱిగియు, తండ్రి భూలోకమునగల ప్రత్యక్షదైవముగ నెంచిన పుత్త్రుడు దశరథతనయుడు. తనపుట్టుకకు కారణభూతుడయిన తండ్రిపట్ల అతనికిగల భక్తికి అంతులేదు. తండ్రిని సంతృప్తిపఱుప నతడే కార్యమయినను చేయ సంసిద్ధుడే. తనకు అరణ్యవాసము ప్రాప్తించుటకు కైకేయి మాత్రము కారణము కాదనియు, విధియే అందులకు కారణమనియు, ఇతని తలంపు. తనకు లభింపనున్న సామ్రాజ్యమును తనకు రానీయనందులకు ఇతనికి కైకేయిపట్ల ఏమాత్రము కోపములేదు. శ్రీరాముడు కైకేయి యంతఃపురమును వీడుటకు ముందు దశరథ మహారాజునకును, కైకేయికిని సాష్టాంగ ప్రణామ మాచరించెను. అంతఃపురమున కెట్టి యుత్సాహముతో వచ్చెనో, అట్టి యుత్సాహముతోనే మరలెను. భోగభాగ్యములను

పీడి, ఘోరారణ్యములందు నివసించుటకు ఏమాత్రము వెనుకంజవేయలేదు, ఏమాత్రము ఆలసింపలేదు. భోగభాగ్యములపట్ల నతడు చూపిన విరక్తి, వానిని అతడు పరిత్యజించిన విధము, అతని నిస్స్వార్థపరాయణత, మనఃస్థైర్యము, అతని గొప్పదనమును వెల్లడిచేయుచున్నవి. ప్రతియొక్కరిని ఆకర్షించి, వారికి సత్యవర్తనమును శ్రీరాముని చరిత్ర బోధించినట్లు ఏ గ్రంథములును బోధింపలేవు.

మహావీరుడయిన ఈ కోదండరామునకు ఖడ్గకోదండములతో బాటు మఱియొక ఆయుధము కలదు. అదియే అతని వాక్పటిమ. సోదరుడు లక్ష్మణుని, తల్లి కౌసల్యను నోదార్చి, వారిని గూడ తన ధర్మమార్గమునకు త్రిప్పికొనెను. వివాహమయిన కొద్దికాలమునకే తన ప్రాణసఖిని వీడియుండవలసి వచ్చినందులకు రాముడు విచారించినను, జానకిని అరణ్యములకు గొనిపోవుటకు ఏమాత్రము ఇష్టపడలేదు. అతిసౌకుమార్యవతియైన ఆమె ఘోరారణ్యములందు కష్టపడుట తాను చూడలేకుండుటయే అందులకు కారణము. తన వాక్పటిమతో తనతో రావలెనన్న ఆమె ప్రయత్నమును మాన్పదలచెను. కాని సాధ్వీమతల్లి సీతాదేవి సతీధర్మమును వివరించి, ఇతని వాక్పటిమాయుధమును వ్యర్థమొనర్చెను. శ్రీరాముడు సీతను గొనిపోవలసి వచ్చుటకు కారణము అతని వాక్పటిమ వ్యర్థమగుట కాదు, సీతాదేవి పలుకులలోగల సత్యము, ధర్మము సత్యసత్యసంధుడైన రాముని ఆకట్టుకొనుటయే. ఆమె సౌఖ్యముకొఱకే ఆమెను అంతఃపురముననే నిలుపదలచెను. కాని సతీధర్మమును, జానకి పాటింపవలసి యున్నందుననే, ఆమెను తనతో తీసికొనిపోయెను.

అరణ్యావాసము ముగిసి, రావణుని వధించి సీతాదేవిని గైకొన్నపిదప భరద్వాజాశ్రమము వద్ద విడిది చేసినపుడు శ్రీరాముడు, హనుమంతుని పిలిచి, అతనితో ఇట్లు చెప్పెను—‘‘నీవు నా మిత్రుని గుహుని కలసికొని, నా క్షేమము నెఱిగింపుము. అతడు నీకు అయోధ్యకు మార్గము చూపును. అటుపిమ్మట నీవు అయోధ్యకేగి, భరతుని దర్శించి, అతనికి జరిగినదంతయు వివరింపుము, భరతుని అభినయవాచకములను జాగ్రత్తగా గుర్తించి, అతనికి రాజ్యముపట్ల ఆశ గలదేమో తెలిసికొని, నాకు తెలుపుము.’ శ్రీరామచంద్రుడు, భరతుడు రాజ్యము నాశించిన తాను అడవులలోనే నివసింప నిశ్చయించుకొనెను.

గర్భవతియైన సీతాదేవిని శ్రీరాముడు పరిత్యజించుట మిక్కిలి వివాదాస్పదమైనది. ఇది శ్రీరాముని ధర్మానుష్ఠానమునకు మఱియొక ఉదాహరణము. తాను, తనకన్న మిన్నగ ప్రేమించిన సతిని, పరిత్యజించుటకు కారణము శ్రీరాముడే, ‘పాలకుని జీవితము, ప్రజాభిప్రాయము ననుసరించి యుండవలయును కాని, వ్యక్తిగతాభిప్రాయము ననుసరించి యుండరాదు. కావుననే, తాను సీతాదేవిని పరిత్యజింపవలసి వచ్చె’నని వివరించెను. సీతాదేవి కొఱకు ముల్లోకములను గడగడ లాడించిన శ్రీరాముడు, ఆమెను ఎంత ప్రేమించియుండునో యూహింప నశక్యము. అంతగా ప్రేమించిన సతిని ధర్మముకొఱకై విడనాడుట వలన, అతడు ధర్మము నెంత కాంక్షించెనో తెలిసికొనవచ్చును. ధర్మసంస్థాపనకై, తన సహధర్మచారిణినే వదలుకొనెను.

శ్రీరామచంద్రుడు ప్రభువయినను, ఇతరులకంటె తాను పైమెట్టువాడని చూపుకొనక, తానును వారిలో నొకడుగ మెలగి, వారిలో

తనపట్ల ప్రేమాభిమానములు జనింపజేసెను. తన పాలనయందుగల ప్రతి పౌరుని యోగ క్షేమములందు అత్యాసక్తి కలిగి యుండెడి వాడు, వారితో బంధువులతో వలె అత్యంత సన్నిహితముగా మెలగును. గుహునకు, శబరికి, వానరులకు అత డతి సన్నిహితుడు. సీతాదేవికి వానరులను తన ఆత్మబంధువులుగ పరిచయ మొనర్చెను.

వాల్మీకి మహర్షి శ్రీరాముని ధర్మాత్ముని గను, సత్యసంధునిగను పేర్కొనెను. రాముని ఆత్మయే ధర్మము. రాముని త్రికరణములును ధర్మములే. ధర్మస్వరూపమును తెల్పుటకే రాముడు మానవజన్మ మెత్తెను.

శ్రీరాముడు వాలిని చంపుట, వివాదాస్పద మయిన విషయము. ధర్మపురుషుడయిన శ్రీరాముడు తన కేమియు అపకార మొనర్పని వాలిని చంపుట ధర్మమా యనెడిది ప్రశ్న. కామ ప్రవృత్తి సంఘముయొక్క కట్టుబాట్లను దాటి వ్యభిచారరూపము దాల్చినచో, అది ఆసంఘ వినాశమునకు దారితీయును. అట్టి దుర్నీతిని అణపవలెనని చెప్పుటకే శ్రీరాముడు వాలిని చంపెను. శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు. పర స్త్రీలను కన్నెత్తియైనను చూడడని కైకేయి ప్రశంసించినది. వాలి కామప్రవృత్తి [illegible]కమై, సంఘనీతిని ఉల్లంఘించి, తన సోదరుని భార్యను రుమను అపహరించున ట్లొనర్చినది. దానికి ఫలితమే అతని వధ.

తన శత్రువయిన రావణునిపట్ల రాము డెంతయో జాలిచూపెను. రావణుడు ఓడి పాఱిపోవుచున్న సమయమున, 'పోయి అలసట దీర్చికొని ర'మ్మనెను. చనిపోయిన దశకంఠునకు ఉత్తరక్రియలు చేయజాలనని విభీషణు డన్నపుడు, తానే వాని జరుప సంసిద్ధుడయ్యెను. శ్రీరాముని ఇట్టి గుణములను మఱువగలమా ?

శ్రీరాముడు తన్ను తన మార్గమునుండి మరల్ప యత్నించినవారిని, తన ధర్మమార్గమునకే మరల్చుకొనెను. శ్రీరామునియందు ఏ సమయమునందు, ఏవిషయముపట్లను అసంతృప్తి పొడసూపలేదు. అతడు నాలుగు పురుషార్థములందు ఎల్లప్పుడును మోక్షధర్మములనే కాంక్షించెను. అతడేసందర్భమునను సత్య ధర్మములను విడనాడలేదు. నేటి ఈ ప్రపంచమున మనము ప్రతి విషయమందును అసంతృప్తులమే. మనకు మోక్ష ధర్మములపట్ల ఆసక్తి ఇసుమంతయేని లేదు. అర్థకామముల కొఱకై సర్వదా దురపిల్లుచున్నాము. ప్రతి విషయమునను స్వార్థపరాయణులమై సత్యమును, ధర్మమును విడనాడుచున్నాము. శ్రీరాము డెంత నిఃస్వార్థపరుడో, మనమంత స్వార్థపరులము. మన యీ ప్రవర్తనమే మన ఈ కష్టములకు కారణము. శ్రీరాముని ప్ర[illegible] యొక్కరును త్రికరణశుద్ధిగా అనుసరించినచో, ఇప్పటి ఈ సమస్యలు ఉండెడివి కావు. ఏదైన సమస్య తలయెత్తినను, అది వెంటనే పరిష్కరింపబడియుండెడిది. శ్రీరాముని గొప్పదనము గూర్చి ప్రసంగించుచు, ఇతరులను రాముని మార్గము ననుసరింపుడని ప్రబోధించుటకన్న, రామనామము జపించుచు, ప్రతియొక్కరు తమంతట తాము ఆదర్శమార్గమైన రామ మార్గము ననుసరించుట లోకమునకు శుభము కలిగించును.

# సేతుబంధమున సీతాదేవి విలాపములు

శ్రీ చేరాల కృష్ణప్రసాదు

ప్రవరసేనమహాకవి ప్రాకృత భాషలో 'సేతుబంధము'ను రచించెను. ఈ మహాకావ్యమునకు 'దశముఖవధ' అని మఱియొక నామధేయము కలదు. ఈ పద్యకావ్యము పదునైదు కాండములు సుమారు 1300 పద్యములు కలిగియున్నది.

ఈ మహాకావ్యమును ప్రథమముగా 'గోల్డుస్మిత్' అను జర్మనీదేశపు పండితుడు ముద్రించెను.

ప్రవరసేనకవి రామాయణకథలో లంకాకాండభాగమును అనుసరించి యీ సేతుబంధ మహాకావ్యమును రచించెను. ఇందుకవి సంస్కృతాలంకారశాస్త్రనియమములను అనుసరించి కొన్ని విషయములను బహురమ్యముగా వర్ణించెను. ప్రవరసేన పద్యకావ్యమునుగుఱించి బాణుడు తన 'హర్షచరిత్రమునందును,' దండి కావ్యాదర్శనమునందును గొప్పగా ప్రశంసించియున్నారు. దీనినిబట్టి ప్రవరసేనుడు ఈ కావ్యమును క్రీ. శ. 7 వ శతాబ్దమునకు పూర్వమే రచించి యుండవచ్చునని ఊహింపవచ్చును. కొందఱు పండితులు ఈ మహాకావ్యమునకు సంస్కృతమున 'సేతుతత్వచంద్రిక' అని పేరిడిరి.

ఈ పదునైదు కాండములుగల ఈ కావ్యమున పదునొకండవ కాండమున సీతాదేవి విలాపములనుగూర్చి రచింపబడినది.

దశకంఠుడు ఏవిధముగనైనను సీతాదేవిని తన దానినిగ చేసికొనుటకు పన్నిన యుక్తులను ప్రవరసేనుడు పదునొకండవ కాండమున వర్ణించెను.

నలుడనెడి వానరరాజుచే మహాసముద్రముపై నిర్మింపబడిన మహావారధిమీదుగ వానరసేనలు లంకానగరసమీపమునగల సువేలపర్వతప్రాంతమునకు చేరినవి. రాముడు వానరసేనతో సువేలపర్వతపార్శ్వములకు వచ్చినాడని తెలిసిన రావణుడు మిక్కిలి మండిపడెను. అప్పుడు సూర్యుడు అస్తమింప బోవుచుండెను. కవి యస్తమయమును రావణుని కాలాస్తమయమునకు సూచనగా వర్ణించెను.

జరుగబోవు మహాసంగ్రామముగూర్చి తలపోయుచు రావణునిఅనుచరులభార్యలు మిక్కిలి విషాదవదనములతో నుండిరి. ఆ భయమును త్రోసిపుచ్చుటకై వారు కామసౌఖ్యముల గూర్చి ఆలోచింప నారంభించిరి. అట్టిసమయమున రావణునిచే పంపబడిన రాముని కృత్రిమ శిరస్సును జూచి సీతాదేవి విలపించెను. అప్పటి లంకానగర పరిస్థితిని సీతాదేవి విలాపమును కవి మిక్కిలి చక్కగా వర్ణించెను.

సీతాదేవి తనకు లభింపలేదని రావణుడు మిక్కిలి మనోవ్యథ చెందియుండెను. తనకు తెలియకయే అతడు తన భార్యలతో సీతాదేవిని ఉమాఱులు ప్రశంసించెను. అతని మనస్సు అశోకవనమున లగ్నమై యుండుట వలన, అతడు తన కార్యములను సరిగా నెఱవేర్పలేకపోయెను, అనేకవిధములైన పొరపాట్లు చేసెను. సీతపైగల కామవాంఛవలన నొడలు తెలియక పాన్పుపై దొర్లెను. రావణుడు వానరసేనను సంహరించి రాముని జయించుటయో లేక సీతను బలవంతముగా అనుభవించుటయో అని ఆలోచింపసాగెను. తన భర్త పెక్కుమైళ్లదూరములో నున్నను తన్ను కన్నెత్తైన చూడని సీత, భర్త లంకకు వచ్చినాడని తెలిసి తనకెట్లు లొంగగలదు, ఎట్లు తన కుట్రకు మోసపోగలదు అని చింతించుచుండెను.

రామునితో యుద్ధమొనర్చుటకు ముందు రాముని కృత్రిమ శిరస్సును జూపి సీతను మోసగించి ఆమె తన్ను అంగీకరించునట్లు చేసికొనవచ్చునని తలపోసెను. రావణుడు తన సేవకులను పిలిపించి తన పన్నాగమును తెలిపెను. రాముని శిరస్సునుబోలిన కృత్రిమ శిరస్సునుచేసి సీతకు జూపుడని ఆజ్ఞాపించెను. రావణుని ఆజ్ఞను అతని సేవకులు నిర్వర్తించిరి. హనుమంతునిచే ధ్వంసమొనర్పబడిన అశోక వనమున సీత తలవంచుకొని కనులలోనుండి నీరుప్రవహించుచుండ మనోవ్యథపడుచుండెను. రావణుని సేవకులు కృత్రిమ శిరస్సును ఆమెకు దానిని జూచిన వెంటనే ఆమె మూర్ఛపోయెను. కొంతసేపటికి తేఱుకొని మరల దారుణముగ కరవాలముచేత ఖండింప బడినట్లున్న కృత్రిమ శిరస్సును జూచి తన భర్త శిరస్సని తలచి వలవలపోయెను. మిక్కిలి దుఃఖములో నున్న ఆమె ఆ శిరస్సు తనభర్త రామచంద్రునిదా లేక కృత్రిమమైనదా అని యోచింపలేకపోయినది. అది కృత్రిమమై యుండుననెడి యోచనయే ఆమెకు కలుగ లేదు. దుఃఖము అధికమగుచుండ ఆమె మాటాడ యత్నించి విఫలురాలయ్యెను. తన మొగముపై పడియున్న ముంగురులను సవరింపక మిక్కిలి దీనదశయందుండెను. ఱొమ్ముపై చేతులనిడుకొని మరల ఆ శిరస్సును జూచి ఈవిధముగ విలపించెను. 'దుఃఖము పైన జూచుటకు మిక్కిలి భయంకరముగను లోపల ఏమియు లేనటులకననగును. కాని అనుభవించు వారికే దాని తీవ్రతలు తెలియును. భర్త మరణము భార్యకు దారుణమైన సంఘటన, అట్టిదానిని జూచియు నేను ఇంకను జీవించి యున్నాను. అరణ్యావాసమునకు బయలుదేఱి నప్పటినుండి ఇప్పటివఱకు నేను మీ విశాల హృదయమున నా దుఃఖమునకు విముక్తి లభించునని తలపోయుచుంటిని. కాని ఇప్పుడు ఆ దుఃఖమును ఎచ్చట వెలిబుచ్చుకొందును? నాకు ఎచ్చట శాంతి లభింపగలదు? మీ ముఖారవిందమును చూడవలెనన్న ఆశతోనే నా జీవితమును వెళ్లబుచ్చుచున్నదానను. కాని మిమ్ములను ఈవిధముగ జూచితిని. మీ దర్శనము లభింపవలెను అనెడి ఆశ నాకు తొలగిపోయినది. కాని నా ప్రాణనాథుని ప్రాణములతో గాంచనైతిని అనెడి వేదన నన్ను పీడించుచున్నది.' తాను పాలించు భూమి, తాననుభవించు సౌఖ్యములు, తాను తాళికట్టిన స్త్రీ-వీరు ముగ్గురు రాజునకు భార్యలు అనెడి హిందూసంప్రదాయమును కవి వివరించెను. ఇది తెలిసిన సీత, 'రాజమరణానంతరము భూమి మఱియొక సిద్ధహస్తుని జూచుకొనును, రాజత్వమను దేవత చంచల కావున ఆమె యింకొక గొప్పవానిని వెదకుకొనును, కాని తుదకు నిజమైనభార్య వితంతువగును' అని విలపించెను. మరల తన బాధను ఈవిధముగ వెలిబుచ్చెను. 'నిజముగా ఇది శ్రీరాముని ముఖారవిందమే. నిన్ను ఈవిధముగా జూచుటకొఱకా ఎన్నడో విచ్ఛిన్నమయి యుండవలసిన నా జీవితమును ఈ రాక్షస స్త్రీలతో గడుపుచుంటిని? ఇప్పుడు నీవు మఱియొక ప్రపంచమునకు వెడలిపోయితివి. నా జీవితము వదలి నేనుగూడ నీ మార్గమునే అనుసరింతును.

కాని యీవిధముగ చేయుటవలన కలుగు సంతోషముకన్న బాధయే మిక్కుటముగా కలుగుచున్నది. ఏలన నేను ఇంకను ఆ దశకంఠుని అన్ని తలలు నిర్దాక్షిణ్యముగ ఖండింపబడుట కనులార చూడలేదు. ఎటువంటి ఆశలు లేని నా జీవితము ఇంకను ఏల నిలిచియున్నదో

నాకు తెలియుటలేదు. నా కొఱకు నీవు మహా సముద్రమును దాటివచ్చి ప్రాణములను కోల్పోయితివి. అట్లయ్యు కృతజ్ఞతలేని నాహృదయము ఇంకను జీవించియున్న దేమి? ప్రజలు నీ కీర్తిని శీలమును వేనోళ్ళ కొనియాడెదరు. కాని నన్ను -భర్త మరణవార్త విన్న వెంటనే ప్రాణములు కోల్పోవుట పతివ్రతల సహజలక్షణము, అట్లు ఈమె ప్రాణములు పోనందున ఈమె ఆ జాతిలో చేరదని - దూషింతురు. దశముఖుని పదితలలు నీ బాణములచేత దారుణముగ ఖండింపబడుట నేను జూడవలెనని ఎన్ని ఆశలు పెట్టుకొంటిని; కాని ఆ ఆశంతయు పెద్ద కలగా మాఱెను కదా, విధి వక్రించినది. ఒక ప్రాణ బంధుని వియోగము, కొద్దిసేపైనను ఎంత భయమును పుట్టించునో అటువంటి భయము, పెద్ద ఆపద నా కండ్లకు కననగుచున్నది.'

సీతాదేవి విలాపము విన్న త్రిజట అనెడి రాక్షస స్త్రీ సీతను మృదువాక్యములతో ఓదార్చెను. 'నీవు స్త్రీవి గావున దుఃఖములో నున్నందున ఏదియో మాటలాడితివి. నీభర్త ముల్లోకములకు ఏకాధిపతి అని బాగుగా తెలిసిన నీవు అతనిని సామాన్య మానవునితో పోల్పరాదు. అది శ్రీరామచంద్రుని శిరస్సని భావింపకు. అది అతని శిరస్సే అయిన అన్ని సముద్రములు ఒకటై యుండెడివి. ప్రపంచమే తలక్రిందు లయ్యెడిది. అట్లు రాముడే మరణించి యుండిన రావణుని యానందోద్యానము ఈ ఆహ్లాదమును కోల్పోయెడిది. అన్ని తామరపుష్పములు వాడి యుండెడివి. కావున రాముని మరణవార్త నిజముగాదు. ఇదంతయు రాక్షసులు రావణుని ప్రోద్బలముచే పన్నిన పన్నాగమై యుండును. కనుక దుఃఖమును మానుము. ఇంక కొలది కాలములో నీవు నీ ప్రాణనాథుని చూడగలవు. అప్పుడతని కౌగిలిలో నీవు కరగిపోగలవు. ఆ శిరస్సు రాముని శిరస్సే అయ్యుండిన, ఆ శిరస్సునందు దాగిన కోపాగ్ని అతి భయంకరముగా ప్రేలి ఈ రాక్షసులకు వినాశము కలిగించి యుండెడిది. శ్రీరామునిచే పంపబడిన వానరాగ్రేసరుడే లంకానగరమును ధ్వంసమొనర్పగా శ్రీరాముని పరాక్రమమును వేఱుగా చెప్పవలెనా? రామునిపై ఎటువంటి అవిశ్వాసమును కలిగించుకొనకుము. మహాసముద్రముపై నిర్మింపబడిన మహావారధికి నీ రాముడే కారణము. కనుక దుఃఖమును మానుము. ధైర్యమును కలిగించుకొనుము.'

కాని త్రిజటమాటలు సీతకు ఎట్టి నమ్మకమును కలిగింపలేదు. ఆమె ఆసమయమునందు త్రిజటను తన ఆప్తురాలుగ తలచి ఆమె రొమ్ముపై ఒరిగి దుఃఖించెను. కొంతసేపటిలో తేఱుకొని త్రిజటతో ఇట్లు మాటలాడెను. 'నేను ఇంకను బ్రతికియున్నందుకు దూషింపుము. ఏల నాహృదయము తన పనిని నిర్విఘ్నముగ చేయుచున్నది? ఓ ప్రాణనాథా, నిన్ను ఇట్టి స్థితియందు చూచియు ఏల నా హృదయము నిలిచిపోలేదు? సాధ్వి కనర్హమైన ఇటువంటి తుచ్ఛజీవితమును గడుపుచున్నాను. నీవు భర్తగా కర్తవ్యమును తీర్చుకొంటివి, రక్కసులు వారిపనిని వారుచేసిరి. కాని స్త్రీగా నా ధర్మమును నిర్వర్తింపలేదు. హనుమంతుడు అందించిన వార్తవలన నన్ను కాపాడుటకు ఇచ్చుటకు వచ్చితివి. కనుక నీ మరణమునకు నేనే ప్రథమ కారకురాలను', కొన్ని మాటలు చెప్పి సీత భూమాతపై నొరిగిపోయెను. కన్నీటిని తుడుచుకొని క్రిందపడిదొర్లుచున్న కృత్రిమ శిరస్సును పలుమార్లుజూచి మరల కన్నీరు దృష్టిని మందముజేయగా, కన్నీటిని తన చీర కొంగుచేత తుడుచుకొని మిక్కిలి దీనావస్థలో నుండెను. చివరకు త్రిజటవైపు చూచి బాధగా

నవ్వి 'నేను నా జీవితమును అంత మొనర్చుటకు సిద్ధపడితిని. భర్తృవియోగమును పెక్కు దినములు అనుభవించితిని. ఇప్పుడు నేను వితంతువునైతిని. కావున నీవు నాయీ సిగ్గులేని ప్రాణత్యాగమును నిందింపరాదు. మరణము అన్ని ప్రాణులకును సహజమే కాని నాకన్న ముందు నా భర్త మరణించుట ఓర్వరానిది' అని పల్కెను.

త్రిజట మరల సీత నోదార్చుచు, 'నీమీాద నున్న ప్రేమకొలది నిన్ను ఊరడించితిని, నేను రాక్షసస్త్రీ నని అసహ్యించుకొనకుము. శ్రీరాముడు బ్రతికియుండగా నీవు ప్రాణత్యాగము చేయుట సరిగాదు. నీవు రామునిగూర్చి తలపోయునది నిజమై యుండిన నేను నీ ప్రాణత్యాగమునకు ఎటువంటి అడ్డును చెప్పను'

'ఒక్క వానరము లంక నంతటిని గడగడలాడింప జగదేకవీరుడైన కోదండరాముడు ఈ రక్కసుల చేతులలో మరణమొందునా? రాముని ఎవ్వరును జయింపలేరు. అతనికి అతడే సాటి. రామునికి ఏహానియైన సంభవించినచో ఈ ముల్లోకములును నశించును, రాక్షసులును మడియుదురు. నీ దుఃఖము మానుము. యుద్ధరంగమునకు పోబోవుచున్న భర్తకు భార్య కన్నీరు అశుభసూచకముగ పరిగణింతురు గదా.

'రాముడొక్కడే దశకంఠుని దశకంఠములను పడగొట్టి అతనికి తీరని అవమానము చేయగలడు. తాటకి మారీచ సుబాహు కంబధ రాక్షసులను వాలిని చంపి, సముద్రుని భయపెట్టిన రాముని పరాక్రమము నీ వెఱుగనిదా?'

'నేను కలలో రావణుడు మరణవాటికకు పోవుటను చూచితి'నని పలికెను.

త్రిజట మాటల విన్న సీతాదేవికి రామునిపై ప్రేమ ఉప్పొంగెను. ఆమె ఇదే ధ్యాసతో నున్నందున శ్రీరామునిసేనఘోష ఆమెకు వినపడలేదు. చివరకు త్రిజట చెప్పిన మాటలలో సత్యమున్నదని సీత గ్రహించెను. తన భర్త తప్పక జీవించియున్నాడని గ్రహించెను. ఆమెలో దాగియున్న భయము తొలగెను. దుఃఖము మటుమాయమాయెను. త్రిజట మాటలు సీతకు మరల క్రొత్త ప్రాణమును పోసినవి. కృత్రిమ శిరస్సు ఆమె చక్షుఃపథము నుండి తొలగిపోయెను. ఇప్పుడు ఆమె శ్రీరాముని సేన చేయుచున్న సింహనాదములను బాగుగా వినగలిగెను. శ్రీరాముడు బ్రతికియే యున్నాడని ఆమెకు పూర్తిగా నమ్మకము కల్గి తన్ను ఓదార్చి తన ప్రాణములను నిలిపిన త్రిజటను మిక్కిలి అభినందించెను.

## రామాయణము - అనువాదములు (తెలుగు)

### శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మగారు

రామాయణము వాల్మీకిమహర్షి కృతమైనదే పుణ్యప్రదమనియు, మోక్షదాయకమనియు, మహాకావ్యమనియు భావించుట ఈ దేశమునకు పరిపాటి. ప్రాచీనమున కొందఱు కవులు సంస్కృతములో వ్రాసినట్లు రామాయణమునుగూర్చి చెప్పుదురు. ''చ్యవనుడు'' ఒక రామాయణమును వ్రాసెననియు, ఇతడు వాల్మీకికంటె కించిత్పూర్వుడనియు, పరిశోధ

కుల మతము. ఏదేనొకరీతిగా వ్రాసిన చ్యవన రామాయణమును పెంచి వాల్మీకి సుందరముగా వ్రాసెనని ప్రసిద్ధము. సంస్కృతములో రామ చరిత్రము వాయుపురాణములోను, విష్ణుపురాణములోను, భాగవతమునందును వ్రాసియుండిరి. వాల్మీకి ముముక్షువుల కుపయోగించునట్లు శ్రీరాముని వృత్తాంతమును వ్రాసి తన పాండిత్యమును ధన్యమొనర్చుకొనినాడు.

వాల్మీకి పూర్వ స్థితియందు కిరాతుడు. ఆ స్థితిలో నితడు అజ్ఞానియై, స్త్రీలోలుడై కుటుంబ పోషణార్థము దారులు కొట్టుచు జీవితము గడపెడివాడు. ఇతడీ విధమున పాపకార్యము లాచరించుచుండ ఒకనాడు కొందఱు మునులు యాత్రచేయుచు వారణాసికి పోయి అక్కడ గ్రీష్మమును భరింపజాలక తమసానదిని దాటి ఒక బోయపల్లెను సమీపించిరి. అచ్చట బోయవాడొకడు వారిని బాణములతో కొట్టి, బాధించి ప్రయోజనములేక ఊరక నిలిచియుండెను. మునులు ప్రశ్నింప "తిండికొఱకిట్లు చేసితి"నని వాడు పలికెను. అంత "నీపాపమున నీ భార్యాపుత్రులకు భాగముకలదా?" యని వారు ప్రశ్నింప ఆ విషయమును వారినే అడిగి తెలిసికొని వచ్చెదనని వాడింటికిపోయి అడుగగా 'మాకా పాపముతో పనిలే'దని భార్యయు బిడ్డలు పలికిరి. ఆ కిరాతుడు తిరిగివచ్చి భావపరివర్తనమునొంది మునులకడకేగి వారి యనుగ్రహమును పొంది తనకు తగినరీతిని రామమంత్రము నుపదేశింప వేడెను. వా రనుగ్రహించిరి. తర్వాత ఆ మంత్రమును అతడు జపింపసాగెను. అతని బందుగులు, దారాపుత్రాదులు మమకారము రేకెత్తించి అతని బుద్ధి మరలింప ప్రయత్నించిరి. వారి ప్రయత్నములు ఫలింపక పోవుటయేగాక వాల్మీకి రామమంత్రమును జపించి బ్రహ్మసాక్షాత్కారము నొందెను. జ్ఞానియై నారదోపదేశమున రామాయణమును రచించి తరించి తరింపజేసెను.

ఈ రామాయణము పెక్కు ప్రాచ్య పాశ్చాత్య పండితుల ప్రశంసల నందినది. అరవిందయోగి కావ్యశిల్పమున వాల్మీకి సర్వశ్రేష్ఠుడనియు, రామాయణమునకు సాటివచ్చు మహాకావ్యము పృథివిలో మఱియొకటిలేదనియు వాకొనెను. భారతీయ హృదయము యుగయుగములుగా రామాయణ గీతికల యందు స్పందించుచున్నదనియు, ఆ సచ్చిదానందామృతమును అనుభవించిన సనాతనుల చిత్రపటము రామాయణము, సదా ప్రదర్శించుచున్నదనియు రవీంద్రనాథఠాగూరు వ్రాసెను. "శ్రీమదాంధ్ర రామాయణము తరతరములుగా మనకు లభించుచున్న పెన్నిధి. ప్రతి గృహమున నుండదగినది. రామాయణముకంటె వేఱొండు గ్రంథమెయ్యది? సీతారాములు, హనుమంతుడు, భరతుడు, లక్ష్మణస్వామి మన ఆత్మబంధువులు. భారతీయులను చల్లని తల్లియై చేరదీసి ఈ సీతారాముల పుణ్యచరిత్రము ఎంతకాలము పుణ్యనదులు ప్రవహించుచుండునో అంతకాలము సంరక్షించుచుండును. ఆబాలగోపాలము శ్రీమద్రామాయణమును భక్తిశ్రద్ధలతో పఠించి, ఆనందించి సద్ధర్మాచరణమున తరింతురుగాక!" యని రాజాజీ రచనము. "సుఖదుఃఖములతో మేళవింపబడిన ఈ జగత్తుతోడి సంబంధమును సచ్చిదానందముతో పోల్చుకొనుటయే ప్రేమ, కరుణ; ఆ కరుణనుండియే ఆదికావ్యము ప్రభవమైనది. విశ్వవిఖ్యాత రామాయణ సముద్భవోదంతము ఇదియే." అని కె. యస్. రామస్వామి శాస్త్రిగారు వక్కాణించిరి.

పాశ్చాత్యవిద్వాంసుల అభిప్రాయములు ఇట్లు రామాయణమునుగూర్చి లభించుచున్నవి:

"రామాయణమువలె ఆనందమును ప్రసాదించు కావ్యములు విశ్వసాహిత్యమునందు అరుదు...హోమరు రచనములను రామాయణము కావ్యకళాశిల్పమునందు మించుచున్నది. మతభావమూలములు రామాయణమునందంతటను వ్యాపించియున్నవి."

—సర్ మోనియర్ విలియమ్స్

సీతారాముల సమగ్రపావనపాత్రలను సాక్షాత్కరింప జేసిన రామాయణమువంటి కావ్యము జగత్తున ఏకాలమునగాని, యేప్రాంతమునగాని, సాహిత్యమున గలదా యని ఎలుగెత్తి చాటనిమ్ము. నైతికప్రబోధము, భాషా భావసారళ్యసౌందర్యములు అహమహమికతో చిఱునవ్వులొలికించి చిద్విలాసమును వెలార్చిన పవిత్రకావ్యమును (రామాయణము)మఱొండు చోట కానగజాలము.

—ఆచార్య

"రామాయణము భారతీయుల సౌభాగ్యమును సొంపునింపుచున్నది. ప్రపంచమునగల ఏ వాఙ్మయమునందును యుగయుగములుగా మఱియే గ్రంథమును, కవితను ఇట్లు ప్రసరింప"

—వింటర్‌నిట్స్

వాల్మీకిమహర్షి సంస్కృతమున గాయత్రీ బీజసంపుటీకరణమున ఇరువదినాలుగువేల శ్లోకములతో ఏడుకాండములుగ రామాయణ మహాకావ్యమును పండితపామరాపేక్షముగ రూపొందించెను. నారదమునీంద్రుని తపఃస్వాధ్యాయనిరతుడని, వాగ్విదులలో శ్రేష్ఠుడని వాల్మీకి వర్ణించెను. నారదమునిపుంగవుని పృచ్ఛచేయగల ఈతడును తపఃస్వాధ్యాయనిరతుడని వాగ్విదులలో శ్రేష్ఠుడని మనమూహింపవచ్చును. తన్నుగూర్చి ఆరంభకమునందే వాల్మీకి 'తపస్వి' యని ప్రయోగించుకొనినాడు. వాల్మీకిని ప్రతిభతోపాటు వ్యుత్పత్త్యభ్యాసములు వరించినవి.

వాల్మీకిరామాయణమును పెక్కమంది తెనుగున వ్రాసిరి. గోనబుద్ధారెడ్డి, తిక్కన, భాస్కరాదులు, మొల్ల, కంకంటిపాపరాజు ముఖ్యులు.

జగత్సాహిత్యమందిరమున ఆరాధనీయమని కీర్తివహించిన వాల్మీకిరామాయణమునకు గోనబుద్ధారెడ్డి రంగనాథరామాయణము స్వేచ్ఛానువాదము. అసలు యథామాత్రానువాదము పూర్వాంధ్రకవుల పద్ధతియే కాదు. నన్నయాదులు యథోచితముగ మాతృకను పెంచియు, కుదించియు వ్రాసియున్నారు కాని మూలమునందలి ముఖ్యాంశములను మార్చినవారుకారు బుద్ధారెడ్డి మార్గమే వేఱు. వాల్మీకీయములగు విషయములనేకము లీతనిగ్రంథమున గలవు. విశేషించి వాల్మీకిరామాయణమునలేని కథలుకూడనిందు గలవు.

సులోచన సహగమనము, కాలనేమిచరిత్రము క్రొత్తగా నిందు చేర్పబడినవి. రంగనాథరామాయణకర్తకు సంస్కృతాంధ్రముల యందసమాన పాండిత్యము గలదు. మనోహరముగా కవిత్వము చెప్పు సామర్థ్యమున్నట్లు మన మూహింపవచ్చును. ఇతని శైలి ద్రాక్షాపాకమై, సలక్షణమై, రసవంతమై యొప్పును. అన్వయకాఠిన్యముండదు. చదువ చదువ మనంబున కానందమును కలిగించును. రామచంద్రప్రభుని దివ్యచరిత్రమును కన్నులార గనుచు, వీనులారవినుచున్నట్లు దోచును. ఈ గ్రంథము పెక్కతావుల ఆంధ్రదేశీయులు వీథి నాటకములుగా, బొమ్మలాటలుగా, పురాణములుగా చెప్పుకొనుచున్నారు. శ్రీరాముని

కథయగుటచే కలికలుషవిధ్వంసచణంబుగా పరమాదరంబున దీనిని తెనుగువారు పఠింతురు.

ఇంత యుద్ధగ్రంథమునను ఒక్కటే ద్విపద పంక్తి. రాముడు దేవతాంశసంభూతుడని నొక్కి వక్కాణింపబడినది గ్రంథమున. బుద్ధరాజు విష్ణుభక్తుడు. మొదటి ప్రతాపరుద్రుని కాలములో నితడొక సంస్థానాధిపతియై యుండినట్లు చారిత్రకుల నిర్ణయము.

వాల్మీకి రామాయణమునందలి ఉత్తర కాండములోని కథను ఆధారముగా గ్రహించి తిక్కన నిర్వచనోత్తర రామాయణ మను పేర శిల్పతత్త్వమునకు భంగము కాని పద్ధతిని సంకుచితముచేసి స్వయం సంపూర్ణమును, మంగళాంతమును నగు స్వతంత్ర కావ్యముగా రచించెను. పూర్వ రామాయణగాథయంతయు సంక్షేపరూపమున ప్రథమాశ్వాసమున చెప్ప బడినది. రాముడు సీతను పరిత్యజించుట అను ప్రధానాంశమును, అందుకొనిన పిమ్మట గుణ భంజకములగు పూర్వగాథలను ఈ కవి తలపెట్ట లేదు. వాస్తవమునకు నిర్వచనోత్తర రామాయణమునందు రావణుని వృత్తాంతమేగాని రామచరిత లేదు. దీనినిబట్టి రావణుని మహత్తు గ్రహింపగల్గితిమి. రాముని మహత్తును నిందు మూలముగా ద్విగుణముగా గ్రహింప గల్గితిమి. వాల్మీకి రావణుని గొప్పతనమును పూర్వరామాయణమునందేల చూపలేదనగా, రామరావణ యుద్ధమునకును, రావణ నాశనమునకును కారణమైన సీతాపహరణమునకు లాఘవము సంభవించునని. తిక్కన సీతారాముల యుద్యాన వనవిహారము, జలవిహారము, లీలావిహారములు వర్ణించుటలో ఆ దంపతుల శృంగార విలాసమును చక్కగా చిత్రించెను. తిక్కనకు వాల్మీకియందుండెడి గౌరవము నిట్లు వర్ణించెను. వాల్మీకి ఆశ్రమము నందు రామాయణము నిత్య పారాయణ మనియు, "ఒక్కొక్కచో నిజస్వాంతంబును గరగింప తన్మయత్వము బొరయుచు, దాన దినములు గడపుదురనియు" వివరించెను.

ఆదికావ్యమగు వాల్మీకి రామాయణమును తెనుగులో ఆదిపద్యకావ్యముగా నందించిన వారు భాస్కరాదులు. హుళక్కి భాస్కరుని వలన దీనికి భాస్కరరామాయణమని పేరు గలిగినది. దీనిని నలువురు రచించిరి- భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుడు, అయ్యలార్యుడు. భాస్కరుడు తన పుత్ర, మిత్ర, ఛాత్రులయందలి వాత్సల్యమున వారికి కొంత కొంత భాగమిచ్చి కొంత భాగమును తాను తీసికొని రామాయణమును తెనుగున పద్య కావ్యముగా రూపొందించి పూర్తిగావించెను. వీరిదికూడ స్వేచ్ఛానువాదమే.

హుళక్కి భాస్కరాదులు తెలుగున తిక్కన తాత మంత్రి భాస్కరుడు వ్రాసిన సంగ్రహ రామాయణ రచనమును విపులీకరణము చేసిరను వాదమున్నది. హుళక్కి భాస్కరుడు ఆరణ్యకాండమును, యుద్ధకాండమున పదునొకొండు వందల పదమూడు పద్యములును, మల్లికార్జునభట్టు బాల కిష్కింధా సుందర కాండములును కుమారరుద్రదేవుడు అయోధ్యా కాండయును, అయ్యలార్యుడు యుద్ధకాండమున భాస్కరుడు మిగిల్చిన భాగమును రచించిరి. వీరికవిత్వము చక్కని జాతీయములును, సామెతలును కలిగియున్నది. శైలి సుగమము. పాత్ర పోషణము మూలవిధేయము. మొత్తముమీద భక్తి ప్రబోధాత్మకమైనది.

తెలుగు భాషలో కవిత్వము చెప్పిన స్త్రీలలో ద్వితీయురాలైనను రామాయణ రచయిత్రులలో ప్రథమురాలని పరిగణ నందినది మొల్ల. ఈమె శ్రీకంఠమల్లేశ్వరుని వరము

చేత కవితనేర్చితి ననెను. మొల్ల కవితాశైలి మధురమై, ద్రాక్షాపాకమై, సులభ సమాస భూయిష్ఠమై యొప్పును. ఈమె పాండిత్య విశేషములు పలువిధములని, అదిసూచించుచున్నది. ఈమె సుందర యుద్ధకాండములను విస్తృతముగా వ్రాసి మిగిలిన కాండలను సంగ్రహించినది. రామాయణ కథ మిక్కిలి వేగముగా సాగిపోయినది. చదివిన విద్యకు దైవశక్తి తోడ్పడి ధారాళమైన కవితాధార యేర్పడగా నీమెకు ఆంధ్రవాఙ్మయమున ఉన్నత స్థానము లభించినది. ఈమె కవనము వీనులకు విందు, తెలుగునకు పొందు.

కంకంటి పాపరాజు తన ఉత్తర రామాయణమును ప్రబంధరీతిని నిర్మించెను. తిక్కన నిర్వచనోత్తర రామాయణమును రచించి యుండ మఱి తానేల రచింపబూనుట యని ప్రశ్నించుకొని "రాఘవేశ్వరుచారిత్రము నెందఱెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని సమాధానము చెప్పుకొని కావ్యరచనకు పూనుకొనినవాడు పాపరాజు. పాపరాజు కవితలో ఆత్మభూతమైన రసమునకు ప్రాముఖ్యముండును. ఇందలి ఈ రామణీయకమే నేటికిని నందఱి నాకర్షించుచున్నది. లలిత సమాసనిర్మాణము జరుగుచునే యుండును. ఉభయ భాషలలో నిరుపమానమైన సాహితిని ప్రకటించు ప్రౌఢ ప్రయోగములు కన్పట్టును. ఈతని కవితయందు శబ్దాలంకారములు, అర్థాలంకారములు, శయ్యలు, భావములు, ధ్వనులు తేలియాడుచుండును. సందర్భ సుందరముగా జాతీయములు, లోకోక్తులు నుండును. మొత్తముపై తెలుగువారికి త్రికాలస్మరణీయు డనక తప్పదు. తిక్కన చివరలో వదలిన భాగములను కూడ "మృదువచోధారార్థ సందర్భ నిర్భర తత్త్వరస ముల్ రహింప" రచింప బూనినాడు. పుష్పగిరి తిమ్మనగారి సాయముతో తుదముట్ట రచించినాడు పాపరాజు. తెనుగునాట రామాయణములు అనేకములున్నవి. ఇతోధికముగ విస్తరింపగలవు. పరమపావనములు సకల పురుషార్థప్రదములు నగు నీ రామకథలను ఆంధ్రులు ఆదరించి తరింతురు గాక!

# తిక్కన-ఉత్తర రామాయణము

డాక్టరు విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు

ఆంధ్ర మహాభారత రచనకుఁ బూర్వమే కవిబ్రహ్మ తిక్కన ఉత్తరరామాయణమును రచించెను. అతఁడు "ఎత్తఱినైనను ధీరోదాత్త నృపోత్తముఁడు రామ ధరణీపతి సద్వృత్తము సంభావ్యమగుట" యే తన యుత్తర రామాయణ రచనకు హేతువుగాఁ బేర్కొనెను.

పాత్రపోషణకు రసపుష్టికి మూలకథయందు కొన్ని మార్పులను బ్రవేశపెట్టె తన శిల్పనైపుణ్యమును కళాభిజ్ఞతను నిరూపించుకొనిన మహాకవి తిక్కన. కాని ఉత్తరరామాయణమునం దాతఁడు మూలకథయందుఁ గావించిన కొన్ని మార్పు లట్టివి కావని నాకుఁ దోఁచుచున్నది. అట్టి మార్పులను కొన్నిటినిఁ బేర్కొని వాని యౌచిత్యమును పరిశీలించుటయే వ్యాసోద్దేశము.

మూలకథయందు తిక్కన ప్రవేశపెట్టిన మార్పులలో ముఖ్యమైనది రాముడు స్వయముగనే సీతాలక్ష్మణులను వనమునకు సాగనంపుట.

మూలకథప్రకారము రామునిచే నాజ్ఞప్తుడై లక్ష్మణుఁడు మఱునాడు సీతమ్మ భవనమునకుఁ బోయి "నీవు వనమునకుఁ బోవ శ్రీరామునిఁ గోరితివట. నీ కోరికనుదీర్ప శ్రీరాముఁడు నన్నాజ్ఞాపించె" నని పలుకఁగా హర్షమునుబొంది సీతమ్మ వనమునకుఁ బ్రయాణమగును.

ఈ మూలకథారీతిని పెద్దలొకరిట్లు విమర్శించిరి.

"లక్ష్మణస్వామి పెద్ద యుద్రేకపుముద్ద. పాదాలు తప్ప తక్కిన అంగాలు వేనినీ ఎఱుగనంతటి మహాభక్తి వదినెమీద ఆతనికి. అట్టివా డీసందర్భంలో ఇట్లు శుష్కంగా నిర్దాక్షిణ్యంగా వదినెను పిలువఁగలిగెనా? ఆ వ్యక్తికంత ఆత్మసంయమము స్వాభావికమా? ఇదొక ప్రశ్న; ప్రయాణవేళలో సాగనంపడానికైనా సీతమ్మవద్దకు రాముడు రాబనిలేదా? అట్లు రాకపోవుట వింతగా తోచదా? శాశ్వతపరిత్యాగం చేస్తూ దగ్గరనిలచి సాగనంపే మొగము రామునికి లేకపోవచ్చును. కాని సీతమ్మ కా విషయ మప్పటికీ తెలియదు కాన ఆమె రాముడు కానరానందుకు ఆక్షేపించి తీరవలయును. లేదా ప్రయాణవేళలోనే ఆమెకీ పరిత్యాగవార్త తెలియజేయవలయును. కాబట్టి లక్ష్మణునిమాట విన్నమాత్రంతో సీత "ప్రహర్షమతులం లేభే" అన్న వాల్మీకిమాట సీతాస్వరూపానికి చాలదు......తిక్కన్న కిది చాలకపోయినది. వాల్మీకి కొక మ్రొక్కు మొక్కి సీత ప్రయాణసమయంలో రామునినే ప్రధానంగా తెచ్చి నిలుపుతాడు. రాముడు,

"అడలడచి నెమ్మనంబున
వెడ తెలివొడఁగూర్చి మాట లేర్పడకుండం
జిడిముడి పడక నయంబున
నెడమడు వొక్కింత లేక యిట్లనుసతితోన్

పొలతుక గంగచేరువ త
పోవన భూములు సూడ నీమదిన్
మొలచిన కౌతుకంబు దుది
ముట్టగ లక్ష్మణదేవు నిన్ను నం
దులకు మనో ముదంబెసఁగఁ
దోకొనిపో నియమించితిన్ సము
జ్జ్వల మణికాంతమైన రథ
సత్తమ మెక్కుదు రమ్మ నావుడున్"

సీతమ్మ,

"అక్కట నాదు వేడ్క కుచి
తానుచితంబులు సూడకే విభుం
డొక్కతలంపు వాడయి స
ముత్సుకతన్ ననుదవ్వ పుచ్చగా
నిక్కమ యియ్యకోలరయ
నెయ్యము తియ్యము గాదె......"

యనుకొని సరేనన్నది. కాని యీ నాటకాన్ని లక్ష్మణుడు చూచి సహింపఁగలడా? మఱి సహింపక మాత్రం యేమనఁగలఁడు? అన్న ధైర్యానికి వదినె పిచ్చి నమ్మకమునకు ఆశ్చర్యమూ దుఃఖమూ అతని నావరింప మొగముమీద తోచినవి. దానినిఁ జూచి రాముఁడు సీతతో

"దూరమునాక ఘోరవన
దుర్గతలంబులఁ గేలిసల్పగాఁ
గోరెడు భామలం బ్రియులఁ
గోరినయట్టుల పుచ్చు రాజులన్
ధారుణి నెందు గానమని
తాము దీనికి నడ్డపెట్టనేఁ
బోరితమాడి యిట్లు నిను
బుచ్చుట కల్గినవాడు సూచితే."

అని పెద్ద అల్లిక మొకటి అల్లి సీతను వలలో వేసి తమ్మునినోరును-తెరవనిదాన్నే మూస్తాడు.

ప్రియవాదీచ భూతానాం
సత్యవాదీచ రాఘవః'

అన్న రాముని కీర్తికి భంగం దీనితో వచ్చిందని దుఃఖించేవారు దుఃఖింపని లెండి! సీతమ్మ వ్యక్తికి మాత్రం దీనితో కొంత ప్రాణబలం వచ్చింది, పొమ్మంటేపోయి రమ్మంటే వచ్చే రకం కాక రాముఁ డసత్యమైనా చెప్పి మనస్సు నెమ్మదిపరచవలసిన పాత్రంగా ఆమె యిందు తయారైంది. మఱి మునిపత్నులకని వాల్మీకి సీత స్వయముగాఁ దీసికొన్న'' మణిమయ భూషణాంబరాదులు తిక్కన రామునిచేత నే యామె కిప్పించినాడు. ఇట్లు ఆమెను,

''పాలతోడ విషంబిడు పగిదిననిచి
పుచ్చి రాఘవుడుల్లంబు నొచ్చి మరలె''

విమర్శకుల యింత గ్రంథము నిచ్చట నను వదించినందులకు పాఠకులు మన్నింతురు గాక!

ఇచ్చట విమర్శకుల యభిప్రాయము ననుసరించి తిక్కనగారు కావించిన మార్పునకు కారణములు రెండు. ఒకటి గొప్ప యుద్రేకములు గల లక్ష్మణునకు 'నిర్వికారంగా నిర్దాక్షిణ్యంగా' సీతతోఁజెప్పి ప్రయాణము చేయింపఁగల ఆత్మసంయమము స్వాభావికముగాదు. రెండవది తన ప్రయాణసమయములో రాముడు లేనందుకు సీతమ్మ ఆక్షేపించి యుండవలదా? అనునది. ఇప్పుడు మొదటి కారణమును పరిశీలింతము. లక్ష్మణుఁడు పెద్ద యుద్రేకపు ముద్ద యనునది సత్యమే. ఈ విషయము రామాయణమున పెక్కుచోట్ల కానఁబడును కాని లక్ష్మణుని యుద్రేకాగ్ని రామాజ్ఞ యనెడు నంబుధారచే చల్లారునట్టిదే యను విషయముకూడ రామా పఠితలకుఁ దెలియనిదికాదు. విమర్శకులే యన్నారుగదా! వేఱొకచోట ''అన్నమాటకు మాఱాడే స్వభావము లేని లక్ష్మణుడు అన్న యాజ్ఞను పరిపాలించుటకు నిర్వికారముగా వది నెతో నడవికి ప్రయాణమగుమని పలుకలేడా? ఆత్మసంయమమును ప్ర ులేడా? వాల్మీకి చిత్రించిన లక్ష్మణుని యాత్మసంయమ మాతని స్వభావమునకు విరుద్ధమని విమర్శకు లనిరి. తిక్కనగారి లక్ష్మణుడుకూడ ఆత్మసంయమమును నిర్వికారతను ప్రదర్శించినాడే! లక్ష్మణుఁడు గంగానదినిదాటు పర్యంతము తన దుఃఖమును మనోవికారమును ప్రకటింపలేదే! ప్రయాణసమయములో లేని యాత్మసంయమము తిక్కనగారి లక్ష్మణునకుఁ బ్రయాణమైన తర్వాత నెట్లు వచ్చినది? లక్ష్మణుఁడు రథము మీద మౌనముతో కూర్చుండి మానసిక వ్యథను ప్రకటింప లేదనుట సరికాదు.

తిక్కనగారి పద్యమును గమనిపుడు.

''లలితగతిన్ సతోయకమ
లస్ఫుటమార్గమునన్ శరీరర
క్షులు వినయంబుతో నడిపి
గౌరవమొప్పఁగ భక్తిపెంపుమై
నలయకపంపుసేయుచు మ
హాశ్రమభూములు పీడుపట్టుగా
లలనఁదగన్ సుమంత్రుడును
లక్ష్మణుడుం గొనిపోయిరిమ్మలన్.''

వినయముతో శరీరరక్షులునడుపుట, పంపుసేయుట, నిర్వికారముగా చేసిన పనులేకదా! అంతియేకాదు. తన తనువున దుర్నిమిత్తములు తోచి సీత ''నాకు వెఱపగుచున్న'' దనగా ''నమ్మాటలు గీటునం బుచ్చుచు'' లక్ష్మణుఁడు

''
లలితడోలాయితవీ
చినిచయసుభగాకృతియగు
ననిమిషనదిఁ జేరనరిగి నత్యంతధృతిన్.''

అని తిక్కనగారే వ్రాసిరి. ఈ యత్యంత ధృతి నాతడు ప్రయాణసమయమునందుమాత్ర మేల ప్రదర్శించి యుండఁగూడదు? కాబట్టి తిక్కనగారు కావించిన మార్పునకు లక్ష్మణ స్వామికి ఆత్మసంయమము స్వాభావికము కాక పోవుట యనుకారణము సరిగాదు.

"లక్ష్మణునకు ఆత్మసంయమము స్వాభావికమా" అన్నవిమర్శకులకు సమాధానమో యన్నట్లీసందర్భమున కంకంటిపాపరాజు రచనను గమనింపుడు.

ఆ సౌమిత్రి దృఢాత్ముఁడౌటవగదై
న్యంబున్ ముఖాబ్జంబునన్
వీసంబంతయుఁ దోపనీక తెగువన్
వేవచ్చి సద్భక్తి సీ
తాసీమంతినికిన్ వినమ్రుఁడయి మా
తా, గాంగతీరాశ్రమే
హాసక్తిన్ నినునందుదోడుకొని పొ
మ్మంచుం విభుండంపినన్.

వాల్మీకిరచనమున విమర్శకులకుఁ గలిగిన ప్రశ్నలకు ఈ పాపరాజుపద్యము సమాధాన మనుట స్పష్టము.

ఇక తిక్కనగారి మార్పునకు విమర్శకు లూహించిన రెండవకారణ మరయుదము. ప్రయాణకాలములో రాముడు లేనందులకు సీతమ్మ యాక్షేపించి యుండవలెననునదియే రెండవ కారణము, ఇచ్చట విమర్శకుల కొక ప్రశ్న.

"గంగాతీరము కానలోనఁ దిరుగంగాఁ గౌతుకం బయ్యెడిన్" అని సీతమ్మ తనకోరికను దెలిపినది. దానికి శ్రీరాముడు "లతాంగి, నీవు కోరినట్లుచేయుటెంతపెద్ద? శీఘ్రంబయచటికిఁ బుచ్చువాడ" ననగా సీతమ్మ తనతో శ్రీరామ చంద్రుడుకూడ వనమునకు రావలయునని కోరఁబనిలేదా? అట్లు కోరినటుల తిక్కనగారు రచింపలేదే! అటు సీతమ్మ కోరకుండుట విమర్శకులకు వింతగా తోచనప్పుడు ప్రయాణ వేళలో రాముడు లేనందులకు సీతమ్మ యాక్షేపింపకపోవుట యేల వింతగా తోపవలయును?

మరియు తిక్కన్నగారి రచనలో "పొమ్మంటే పోయి రమ్మంటే వచ్చేరకంకాక అసత్యమైనా చెప్పి నెమ్మదిపఱచవలసిన పాత్రంగా తయారైంది సీతమ్మ" అనికూడ విమర్శకులు వ్రాసిరి. వాల్మీకి చిత్రించిన సీత యంత తేలికబారుగా నున్నదని విమర్శకుల యాశయము. పొమ్మంటే పోయి రమ్మంటే వచ్చే గృహిణులు విమర్శకుల దృష్టిలో ఉదాత్తవ్యక్తులుకారు కాబోలు. అదియుఁగాక "పొమ్మంటే పోయి" అనుమాటకు ఇక్కడ ప్రసక్తియే లేదు. వనమునకుఁబోవ సీతమ్మ వాంఛించినది. రాము డంగీకరించినాడు. ఇచ్చట 'పొమ్మంటే పోవు' అనుదానికి అవకాశమెక్కడ? ఇక్కడ తిక్కన కావించిన మార్పువలన సీతమ్మ పాత్రపోషణమునకు చేకూరిన విశేషము నాకు బోధపడుటలేదు. ఈ ఘట్టమునందు భవభూతిని మించి తిక్కన మార్పులను ప్రవేశపెట్టెననికూడ విమర్శకులు వ్రాసిరి. నాకు భవభూతి కథాక్రమమే హృదయంగమముగా తోచుచున్నది. భవభూతిరచననుసరించి సీతమ్మకోరికనుతీర్చుటకు ఋష్యాశ్రమములకుఁ బంపుదునని శ్రీరాముడు చెప్పగనే సీతమ్మ "మీరుకూడ రావలయు" నని కోరును. ప్రయాణసమయములో రాముడు లేనందులకు సీత యాశ్చర్యపడి "కాని అతని మీద కోపం చూపుతాను. అతనిఁ జూచి నపుడు నా తెలివి నాలో వుంటే" అంటుంది. ఈ రచనయందు ఎట్టి ప్రశ్నల కవకాశము లేదు.

తిక్కనగారి కథాకథనమందు రాముని సంభాషణ మాతని యుదాత్తప్రకృతికిఁ దగినట్లు లేదు. గర్భవతిగా నున్న సీతమ్మ కోరిన కోరికను రాముడు తీర్చుచుండగా లక్ష్మణుఁ డాక్షేపించునా? అట్లాక్షేపించెనని రాముడు చెప్పినను సీతమ్మ నమ్మునా? ఆవిధముగ రాముడు చెప్పగనే సీతమ్మ నమ్మినటు వ్రాయుటవలన తిక్కనగారి సీతమ్మ విమర్శకుల యభిప్రాయముప్రకారము స్వాభిమానాలుకల వ్యక్తిగా కాక యేమాటచెప్పినను నమ్మెడి వెఱ్ఱిబాగులదిగ తయారైనది.

విమర్శకులు "ప్రియవాదీచభూతానాం సత్యవాదీచరాఘవః అన్న రాముని కీర్తికి భంగంవచ్చిందని దుఃఖించేవారు దుఃఖింపనిలెండి" అని వ్రాసిరి. వారి యభిప్రాయము ప్రకారమే రాముని పాత్రపోషణమునకు భంగమువాటిల్లినదని తెలియుటలేదా? సీతమ్మ పాత్రకు ఉదాత్తతవచ్చినది కావున రాముని పాత్రకు లోపము వచ్చినను ఫరవాలేదందురా? కవిప్రధానపాత్రలన్నింటిని సమానస్థాయిలో పోషింపవలెనుగాని ఒకపాత్రకు ప్రాధాన్యమును వేఱొకపాత్రకు హైన్యమునాపాదించునటుల చిత్రించుట న్యాయ్యముకాదు. తిక్కనగారి రచనలో లక్ష్మణుని పాత్రకుకూడ లోపము వాటిల్లినది. తనకుఁగలిగిన యపవాదమును పోగొట్టుకొనుటకు రాముడు లక్ష్మణుని సాహాయ్యము కోరగా లక్ష్మణుఁ డంగీకరించి ప్రయాణసమయమున "ఉమ్మలించుచుం జిత్తముఖేదమాననమునఁ జెందిన మాన్పగలేక యుత్తలమందు" చున్నట్లుగా లక్ష్మణుని చిత్రించుట ఆ పాత్రకు లోపమును ఘటించుట లేదా!

వనమునకుఁ బోయినతర్వాత లక్ష్మణుడు రాముని యాజ్ఞను సీతమ్మకుఁ దెలుపును. అప్పుడు సీతమ్మ రాముడు చేసిన యసత్య సంభాషణమునకు మోసమునకు ఎంత యాక్షేపించి యుండవలెను? అట్లాక్షేపించినటుల తిక్కనగారు రచింపలేదే – కాబట్టి రాముడే సీతమ్మను స్వయముగా వనమునకు సాగనంపెనను తిక్కనగారి రచనకంటె వాల్మీకిరచనయే పాత్రపోషణాదృష్టితో చూచిన ఉచితమైనదని నాయాశయము.

మునిపత్నులకని మణిమయభూషణాంబరాదులు సీతమ్మ స్వయముగా తీసికొన్నటుల వాల్మీకిమహర్షి రచించెను కాని మణిమయ భూషణాంబరాదులను రాముడే ఋషిపత్నులకని సీతమ్మ కిచ్చినటుల తిక్కనగారు రచించిరి. ఈ సందర్భముననైనను తిక్కనగారి సీతమ్మకంటె వాల్మీకిమహర్షి రచించిన సీతమ్మ మెఱుగని విమర్శకులు వ్రాయలేదు. వనమున ఋషిపత్నులతో విహరింపఁగోరిన సీతమ్మ ఋషిపత్నుల కీయఁదగిన కానుకలను తానే ఏఱికోరుకొనుట యుచితముగదా! లోకములో స్త్రీలకుఁ గావలిసిన చీరలును, ఆభరణములును స్త్రీలేకదా యెన్నుకొందురు. వాల్మీకిమహర్షి చిత్రించిన సీత ఋషిపత్నులకు ఈయవలసిన కానుకలను తానే తీసికొనినది. తిక్కనగారి రచనలో నామె అట్టి మర్యాద లేవియు తెలియనిదిగా చిత్రింపబడినది.

విమర్శకులు మరియు నిట్లు వ్రాసిరి: "గంగానది యవతలియొడ్డున సీతమ్మ కామె పరిత్యాగవార్త తెలిపిన తర్వాత లక్ష్మణుడు వాల్మీకియాశ్రమ మిందే యున్నది. అందు సుఖముగా వసింపుమన్నాడు అంటూ కడపటిదిగా ఒక అధికప్రసంగపుమాట జాఱవిడిచినాడు.'

ఉపవాసపరైకాగ్రా
వసత్వం జనకజాత్మజే

పతివ్రతాత్వమాస్థాయ
రామంకృత్వా సదాహృది.

లక్ష్మణునినోట ఈ యుపదేశపుమాట రానిచ్చుట ఆ ఇద్దఱు వ్యక్తుల యోగ్యతకు చాలనిది, గనుకనే దానిని తిక్కన్నగారు వాల్మీకికే వదలినాడు.

"ఇచ్చట ఉపవాసపరా, ఏకాగ్రా" అను రెండు విశేషణములను విధేయవిశేషణములనుగా చేసినచో విమర్శకులు వ్రాసినటుల అనుచితముగా తోపవచ్చును. కాని ఆ రెండు విశేషణములను సామాన్యవిశేషణములనుజేసి ఉపవాసపరా, ఏకాగ్రా, త్వం మహాత్మనః పాదచ్ఛాయా ముపాగమ్య సుఖంవస" అని అన్వయించిన దోషమేమి కలదు? నీవు (స్వభావముచేత) ఉపవాసపరురాలవు, ఏకాగ్రత కలదానవు. అట్టి నీవు పతివ్రతాధర్మము నాశ్రయించి (అనగా ఆత్మహత్యాదులకుఁ బాల్పడక) రాముని సదా హృదయమునం దిడుకొని ఈవాల్మీకియాశ్రమమునందు వసింపుమనుటలో ననౌచిత్య మేమియు లేదని నా యాశయము. కష్టసమయమున పిన్నలుకూడ పెద్దలకు నీతు లుపదేశించుట లోకమున సహజముకదా! ఆపత్సమయమున మన శ్రాంతికె యెవరెనను ధర్మము లుపదేశింపవచ్చును. అట్లుపదేశించినమాత్రమున ఆ ధర్మము లా పెద్దవారికి తెలియవని చిన్నవారు తలచినటుల మనము భావింపరాదు. "బాలాదపిసుభాషిత"మ్మనికదా పెద్దల నానుడి. కాబట్టి లక్ష్మణుని యుపదేశ మనుచితము గాదని నాయూహ.

వాల్మీకిరచన పాత్రపోషణదృష్టితో చూచిన నుచితముగానే యున్నదనియు తిక్కనగారి రచనకు ఆయన కావించిన మార్పులవలన నెట్టి ప్రాశస్త్యముచేకూరదనియు తెలుపుచు నీ వ్యాసము ముగించుచున్నాను.

# శ్రీమద్రామాయణోదాహరణము

శ్రీ పాటీలు తిమ్మారెడ్డిగారు

ఉదాహరణ ప్రశంస: "జగత్తంతయుఁ గ్రియారూపము – సర్వక్రియయుఁ బరమేశ్వరునందుఁ బర్యవసించును. ధాతువు సర్వథా విభక్త్యాశ్రయము. ఏ విభక్తితో సంబంధములేక క్రియలేదు. అందుచేత నన్నివిభక్తులతోఁ బరమేశ్వరునిఁ జెప్పినపుడు భగవంతుఁడు సర్వక్రియాస్థానభూతుఁడని వ్యంగ్యము. ఇది యుదాహరణ కావ్యరహస్యము......"

—కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

వినతి: ఉదాహరణ కావ్యము విభక్త్యాశ్రయమగుటచే నిది కథనమునకుపయోగింపదు. కావున నాంధ్రసాహిత్యమున నేఁటిదాఁక వెలువడిన యుదాహరణము లన్నియుఁ గేవలము స్తుత్యాత్మకములు, లేదా ప్రశంసాత్మకములు. అట్టియెడ నేతత్కావ్యలోకమున నుదాహరణమునఁ గథాప్రసంగమును దెచ్చుట కిది సర్వప్రథమయత్నము. సుందరకాండమునఁ గథానాయకుఁడగు రామప్రవేశ

మున కవకాశము లేదు. కావున నందుఁ బ్రేరణ క్రియారూపము లవలంబింపఁబడినవి. ఈ యత్న సాఫల్యమునకు సహృదయ కవిపుంగవులే ప్రమాణము.

—పాటీలు తిమ్మారెడ్డి

బాలకాండము - ప్రథమావిభక్తి

శా. శ్రీమంతమ్మ్ము, సమస్త మానిజన సం
సేవ్యమ్మ్ము, దివ్యమ్మ్ము, శో
భామాంగల్య సురూపపేటిక, లస
ద్భక్తార్తి కల్పాగముల్
శ్యామాంగమ్మ్ము, కిశోరవంద్యమును బ్ర
హ్మాండాధినాథమ్మ్మునౌ
రామబ్రహ్మమహమ్మ్ము లోకమున నా
రాధ్యమ్మ్ము భక్తాళికిన్.

త్రిపుట తాళము - కళిక - వృషభగతి రగడ

సురమునీశ్వర ప్రార్థితమ్మై
క్షోణిఁబుట్టిన విష్ణుతేజము
వరలు కౌసల్యా దశరథే
శ్వరుల కూరిమి పుత్రరాజము
తపసి జన్నముఁ గాచుకొఱకై
తండ్రి పంపఁగఁ జన్న శౌర్యము
నిపుణతను దాటకను గానల
నిలువునను జీల్చిన ధైర్యము
పరమకరుణ నహల్య దగు శా
పమ్ము వాపిన దివ్యచరణము
హరుని ధనువును దునిమివైచిన
యట్టి శ్రీరఘుకులాభరణము
ధరణి యానందమునఁ బొంగఁగ
ధరణిజను వరియించు పుణ్యము
పరశురాముని బాహుగర్వము
ప్రక్కలించిన శక్తి గణ్యము. ౨

త్రిపుట తాళము - ఉత్కళిక - హరిణగతి రగడ

పౌరజన చిత్తాంబుజమ్ములు
కూరిమిని వికసింపఁ దమ్ములు
వెంటఁ జనుదేరంగఁ దల్లులు
కంట మోదాశ్రువుల జల్లులు
కురియఁగా సాకేత సత్పుర
వరము సొచ్చిన దివ్యసుందర
లోకమోహన పుణ్యరాజము
లోకబాంధవ వంశతేజము. 3

అయోధ్యాకాండము - ద్వితీయా విభక్తి

ఉ. ఏను బురాభవమ్మున న
దెంత తపమ్మొనరించి యుంటినో
గాని మునీంద్ర దుర్లభము
గా సకలాగమముల్ వచించునె
వ్వాని పదాబ్జ భక్తి నటు
వంటి రఘూద్వహు లోకవంద్యునా
మానస మాశ్రయించినది
మానక రాముని నామధామునిన్. ౪

జంపెతాళము - కళిక - విజయభద్ర రగడ

అభిషేక భంగమున
కనుతపింపని వాని
విభవ సముదాయమును
విడిచివైచినవాని
నారచీరలలోన
నగవు లొలికిన వానిఁ
గారడవులకుఁ దండ్రి
కట్టడిని జనువానిఁ
బ్రాతుఁడౌ గుహుని సే
వలకు మెచ్చిన వానిఁ
జిత్రకూటమ్ము వేం
చేసి నిలిచిన వానిఁ

దండ్రి స్వర్గతిని విని
తల్లడిల్లిన వానిఁ
దండ్రి కచటనె తిలో
దకము లిచ్చిన వాని. ౫

జంపెతాళము - ఉత్కళిక - ద్విరదగతి రగడ.

తల్లి సేఁతలను విని
పెల్లు దురపిల్లి చని
రామునిం గొని తెత్తు
నీ మహీతల మిత్తు
నని యెంచి వచ్చు భర
తునకుఁ బ్రేమమున వర
పాదుక లొసఁగి వాని
నాదరించిన వాని. ౬

ఆరణ్యకాండము - తృతీయా విభక్తి.

ఉ. అక్కట యేల భీతిలఁగ
నన్యుల పోలిక, రామనామమే
దిక్కని నమ్మియుండి విభు
దీనశరణ్యు గుణమ్మెంచింగియుఁ ?
దిక్కులు పట్టకుండు నొకొ
తేఁకువ దప్పి మహౌఘ సంచయ
మ్మక్కమలాక్షుచేత జగ
దార్తి హరుండగు నట్టి రాముచేఁ ? ౭

రూపకతాళము కళిక - తురగవల్గన రగడ

క్రౌంచకయ విరాధ దైత్యుఁ
గూల్చినట్టి ఘనుని చేతఁ
బంచవటిని బర్ణశాల
పరిరచించు వానిచేత
శూర్పణఖ విరూపఁ జేసి
సురిగించిన వానిచేత
దర్పమున ఖరాది దైత్య
తతులఁ గూల్చు వానిచేతఁ
గనకమృగము దెచ్చుటకై
కదలి చన్న వానిచేతఁ
గనకమృగాకార దైత్యుఁ
గాలరాయు వానిచేత
సీతకోస మడవి దిరిగి
చింతించిన వానిచేతఁ
బ్రీతి జటాయువునకుం దు
రీయమిచ్చు వానిచేత. ౮

రూపక తాళము - ఉత్కళిక - హయప్రచార రగడ

రాముఁడిటకు వచ్చునెపుడు
రాముని నేఁగాంతు నెపుడు
కన్నులార ననుచు వేచి
తెన్నులెదురు చూచి చూచి
కొఱకికి ఫలములిచ్చు శబరి
కరుసమునను ముక్తిని గురి
పించు దయాసాంద్రుచేత
మించు రామచంద్రుచేత. ౯

కిష్కింధాకాండము - చతుర్థీ విభక్తి

మ. హన దివ్యనీల రుచితో
దేదీప్య మానమ్మునై
యజశర్వామరనాథ ముఖ్య సుర వం
ద్యమ్మై నితాంతమ్ము ధా
త్రిజ దివ్యానన పద్మసూర్యమయి ప్రీ
తిం జూపు శ్రీరామ చం
ద్ర జగద్వంద్య మహామ్ముకై ప్రణతు
ల్యంతమ్ము గ సేసెదఁ. ౧౦

ఏకతాళము - కళిక - హరిగతి రగడ

పవనకుమారుని ఋశ్యమూకనగ
ప్రాంతమ్మునఁ గనుగొన్న యతనికై
ప్రవిమలమతి సుగ్రీవునితో మి
త్రత్వము నెరపిన యా ధీరునకై

శరకౌశలమునఁ దాలము లేడిటి
జవమునఁ గూల్చినయట్టి ఘనునకై
పరదారను హరియించిన వాలిని
బరిమార్చిన విక్రమ శీలునకై
ప్రీతిని గిష్కింధారాజ్యము సు
గ్రీవున కిచ్చిన యా రఘుపతికై
యాతతముగఁ దాశేయున కప్పుడ
యౌవరాజ్య మిడు జానకిపతికై
జనకసుతాన్వేషణముం జేయఁగ
సకల కపుల రావించు నతనికై
హనుమానున కతివాత్సల్యమున ని
జాంగుళి ముద్రికనిచ్చు నతనికై. ౧౧

ఏకతాళము - ఉత్కళిక - మధురగతి రగడ

ఎవ్వనినామ బలమ్మునఁ గపులే
యెవ్వరునుం జొరఁజాలని గుహలే
వనములె క్రీడలలో వలె దూరిరొ
ఘనుఁడగు నా సంపాతిని జేరిరొ
జనకజ వృత్తాంతము గనిపట్టిరొ
వననిధి లంఘింపఁగ సమకట్టిరొ
యమ్మహనీయ లసన్నామునకై
యిమ్మగు సేవకమందారునకై. ౧౨

సుందరకాండము - పంచమీవిభక్తి

శా. ఘోరాకారము దుస్తరం బగుచు లో
కుల్ భీతినొందంగ సం
సారాంభోధియొసంగఁ దారకముగా
శంభుండు ప్రేమమ్మునన్
(శ్రీ) రామప్రభు నామమిచ్చునెపుడున్
జీవాళి, శాశ్యామలా
కారుండైన రఘుప్రవీరువలనన్
- గాంక్షింతుఁ గైవల్యమున్. ౧౩

రూపకతాళము - కళిక - తురగవల్గనరగడ

వారిరాశిఁ గ్రోతికిఁగా
ల్వాగ నొనర్చువానివలన
వారక లంకిణినిబట్టి
వధింపించువానివలన
లంకనెల్ల వెదకించెను
రాత్రియెవ్వఁడతనివలన
జంకు మాని యశోకవనిఁ
జదిమించిన యతనివలన
శిక్షితులుగ దానవులను
జేయించినవానివలన
నక్షయాదులను యమపురి
కంపజేయువానివలన
నింద్రజిత్తుచేత హనుమ
నిరికించినవానివలన
సాంద్రదైత్యసభనుదూత
సరగ నిలుపువానివలన. ౧౪

రూపకతాళము - ఉత్కళిక - హయప్రచారరగడ

పవనపుత్రు వాలమందు
రవులుకొనఁగ నగ్నినిందు
శీతలముగఁ జేసి వాని
చేతలంక నెల్లఁబూని
ఛటచ్ఛటా రావములను
పటుతరముగ హర్మ్యములను
గాల్పించిన వానివలనఁ
గల్పావ్యద్యధినాథువలన. ౧౫

యుద్ధకాండము - షష్ఠీవిభక్తి

చ. శరణము నాకు రాముఁడని
సర్వవిధమ్ముల భక్తియుక్తిఁ ద
చ్ఛరణము లాశ్రయించునెడ
స్వామి యదెంతటి పాపినేని నా

కరము సెలంగఁ గాచును స
దా, శరణాగతవత్సలుండు నా
యెరుదున కెక్కు భానుకుల
వీరున కే ఘటియింతు నంజలుల్. ౧౬

ఏకతాళము - కళిక - హరిగతిరగడ

శరణనివచ్చిన యంతటన విభీ
షణునకు నభయమ్మిచ్చిన వరునకు
శరనిధినింకిం చెదఁగనుఁడీనా
శరకౌశలమని పలికిన వరునకు
శరనిధిపైఁ గోఁతులచే సేతువు
సరభసముగ గట్టించిన యతనికి
దురమున నింద్రజిదకంపనాదుల
దోర్దోడనదునిమించిన యతనికి
రావణఘటకర్ణప్రముఖ మహా
రాక్షసనాథుల రాచినస్వామికి
రావణు సోదరునకు నాలంకా
రాజ్యమ్మిచ్చిన దయాతిభూమికి
మృతులయి రణభూమినిఁబడు శాఖా
మృగముల బ్రదికం జేసిన విభునకుఁ
గుతుకమ్మునఁ జిచ్చురికినజానకి
గూరిమితోఁ జేపట్టిన ప్రభునకు. ౧౭

ఏకతాళము - ఉత్కళిక - మధురగతిరగడ

పుష్పములను గురియగ సురగణములు
పుష్పకమెక్కి ప్లవంగమ గణములు
జయవెట్టంగ నయోధ్యాపురమ్ము
రయమునఁ జేరియు జగములు కరమ్ము
మోదింపఁగ నభిషిక్తుండై జన
మోదకరమ్ముగ రాజ్యమ్మేలిన
సజలఘనఘనాఘనశ్యామునకు
నజరుద్రాదిక వంద్యనామునకు. ౧౮

ఉత్తరకాండము - సప్తమీవిభక్తి

చ. యుగము లవెన్నిమాఱిన స
హో యదె రాముని రాజ్యమంచు ము
జ్జగములు మాటిమాటికిఁ బ్ర
శంసయొనర్పఁ బ్రజాళియెల్లఁ జ
ల్లగ నిదురించునట్లుగ ధ
రాపరిపాలన మాచరించు నీ
జగదభివంద్యుఁడైన రఘు
చంద్రునియందు రమించుఁ జిత్తముల్.

జంపెతాళము - కళిక - విజయభద్రరగడ

అజరుద్రమఘువ ము
ఖ్యామరేడ్యునియందుఁ
బ్రజలకై సతిఁగూడ
వదలు జనపతియందు
హయమేధ దీక్షితుం
డైన సత్ప్రభునందు
నయముగాఁ దొలికావ్య
నాథుఁడగు విభునందుఁ
గుశలవుల కూర్మిజన
కుండయిన ఘనునందు
విశదముగఁ దనగాథ
విన్న పుణ్యునియందు
లవణసంహార కా
రణుఁడైన వరునందు
భవజలధి దాఁటింప
వలఁతియగు స్థిరునందు. ౨౦

జంపెతాళము - ఉత్కళిక - ద్విరదగతిరగడ

అవతార కార్యమ్ము
భువిఁదీర్చి సర్వమ్ము
దేవతలు ప్రార్థింప
నావిమానముఁ బంప

సాకేతపురి మాఱి
వైకుంఠమును జేరి
జగదవనమునయందు
నెగడు శాశ్వతునందు. ౨౧

**అద్యతనకాండము - సంబోధన ప్రథమావిభక్తి**

ఉ. ఎందఱొ వెన్నిరీతుల ర
చించియుఁ దావకదివ్యగాథ తా
నందముఁ జిందునెప్పుడు న
హా సుపవిత్రము నిత్యనూత్నమై,
యందుల కేగదా సుకవు
లన్నివిధమ్ములఁ బాడుచుండు రా
నందముపొందు కోరిక మ
నమ్ముల నీకథ రాఘవేశ్వరా. ౨౨

**త్రిపుటతాళము - కళిక - వృషభగతిరగడ**

ప్రేమతో గోదావరీతటి
వెలయు భక్తజనార్తిహరణా
రామదాస వినిర్మితాలయ
రమ్యధామా, దివ్యచరణా
కడకుఁ దానీషానుగని రూ
కలను జెల్లించిన యుదారా
తడయకను నిజభక్తునిం బం
ధములు విడిపించిన గభీరా
శాశ్వతమ్ముగఁ బోతనాదుల
సత్కృతుల నెలకొన్న రామా
విశ్వనాథుని కల్పకమ్మున
వెలయు సుకవిహృదబ్జధామా
త్యాగరాజ సుకీర్తనములకు
దక్కిపోవు మహానుభావా
ఏగతి న్నిన్నెవరుగొలిచిన
నెల్లరను బాలించుదేవా. ౨౩

**త్రిపుటతాళము - ఉత్కళిక - హరిణగతిరగడ**

* ప్రేమఁ దులసీదాసువ్రాసిన
రామచరితముఁ దెనుఁగుసేసిన
వారలను గేశవకిశోరులఁ
గూరిమిని సకలాఘదూరులఁ
జేసి తావకపాద భక్తిని
వాసిగా నాపిదప ముక్తిని
గటాక్షింపఁగ నిలుచురామా
నిటాలేక్షణవినుతనామా. ౨౪

**సార్వవిభక్తికము - మత్తేభవిక్రీడితము**

భగవంతుండవు నీవ - నిన్ను మదిలో
భావింతునేవేళ - నా
వగనీచేహృతమా - నమస్కృతులు పొ
ల్పారున్ సదా నీకునై
జగతీవాసనలెల్ల నీవలన నా
శమ్మౌను - నీకున్నతుల్
తగునీయందలిభక్తి - భద్రగిరినా
థా రామచంద్రప్రభూ. ౨౫

**అంకితాంకము - సీసము**

)రామదివ్యచరితమానసాది స
త్కావ్య నిర్మాణైక కర్మఠుండు
పాటీలువంశాబ్ధి పార్వణచంద్రుఁ డం
కంపల్లివాసుఁడు ఖ్యాతుఁడైన
గోవిందరెడ్డికిఁ గూరిమితనయుండు
విశ్వనాథమహాకవీంద్రు శిష్యుఁ
డలకిశోరాఖ్యఁ బ్రఖ్యాతుఁడౌ వాఁడు తి
మ్మారెడ్డియభిదఁ బెంపారువాఁడు
ఆంధ్రదైవమటంచు విఖ్యాతిఁగొన్న
భద్రగిరిరామభద్రుని భవ్యదివ్య
భక్తజనవంద్యపావన పాదనీర
జాంకితముగ నీచిన్నికావ్యమ్ముఁగూర్చె.

ఓం శ్రీరామచంద్రార్పణమస్తు.

---

* శ్రీరామచరితమానసము : అనువాదకులు:— శ్రీ కేశవతీర్థస్వామి, శ్రీ పాటీలు తిమ్మారెడ్డి—1966 లో వెలువడిన ఉత్తమకావ్యముగా ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారిచే రు. 1116 ల బహుమతి నందినది. పిడుగురాళ రామతీర్థ సేవాశ్రమమువారి ప్రచురణ.

# శుకోపదేశము

## [రావణునకు శుకుఁడు చేసిన హితోపదేశము]

"ఆర్షకవి శిరోమణి" విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు

చ. అనుపమ పుణ్యమూర్తులు మహాత్ములు రావణ సార్వభౌమ, ఆ
యనుజులు రామలక్ష్మణులు నట్లు విభీషణుఁడున్ గపీంద్రుఁడున్
గనఁగ మహామహుల్ ఘనులు నల్వురు నున్న పవిత్రభూస్థలిన్
విను మసురేంద్ర, సర్వమును విస్ఫుటమున్ క్షణమాత్ర సాధ్యమున్. 1

ఉ. లంకను బెల్లగించుటకు లంకను భస్మమొనర్పఁగంటకున్
శంకయె లేక యొక్కత్రుటి సర్వము నాశమొనర్పఁగంటకున్
శంకర సన్నిభుల్ పరమశౌర్యనిధానులు వారు నల్వు రే
వంకకునైనఁ జాలుదురు వానరసైన్యము నిద్రపోవఁగన్. 2

ఉ. రాముని రూపమున్ మఱి పరాక్రమమున్ బల మాయుధంబులన్
స్తోమత చూడ నొక్కఁడె వసుంధర సర్వము నాశనంబుగా
నోమును జేయ ముప్వురును నూరకయుండఁగ వచ్చు వారికై
యేమియు శేష ముంపఁ డిఁక నింతటిధైర్యపరాక్రముం డగున్. 3

గీ. రాముఁడు నరుండు కాఁడు, పరాత్పరుండు ఆదినారాయణుండు సత్యంబు వినుము
సకలవిశ్వప్రహేతు చిచ్ఛక్తి సీత, ఆమె జగదాత్మికయె సంశయంబు లేదు. 4

క. సీతారాముల వలననె, యేతద్విశ్వంబు పుట్టె నిటు స్థావరమున్
భూతాత్మక జంగమమును, బ్రీతిని దెలియంగనౌను విజ్ఞుల కెల్లన్. 5

శా. సీతారాములు లోకజాలమునకున్ జెన్నారు మాతాపితల్
ప్రీతిన్ వారలఁ గొల్చువారికె శుభశ్రేణుల్ లభించున్ గడున్
ఖ్యాతిన్ గాంతురు వారె వారిరిపు లాహా! యెట్లు జీవింత్రు? దు
ర్నీతిన్ సీతను లోకమాత నపహారింపంగ నెట్లోపితో? 6

చ. క్షణమున నాశనంబగును సంసృతి; అందు శరీర మింకనున్
క్షణికము; పంచభూతములసంగతి నిర్వదినాల్గు తత్త్వముల్
గణముగఁ జేర నేర్పడియెఁ; గల్మషసంయుత మస్థిమాంసముల్
మిణికెఁడునేహ్యపున్ స్థలము మిక్కిలిదూష్యము సర్వవేళలన్. 7

గీ. పరమదుర్వాసనకుఁ జోటు, దురితములకు ఆటపట్టు, అహంకృతి కాలయంబు
జడము నగుకాయమందు ఆజడముకాని నీకు మమకార మేల ? యత్నించి చూడు. 8

శా. ఏ దేహార్థము బ్రహ్మహత్య మొదలౌ నెన్నోకృతుల్ చేసినా
వే దేహంబు సమస్తభోగములఁ దా నింపారఁగాఁ బొందునో
ఏ దేహంబును సర్వకాలముల నీ వెంతెంతగా నింపితో
ఆ దేహంబు నశించు నిచ్చటనె, నీ వద్దానికై యేడ్తువే ? 9

గీ. కనఁగ సుఖదుఃఖవితతికిఁ గారణములు పుణ్యపాపము, లవియె జీవునికి వెనుక
వచ్చుచుండును ఆపుణ్యపాపము, లవి దేహసుఖదుఃఖవితతిని దెచ్చుచుండు. 10

గీ. నేను దేహము ననుబుద్ధి నిల్చువఱకు, నేను చేయుదు ననుబుద్ధి నిల్చువఱకు
అవశుఁడయి భ్రమ గాంచి యహంకరించు, అంతవఱకును జనిమృతి అగుచునుండు. 11

గీ. అందువలన దేహాదులయందుఁ గలుగునట్టి యభిమానమున్ వీడుమయ్య, నీవు.
ఆత్మ శుద్ధము నిర్మల మవ్యయమును అచల మద్వయ మమృతము నచ్యుతంబు. 12

గీ. తన్నె యజ్ఞానవశమునఁ దా నెఱుఁగక, బంధనముఁ గాంచి మోహాలంపటతఁ గాంచుఁ
బరగ నీవును శుద్ధభావంబుఁ గాంచి, ఆత్మ నెఱిఁగి స్మరింపుమీ అహరహంబు. 13

గీ. పుత్త్రదారగృహాదులఁ బొందక తమి, విరతి నందుము నీ వెల్ల వేళలందు
నరకదాయక భోగముల్ పరగుచుండుఁ, గుక్కలకుఁ బందులకుఁ బోలెఁ గుమతులకును.

ఉ. సారవివేకసంపదకుఁ జాలిన దేహముఁ దాల్చి, యందు నిం
పారెడు బ్రాహ్మణత్వమును భవ్యముగాఁ గని, యంతెకాక యీ
భారతకర్మభూమిపయిఁ బ్రాభవమంది సుదుర్లభంబుగన్
సూరుఁడు దేహ మాత్మ యని చొచ్చునె భోగము లంద మూర్ఖుఁడై ? 15

గీ. బ్రాహ్మణుండవు పౌలస్త్యవరసుతుఁడవు, భవ్యజన్మంబుఁ గాంచినవాఁడవౌట
అజ్ఞునింబోలి భోగంబు లందుఁ దగిలి, వ్యర్థపుచ్చకు నీజన్మ మసురవర్య. 16

గీ. ఇంకనైనను సంగంబు లెల్ల వీడి, భక్తిభావము వహియించి భవ్యముగను
రామచంద్రుఁ బరాత్పరు రక్తిఁ గొల్చి, ఆశ్రయింపుము రామపాదాంబుజములు. 17

గీ. సీత నర్పించి రాముని చెంతఁ జేరి, అతని పాదానుచరుఁడవై అలరుమయ్య !
సర్వపాపంబులున్ వినష్టములు గాఁగ, విష్ణులోకంబుఁ గనుము వివేకబుద్ధి. 18

గీ: అట్లు చేయంగఁ దలపూనవైతి వేని, వచ్చుచున్ బోవుచున్ బుచ్చువాఁడ వాడు
వినుము నామాట విని క్షేమమును గడింపు, నీహితంబును గోరి విన్నించినాఁడ. 19

మ. వరభక్తవ్రజసంగతిం గనుము శశ్వద్భక్తవాత్సల్యుఁ డా
హరియే దిక్కని ఆశ్రయింపుము సునైల్యాభున్ రఘుశ్రేష్ఠు సుం
దరసీతాసముపేతు హస్తధృతకోదండున్ మహాబాహు సో
దరసుగ్రీవ విభీషణార్చితపదున్ ధన్యాత్మ సేవింపుమీ !'' 20

[నా "నిర్వచనాధ్యాత్మరామాయణము" నుండి]

---

# హనుమంతుఁడు

డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు

గోష్పదీకృతవారాశిం
మశకీకృతరాక్షసం
రామాయణమహామాలా
రత్నంవన్దే ఽనిలాత్మజమ్

అంజనానందనంవీరం
జానకీ శోకనాశనం
కపీశమక్షహంతారం
వందేలంకా భయంకరమ్

ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయవిగ్రహం
పారిజాత తరుమూలవాసినం
మారుతిం నమత రాక్షసాంతకమ్.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

ఇవి సాధారణముగా భక్తులెల్లరును పఠించు చుండు హనుమత్స్తోత్రశ్లోకములు. ఇందలి విశేషణములను ప్రపంచించి చూచినచో హనుమంతుని జననరూపగుణశీలవీర్యపరాక్రమ మహత్త్వాదులన్నియు సమగ్రముగాఁ దెలియవచ్చును. పాత్రపోషణకౌశలమున కృతహస్తుఁడైన ఆదికవి రామాయణమహాకావ్యమున నాతని గుణశీలములను చక్కగా తీర్చి దిద్దినాఁడు. ఒక్క వానరవీరులలోనే కాక రామాయణవర్ణిత సర్వపాత్రలందు నాతఁడు ప్రత్యేకప్రకాశముతోఁ గనవచ్చును. రామాయణ మహామాలారత్నమని యాతనికి వాడఁబడిన విశేషణ మెంతయు నన్వర్థము.

ఉత్తరరామాయణమున హనుమంతుని జననవృత్తాంతము విశదముగ వర్ణింపఁబడినది. అతఁడు రుద్రాంశమున పార్వతీదేవి కుక్షిని గొంతకాలము వృద్ధినొంది, పిదప పావకుని యందుఁ గొన్నాళ్లు వర్తించి, తరువాత పవనగర్భాంతఃస్థుఁడై భాసిల్లి, యనంతరము పవనుని వరముచే కేసరి కళత్రమైన అంజనకుఁ బుత్త్రుఁడుగా జనించెను. అతఁడు జన్మింపఁగనే తల్లి ఫలములు తెచ్చుట కడవికరుగ నతఁ డుదయించు సూర్యునిగాంచి పండని భ్రమించి

యాతనిపై కేగసెను. నాఁడు పర్వమాటచే నాసమయమున రాహువు సూర్యుని బట్టుటకై వచ్చెను. హనుమంతుఁ డంత సూర్యగ్రహణము మాని నల్లనిపండు లభించెనని సంతసించుచు నాతని బట్టుకొనెను. రాహువు భీతుఁడై పరుగెత్తుకొనిపోయి యీ విషయమంతయు నింద్రుని కెఱింగించెను. ఇంద్రుఁడు కుపితుఁడై యైరావతము నెక్కి యచ్చటికరుదెంచి తన యేనుఁగును హనుమంతునిపైఁ గవియించెను. హనుమంతుఁ డైరావతమును గాంచి తెల్లని పండని భ్రమించి దానిపై కేగిరెను. ఇంద్రుఁ డంత నాతనిపై వజ్రాయుధము విసరెను. అది వామహనువును నొప్పించుటచే హనుమంతుఁడు మూర్ఛాక్రాంతుఁడై పూర్వాద్రిపైఁ బడెను. అట్లు పడిన కుమారునిగాంచి పవనుఁ డాగ్రహావిష్టుఁడై జగములెల్లను నిండిన యాత్మమూర్తి నుపసంహరించి, పుత్రునితోఁగూడ నొకశైల గుహాకుహరముచొచ్చెను. వాయువు స్తంభించిన కారణమున లోకులెల్లరును దల్లడిల్లిరి. అంతఁ దాపసులు బ్రహ్మకడకేగి రక్షింపవేడుకొనిరి. బ్రహ్మ జరిగినదంతయు నెఱింగి ఋషులతోఁ గూడి వాయువున్న శైలగుహాకడ కరిగెను. వాయువంతఁ గొడుకును గొనివచ్చి బ్రహ్మకు మ్రొక్కెను. బ్రహ్మ దయాళువై మూర్ఛితుఁడైన హనుమంతుని మేను నిమిరెను. హనుమంతుని మూర్ఛ తొలంగెను. వాయువు సంతుష్టుఁడై మరల వీవఁదొడంగెను. లోకములు యథాపూర్వముగ నుత్సాహమునఁ జెలంగెను. పిమ్మట బ్రహ్మయు దేవతలును హనుమంతునికి వరము లొసంగి తమ తమ నెలవుల కరిగిరి. వాయువు హనుమంతుని గొనివచ్చి అంజనాదేవి కొసంగెను. తరువాత హనుమంతుఁడు బాల్యచాపల్యమున నంతిక మున్యాశ్రమములుచొచ్చి మునుల వల్కలాజినములు ప్రచ్చి వందఱలాడఁగా వారు కోపించి యతఁ డాత్మశక్తి యెఱుంగకుండుఁ గాక యని శపించిరి. అంత హనుమంతుఁడు పశ్చాత్తప్తుఁడై యా తాపసులకు సేవ కావించుచుఁ గొంతకాలముండి పిదప సుగ్రీవుని జేరి యాతనికి మంత్రి యయ్యెను.

బ్రహ్మాదులు వరము లిచ్చు సందర్భమున నినుఁడు "నా తేజమున శతాంశమును విద్యలను నొసంగెద" నని పల్కియుండుటచే హనుమంతుఁ డది స్మరించి, శ్రుతు లధ్యయనము చేయు నుద్దేశముతో నద్భుతమైన వేగమున సూర్యుని కడకేగెను. సూర్యుఁడు సంతోషించి "వత్సా, నిత్యసంచార మొనరించు నాకడ నీవెట్లు విద్యాభ్యాసము కావింతువు? చండభానుఁడైన నాముం దెవ్వరును నిల్వఁజాలరు కదా! అదియునుగాక వేగముగాఁ బోవుచుఁ జదువు సాగించిన మనస్సున కేకాగ్రతగలుగుట దుర్లభ" మని పల్క హనుమంతుఁ డుదయాస్తాచలములఁ బాదయుగళమునిల్పి తొల్లి త్రివిక్రమునివలె నూర్ధ్వకర్పరమెల్ల నావరించి కనఁబడెను. సూర్యుఁ డద్భుతాక్రాంతచిత్తుఁ డయ్యెను. హనుమంతుఁడు నిజరూపము ధరించి సూర్యుని యరదమునకెదురై యాకాశమార్గమున వేగముతోఁ బోవుచు వేదశాస్త్రాదు లన్నియు నభ్యసించెను. అతని విద్యాజ్ఞానగ్రహణకళావిశేషములకు సూర్యుఁ డెంతయు సంతోషించెను.

పై వృత్తాంతములవలన హనుమంతుని వేగ పరాక్రమ విజ్ఞాన మహత్త్వములు తేటతెల్లము లగుచున్నవి. శతయోజనవిస్తీర్ణమైన సముద్రము దాఁటుటెట్లని వానరులందఱును విషణ్ణులై యుండినప్పుడు జాంబవంతుఁడు హనుమంతుని బుద్ధిబలవిక్రమాదులను ప్రశం

సించెను. వాయు వంజనతో "వీర్యవాన్ బుద్ధి సంపన్నః పుత్రస్తవభవిష్యతి, మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః, లంఘనే ప్లవనే చైవ భవిష్యతి హి మత్సమః" అని చెప్పిన ట్లాతఁడు వివరించెను. సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకై కపులను బంపుచు హనుమంతునిగూర్చి "గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవంచ మహాకపే, పితుస్తే సదృశం వీర, మారుతస్య మహౌజసః, త్వయ్యేవహనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమం దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయపండిత" అని పల్కియుండెను. వాల్మీకి యాతనికి మహాప్రాజ్ఞః, మహానుభావః, సర్వశాస్త్రవిదాం వరః మున్నగు విశేషణములు వాడియుండెను. అతఁడు సర్వసద్గుణసంపూర్ణుఁడు. ఉచితానుచిత పరిజ్ఞానమున నాతని కాతఁడే సాటి. దానితోపాటాతనియందు బుద్ధిసంపద, ఔదార్యము, మితహితసత్యవాక్చాతుర్యము, వినయము మున్నగు నుత్తమగుణము లెన్నో పుంజీకృతములై యున్నవి. ఉదాత్తగుణము లిన్నియొక్కచోఁ గూడియుండుట చాల అరుదుగాఁ గనిపించును. అందుచేతనే సీతాన్వేషణమునకై వానరులరుగునప్పుడు రాముఁడు స్వ నామాంకితమైన యంగుళీయకమును హనుమంతునికే యొసంగెను.

హనుమంతుని వాక్చాతుర్యమద్వితీయమైనది. ఈ వాక్చాతుర్యము సాహాయ్యముననే అతఁడు రామసుగ్రీవులకు సఖ్యము కలిగింపఁ జాలెను. ప్రప్రథమమున హనుమంతుఁడు తనతోఁ బల్కిన పల్కులు విని రాముఁ డాశ్చర్యచకితుఁడై లక్ష్మణునితో "నానృగ్వేద వినీతస్య నాయజుర్వేదధారిణః నా సామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుమ్, నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధాశ్రుతం బహువ్యాహరతానేన నకించి దపశబ్దితమ్, అవిస్తరమసందిగ్ధమవిలంబితమద్రుతమ్ ఉరస్థం కంఠగం వాక్యం వర్తతేమధ్యమే స్వరే, సంస్కారక్రమసంపన్నా మద్రుతామవిలంబితా ముచ్చారయతికల్యాణీం వాచం హృదయ హారిణీమ్ (కి. ౩)" అని ప్రశంసాపూర్వకముగాఁ బల్కియుండెను. అశోకవనమున రాక్షసీ మధ్యగతయై కలఁతనందుచున్న సీత నాశ్వాసించుట యెట్లా యని హనుమంతుఁడు బహువిధముల నాలోచించెను. "యదివాచం ప్రదాస్యామి ద్విజాతి రివసంస్కృతామ్, రావణం మన్యమానా మాం సీతా భీతాభవిష్యతి" (సుం. 30–18) అని తలంచుట యాతని యసాధారణవిచక్షణతను సూచించుచున్నది. అతఁడు శ్రీరాముని గుణగణములను కీర్తించి, అశోకవృక్షమునుండి దిగి, వినీత వేషుఁడును బద్ధాంజలియునై భయోద్విగ్నయై యున్న సీతతో పల్కిన మధురవాక్యము లాతని వాక్చాతుర్యమును వేయివిధములఁ జాటుచున్నవి. సీతకు విశ్వాసము కలిగించుటకై యాతఁ డవలంబించినవిధానము ప్రశంసనీయమైనది. రావణుని కొలువున నాతఁడు ప్రకటించిన వాక్చాతుర్య మింతంతనరానిది. "త్వయావిజ్ఞాతపూర్వశ్చ వాలీవానరపుంగవః స తేననిహతస్సంఖ్యే శరేణైకేనవానరః" అను శ్లోకమున నాతఁడు రాముని యప్రతిమాన పరాక్రమమును వ్యంగ్యముగా సూచించెను. వాలిపరాక్రమమును రావణుఁడు లెస్సగా నెఱుంగును. అతఁ డతనిని తోఁకతోఁ జుట్టి సప్తసముద్రములలో ముంచియుండెను. అట్టి వానిని రాముఁ డొక్కబాణముతో సంహరించెనని చెప్పుటయందలి వ్యంగ్యమును గ్రహించి రావణుఁ డాతని రాజనీతికౌశలమునకును వాక్చాతుర్యమునకును ఆశ్చర్యచకితుఁ

డయ్యెను. వాక్యజ్ఞుఁడు, వాక్యవిశారదుఁడు, వాగ్మి, మధురభాషి మున్నగు విశేషణము లాతని కెంతయుఁ దగియున్నవి.

హనుమంతుఁడు కార్యాచరణదక్షుఁడు. అసాధ్యకార్యములనుసైతమతఁ డవలీలగా నొనర్చెను. యుద్ధకాండారంభమున "కృతం హనుమతా కార్యం సుమహద్భువిదుర్లభమ్ మనసాపి యదన్యేన నశక్యం ధరణీతలే" (యు. 1-2) అని రాముఁ డతనిగూర్చి పల్కియుండెను. సాగరలంఘనము, లంకలో నొంటరిగాఁ బలుమంది రాక్షసులతోఁ బోరి విజయము గాంచుట, లంకాదహనము, సంజీవిపర్వతానయనము మున్నగు కార్యము లన్యులకసాధ్యములైనట్టివి. అతఁ డేకార్యము నొనరించినను బాగుగా విమర్శించి యుపాయముతో నొనరించును. "కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపిసాధయేత్ పూర్వకార్యావిరోధేన సకార్యం కర్తుమర్హతి" అని యాతఁడు పల్కుటవలన నేకక్రియచే బహుప్రయోజనములను సాధింపఁజాలుట కార్యాచరణసమర్థుని లక్షణమని యాతఁడు భావించినట్లు తెలియుచున్నది. అతఁడు బాగుగా నాలోచించియే లంకలోఁ బరాక్రమప్రదర్శనము కావించినట్లు "నసామరక్షస్సుగుణాయకల్పతే. నదానమర్థోపచితేషుయుజ్యతే, నభేదసాధ్యాబలదర్పితాజనాః, పరాక్రమస్త్వేవమ మేహరోచతే" యను శ్లోకమువలనఁ దెలియుచున్నది. ఎంత దుష్కర కార్యమునైనను అతఁ డుపాయముతోడను, ధర్మబుద్ధితోడను ఒనరించునని సుగ్రీవుఁడు పలుసార్లు చెప్పియున్నాఁడు.

హనుమంతుని సమయస్ఫూర్తి చాల గొప్పది. అతఁడు ప్రదోషకాలమున లంకానగరమును బ్రవేశించెను. నిజరూపముతో లంకఁజొచ్చుట యుచితముకాదని యాతఁడు పృషదంశకమాత్రశరీరుఁడై యన్వేషణమునకు బయలుదేఱెను. సురసాసింహికలు విఘ్నమాచరించినప్పుడుకూడ నుపాయమున సంక్షిప్తశరీరుఁడై విజయము పొందఁజాలెను. అశోకవనమున నతఁడు రాక్షసస్త్రీలు నిద్రించినపిమ్మటగాని సీతతో సంభాషించుటకుఁ గడంగఁడయ్యెను. అప్పుడైనను వెంటనే యామె ముందు నిలఁబడినచో నామె యనుమానించునని దశరథరామచంద్రులగుణసంకీర్తనము కావించి యామెకుఁ గొంత విశ్వాసము కల్పించి యామెతో మాటాడుటకు మొదలు పెట్టెను. ఈవిధముగా నతఁ డేకార్యము నెట్లాచరించినను ఉపాయశాలిత్వమును సమయస్ఫూర్తిని బ్రదర్శించును.

హనుమంతుని బలపరాక్రమ జవసత్త్వములు నాన్యతోదర్శనీయములు. అతఁడు మనోజవుఁడు. మారుతతుల్యవేగుఁడు. వాల్మీకి యాతని వేగమును సాధారణముగా మనోమరుద్గరుడుల వేగముతోఁ బోల్చుచుండును. అన్యదుష్కరమైన సముద్రలంఘన మాతని యపారజవసత్త్వములకుఁ దార్కాణము. సురసాసింహికలను నిర్జించుట, లంకిణి నోడించుట, లంకలో రాక్షసులనే కాక అక్షయకుమారునిగూడ సంహరించుట, యుద్ధమునఁ బలుతెఱఁగుల విజృంభించుట యతని యద్వితీయ పరాక్రమమునకు నిదర్శనములు. ఉత్తరకాండమున నగస్త్యుఁ డాతఁడు వాలిరావణుల కంటెఁ గూడ బలవత్తరుఁడనియుఁ బరాక్రమమందు వలెనే బుద్ధికౌశలమునందును అప్రతిమానుఁడనియు వర్ణించియుండెను. రాక్షసులు కొలువునకుఁ గొనివచ్చిన హనుమంతునిగాంచి రావణుఁడు "కిమేష భగవాన్నందీ భవేత్సాక్షాదిహాగతః, యేనశప్తోఽస్మి కైలాసేమయా సంచాలితేపురా" అని శంకించెను. అతని తేజో

రూపాతిశయము లట్టివి. అతఁడు సీత నోదార్చుచు "త్వాంతు పృష్ఠ గతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్, శక్తిరస్తిహి మే వోఢుం లంకామపి స రావణామ్" అని చెప్పుటలో నతిశయోక్తి యిసుమంతయు లేదు. కాని సీత సామాన్య వానరాకారముతో నున్న యాతని గాంచి "కథం వాల్ప శరీరస్త్వం మా మితో నేతు మిచ్ఛసి" యని యనుమానించుచుఁ బలుక నాతని కా పలుకువలన నూతనమైన పరాభవము కలిగిన ట్లనిపించెను. అంత నాతఁడు సీతకుఁ బ్రత్యయము కలిగించుటకై పర్వతసంకాశమును భీమమునైన రూపమును బ్రదర్శించెను. అప్పుడు సీత యచ్చెరువంది "తవసత్త్వం బలం చైవ విజానామి మహాకపే వాయోరివ గతించాపి తేజశ్చాగ్నే రివాద్భుతమ్" అని యాతనిఁ బ్రశంసించెను.

హనుమంతుఁడు మహా వినయసంపన్నుఁడు, అవికత్థనుఁడు. ఆరంభమున రామలక్ష్మణుల తోడను అశోకవనమున జానకితోడను ఆతఁడు పల్కిన పల్కులు వినయసంపదకుఁ బట్టుగొమ్మలు. అతఁడు సీతతో నితర వానరవీరులు తనకంటె బలసంపన్నులనియు, నప్రకృష్టులే సాధారణముగా దూతభావమునఁ బంపఁబడుదురనియుఁ జెప్పియుండెను. ఇది యాతని వినయమును ఆత్మప్రశంసావైముఖ్యమును సూచించుచున్నది. శత్రువులందైనను గుణము లున్నచో నాతఁడు హృదయపూర్వకముగాఁ బ్రశంసించును. రావణుని వీక్షింపఁగనే యాతఁడు "అహోరూప మహోధైర్య మహోసత్త్వ మహోద్యుతిః, అహోరాక్షస రాజస్య సర్వలక్షణ యుక్తతా" అని యాతని రూపగుణ విశేషముల నుగ్గడించెను.

హనుమంతుఁడు పరేంగితజ్ఞుఁడు. ఆకార దర్శనమాత్రమున నాంతర మహత్త్వమును గుర్తింపఁజాలిన బుద్ధిశాలి. అశోకవనమున సీతను జూడఁగనే యాతఁడు ప్రహృష్టుఁడై రాముని స్మరించి, "త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాప్నుయా త్కలామ్" అని భావించెను. రావణాంతఃపురమున సీతకై వెదకుచు నాతఁడు "పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్, ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి" అని తనచర్య ధర్మవిరుద్ధమేమో యని భయమందెను. కాని స్త్రీలను స్త్రీలలోనే వెదకవలయును గాని మృగాదులందు వెదకరాదు గదా యని సరిపెట్టుకొనెను. రాత్రివేళ వివిధాకృతులతో వివిధస్థితులలో నున్న స్త్రీలను జూచినను అతని మనస్సున నించుకంతయు వికృతి జనింపకుండుట యాతని జితేంద్రియతను ధర్మపరాయణత్వమును సూచించుచున్నది. అతఁడు సీతను దానే రామునికడకుఁ గొనిపోదునని పలుక సీత రాముఁడు రావణుని సంహరించి తన్నుఁ గొనిపోవుట యాతని యుదాత్తత కనుగుణముగా నుండునని తన యభిప్రాయమును సూచించెను. అప్పుడాతఁడామె యాభిజాత్యాభిమానములను గ్రహించి "యుక్తరూపం త్వయాదేవి భాషితం శుభదర్శనే, సదృశం స్త్రీ స్వభావస్య సాధ్వీనాం వినయస్యచ" అని యామెను బ్రశంసించి తన యౌచిత్య పరిజ్ఞానమును బ్రకటించెను. "జితేంద్రియః-బుద్ధిమతాం వరిష్ఠః" అను విశేషణము లాతనియెడ మిక్కిలి సార్థకములు.

హనుమంతుని స్వామిభక్తి యచంచలమైనది. తాను బుద్ధిమద్వరిష్ఠుఁడైనను, బలసంపన్నుఁడైనను ఆతఁ డహంకారమును వహింపక సుగ్రీవునియెడను అంగదునియెడను అపారమైనభక్తి గౌరవములు ప్రదర్శించుచుండెను. "సీతా మదృష్ట్వా హ్యనవాప్య పౌరుషం, విహృత్యకాలం సహ వానరైశ్చిరం, న మేస్తి

సుగ్రీవ సమీపగా గతిః, సుతీక్ష్ణ దండో బల
వాంశ్చ వానరః'' అని యాతఁడు పల్కుట
సుగ్రీవుని యెడ నాతనికిఁ గల భయభక్తులను
సూచించుచున్నది. ఆరంభించిన కార్యమును సమ
గ్రముగను సఫలముగను నిర్వహించుటయం
దాతనికిఁ గల దీక్ష యఖండమైనది. ఎంత వెద
కినను సీతజాడ కానరానప్పుడు తొలుత
నాతఁడు నిర్విణ్ణుడైనను, తరువాత ''జీవన్
భద్రాణి పశ్యతి'' అను నార్యోక్తిని స్మరించి
ధైర్యము వహించి మరల నామెను వెదక మొద
లిడెను. ''యావత్సీతాంహి పశ్యామి రామ
పత్నీం యశస్వినీం తావదేతాం పురీం లంకాం
విచినోమి పునః పునః'' అనునది యాతని నిశ్చ
యము. సీతను జూడకుండఁ దాను లంకను
విడిచి యేగినచో నది పురుషార్థమునకు భంగ
మాపాదించుననియు, నప్పుడు సముద్ర లంఘన
లంకాప్రవేశ రాక్షసదర్శనాదులు వ్యర్థము లగు
ననియు నాతఁడు భావించెను.

శ్రీరామునియెడ హనుమంతునికిఁగల భక్తి
యపరిమితమైనది. ఆ భక్తియే యాతనిచే
సముద్రలంఘన లంకాప్రవేశాది సాహసకార్య
ములను జేయించినది. ''వవృధే రామ
వృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు'' అను వాక్య
మాతని రామపరాధీన మనస్కతను ప్రక
టించుచున్నది. ''జయత్యతిబలో రామో లక్ష్మ
ణశ్చ మహాయశః'' ఇత్యాది వాక్యము నుచ్చ
రించుచునే యాతఁడు లంకలో నన్య దుష్క
రములైన కార్యము లొనరించెను. ''యథా
రాఘవ నిర్ముక్త శ్శరః శ్వసనవిక్రమః గచ్ఛే
త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణ పాలితామ్,
నూనం రామ ప్రభావేన వైదేహ్యా స్సుకృతే
నచ యన్మాం దహన కర్మాయం నాదహద్వ్య
వాహనః'' ఇత్యాది శ్లోకము లాతని నిరహం
కారతను సీతారామభక్తిని సూచించుచున్నవి.

విభీషణుఁడు తన యైదుగురు సచివులతో
శరణార్థియై వచ్చుచున్నప్పుడు రాముఁడు
కర్తవ్యమునుగూర్చి సుగ్రీవజాంబవల్లక్ష్మణాదుల
నందఱిని ప్రశ్నించెను. వారిలో నెవ్వరును
విభీషణునికి శరణ మొసంగుటకు సమ్మతింపరైరి.
హనుమంతుఁడుమాత్ర మాతఁడు రావణుని
విడిచియే వచ్చుచుండెననియుఁ, దాను పట్టు
పడినప్పుడు దూతవధనీత్యోచితము కాదని రావ
ణుని వారించియుండుటచే నతఁడు జన్మచే
రాక్షసుఁడైనను గుణముచే రాక్షసుఁడు
కాఁడనియు, నతనిని దయతో గ్రహించుటయే
యుక్తమనియుఁ దెల్పి రాముని మన్ననకు
పాత్రుఁడయ్యెను. ఇది యాతని బుద్ధిమత్తను,
ఇంగితజ్ఞానమును, కార్యాకార్యనిర్ణయసామ
ర్థ్యమును, ఔదార్యసంపదను సూచించు
చున్నది.

ఉత్తమములైన మానవతా లక్షణము
లన్నియు హనుమంతునియందు సమగ్రముగాఁ
గానిపించును. సీత దైన్యమును జూచి యాతని
మనస్సు ద్రవించెను. లంకాదహనానంతరము
సీతకేమైన హాని జరిగినదేమోయని యాతఁడు
చింతావ్యగ్రమానసుఁడై తన యవివేకమును
వేయివిధముల నిందించుకొనెను. రావణుని
కుమారుఁడైన అక్షుఁడు తనతోఁ బోరాడుటకు
వచ్చినప్పు డాతఁ డాతనియెడ ద్వేషమునకు
బదులు జాలి ప్రదర్శించెను. ఆత్మరక్షణార్థ
మాతఁ డతనిని సంహరింపవలసివచ్చెను గాని
లేనిచో మందలించి విడిచిపుచ్చెడివాఁడే.
మైనాకు నాతఁడు మొదట విఘ్నకారియని
శంకించినను దరువాత గౌరవపూర్వకముగా
నాదరించెను. సీతాక్షేమవార్త తెల్పి శ్రీరా
ముని ప్రాణములను, శ్రీరాముని సేనాసమేత
ముగఁ గొనివచ్చెదనని యూరార్చి సీత ప్రాణ
ములను నిల్పిన మహనీయుఁడతఁడే. ఆతని

యుత్తమగుణములకు మెచ్చియే రాముఁడు చిరంజీవిగా నాశీర్వదించుటయే కాక తన చరిత్రము లోకమున స్మరింపఁబడునంతవఱ కాతని కీర్తి నిర్మలమై ప్రకాశించునని యభినందించెను.

హనుమంతుఁడు కాంచనాద్రి కమనీయ విగ్రహుఁడు. అతిపాటలాననుఁడు. సూర్యసమతేజస్కుఁడు. పరమసుందరుఁడు. సుందరకాండమున కాపేరు కల్గుట కాతని సౌందర్యమును నొక కారణము.

వైరాగ్యమహిమకీ వడుగు నివాసంబు
  వినయంబునకు నీతఁ డునికిపట్టు
శమదమోన్నతులకీచతురుఁ డాధారంబు
  దాక్షిణ్యమునకు నీతడుండుచోటు
సౌశీల్యమునకీప్రశాంతశాలి బిడారు
  పరహితక్రియకీప్రసన్నుఁడిక్క
విక్రమస్ఫురణకీవీరవర్యుఁడు తావు
  గాంభీర్యగరిమకీఘనుఁడు ప్రాపు
బ్రహ్మవిద్యకు నిమ్మేటి పట్టుఁగొమ్మ
ఘనతపోధనమునకు నీయన నిధాన
మతులధైర్యంబునకు నీమహాత్ముఁడిమ్ము
రామ నీ భక్తికీపుణ్యరాశి నెలవు.

ఉ. రా. V 140

అని యుత్తరరామాయణమున కంకంటి పాపరాజగస్త్యునినోట హనుమంతుని గుణగణముల కక్షరరూప మొసంగినాఁడు.

# విశుద్ధభక్తాగ్రేసరుడు - విభీషణుడు

## శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కేశవతీర్థ స్వామివారు

విభీషణుడు విశుద్ధభక్తాగ్రేసరుడు. ప్రపత్తియోగనిష్ఠాగరిష్ఠుడు. ధర్మపరాయణుడు. రాక్షసకులములో బుట్టినను, రావణుని సహోదరుడైనను, దనగుణసంపదచేత రామానుగ్రహపాత్రుడైన ధన్యజన్ముడు. రామాయణమున విభీషణునకు గల స్థానము విశిష్టమైనది. త్రిజగద్గురువు నారదస్వామి, భక్తిసిద్ధాంతాచార్యవర్యులలో విభీషణుని నొకనిగా బేర్కొనినాడు. "విభీషణస్తు ధర్మాత్మా" అని ప్రస్తుతికెక్కిన మహాపురుషుడు విభీషణుడు.

కాని సూక్ష్మదృష్టి లేని పామరులుమాత్రము "విభీషణుడు భ్రాతృవిద్రోహి; అతడు తన యన్నను, పితృతుల్యుని, బాల్యమునుండి రక్షించినవానిని, ఆపత్సమయములో వదలిపోవచ్చునా? పోయినను, దనయన్నను సంహరింపనున్న శత్రువుకడకు బోవచ్చునా? రాజ్యతృష్ణయే యతని రామాశ్రయమునకు గారణము. సీతాదేవి నపహరించుటకు ముందు గూడ, రావణాసురుడు పరస్త్రీల నెందఱినో యపహరించి చెఱబెట్టెనుగదా! అప్పుడు విభీషణుడు ధర్మనిష్ఠుడే యయి, రావణుని త్యజింపవచ్చుగదా? అప్పుడు లేని యధర్మవైముఖ్య మిప్పు డెందుకు వచ్చినది? ఇంద్రజిత్కుంభకర్ణాదులతో బాటుగ నాతడు కూడ భ్రాతృభక్తి - రాజవిశ్వాసముల జూపుటయే ధర్మ"మని విభీషణుని విమర్శించి దూయబట్టుటకు వెనుకాడరు. ఇట్టి విమర్శలకు సమాధాన

మిందు సంగ్రహప్రాయముగా సర్వచింపబడు చున్నది :

విభీషణుడు పామరుడు కాడు; పండితుడు. బ్రహ్మవేత్త. బ్రహ్మదేవుని వరప్రసాదము చేత, తాతయైన విశ్రవసుని కృపావిశేషము చేత, విశేషజ్ఞానసంపన్నుడైనందున - సర్వవేదాంత వేద్యుడు, సర్వలోకేశ్వరుడు, సర్వలోకశర ణ్యుడు, ముక్తిప్రాప్యుడు. సాక్షాత్పరబ్రహ్మము నైన నారాయణుడే శ్రీరాముడుగా బృథ్వీ రంగమందు ధర్మసంరక్షణార్థ మవతరించి నాడని-విభీషణునకు విస్పష్టముగా దెలియును. సామాన్యధర్మమేదో, విశేషధర్మమేదో, యెట్టి సందర్భములో సామాన్యధర్మమును సంత్య జించి విశేషధర్మమునే సమాశ్రయింపవలసి యుండునో - వివేకశాలియైన విభీషణునకు విదితమే. లౌకికధర్మములన్నియు సామాన్య ధర్మములు. పరమాత్మసమాశ్రయణమో పరమధర్మము. సామాన్యధర్మములన్నియు బరమధర్మమును బొందుటకొఱకే. పరమ ధర్మమునకడ్డువచ్చినప్పుడు సామాన్యధర్మము లన్నియు సంత్యజింపదగినవే. లోకధర్మముల ప్రయోజనము లోకేశ్వరుని జేరుటయే. తన శరీరము, సమస్తబాంధవ్యములు, సమస్త ధర్మములు స్వస్వరూపమైన, సత్యబాంధవు డైన, సర్వాధిష్ఠానమూర్తియైన పరమేశ్వరుని బొందుటకే. పరమేశ్వరప్రాప్తితో నీలోకధర్మ ములకు బత్యేకస్థానము పోవును. సూర్యో దయమువఱకే దీపాలసాయము. సూర్యోదయ ముతో నవి వెలవెలపోవును. సర్వేశ్వరప్రాప్తి సాగరములో సర్వసామాన్య ధర్మనదీనదములు విలీనములై యదృశ్యము లగును. భ్రాతృసేవ భగవదుపాసనకు పరంపరాసాధనమైనందున నది సామాన్యధర్మము. పరంధాముడైన సాక్షాద్రాముని సేవించుట విశేషధర్మము. రెంటికిని సమన్వయము కుదిరినప్పుడు రెంటిని సేవింపవలసినదే. సమన్వయము కుదరనప్పుడు సామాన్యధర్మమును విడిచి, విశేషధర్మము ననుష్ఠింపవలె. అందుననే విభీషణుడింత కాలము రావణుని విడువకయే రాముని గూడ సేవింప వలెననెడి యాశయముతో, నన్నయైన రావ ణునకెంతో హితబోధ చేసినాడు. దుర్మ దాంధుడైన రావణుడు తనమేలును నిజముగా నాసించుచున్న విభీషణుని సత్యసౌభ్రాత్రమును గుర్తింపలేకపోయినాడు. ఇచ్ఛకములతో దనకు గీడు తెచ్చిపెట్టనున్న మిథ్యా బాంధవుల నాత్మీయులనుగా నెంచుకొనెను. విభీషణుని ధర్మప్రబోధములను నిర్లక్ష్యము చేసి, విభీషణుని నిండుపేరోలగములో నవమానించి, వెళ్ళిపో మ్మని మండిపడినాడు. అప్పుడు దన్నవమా నించినందులకు రోషపడి విభీషణుడు రావణుని బరిత్యజింపలేదు; కాని, ధర్మము నవమానించి నందుల కతడు బాహ్యబాంధవ్యములను మాత్రమే పరిత్యజించినాడు. సత్యనిష్ఠులకు ధర్మమే తండ్రి; ధర్మమే తల్లి; ధర్మమే యన్న; ధర్మమే సమస్తబాంధవులు; ధర్మమే సంపద; ధర్మమే సర్వస్వము. సత్యనిష్ఠుడు, ధర్మనిష్ఠుడు నైన విభీషణుడు ధర్మదేవతయు, సత్యబాంధ వుడునైన రాముని సమాశ్రయించుటద్వార మున విశేషధర్మము ననుష్ఠించి, సామాన్య ధర్మములనన్నిటిని సఫలీకృతముల చేయగలిగి నాడు. సముద్రములో స్నానము చేసినచో సమస్తనదులలో స్నానము చేసినట్లేగదా. పరమధర్మనిర్వహణములో సర్వధర్మసమాచర ణము జరిగినట్లే. విభీషణుడు పరదృష్టితో రాముని సమాశ్రయింపలేదు; నారాయణ దృష్టితో సమాశ్రయించినాడు. అందుచేత నతనిచేష్ట యధర్మము కాకపోగా పరమ ధర్మమే యగుచున్నది. గోపికలకు శ్రీకృష్ణుడు

పరమాత్మయనెడి జ్ఞానముండుటచేత గోపికలు జారిణులు కారు - అని నారదులవా రన్నట్లు, రాముడు పరంధాముడన్న జ్ఞానముతో సమాశ్రయించుటచేత, విభీషణుడు శత్రుపక్షమున జేరిన భ్రాతృద్రోహికాడు. విభీషణుడు రావణుని వదలినను వదలకపోయినను రావణసంహారము జరిగితీరును. రామశరణాగతిపొందినప్పుడే రావణునికి బ్రదుకుదెరువు. విభీషణుడు మిగిలినవారితో బాటిచ్చకము లాడియున్నట్లయిన రావణుని యహంకారరోగము మఱింత అభివృద్ధికాగల యవకాశ ముండును. విభీషణుడు వెళ్ళిపోవుటవలన, రావణుడు పశ్చాత్తాపపడి దారికి వచ్చిన రావచ్చును. ఇందుచేతగూడ విభీషణునిచర్య సమంజసమైనదే.

తనధర్మప్రబోధముల నిర్లక్ష్య మొనర్చి, రావణుడు తన్ను బహిష్కరించిన సమయములో విభీషణుడు రామసమాశ్రయణమునకు వెళ్లునపుడు పలికినమాట లివి :

జ్యేష్ఠో మాన్యః పితృసమో
నచ ధర్మపథే స్థితః,
ఇదం తు పరుషం వాక్యం
న క్షమా మ్యనృతం తవ.

తా. ఓ రాజా, పరుషోక్తు లాడిన నీవు నాకన్నవైనందున బదులుచెప్పుట నా కిష్టము లేదు. నీవు నోటికి వచ్చినట్లు నిందింపవచ్చు. అన్నవగునీవు పితృసమానుడవు, పూజ్యుడవు. అయినను నీవు ధర్మమార్గములో లేవు గనుక, నీవు చెప్పిన యనృతవాక్యములను గఠినోక్తులను సహించి యిక్కడ నే నుండలేను.

సునీతం హితకామేన
వాక్య ముక్తం దశానన,
న గృహ్ణం త్యకృతాత్మానః
కాలస్య వశమాగతాః.

తా. రావణా, నీహితమెంచి చక్కని నీతివాక్యములు నీకు జెప్పితిని. కాలవశులైన యాత్మజ్ఞానశూన్యు లట్టిమాటలు గ్రహింపజాలరు.

సులభాః పురుషా రాజన్,
సతతం ప్రియవాదినః
అప్రియస్య తు పథ్యస్య
వక్తా శ్రోతా చ దుర్లభః.

తా. రాజా, సర్వదా ఱేని చిత్తానుసారము ప్రియములైనమాటలు చెప్పువా రెందఱో యుందురు. విననప్పుడుమాత్ర మప్రియమై, యచిరకాలముననే హితము కలిగించు మాటలను జెప్పెడివాడుగాని, వానిని వినెడువాడుగాని లభించుట కష్టాతికష్టము.

బద్ధం కాలస్య పాశేన
సర్వభూతాపహారిణా,
న నశ్యంత ముపేక్షేయం
ప్రదీప్తం శరణం యథా.

తా. కాలిపోవుచున్న కొంపను చూచుచు మిన్నకుండుటకు బుద్ధిపుట్టని మాదిరి, సర్వభూతాపహారక కాలపాశముచే గట్టబడి నశించిపోవుచున్న నిన్ను చూచుచు మిన్నకుండుటకు నాకు మనస్సు రాకున్నది.

దీప్తపావకసంకాశైః
శితైః కాంచనభూషణైః
న త్వా మిచ్ఛా మ్యహం ద్రష్టుం
రామేణ నిహతం శరైః.

తా. దీప్తాగ్నిసంకాశములైన, పదునైన, బంగారుకట్లుగలబాణములతో రాముడు నిన్ను సంహరించునప్పుడు నిన్ను జూచుచుండుట నా కిష్టము లేదు.

శూరాశ్చ బలవంతశ్చ
కృతాస్త్రాశ్చ రణాజిరే,
కాలాభిపన్నా స్సీదంతి
యథా వాలుక సేతవః.

తా. శూరులైనను, బలవంతులైనను, సర్వాస్త్రవిదులైనను, గాలవశులై యిసుకతో నిర్మింపబడిన యడ్డుకట్టలవలె నాశమగు చున్నారు.

త న్మర్షయతు య చ్చోక్తం
గురుత్వా ద్ధిత మిచ్ఛతా,
ఆత్మానం సర్వథా రక్ష
పురీం చేమాం సరాక్షసా

తా. నీవు నా కన్నవయి యున్నందున నీహితముగోరి నేనీమాటలు చెప్పితిని. తప్పయినచో క్షమింపుము. నిన్ను, రాక్షసాశ్రయమైన యీలంకాపురిని, సర్వవిధముల రక్షించుకొనుము.

స్వస్తి తేఽస్తు గమిష్యామి
సుఖీ భవ మయా వినా,
నూనం న తే రావణ, కశ్చి దస్తి
రక్షోనికాయేషు సుహృ త్సఖా వా,
హితోపదేశస్య సమంత్రవక్తా
యో వారయే త్వాం
స్వయమేవ పాపా

తా. నీకు క్షేమము కలుగుగాక! సెలవు. నన్ను విడిచి సుఖపడుము. (ఓ రావణా, రాక్షసకోటిలో నీకు మంచియాలోచన చెప్పుటకును, హితోపదేశము చేయుటకును, పాపాచరణమునుండి నిన్ను వారించుటకును నిజముగా నీమేలు గోరు స్నేహితుడుగాని సామాన్య స్నేహితుడుగాని యొక్కడును గానరాడు.)

నివార్యమాణస్య మయా హితైషిణా
న రోచతే తే వచనం నిశాచర,
పరీతకాలా హి గతాయుషో నరా
హితం న గృహ్ణంతి సుహృద్భిరీరితమ్.

తా. నిశాచరా, నీహితముగోరు నేను పాపకార్యమునకు దలపడవలదని యెంతగ నడ్డగించినను నీకు రుచించుటలేదు. ఎందుకనిన, మృత్యువు సమీపించినప్పు డల్పాయువు లయినవారు, విహితుల హితప్రబోధములను గ్రహింపరుసుమా!

ఈవిధముగా జెప్పి విభీషణుడు తత్క్షణమే శ్రీరామసన్నిధికి నిర్గమించెను పై విభీషణుని పరిత్యాగవాక్కులలో నా మహాపురుషుని ధార్మికస్వరూపమును మనము విస్పష్టముగా సందర్శింపగలము

విభీషణుడు రాజ్యకాంక్షతో రామసమాశ్రయణము చేయలేదనుటకు రామశరణాగతి సందర్భమున "త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః" – అన్న విభీషణుని వాక్కులలో నాతని మహోన్నతవైరాగ్యము ద్యోతితమవుచున్నది. విభీషణుడు రామసన్నిధిలో—

పరిత్యక్తా మయా లంకా
మిత్రాణి చ ధనాని చ
భవద్గతం చ మే రాజ్యం
జీవితం చ సుఖాని చ.

నివాసభూమియైన లంకను, స్నేహితులను, సంపదలను – సమస్తప్రాప్యాంతరపదార్థములను బరిత్యజించితిని. రాజ్యాది సమస్తైశ్వర్యములు, ధారకపోషకభోగ్యములైన సర్వపదార్థములు, ఐహికాముష్మికసుఖములు – ఇవియెల్ల నీ కైంకర్యములో నిమిడియున్నవి. (నీకైంకర్యము తప్ప నితరసుఖములను నే నపేక్షించుటలేదు) అని శ్రీరామశరణాగతినే సర్వవిధపురుషార్థముగా విన్నవించుకొనినాడు. ఇట్టి సర్వభరన్యాసి

యైన విభీషణుడు రాజ్యాకాంక్షి యనుట మహా దోషము. అవివేకమూలము. శ్రీరాముడు సర్వభూతశరణ్యుడు గనుక, శ్రీరాముని శరణుజొచ్చి విభీషణుడు సకల ధర్మఫలమును సులభముగా బడయగలిగెను. విభీషణుని యుద్ధకర్మ రాజ్యతృష్ణారూపకమైనది కాదు. రామకైంకర్యరూపమైనది మాత్రమే. అందుకనియే యుత్తరకాండములో రాముని బలవంతముచేతనే లంకారాజ్యమును స్వీకరించినట్లు చెప్పబడినది. రామాజ్ఞాబద్ధమైన రాజ్యపాలనముకూడ విభీణునకు రామకైంకర్యమే. పరమధర్మతత్త్వమెఱిగిన లక్ష్మణుడు, తలిదండ్రులను, భార్యను, భోగములను విడిచి, నిరుపాధిక సర్వవిధబాంధవుడైన రామచంద్రుని సేవనే సర్వదా యాకాంక్షించెను. అదేరీతి విభీణుడుకూడ సోదరుని, సమస్తబాంధవులను బరిత్యజించి, సత్యబాంధవుడైన శ్రీరాముని సమాశ్రయించెను. ఇట్లు ''సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ'' – అన్న భగవదాదేశమును సమాచరింపగలిగిన మహాభాగ్యశాలి గనుకనే, ఆశ్రయింపదగినవస్తువు నాశ్రయింపగలుగు చున్నాడు గనుకనే, రావణుని బరిత్యజించుచున్నసమయములో ''అంతరిక్షగతః శ్రీమాన్'' అని విభీషణుని ''శ్రీమంతు''నిగా శ్రీ వాల్మీకి మహర్షి కీర్తించినాడు. మిథ్యావస్తుప్రపంచమును బరిత్యజించి సత్యపరమాత్మను సమాశ్రయింపగలవారేకదా యథార్థశ్రీమంతులు! అట్టి శ్రీమంతుని సమస్తసంపదలు తమయంతనవియే సమాశ్రయించితీరును. విభీషణుడు కోరకముందే, తనకై తానే శ్రీరామభగవానుడు–

> అహం హత్వా దశగ్రీవం
> సప్రహస్తం సబాంధవమ్
> రాజానం త్వాం కరిష్యామి
> సత్య మేత ద్బ్రవీమి తే.

ప్రహస్తునితో, సమస్తబాంధవులతో రావణుని సంహరించి నీకు లంకలో బట్టాభిషేకము చేయుదును. ఇది సత్యమని నీకు దెలుపుచున్నాను – అని యఖండప్రేమను వర్షించినాడు. విశుద్ధభక్తాగ్రేసరుడైన విభీషణునకు, లోకేశ్వరుడైన రాముడే వశుడైనప్పుడు, లోకసంపదలు వశమగుట యేమిలెక్క ?

''శ్రీరామచంద్రభగవానుని చరణపద్మస్పర్శభాగ్య మొందగలిగిన నాయీశిరస్సునిక నేస్థానములోగూడ వంచను'' అని శ్రీ విభీషణుని ప్రతిజ్ఞయట! ఆరామచరణశరణాగతిమహాభాగ్య మెవరికి లభింపగలదు ?

ఓం తత్సత్

# సీ త క థ

## శ్రీ కొమాండూరి కల్యాణరాంగారు

అనేకసంవత్సరములు పరపాలనలో నుండినను, ఆకలిని తీర్చుకొనలేని బీదజనులు కల్గినదియేమైనను, మన భారతదేశమునకు ఏ యితర దేశములకును లేని శక్తి మహిమలు గలవు. ఆ శక్తి మహిమలే సీత. ఈ పేరులో నున్న శక్తి ప్రభావములు ఎన్ని యుగముల కును తఱుగదు; కాలమునకును, చరిత్రకును అతీతములు. ''మంచికిని, పారిశుద్ధ్యమునకును, పవిత్రతకును మాఱుపేరు సీత'' అన్న స్వామి వివేకానందుని మాటలు ప్రతి భారతీయుని

హృదయములోను ప్రతిధ్వనించును. మన పురాణేతిహాసములు, మన వేదములు, కడకు మన సంస్కృతభాషయే అంతరించినను, భారతీయులు జీవించియున్నంతవఱకు సీతకథ విస్మరింపబడదు, అది భారతీయుల రక్తములో ఆ విధముగ కలిసిపోయి యున్నది.

సీత ఎప్పుడో యుండి గతించిన ఒక రాణి కాదు. సీత మరణింపలేదు; మరణింపదు, భూమిలో ప్రవేశించిన ఆమె అజరామర. ఆది మధ్యాంత రహితముగ సర్వకాలములందును గుబాళించు ఒక కోమల వినూత్న పుష్పము. బాధలుపడు ప్రతి భారతీయుడును సీత పడిన బాధలను చూచి తన బాధలను సహించుటకు వలయు ఓర్పు బలములను పొందును. కనుక అనంతములైన బాధలను సహించిన యామె యితరుల బాధలకు అంతమైనది. మానవలోకమునకు ఒక నూతన ధర్మప్రవృత్తిని జూపి మార్గదర్శకురాలైనది. జీవితములో ఓర్పు బలములకు గల ప్రాధాన్యమును చూపి వాని ఉత్కృష్టతను నిరూపించినది. వివేకానందుల వారన్నట్లు ఆమె పతివ్రత; శీలమునకును, పవిత్రతకును మాఱుపేరు. కనుకనే ఎవరుగాని ఒక అమ్మాయిని దీవింపవలసినప్పుడు "సీతవలె నుండువుగాక" యని యందురు. అంతకన్న గొప్ప ఆశీర్వాదము కలదా ?

సీత అయోనిజ, యజ్ఞభూమిసంభూత, పురాకృతపుణ్యమువలన జనకమహారాజునకు దొరకి, ఆయనసౌధమున రాజోపచారములతో పెరిగినది. శివధనుర్భంగ మొనర్చిన శ్రీరామునికి జనకమహారాజు నిర్ణయము ప్రకారము భార్యయైనది, "ఇది సీత, నాసుత, నీకు ఎల్లప్పుడు సహధర్మచారిణిగ నుండును. గైకొను" మని జనకునిచే శ్రీరామునికి కన్యాదానము చేయబడినది. సీతయు శ్రీరామునికి సర్వవిషయములలోను, ముఖ్యముగా ఆయన అవతరించిన ధర్మసంస్థాపన కార్యములో సహధర్మచారిణిగనే యుండినది. సీత లేకున్న శ్రీరాముని అవతారోద్దేశ్యము సఫలము కాదుగదా !

కైకేయి వరముల ప్రకారము వనములకు పయనమై చెప్పి పోవుటకు వచ్చిన రామచంద్రునితో రాజ్యము రాజభోగములు పోయిన విషయమును ఈషన్మాత్రమైన ప్రస్తావింపక, క్రొత్తదంపతులు క్రొత్తవాహనములో ఉల్లాసముగ షికారుకు పోవునట్లు వనమునకుబోవ సిద్ధపడినది. ఒక రాజసౌధమున పుట్టి మఱియొక రాజసౌధమున మెట్టిన సీత, వనమునకు తన్ను కొనిపోవ వెనుకాడిన శ్రీరామునితో తన కర్తవ్యము తనకు తెలియుననియు, భర్తే తనకు గతి యనియు, భర్తతో కాననమున నుండుట రాజసౌధములో నున్న దానికన్న ప్రియమనియు, అచంచలమైన భక్తి ప్రేమలతో వాదించి. రాముని నిరుత్తరునిజేసి, అతనిని అనుగమించినది.

"అడవులలో నీకన్న అడుగుముందుగ నేను నడచి బాటలో నుండు రాళ్ళను ముళ్ళను తొలగించి సుగమము చేయుదును" అని రాముని హెచ్చరించిన పల్కులలో నన్నది. ఆమె ఔన్నత్యము సహధర్మచరత్వము, ఒక విధముగా ఆమె చెప్పినట్లే జరిగినది. లోకకంటకుడైన రావణుని పెకలించుటకు ఆమెయే గదా ముందు లంకను చేరినది! రాముని బాటలో మరియొక ముల్లు, రావణునికన్న గట్టిది, తారసిల్లినది. అది ప్రజాభిప్రాయము; చాలకాలము రావణుని బందిగా నుండిన సీత శీలమును గూర్చిన శంక. దానిని కూడ తొలగించుటకు తానుగా తాను అగ్నిప్రవేశముచేసి తన పాతివ్రత్యమును పవిత్రతను చాటుకొనుటయే గాక ధర్మసంస్థాపనా కార్యమున శ్రీరామునికి

చేదోడు అయినది. నీవెనుక నీ నీడవలె నిన్నంటి యుండగలదు అనిన, జనకమహారాజు పల్కునకు అనుగుణముగా ఎన్ని కష్టములు వచ్చినను 'నీవు లేనిది స్వర్గమైనను నాకు వలదు'' అని శ్రీరాముని అంటిపెట్టుకొని యుండిన దానిని ఎవరెఱుగరు ?

సహధర్మిణియే యైనను ధర్మమును గుఱించి ఆమెకు వేఱు నిర్వచనము కలదు. దండకారణ్యమున విరాధుని వధానంతరము ఆమె రామునితో నిట్లు చెప్పెను. ''లోకమున మూడు మహాపాపము లున్నవి. మొదటిది, అసత్యము పల్కుట, రెండవది పరస్త్రీసంగమము, మూడవది పరులను హింసించుట, ఇందు మొదటి రెంటిని నీవు చేయవు. మూడవదానిని ఇప్పుడు విరాధుని చంపినందువలన, చేసిన వాడవైతివి. రాక్షసుల బాధనుండి ఋషులను కాపాడునట్లు మాటయిచ్చి ఆ మాటప్రకారము అస్త్రశస్త్రములతో ఈ అరణ్యమును ప్రవేశించినావు. ఇట్లుండుట నా కిష్టము లేదు. మనము ఋషుల వలెనే యుండవలయును, నీకు చెప్పగలదానను కాను. కాని నాఅభిప్రాయమును తెలుపుచున్నాను.'' సీత మాటలతో తాను ఏకీభవింపకున్నను, వానిలోని గొప్పతనమును శ్రీరాముడు గ్రహింపక పోలేదు. ధర్మము కత్తివలె దార్ఢ్యముచేసి తన్ను స్థాపించుకొన కూడదు. కుసుమమువలె అతిపేలవముగను ఉండకూడదు.... రెంటికి కలయికగా నుండవలెను. అట్టి కలయికయే సీతారాముల సంగమము. సీత లేని రాముడు నిర్వీర్యుడు. వారిరువురిని ముల్లోకములలోని ఏ శక్తియు వేఱుపఱుప లేవు. రావణుని సీతాపహరణము మాట మాత్రమే. రావణుడు అపహరించినది మిథ్యా సీత. ఆనిమిషమునుండి నిజమైన సీత రాముని హృదయాంతరాళమందు పాతుకొనిపోయినది.

శ్రీమద్రామాయణమును చదివినవారికిని, ఎఱిగినవారికిని, రావణునిచే సీతాపహరణము, సీతావిమోచనమునకై రామరావణయుద్ధము, రావణవధ మొదలగునవి సుపరిచితములైన విషయములే. కాని యిందు రావణుని గూర్చియును ఒక మంచిమాట చెప్పవలసి యున్నది. అతడు మనకు మహోపకారి. అతడు సీతను అపహరింపకున్న, సీత గొప్పతనము లోకమున కెట్లు ప్రకటితమైయుండును? భర్తను ప్రేమించి భర్తచే ప్రేమింపబడు ఒక సాధారణ గృహిణిగానే సీతమ్మ యుండిపోయెడిది. మనము ఇప్పుడెఱిగియున్న సీత మనకు లభించెడిది కాదు. ఒక సామాన్య గృహిణిగా నుండిపోవలసిన సీతను రావణుడు పుటమువైచి మేల్మి బంగారముగచేసి మనకు ప్రసాదించెను గదా!

నిర్మలమైన సీత గుణశీలములలో ఒక చిన్న మచ్చయున్నది. రామబాణ నిహతుడైన మాయలేడి రూపుడు మారీచుడు చనిపోవుచు రాముని కంఠము ననుకరించి 'హా! సీతా, హా లక్ష్మణా' యని యఱచెను. రామునికి ఏదో యాపద కల్గినదని స్త్రీ సహజమగు బేలతనముతో అనుకొనిన సీత లక్ష్మణుని సహాయముగ నుండ పొమ్మనెను. శ్రీరాముని శౌర్యమును, రాక్షసుల మాయాజాలములను ఎఱిగిన లక్ష్మణుడు తన అన్నకెట్టి ఆపదయు రాదని, వదిన రక్షణమే తన ముఖ్య కర్తవ్యమని పోవ వెనుకాడును. అప్పుడు సీత లక్ష్మణుని అనరాని మాటలు అని నొప్పించి పంపును. అదియే ఆ మచ్చ, అతి పరిశుద్ధచిత్తుడును పరమభాగవతుడును అగు లక్ష్మణుని అట్టిమాటలన్నందుకు సద్యఃఫలముగ ఆమెకు కష్టములు వచ్చినవని అనెడువారు లేకపోలేదు. కాని యిందు సీత తన సౌఖ్యమును గూడ చూచుకొనక ఒంటరియైన తనకు రాబోవు ఇబ్బందులను సరకు

గొనక, భర్తకై తన సర్వస్వమును త్యాగము చేసిన ఔదార్యము ప్రేమ పతిచింతన – గమనార్హములు. అట్లుండుట తప్పిదమైన, సీత అపరాధినియే.

సీతయొక్క అత్యున్నతములైన తేజశ్శక్తి మహిమలను ఇంకను కూలంకషముగా నరయవలయునన్న రావణుని బందిగా ఆమె అశోకవనమున నుండినప్పుడు చూడవలెను. రాక్షసస్త్రీలచే పరివేష్టితయై ఉపవాసముచే కృశించినదై మూర్తీభవించిన శోకదేవతవలె, రాముని స్మరించుచు సర్వప్రపంచమును విస్మరించి పతిధ్యానములోనే నిమగ్నయై యుండిన సీత గొప్ప తపస్విని. ఆ తపస్సే ఆమెకు అపరిమితమైన శక్తిని ప్రసాదించినది. నయమునను భయమునను తన్ను పొందగోరు రావణునితో "ఓ దశముఖా, నన్ను మఱచిపోయి నీవారినే పొందు. నేనట్టిదానను కాను. నేను తలచుకొన్న నిన్ను భస్మము చేయగలను. కాని ఆపని శ్రీరాముడే చేయవలయును. నిన్ను రూపుమాపి నన్ను విడిపించికొని పోవుటయే పురుషసింహుడగు ఆయనకు గౌరవము. ఆయననుండి నన్ను వేఱుచేయు శక్తి లేనేలేదు. విధి వైరుధ్యమువలన నన్ను అపహరింప గల్గితివి. అదియే నీ వినాశమునకు దారితీయును" అన్న సీతాదేవి మాటలలోని గాంభీర్యము, పతిపారతంత్ర్యము గమనార్హములు. రాముని బాణములకు గుఱికావలసిన రావణుని వానినుండి తప్పించి వాని పనిని తానే చేయుటకు ఆమెకు శక్తియున్నను ఇష్టములేదు. తన్ను తప్పింతునన్న హనుమంతునికిని ఆ మాటలే చెప్పినది. అపారమైన పతిభక్తియే ఆమె ఔన్నత్యమునకును సాహసమునకును మూలము. సర్పాస్త్రబంధితులై మూర్ఛలోనున్న రామలక్ష్మణులను చూచి తనకై గాక వనవాసానంతరము రాగలపుత్రుని ఎదురుచూచుచు దినములను లెక్కించుకొనుచున్న కౌసల్యను తలంచి చాల దుఃఖపడెను. రావణవధానంతరము తన్ను కాపలాకాయుచుండిన రాక్షసస్త్రీలను హనుమంతుడు చంపనుద్యుక్తుడైనప్పుడును అట్టి కారుణ్యమునే కనపఱచి, అపకారికి ప్రత్యపకారమునకంటె ప్రత్యుపకారము చేయుట గొప్పదన్న ఉత్తమధర్మమును బోధించి, ఆ స్త్రీలను కాపాడెను.

రావణనిర్మూలనానంతరము రాముడు సీతాదేవి నుద్దేశించి, సుగ్రీవాది స్నేహితుల సాహాయ్యమువలన తానుచేయవలసినకార్యము నిర్వర్తింపబడెననియు, మోహావేశుడగు రావణుని బందిగా నుండిన యామె పరిగ్రహింప యోగ్యురాలుగాదనియు, ఆమె తనయిష్టము వచ్చినచోటికి పోవచ్చుననియు చెప్పెను. అందులకు సీత, అశ్రుపూరితనయనయై మనోవాక్కాయకర్మల తాను నిర్దోషి నిష్కళంకి నని చెప్పి పంచభూతములను, దేవతలను సాక్ష్యముగొని ప్రతిజ్ఞజేసి అగ్నిప్రవేశముచేసెను. అగ్నిదేవుడు ఆమె నిష్కళంకతను లోకమునకు చాటి శ్రీరామునికి అర్పించెను. లోకాపవాదభీతిచే అట్లు తాను చేసితినిగాని సీత శీలమును శంకించి కాదని పశ్చాత్తాపముచెంది, అశ్రుపూరిత నయనములతో శ్రీరాముడును ఆమెను గ్రహించెను. ఈ సంఘటనవలన సీత, పాతివ్రత్యమునకును పవిత్రతకును పర్యాయపదమయ్యెను.

సీతాదేవి ఇదిగాక మరియొకపరీక్షను ఎదుర్కొనవలసివచ్చెను. పట్టాభిషిక్తుడై రాజ్యపాలనముచేసిన కొన్ని సంవత్సరములకు శ్రీరామునికి "రావణుని బందిగా అన్నిసంవత్సరములుండిన సీతను తెచ్చుకొని రాము డెంత సుఖముగా నున్నాడు. మనముకూడ మన

యాడువారియం దేవేని లోపములున్న సర్దుకొని పోవలయు''నని పౌరు లాడుమాటలు చెవిలో పడెను. వెంటనే నిష్కళంకయు పూర్ణగర్భిణియు నగు ఆ మహాసాధ్విని రాముడు పరిత్యజించి కానలకు బంపెను. ఆమెయు వాల్మీకిమహర్షి ఆశ్రమములో ఆశ్రయముపొంది అట కుశలవు లనబడు కవలపుత్రులను కనెను. వాల్మీకి వారికి యుక్తవయస్సు రాగానే పంచ సంస్కారములనుచేసి రామాయణకథను నేర్పెను. ఇంతలో శ్రీరాముడు స్వర్ణసీతా ద్వితీయుడై అశ్వమేధయాగముచేసెను. ఆ యాగగోష్ఠిలో వాల్మీకి కుశలవులచే రామాయణమును గానము చేయించెను. పశ్చాత్తప్త హృదయుడైన శ్రీరాముడు వాల్మీకితో జానకి తన నిష్కళంకతను ఆ సభలో రుజువుచేసికొనిన తానామెను పరిగ్రహింతు ననెను. సీతయు వాల్మీకివెంటవచ్చి ఋషులు బ్రాహ్మణులు భూపాలకులు క్రిక్కిరిసియున్న ఆ సభలో తన పాతివ్రత్యము పైని నిష్కళంకత పైని ఒట్టిడి భూదేవి తన్ను తనలోనికి తీసికొనిపోవుగాక యని అంజలి ఘటించి ప్రార్థించెను. భూమి రెండుగా చీలెను. భూగర్భమునుండి యొక సింహాసనముమీద భూదేవి ప్రత్యక్షమై సీతాదేవిని తనలో ఐక్యముచేసికొని అంతర్ధానమయ్యెను. శ్రీరాముడు శోకమూర్ఛితుడై దుఃఖించెను. బ్రహ్మాదిఋషులు శ్రీరాముని ఓదార్చి ఆయన మహావిష్ణువనియు కార్యాంతరమున భూలోకమున అవతరించెననియు జ్ఞాపకముచేసి దుఃఖోపశమనము చేసిరి.

యజ్ఞభూమి సంభూతయు, సహధర్మచారిణియు, తపస్వినియు అయిన సీత, కడకు సన్న్యాసినియు అయ్యెను. తన పాతివ్రత్యమును పవిత్రతను స్థాపించుకొనిన మఱుక్షణములోనే యీమె యీ లోకమునుండి అదృశ్యమైనది. ఆమె వచ్చినపని యైనది. ఒక చక్రవర్తి అనుంగుబిడ్డగా పరిచయమై మన యెదుటనే సహధర్మిణియగు సతియు, తపస్వినియు, కడకు సన్న్యాసినియు అయి మన దృష్టికి అంతర్ధానమైనది. కాని ప్రతిస్థితిలోను అనంతమైన శక్తి ఆమెలో నుండియు, ఒక మధురమైన కోమలమైన సామాన్య స్త్రీమూర్తిగనే మనకు కనిపించుచుండినది. ఇదియే సీతాదేవి పవిత్ర గాథ.

# మహర్షి భరద్వాజుడు

## శ్రీమత్కాంచీ ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యస్వామి

ఆదికావ్యవిఖ్యాతమహర్షి వర్యుడైనయట్టి భరద్వాజు నతిశయములఁ
బ్రస్తుతించెద వాక్కు సాఫల్య మొంద, చిత్తగింపుడు, విబుధులు, చేత మలర.

ప్రాచేతసమునిప్రణీతమైన ఆదికావ్యమగు శ్రీరామాయణమున కథానుబంధవశమున పెక్కండ్రుమహర్షుల ప్రస్తావము వచ్చుచుండునని ఆ గ్రంథమును పారాయణముచేయువారంద ఱెఱుగుదురు. అందు భరద్వాజ మహర్షి నిగూర్చి తెలియవచ్చిన విశేషములను ఇచట వివరించుచున్నాను. మొదట ఈ ఇతిహాసమున భరద్వాజప్రస్తావము ఎన్ని పర్యాయములు

వచ్చినదో చూతుమేని ఐదుపర్యాయములు వచ్చియున్న దని తెలియనగును. సంక్షేప రామాయణాత్మకమగు ప్రథమసర్గమున (31) "చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్, రమ్య మావసథం కృత్వా రమమాణా వనేత్రయః." "చిత్రకూటమునకు చేరుకొని భరద్వాజునానతిచొప్పున రమ్యకుటీరమును నిర్మించుకొని మువ్వురును వనమున విహరించుచుండిరి." అని చెప్పియుండుచోటు మొదటిది. సంక్షేపరామాయణములోనే (87) "భరద్వాజాశ్రమం గత్వా రామ స్సత్యపరాక్రమః। భరతస్యాన్తికం రామో హనూమన్తం వ్యసర్జయత్" "సత్యపరాక్రముడగు రాముడు భరద్వాజాశ్రమమునకు వచ్చి భరతునొద్దకు హనుమంతుని పంపెను." అనునది రెండవచోటు. అయోధ్యాకాండమున సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమమును చేరుకొనుటను చెప్పెడి ఏబదినాలుగవసర్గ మూడవచోటు. అయోధ్యాకాండములోనే భరతభరద్వాజ సమాగమము నభివర్ణించు తొంబదియవసర్గము నాల్గవచోటు. యుద్ధకాండమున రావణ వధానంతరము పుష్పకవిమానమున వచ్చుచున్న శ్రీరాముడు భరద్వాజాశ్రమమునకు వచ్చుటను తెలుపు నూటయిరువదియేడవసర్గము ఐదవస్థలము.

బాలకాండద్వితీయసర్గములో "అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ" "భరద్వాజా, చూడవోయి బురదలేని నీటిని" అను చోట భరద్వాజప్రస్తావ మున్నను ఆ భరద్వాజుడు వేఱు. అతడు వాల్మీకిశిష్యుడు. అను విషయము అందే (21) "భరద్వాజ స్తత శ్శిష్యో వినీతః శ్రుతవాన్ మునిః కలశం పూర్ణ మాదాయ పృష్ఠతోఽనుజగామహ" "అంతట వినయవంతుడు వేదజ్ఞుడు మౌని యున్నైన భరద్వాజుడను శిష్యుడు పూర్ణకలశమును చేతగొని వాల్మీకి ననుగమించెను." అనుశ్లోకమువలన తెలియుచున్నది.

వీనిలో కడపటి సందర్భమునమాత్రమే భరద్వాజుని యోగమహిమ అతనిమాటలచేతనే చక్కగ తెలియుచున్నది. అచ్చట "పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః। భరద్వాజాశ్రమం ప్రాప్య వవన్దే నియతో మునిమ్॥సో ఽపృచ్ఛ దభివా ద్యైనం భరద్వాజం తపోధనమ్ శృణోషికచ్చి ద్భగవన్ సుభిక్షానామయం పురే కచ్చిచ్చ యుక్తో భరతో జీవ న్త్యః చ మాతరః" "పదునాలు గేండ్లునిండిన పిమ్మట పంచమినాడు లక్ష్మణాగ్రజుడు భరద్వాజాశ్రమమునకు చేరుకొని నిష్ఠతో మునికి మ్రొక్కెను. ఆతపోధను నిట్లడిగెను. "భగవంతుడా, నగరమున క్షేమ సుభిక్షములు ఉన్నవార్త వినవచ్చెనా? భరతుడు బాగున్నాడా, తల్లులు జీవించి యున్నారా" అను రెండున్నరశ్లోకములలో సాకేతకుశలవృత్తాంతమునుగూర్చిన రాముని సంప్రశ్నము నిబద్ధమై యున్నది. అంతట "ఏవ ముక్త స్తు రామేణ భరద్వాజో మహామునిః ప్రత్యువాచ" "రాము డిట్లనగా భరద్వాజ మహాముని బదులుచెప్పె" నని నారంభించి "పఙ్కదిగ్ధ స్తు జటిలో భరత స్త్వామ్ ప్రతీక్షతే పాదుకే తే పురస్కృత్య సర్వంచ కుశలం గృహే." "జటామండలధారియై అడుసంటిన మేనితో భరతుడు నీకై వేచియున్నాడు. నీ పాదుకల పరిపాలనమున ఇంట సర్వమును కుశలమే" అని సాకేతకుశలోదంతనివేదనము పొందుపఱుపబడినది. అంతట "సర్వంచ సుఖదుఃఖ న్తే విదితం మమ రాఘవ యత్త్వయా విపులం ప్రాప్తం జనస్థానవధాదికమ్ బ్రాహ్మణార్థే నియుక్తస్య రక్షితు స్సర్వతాపసాన్ రావణేన హృతా భార్యా బభూ

వేయ మనిన్దితా। మారీచదర్శనం చైవ సీతో న్మథనమేవ చ । కబంధదర్శనం చైవ పంపాభిగమనం తథా। సుగ్రీవేణచ తే సఖ్యం యచ్చ వాలీ హత స్త్వయా। మార్గణం చైవ వైదేహ్యాః కర్మ వాతాత్మజస్య చ । విదితాయాంచ వైదేహ్యాం నలసేతు ర్యథా కృతః।యథా వా దీపితా లంకా ప్రహృష్టై ర్హరియూథపైః।

సపుత్రబాంధవామాత్య స్సబల స్సహవాహనః। యథా వినిహత స్సంఖ్యే రావణో దేవకంటకః సమాగమ శ్చ త్రిదశై ర్యథా దత్తశ్చ తే వరః। సర్వం మ మైత ద్విదితం తపసా ధర్మవత్సల "రాఘువా నీ వనుభవించిన సుఖదుఃఖము లన్నియు నే నెఱుగుదును. జనస్థానమున బ్రాహ్మణులు నియోగింపగా తపస్వుల సంరక్షణకై వేలకొలది రాక్షసులను చంపుట, మారీచదర్శనము, సీతాపహరణము, కబంధదర్శనము, పంపాభిగమనము, సుగ్రీవసఖ్యము, వాలివధ, సీతాన్వేషణము, హనుమంతుడు సాధించిన పనులు, సేతుబంధనము, వానరులు లంకనుతగులబెట్టుట, దేవకంటకుడగు రావణుడు సపుత్త్రబాంధవామాత్యుడుగను సహవాహనుడుగను రణమున నిహతుడగుట, వేల్పులతో సమాగమము, నీకు వారిచ్చిన వరము—ఇంత వఱకుసర్వము తపశ్శక్తిచే నేనెఱిగియున్నాను." అని భరద్వాజుడే చెప్పిన మాటలలో ఆయన తపశ్శక్తి ప్రకాశితమగుచున్నది. అంతటి తపస్వికి ఆపాటిశక్తియుక్తులు ఆశ్చర్యజనకములు కావు.

మఱొకచోట మఱొకవిప్రతిపత్తి కలుగుచున్నది. అయోధ్యాకాండమున భరతభరద్వాజసమాగమసందర్భమున మహర్షి భరతుని "కచ్చి న్న తస్యాపాపస్య పాపం కర్తు మిహేచ్ఛసి।అకంటకం భోక్తుమానా రాజ్యం తస్యానుజస్య చ" "పాపరహితుడగు ఆరాముని విషయమున ఏమేని పాప మొనర్ప సంకల్పింప లేదు కదా, రాజ్యానుభవమునకు ఆయన్న దమ్ముల తోడుసు లేకుండ చేసికొనుటకు?" అని ప్రశ్నించును. ప్రశ్నార్థము సులభమే కదా. "తమ్మునితో అడవికి వచ్చియున్న రాముని జంపి రాజ్యమును నిష్కంటముగ చేసికొన గోరి బయలు దేఱియున్నావా? రాముడు సాధువును సాత్త్వికుడును. అతనికి కీడుచేయుట ఉచితమా" అనుట కదా యోగివరేణ్యుడైన భరద్వాజుని ప్రశ్నార్థము. ఎనుబదియైదవ సర్గలో గుహుడు భరతుని "కచ్చి న్న దుష్టో వ్రజసి రామస్యాక్లిష్టకర్మణః। ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే" "సుచరితుడగు రాముని విషయమున దుస్సంకల్పముతో నీవు చనుట లేదు కదా. నీ వెంట నున్న ఈపెద్దసేన నా కనుమానము కలిగించుచున్నది." అని అడిగియుండెను. గుహుడు, అజ్ఞానులలో అగ్రణియు పామరుడు నైనందున అత డాలా గడిగినందుకు విచారము విస్మయము అక్కఱలేదు. మఱి భరద్వాజమహర్షి తపోబలవిదితనిఖిలవేదితవ్యుడు కదా. జరిగిపోయిన దానిని జరుగనున్నదానిని హృద్గతమైనదానిని ఎఱుగుటకు వలసిన అసమాభ్యధికశక్తికలవాడు కదా. పదునాలుగేండ్ల శ్రీరామచరిత్రమును సర్వము నెఱుగుదునని చెప్పుచున్న ఈయన "విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్।రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మి హార్హసి; కథం దశరథా జ్జాతో భవే ద్రాజ్యాపహారకః" "సభామధ్యమున విలపించెను. పురోహితుని నిందించెను. నేను రాముని సొమ్మును. రాజ్యమును రాముని సొమ్మే. ఇచట ధర్మమును నీవే చెప్పుము. దశరథుని కడుపున పుట్టినవాడు ఎట్లు రాజ్యాపహర్త కాగలుగును." ఇట్లంతయు చెప్పిన

భరతునివృత్తాంతము ఈయనకు తెలిసియే యుండవలయును కదా. ఈయన తపోబల మీవిషయమున ప్రసరింపదా ?

ఇంతే కాదు. శంకకు గుఱియైన భరతునితో కూడ వసిష్ఠమహర్షియు వచ్చియుండెను. ఆప్రకరణములోనే "వసిష్ఠ మథ దృష్ట్వైవ భరద్వాజో మహాత్మనః సంచచా లాసనా త్తూర్ణం శిష్యా నర్ఘ్య మితి బ్రువన్" "వచ్చిన వసిష్ఠుని చూచినంతనే మహామతియగు భరద్వాజుడు అర్ఘ్యము తెండి అర్ఘ్యము తెండి అని శిష్యులను తొందరించుచు ఆసనమునుండి లేచెను" అని చెప్పబడినది. భరతుడు కుటిల మనస్కుడే యగుచో తపస్తేజస్సంపన్నుడగు వశిష్ఠుడు అతనివెంబడి వచ్చియుండడుకదా. ఇట్లుండగా ఆ సాధువునకు పాప మొనర్పకోరవు కదా" అని భరద్వాజు డడుగుట ఎట్లు పొసగును ?

ఇందులకు చక్కని సమాధానము : ఈ ఘట్టములోనే పైశంకను తీర్పగలట్లు వాల్మీకి మహర్షి "భరద్వాజో మహాతపాః, భరతం పృష్టవా నేవం రాఘవస్నేహబంధనాత్" మహాతపస్వియైన భరద్వాజుడు శ్రీరాముని మీది స్నేహబంధముచే భరతు నిట్లడిగె" నని చెప్పియున్నాడు. స్నేహవైఖరి మితమతుల కర్థముకాదు. భాష్యముమీది శ్రుతప్రకాశిక యను వ్యాఖ్యలో ఆచార్యులు "సంబంధ విశేషాన్వితులందున్న ప్రీతి స్నేహ మనబడును. అస్థానమున శంకలు, భయములు, దోషములను గుర్తింపలేమి, దోషములుసైతము గుణములుగ కననగుట–మున్నగునవి ఆ స్నేహవిపాకములే" అని సెలవిచ్చియున్నారు. దోషములు కనబడకుండుటయు దోషములు గుణములుగ కనబడుటయు అటుండు గాక, అస్థానభయశంకిత్వమని మొదట చెప్పబడెనే దానినిట గొనవలయును స్నేహవిపాకముచే అస్థానభయ శంకిత్వము కలుగుచుండు ననుట ఫలితార్థము "స్నేహా దస్థానరక్షావ్యసనిభి రభయం శార్‌ఙ్గచక్రాసి ముఖ్యై రానందైకార్ణవం శ్రీ ర్భగవతి యువయో రాహు రాస్థానరత్నం". "ఓ లక్ష్మీదేవీ, శ్రేష్ఠమైన మీ యుభయుల ఆస్థానమున స్నేహముచే భయమును శంకించు దివ్యాయుధములచే ఎట్టిభయమునకును అవకాశ ముండ" దనియు మీ యునికి పట్టు ఆనందైకార్ణవముగ నుండు ననియు చెప్పుదురు." అనెడి గుణరత్నకోశమందలి (24) శ్రీ పరాశర భట్టారకుల శ్రీసూక్తి, ఈ సమన్వయమునకు ప్రమాణము.

ఈ సూక్తి శ్రీవైకుంఠదివ్యలోకచర్యను తెలుపునది కదా. అజ్ఞానము అన్యథాజ్ఞానము సంశయము విస్మృతి మున్నగు పురుషదోషముల గంధమైనను లేని నిత్యసూరులు సైతము అస్థానమున కలవరపడుచు భగవంతుని రక్షింప ముందున ఉఱుకుచుందురు కదా. విపాకదశ నందిన స్నేహమే అందుకు కారణ మని శ్రీపరాశరభట్టారకులు "స్నేహా దస్థానరక్షావ్యసనిభిః" అనుదళముచే సూచించిరి. విమలవిశద జ్ఞాననిధులైన సజ్జనులకు సైతము ప్రేమోత్కటతచే అస్థానమున భయశంక కలుగు ననుటను హార్దస్నేహము కలవారే గ్రహింప సమర్థులు.

సామాన్యప్రజ్ఞ గల మనము సమస్తమునకును రక్షకుడు భగవంతుడు అనుటనుమాత్రమే ఎఱుగుదుము. భగవంతునియునికిని రక్షకతను అంగీకరింపని నాస్తికులతో మనము చేరమనుట అంటుండ నిండు. భగవంతుని రక్షకత్వమందు ప్రామాణికున కెవనికి గాని, విప్రతిపత్తి లేశమేని ఉండదు. దేవుడు రక్షకుడు మనము రక్ష్యు

లము అని, సర్వశాస్త్రములును ఘోషించు చున్నవి. "వినతవివిధభూతవ్రాత రక్షైకదీక్షే" "ప్రణమిల్లిన సకలప్రాణులను రక్షించు ముఖ్య దీక్ష కలవాడు". "సర్వావస్థసకృత్ప్రపన్న జనతాసంరక్షణైకవ్రతీ" "ఏ దశయందుగాని ఒక్కసారి శరణన్న చాలును, శరణన్నవారిని సంరక్షించుటే ముఖ్యవ్రతముగ గలవాడు." ఈ మొదలగు ఆచార్యశ్రీసూక్తులు సదా మనము వల్లించుచుండునవే. అటువంటి ఆర్త త్రాణపరాయణుడైన భగవంతుని సైతము తాము కాపాడ గోరి కొందఱు మహామతులు ముందునకు ఉఱుకుదురని చెప్పినచో అల్పమతులకు అది సులభముగ నర్థము కాదు. ఏదశయందైనను సరే రక్షకుడు భగవంతుడే. మనము రక్ష్యులమే. భగవంతునకు మనము రక్షకులము కాము. "లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా రక్షక స్సర్వసిద్ధాంతే వేదాంతేఽపిచ గీయతే" "కారుణ్యరూపయైన లక్ష్మీదేవితో కూడిన హృషీకేశుడే రక్షకుడని సకలసిద్ధాంతములును వేదాంతమును కీర్తించుచున్నవి." "న హి పాలనసామర్థ్య మృతే సర్వేశ్వరం హరిం" "సర్వేశ్వరుడగు హరికి తప్ప రక్షణసామర్థ్యము మఱొకరికి లేదు." ఇత్యాది ప్రమాణ సహస్రములచే సర్వజగద్రక్షణవిచక్షణుడు సర్వేశ్వరుడే అనుట నిర్వివాదము. దాని నెవ్వరును కాదనరు గాని రక్షకుడైన భగవంతునకు రక్ష్యత్వమును ఉపపాదించుచున్నాము, చిత్తగింపుడు.

అల్పశక్తులమును అల్పజ్ఞులము నగు మనము అప్రమేయశక్తియు సర్వజ్ఞుడును సర్వాపదలను పోగొట్టువాడు నగు భగవంతుని రక్షింతుమనుట మనస్సుచే తలంచుటకైనను శక్యము కాదు, యోగ్యము కాదు; నిజమే భక్తప్రవరులగోష్ఠులలో మంగళాశాసన మను నొకమాట సుప్రథితమే. పరమభక్తవరేణ్యులకు మంగళాశాసనపరు లనియే వ్యపదేశము. 'మంగళాశాసన మనగా నేమి? మంగళములను ఆశాసించుటకు కారణమేమి' అనుటను విమర్శించి తెలిసికొందు మేని రక్షకుడగు భగవంతుని సైతము రక్ష్యునిగా భావించుట అవ్యాహత మను విషయము నిర్ధారిత మగును. కావున దీనిని వివరించుచున్నాము

భక్తచేతనులకు జ్ఞానదశ అనియు, ప్రేమదశ అనియు రెండుదశలు తప్పవు. సర్వేశ్వరుడే రక్షకుడు మనము రక్ష్యులము, రక్షింపబడుచున్నాము అని భావించుచుండు దశ జ్ఞానదశ. ఈదశలో భక్తులు "మాం రక్ష హరే" "అస్మాన్ పాల యాచ్యుత" ఇత్యాది రీతులలో భగవంతుని రక్షకత్వమును అనుసంధించుచుందురు. ఈదశలో చేతనులు రక్ష్యులు. పరమచేతనుడు రక్షకుడు అను ప్రమాణశత ప్రతీతమైన విషయము నిరూపితమగుచున్నది. ఇక ప్రేమదశను వివరింతుము. భగవంతుడు నిరవధిక సౌందర్య లావణ్య సౌకుమార్యాది నిధి. ఆగుణముల ననుసంధించు నుద్రేకమున "అయ్యో, ఈ భగవంతునకు ఏ ఆసురప్రకృతి వలన ఎట్టియాపద వాటిల్లునో" అని అస్థానమున భయశంక కలుగుచున్నది. అప్పుడు అతని రక్షకత్వము విస్మృతమై అతనిని మనము రక్షింపవలె నను అధ్యవసాయము కలుగును. "జయ విజయీభవ చిరంజీవ భద్రమస్తు భవతః" ఈ రీతుల వాక్యములు నోట వెలువడును. దీనినే ప్రేమదశ కార్యమందురు. అప్పుడు రక్షింపబడువాడు ఈశ్వరుడనియు రక్షించువాడు తా ననియు విపర్యస్తభావము కలుగును. ఇందులకు కారణము అస్థాన భయశంకయే.

శ్రీరామాయణమున ఈప్రేమదశ అనేక వ్యక్తులలో కననగుచుండును. (1)"అహం వేద్మి

మహాత్మానం రామం సత్య పరాక్రమమ్'' ''సత్యపరాక్రముడును మహాత్ముడును నగు రాముని నే నెఱుగుదు'' నని చెప్పి దశరథ రాముని తన యజ్ఞసంరక్షణకై పిలుచుకొని పోవుచున్న విశ్వామిత్రుడు తాటక వచ్చిపై బడు సందర్భమున కలవరపడి శ్రీరాముని వీర్య పరాక్రమాదికములను మఱచి కేవల మతని సౌకుమార్యమును మాత్రము తలంచి దిగులుపడి ''స్వస్తి రాఘవయో రస్తు'' ''రామలక్ష్మణులకు శుభము కలుగును గాక'' అని మంగళాశాసనము కావించెను. (2) శివుని వింటిని విఱిచిన శ్రీరాముని అతిమానుషశక్తిని ప్రత్యక్షముగ చూచిన జనకమహారాజు శ్రీరాముని వైవాహికవేషరామణీయకమును విలోకించి ''ఈ సౌందర్యనిధికి ఆపదలు కలుగకుండవలయునే'' అనెడి అక్కఱకలవాడై కన్యాప్రదానకాలమున ''ప్రతీచ్ఛ చైనాం భద్రం తే'' ''ఈమెను గైకొనుము. నీకు శుభ మగుత'' మని మంగళాశాసనము చేసెను. (3) సీతాదేవి విభుని నిస్సమాభ్యధికమహిమ నెఱింగినదైనను సింగారించుకొన్న అతని మేని సోయగమును చూచి విహ్వలయై ''పతి సమ్మానితా సీతా భర్తార మసితేక్షణా ఆద్వార మనువ్రాజ మంగళా న్యభిదధ్యుషీ'' ''భర్తృసమాదరవతియు నలుపుడాలుగల చక్కనినేత్రములు కలదియు నగు సీత మంగళముల నాసించుచు భర్తను తలవాకిలివఱకు అనుగమించెనట.'' అచ్చట ''పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః వరుణః పశ్చిమా మాశాం ధనద స్తూత్తరాం దిశమ్,'' ''నిన్ను తూర్పువైపు ఇంద్రుడు కాపాడును గాక. దక్షిణపువైపు యముడు రక్షించును గాక. పడమటివైపు వరుణు డోమునుగాక. ఉత్తరదిశవైపు కుబేరుడు పాలించునుగాక'' అని దిక్పాలకులను శ్రీరామరక్షణమందు నియమించినది. ''భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మా దగ్ని శ్చేంద్రశ్చ మృత్యు ర్ధావతి పంచమ ఇతి'' అను నుపనిషత్తున చెప్పినట్లు భగవంతు నెదుట గడగడలాడుచు పనులు నిర్వర్తించు దేవతలు ఎట్లు భగవంతుని తాము రక్షింపగలుగుదు రని వైదేహి ఆలోచింపదాయెను.

(4) వే యెందులకు? అయోధ్యావాసిజనులందఱకును రామునకు మంగళాశాసనము చేయుట నిత్యకృత్య మని వాల్మీకిమహర్షి వాక్రుచ్చుచున్నాడు. ''స్త్రియో వృద్ధా సరుణ్యా శ్చ సాయంప్రాత స్సమాహితాః సర్వాన్ దేవాన్ నమస్యన్తి రామస్యార్థే యశస్వినః'' ''ముదిసినమగువలు యువతులు సాయంప్రాతర్వేళలందు యశస్వంతుడగు రామునికి మంగళములు కలుగవలయునని సకలదేవతలకును మ్రొక్కుకొనుచుండెడివారు'' రామప్రభావమును చక్కగ నెఱిగిన పౌరజనులు రామునకు క్షేమము ఎడతెగకుండుటకై ప్రతిదినము క్షుద్రదేవతలను ప్రార్థించుచుండిరని చెప్పుటచే అస్థానమున వారికి కలిగిన భయశంక కదా సూచితమైనది. పైనుదాహరింపబడిన రామాయణశ్లోకమున 'యశస్వినః' అనునది షష్ఠ్యంతము రామవిశేషణము. ''స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః'' ''దర్పితుడైన రావణుని వధించుటకై వేల్పులచే ప్రార్థితుడై మానవలోకమున అవతరించిన సనాతనుడగు విష్ణువేకదా ఈరాముడు'' అని రాముడు విష్ణ్వవతారమనుట విఖ్యాత విషయమే. దాని నెఱిగియుండియు పౌరజనులు ఆ రాముని మేలునకై క్షుద్రదేవతలను ప్రార్థించిరట. ఇందుకు కారణము అస్థానభయశంకిత్వము తప్ప వే ఱేమి?

(5) శ్రీరాముని ప్రభావము చక్కగ నెఱిగిన కౌసల్యాదేవియు "య న్మంగళం సుపర్ణస్య వినతా కల్పయత్ పురా అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగళమ్" "అమృతము తేబోవునప్పుడు గరుత్మంతునకు వినత ఏ మంగళమును సమకూర్చెనో ఆ మంగళము నీకును కలుగుత" అని అస్థానభయవిహ్వలయై మంగళాశాసనము చేసెను.

(6) ఇక దండకారణ్యవాసిమహర్షుల నడవడిని కనుడు. వీరు తపోధనులు కదా. "తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః" నీదేశములో వసించు ప్రజలము మేము. మమ్ము కాపాడు బాధ్యత నీది" "రక్షితవ్యా స్త్వయా శశ్వ ద్గర్భభూతా స్తపోధనాః" "తపోధనులము బిడ్డలను కాపాడినట్లుగా సదా నీవు కాపాడవలెను.' ఇట్లంతయు ప్రార్థించిన వీరికి రాముడు రక్షకుడనుటయు తాము రక్ష్యులనుటయు చక్కగ తెలిసినవిషయమే కదా. అటువంటి వీరు "తే తం సోమ మివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణః మంగళాని ప్రయుఞ్జానాః ప్రత్యగృహ్ణాన్ దృఢవ్రతాః" "చంద్రుడుదయించినట్లుగా లోచనగోచరుడైన శ్రీరాముని కన్నంతనే దృఢవ్రతులును ధర్మచారులునగు ఆ మునులు మంగళములను ఆశాసించి ఆదరించిరట." ఈ మంగళాశాసనమునకు కారణము అస్థానభయశంకిత్వమే.

(7) జటాయుచరితమును కనుడు. సీతను కాపాడుటకై ఇతడు రావణునితో పోరాడినిహతుడయ్యెను. ఆసన్నమరణదశలో జటాయువుండగా సీతను వెదకుచు రామలక్ష్మణులటు వచ్చిరి. అప్పుడు రామునితో జటాయువు పల్కిన వాక్యము "యా మోషధి మివాయుష్మ న్నన్వేషసి మహావనే సా దేవీ మమ చ ప్రాణా రావణేనో భయం హృతమ్" "ఆయుష్మంతుడా, కారడవిలో ఓషధిని వెదకినట్లుగా ఎవతెను వెదకుచున్నావో ఆమెను నా ప్రాణములను ఈ యుభయమును రావణుడు హరించెను." ఇచ్చట "ఆయుష్మన్" అనుటకు "అబ్బాయీ" అనుటమాత్ర మర్థము కాదు. "దీర్ఘాయుష్మంతుడవుక" మ్మనెడి ఆశీస్సు ఇందు వ్యంజితము. జనస్థానమందుండిన పదునాలుగువేల రాక్షసులను జంపినప్పటి శ్రీరాముని అసహాయశూరత్వమును అనపాయసాహసత్వమును జటాయువు చక్కగ నెఱుగును. ఐనను ప్రస్తుతము సీతావిరహముచే రాముని మేన గననగుచుండిన వాడుపాటును, సౌకుమార్యాతిశయమును, అసురులతో పొసగిన దీర్ఘ ద్వేషమును జూచినప్పుడు "అయ్యో, ఏ యనర్థము కల్గునో" అని అకాండభయావిష్టుడై జటాయువు కావించిన 'ఆయుష్మంతుడా' అను సంబోధనలో అతనికి గలిగిన అతిశంక ద్యోతిత మగుచున్నది.

అట్లే భరద్వాజమహర్షికిని రామప్రభావము చక్కగ తెలిసియున్నను ప్రేమపరవశుడై నీటిని జూచి నిప్పని భ్రమించినట్లుగ ఆయన భరతుని జూచి రామునకు ప్రతికూలుడు కాబోలునని శంకించెను. ఆయన భరతు నడిగిన ప్రశ్నలో ఈ యతిశంక కననగుట ఎంతయు ఉపపన్నమే.

తైత్తిరీయబ్రాహ్మణమున కాఠకశాఖలో 'భరద్వాజో హ త్రిభి రాయుర్భి ర్బ్రహ్మచర్య మువాస" "మూడుజీవితకాలాలు చెల్లెను భరద్వాజుని బ్రహ్మచర్య" మని యామ్నాతమైన యుపాఖ్యానముకూడ ఇతని ప్రభావాతిశయమును ప్రఖ్యాపించుచున్నది.

శ్రీమదణ్ణంగరాచార్య శేఖరుండు పెద్దహారల యానతిం బ్రీతితోడ
వరభరద్వాజముని ప్రభావంబునెల్ల పొందుపఱచెను వ్యాసంబునందు నిచట.
ఆ భరద్వాజుఁ గీర్తించు వ్యాజమునను మంగళాశాసనపు మహిమంబుఁ దెల్పె.

# ఆదర్శపురుషుడు శ్రీరామచంద్రుడు

శ్రీ చిలువూరి మాధవకృష్ణకవి

ఉ. శ్రీరమణీయ జీవనము శిష్టజనావళికెల్లఁ గొల్పనెం
తే రహి సద్గుణంబులకు నెందును లక్ష్యము లక్షణంబునై
ధారుణి రామచంద్రుఁడయి దాసులఁ బ్రోచిన తండ్రి సత్కృపా
వారి యవారిగాఁ గురిసి వారని సంపదలిచ్చి ప్రోచుతన్.

భగవల్లీల లనంతములు, గోచరములు. ఈ విషయమునే "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ' అని పెద్దలు వచించిరి. సనాతనమతమునకు వేదములు మూలస్తంభములు. వేదవాఙ్మయము సిద్ధపురుషులకే అవగతము. ఋషితుల్యులు సయితము వేదార్థముల ప్రవచించునెడ భిన్నాభిప్రాయముల వెలిబుచ్చుచుందురు. ఇక పామర జనసమూహము వేదవాఙ్మయమును యథాతథముగ గ్రహింపజాలదన నందావంతయు సందియము లేదు. కావుననే వేదవాఙ్మయమును లక్ష్యలక్షణ సమన్వితముగ జనసామాన్యమునకు వివరింపనెంచి పూర్వులు ఇతిహాసపురాణాదులను కథారూపమున రచించిరి. ఇట్టి పవిత్రగ్రంథములలో రామాయణము ఆదికావ్యమని పేరెన్నికగన్నది రామాయణ పారాయణమున జన్మతరింపగలదని పూర్వులు హృదయపూర్వకముగ విశ్వసించెడివారు. నేడును ఈ మహాకావ్యమును మహానుభావు లెందరో పారాయణము చేయుచున్నారు. ఇందులకీ క్రింది శ్లోకమే సాక్షి:

శ్లో. చరితం రఘునాథస్య
శతకోటి ప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం
మహాపాతక నాశనం.

తా. శ్రీరామచంద్ర చరిత్ర విస్తృతి యెన్నియో కోట్లు గలవు. అందలి ప్రత్యక్షరమును మహాపాతకముల నశింపజేయగలదు. ఇట్టి విశ్వాసము తో భక్తజనులు ఈ రామాయణమును మహాపుణ్యప్రదమని యనుదినము పారాయణము చేయుచుందురు.

మోక్షదాయకములగు గ్రంథములలో హిందూవులకు భారత భాగవత రామాయణములు ముఖ్యములు భక్తులెల్లరు తమయిష్టదైవమును ధ్యానించి పూజించినట్లే యీ గ్రంథములను ప్రార్థనపూర్వకముగ పూజించి పారాయణము చేయుదురు. అట్టి పారాయణము వలన తమకు మేలు చేకూరునని వారి విశ్వాసము. ఈ మూడు గ్రంథములందును రామాయణము అత్యంతము ప్రాచీనమయినది. రాముడు అన్న శబ్దమునందే రామాయణ ప్రాశస్త్య మిమిడియున్నది. ప్రజలను రంజింపజేయువాడే రాముడు అని యీ శబ్దమునకు వ్యుత్పత్తి.

రాముడు ప్రజలనెట్లు రంజింపజేసెనో ఆతడు ఎట్టిజీవనమును గడపెనో, ఆతని శీలమువలన మనము గ్రహింపదగినవియు, అనుసరింపదగినవియునగు మార్గములెవ్వియో గమనింతము.

శ్రీరాముని వాల్మీకి 'సర్వలక్షణ సంపన్న' అన్న విశేషణమును ప్రయోగించెను. ఈ ఒక్క సమాసమే రాముని గుణగణములను వేనోళ్ల జాటుచున్నది. నిజముగా మానవుడు ఎట్టిగుణముల నలవఱచుకొని ప్రపంచమున జీవింపవలయునో ఆయాగుణములెల్ల శ్రీరామునియందు నిక్షిప్తములై యున్నవని

యీ భావము మనకు తేటతెల్లము సేయుచున్నది.

శ్రీరామచంద్రునిగూర్చి రాజ్యముసంపలి ప్రజలు ఆస్థానమునందలి గురువులు, బుధులు, ఉద్యోగులు–పలికిన పలుకులు విన్నచో శ్రీరాముడు సర్వలక్షణ సంపన్నుడనియు, ఆదర్శపురుషుడనియు నవగాహనమగును.

శ్లో. రామస్సత్పురుషో లోకే
సత్యధర్మపరాయణః
సాక్షాద్రామాద్వినిర్వృత్తో
ధర్మశ్చాపి శ్రియాసహ. అయోధ్య 2-29

శ్లో. వ్యసనేషుమనుష్యాణాం
భృశంభవతి దుఃఖితః
ఉత్సవేషుచసర్వేషు
పితేవ పరితుష్యతి. అయోధ్య–2–40

శ్లో. ప్రజాపాలనతత్త్వజ్ఞో
న రాగోపహతేన్ద్రియః
శక్తస్త్రైలోక్యమప్యేకో
భోక్తుం కిన్ను మహీమిమామ్.
అయోధ్య–2–44

శ్లో. శాన్తై స్సర్వప్రజాకాన్తైః
ప్రీతిసంజననైర్నృణామ్
గుణైర్విరురుచేరామో
దీప్తస్సూర్య ఇవాంశుభిః.
అయోధ్య–2–47

తా. లోకంబున రాముడే సత్పురుషుడు సత్యధర్మంబులయందు మిక్కిలి యాసక్తిగలవాడు. ధర్మమును సంపదయు నాతని నెపబాయజాలక యాతనియందె నిక్షిప్తములయినవి.

తా. బంధువులు, మిత్రులు, ధనికులు దరిద్రులు మొదలగు భేదములు లేక, మనుష్యసామాన్యమునకు కష్టము సంభవించినను నెంతయో దుఃఖమును పొందును. అట్లే మనుష్యసామాన్యమున కేమాత్రము సుఖముగలిగినను పుత్రోత్సవమువలన తండ్రి సంతసించునట్లు మిక్కిలిగ సంతసించును.

తా. రాముడు జనులను చక్కగపాలింప దెలిసినవాడు. ఇతడు స్వయముగా ముల్లోకములను బాలింపగలడు. ఈభూమిని పాలించుట గూర్చి వింతయేల ?

తా. శాంతిప్రధానములును సమస్తప్రజలకు కోరదగినవియు మానవలోకమునకు సంతోషదాయకంబులునునగు గుణములుగలిగి సహస్రభానునివలె శ్రీరామచంద్రుడు ప్రకాశించుచున్నాడు.

ఇట్లు ప్రజాభిరాముడయిన శ్రీరాముడు తన సోదరులయందు ఎట్టి ప్రేమాదరములు గలిగియుండెనో గమనింతము. నిజముగా శ్రీరాముడు తన సోదరులయందు జూపిన ప్రేమ యనన్య సదృశము. తన సోదరులలో ఆయన ఎవరినిగాని ఎన్నడుగాని అసంతృప్తి పరచినట్లు ఎక్కడను గనిపింపదు. ఆ సోదరులును అన్న యెడ సంపూర్ణభక్తిభావము గలిగియే యుండిరి. ఏవిషయమునందుగాని ఎన్నడుగాని వారిలో ఎవరయినను ఆయనయందు న్యూనత నాపాదించిన వారుగారు. మీదుమిక్కిలి తమ్ము తమ ఘనతకు మిక్కిలిగా గౌరవించి యాదరించెననియే పలికెడివారు. అట్లని తామెట్లు మెలగినను తమ్ము ప్రేమతోనే జూచెడివాడని తలంచెడివారుకారు. ఏమాత్రము దోషము తమయందున్నను ఆయన సహింపజాలనివాడని నిశ్చయముగ బలికెడివారు. శ్రీరామచంద్రుని అడవులకు బంపిన కైకేయిని వధింపబూనియు భరతుడు వెనుదీసెను. అందులకు కారణ మిట్లు వెల్లడించెను.

శ్లో॥ అపాపదర్శనం శూరం
కృతాత్మానం యశస్వినం
ప్రవ్రాజ్యచీరవసనం
కిం ను పశ్యసి కారణమ్' అయోధ్య 73-12

తా. మనస్సునందయినను పాపమునుదలపని వాడును శూరుడును బుద్ధిమంతుడును కీర్తిశాలియునగు రాముని నారచీరలుకట్టుకొని యడవికి బోవునట్లు చేసితివే దీని కేమికారణము?

శ్లో. 'హన్యామహామిమాంపాపాం
కైకేయీం దుష్టచారిణీం
యదిమాం ధార్మికోరామో
నాసూయే న్మాతృఘాతుకమ్.'
అయోధ్య 78-22

తా. ధర్మస్వరూపుడగు శ్రీరామచంద్రుడు మాతృఘాతుకుడనని నన్ను నిందింపకుండునేని నేనే పాపచారిణియు దుష్టురాలునగు నీకైకేయిని జంపియుందును.

మంథరను జంపదలంచిన శత్రుఘ్నునితో భరతుడు పలికిన యీ క్రింది పలుకులు ఇందు గమనార్హములు.

శ్లో. ఇమామపి హతాం కుబ్జాం
యదిజానాతిరాఘవః
త్వాంచమాం చ హి ధర్మాత్మా
నాభిభాషిష్యతే ధ్రువమ్.
అయోధ్య 78-23

తా. ఈమంథరనైనను మనము చంపినట్లు వినునేని ధర్మాత్ముడు గావున శ్రీరామచంద్రుడు స్త్రీవధ గావించితిమని నీతోగాని నాతోగాని ఎంతమాత్రము భాషింపడు. ఇది నిశ్చయము.

పైపలుకులవలన శ్రీరామచంద్రుడు సోదరులయందే మాత్రము దోషము కనిపించినను ఓర్వజాలనివాడనియు, ధర్మముతో నవినాభావసంబంధము గలవాడనియు దెలియవచ్చుచున్నది. ఇచట శ్రీరామచంద్రుడు తమ్ములను ప్రేమించుటయందేగాక వారి శీల సంరక్షణమునందును నత్యంతబాధ్యతవహించియుండెనను సత్యము స్ఫురించుచున్నది.

సుగుణాభిరాముడగు శ్రీరామచంద్రుని హితులుమాత్రమే పొగడుచుండెడివారుకారు. శత్రుపక్షీయులు సయితము ఆ మహానుభావుని కీర్తించుచుండెడివారు. ఒకపరి తన బాణవేగమును-తనకోపమును-రుచిచూచిన వారును గూడ ఆయన ధర్మస్వరూపుడనియే కొనియాడిరి. ఇందులకు ఈక్రింది సన్నివేశమే దృష్టాంతము :

''మాయామృగమవై శ్రీరామచంద్రునుటంకింపు'' మన్న రావణునితో మారీచుడిట్లు పలుకుచున్నాడు. ఈమారీచుడిదివరకు శ్రీరామచంద్రునిచే గొట్టబడి తప్పించుకొని పారిపోయినవాడు; శ్రీరామచంద్రుని రూపమును నడవడిని కన్నారజూచినవాడు.

శ్లో. 'రామోవిగ్రహవాన్ధర్మ
స్సాధుస్సత్యపరాక్రమః
రాజాసర్వస్యలోకస్య
దేవానాం మఘవానివ. ఆరణ్య 37-13

తా. శ్రీరాముడు రూపుదాల్చిన ధర్మము. సత్పురుషుడు, సత్యపరాక్రముడు. దేవతలకందరకును ఇంద్రుడు ప్రభువగునట్లు ప్రజలకందరకును ప్రభుసత్తముడు.

'శ్రీరాముని కికురింపబోవేని నిన్నిపుడే చంపెద' నన్న రావణునితో మారీచుడు పలికిన పలుకులు గమనింపుడు.

శ్లో. మాం నిహత్యతు రామశ్చ
నచిరాత్త్వాం వధిష్యతి

అనేనకృతకృత్యోఽస్మి
మ్రియేయ దరిణా హతః ఆరణ్య-41-17

శ్రీరాముడు నన్ను వధించిన యనంతరము శీఘ్రముననే నిన్నును వధించును. ఇప్పుడు నీచే చచ్చుటకంటె శ్రీరామునిచే చచ్చుట వలన కృతార్థుడ నయ్యెదను.

చూచితిరా శత్రుపక్షమునందలివాడును రాక్షసాధముడును నగు మారీచుడు తాను శ్రీరామునిచే జచ్చుటవలన మోక్షమునంద గల నన్న తన దృఢవిశ్వాసమును బ్రకటించెను.

శ్రీరామచంద్రుని అడవులకు బంపుటకు కారణభూతురాలయిన కైకేయి సయితము శ్రీరాముని ఎంతగనో ప్రేమించి అతనియం దాదరాభిమానములు గలిగియుండెను. శ్రీరామచంద్రుని పట్టాభిషేక వార్త దుఃఖ వార్తగా గల్పించి చెప్పనచ్చిన మంథరను జూచి కైకేయి పలికిన పలుకు లరయుడు.

శ్లో. రామే వా భరతే వాహం
విశేషం నోప లక్షయే
తస్మాత్తుష్టాఽస్మి యద్రాజా
రామం రాజ్యేఽభిషేక్ష్యతి

శ్లో. న మే పరం కించి దిత స్త్వయా పునః
ప్రియం ప్రియార్హే సు వచం వచః పరమ్
తథా హ్యవోచ స్త్వ మతః ప్రియోత్తరం
పరంవరం తే ప్రదదామి తం వృణు.
అయోధ్య. 7-35, 36.

తా. నాకు భరతుడుగాని, రాముడుగాని ఇరువురు నొక్కటియే. నాకే భేదమును లేదు. దశరథుడు రాజ్యమునందు రామునకు పట్టాభిషేకము చేయింపబోవుచున్నాడని వినుటవలన నెంతయో సంతసించితిని. మంథరా, నీవు సంతోషమునకు తగినదానవు. ఈ రామాభిషేక వార్తకన్నను ఇతరమయిన ప్రియ తమ వార్తను నీవు నాకింక చెప్పజాలవు. అట్టి ప్రియవార్తను నీ విప్పుడు చెప్పితివి గావున నీకు అన్నిటికన్న నెక్కువగా సంతోషంబు గలిగించు వస్తువు నిచ్చెదను, కోరుకొనుము.

ఇక శ్రీరామచంద్రుని గూర్చి-అతనియందు మాత్సర్యము వహించిన - మంథర పలికిన పలుకులు గమనింపుడు.

శ్లో. విదుషః క్షత్ర చారిత్రే
ప్రాజ్ఞస్య ప్రాప్త కారిణః. అయోధ్య8-8

తా. శ్రీరాముడు మహాబుద్ధిమంతుడు, రాజనీతిని జక్కగా నెఱిగినవాడు, ఏకాలమున దేనిని చేయవలయునో అప్పుడే దానిని తప్పక చేయువాడు.

ఇట్లు రామాయణమును జదువుచు బోవుదుమేని శ్రీరామచంద్రుని గుణగణములు ప్రవాహమునందలి రత్నములవలె ప్రకాశించుచు పరువులు వారుచుండును. శ్రీరామచంద్రుడు పుత్రుడుగా, భ్రాతగా రాజుగా ఎట్లు జీవించెనో పయి యుదాహరణముల వలన మనకు విశదమగుచున్నది గదా! తమ్ముల ప్రేమించుటయందు ఎంతటి దయాళువో వారి శీలమును చక్కబెట్టుటయందును శ్రీరాముడంతటి సమర్థుడు. "లోకాభిరామం శ్రీరామం" అన్న వృద్ధవాక్యము సత్యసమ్మతముగదా! సమస్త రంగములయందును శ్రీరామచంద్రుడు శ్రేష్ఠుడు. అట్టి ఉత్తమస్థానము నలంకరించుటకు మనము మన శీలమును పదేపదే పరిశీలించుకొనుచు నందలి దోషముల చక్కబెట్టుకొనుచు జీవితమును సార్థకము చేసికొనుటకు ప్రయత్నింపవలయును.

ఈ విషయమున స్వయముగా పరబ్రహ్మ స్వరూపుడయిన శ్రీరామచంద్రుడే లక్ష్మణునికి దెలిపిన పరమార్థము గమనార్హము :

శ్లో. యావన్న పశ్యే దఖిలం మదాత్మకం
తావ న్మదారాధన తత్పరో భవేత్
శ్రద్ధాళు రత్యూర్జిత భక్తిలక్షణో
య స్తస్య దృశ్యోఽహ మహర్నిశం హృది.
శ్రీరామగీతా-58.

తా. మానవు డెంతవఱకు సమస్తప్రపంచమును లయముచేసి దాని కధిష్ఠానభూతుడ నయిన నన్ను దెలియకుండునో యంతపర్యంతము నన్నారాధింపవలయును. శ్రద్ధయు పరిశుద్ధ మయిన భక్తియు గలవాని హృదయమున రేయింబవలును నేను ప్రత్యక్షమగుచుందును. అట్లు నాయందు భక్తిగలిగి నన్ను సేవించినచో ఆ సత్పురుషుడు వివేక వైరాగ్యాదుల బడసి మదైక్యజ్ఞానము నందగలడు.

శ్లో. య స్సేవతే మా మగుణం గుణాత్పరం
హృదా కదావా యదివా గుణాత్మకమ్
సోఽహం స్వపాదాఞ్చిత రేణుభి స్స్పృశ
న్పునాతి లోకత్రితయం యథారవిః.
శ్రీరామగీతా-61.

తా. ఏ పుణ్యాత్ముడు నన్ను నిర్గుణునిగను, గుణాతీతునిగను తెలిసి పరిశుద్ధహృదయంబున నుపాసించునో అతడు నాయం దైక్యము నొందును. అతడు సూర్యుడు తన కిరణముల చేతంబోలె తన పాదరేణువులచేత ముల్లోక ములను పవిత్రము చేయును.

పరబ్రహ్మస్వరూపుడయిన శ్రీరామచంద్రుని పాదారవిందముల సేవించుచు ఆదర్శమానవు లమై జీవించి శ్రీరామ సాయుజ్యమునందుటకు ప్రయత్నింతము గాక.

శ్లో. ఆపదా మపహర్తారం దాతారం సర్వ సంపదామ్
రామం శ్రీరామం భూయో భూయో నమా మ్యహం.

## అ ను న య ము

(శ్రీ ఊర్మిళాభ్యుదయము)

**కవికిశోర, ఆంధ్ర కవిహంస మహాకవి, పుల్లకవి శేషగిరి రాయకవి.**

(సీతారామలక్ష్మణులు అరణ్యవాసమునకు వెళ్లిన తరువాత ఊర్మిళ విచారముతో నిద్రాహారములు మానినందున సోదరీమణులగు మాండవీశ్రుతకీర్తులు అనునయింతురు.)

మ. తగునే నీ కిటు చింతనొందఁ? దగవుల్ ధైర్యంబు గోల్పోయి నె
వ్వగచే దేహము నొవ్వఁజేసి పరితాపం బొందఁగా మేలె ? వ
మ్మగదే! యీ క్రియ బేలవైన బ్రదుకున్ మూఢత్వమే గాదె ? నీ
వగపుల్ నీవె దలంచుకొమ్మ స్థిరతల్ బాటించి భావమ్మునన్.

చ. ధరణి జనించు వారలకుఁ దప్పవు కీడును మేలు జంటగాఁ
బరఁగుచునుండు వారిఁదగు ప్రాకృతకర్మవశంబుచేత నె
త్తఱిని వివేకవంతు లతి ధైర్యముతో నవి యోర్చి మోద సం
భరిత మనస్కులయ్యెదరు, పామరు లందు నశింత్రు బేలలై.

ఉ. పుట్టితి మా విదేహ నృపపుంగవు వంశమునందు; దానిపై
మెట్టితి మీరఘూద్వహుల మేలి కుటుంబము గీర్తినొందఁ; జే
పట్టితి మమ్ము కార్యపరివర్ధిత మానవ భవ్యమూర్తులన్;
బుట్టినచోట, మెట్టునెడఁ బొందవలెన్ యశమెల్లభంగులన్.

ఉ. కాంతుఁడనంగ నింద్రియసుఖంబును గూర్చెడు యంత్రమంచు నీ
స్వాంతమునన్ దలంచి యెడఁబాటు సహింపఁగ లేక ముగ్ధవై
వంతను గుందె దీవకట! భావమచంచల లక్ష్యసిద్ధి న
త్యంతముఁ గూర్పఁగా సగుణ తత్త్వవిభావముగాదె భర్తయున్?

మ॥ పతినిన్ దైవముగాఁగఁ గొల్వవలె సద్భావంబుతో నాతియం
చిత భక్తిన్ గొనియంచుఁ బల్కు నుడులన్ జింతింపవో? భర్త నం
చిత రక్తిన్ హృదినుంచి శక్తిమెయి శాసింపంగ విన్నార ము
న్నతి మూర్తిత్రితయంబె యాత్మకును బ్రజ్ఞాదీప్తి సిద్ధించుటన్.

మ॥ పతిచెంతన్ వసియించు సాధ్వి చనవున్ బాటించి సేవాదిక
ప్రతతిన్ నాథు నలర్చుకొంట యొకటే భావించి యెవ్వేళ జీ
వితమెల్లన్ సగుణార్చనంబు కొఱకే వెచ్చింపఁగా నౌనుగా
ని తలంపన్ పరమాత్ము నిర్గుణప్రభా నిర్ణీతి సాధ్యంబొకో?

గీ. కోరుకొన్నట్టి వస్తువు దూరమైనఁ బ్రబలమగు వాంఛ దానిపైఁ బరగుచుండి
సాధనంబున దీక్ష విస్తారమగుచు, నవిరళంబైన కృషికిఁ బ్రోత్సాహమిచ్చు.

గీ. కోరికలడంచి, భావముఁగుదురుపఱచి, యింద్రియోద్వేగమునుమాన్పి యిహపరమ్ము
లందున నసూయ వెలయు జీవాత్మనెపుడు భవ్యపరమాత్మ సంయోగ పాత్రముగను
సిద్ధపఱుచుట దాంపత్య చిహ్నమగును.

చ. ఎఱుగనివార లెల్లపుడు నింద్రియ భోగములందు మున్గి కా
పురములు తీర్చి. తృప్తిఁగనఁ బోవక నిందును నందు సౌఖ్యముల్
కరవయి, గర్భవాస నరకమ్మున మ్రగ్గుచుఁ బుట్టి చచ్చుచున్
పురుగులబోలె జీవితముఁ బోవిడుచుందురు మాటిమాటికిన్.

గీ. సగుణ నిర్గుణరూప ప్రసన్నుఁడగుచుఁ గల్పవృక్షమ్ము సతులకుఁ గాంతుఁడనఁగ
నతఁడు దూరమ్ముగా నున్న నతివ కెపుడు, గలుగ దపచారమును ధ్యాన గరిమమించు
భవము తరియింప నది రాచబాట యగును.

ఉ॥ నిద్దురమాని భుక్తియును నీరము గొంటయు మాని దేహ మా
పద్దశ నొందఁజేసి దృఢభావము లేక కృశించు నంత నీ
వొద్ది గడించు దానవొ? యొకింత తలంపుము, ధర్మసాధనన్
పెద్దశరీర పోషణము; వృద్ధినొసంగెడు నద్ది బుద్ధికిన్.

ఉ. భౌతిక దేహమున్ దగిన పద్ధతి నిల్పుచు నిశ్చలమ్ముగాఁ
జేతమునందునన్ విభుని శ్రీపదరాజము లెంచి కొల్చు నా
నాతియె యామె భర్తకు ననంతసుఖంబిడు భావనా బలం
బాతత దీప్తితో జగతియందున వ్యాప్తమునొంది మించఁగన్.

గీ. భావనాశక్తి సృజియించు బ్రహ్మయెపుడు, భావపటిమను విష్ణుండు పరఁగఁ బ్రోచు
భావనాశక్తి సర్వ సౌభాగ్యము లిడు, భావవైరుద్ధ్యమే జగత్ప్రళయము సుమ.

# భరత మహిమ

## (కీ. శే.) మహోపాధ్యాయ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు

భరతుడు నందిగ్రామమునఁ బాదుకా ముఖమున రాజకార్యములు నిర్వర్తించుచుండెను. ఆతఁడు సూర్యోదయమునకన్న మున్న నిద్ర లేచి క్షత్రియోచితములైన కల్య కర్మముల నాచరించి ౮, ౯, గంటలకుఁ బాదుకాధిష్ఠితమైన సింహాసనమునొద్దకు వచ్చెడు వాఁడు. అక్కడఁ దన దర్శనమునకు వేచియున్న సామంతులకును, ఇతర జనులకును దర్శనమిచ్చి పాదుకలు ప్రమాణముగాఁ దన యంతరాత్మ కెవ్వి శాస్త్రవిహితములని తోఁచునో యట్టి యాజ్ఞలఁ బ్రతిపాదించి మధ్యాహ్నమునకు లోని కేఁగెడు వాఁడు. అప్పుడు ఋన్నివృత్తికొఱకైన యల్ప ఫలమూలముల భుజించి తక్కుకాలము పూర్వ రాజర్షి చరిత్రములు వినుటయందును, వేద శాస్త్ర పురాణప్రసంగములయందును, వృద్ధ జనులతోడం గాలమ్ము గడపుచుండెను. భ్రాతృ విరహ దుఃఖమువలనఁ గలిగిన శరీర వైవర్ణ్య మునకుఁ దోడు జటాధారణాదులవలననైన మార్పులవలన, భరతుని గుఱుతించుటయే యసాధ్యముగా నుండెను. అల్పాహారము వలనను, ఎన్నఁడు నలవాటులేని యితర వ్రత చర్యలవలనను, ప్రకృతి సుకుమారుఁడైన భరతుఁడు కృశించి తొల్త శల్యావశిష్టుఁ డయి నప్పుడు, ఈ నియమములు మార్చుకొనుమని మిత్రులు పెక్కు తెఱఁగుల బోధించిరి. కాని, రామునితోడి పునస్సమాగమ మగునంతదనుక, నీ నియమములవలన నేమైన నగుఁగాక వానిఁ ద్యజింపవలనుపడదనియు, రాజ్యాధికార యోగ్యుఁడైన యగ్రజుఁడరణ్యమున దపోవృత్తినుండఁ దాను భోగానుభవము సేయుట గురుద్రోహమనియుఁ జెప్పి భరతుఁడు తన పట్టు వీడకుండెను. భరతుని యుల్లాసముకొఱకు సామంతులు నాటకాదులు నృత్యాదులు పెక్కులు కల్పించుచుండిరి. కాని తాను రాజుగాఁడనియు బాదుకలు కార్యనిర్వహణము సేయుచున్నవనియుఁ జెప్పి తాను, అట్టివాని దర్శింపకుండెను. సుఖహేతువులైన వస్తుదర్శనములు గూడ భరతునకుఁ జింతనే గావించుచుండెను. 'జానకీసహితుఁడైన రామున కుండ వలసిన యీభోగములు నాకేల? ఆయన పాద ధూళి ధరించుటకుఁగూడ నే నర్హుఁడనుగాను' అని భరతుఁడు చెప్పుచుండెను. ఇట్టి మహానీయుని సాన్నిధ్యమునఁ రాష్ట్రమెల్ల ధర్మమయమై పోయెను. అహింసాపరులయిన మహార్షుల యాశ్రమములఁ గ్రూరసత్త్వములు జాతి వైరమునుదక్కి కరుణగలిగి యుండునని

మనము విందుముగదా! భరతరాజ్యమున నట్టిదియే ఘటిల్లెను. చోరులు దొంగతనము మానుకొనిరి. జారత్వమనునది దుష్కావ్యాలాపములయందుఁ జూడవలసినదే. స్వప్రయోజన పరత్వము నామమాత్రావశేషమయ్యెను. రాజభక్తి మిన్నందెను. 'భరతుని యాజ్ఞ' యన్నఁజాలును. అది బ్రహ్మాస్త్రమే. ధర్మము యొక్క శక్తి యప్రతిద్వంద్వమని యెల్లరకుఁ దోఁచిపోయెను. వర్ణాశ్రమాచారములు, గురుదేవతాభక్తి, వేదవిశ్వాసము, అన్నియును బ్రస్ఫుటములయ్యెను. ఇఁక సామంతరాజులు భరతుఁడన్న భగవచ్ఛబ్దమునకుఁ బర్యాయపదమని వాడుకొనఁ జొచ్చిరి. పుణ్యతీర్థావగాహనమునకన్నఁ, బుణ్యక్షేత్ర దర్శనమునకన్న, భరతునిజూచుట యెక్కువ ఫల మిచ్చునది యని ప్రజలు దలంపఁదొడఁగిరి. దండనీతితోఁ బనియే లేకపోయెను. ధర్మాతిక్రమణ మసాధ్యమయ్యెను.

భరతుఁడు నందిగ్రామమున రాజ్యము చేయుచుండెను. తొల్తటివిషాదవేగము కాలక్రమమున గొంత తగ్గినను రామసందర్శనేచ్ఛ భరతుని మనస్సును విడనాడక తాండవమాడుచుండెను, 'అరణ్యవాస మెప్పుడు పూర్తి యగునా? శ్రీరాముఁ డయోధ్యకు మరల నెప్పుడు వచ్చునా? చతురంగబల కోశవసుధాన్యములతోడ నేనీరాజ్యము నాయన కెప్పు డప్పగింపఁ గలుగుదునా?' యని భరతుఁడు దినములు లెక్కపెట్టుకొనుచుండెను. ఐన నొక్కదినమా? రెండుదినములా? పదునాలుగేండ్లు గడవవలయు!

చిత్రకూటమునుండి మరలివచ్చిన కొన్ని దినములవఱకు భరతునకు శ్రీరాముల వార్త తెలియుచుండెను. ఆవల వార్తలు వచ్చుటుడిగెను. ఆరణ్యకుల నెవ్వరి నడిగినను వారుచెప్ప నేరకుండిరి. రామలక్ష్మణు లేదిక్కున కేగిరో, యేమైరో యెవ్వరికిని దెలియకుండెను. వారు దండకారణ్యము ప్రవేశించినదిగాని, పంచవటికి వచ్చి యక్కడ శ్రీరాముఁడు సీతను గోల్పోయినదిగాని, పాపము! భరతున కేదియుఁ దెలియదు. సీతానిమిత్తమై రామ రావణులకుఁ బాటిల్లిన ఘోరసంగ్రామముగాని, యందు హనుమదాది సాహాయ్యమున శ్రీరామున కొదఁగూడిన జయముగాని, సీతాపరీక్షణము పరిగ్రహముగాని, భరతునకు నేమియుఁ దెలియదు. యథార్థములైన యిట్టి యుదంతములు దెలియకున్నను, శ్రీరాముఁడు సముద్రమును దాఁటి రావణునితోడి యుద్ధమున కుపక్రమించిన తర్వాత నపకారతత్పరులైన రక్కసులు కొన్ని మాయలు పన్ని భరతునకు సంశయ విషాదముల నెలయించుచుండిరి. ఒకపరి, దండశూకుఁ డను రాక్షసుఁడు మునివేషధారియై వచ్చి లక్ష్మణుఁ డరణ్యమునఁ గ్రూరసత్త్వముల పాలయ్యెనని చెప్పి మిక్కిలి యలజడి కలిగించెను. వేఱొక్కపరి, నింకొక్కఁడు శ్రీరాముఁడు రావణాసురునిచేత హతుఁడయ్యెనని నమ్మకము పుట్టఁబల్కి భరతునిఁ బ్రాయోపవేశముసేయింప నుద్యమించెను. ఇట్టి రాక్షసమాయలు దైవానుకూల్యమునబయల్పడి గార్యము మించుటకు మున్న మాయావులైన యచ్చెనఁటి రక్కసులే భ్రమందుచుండిరి. ౧౦ సంవత్సరములు—; ౧౧ సంవత్సరములు—; శ్రీరాముల వార్త దెలియకుండెను. పాపము; మన భరతుఁ డేమిసేయగలఁడు? పదునాల్గవ సంవత్సరముగూడఁ గడచిక్కుచుండెను. రామలక్ష్మణుల పోఁబడి లేదు.

(సశేషము)

# వారలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమఠము మదరాసు-4.

## శంకరరామానుజ జయంతి మహోత్సవములు

శ్రీ శంకరాచార్యులయు శ్రీ రామానుజాచార్యులయు జయంతులు ఈ సంవత్సరం (1970) మే నెల 10 వ తేదీనాడు సమకూడినవి. ఆనాడు శ్రీరామకృష్ణమఠంలో ప్రత్యేకపూజ నిర్వర్తితమైనది. శ్రీశంకరజయంతి సంబంధంగా పౌరమహాసభ మే నెల 24 వ తేది భానువారం వివేకానందహాలులో సమావేశమైనది. ప్రార్థనగేయం మంత్రపుష్పం ముగిసిన వెంటనే మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు సదస్యులకు స్వాగతమంగళం అనుగ్రహిస్తూ ఇలాగన్నారు. తత్త్వశాస్త్రప్రపంచంలో శ్రీ శంకరాచార్యులస్థానం అనన్యాదృశమైనది. వారి జీవితచరిత్రం వారిగ్రంథాలు ఈనాటికీ ప్రజలకు ఉత్తేజం కలిగిస్తున్నాయి. 8-వ 9-వ శతాబ్దాల క్లిష్టసమయంలో భారతదేశసముద్ధరణం కావించినవారు శ్రీశంకరులు. వేదాలను దేవాలయాలను సారస్వతమును భారతదేశంలో విలువగల సమస్తమును కాపాడి భద్రపఱచినవా రాయన. వారిభాష్యాలు అవిస్మరణీయములు. పరమార్థం తెలుసుకోగోరిన ఎవరుగాని శ్రీశంకరులను సమాశ్రయింపక తప్పదు. వారి తత్త్వశాస్త్రగ్రంథాలు ఉత్తమకావ్యాలుకూడ. సన్యాసులలో దశనామిసంప్రదాయంలోకానికి ఆయన ప్రసాదించిందే. ఆయన గొప్పసంస్కర్త, అమోఘప్రచారకుడు. కాబట్టి ఆయన సాధించిన కార్యాలు చరిత్రపై ప్రసరింపజేస్తున్న ప్రభావం ఇంతంత కాదు. భారతదేశైక్యాన్ని ఆయన సాక్షాత్కరించుకొన్నందుకు నిదర్శనాలు నలుమూలలలో ఆయన నెలకొల్పిన మఠాలే. శ్రీశంకరులలో భక్తినిష్ఠ జ్ఞాననిష్ఠకు తీసిపోదు. ఆయన భక్తిగంభీరతకు తత్ప్రణీతములైన స్తోత్రరాజములు తార్కాణములు.

మద్రాసు యూనివర్సిటీ తత్త్వశాస్త్రపరిశోధనాసంచాలకులైన డాక్టర్ టి. ఎమ్. పి. మహాదేవనుగారు ఆధునికలోకానికి ఆదిశంకరులు సంక్రమింపజేసిన ఆధ్యాత్మికవిజ్ఞాననిధులనుగూర్చి ఉపన్యసించారు. ప్రొఫెసరు కె. శేషాద్రిగారి వందనసమర్పణంతో నాటి కార్యక్రమం ముగిసింది.

వివేకానందహాలులోనే జూన్ నెల 7-వ తేదీ భానువారం నాడు శ్రీరామానుజజయంతి సంబంధంగా పౌరమహాసభ కూడినది. ప్రార్థనగేయం మంత్రపుష్పం ముగిసిన వెంటనే శ్రీరామకృష్ణవిజయ తమిళ పత్రికాసంపాదకులైన శ్రీమత్పరమాత్మానందస్వాములు నాటి వక్తకు సదస్యులకు స్వాగతాశీస్సులనుగ్రహిస్తూ ఇలాగన్నారు—పరిసరాలలో మానవమనఃప్రవృత్తులలో మార్పులు కలిగి ప్రాతవడిన సముదాచారాలస్థానంలో క్రొత్త సముదాచారాలు నెలకొంటున్నప్పుడు లోకకల్యాణనిర్వర్తనార్థం ఆచార్యు లవతరిస్తుంటారు. శ్రీరామానుజులవారి యవతారమును ఆయనకు ముందుండిన దివ్యసూరులు ముందుగనే సూచించారు. మానవచరిత్రలో భగవద్రామానుజులవారు యుగకర్త కావడంలో ఆశ్చర్యం లేదు. ఆయన సాధించిన ఘనకార్యాలు బహుముఖములు. ఆయన ఉభయవేదాంతి, మహాప్రతిభావంతులగు ముఖ్యశిష్యులు కలవాడు. యదార్థములైన బిరుదములు అనేకము లాయన కర్పితములై చరితార్థములైనవి.

రామానుజుల జీవితచరిత్రమును ఉపదేశాలనుగూర్చి డాక్టర్ వి. వి. రామానుజంగారు ఉపన్యసించారు. డాక్టర్ ఎస్. వేణుగోపాలం

గారి వందనసమర్పణంతో సభాకార్యక్రమం ముగిసింది.

## శ్రీవివేకానందస్వామికి స్మారకం

ప్రస్తుతం భారతదేశంలో పెక్కుచోట్ల శ్రీవివేకానందస్వామికి స్మారకములు నిర్మిస్తున్నారు. కన్యాకుమార్యగ్రమున కెదురుగా వివేకానందశిలపై ప్రారబ్ధమైన స్మారకనిర్మాణం పరిసమాప్తిని సమీపిస్తున్నది.

దక్షిణపుకొనన వివేకానందశిలవలెనే హిమాలయనగరమైన అల్మోడాలో స్వామిజీ సంబంధంచేత పరిపూతములైనవి అనేకములున్నవి. అల్మోడాపై స్వామీజీకి ప్రత్యేక ప్రేమ. మూడుపర్యాయములో ఇంకను ఎక్కువసార్లో ఆయన అక్కడికి విజయంచేసి ఆ నగరమును పవిత్రీకరించారు. కాబట్టి అల్మోడాలో సమర్థమైన స్మారక మొకటి నిర్మింపబడిందంటే ఎంతయు సమంజసమే. విశ్వమహాపురుషులుగా వెలుగొందేందుకు ముందు స్వామి పరివ్రాజకసన్యాసిగా పాదచారిగా నైనిటాలు నుండి అంతదూరం నడిచి వచ్చి అల్మోడాలో మహమ్మదీయుల సమాధుల మిట్టకు చేరుకునేటప్పటికి ఆకలిచేత దప్పిచేత ఆయన పరవశుడగుచుండెను. ఆ ఒలికిమిట్టవద్ద నున్న ఫకీరు చేత ఒకదోసకాయ తప్ప నే తేదియు లేదు. దాని నతడు స్వామీజీకి సమర్పించాడు. అది 1890 సంవత్సరపు వేసవి. భారతదేశసముద్ధరణానికి అధఃపతితుల పేదల సంక్షేమానికి తన జీవితము నర్పింపవలెననెడి అంతరాత్మప్రబోధము స్వామీజీకి కలిగింది అక్కడే అప్పుడే. ఏడేండ్లకు తరువాత 1897 లో వివేకానంద స్వామి అల్మోడాకు మరల విచ్చేశారు. అప్పటికాయన భారతదేశాధ్యాత్మికసందేశప్రవక్తగా ఖండఖండాంతరప్రశస్తి నంది యుండెను. పౌరులందఱు స్వామీజీకి గొప్పఊరేగింపు చేశారు. "ఊరేగింపు మహమ్మదీయుల సమాధులమిట్ట యొద్దకు వచ్చింది. మునుపటి ఫకీరు అక్కడే ఉన్నాడు. స్వామి అతనిని గుర్తించి గుఱ్ఱము మీద నుండి దిగి పరుగున పోయి కౌగిలించుకొని "ఒకనాడు నా ప్రాణమును కాపాడిన దితడు" అని అందఱి ఎదుట ఉద్ఘాటించారు. స్వామి అల్మోడాకు మూడవసారి విచ్చేసింది 1898 లో. అప్పుడాయనతోకూడ ప్రాచ్యపాశ్చాత్యశిష్యులు చాలమంది ఉండినారు.

కొన్నాళ్ళక్రితం అల్మోడా నగరప్రజలు ఒకపరిషత్తు నేర్పఱచారు. అల్మోడాలో శ్రీవివేకానందస్వామితో సంబంధపడినప్రాంతాలన్నిట తగినస్మారకములు నిర్మించాలని అందుకు ధనం సేకరించాలని ఈపరిషత్తువారి ముఖ్యోద్దేశాలు.

మహమ్మదీయుల సమాధులమిట్ట సమీపంలో ఒక చలువరాతివిశ్రాంతిభవనమును నిర్మించాలని మొకటనిశ్చయించుకున్నారు. స్మారకనిర్మాణపరిషదధ్యక్షులైన శ్రీజోషీ సేనుగారు 1970 మే 8-వ తేదీ శుక్రవారం నాడు శంకుస్థాపనం చేశారు. అప్పుడు శ్రీపూర్ణాత్మానందస్వామి వేదమును మౌలానా అబ్దుల్ వహాబుగారు కొరానును శ్రీ బి. ఎస్ మాస్సేగారు బైబిలును పారాయణం చేశారు. శ్రీవివేకానందస్వాముల విశ్వమానవసౌభ్రాత్రసందేశమును గూర్చి శ్రీజోషీసేనుగారు ఉపన్యసించారు. పరిషత్ కార్యదర్శి శ్రీహరికిషన్ లాల్ షాగారు స్మారకనిర్మాణానికి హృదయపూర్వకంగా సహకరించాలని సదస్యులకు విన్నవించారు. అలహాబాదు రామకృష్ణమిషను సెక్రటరీ శ్రీవ్యోమానందస్వామి అల్మోడానగర చారిత్రికాధ్యాత్మికప్రాముఖ్యాన్ని ప్రస్తుతించి "ఈసమీపంలోఒకగుహాలో ధ్యానసమాధిలో

జీవితశేషం గడపాలని శ్రీవివేకానందస్వామి లభిలషించారు. కాని విశ్వమానవసముద్ధరణకై జీవితము నంకితమును చేసికోమని ఆయన ఆజ్ఞప్తుడైనాడు. ఇదే ఆజ్ఞ ఆయనకు కన్యాకుమారిఅగ్రంవద్దనుఅందింపబడింది.'' అన్నారు జిల్లా మేజిస్ట్రేటు శ్రీమాతాప్రసాదుగారు వివేకానందస్వాములు కోరినట్లుగా ప్రజలలో ఐక్యం పెంపొందాలి'' అన్నారు.

ఉదారమహాజనులు శ్రీవివేకానందస్వాముల పట్ల భక్తిని కృతజ్ఞతను చరితార్థ మొనర్చుకొంటూ స్మారకనిర్మాణాలకు విరాళము లిచ్చి తోడ్పడవలసిం దని పరిషతువారు ప్రార్థిస్తున్నారు. విరాళాలు అందింపవలసిన విలాసం శ్రీగోపాల్‌షా, ట్రెజరర్, స్వామి వివేకానంద మెమోరియలు కమిటీ, అల్మోడా, ఉ.ప్ర.

పూర్ణాత్మానందస్వామి
అల్మోడా శ్రీరామకృష్ణ కుటీరాధ్యక్షుడు

జోషీ సేను
వివేకానందస్వామి మెమోరియలుకమిటీ
ప్రెసిడెంటు
అల్మోడా. ఉ.ప్ర.

# గ్రంథ పరిచయం

## శ్రీసప్తశ్లోకి భగవద్గీత

ఇందు భగవద్గీతనుండి ఏడుశ్లోకాలు గ్రుచ్చబడి ఉన్నాయి. వానికి కళింగపట్నం గీతాకుటీరం పరమహంస పరివ్రాజకాచార్య త్రిదండి శ్రీరామానుజజీయరుస్వామివారు పదవిభాగ ప్రతిపదార్థ, తాత్పర్యాలను ఇందు అనుగ్రహించియున్నారు. ఇది ఆర్షసాహితివారి 18 వ ప్రచురణం. ప్రాప్తిస్థానం: ఆర్షసాహితి, సనాతన ధర్మప్రచారసంస్థ, 25-7-18 ఆమంచివారి వీధి, విజయనగరం 2. దీనికి వెల లేదు. వలయువారు తపాలాఖర్చులకై 20 పైసలు పంపిన చాలును. చిన్నసైజు, మంచిఅచ్చు, ఆకర్షకమైన తయారింపు.

## చెంగల్పట్టు రామకృష్ణమిషను విద్యాలయ హైస్కూళ్ళ క్యాలెండరు 1970-71

వ్యవస్థాపక ప్రిన్సిపాలు శ్రీ టి. ఇ. వి. శర్మగారు అపూర్వమైన పద్ధతిలో క్యాలెండరును రూపొందించియున్నారు. పుస్తకరూపమున కాక, స్కూలు క్యాలెండరు గోడకు తగిలించుకోదగిన రూపంలో తయారు చేయబడి ఉంది. తొలిపుటలో ధ్యానసమాధి స్థితిలోని శ్రీరామకృష్ణపరమహంసదేవుని చిత్రం కంటికి చల్లగా అమర్చబడిఉంది. విద్యాలయాల అధికారవర్గాలనుగూర్చిన వివరాలు అక్రిందే పొందుపఱుబడిఉన్నాయి. లోపలి పుటలలో ప్రతిదానిలోను శ్రీశారదా రామకృష్ణవివేకానందుల చిత్రపటాలతోను వారి సూక్తిరత్నాలతోను రెండేసి నెలల తేదులు ఉత్సవవిశేషాలు పొందుపఱుపబడియున్నవి. జనవరినుండి డిసంబరువఱకు ఉండే 12 నెలల క్యాలండరు కాదిది. 1970 జూను నుండి 1971 ఏప్రిలు వఱకు నుండు పదకొండు నెలల క్యాలండ రిది. చూస్తే పదిలపఱచుకోవాలనిపిస్తుందే కాని, ఏ పేజిని కాని చించిపాఱవేయ బుద్ధి రాదు. ప్రభాకర్

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీరామకృష్ణ మిషన్ (సేవాసంస్థ): తదాదర్శములు: కార్యావళి

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

ప్రప్రథమమున శ్రీరామకృష్ణమిషన్ ఎట్లు స్థాపింపబడినదియు, ఆ సంస్థయొక్క ఆదర్శములు, అది కావించుచున్న సేవాకార్యావళియు నిందు వివరముగ దెలుపబడియున్నవి.

54 పుటలు వెల : 50 పైసలు

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౦ - ఆగస్టు : సాధారణ - శ్రావణము సంచిక ౨

## విషయసూచిక



ఫోన్ : 71231 **శ్రీ రామకృష్ణప్రభ** పోస్టు బాక్సు : 635

1. 1970 జూలై నుండి శ్రీరామకృష్ణప్రభ ఇరవైఏడవసంపుటం జరుగుతూ ఉంది.
2. చందావివరాలు : ఇండియాలో రూ. 5-00 ; సిలోనులో రూ. 7-00. విడిసంచిక 50 పైసలు.
3. చందాదారులు జాబులలో తమచందాదారుసంఖ్యను చిరునామాను స్పష్టంగా వ్రాయాలి.
4. సంచిక అందకపోతే వారంరోజులలో తెలియజేయాలి.
5. మేము ప్రచురించిన తెలుగుగ్రంథాలలో అనేకములు శ్రీరామకృష్ణప్రభ చందాదారులకు తక్కువవెలకు అందజేయబడును. వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి.
6. శ్రీరామకృష్ణప్రభ ప్రముఖసంస్కృతికేంద్రాలలో ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మికవిజ్ఞానపత్రిక. అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకం. రేట్లకు వ్రాయండి.
7. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపాలని గ్రంథకర్తలకు, ప్రకాశకులకు మా ప్రార్థన.

తక్కిన వివరాలకు ఈ చిరునామాకు వ్రాయండి :—

మేనేజరు : శ్రీరామకృష్ణప్రభ ఆఫీసు, శ్రీరామకృష్ణమఠం, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని ... ము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితా మాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (స్టేట్స్‌మన్: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7.50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2.50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

'అఖిలవిభు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౦ - ఆగస్టు : : సాధారణ - శ్రావణము { సంచిక ౨

శ్రీః

## వివేకచూడామ

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

అవతారిక—గ్రంథపువిలువకు 'వివేకచూడామణి' అను నామమే వ్యాఖ్యానము. అద్వైతవేదాంతప్రతిపాదకగ్రంథములలో దీని కిదే సాటి. హిమవన్నగోన్నతమును మహార్ణగాధమునగు శ్రీశంకరులమహిమ ఈ గ్రంథముగ రూపొందె ననుట మితోక్తి. విషయగాంభీర్యమునకును ఉక్తిసారళ్యమాధుర్యములకును ఈ గ్రంథమున కుదిరియున్న పొందిక లోకోత్తరమైనది.

> సర్వవేదాన్తసిద్ధాన్తగోచరం త మగోచరమ్
> గోవిన్దం పరమానన్దం సద్గురుం ప్రణతో ఽస్మ్యహమ్. 1

ఆచార్యులవారు ఈశ్లోకమున గురువునకును పరబ్రహ్మమునకును అభేదము నధ్యవసించియున్నారు. కావున శ్లోకతాత్పర్యమును రెండువిధములుగ చెప్పవచ్చును :—(1) సర్వోపనిషత్సిద్ధాంతరహస్యజ్ఞులును, ఎవరిప్రశంసలపైని కోర్కి లేనందున మఱుగున నుండువారును, బ్రహ్మానందానుభోక్తలును, పరిమితలక్షణాంచితులును, అజ్ఞానతమోహారులును అగు శ్రీగోవింద భగవత్పాదులకు ప్రణమిల్లుచున్నాను. (2) సర్వవేదాంతసిద్ధాంతసంవేద్యమును, ప్రత్యక్షాది ప్రమాణముల కందనిదియు, ఆనందస్వరూపమును అజ్ఞానతమోహారిజ్ఞానస్వరూపమును, గోవిందభగవత్పాదరూపమున నన్నేలుకొన్నదియు నగు పరబ్రహ్మమునకు ప్రణమిల్లుచున్నాను.

జన్తూనాం నరజన్మ దుర్లభ, మతః పుంస్త్వం, తతో విప్రతా,
తస్మా ద్వైదికధర్మమార్గపరతా, విద్వత్త్వ మస్మా త్పరమ్,
ఆత్మానాత్మావివేచనం, స్వనుభవో, బ్రహ్మాత్మనాసంస్థితి,
ర్ముక్తి ర్నో శతజన్మకోటిసుకృతైః పుణ్యై ర్వినా లభ్యతే. 2

ప్రాణులకు వివేకమహితమైన నరజన్మ దుర్లభము. అంతకంటె వేదాధ్యయనాధికారసంపన్నమగు మగపుట్టుక దుర్లభము. బ్రహ్మవిచారమునకు సమగ్రావకాశ మిచ్చు సన్న్యాసాశ్రమస్వీకారమున కర్హత కలిగించు బ్రాహ్మణత్వము, మగపుట్టుకకంటె దుర్లభము. బ్రాహ్మణత్వమునకంటె వేదోక్తధర్మానుష్ఠానాసక్తి దుర్లభము. ధర్మానుష్ఠానాసక్తికంటె వేదశాస్త్రాది పాండిత్యము దుర్లభము. ఆపాండిత్యమునకంటె ఆత్మానాత్మవివేకమును, జీవబ్రహ్మైక్యపరిజ్ఞానమును, బ్రహ్మాభూయ మనెడి జీవన్ముక్తదశయు యథోత్తరము దుర్లభతరములు. కోట్లకొలది జన్మములలో చేసిన యనంతపుణ్యపరిపాకమున గాని జీవన్ముక్తదశ లభింపదు. ౨

దుర్లభం త్రయ మే వైత ద్దేవానుగ్రహహేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః. 3

ఈ క్రింది మూడును ఈశ్వరానుగ్రహభాజనులకు మాత్రమే లభించును. ఇతరుల కివి దుర్లభములే. ఏవి యనగా, 1. మానవజన్మ, 2. ప్రాప్యమగు మోక్షమునం దభిలాష. 3. ప్రాపకులగు మహనీయులప్రాపు. 3

లబ్ధ్వా కథఞ్చి న్నరజన్మ దుర్లభం తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్
య స్త్వాత్మముక్త్యై న యతేత మూఢధీః స ఆత్మహా స్వం వినిహ న్త్యసద్గ్రహాత్. 4

ఎంతో ప్రయాసపడి, దుర్లభమైన మానవజన్మను అంతకంటె యథోత్తరము దుర్లభతరములగు పురుషత్వము బ్రాహ్మణత్వము వేదశాస్త్రపాండిత్యము అనువానిని బడసియు, దేహేంద్రియ - పుత్త్రమిత్రకళత్ర-గృహారామ విత్తప్రముఖములను అసత్తులని గుర్తింపక వానికై పాటుపడుచు, తనముక్తికై ఎవడు ప్రయత్నింపకుండునో అతడు మూఢబుద్ధియు ఆత్మఘాతుకుడు నగును. ౪

ఇతః కో ఽన్వస్తి మూఢాత్మా య స్తు స్వార్థే ప్రమాద్యతి
దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్. 5

మనుష్యదేహము దుర్లభము. అంతకంటె దుర్లభము పురుషజన్మము. వీనిని బడసియు, సంసారబంధమునుండి విడుపొందుట యనెడి స్వార్థమున ఎవడు ఏమరియుండునో వానికంటె మూఢాత్ముడు వే రెవడు? ౫

వదన్తు శాస్త్రాణి యజన్తు దేవా‌న్ కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః
ఆత్మైక్యబోధేన వినా విముక్తి ర్న సిద్ధ్యతి బ్రహ్మశతాన్తరే ఽపి. 6

శాస్త్రములనేకరువుపెట్టుదురుగాక, కర్మల నాచరింతురుగాక, వేల్పుల నాశ్రయింతురుగాక, ఆరాధింతురుగాక, ఆత్మైక్యజ్ఞానము గలుగనిదే కల్పశతములకైనను విముక్తి సిద్ధింపదు. ౬

అమృతత్వస్య నాశాస్తి విత్తే నే త్యేవ హి శ్రుతిః
బ్రవీతి, కర్మణో ముక్తే రహేతుత్వం స్ఫుటం యతః. 7

విత్తముచే అమృతత్వము కలుగు నను ఆసపాటు లేదని కదా వేదము చెప్పుచున్నది. కావున కర్మలు మోక్షహేతువులు కాజాలవనుట స్పష్టము. ౭

అతో విముక్త్యై ప్రయతేత విద్వా‌న్ సన్న్యస్తబాహ్యార్థసుఖస్పృహస్సన్
సన్తం మహాన్తం సముపేత్య దేశికం తేనోపదిష్టార్థసమాహితాత్మా. 8

కావున విద్వాంసుడు, బాహ్యవిషయసుఖములందు ఆశను పూర్తిగా వదలుకొని, ఉదారుడు నున్నతుడు నగు సదాచార్యు నాశ్రయించి, అతడుపదేశించిన పరమార్థమందు మనసుంచి, విముక్తికై పాటుపడవలయును. ౮

ఉద్ధరే దాత్మ నాత్మానం మగ్నం సంసారవారిధౌ
యోగారూఢత్వ మాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా. 9

జీవుడు యోగారూఢదశ నొంది, ఆత్మసాక్షాత్కారనిష్ఠమైన మనస్సుతో తన్ను సంసార సాగరమునుండి సముద్ధరించుకోవలయును. యోగారూఢదశ యనగా ఇంద్రియార్థములందును కర్మములందును ఆసక్తి లేకుండు దశ, సర్వసంకల్పముల విడనాడిన దశ. ౯

సన్న్యస్య సర్వకర్మాణి భవబన్ధవిముక్తయే
యత్యతాం పణ్డితై ర్ధీరై రాత్మాభ్యాసఉపస్థితైః. 10

ఆత్మసాక్షాత్కారమును గోరిన పండితులు ధీరులు భవబంధవిముక్తికై సర్వకర్మసన్న్యాసపూర్వకముగా యత్నింపవలయును. ౧౦

చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే
వస్తుసిద్ధి ర్విచారేణ న కిఞ్చి త్కర్మకోటిభిః. 11

కర్మలచే చిత్తశుద్ధి గలుగునే కాని బ్రహ్మసాక్షాత్కారము గలుగదు. 'నేతి నేతి' 'ఇది కాదు, ఇది కాదు' అని వివేచించుకొనుచుపోయిన బ్రహ్మసాక్షాత్కారసిద్ధి గలుగును. ఆసిద్ధి కోట్లకొలది కర్మల నాచరించినను గలుగునది కాదు. ౧౧

సమ్యగ్విచారత స్సిద్ధా రజ్జుతత్త్వావధారణా
భ్రాన్త్యోదితమహాసర్ప భవదుఃఖవినాశినీ. 12

త్రాడును జూచి 'పెనుబా' మని భ్రమించినప్పుడు గల్గిన దుఃఖము—చక్కని విచారణమూలముగా 'పెనుబాము కాదు, త్రాడే' అను నిశ్చయము కుదిరినవెంటనే—పటాపంచలగును. ౧౨

అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితోక్తితః
న స్నానేన, నదానేన, ప్రాణాయామశతేన వా. 13

ఆత్మస్వరూపజ్ఞానము ఆప్తవాగనుసారము స్వయముగా జరుపు విచారణమూలముగా గలుగునే కాని, పుణ్యతీర్థములందు క్రుంకుటచే గాని దానములచేగాని నూఱుపర్యాయములు ప్రాణాయామము సేయుటచే గాని కలుగదు. ౧౩

అధికారిణ మాశాస్తే ఫలసిద్ధి ర్విశేషతః
ఉపాయా దేశకాలాద్యాః స న్త్యస్మి న్సహకారిణః. 14

మోక్షఫలసిద్ధికి ముఖ్యకారణము సాధకుని యధికారము (= యోగ్యత), సహకారికారణములు దేశము కాలము మున్నగునవి. ౧౪

అతో విచారః కర్తవ్యో జిజ్ఞాసో రాత్మవస్తునః
సమాసాద్య దయాసిన్ధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్. 15

బ్రహ్మజ్ఞానులలో వరిష్ఠుడును దయాసముద్రుడు నగు గురువును యథావిధిగ ఆశ్రయించి జీవబ్రహ్మవిచారమును సాగింప వలయును. ౧౫

మేధావీ పురుషో విద్వా నూహాపోహవిచక్షణః
అధికా ర్యాత్మవిద్యాయా ముక్తలక్షణలక్షితః 16

ఒకసారి తెలిసికొన్న విషయముల నిక నెన్నడు మఱవని ప్రతిభయు, పురుషజన్మమును, శాస్త్రాదిపాండిత్యమును స్వమతస్థాపనపరమతఖండనదక్షతయు, పైనిచెప్పిన లక్షణములెల్ల గలవాడు, ఆత్మవిద్యాభ్యాసమునకు తగిన యధికారి. ౧౬

[సశేషము]

# శ్రీరామకృష్ణానందస్వామికి శ్రీ వివేకానందస్వాముల లేఖ ఒకటి

అమెరికా సంయుక్తరాష్ట్రములు
ఏప్రిలు 11, 1895

నా ప్రియశశి,

...వ్యాధినుండి తేఱుకొంటి వని వ్రాసితివి. కాని ఇకమీద నీవు చాల జాగ్రత్త కలిగి యుండవలెను. అకాలభోజనములు అపథ్య భోజనమును దుర్గంధభూయిష్ఠములగు స్థలములలో వసించుట - ఇవి, పోయిన వ్యాధిని మరల రప్పింపవచ్చు. అప్పుడు మన్నెజర్వపు పట్టునుండి విడుపొందుట కష్టము కావచ్చు. మొట్టమొదట నీవు చుట్టును తోటగల చిన్న యింటిని బాడుగకు తీసికొనవలయును. అట్టి యిల్లు నీకు ముప్పది నలువది రూపాయలకు దొరకవచ్చు. రెండవ విషయము : వంటకు త్రాగుటకు ఉపయోగించు నీటిని వడియబోయవలెను. వడియగట్టుటకు వెదురుతో చేయబడిన సాధనము పెద్దది చాలును. అన్ని రకముల వ్యాధికిని నీరే ప్రాణము. నీటిలో నుండు క్రిములే రోగములకు కారణములు. అంతే కాని నీటిమురికియు తేటదనమును కావు. నీటిని కాచి వడియకట్టవలెను. మీ రందఱును మొట్టమొదట మీ యారోగ్యమును గూర్చి జాగ్రత వహింపవలయును. ఒవవంటవాడు, ఒకపనివాడు, పరిశుభ్రములైన పాన్పులు, సకాలభోజనము - ఇవి యెంతయు ఆవశ్యకములు. దయచేసి యీ సలహాలన్నియు సమగ్రముగ జరుగునట్లు చూడుము ... నీ ఉద్యమముల విజయము పూర్తిగా మీ పరస్పరానురాగములపై నాధారపడియుండును. ద్వేషము అసూయ దురహంకారము అనునివి ప్రధానములై యున్నంతవఱకు భవిష్యత్కాలమున మంచి కలుగదు...కాళి వ్రాసిన చిన్న పుస్తకములో అతిశయోక్తు లేవియు లేవు. దాని నతడు చాల చక్కగా వ్రాసియున్నాడు. చాటున ఇతరులను దూషించుట పాపమని తెలిసికొనుము. దానిని నీవు పూర్తిగా మానుకొనవలయును. మనసునకు పెక్కు విషయములు స్ఫురింపవచ్చు. కాని వానిని నీవు బయటికి చెప్పుటకు ప్రయత్నించినపుడు నీ మనస్సు గోరంతలను కొండంతలనుగ జేయును. నీవు మన్నించుచు మఱచిపోవుచు నుందువేని అన్నియు సమసిపోవును. శ్రీరామకృష్ణుని జయంతిమహోత్సవము అత్యంతవైభవముతో జరుపబడినదనుట శుభవార్త. పైసంవత్సరము లక్షమంది ప్రజలు సమావేశ మగునట్లు నీవు ప్రయత్నింపవలెను. మీ అందఱి శక్తిసామర్థ్యములను కలుపుకొని ఒకపత్రికను ప్రారంభింపుడు. బిడియము ఇక పనికి రాదు... అనంతశాంతియు అనంతశక్తియు ఆధారముగ గలవాడు మాత్రమే విజయ మొందును. చదువునందు నీవు ప్రత్యేకశ్రద్ధ వహింపవలయును. తెలిసినదా? మూర్ఖులను పెక్కుండ్రను గుమిగూర్ప రాదు. అల్పసంఖ్యాకులైనను యథార్థమానవులను నీ వొక్కటిగా చేర్చిన నేను సంతోషింతును. ఒక్కడైనను నోరు తెఱచి మాటాడుట నా చెవిని బడ లేదే? ఏల? ఉత్సవమప్పుడు నీవు తియ్యనిబండములను పంచిపెట్టితివి. కొన్నిజట్లవారు, చాలవఱకు సోమరులు, కొన్ని పాటలు పాడిరి, నిజమే. కాని ఆధ్యాత్మికాహారము నీ వేమి వడ్డించితివో నా చెవికి రాలేదే? దేనినిగాని ప్రశంసింపకుండు, ఎందుకుగాని ఆశ్చర్యపడకుండు, ఆ వైఖరి తొలగకుండునంతవఱకు నీ వేమియు చేయలేవు. మీ కెవరికిని ధైర్య ముండదు. వదరుబోతులు ఎల్లప్పుడును పిఱికిపందలు.

ప్రతియొక్కనిని సానుభూతితో చేరదీయుము. అతనికి శ్రీరామకృష్ణునిలో నమ్మకముండనీ లేకపోనీ. ఎవడైన మీతో రి తజగడ

మునకు వచ్చునేని మర్యాదగా ఆవలికి తొలగి పొండి ... అన్ని వర్గముల ప్రజలయందును మీ సానుభూతి తప్పక కననగుచుండవలెను. మూల భూతములైన యీ సుగుణరాజములు నీలో కననైనపుడే అత్యంతశక్తితో నీవు పాటుపడ గలిగియుందువు. అట్లు కాకున్నచో వట్టిగురు నామజపము పనికి రాదు. ఐనను ఈ సంవత్సరము మహోత్సవము అధికవిజయవంతముగనే జరిగిన దనుటకు సందేహము లేదు. అందుకై నీవు ప్రత్యేకముగ అభినందనార్హుడవు. కాని నీవు ముందంజ వేయవలెను. గుర్తించితివా? శరత్తు ఏమిచేయుచున్నాడు? ఏమియు తెలియదు ఏమియు తెలియదు అనియే చెప్పుచుందువేని, ఎన్నటికిని ఏమియు నీవు తెలిసికొనజాలవు...మనకు కావలసినది ఉదాత్తధోరణి కలది. అది పండితుల బుద్ధికెక్కును. కేవలము పాటకులజట్లను తయారుచేయుట మున్నగునవి పనికి రాదు. ఈ యుత్సవము గురుదేవుని జ్ఞప్తికి తెచ్చునదగుటే కాక ఆయన సిద్ధాంతముల గాఢప్రచారమునకు కేంద్రసంఘము అగును ... సమస్తమును సకాలమున సమకూడును. కాని అప్పుడప్పుడు నేను దెబ్బతిన్న కుక్కవలె చిందులు త్రొక్కుదును. చిటచిటలాడుదును. పదండి ముందుకు. పదండి పైకి- ఇదే నా సనాతనసాంకేతికసూక్తి. నేను క్షేమముగ నున్నాను. త్వరపడి భారతదేశమునకు వచ్చిన ఏ యుపయోగము నుండదు. మీ శక్తుల నన్నిటిని పైకి రప్పించుకొండి. హృదయపూర్వకముగ పారమార్థికముగ కార్యమునకు పూనుకొండి. అది నిజమైన వీరలక్షణము.

—భవదీయ ప్రేమయుత వివేకానంద

# సాంత్వన సూక్తులు

ప్రతికూలపరిసితులనుండి బయటబడుటకు దారి తెలుచు సాంకేతికపదము 'సంతృప్తి' అనున దొక్కటే. దేవుడు సౌజన్యసింధువు. సమస్తమునకును కర్త ఆయనయే. ఆయన మంచినే చేయును కాని చెఱుపు చేయజాలడు. ఇదే అన్నిమతములు చేయు బోధన. ఆబోధన నవలంబింపుడు. చిత్తశాంతి తనంతట కుదిరి తీఱును. ఎవనిమనసులోనికిగాని వైరాగ్యమును బలాత్కరించి చొప్పించుట మనకు సాధ్యము కాదు. అందఱును సన్న్యాసులుగను సన్న్యాసినులుగను అగుట కుద్దేశింపబడినవారు కారు. నిర్వర్తింపవలసిన పని ఎవనిది వాని కున్నది. దేవుడతని నీలోకమునకు పంపుట అందుకే. అందఱితో సమరసభావము గలిగి పనులు చేసికొనుడు. ధన్యులు కదా శాంతిసంస్థాపకులు. ఏల యన దేవునిబిడ్డలనిపించుకొనువారు వారే.

ఆపదలు చుట్టుకొన్నప్పుడు ధైర్యము కోల్పోరాదు. 'మా కింక నింకను కష్టములను గల్గించుచుండు' మని పాండవులతల్లి, కుంతి, శ్రీకృష్ణుని ప్రార్థించిన దట. ఏల యన కష్టములందున్నప్పుడు మాత్రమే మనము భగవంతుని స్మరించుచుందుము ... ఎలప్రాయమున ఇంద్రియములు అదుపుతప్పుట సహజము. అవి నిన్ను బానిసగ చేసివైచికొనకుండునట్లు నీవు స్థైర్యము నలవఱచుకోవలయును. యువకులకు ముఖ్యశత్రువు కామము. మగువల నందఱిని మాతృస్వరూపిణులుగ సాక్షాత్కరించుకో.

మనస్సును సదా శ్రీకృష్ణభగవానునందు నిల్పి, శారీరకమానసిక కర్తవ్య నిర్వహణమున దీక్షితుడవు కమ్ము. మనస్సును సదా దేవునిపై నిల్పుట సాధ్యము కాకున్ననో దేనిపైనో ఒక దానిపై నిల్పియుంచుట వివేకము. ఆలాగు తర్ఫీదైన మనస్సును శ్రీకృష్ణుని చరణార విందములపై నిలుపుట అంతగా కష్టము కాదు. నీ వొక దేవుడ వని ఇంద్రియములకు నియంత వని తెలిసికో. నీ వేల ఇంద్రియములను నీపై దురధికారమును చెలాయింపనీయవలయును? సత్త్వహీనుని దుర్జనులు రాపాడుదు రనుట అటుండనీ, అతని దుష్ప్రవణతలే అతనికి హాని గూర్చుచుండును. శరీరదార్బల్యమెంత చెడుగో మనోదార్బల్యమును అంత చెడుగే.

ప్రతికూలపరిస్థితులు ముంచుకవచ్చినప్పుడు నిర్విణ్ణులమై మేము శ్రీరామకృష్ణుని దరియు దుము. ఆయన మ మ్మిట్లూరడించెడివాడు—“కమ్మరి అంగడిలోని దాగలిస్వభావమును అనుకరింపుడు. కమ్మరివాడు ప్రొద్దస్తమానము దాగలిని సమ్మెటతో లెక్కలేనన్ని పర్యాయ ములు మోదుచుండును. అదేమో ఎప్పుడును కదలక చెదరక ఒక్కతీరు నిలుకడలోనే యుండును. ఈ లోకమున మీరును మాటి మాటికిని సమ్మెటవ్రేటులకు గురికావచ్చు. కమ్మరివాని దాగలివలె వ్రేటునకు వెనుదీయ కుండుడు. సర్వేశ్వరుని క్షాంతియందును దయయందును గట్టినమ్మకము గలిగియుండుడు. ఐహికదుఃఖసంకటములు మి మ్మేమియు చేయ జాలవు. మిమ్ము వెఱగుపఱుపజాలక, అవి తామే వెఱగుపడిపోగలవు. సదా భగవ ద్గీతను తోడ్పఱచుకొండి. ఎప్పుడును సంతోష ముతో ఉండుడు. ఈ ఆత్మ నిత్యముక్తము, ఆనందపూర్ణము. దానిని దుఃఖనిరుత్సాహము లకు వశపడనీయకుడు.’

నీయత్నము లొక్కటియు నెగ్గ లే దని మొఱపెట్టుకొన నక్కఱ లేదు. అందఱిసంగ తియు అంతే. పుట్టుకతోనే పరిపూర్ణతసిద్ధింప గన్నవారు, మహాత్ములు, అత్యల్పసంఖ్యాకులు మాత్రమే తాము పవిత్రదేహుల మని పవిత్రచిత్తుల మని పవిత్రచర్యుల మని బల్ల గ్రుద్ది చెప్పుకోగలరు. సర్వలోకనాథుడైన భగవంతునిమీది ప్రేమ ఎప్పుడును విస్మృతము కాకూడదు. అ దొక్కటే మనము మెలకువ వహింపవలసిన విషయము. కావున ధైర్యము వహింపుము. జాఱుపాట్లు తఱచు గల్గినను పైమెట్టెక్క ప్రయత్నించుచునే యుండుము. ప్రతిశిశువును నడక నేర్చుకొనుటకు ముందు లక్షసారు పడుచుండును. పాటుపడువారికి దేవుడు తప్పక సాయపడును. నమ్ము.

మానవు డెంత చెడ్డవాడుగనైన నుండును గాక. లోకమంతయు నతనిని పరిత్యజించును గాక. దేవుడుమాత్రము పరమభక్తు నెంతగా ప్రేమించునో దుర్జనునికూడ అంతగా ప్రేమించు నని గట్టిగా తెలిసికో. కుమారు డెదిగి హంత కుడుగ పరిణమించినను అతనిమీద నతని తల్లి కుండు ప్రేమ తఱుగదు. అట్లే యుండును. అందఱు తల్లుల ప్రేమకారుణ్యములను కలిపినను దేవుని ప్రేమ కారుణ్యములలో కళాంశమైనను కాదు. దేవుని ప్రేమానుగ్రహముల విషయమున నమ్మకము నెన్నడును కోల్పోకుము. అత్యంత నికృష్టపాపులపైనైనను ఆయన సదా తన కన్నుంచియుండును. ఈ సంగతిని గుర్తుంచు కొని హాయిగ నుండుము.

నిన్ను గూర్చి అసంతృప్తిపడకు. నీవు దేవుని బిడ్డవు. నిన్ను గూర్చి అసంతృప్తిచెందుట దేవుని బిడ్డనుగూర్చి అసంతృప్తి చెందుటే. అది తప్పుకదా! నిన్ను ఆదరించుకో, ఏలయన భగవం

తునిపుత్రుడవు కాబట్టి నిన్ను సృజించుట దేవుడు చేసిన తప్పు కాదు. తప్పులకు అతీతుడు కదా దేవుడు. నీద్వారా ఆయన నిర్వర్తింపజేయుపని ఏదో యొకటి ఉన్న దనుట నిజము. అందుకే ఆయన నిన్నీ లోకమునకు తెచ్చియున్నాడు. నీకు దేవునందు అనురాగ మెంత మొగ్గునో ఇంద్రియతృష్ణ అంత తగ్గును. సదా సరిదారిలోనే సంచరింప ప్రయత్నింపుము. సత్యపరతను సౌజన్యమును అలవఱచుకో. ఇంద్రియవాంఛలను విడనాడుము. దీనినే నీ లక్ష్యముగ గంతవ్యముగ నుంచుకో. పురోగమనమును సాధింపుము. నడుమ జాఱుపాట్లును పతనములు కల్గిన కల్గును గాక. మరల మరల లేచుచుండుము. ముందున కేగుచుండుము. తుదకు నెగ్గి తీరుదువని గట్టిగా నమ్ము. నెగ్గువఱకు పట్టుదల వీడకు.

శ్రీరామకృష్ణుడు ఈలాగు చెప్పెడివాడు— నీటికి సొంతరూపము లేదు, ఏ పాత్రలో పోసిన ఆయాకృతిని నొందుచుండును. అట్లే దేవునకు రూపము లేదు. దేవుడు సకలప్రాణులకును దేవుడు. కావున మానవాకృతులను మాత్రమే ఆయన తాల్చుచుండు ననుకొనరాదు. మీ తండ్రి విదేశీయుని వేషమును వేసికొను ననుకొనుము. ఆ కారణముచేత నీవు ఆయనను గౌరవింపకపోవు. ఏరూపముదాల్చినను దేవుడు నీ దేవుడే కాబట్టి ఆయనను నీవు సదా ప్రేమించుచుండవలసినదే. ఒక్కొక్కని కొక్కొక్క రూప మిష్టమూర్తి కావచ్చు. విష్ణురూపము వైష్ణవులకు ప్రియము. శక్తిరూపము శాక్తేయులకు ప్రియము. హిందు కుటుంబమున కోడలు, కుటుంబమం దందఱిని ఆదరించును కాని ఆమెకు శయనసఖుడు పెనిమిటియే. అట్లే నీవును దేవు నవతారముల నన్నిటి నాదరింపవలసినదే; కాని నీ జీవితేశ్వరుడుగ నుండవలసినది నీయిష్టమూర్తియే.

# గురుభక్తి పరమాదర్శము:

రామకృష్ణానందమునకు రామకృష్ణానంద స్వామి మధురమూర్తిభావమైనరీతియే ఆయన జీవితచరిత్రము.

పరిస్థితుల తాఱుమాఱును సరిపఱచి మానవ తతిని ధర్మపథమున నిలుపుటకు మహాపురుషు లవతరించుచుందురు. వారిజీవితములలో సనాతనసత్యములు వ్యాఖ్యాతము లగుచుండును. శ్రీరామకృష్ణు నవతార మట్టిది. అవతారమూర్తులజీవితకార్యములో వారికి సహకరించుటకును అనంతరమునను దానిని సాగించుటకును వారే ఎన్నుకున్న దివ్యానుచరులు వారితో వచ్చుచుందురు. సనా [illegible] లు రామకృష్ణునకు పదునాలుగు రుండిరి. వారు తమ సర్వస్వమును గురుదేవుని సేవకు అర్పించిరి. శ్రీరామకృష్ణుని చరితమును తిలకించితిమేని ఆయన నాయకరత్నముగ అమరియున్న ఈ శిష్యరత్నమాల మానవతతికి వెలుగుబాటను సమకూర్చిన మహాద్భుతమును గుర్తింతుము. గురుదేవునిలోని ఒక్కొక్క విశేషము శిష్యులొక్కొక్కరిలో వికాసము నందినది. ఆ పదునాలుగురు సన్న్యాసశిష్యులలో రామకృష్ణానందస్వామి యొకరు.

ఆయన పూర్వాశ్రమనామము శశిభూషణ చక్రవర్తి. హుగ్లీ జిల్లాలో సనాతనాచారపరు

లైన బ్రాహ్మణకుటుంబములో ఆయన 1863వ సంవత్సరము జూలై నెల 13వ తేదీ జన్మించెను. ఆయనతండ్రి ఈశ్వరచంద్రుడు, గొప్ప దేవీ భక్తుడు. తాంత్రికశాస్త్రములలో సాధనలలో నిష్ణాతుడు. శశి జ్యేష్ఠకుమారుడు. వైదికాచార వాతావరణమున ఎదిగినవాడు. బడివిద్యార్థి దశలో ఆయనప్రతిభ గుర్తింపబడినది. ఎఫ్.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై బి. ఏ. చదువునకై మెట్రోపాలిటను కాలేజీలో చేరెను. ఆయన కభిమాన విషయములు ఆంగ్ల గీర్వాణసారస్వతములు, గణితతత్త్వశాస్త్రములు. గణితశాస్త్రమందలి ఆయనప్రీతి జీవితాంతమువఱకు నుండెను.

భారతదేశచరిత్రలో 19వ శతాబ్ది ఒక కల్లోలయుగము. ఐహికపరమైన పాశ్చాత్యుల సంస్కృతి మనదేశయువకుల చిత్తములను ప్రముచ్ఛిలించినది. దేశీయాచారములను విస్మరించి వారు పాశ్చాత్యరీతులను అనుకరింప జొచ్చిరి. ఆంగ్లేయుల పరిపాలనతో కూడనే అన్యమతాలవారిని క్రైస్తవమతములోనికి ఆకర్షించు పాశ్చాత్యసంస్థలు లెక్కకు మిక్కిలిగ వచ్చి చేరినవి. వారిబోధనకు ముగ్ధులై భారతీయులు హిందూ సంప్రదాయాచారములను నిరర్థకములనియు అంధవిశ్వాసవిలసితములనియు పరిహసించుచుండిరి. ఆ యదనున భారతీయులలో దూరదర్శులగు మహనీయులు కొందఱుండిరి. రాజారామమోహనరాయి బ్రాహ్మసమాజమును స్థాపించెను. ఈసమాజపు ఆధునిక దృక్పథము భారతీయులను కొందఱినైనను మతాంతరులవలలలో చిక్కుకొననీయక కాపాడినది. రాజారామమోహనరాయి కనంతరము విశ్వసంస్తుతినొందిన బ్రాహ్మసమాజనాయకుడు కేశవచంద్రసేను. ఆయనభక్తియు విశాల హృదయమును ధాటీ మండితములైన యుపన్యాసములును ప్రతిభాంచితులైన యువకులను పెక్కండ్రను బ్రాహ్మసమాజములోనికి ఆకర్షించినది.

నరేంద్రుడు (వివేకానందస్వామి) రాఖాలు (బ్రహ్మానందస్వామి) శరత్తు (శారదానంద స్వామి) మున్నగువారితో బాటు శశియు బ్రాహ్మసమాజోద్యమమున ఎంతయు ఆసక్తినొందెను. నవవిధానమందిరమున కేశవచంద్రసేను నడపుచుండిన ఉపాసనములందు పాల్గొనుచుండెను. బ్రాహ్మసమాజనాయకునకును శశికిని సాన్నిహిత్యము హెచ్చెను. దక్షిణేశ్వరయోగియగు శ్రీరామకృష్ణునందు కేశవచంద్రసేనునకు ఇంతంతనరాని ఆదరమేర్పడినది. ఆయన దక్షిణేశ్వరమునకు తఱచు పోవుచుండెను. శ్రీరామకృష్ణుని ప్రభావము కేశవు నభిప్రాయములందును దృక్పథమందును పరిణామము తెచ్చెను. శ్రీరామకృష్ణునిగూర్చి కేశవచంద్రసేను ఒక వ్యాసమును వ్రాసెను. ఒకమిత్రుడు చెప్పగా విని ఆవ్యాసమును చదివి శశి శ్రీరామకృష్ణుని దర్శింపవలె నని కుతూహలితుడయ్యెను. పెదనాయనకుమారుడగు శరత్తుతోను మఱి కొందఱు యువకులతోను శశి దక్షిణేశ్వరమునకేగెను. శ్రీరామకృష్ణుడు ప్రకృతిమాతనిసుగనియు, ప్రేమకు అమాయికతకు సరళతకు మూర్తిభావమనియు, శశి గ్రహించెను. వచ్చిన జట్టులో శశియే అందఱికంటె పెద్దవాడు గావున శ్రీరామకృష్ణుడు అతనితోనే మాట్లాడెను. ఆధ్యాత్మికజీవితములో వైరాగ్యమెంత యావశ్యకమో ఎంతవిలువగలదో శ్రీరామకృష్ణుడు వివరించెను. "ఇటికలపై పెంకులపై కంపెనీ గుర్తును ముద్రించి పిమ్మట వానిని కాల్చినచో ఆగుర్తులు చెఱగకుండును. అట్లే మీరు ప్రాపంచిక జీవితమున ప్రవేశించుటకు ముందు ఆధ్యాత్మికపరత మీలో ముద్రితము కావలయును. అగునేని, ఐహికములందు సంగము మీకు

కలుగదు.'' అనెను శ్రీరామకృష్ణుడు. తరువాత ఆయన శశిని, "నీవు సాకారదైవమును విశ్వసింతువా, నిరాకారదైవమును విశ్వసింతువా'' అని ప్రశ్నించెను. అందులకు శశి, "దేవు డున్నా డను నమ్మకమే నా కింకను గట్టిగా నేర్పడలేదు'' అని బదులు చెప్పెను. ఋజువును సరళమునైన నీ వాక్యమునకు గురుదేవుడు ప్రీతు డయ్యెను. ఇది వారి ప్రథమ సమావేశము. దీని ప్రభావము శశిని శరత్తును పరమహంసయొద్దకు తఱచు వచ్చునట్లు చేసినది. ఏవో అప్రత్యక్షములగు పగ్గములు శశిని రామకృష్ణునొద్దకు ఆకర్షించుచున్న ట్లుండెను. శ్రీరామకృష్ణుడు ఇప్పటిచదువులు చదువుకున్నవాడు కాడు. కాని జీవితగ్రంథమున నిమిష నిమిషమునకు సూక్ష్మతర గాఢతర పరమార్థములు ఆయనకు ప్రత్యక్షము లగుచుండినవి.– ఆత్మవిద్యాసారమును తనకు ప్రసాదింపగల గురువు శ్రీరామకృష్ణు డని శశి గుర్తించెను. శశిభూషణుని ప్రవణతలును దృక్పథమును మార్పొందినవి. గురుదేవుని శ్రీచరణములకు తన డెందమును ఆత్మను అర్పించుకొనవలె ననెడి తీవ్రమైన తహతహ అతనికి కలిగెను. ఆధ్యాత్మికతృష్ణ హెచ్చుకొలది చదువులందతనికి రుచి తగ్గెను. గురుదేవుడు అఖండదివ్యతకు మూర్తీభావమని గుర్తించిన శశి గురుసేవకే తన్నర్పించుకొన నిశ్చయించుకొనెను. దక్షిణేశ్వరమునకు తఱచు రాసాగెను.

ఒకనాడు శశి సూఫీగ్రంథము చదువుచు తదేకనిమగ్నుడుగ నుండెను. గురుదేవునిపిలుపు అతనికి వినబడలేదు. ఆయన ముమ్మాఱు పిలిచిన పిమ్మటనే వినబడెను. అప్పుడు గురుదేవుడు శశిని "ఇట్లు నీవు సాహిత్యగ్రంథపఠనమున మునిగి కర్తవ్యమును విస్మరింతువేని భక్తి నెల్ల కోల్పోదువు'' అని హెచ్చరించెను. గురుదేవు నాదేశాంతరార్థమును గ్రహించిన శశి వెంటనే తన పుస్తకములను మూటకట్టి గంగలో పాఱవేసెను. వేసవిలో మంచుగడ్డ నారగించుట గురుదేవున కెంతయు ప్రియము. ఒకనాడు ఒడిఎండలో శశి మంచుగడ్డ తును కను తన యుత్తరీయమున మూట గట్టుకొని కల్కత్తానుండి దక్షిణేశ్వరమునకు గురుదేవున కర్పించుటకై తెచ్చెను. మహాద్భుత మే మనగా అంత ఎండవేడిమికిని ఆ మంచుగడ్డ కరగలేదు. కొన్నప్పు డెట్లుండెనో గురుదేవుని చేత నుంచినప్పుడు నట్లే యుండెను. శ్రీరామకృష్ణుడు "ఇది నీభక్తికెంతయు ననురూప'' మని ప్రశంసించెను. గురుదేవుడు వ్యాధిగ్రస్తుడుగ నుండిన దినములలో పరిచర్య చేయుచుండిన శశి ఒకనాటిరాత్రి చలివేళలో గురుదేవుని మలపాత్రమును కడుగుటకై వెలుపలికేగి యుండెను. కప్పుకొనువస్త్రము లేకయే శశి పోయి యుండుటను గురుదేవుడు గుర్తించెను. శశి మరలివచ్చి చూచునప్పటికి గురుదేవుడు దండెమున నున్న యొక దుప్పటిని అందుకొనలేక, అందుకొనుటకు శ్రమపడుచుండెను. చలిచేత గురుదేవుడు శ్రమపడుచున్నా డని ఎంచి శశి, బాగుగా కప్పి పోనైతినే అని విషణ్ణుడై "నేను వెలుపలికి పోవుటకు ముందు దుప్పటి నిమ్మని ఏల యడుగ వైతి'' వని గురుదేవు నడిగెను. గురుదేవుడు "నాయనా, నీవు పైనొక్కటుండైనను లేక చలిలో వెలుపలికి పోయితివే. నీకైయే నేను దుప్పటి నందుకొన ప్రయత్నించుచున్నా'' ననెను. ఈ గురుప్రేమ శశిని పరమానందభరితు నొనర్చెను.

ఒకనాడు శశి ఏదో పనిమీద తొందరగా పోవుచున్నప్పుడు గురుదేవు డతనిని పిలిచి తన్ను చూపుకొనుచు "నీకు కావలసినది

ఇదే, ఇదే'' అని చెప్పెను. శ్రీరామకృష్ణుని హృదయమును శశి గ్రహించెను. గురువును ఇష్టదైవమును అభిన్నులనెడి తత్త్వమే నాడు గురుదేవుడు శశికి బోధించినది. నాటినుండి శశి జీవితసారము గురుసేవయే ఆయెను.

వ్యాధిగ్రస్తుడైన గురుదేవుని వైద్యమునకై మొదట శ్యామ్పుకూరునకును పిమ్మట కాశీపూరు తోటమాళిగకును చేర్చినప్పుడు శశి ప్రముఖశిష్యులు తమ విద్యాదులకు స్వస్తి చెప్పి గురుదేవుని పరిచర్యకు పూనుకొనిరి. తక్కినవారు చేసిన సేవ కంటె శశిచేసిన సేవ విలక్షణమైనది. శశిపైని గురుదేవు సను రాగమును ప్రగాఢతరమే. గురుదేవుని వ్యాధి యువశిష్యుల నొక్కజట్టుగా చేర్చినది. ఒక నాడు గురుదేవుడు స్వయముగ వారికి కాషాయవస్త్రముల నొసంగెను. రామకృష్ణ సంప్రదాయసన్యాసిపరంపరకు శ్రీరామకృష్ణుడే ఇట్లు శ్రీకారముచుట్టినవా డాయెను. గురు పరిచర్యయే సాధన లన్నిటికంటె మహోదాత్తతరమైన సాధన యను అధ్యవసాయము గల శశి సాధనాంతరానుష్ఠానమున శ్రద్ధ వహింపలేదు. గురుసేవచేతనే అతడు పరిపూర్ణతను సాధించెను. యువశిష్యులెంత మెలకువతో నుపచరించినను గురుదేవుడు 1886–వ సంవత్సరము ఆగస్టునెల 16–వ తేదీ నాడు మహాసమాధినొందెను. శశిదుఃఖము అవధుల నతిక్రమించెను. గురుదేవుని శరీరమునకు దహనసంస్కారము చేసినపిమ్మట శశి అగాధప్రేమాదరములతో అస్థికలను ప్రోగు చేసి మొదట కాశీపూరువనభవనమునకును పిమ్మట బరానగరమఠమునకును చేర్చెను. బరానగరమఠమున శశి గురుదేవుని చిత్రపటమును అస్థికలను కాలము క్రమము తప్పక ఆరాధింపదొడగెను. సజీవుడుగ నుండినప్పుడు గురుదేవు నెట్లుపచరించెనో, ఇప్పుడు గురుదేవునిపటమును అస్థికలను అట్లే ఆరాధించుచుండెను. అతనికే గాక అచటికి వచ్చు నెల్లరికిని గురుదేవుని సాన్నిధ్యము అనుభవగోచరమయ్యెడిది. బిడ్డపోషణమందు తల్లి శ్రద్ధ వహించునట్లుగ సోదరశిష్యుల యోగక్షేమమందు శశి శ్రద్ధ వహించెను. వారు అప్పుడప్పుడు గంటలకొలది ధ్యానసమాధిలో నిమగ్నులై నిద్రాహారముల సైతము స్మరింపకుందురు. వారిని పస్తుండనీయక ఆహార మంద చేసెడివాడు శశి. మఠమునకు అది చాల కష్టకాలము. యువసన్యాసులచేత సాయెనను లేదు. గృహస్థభక్తులు అర్పించుచుండినది చాలకుండెను. అప్పుడు మఠపోషణకై శశి కొన్నాళ్లు చెంతనున్న స్కూలులో ఉపాధ్యాయుడుగ సైతము పనిచేసెను. ఇతర శిష్యులు తపస్తృష్ణకును దేశపర్యటనాభిలాషకును లోనై చెఱియొకదిక్కున కేగిరి. మఠమున నున్న వారి నుపచరించుచు గురుదేవు నారాధించుచు తావు కదలకుండినవాడు శశి ఒక్కడే.

వివేకానందస్వామి మొదట రామకృష్ణానందస్వామి అను పేరును తా నుంచుకొనగోరెనట. పిమ్మట ఆపేరుదాల్చు నర్హత తనకంటె శశి కెక్కువ యని గుర్తించి ఆపేరు అతనికే యుంచెనట.

భక్తిశ్రద్ధలకు శశి మూర్తీభావము. అయస్కాంతముగ మార్పొందిన ఇనుపటునుక అయస్కాంతముగనే యుండునటుల పరమహంసదేవునొద్దనుండి సముత్సాహమును గడించిన శశి జీవితాంతమువఱకు దానిని నిలుపుకొనెను. శ్రీరామకృష్ణునందలి యతనిభక్తి అప్రకంప్యమైనది. గురుదేవుని చిత్తరువతనికి, చిత్తరువు కాదు, సాక్షాద్గురుదేవుడే. కావుననే పండ్రెం

డేండ్లకాలము స్థానచలనము లేక గురుదేవారాధనాతత్పరుడుగ నతడు గడపెను. గుడిలో గురుదేవు నాయన ఆరాధించుచుండచూచుట ప్రేక్షకులకు నేత్రపర్వమైన మహోత్సవము. జీసస్‌క్రైస్తుశిష్యుడగు "పాలు" యోగి "నేను జీవించిలేను. నాలో జీవముగ నుండునది క్రైస్తుదేవుడే" అనెనట. అట్టిదే శశిభూషణుని గురుసమర్పితజీవితమును.

మాతృశ్రీ శారదాదేవి గురుదేవుని శక్తి అనియే శశి విశ్వాసము. మాతృదేవి గురుదేవుని మూర్త్యంతరమే అనుట అతని యధ్యవసాయము. రామేశ్వరయాత్రావ్యాజమున దక్షిణభారతదేశమునంతటిని మాతృదేవి శ్రీచరణాంకితముగ నొనర్చి పవిత్రీకరింపవలె ననుట శశి కుండిన మహాభిలాషలలో నొకటి. 1910 లో ఆ మహాభిలాష ఆయనకు తీరినది.

గురుదేవుని చరమదశనుగూర్చి శశి ఇట్లు చెప్పెను: "దేహమును త్యజించిన క్షణము రామకృష్ణుడు జీవితమునకంతటికిని అత్యంతానందమును బ్రహ్మానందము ననుభవించెను. ఆనందరోమాంచ మాయన దేహమున నేను కంటిని."

తనకు ఉక్కగ ఉన్నప్పుడు శశి గంటల కొలదిగ శ్రీరామకృష్ణుని పటమునకు విసనకఱ్ఱతో గాలి వీచుచుండెడివాడు. ద్రవాన కురిసినప్పుడు మఠమున ఉఱు పుండెడిది. వానచినుకులు గురుదేవుని పటముపై పడనీయక సగము రాత్రిలో శశి గొడుగు పట్టుచుండెడివాడట. పటమును ఉఱుపు లేని చోటికి మార్చ రాదా యనిన "గురుదేవునకు నిద్ర చెడును" అని శశి చెప్పు జవాబు. గురుదేవుని పటము నెదుట నైవేద్యముంచునప్పుడు చెంతనే స్టౌ ఉంచుకొని పదార్థములను వేడివేడిగ సమర్పించెడివాడట. ఆశ్చర్యమే మనగ ప్రేక్షకులకును అచ్చట గురుదేవుని సాన్నిధ్యము తోతెంచుచుండెనే కాని ఎవరును శశిని వెఱ్ఱివాడనుకొనలేదు. ఒకదినము శశి మఠావరణమందలి పచ్చిక మొదలైనవానిని చెక్కించి జల్లెడపట్టించి ముండ్ల నెత్తిపాఱవేయించెను. ముందుదినము సాయంకాలము గురుదేవుడు ఆ ప్రదేశములో సంచరించుచుండుట ఆయన ప్రత్యక్షముగ చూచెనట. గురుదేవునికాళ్లకు గ్రుచ్చుకొనకుండుటకె ముండను పాఱవేయించెనట. ఏ పదార్థమునుగాని గురుదేవునకు సమర్పింపక శశి భుజింపడు. ఆయనకు నివేదించిన పదార్థములనే తాను భుజించును. ఇందుకు ముచ్చట గొలుపు ఉదాహరణములు రెండు. (1) ఒకరింట అతిథిగ భుజింప శశి కూర్చుండెను. ఆ యింటియజమానురాలితో 'అమ్మా, మీరు నాకు వడ్డింపనెంచిన పదార్థముల నన్నిటిని ఒక్కసారిగానే వడ్డింపుడు' అని కోరెనట. ఆలాగు వడ్డించియైన దని ఆమె చెప్పినపిమ్మట శశి ఆ పదార్థములను మొదట గురుదేవునకు నివేదించి పిమ్మట భుజింప నారంభించెను. ఆరంభించిన పిమ్మట ఆ యింటియజమానురాలు "అయ్యో, నెయ్యి వడ్డింప మఱచిపోయితి" నని చెప్పి వడ్డింప నేతిని తెచ్చెను శశి "గురుదేవునకు నివేదించినదానినే కాని నేను భుజింపను. నెయ్యి లేకే గురుదేవునకు నివేదించిన పిమ్మట నేనును నెయ్యి లేకే భుజింతును గాని, వేసికొనను' అని నిరాకరించెను. (2) రామకృష్ణానందస్వామి కొకప్పుడు మధుమేహవ్యాధి వచ్చినది. అందుకు వైద్యులు వరియన్నము కూడదనియు గోధుమయన్నము భుజింపవలయు ననియు విధించిరి. గురుదేవునకు ప్రియములైన వస్తువులనే ఆయ

నకు నివేదింపవలయు ననియు ఆయన భుక్త శేషమునే తాను భుజింపవలయు ననియు శశికి జన్మవ్రతము. గురుదేవునకు మధుమేహవ్యాధి లేనందున వైద్యులు చెప్పిన నియమమునకు ఆయనను లోబఱుపరాదు. ఆయన ఆరగింపని దానిని తాను భుజింపడు గావున శశి వైద్యుల యాదేశమును త్రోసిరాజనెను.

కోయంబత్తూరులో ప్లేగువ్యాధిచే ఒక కుటుంబమున పెద్దలందఱును మరణించి ఇద్దఱు శిశువులు దిక్కులేనివారుగ మిగిలిరి. వారి పరిస్థితిని చూచి శశిమహారాజు హృదయము కరగెను. వారిని తనపోషణలోనికి తీసికొనెను. ఇదే మదరాసున రామకృష్ణమిషను విద్యార్థుల వసతిగృహము (స్టూడెన్ట్సుహోము)నకుపునాది.

శశికి గురుదేవునం దెంతభక్తియో సోదర శిష్యులందు ముఖ్యముగ శ్రీవివేకానందబ్రహ్మానందస్వాములందు అంత భక్తియే. పండ్రెండేండ్లు శ్రీరామకృష్ణుని అస్థికల నారాధించుచు తావు తలగకుండిన శశి "నీవు వెంటనే మద్రాసుకు చేరి కేంద్ర మేర్పఱచి గురుదేవుని సందేశమును దక్షిణభారతదేశమున ప్రచారము చేయవలసినది" అని శ్రీవివేకానందస్వామి ఆదేశింపగనే ఆ మాటను వేదవాక్యముగ తలదాల్చి మఱునాళలోనే మద్రాసుకు చేరెను. గురుదేవు నస్థికల నారాధించు టెటువంటిదో గురుదేవునకు పరమాదరపాత్రమైన వివేకానందస్వామిమాటను పాటించుటయు అట్టిదే. శ్రీబ్రహ్మానందస్వామి మద్రాసునకు విచ్చేసినప్పుడు సదస్యులకు ఆయనను పరిచయము చేయుచు రామకృష్ణానందస్వామి పల్కిన మాటలు: "మీరు గురుదేవుని చూడ లేదు. గురుపుత్రుని చూచుచున్నారు. పుత్రునిచూచినవారు తండ్రిని చూచినవారే."

రామకృష్ణానందస్వామి మద్రాసులో మొదట కొంతకాలము ఐస్‌హౌస్‌లో నుండెను. ధనాభావముచే దినములు గడచుట అత్యంత కష్టముగ నుండిన యాకాలమున శశిమహారాజుపడిన శ్రమ ఇంతంతకాదు. కొన్నియేండ్లకు మైలాపూరుబ్రాడీసు రోడ్డులో ఇప్పటి మఠమున్నచోటనే ఒకప్రాతయింటికి శశి తన వాసమును మార్చుకొనెను. తానే వంటవాడు. తానే బంటు. అన్నిపనులను తానే నిర్వహించుకోవలసియుండెడిది. అప్పటి కింకను ట్రాముల బస్సుల సౌకర్యము లేదు. నగరమున ఏమూలకు పోవలసినను జట్కాబండ్లలోనే పోవలయును. అందుకు ధనవసతి చాలనప్పుడు కాలినడకన పోవలసినదే. ప్రయాణసౌకర్యములు అంత తక్కువగ నుండిన ఆకాలమున స్వామి నగరమున పలుచోట్ల తరగతులు నడపుచుండెను. రామకృష్ణానందస్వామి వివేకానందస్వామి వంటి వాగ్ధాటికలవాడు కాడు. పెద్దసదస్సులను ముగ్ధమొనర్చు వక్తృత్వము ఆయనకు లేదు. కాని చిన్న తరగతులలో ఎంతగడ్డువిషయములనైనను శ్రోతల చిత్తముల కెక్కించు వ్యాఖ్యాననైపుణి శశికి కలదు. మొదట కొన్ని దినములలో తరగతులకు వచ్చువారి సంఖ్య తక్కువగ నుండినను సందేశమాధుర్యమును రుచిచూచిన పిమ్మట శ్రోతలెక్కువ రాసాగిరి. తరగతులలో పెక్కం డ్రున్నను, ఒక్కరే యున్నను స్వామి శ్రద్ధోత్సాహములలో నిసుమంతయు భేదముండదు. శ్రోతలు ఒక్కరైనను లేనప్పుడు సైతము స్వామి ఏర్పాటైన చోటికి పోయి ఉపన్యాసవేదికపై కూర్చుండి పాఠము చెప్పవలసినంత సేపు ధ్యానసమాధిలో నుండి మరలెడివాడు. తన్ను కర్తగ ఆయనతలంపలేదు, తాను గురుదేవునిచేతి పనిముట్టనియే ఆయన యథ్యవ

సాయము. కావున గర్వగంధమైనను ఆయనలో లేదు. చమత్కారముగ ఆయన ఈలాగు చెప్పెడివాడు, "పేనాకు చైతన్య మున్నచో నే నెన్ని పుటలు వ్రాయుచున్నా నని అదియు గర్వింపవచ్చును. వ్రాయసగాడు ఉపయోగించుకొననిదే వ్రాయజాలని పేనా వ్రాయుచున్నది నేనే" అని తలంచిన నెట్లుండునో కర్తలమని మనము తలంచుకొన్నను అట్లే యుండును.

కాలక్రమమున గురుదేవుని సందేశము మద్రాసునుండి బెంగుళూరు, మైసూరు, తిరువనంతపురము మొదలైన ప్రాంతములకు వ్యాపించి అచ్చట కేంద్రము లేర్పడినవి. బర్మాలోకూడ రామకృష్ణానందస్వామి గురుదేవుని సందేశమును చవిచూపి భక్తబృందము నేర్పఱచెను. పనులయొత్తిడికి ఆయనదేహమిక నోర్వజాలని లక్షణములు కనిపింపజొచ్చెను. దేహబాధలు ఎక్కువయ్యెను. వైద్యులు వ్యాధిని క్షయ అని నిర్ణయించిరి. కొన్నాళ్లు బెంగళూరి వాతావరణమున నున్నను ఆయనశరీరపరిస్థితి బాగుపడలేదు. ఐనను సర్వమతాధిపతియైన శ్రీ బ్రహ్మానందస్వాముల అనుమతి అందువఱకు రామకృష్ణానందస్వామి మదరాసును వీడనిష్టపడలేదు. తరువాతనే ఆయన కల్కత్తాకు చేర్పబడెను. ఎట్టివైద్యలోపమును లేకున్నను దేహస్థితి నానాటికి తీసికట్టై 21-8-1911 వ తేది నాడు స్వామి మహాసమాధి నొందెను.

తే 4-9-1911 దినాడు పచ్చయప్ప హాలులో కూడిన పౌరమహాసభలో అధ్యక్ష్యమును వహించిన న్యాయమూర్తి మాన్యశ్రీ పి. ఆర్. సుందరయ్యరుగారు ఇట్లు వాక్రుచ్చిరి. —శ్రీరామకృష్ణ సంప్రదాయమునకు చెందిన సన్న్యాసులలో రామకృష్ణానందస్వామి అతి విఖ్యాతులలో నొకరు. లక్ష్యములం దేమి, కార్యక్రమమం దేమి రామకృష్ణసేవాసంఘము (మిషను) అనన్యాదృశమైనది. ఈ సంఘసాధువులు నిస్స్వార్థబుద్ధితో లౌకిక నైతిక పారమార్థిక రంగములలో ప్రజాసేవకే తమ జీవితముల నర్పించుకొన్నవారు. మన తత్త్వశాస్త్రమును సంస్కృతియు సర్వమానవాంగీకారోచితము లని నిరూపించిన ప్రముఖులలో రామకృష్ణానందస్వామి యొకరు.........ఎంతో ప్రజోపయుక్తములగు గ్రంథములను ఆయన రచించియున్నాడు. ఆయన సాధించిన గొప్ప కార్యములను సాధింప నొక్కని కెట్లు సాధ్యమగు నని నేను తఱచు అచ్చెరువొందు చుందును. అటువంటి ధన్యజీవులు, అమర జీవులే.

# భరతమహిమ

## కీ. శే. మహోపాధ్యాయ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

(గతసంచికతరువాయి)

అరణ్యములలో సంచరించునపుడు సింహశార్దూలములపాలైరో, పిశితాశనుల చేతులనేపడిరో, ప్రవాహములు, వనవహ్ని, ఇత్యాది సందర్భములనే చిక్కుకొనిరో ఈపదునాల్గేండ్లలో జానకీసహితులైన రామలక్ష్మణు లెట్లయిరో-భరతునకుఁజింత యపారమయ్యెను. పదునాలుగేండ్లకు శ్రీరాముఁడు మరలివచ్చు నని యనుకొనుచున్న భరతుని యాశ వ్యర్థమే యయ్యెనా? ఆయన వారి యరిష్టనివృత్తికై

నందిగ్రామమునఁ గావించుచున్న శాంతి క్రియలు నీటనే గలసెనా ?

ఒక్కనాఁటి సాయంసమయమున సంధ్యా కార్యములు దీర్చి భరతుఁడు వసిష్ఠాదిసహితుఁడై యగ్నిసాన్నిధ్యమునఁగూరుచుండి యుపనిషత్తులు చెప్పుచున్న బ్రాహ్మణులతోడ నర్థవిచారము చేయుచుండెను. వేదపఠనానంతరము బ్రాహ్మణులు పోఁగా, భరతుఁ డీశ్వరధ్యానతత్పరుఁడై కొంతతడవు కన్నులు మూసికొని కూరుచుండెను. "శ్రీరాముఁడు క్షేమముగా నున్నాఁడు. జానకీసహితుఁడై లక్ష్మణునితోడ లంకనుండి పుష్పకవిమానమునవచ్చి భరద్వాజాశ్రమముననుండి యీ శుభవార్త ముందుగా మీకుఁ దెల్పుటకు నన్నంపినాఁడు" అనుమాటలు భరతునకు శ్రుతిగోచరము లయ్యెను. 'ఇదియేమి స్వప్నమా? కాక మనోవికారమా?' యని భరతుఁడు కన్నులు దెఱచి చూచునంతకుఁ దనయెదుట, మేరుపర్వతమువలెఁ బచ్చని కమనీయవిగ్రహమును, మిక్కిలి యెఱ్ఱవాఱిన నెమ్మొగమును పిశంగనేత్రములును వెలుఁగ బ్రహ్మవర్చస్వియైన యొక్కకపిశ్రేష్ఠుఁడు పొడకట్టెను. "నేను హనుమంతుఁడనువాఁడను. వాయుదేవుని కుమారుఁడను. శ్రీరాముని దాసుఁడను. నేను మాయావులైన రక్కసులలో నొక్కరుఁడ గాను. అట్టివారెల్ల లంకలోనే నిహతులైరి. నన్ను సంశయింపకుము" అని తన్నుఁ దానెఱింగించుకొని శ్రీరాముఁడు చిత్రకూటము వదలినదిమొదలు, అంతవఱకు జరిగిన సంగతులన్నిటిఁ బూసగూర్చినట్లు భరతునకుఁ జెప్పెను. భరతుఁడు ముహూర్తమాత్ర మానందముచేతఁ బరవశుఁడై యేమియుఁదోఁప కూరకుండెను. "వానరోత్తమా, ఇట్టి శుభవార్త దెచ్చి నా ప్రాణములు నిల్పిన నీమేలునకుఁ బ్రతిక్రియయేదియో నాకుఁ దోఁపకున్నది. స్వామిభక్తిభరితుఁడవైన నిన్నుఁ జూచుటచే నాజన్మము సఫలమైనది" యని యాంజనేయుని గాఁగిలించుకొని సత్కరించి యందఱ కెఱింగించి భరతుఁడు సపౌరపరివారముగాఁ దల్లులతోడఁ బురోహితులతోడ రాముని సందర్శింపఁబోవుటకు బయలువెడలెను. ఈలోన శత్రుఘ్నుఁ డయోధ్యాపట్టణము నపూర్వశృంగార కలితమ్ముగా నలంకరింప, నందిగ్రామమునుండి యయోధ్యకుఁ బోవుమార్గము నత్యంతసుగమమ్ముగావింపఁ దగువారి నాజ్ఞాపించెను.

భరతాదులు వాలుకినదియొద్దకుఁ బోవునంతకు వానరులు గోమతీతీరమును దాఁటియుండిరి. పైఁడిముఖలోన శ్రీరాముని పుష్పకమెల్లరకు దృగ్గోచరమయ్యెను. అప్పుడు వనవాసదీక్షఁజేసి గుఱుతింపరాకయున్న రామలక్ష్మణులను, సీతాదేవిని, బూర్వపరిచయములేకునికి నజ్ఞాతులైయున్న సుగ్రీవవిభీషణాదులను హనుమంతుఁడు పేరుపేర భరతునకుఁ గౌసల్యాదులకును జూపి యొక్కపెట్ట శ్రీరాముని విమానము నొద్దకుఁబోయి భరతాదులు వచ్చియున్నారని విన్నవించెను. పుష్పకము ధరణీతలమునకు దిగియె. అప్పుడు రథముడిగ్గి తలఁదాల్చుకొని తెచ్చుచున్న పాదుకలనుబట్టి గుఱుతింపఁగలిగెఁగాని కాకున్న శ్రీరాముఁడు భరతుని గుఱుతింపనే నేరఁడు. కట్టుకొనియున్న కృష్ణాజినములు, ధూళిధూసరితములైన మేనులు, వ్రేలాడు జడలు, కృశాంగములునై తాపసవేషములతో దూరముననుండి వచ్చుచున్న తమ్ములనుజూచి శ్రీరామునకే యాశ్చర్యము కలిగెను. కౌసల్యాదులును గలసికొనిరి. ఈ సమాగమమున నన్నదమ్ములకును, దల్లులకును, బౌరులకును, ఎల్లరకుఁ గలిగినమహోల్లాసము వర్ణనాతీతమైయుండెను.

దశరథుఁడు లేని కొఱంత యొక్కఁడుండఁబట్టి సరిపోయెఁగాక, కాకున్న నియ్యనిర్వాచ్య మహానందసముద్రమగ్నులైన వీ రేమై యుందురో!

భరతుఁడు పాదుకలు రాముని కాళ్ళఁ దొడిగి "నృపోత్తమా, నీయాజ్ఞఁ జేసి నీకు భృత్యుఁడనై యీ పదునాలుగేండ్లు రాజ్యభారము వహించితిని. నిన్ని యయోధ్యాపట్టణమునఁ గలసికొని, యీ రాష్ట్రమును మరల నీకప్పగింపఁగలుగుటఁ జేసి, నాజన్మము సఫలమైనది. నేను కృతార్థుఁడను. మాతల్లి కైక యొక్కకోర్కెయు, నటపై నాసంప్రార్థనము నీవాచరించుటచేత మాకు మఱవరాని మహాగౌరవము నాపాదించితివి. ఇంతకన్న నేను గోరఁదగిన యభ్యుదయ మేమియును లేదు" అని చెప్పి భరతుఁడు నమస్కరించెను. దేవతలు కుసుమవృష్టి గురిసిరి. ఆవల నందఱును నందిగ్రామమునకుఁబోయి యక్కడ నలుగురుకుమారులును దీక్షా విసర్జనము గావించుకొని, సముచిత వసనభూషణాదులు ధరించి, నూత్నశృంగార కలితయైన సీతాదేవితో సకలపరిజనముతో నయోధ్యాపట్టనము చేరి యక్కడ నపూర్వవిభవముతో, అమరావతీపట్టణమునందు దేవేంద్రుఁడువలె వసిష్ఠాది మహామునులచేత శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడయ్యెను.

చ. కరగతమైనరాజ్యరమఁ గాసునకుం గొన కార్యధర్మసు
స్థిరత నఖండసంపదలు జ్యేష్ఠునకిచ్చె; నతం డయోధ్యకుం
మరలెడు నంత కుగ్రనియమమ్ములఁబుచ్చెఁ జతుర్దశాబ్దముల్
భరతుని సత్ప్రవర్తనము, పాఠకులార, తలంచిచూడుఁడీ.

చ. ఎఱుఁగమె యన్నదమ్ములను నెందఱనో సహజార్థధర్మముం
జెఱిచినవారి; స్వార్థరతిచేఁ గపటాత్మకులైనవార; న
త్తెఱఁగునగాక విశ్వజగతీ స్పృహణీయ చరిత్రుఁడైన యీ
భరతుని మర్త్యమాత్రుఁడనవచ్చునె? దేవుఁడ యంట పొచ్చెమే?

సీ. తనకురాజ్యముగూర్పఁ దల్లి గావించిన కుటిలతంత్రమున కీకొనఁగ లేదు;
ఆవల వసిష్ఠాదు లర్థవాదములాడ వెనఁ దదుక్తులు చెవిఁబెట్టలేదు;
అడవి శ్రీరాముండె యీదేశమిడ రాజ్య మింపారఁ గొననిచ్ఛగింపలేదు;
కడువిరాగులనైన నుడికించు నలదురాశాపిశాచికిఁ జోటొసంగలేదు;

తే. ధర్మనిష్ఠాభిరతియు – సోదరజనైకపరతయును దోఁపఁ గార్యముల్ జరపినాఁడు;
ధరణి రాజ్యమ్ము తృణమట్ల దలఁచినాఁడు; భరతునకు సాటి యన్యుఁడొక్కరుఁడు గలఁడె?

సీ. పితృవాక్య పాలనవ్రతమూని దండకాటవి కేగినట్టి రాఘవునికంటె
పతిసేవనాసక్తి నతని వెంబడి వనస్థలి నేగివడినభూతనయకంటె
నిదురయు నోరె మన్నియుమాని వారిరక్షణ దీక్షఁగొన్న లక్ష్మణునికంటె
ప్రభుభక్తిఁ గడలిగోష్పదమట్ల దాఁటి రావణునెదిర్చిన గాడ్పుపట్టికంటె

తే. భ్రాతల పరోక్షమున భ్రాతృభక్తి నెఱపె; సిరి మరులుగొల్ప వికృతులు పొరయకుండె;
అన్న కమృతమ్మునిడి నీరమానెఁ దాను! భరతుఁ డప్రాకృతుఁడో? గాక ప్రాకృతుండొ?

చ. ఎదుటన యుండె రామవిభుఁ, డేమివిచిత్రము లక్ష్మణుండు బె
ట్టిదపువ్రతంబుసల్పెనన ? డెందము భ్రాతృపదక్షమమ్ముగాఁ
బదియును నాలుగేఁడులు తపంబొనరించె నితం డయోధ్యలో;
నదురిత శీలుఁ డీభరతునట్టిరు తమ్ములుగల్గిరే యొకర్ ?

మ. కతయో, గాకయథార్థమో? యె టయినన్ గాకుత్స్థుసచ్చారిత్ర మం
చితమై యొందఱ సీతలన్ భరతులన్ శ్రీరాములం గూర్చె భా
రతవర్షమ్మున; దాదృశాశయమహాగ్రంథైక నిర్ణేతకున్
నతిగావించెదఁ బుట్టపుట్టువునకున్ జ్ఞానైక వారాశికిన్.

# వాలివధాంతర్య సందేశం

## శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కేశవతీర్థస్వామివారు

శ్రీమద్రామాయణంలో శ్రీరాముడు వాలిని వధించినవిధానమును, అధర్మమని కొంతమంది గర్హిస్తుంటారు. కొందరు పండితులుసైతం, ఈ విషయంలో సంశయగ్రస్తులుగావటం శోచనీయం. తన్ను ముఖాముఖిగ నిందించి, శ్రీరాముని సమాధానంతో సంతృప్తుడై, తుదకు సదమలజ్ఞానసంపన్నుడై శరీరమును త్యజించి శాంతిపదము నధిష్ఠించాడు వాలి. వాలి సంతృప్తుడైనా, రాముడు చేసింది అధర్మమని వాలితరఫున వాదించే న్యాయవాదులుమాత్రం, నేటికి కూడా నిలిచియుండడం అతివిచిత్రవిషయం. వాలివధవిధానమును ధర్మంగా గ్రహింపలేకపోవడానికి కారణాలు-ఒకటి శ్రద్ధతో, వినిర్మల హృదయంతో, రామాయణమును అధ్యయనం చేయకపోవడం; రెండవది అపరిణతబుద్ధి. విషయాలను తలక్రిందుగా పరిస్తే సత్యం గోచరం కాదు. సక్రమావలోకనం, సంస్కృతి, మన కత్యవసరం. ఋషివాఙ్మయమును గ్రహించడానికి శుష్క-పాండిత్యాలు, శూన్యహృదయాలు పనికిరావు. సదాచారశిక్షణ కావాలె; సత్యవైదుష్యం కావాలె. శ్రీరామభగవానుడే వాలితో ఇట్లన్నాడు: "సూక్ష్మః పరమ దుర్జ్ఞేయ స్సతాం ధర్మః ప్లవంగమ । హృదిస్థ స్సర్వభూతానా మాత్మా వేద శుభాశుభమ్." ఓ వానరుడా, ధర్మం సూక్ష్మమైంది. పండితులకుగూడ పరమదుర్జ్ఞేయమైంది. ధర్మాధర్మములు సర్వ యామియైన పరమాత్మకే తెలుసు.

ఈవిషయాన్నే మహాభారత మిట్లు చెప్పుతున్నది :

"సూక్ష్మా గతిర్హి ధర్మస్య,
దుర్జ్ఞేయా హ్యకృతాత్మభిః

ధర్మగతి అతిసూక్ష్మం. అది అసంస్కృత హృదయులకు అగ్రాహ్యం. అందుచేత ఆత్మ

జ్ఞానులైన - బ్రహ్మనిష్ఠులైన - అంతర్వాణి సుశ్రోతలైన మహాత్ములే ధర్మాధర్మవివేచనం చేయగలుతారని మనం గ్రహించవలసి యున్నది. నారాయణుడైన శ్రీరాముని ధర్మ తత్త్వం వానరుడైన వాలి కెంత తెలుసో, అజ్ఞానులైన నరులకుకూడా అంతే తెలుస్తుంది.

శ్రీరామచంద్రుడు సాక్షాద్ధర్మముయొక్క అవతారం. అధర్మమును కూలద్రోయడానికి, ధర్మమును పరిరక్షించడానికి భూమియందవతరించినసాక్షాద్భగవానుడు శ్రీరామచంద్రుడు. కళ్లు తిరుగుతుంటే, ఇళ్లు తిరుగుతున్నట్లు కనబడినమాదిరి అధర్మహృదయులకు శ్రీరాముని ధర్మగతి అధర్మవర్తనంగా గోచరిస్తుంది. ఇది విభ్రాంతి ప్రభావం.

ఉత్తమక్షత్రియుడు- ప్రభువు - ధర్మాధర్మ వివేచనసమర్థుడు-శాస్త్రవిశ్వాసి - దయాహృదయుడు-సర్వహితంకరుడు-ధర్మరక్షకుడు - దుష్టశిక్షకుడు నైన శ్రీరాముడు, నిరపరాధి యైన తన్ను వేరొకనితో యుద్ధంచేస్తున్న సమయంలో చెట్టుమాటున నిలిచి, బాణఘాతంతో సంహరించడం అధర్మమనీ, ఎదురుగా నిలిచి పోరకపోవడం మోసమనీ, వానరుడైన తన్ను నిష్ప్రయోజనకరంగా చంపడం అన్యాయమనీ, వాలి శ్రీరాముని అనేకవిధాల నిందించాడు. అజ్ఞ మానవులకుకూడా ఇదే దృష్టి ఉంటుంది. వాల్మీకి రామాయణంలో శ్రీరాముడు వాలికి చెప్పిన సమాధానం సక్రమంగా పఠిస్తే చాలు; సంశయనివృత్తి కలుగుతుంది. వాలివధాంతర్య సందేశ మిక్కడ నిర్వచింపబడుతున్నది; వాలి తన్ను ధర్మవిదునిగా, శ్రీరాముని అధర్మపరునిగా, అజ్ఞానంచేత ఎంచుకొన్నాడు. ఈ విపర్యయదృష్టిచేత అతనికి రామకార్యమంతా అధర్మంగా తోచింది. శుష్కపండితుడైన వాలికి ధర్మానుభూతి లేదు. ధర్మాచరణమూర్తియైన శ్రీరాముని ధర్మపులోతులాతడు గ్రహించలేక నిందించాడు. సూర్యునిలో చీకటి పుట్టని రీతి, శ్రీరామునిలో అధర్మం ఆవిర్భవించదు. ధర్మదేవతయొక్క విశ్వరూపసందర్శనం చేయగలిగినప్పుడే, ధర్మలీలావివిధవిన్యాసములను మనం గ్రహించగలం.

శ్రీరామకృత వాలివధ విధానం - ప్రభుని యొక్క, పరమేశ్వరునియొక్క ధర్మానికి ఏ మాత్రం విరుద్ధమైనది కాదు. ఉత్తమక్షత్రియ ధర్మాన్ని రాము డనుష్ఠించాడు. నిరపరాధిని రాముడు సంహరించలేదు. కామకాంచన లోలుడై, ధర్మమును విస్మరించాడువాలి, కాదా మరి? సుగ్రీవుడు బ్రతికి ఉండగానే, తమ్మునిభార్యను "రుమను" వాలి అపహరించి, సుగ్రీవుని రాజ్యమునుండి వెడలగొట్టి, కొమార్తెతో సమానురాలైన "రుమ"తో కామోపభోగముల నాసించాడు. వానరజాతి ధర్మాన్నికూడా అత డతిక్రమించాడు. పరస్త్రీ లోలుడు, పరశ్రీలుబ్ధుడు, మదోన్మత్తుడు అయినవాలిని నిగ్రహించడం - నరపాలుడైన నారాయణుడైన శ్రీరామునికి ధర్మమే. తన సామ్రాజ్యంలోని పీడితప్రజలను రక్షించడం, పరపీడాపరాయణులను శిక్షించడం ప్రభుధర్మం. పరమేశ్వరధర్మం. ఒకడు విశ్వంలో ఏ అపకారం చేసినా, విశ్వేశ్వరునికి చేసినట్లే, అందుచేత వాలి రామాపరాధే. శ్రీరాముడు ధర్మదేవత. ధర్మమును అగౌరవిస్తే శ్రీ—ముని అగౌరవించినట్లే. అందుచేత వాలి వధార్హుడైనాడు.

"శ్రీరాముడు సీతకొఱకు సుగ్రీవునకుసహాయపడ్డాడు. కాని ఆశ్రితుడని సహాయపడ్డాడా?" —అనే ప్రశ్న వస్తుంది. వాల్మీకంలో శ్రీరా

ముడే వాలితో, సుగ్రీవుడు నాకు లక్ష్మణునివలె ప్రియుడు. సీతాన్వేషణమనేది మా స్నేహ ఫలం కాని, స్నేహబీజం కా''-దని చెప్పాడు. సీతకొఱకే సుగ్రీవునిపక్షం వహించి, రాముడు వాలిని వధించినట్లైతే-వాలి అన్నట్లు, వాలితో రాముడు స్నేహంచేస్తే, వాలివల్ల అనాయాసంగా సీత లభించేదేకదా! అందుచేత సుగ్రీవ మైత్రిగాని, వాలివధగానీ, శ్రీరాముడు సీతార్థం చేయలేదు. సీతాశోకనివారణం రామునికెంత స్వీయవిషయమో, సుగ్రీవునివంటి ఆర్తులనను గ్రహించడంకూడ రాముని కంతకంటె స్వీయ కృత్యం. ఆశ్రితజనుల దుఃఖదశను పరికించినప్పుడల్లా శ్రీరాముడు సీతాదుఃఖమును విస్మరించడం మన మనేక సందర్భములలో చూస్తాము. సీతారామకల్యాణం, సీతారామ వనగమనం, సీతారామవియోగం, ఆర్తరక్షణ కొఱకే - అజ్ఞశిక్షణకొఱకే, 'సీతకొఱకైతే నాసహాయం నీకు ఎక్కువ ఉపకరించేది గదా! ఆహారం కొఱకైతే, కోతిమాంసం అభక్ష్యం కదా!'' అని వాలే అన్నాడు. అందుచేత వాలివధ స్వార్థప్రేరితం కాదు. శ్రీరాముని నయ భయశిక్షణ లన్నీ-జీవుని అనుగ్రహించడానికే.

ఇంకొకప్రశ్న: ''ముందుగా శ్రీరాముడు సామదానభేదోపాయాలను ఉపయోగించి వాలిని సుముఖుని చేసికోవచ్చు కదా'' అని. సామదానభేదోపాయాలు, శిక్షార్హుడైన లోకాపరాధివిషయంలో కాదు. వాలిదుర్మదం శిక్షార్హమైందే. అర్ధాంగియైనతార చెప్పింది; ఆతడు వినలేదు. ప్రియురాలిమాటలే వినని వాడు ఇంకొకరిమాటలు వింటాడా? ''సుగ్రీవుడు శ్రీరాముని బాహుబలాశ్రితుడు'' - అని వాలి వినికూడా ఉద్ధతుడైనాడు. సర్వజ్ఞుడైన శ్రీరాముడు, వాలి వధార్హుడే అని గుర్తించాడు. స్వీయవిషయంలో శ్రీరాము డపరాధి కోటిని సహిస్తాడని, తన ఆశ్రితుల విషయంలో ఒక అపరాధంకూడా క్షమించడని, శ్రీ తులసీదాసువా రంటారు. సరే, వాలి వధార్హుడే గనుక శ్రీరాముడు సంహరించడం న్యాయ్యమే. ''మరి చెట్టుమాటున డాగి, సుగ్రీవునితో యుద్ధం చేస్తున్న వానిమీద బాణప్రయోగం చేసి సంహరించడం అధర్మం కాదా?'' అని ప్రధానప్రశ్న. ఈఘట్టం అత్యంత గంభీరమైంది. రసవంతమైంది. పరమార్థగర్భితమైంది. మంచివానిలోని చెడుగును గానీ, చెడువానిలోని మంచినిగాని, ఏమాత్రము దాచక ప్రకటించిన మహర్షి వాల్మీకి, శ్రీరాముని ధర్మస్వరూపునిగా సర్వత్ర పేర్కొనిన విషయం మనం కనీసం కొండగుర్తుగా పెట్టుకోవలసి యున్నది.

ముందు నరపాలధర్మానుసారం విషయం వివృతం చేయబడుతున్నది. వాలి జాతినిబట్టి మృగం. గుణాన్నిబట్టికూడా మృగప్రాయుడు. రాజులు వనమృగాలను వేటాడడం విహితం. మృగయాధర్మంలో ఎదుటబడిగాని, మాటున ఉండిగాని, వలలు పన్నిగాని ఏదో ఒకరీతి దుష్టజంతుసంహారం చేయడం, విహితకృత్యమే. ఉత్తమక్షత్రియు డగురాముడు, క్రూరమైన వాలిని, చెట్టుమాటుననుండి వధించడంలోని మృగయావినోదసౌందర్యం మనోజ్ఞమైంది. వాలివధవిధానం మృగయా ధర్మానుకూలం, మృగప్రాయుడైనవాలి కాశిక్ష అర్హమైంది. అదిగాక వాలివిషయంలో శ్రీరాము డెదురొడ్డి పోరాడడం ఆత్మగౌరవభంగకరం. మృగప్రాయుడైనవాలిని మృగయావినోదవిధానంలో సంహరించడమే, ఉత్తమక్షత్రియుడైనరామునికి తగినధర్మం. చలిచీమమీదికి చంద్రహాస ప్రయోగంవలె, మృగజాతీయుడైనవాలితో, ముఖాముఖి శ్రీరాముడు సంగ్రామంచేయడం అనుచితం. మృగమును మృగయాధర్మాను

సారమే శ్రీరాముడు చెట్టుమాటుననుండి వేటాడి సంహరించాడు. తనపాశవికదుశ్చర్యలకు తగినమరణమును వాలి పొందాడు. వాలి యోగ్యత శ్రీరాము డెదురొడ్డి పోరదగినది కాదు. సమానస్కంధులతో, వీరులు ఎదురు నిల్చి పోరుతారు. శ్రీనృసింహావతారంతో భగవానుడు హిరణ్యకశిపుని వధించాడు. ఆ రూపధారణకు, నిజానికి మూలకారణం హిరణ్యకశిపుని సంకల్పమే. ఆతనివరాలు నరసింహరూపమును సృష్టించుకొన్నాయి. నరునిచేతగాని, మృగంచేతగాని చావగూడదని కోరుకున్నాడంటే నరమృగరూపంచేత చావాలని కోరుకున్నట్టే. వాలియొక్క మృగప్రవృత్తులు శ్రీరాముని మృగయునిగా (వేటగానిగా) సాక్షాత్కరించుకొన్నవి. ఇది కర్మధర్మం. నాకు ఎదురయ్యేశత్రు వుండగూడదంటే, చాటున శత్రువు ఉండాలనేకదా సంకల్పం. వాలిమృగధర్మమును వరించాడు గనుక, భగవాను డాతనియెడ మృగయుడై వేటాడవలసి వచ్చింది. మృగప్రాయుడైనవాలిని, మృగయాపథంలోనే, శ్రీరామదేవుడు సంహరించడం ప్రకృతిన్యాయంగా మనం గ్రహించవలసి యున్నది. ఒకనికి పశుకామం ఉందనుకోండి. ఆ ఉద్రేకనివృత్తికి మానవదేహం చాలదు. ఆతనితృష్ణ, అతడు కోరకుండానే, అతనిని, ఏదున్నపోతుదేహంలోనో, ఏ పందిశరీరంలోనో పడవేస్తుంది. అప్పు డాతనితృష్ణ తీరుతుంది. కోరికలప్రభావం అలాంటిది. వాలి బ్రతికియున్న తమ్ముని భార్యను, తనభార్యగా చేసికొన్నాడు. కాళ్ళమీదపడి వేడినా వాని సర్వస్వమును హరించి, సోదరప్రేమ రవ్వంత కూడా లేకుండా, దురుద్రేకంతో వానిని తరిమి వేశాడు. తన్ను ఎదిరించేవాడుండరాదని ఆతడు భావించాడు. ఆతని పశుకర్మకు ఫలితంగా, ధర్మం రామరూపంతో, తగినఫలాన్ని ప్రసాదించింది. మృగదృష్టితో వాలి ధర్మదేవతను చాటుకు నెట్టాడు. ధర్మదేవత అతనిని మాటు బెట్టి మసిచేసింది. ఈ సందర్భంలో మూల సందేశమును మనం గ్రహించవలసి యున్నది: పీడితసుగ్రీవుడు, ధర్మస్వరూపు డైన శ్రీరామదేవుని శరణుపొందుతాడు. వాలిమీద యుద్ధానికి పోయి దెబ్బలు తిని పాఱివస్తాడు. "మీ ఉభయులు సమానంగా నున్నందున గుర్తించలేక బాణం విడువలే" దన్నాడు శ్రీరాముడు. అంటే ఏమిటి? అప్పటికి సుగ్రీవునకు కావలసిన సంపూర్ణశరణాగతి-వెనుక భగవంతు డండగా నున్నా డనేదృష్టి-స్థిరం కాలేదు. "రాముడున్నా డని" తెలిసినా, దుర్మదంతో భయపడనివాలీ—"వెనుక రాముడు తోడున్నా" డని తెలిసినా, దుర్బలత్వంతో భయపడే సుగ్రీవుడూ-ఇద్దరూ, నాస్తికసోదరులే. అందుచేత వాలిసుగ్రీవులలోని భేదాన్ని రామభగ నుడు గు రించలేదు. "నా అనేది ఏమీ దు. సర్వాధిష్ఠానమూర్తి, బలవంతులకు, దుర్బలులకు,-సర్వులకు మూలశక్తి యైనపరమాత్మయే నాకు ఆధారం - పరమేశ్వర శరణ్యుడ నైననా కేమిభయం" - అనే పూర్ణశరణాగతిభావం ఎప్పుడు సుగ్రీవునియం దుదయించిందో, ఘోరార్తివశు డైనఆతనిని సంరక్షించడానికి, దీనాభయప్రదాత యైన-శ్రీరఘువీరస్వామి, వానిపై బాణప్రయోగం చేశాడు. చెట్టుమాటున ఉండి శ్రీరాముడు వాలిని సంహరించడం లోని మహాసందేశం - "భగవానుడు దుర్బలులవెనుక, దుఃఖితులవెనుక, దీనుల వెనుక అండయై ఉంటాడని. ఆ అదృశ్యదైవశక్తిని అహంకారాంధులు గుర్తింపలేక విఱ్ఱవీగి తుదకు హతు లౌతారని- ఆ అకుంఠితధర్మశక్తి అదృశ్యమానమైనా సర్వసాక్షియై జీవుల

కర్మఫలాలను ప్రసాదిస్తుందనీ' -మనము గ్రహించవలసియున్నది.

విశ్వమును-ప్రకృతిని వృక్షంగా శాస్త్రాలలో వర్ణించడం మనము వింటాము. గీతలో విశ్వప్రకృతి అశ్వత్థంగా పోల్చబడింది. విశ్వాధిష్ఠానశక్తి - ప్రకృతిమూలశక్తి- పరమాత్మ- ఇంద్రియాతీతుడై అగోచరుడై యుంటాడు. ధర్మమును మఱచి, విషయసుఖార్జనకై పోరాడే చపలచిత్తుడు, నరత్వము నతిక్రమించని వానరుడు- "విశ్వవృక్షము మాటున ఉన్న సర్వసంచాలక ధర్మశక్తిని - శ్రీరాముని - దర్శించలేడు. 'ధర్మశరాఘాతం తనగుండెలో నాటినప్పుడు, రోదిస్తాడు. శ్రీరాముడు చెట్టుచాటున దాగియుండుటలోని మహాసందేశ మిదే!

శ్రీరాముని ముఖమున వాలివధలోని ధర్మసందేశమును విన్నపిదప, వాలియొక్క అజ్ఞానం వీగిలిపోయింది. సుగ్రీవుని రక్షించడం ద్వారా, ఆతనిపై జూపిన అనుగ్రహమునూ, తన్ను శిక్షించడం ద్వారా, అహంకార దేహకర్తృత్వ విముక్తిని గల్పించి తనపై చూపిన అనుగ్రహమును వాలి గ్రహించి, ఆనందబాష్పాలు కారుస్తూ ముకుళితహస్తుడై అంత్యసమయంలో శ్రీరాముని దివ్యమంగళాకృతిలోని మహా ధర్మతేజమును సందర్శిస్తూ, కైవల్యపద మధిష్ఠించాడు. భగవంతుని నిగ్రహానుగ్రహాలీలలు రెండూ జీవోద్ధరణానికే! ధర్మావతారమూర్తియైన శ్రీ రామభగవానుని ప్రతి చర్యలోని మానవ-మాధవధర్మములను మనం సాక్షాత్కరించుకొని, ధన్యత గంటాము గాక!

ఓం! ఓం!! ఓం!!!

## శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తిగారు

(జూలై సంచిక తరువాయి)

### 3

చివరకు దధ్యఙ్మహర్షి తనమాట నిల్పుకొనవలసివచ్చినది. ఇంద్రుడు కపటమనస్సుతో బ్రహ్మవిద్యాదీక్ష స్వీకరింపగలిగెను. కాని మానసికశాంతి కాని సంతోషముకాని యింద్రునకు లభింప లేదు. ఒకదినమున నింద్రున కుపదేశముచేయు సమయమున మహర్షి భోగవిలాసములను గర్హించి యింద్రుని కాముకశునకముతో పోల్చి విమర్శించినాడు. "ప్రపంచమున జన్మించినది మొదలు స్వార్థసాధన ముఖ్యముగా నెంచువారికి, భోగవిలాసములు తక్క పరమార్థదృష్టి ఏమాత్రము లేనివారికి, దుఃఖము, అశాంతి, అసంతోషము తప్ప మఱి ఏమియు లభింపవు" అని ఘోషించినాడు. తనయైశ్వర్యము, తనభోగవిలాసములు శునకజీవితంవంటివని గర్హింపబడినప్పు డింద్రుడు బ్రహ్మవిద్య నేమి చేసికొనవలెను? ఏ యైశ్వర్యము, ఏ సుఖము, ఏ భోగవిలాసములు మొదలగునవి పొందుటకు గొప్పగొప్ప మహర్షులు తపస్సు చేసి జీవితము లర్పించియు పొందజాలని యా యైశ్వర్యము, ఆ సుఖము, ఆ భోగవిలాసములు శునకజీవనప్రవృత్తు లెట్లగును? తన ప్రియశిష్యులైన యశ్వినీకుమారుల ప్రేరణచేతనే మహర్షి తన్నవమా

నించుచుండె నని యింద్రుడు మనస్సులో అనుమానపడసాగినాడు. "మహర్షి మనస్సు పక్షపాతముచే కలుషితమైనది. ముల్లోకములం దెచ్చటను, ఎప్పుడును నాకింతటి యవమానము కలిగియుండలేదు." ఈ ప్రకారముగా నింద్రునిమనస్సులో నంకురించిన సందేహ బీజము స్వల్పకాలములోనే మహావృక్షమైనది. ఇంద్రుని కన్ను లెఱ్ఱబడినవి. ముఖము రక్తిమ దాల్చినది. వేడినిట్టూర్పులు వెలువడసాగినవి. నిగ్రహించుకొనుట కింద్రుడు చేసిన ప్రయత్నము ఫలింపలేదు.

ఇంద్రుడు కూర్చున్నచోటునుండి లేచి "బ్రహ్మర్షి, ఇక చాలింపుడు. ఇంతకంటె నధికముగా నన్ను పరాభవింపకుడు. మూడు లోకములలో నెవ్వరికిని నాయెదుట ఈ ప్రకారము మాట్లాడు శక్తి కాని సాహసము కాని లేదు. మీరు గురు వగుటచేత మీ రిచ్చిన యాజ్ఞ లన్నియు కన్నులు మూసికొని యింతవఱకు ఆచరించితిని. ఆత్మాభిమానము చంపుకొంటి నని కాని, మీరేది చెప్పినను నిశ్శబ్దముగా నాలకించునంత నీచుడ నైతి నని కాని భావింపకుడు."

దధ్యఙ్మహర్షికి ప్రపంచములో దేనికిని భయము లేదు. సహజగంభీరస్వరముతో "దేవరాజ, బ్రహ్మజ్ఞానము పొందినపిదపకూడ ఇంతఅసంతృప్తితోను, ఇంతఅశాంతితోను బాధపడు నిన్ను తప్ప ప్రపంచములో మఱియెవ్వరిని చూచి యెఱుగను. రాగద్వేషములకు వశుడనై భోగములను గ్రహింపలేదు. నీయిచ్చవచ్చినట్లు చేయవచ్చును. మా కెవ్వరివలనను భయము లేదు" అని స్పష్టముగా పలికినాడు. ఇంద్రునకు మహర్షి యవిధేయతకు మఱింతకోపము వచ్చినది. కఠోరస్వరముతో "మహర్షీ, నేడు పెక్కుకారణములచేత నిన్ను విడిచి పుచ్చుచున్నాను. కాని మఱెయొకపర్యాయ మెవరికైనను బ్రహ్మవిద్య నుపదేశించినయెడల వెంటనే నీశిరస్సు నావజ్రాయుధముతో ఖండింతును" అని పలికెను.

ఇంద్రుని యీ దుర్వ్యవహారము మహర్షి మనస్సుపై నెట్టిప్రభావము చూపజాలక పోయినది. అతని మోముపై కోపచిహ్నము కాని, క్షోభ చెందినగుర్తుకాని యేమాత్రము గోచరింపలేదు. పూర్వమువలెనే శాంతముగా నుండెను. చిఱునవ్వు నవ్వుచు "దేవేంద్ర, మంచిది. మేము మఱియెవరికైన బ్రహ్మవిద్య నుపదేశించిన మాశిరస్సు ఖండింపుము" అని సమాధానము చెప్పెను.

కోపముచే పిచ్చివాడైన ఇంద్రునిమనస్సుపై మహర్షి చూపిన క్షమ, శాంతము ప్రభావము చూపక పోలేదు. కాని ఒకసారి యుద్రిక్తుడైన తరువాత వెంటనే క్షమాభిక్ష నర్థించుట ఇంద్రుని స్వభావమునకు సరిపడు విషయము కాదు. వెంటనే యచటినుంచి లేచి నమస్కారాదిమర్యాదలను పాటింపక రాజధానికి ప్రయాణమైనాడు.

అశ్వినీకుమారులు చ్యవనమహర్షి యాశ్రమము చేరి తమనేర్పుచేతను, బుద్ధిబలము చేతను మహర్షి నేత్రములను బాగుచేసిరి. యువకులకుండు ఆరోగ్యము, సౌందర్యము, బలము చ్యవనమహర్షికి కలుగునట్లు చేసిరి. సుకన్యకు ఆమెతండ్రికి చాల సంతోషము కలిగినది. చ్యవనునియానందమున కవధియే లేదు. మహర్షి ఆనందముతో చిందులు త్రొక్కినాడు. అశ్వినీదేవతలయందు చాల ననుగ్రహము కలిగినది. కుమారులార, కంఠములో ప్రాణము లున్నంతవఱకు మీమేలు

మఱవజాలము. మాజీవితము సుఖవంతముగా చేసి, నాకే గాక సుకన్యకు ఆమెతండ్రికికూడ గొప్పమేలు చేసినారు. మాకు చేసిన యుప కారమునకు బదులుగా మీాకే వరముకావలసి నను కోరవచ్చును'' అని చ్యవనమహర్షి యశ్వనీదేవతలతో పలికినాడు. చ్యవనుని మాటలు దేవవైద్యులకు చాల సంతోషము కలిగించినవి. వారి మనస్సులలోని చిరకాల వాంఛితము సఫలమైనది. చ్యవనుని తపః ప్రభావము పూర్వమే వారు వినియున్నారు. కొంతసేపు యోచించి దస్రుడు పలికెను. ''మహర్షీ, మీాకు మాయందు వాస్తవముగా నను్రగహము కలిగినయెడల మాకు యజ్ఞము లందు భాగము పొందు నధికారము సిద్ధించు నట్లు చేయుడు. దేవేంద్రు డసూయతోను, విరోధభావముతోను దేవతలే కాక మహ ర్షులుకూడ మాకు యజ్ఞభాగము ఈయకుండున ట్లొనరించినాడు. మాకు జరిగిన పరాభవమునకు మిక్కిలి దుఃఖించుచుంటిమి'' నాసత్యు డా సమయమున మహర్షి మోము పరిశీలించుచు నిలబడియుండెను.

చ్యవనుడు ''చిరంజీవులార, మీా కోరిక నెఱవేఱును. మేము స్వయముగా గొప్పయజ్ఞ మొనరించి అందు మీాకు భాగ మిచ్చి యా పద్ధతి శాశ్వత మగు నేర్పాటు చేయుదుము. ఇంద్రునకు మేము భయపడము. మీారు నిశ్చింతగా నుండుడు'' అని యభయ మొసంగెను.

చ్యవనమహర్షి మహాయజ్ఞ మారంభించి యం దశ్వనీదేవతల నాహ్వానించి హవిస్సు నొసంగి తనమాట నెఱవేర్చుకొనెను. ఇంద్రుడు చ్యవనుని యజ్ఞమున అశ్వనీదేవతలకు ఆహ్వా నము రాకుండ చేయుటకు సర్వవిధముల ప్రయ త్నించెను కాని పని జరుగలేదు. యజ్ఞమున అశ్వనీదేవతలకు భాగము లభించుటయు ఇంద్రునకు గర్వభంగమగుటయు జరిగెను.

## 5

యజ్ఞమునభాగము లభింపగనే యశ్వనీ దేవతల కోపము శాంతించినది. వారు తమ గురువైన దధ్యఙ్మహర్షి మాటలపై పరిపూర్ణ విశ్వాస ముంచి బ్రహ్మవిద్యోపదేశము పొందు టకు యోగ్యతసంపాదించుటకై సాధన చేయ సాగిరి. వారికి సాధనమునకూడ సఫలత లభిం చినది. వారి స్వభావములు మార్పుచెందినం దుల కన్నివైపులనుండియు ప్రశంసలు రాసాగి నవి. దేవతలలోకూడ వారి ప్రతిష్ఠ పెంపొంది నది. మొదట నెక్కడకేగినను ఎవరును సరిగా మాట్లాడెడివారు కారు. ఇప్పుడు ఆదరపూర్వక మగు స్వాగతము సర్వత్ర లభించుచున్నది. లోకప్రవృత్తులయందు వారికి విరక్తి యేర్పడి నది. శృంగారభావములు మచ్చునకు గూడ లేవు. మృదువచనములచేతను సదాచరణము, సరళత్వము, శాంతము, అహింస మొదలగు సద్గుణములచేతను సాఫల్యము నందిరి. అశాంతి, అసంతుష్టి వారి నిర్మల మనస్సులను శాశ్వత ముగా విడిచిపెట్టినవి.

ఈప్రకారముగా వైరాగ్యాది సాధనముల చేత సుసంపన్నులైన సోదరు లిరువురును తమ గురువైన దధ్యఙ్మహర్షిని సమీపించి బ్రహ్మ విద్యాప్రాప్తికై తమకు గల యుత్కృష్టమైన వాంఛను వెల్లడించి వినయముగా ప్రార్థించిరి. దధ్యఙ్మహర్షికి పెద్ద సమస్య యేర్పడినది. అశ్వనీ కుమారుల నడవడివలన బ్రహ్మవిద్య బడయు టను వారు నిజమైన యధికారులై రని గ్రహిం చెను. కాని యింద్రశాసనము తన కడ్డువచ్చు చున్నది. ఒకప్రక్క మాటయిచ్చియు యోగ్య

శిష్యులకు బ్రహ్మవిద్య నుపదేశింపక పోవుట వలన రాబోవు పాపము, మఱియొకప్రక్క ఇంద్రునిమాట నతిక్రమించి యింద్రుడు బ్రహ్మహత్యాపాతకమునకు సిద్ధపడునట్లు చేయుట వలన రాబోవుదోషము మహర్షికి ఆందోళన కలిగించెను. ఇట్టి ద్వైధీభావముతో చాలసేపు మౌన మవలంబించి చివరకు ఇంద్రునకు తనకు జరిగిన వివాదము అశ్వనీకుమారులకు సంపూర్ణముగా వివరించి "నాయనలార, మాకు ప్రాణము లందు వ్యామోహము లేదు. మీ కిచ్చిన మాట నెఱవేర్పకుండుటకంటె మృత్యుదేవత యొడిలో నిద్రించుట మంచిది. మీ కిచ్చిన మాట నెఱవేర్చుకొనుట మాధర్మము. కాని వివశుడైన యింద్రుడు మమ్ము సంహరించును. ఈపాపము మాతలపై బడును. ఇట్టివిషమపరిస్థితిలో మమ్ము బాగుగా యోచించుకొననిండు. నేడాశ్రమమున ప్రశాంతముగా వసింపుడు. రేపుదయము మా నిశ్చయ మెఱింగింతు" మని పలికెను.

అశ్వనీకుమారులు గురువుగారి మాటలు విని మిగుల దుఃఖించిరి. కాని వారు వివేకము కోల్పోలేదు. కొంతసేపు యోచించి దస్రుడు "గురువర్య, మీకు ప్రాణాపాయము తెచ్చిపెట్టు బ్రహ్మవిద్య మా కవసరము లేదు" అని విన్నవించెను. మహర్షి దస్రునివైపు నవ్వుచు చూచి "నాయనలార, నాశనస్వభావము కల ప్రపంచమున జన్మించిన ప్రతిప్రాణియు నేదో యొక రోజున మరణింపక తప్పదు. ఎందుచేత ననగా ఇది కర్మభూమి. తా మాచరించిన సదసత్కర్మల ఫలము లనుభవించుటకై ప్రాణు లిచ్చటకు వచ్చును. మృత్యువు ప్రతివారికిని నిశ్చితమైనదే. మృత్యువునకు భయపడి యెవ్వరును తప్పించుకొనజాలరు. నేడో, నూరేండ్ల తరువాతనో, ఎప్పుడో యొకప్పుడు చావు తప్పదు. చావునకు భయపడువాడు పిఱికివాడు, పాపాత్ముడు. కర్తవ్యనిర్వహణలో ప్రాణత్యాగముచేసిన వాడమరు డగును. మృత్యువును గూర్చి తెలిసిన వా డెవ్వడును చావునకు భయపడడు" అని గంభీరముగా పలికెను.

గురువాక్యములకు దస్రున కాశ్చర్యము కలిగెను. మధ్యలో కల్పించుకొని "దేని నెఱింగిన చావునకు భయపడమో అట్టి మృత్యువుగూర్చి తెల్పు" డని ప్రార్థించెను.

దధ్యఙ్ఙు—"వత్సలార, మృత్యువు శరీరము మార్చును. ఆత్మ అజరామరము, నాశరహితము. ఆత్మ నెవ్వరుమ చంపజాలరు. ప్రాతబట్టను విడచి క్రొత్తబట్టను ధరించునట్లు ఆత్మ ప్రాతశరీరము విడచి క్రొతశరీరమున ప్రవేశించును. బాగుగా శ్రమించి పనిచేసి ధన మార్జించిన మానవుడు మంచివస్త్రము ధరించును. కష్టపడి ధన మార్జింపని వ్యక్తి సామాన్యవస్త్రము ధరించును. అట్లే తాము చేసిన సత్కర్మలవలన మంచిశరీరము, అసత్కర్మలవలన చెడుశరీరము ఆత్మపొందును."

నాసత్యుడు చేతులు జోడించి "గురుదేవ, మీమూలమున ప్రపంచమునకు గొప్పమేలు కలుగుట స్వయముగా చూడ గలిగిన మేము మీశరీరమును సర్వవిధముల రక్షింతుము. అది మా పరమధర్మము" అని విన్నవించెను.

దస్రుడు "గురుదేవ, నా కింద్రు డనిన ఏమాత్రము భీతి లేదు. నే నింద్రుని ప్రయత్నము లన్నియు వ్యర్థముచేయుదును. మీరు నిశ్చింతగా నుండుడు." నాసత్యుడు కుతూహలముగ తమ్ముని మోము చూడసాగెను.

దస్రుడు "గురుదేవ, వేఱు చేయబడిన యవయవములను కలిపి జీవింపజేయువిద్య మా యొద్ద నున్నది. ఆ విద్యాకౌశలముచేత మీరు

మరణింపనక్కఱలేకుండ మేము బ్రహ్మవిద్య కోల్పోవ నక్కఱ లేకుండ చేయుదుము.''

దధ్యఙ్-''అది యెట్లు సంభవ మగును?''

దస్రుడు-''గురువర్యా, ఒక గుఱ్ఱమును తీసి కొని వచ్చి దాని శిరస్సు మొదట ఖండింతుము. తరువాత మీశిరస్సు తీసి గుఱ్ఱమున కతికెదము, గుఱ్ఱము శిరస్సు మీ కతికెదము. మీరశ్వముఖ ముతో మాకు బ్రహ్మవిద్య నుపదేశింపుడు. ఇంద్రుడు వచ్చి మీరు మాకు బ్రహ్మోప దేశము చేసినందులకు కోపించి మీ కతుక బడిన యశ్వశిరము ఖండించిన, అశ్వము శరీరమున కతికిన మీ శిరస్సు దెచ్చి మీ శరీరమున కతికి మిమ్ము జీవింపజేయుదుము. అశ్వశిరస్సు అశ్వశరీరమున కతికి అశ్వమును కూడ జీవింపజేయుదుము. ఈ యుపాయము చేత మీరు మరణింపరు. గుఱ్ఱముకు మర ణింపదు. ఇంద్రునకు బ్రహ్మహత్యాపాతకము కలుగదు.''

నాసత్యుడు తమ్ముని మాటలు మౌనముగా నాలకించి మనస్సులో చాల సంతోషము పొందెను. దధ్యఙ్మహర్షికిగూడ దస్రుని యుపాయ మంగీకరించుటలో దోష మేమియు కనిపింపలేదు.

ఈ ప్రకారముగా దధ్యఙ్మహర్షి అశ్వ శిరస్సుతో బ్రహ్మవిద్య సంపూర్ణముగా నుప దేశించి యశ్వనీదేవతలను పరిపూర్ణబ్రహ్మ జ్ఞానులుగా జేసెను. వారిని యజ్ఞమునుండి బహిష్కరించు మాట యెత్తుట కెవ్వరికిని సాహసము లేదు. దధ్యఙ్మహర్షి యశ్వనీ దేవతలకు బ్రహ్మవిద్య నుపదేశించె నను సమాచారము తెలియగనే యింద్రుడు కోప ముతో రాజధానినుండి మహర్షియాశ్రమము నకు పరుగుపరుగున వచ్చినాడు. వెంటనే యేమియు ప్రశ్నింపక క్రూరవజ్రముతో మహర్షి శరీరమున కతుకబడిన యశ్వశిరస్సు ఖండించినాడు. కాని యశ్వనీకుమారులు సంజీవనీవిద్యచే గుఱ్ఱముశరీరమున కతుకబడిన గురుశిరస్సు తెచ్చి గురుశరీరమున కతికి యింద్రునియెదుటనే గురువును జీవింపజేసిరి. నేలపై పడియున్న యశ్వశిరస్సు గుఱ్ఱమున కతికి దానినికూడ జీవింపజేసిరి.

ఇంద్రు డాశ్చర్యచకితుడై భయముతో చూచుసరికి దధ్యఙ్మహర్షి యానందముగా చూచుచుండెను. గుఱ్ఱము కిలించుచు సంతోషముగా గంతులు వేయుచుండెను. ఇంద్రుడు సిగ్గుతో తలవంచుకొని మౌనముగా రాజధానికి వెళ్ళిపోయెను. అశ్వనీకుమారులకు చిరకాలవాంఛ నెఱవేఱినది. ప్రియశిష్యుల కోరిక నెఱవేఱినందులకు మహర్షికిగూడ ఆనందము కలిగెను. గుర్వాశ్రమంబున రెండు మూడు రోజు లుండి యంతిమ దీక్షనుకూడ స్వీకరించి యింటికి వెళ్ళుట కనుమతి కోరు చున్న యశ్వనీకుమారులను జూచి మహర్షి ప్రసన్నతతో వారికి సెల విచ్చుచు ''కుమారు లార, వెళ్ళిరండు. ప్రయాణము సుఖప్రద మగుగాక. సత్యము, ధర్మాచరణము, స్వాధ్యా యము నెప్పుడును పరిత్యజింపకుడు. అనింద్య మైన కర్మలనే యాచరింపుడు. పొరపాటున గూడ నింద్యకర్మల నాచరింపకుడు. బిడ్డలార, కపటము, ఈర్ష్య, ద్వేషము మొదలగు దుర్గుణములను దరిజేరనీకుడు. పరుల కుపకార మొనరించుచు ఆనందముగా జీవింపుడు. పరోప కారమును మించిన పుణ్యము లేదు. శత్రు వులపైగూడ మైత్రీభావము కలిగియుండవలెను. అట్లుండిననే బ్రహ్మవిద్య సుఫలమగును. నా యీ యుపదేశములను సర్వకాల సర్వావస్థల

యందును గుర్తుంచుకొను'' డని హితవు గఱపెను.

సోదరు లిరువురును గురూపదేశామృతము గ్రోలి గురుపాదములపై చివరిసారిగా శిరము లుంచి మ్రొక్కి తమ నివాసమునకు పయనమైరి. వారి నిర్మలమనస్సులకు శాంతిసంతోషములు కలిగినవి. సహజప్రసన్నమైన వారి మనస్సులనుండి పగ మాయమైనది. వారి బాహ్యాభ్యంతరదృష్టులలో అనిర్వచనీయభావములు గంతులు వేయసాగినవి.

# శివానంద స్మృతులు-36*

## అను : శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

శనివారము 23-3-1929.
బేలూరు మఠము.

శ్రీమహాపురుషుల ఆరోగ్యము చాల చెడెను. కాని వారు శరీరమువైపు ఇసుమంతయు లక్ష్యము పెట్టలేదు. శరీరబాధల ననుభవించుచున్నను- వారిమనస్సు సదానందసాగరమున నోలలాడుచుండెను.

ఉదయము సుమారు 8 గంటలసమయమున ఒకవృద్ధసన్న్యాసి వచ్చి శ్రీమహాపురుషులకు సాష్టాంగప్రణామము చేసి - మీ ఆరోగ్యమేలా గున్న దని ప్రశ్నించెను.

మహాపురుషులు: - ఈ అనిత్య శరీరమును గూర్చి అడుగుచున్నావా? ఈవృద్ధవయస్సులో శరీర మెట్లు బాగుండగలదు ?

సన్న్యాసి:-అదే అగపడుచున్నది-మీ శరీరారోగ్యము శిథిలమైనది. ఇట్టిస్థితిలో మిమ్ముల చూచుచుండ చాలకష్టము వేయుచున్నది.

మహాపురుషులు :- ఈశరీర మింక ఎక్కువ దినము లుండబోదు. శరత్తుమహారాజు(శారదానందస్వామి) పోవుటతో, నా కుడిచేయి విరిగిన ట్లయినది. ఏమియు తోచుటలేదు-పనిపాటలలో మనస్సు పోవుట లేదు. అప్పుడే నేను పోవుటకు తయారై యుంటిని. శరత్తు మహారాజు పోయినప్పటినుండి శరీరము చాల నీరసమై పోయినది. ఇక నేను బ్రతికియుండ ఇష్టము లేదని శ్రీఠాకూరుకడ విన్నవించుకొంటిని. కాని నాప్రార్థన వారు ఆలకింపలేదు. బలాత్కారముగ వారు నన్ను ఇంకను జీవించి యుండజేయుచున్నారు. వా రుంచినట్లే పడియున్నాను. వారు నన్ను అపుడే ఎందులకు పోనీయలేదో, ఆయనకే ఎఱుగును. అంతయు ఆయనఇచ్ఛ. ఆయన ఎన్నిదినము లుంచునో, అన్నిదినము లుండవలసినదే.

సన్న్యాసి:-అది నిజమే. భగవానుని ఇష్టమే నెఱవేఱుగాక ! కనీసము మాకొఱకై మీకు దీర్ఘాయువు ప్రసాదింపు మని మేమెల్లరము నిత్యమును శ్రీభగవానుని ప్రార్థించుచున్నాము. మీరు లేనిచో ఈసంఘముయొక్క ఆధ్యాత్మికశక్తి వికాసము తగ్గిపోవును. మీ రేమియు పని చేయ నక్కఱలేదు. మీరు ఊరకకూర్చుండి యున్న చాలును. మీఇచ్ఛాశక్తి ద్వార పనులన్నియు సక్రమముగ నెఱవేఱును. ఆలాగే జరుగుచున్నవి కూడను. మీరు మా కెల్లరకును శక్తిని ప్రసాదింపుడు-మాకు ఉత్సాహము కల్గింపుడు - మ మ్మాశీర్వదింపుడు. మిగత కార్యములెల్ల మేమే సవరించుకొనెదము. స్వామీ, మే మెచ్చటనున్నను సరే, మీరున్నారను తలపు మాకు బలము చేకూర్చుచున్నది.

*36_వ 37_వ సంస్మృతులు వరుసతప్పిన పొరపాటునకు చింతిలుచున్నాము. సం॥

మహాపురుషులు:-మీరెల్లరును నేనింకను జీవించియుండవలె నని కోరుచున్నారు. నాపై మీకు గల శ్రద్ధాభక్తుల విషయము నేను బాగుగ ఎఱుగుదును. శ్రీఠాకూరు సంఘములో - పరస్పరము ప్రేమవాత్సల్యములు, శ్రద్ధాభక్తులు కల్గియుండుటచే సంఘజీవనశక్తి నిశ్చలముగ నున్నది. పరస్పరము, నిస్స్వార్థప్రేమ సంబంధము ఎంతకాలము స్థిరముగ నుండునో, అంతకాలము ఈసంఘాధ్యాత్మికశక్తి నిరాటంకముగ విరాజిల్లగలదు. ఎందుచేతననగా శ్రీభగవానుని అండగ జేసికొనియే కదా ఈ పరస్పరాభిలాష కల్గినది. వానిని కేంద్రముగ జేసికొనియే ఈప్రేమబాంధవ్య మేర్పడినది? దేహము నశించినను, ఈసంబంధము నశింపదు సుమా. మును పటి సంఘాచార్యులశక్తి నేటికిని ఈ సంఘము ద్వారా పనిచేయుచునే యున్నది. ఈశక్తి ఎన్నటికిని తరుగదు-ఇదే చూడుము. స్వామీజీ (వివేకానంద); బ్రహ్మానంద (మహారాజు) బాబురాం మహారాజు (ప్రేమానంద); హరి మహారాజు (తురియానంద) శరత్తు మహారాజు (శారదానందస్వామి) ఒక్కొక్కరుగ వీరందఱును పాంచభౌతికశరీరమును వీడిపోయిరి. శరీరము నశించినంతమాత్రమున ఏలాటి నష్టము కలుగ దాయె. వారలపై మాకుండిన శ్రద్ధాభక్తులు, ప్రేమవాత్సల్యములు తగ్గినవా? వారి ఆధ్యాత్మికశక్తి సడలెనా? ఆశక్తి ఎన్నటికైన నశించునా ఏమి? అదెన్నటికిని నశింపదు - వారెల్లరును సర్వదా విరాజిల్లుచున్నారు - వారిశక్తి విభిన్నాధారములద్వార యథాతథముగ పని చేయుచునేయున్నది. వారి జీవితములే నేటికిని మాకు ఆధ్యాత్మికప్రేరణ నిచ్చునవి-మమ్ము సక్రమమార్గమున నడిపించుచున్నవి. స్థూలశరీరము వీడి వారు చిన్మయదేహముల నలంకరించిరి - సూక్ష్మరూపమున ఇనుమడింపుగ కార్యముల సల్పుచున్నారు. అవసరమైనపుడెల్ల ప్రత్యక్షరూపమున దర్శనమిచ్చి, కార్యకలాపముల విషయముల కనువగు ఉపదేశముల నిచ్చుచునే యున్నారు. మనస్సు సమాధియందు లయించును. అట్టితఱి ఆ దివ్య మహాపురుషులతోడ ఘనిష్ఠసంబంధము ఏర్పడును. వారితో సల్లాపములు చేయనగును. మా ఈ శరీరము నశించిన వెంటనే మేమును వారిలో ఐక్యమైపోయెదము. అపుడు శ్రీఠాకూరును ధ్యానించినచో, మమ్ము ధ్యానించినట్లే మేము శ్రీభగవానుని భక్తులము, వాని దాసులము, భగవానులు వినా మాకు ప్రత్యేకమైన అస్తిత్వము లేదు. మా వ్యక్తిత్వమెల్ల ఆయనలో లీనమై పోయినది. శ్రీ ఠాకూరు (రామకృష్ణులు) సాక్షాత్సనాతనపరబ్రహ్మము.

సన్న్యాసి:-మహారాజ్-మేము స్థూలజగత్తులోనే యున్నాము-కాన మేము మిమ్ముల స్థూలరూపముననే కోరుచున్నాము. అదియుగాక మా మనస్సులు ఉన్నతాధ్యాత్మికావస్థ నందలేదు- శ్రీఠాకూరు దర్శనము మాకు కలుగలేదు. మీరు శ్రీఠాకూరునకు అంతరంగపార్షదులు. మేము మీగుండనే శ్రీభగవానుని తెలిసికొన ప్రయత్నించుచున్నాము. మాప్రార్థనల మీ రంగీకరించుచో, భగవాను డంగీకరించినట్లే మేము భావింతుము.

మహాపురుషులు: - మా శరీరము నశించినను, మాతోడ కల్గిన ఈ సంబంధ మెన్నటికిని తొలగిపోదు. నేను హృదయపూర్వకముగ ఆశీర్వదించుచున్నాను. మీ హృదయములు, భక్తి,ప్రేమ,విశ్వాస, పవిత్రతలతో పరిపూర్ణములగుగాక. మీకు ఉన్నతి కల్గుగాక. ఇదియే నా ఆశీర్వాదము. మీద్వార పలురకములగ లోకకల్యాణకార్యములు నెఱవేఱుగాక ! శ్రీఠాకూరు మిమ్ముల సక్రమమార్గమున నడిపి

చుచు, మీకు అపరిమితశక్తి నిచ్చుగాక. శ్రీ ఠాకూరును, స్వామిజీయు లోకహితార్థమే మానవరూపముదాల్చిరి. సమగ్రబ్రహ్మాండమునకు, శాంతి ప్రసాదించుటకే, శ్రీఠాకూరు మానవరూపమున అవతరించినది. శ్రీవారి యుగధర్మప్రవర్తనకార్యార్థమే స్వామిజీ ఈ సంఘమును స్థాపించినది. స్వామిజీ ప్రచారము చేసినట్టి ఆదర్శమును, సమస్తప్రపంచము క్రమముగా అనుసరింపవలసినదే. ప్రపంచమున శాంతి స్థాపనమార్గమిది. ఇది తప్ప వేఱొండు లేదు.

# శివానంద లేఖావళి

## 57

చిల్కాపేట,
అల్మోడా, ఉ.ప్ర,
25 సెప్టెంబరు 1915

ప్రియజీ,—ఎన్—,

క్రిందటినెల 10 వ తేదీ మీరు వ్రాసిన జాబు నాకు యథావిధిగ చేరినది. జాబు వ్రాయ నే నాలసించితిని. ఈశ్వరానుగ్రహమున మీరందఱును క్షేమముగా నున్నారని అనుకొనుచున్నాను. తూర్పుబంగాళములో క్షామతీవ్రత రవంత తగ్గినట్లున్నదని మీరు వ్రాసితిరి. కాని తగ్గుపాటు నా కగపడుట లేదు. క్షామతీవ్రత హెచ్చినట్లుగకూడ నాకు తోచుచున్నది. అంతే కాదు. బంకూరాలో తీవ్రక్షామ మేర్పడినదని వార్త వినవచ్చినది. ఈసారి దేవుని సంకల్ప మేమో దేవునకే తెలియును. ఆయన కరుణించును గాక. ఇంతకన్న నేను వేఱేమి చెప్పగలను? దేవుని కరుణామయరూపమును గాంచవలెననుటే మా కోరిక. దేవుని సృష్టిస్థితిసంహారములను మూడింటిని చూడగోరినవాడు చూచును గాక. మాకేమో దేవుని కరుణామూర్తిని చూడవలెననిమాత్రమే కోరిక. మామట్టుకు మాకు ఆయన ప్రేమనాథుడు. కృపామయుడు.

ఈశ్వరానుగ్రహముచే మీ రందఱును క్షేమముగ నున్నారనువార్త విని నే నెంతయు సంతోషించితిని. 'భగవంతుడు మిమ్మందఱిని సర్వవిధముల సుస్థితియందుంచును గాక.' అనుటయే హృదయపూర్వకమైన నా ప్రార్థన. మీ ప్రేమను భక్తిని సేవాపరతను స్మరించినప్పుడు మీరు ఈశ్వరుని ప్రత్యేక కటాక్షమునకు పాత్రులైతిరని నాకు తోచును. మాతృశ్రీగారి కృప దానిప్రత్యక్షప్రదర్శనమే. అప్పుడప్పుడు కనీసము వారమున కొక్కసారియైనను భక్తులందఱు ఒక్కచోటకూడి గురుదేవునిగూర్చిన పఠనవివరణములందు పాల్గొనుచు ఆయనమహిమలను కీర్తించుచుందురేని చాల బాగుండును.

హరిమహారాజు నారోగ్యము మునుపటి కంటె చాల మెఱుగే. ఆయన సమష్టియారోగ్యము పెంపొందినప్పటికిని మధుమేహాము జీర్ణించిపోయినరోగి యతడు. కాబట్టి ఆయనకా బాధ ఇప్పుడును ఉన్నది. ఇచ్చటి చల్లని వాతావరణముచేతను ఆహారవిషయమున వహించుచున్న జాగరూకతచేతను ఆయన పరిస్థితి మొత్తముమీద చాల మెఱుగుగా నున్నది. మధుమేహవ్యాధి బాధ అంతతీవ్రముగ లేదు.

కొన్నాళ్ళక్రింద ఉత్తరకాశీలోని "దేవేన్" (దేవేంద్రు)నుండి నాకొక జాబు వచ్చినది. దైవకృపచే అత డచ్చట చాలహాయిగ నున్నాడు. నాయొక్క హరిమహారాజుయొక్క హృదయపూర్వకప్రేమాశీస్సులను మీరు స్వీక

రింపుడు. అందఱికి నంద జేయుడు. మీయందఱి క్షేమమును అప్పుడప్పుడు తెల్పుచుండుడు.

మీ శ్రేయోభిలాషి
శివానంద

## 58

చిల్కపేట, అల్మోడా
ఉ.ప్ర. 10 అక్టోబర్ 1915

ప్రియ-

ప్రేమతో నీవు వ్రాసిన జాబు అందినది. మా హృదయపూర్వక ప్రేమాశీస్సులను అక్కడి భక్తులకు అందజేయుము. భగవత్కృపచేత మా ధ్యానప్రార్థనలకు విశ్వమానవ శ్రేయస్సు తప్ప వేఱొక లక్ష్యము లేదు. భగవన్నామమును జపించుచు ఆయనను ధ్యానా సీనులము కాగా మా డెందములలో పైకుబుకు భావము ఇది:—"దేవా, కారుణ్యరూపా, విశ్వమానవులకు శ్రేయస్సు సమకూర్పుము."

భగవంతుడు నిత్యుడు. వేదాది శాస్త్రములును నిత్యములే. పుణ్యక్షేత్రములును నిత్యములే. కాని ధర్మముమాత్రము క్షీణించుచున్నది. భూప్రజలచిత్తములు కలుషితములైనప్పుడు సర్వేశ్వరుడు అవ్యాజకృపచే అవతరించును. లేనిచో లోకమునకు ఉద్ధరణ మార్గము వేఱు లేదు. ఇందుకు చరిత్రయే సాక్ష్యము. ప్రకృతయుగమున కరుణామూర్తియగు శ్రీరామకృష్ణుడును ఆయనయొక్క శక్తిస్వరూపిణియగు మాతృశ్రీ శారదాదేవియు శ్రీవివేకానందస్వామి ప్రముఖులగు వారి అనుచరులును విశ్వశ్రేయస్సంపాదనకైయే అవతరించినవారు. ఇంతకన్న నేమి వ్రాయుదును?...

ఆస్థతో నీ శ్రేయము కోరు
శివానంద

## 59

చిల్కపేట, అల్మోడా
ఉ.ప్ర. 12 అక్టోబర్ 1915

అత్యంతప్రియ బాబూరామ్ మహరాజ్,

అన్నిసంగతులను వివరముగా తెలియజేయు నీపెద్ద జాబును చూచుకొని ఎంతో సంతోషించితిని. ఇది నీ ప్రేమకరుణలకు సూచకము. సుదీర్ఘకాలము నీయొద్దనుండి అట్టి జాబు రాకున్నచో మనస్సు ఎండుకొనిపోవును. గురుదేవునికరుణ అనంతము నిరవధికము. ఆయన కరుణాప్రవాహవేగమును శక్తియు ఇంతంత కాదు. పల్లమువంకకు సాగు పాఱుదలకూడ మీదివంకకు త్రిప్పబడును. ఇప్పటి పంపులపద్ధతి ప్రకృతిసూత్రముల అవధులను అతిక్రమించి పోయినది. ప్రకృతికి విజ్ఞానమునకు పోరాటము సాగుచున్నది. ఈ చిన్నగుట్టనుగూర్చి చెప్పవలయునా? నీ ప్రేమ ప్రవాహము దుస్తరగహనోత్తుంగమగు అవిద్యాపర్వతమునుసైతము దాటి సామాన్యమానవుల జీవితములను ధన్యములుగ నొనర్చును. సర్వమునకును కర్త గురుదేవుడొక్కడే అనుటను మీ రందఱును యథాతథముగా గ్రహించితిరి. అందుంగూర్చి సందేహము లేదు. మిమ్ముల నందఱిని ఆయన సొంతచేతులతో దిద్దితీర్చినాడు. స్వకర్తృత్వబుద్ధి మీయందు కలుగుట ఎట్లు శక్యము? ఎన్నటికిని కలుగదు. మీయందున్న అహంకారము దాస్యాహంకారము, శిశూచితాహంకారము, భక్తాహంకారము. అంతేగాని అనర్థావహమగు మాయామాలు అహంకారము కాదు. సలహాలతో ఉపదేశాలతో నిండియున్న నీజాబు నాకెంతయు ప్రీతి గూర్చినది. అవి నీలో నీ వనుకొనిన మాటలనుటకు సందేహము లేదు. కాని గురుదేవుని

ఆ వచనామృతమును నన్నుద్దేశించి నీవు చెప్పు చుండినట్లు నా కనిపించినది. అప్పుడప్పు డట్టి జాబులు నీవద్దనుండి వచ్చుచుండునేని నాకు కలుగు ఆనందసముత్సాహములు వర్ణనాతీత ములు. నీ వాక్యావళి యంతయు సజీవము. మాటలలో జీవము లేకుండిన అవి డెందములను ఉత్తేజపఱుపజాలవు.

చి. ర. దాసు సకుటుంబముగా ఇక్కడికి వచ్చియున్నాడు. ఇక్కడినుండి మాయావతికి పోవును......

పాపము, ఫ్రాంకుగారికడుపులోని కారిజము (లివరు) ప్రకోపించి యున్నది. కాబట్టి ఆయన చాలదినములుగా ఖాయిలాగా ఉన్నాడు. పైగా అతనిచేత పైసా లేదు. అమ్మ సేవియరు అతని కేదో కొంచెము ఇచ్చుచు నుండును. అతని స్వభావము చాలముచ్చటకొలుపునదిగా మాఱిపోయినది. ధ్యాన ప్రముఖ తపస్సాధన లందు అతని మనస్సు ప్రవణమై యున్నది. మఠములోను కలకత్తాలోను కొన్నాళ్లుండమను తీవ్రమైన కోరిక అతనికి ఉన్నది.

హరిమహారాజు పరిస్థితి అట్లే ఉన్నది. మఠ ములో ఈదినాలలో ఆరోగ్యవిషయమున నీవు చాల జాగరూకుడవై యుండవలయును. అచ్చట ఆరోగ్యమునకు చాల చెఱుపుచేయు ఋతువు ఇది........హృదయపూర్వక ప్రేమాశిస్సులు నావి, హరిమహారాజువి అందుకొనుము.

ప్రేమానురాగప్రయుక్తలేఖలను దయచేసి అప్పు డప్పుడు వ్రాయుచుండుము.

సేవకుడు తారకుడు.

అనుబంధము : ఒకనాడు గురుదేవుడు దక్షి ణేశ్వరమున తనగదిలో కూర్చుండి ఒక మార్వాడీభక్తునితో సంభాషించుచుండెను. సంగమునుగూర్చి రవంత చర్చ సాగినపిమ్మట గురుదేవుడు భక్తునితో తుద కిట్లనెను. "సన్న్య సించినవాని మనస్సు నుండి కరుణతప్ప తక్కిన వృత్తులన్నియు రాలిపోవును." మనభాషలో దానిని ప్రేమ అందుము. వివిధమనోవృత్తులు గల భక్తులను భగవంతు డొకజట్టుగా కూర్చు నది ప్రేమబంధముచేతనే. ప్రేమపరవశుడై కృపాపరవశుడై భగవంతుడు ప్రతియుగము నందును భువియందవతరించి నానాకష్టములకు లోనై విశ్వమానవతతికి సంక్షేమమును సమ కూర్చును. ఆలాగు ఆయన చేయకుండిన మాన వులకు క్షేమము ఎప్పుడుగాని కలుగజాలదు. వేదాదిశాస్త్రములు ఎల్లప్పుడును ఉండునవే. పుణ్యక్షేత్రములును సదా ఉండునవే. యోగు లును సాధువులును సదా సర్వకాలము ఏదో ఒకచోట కననగుచుందురు. కాని ధర్మమునకు హాని కలుగుచునే ఉండును. చరిత్రచే సిద్ధించిన నిర్ణయ మది. కావున సామాన్యమానవులకై, బహుజనసుఖమునకై బహుజనహితమునకై పరమపురుషుడు కరుణాప్రేరితుడై అప్పుడప్పుడు అవతరించుచుండును.

"స, రి, గ, మ, ప, ద, ని" అని ఊరక నోటితో అనుట తేలికయే. కాని వానిని ఒక వాద్యమువిూద పలికించుట కష్టము. అటులనే మతధర్మములను గుఱించి మాటలాడుట సులభమే. కాని ఆచరించుట దుర్లభము.

—శ్రీ రామకృష్ణుడు.

# వారలు - విశేషాలు

## శ్రీరామకృష్ణ మఠము మదరాసు-4

బుద్ధజయంతీ మహోత్సవాంగముగ 1970 సంవత్సరం జూన్ నెల 21-వ తేదీ భానువారం మద్రాసు మైలాపూరు శ్రీరామకృష్ణ మఠావరణలోని వివేకానందహాలులో పౌరసభ సమావేశమైనది. ప్రార్థనగేయం, మంత్రపుష్పం అయ్యాక మఠాధ్యక్షులు శ్రీమత్ కైలాసానంద స్వాములు సదస్సుకు స్వాగతమంగళవాక్కు అనుగ్రహిస్తూ ఇలా గన్నారు:- "బుద్ధభగవానుడు దేశచరిత్రలో మిక్కిలి రంజకవ్యక్తులలో ఒకడు. విశ్వమహాపురుషులలో యుగపురుషులలో ఆయన అన్యతముడు. ఆయన జీవితచరిత్రము అవిస్మరణీయము. 2,500 సంవత్సరములకు పూర్వం అవతరించి ఆయన మనదేశంలో సన్యాస సంప్రదాయభద్రతకు అభివృద్ధికి దోహదం చేశాడు. ధర్మమునకు గ్లానియు అధర్మమునకు అభ్యుత్థానమును కలిగినప్పుడెల్ల పరిస్థితులను చక్కపెట్టడానికి ఒక అవతార పురుషుడు జన్మిస్తూండడం మనదేశచరిత్రలో గల ప్రత్యేకత. భారతీయ సంస్కృతి, ఎన్ని విప్లవాలు కలిగినా చెక్కు చెదరకుండడం ఈ ప్రవక్తలప్రభావంచేతనే. బుద్ధుడు మనుష్యచంద్రుడని పొగడ్తనొందినాడు. అవతార పురుషునిగ భారతీయులాయన్ను ఆరాధిస్తున్నారు. నిజానికి హిందువు లందరిలోకి ఆయనే హిందువు. ఒక్క పరమపురుషుడే యుగావసరములనుబట్టి రాముడుగ కృష్ణుడుగ బుద్ధుడుగ శంకరుడుగ రామకృష్ణుడుగ అవతరిస్తున్నాడని మనవిశ్వాసం. బుద్ధదేవునియందు శ్రీవివేకానందస్వామి కుండిన ఆదరం ఇంతంతకాదు. స్వామికి మొదట కలిగిన దివ్యదర్శనము బుద్ధభగవానుని దివ్యదర్శనమే. బౌద్ధమతము హిందూమతము అను రెంటిలో ఇది లేక అది ఉండ లేదు, అది లేక ఇది ఉండ లేదు. అని ఉద్ఘాటించారు స్వామీజి. బుద్ధదేవుడు జనింపజేసిన ధర్మశక్తివేగం 25 శతాబ్దులు సాగింది. కాలతత్త్వం ఉన్నంతవఱకు అది ఆలాగు సాగుతూ ఉండగలదు."

వివేకానందకాలేజీప్రొఫెస్సరు కె. శ్రీనివాసనుగారు బుద్ధదేవుని జీవితోపదేశములను గుఱించి ఆంగ్లములో మహోపన్యాసమును గావించినారు. ఆచార్య వి. కె. సీతారామనుగారి వందనసమర్పణంతో సభా కార్యక్రమం ముగిసింది.

## శ్రీరామకృష్ణ మిషను ఆశ్రమం విశాఖపట్నం, 1968-69 నివేదిక

ఈసంవత్సరం ఈ కేంద్రంలో నిర్వర్తితములైన కార్యక్రమాలు :-

ఆశ్రమంలో నిత్యపూజ యథావిధిగా జరుగుతూ వచ్చింది. పౌరమహాజనులున్నూ అందు పాల్గొనేవారు. ఏకాదశి దినాలలో రామనామ సంకీర్తనం జరిగేది. భక్తులత్యధికసంఖ్యాకులు అందన్వయించేవారు. శ్రీశారదా - శ్రీరామకృష్ణ-వివేకానంద-బుద్ధ-శంకరాచార్య ప్రముఖుల జయంతిమహోత్సవాలు నిర్వర్తింపబడ్డాయి.

సంస్కృతి కేంద్రాలలో బాలురకు ఇతర శ్రద్ధాళువులకు సంస్కృతభాష సుగ్రహీతులలో బోధించబడింది. విద్యాబోధక చలనచిత్రాలు ప్రదర్శించబడ్డాయి. బహుళంగా బొమ్మల పుస్తకాలు గల శిశుగ్రంథాలయం చక్కగా వినియుక్తమైనది.

సాయంవేళలలో వివేకానందహాలులో భారతరామాయణభాగవతపురాణకాలక్షేపం జరిగేది. పౌరమహాజను లత్యధికసంఖ్యలో హాజరౌతూవచ్చారు.

ఉచితగ్రంథాలయంలో ఉన్న గ్రంథాల సంఖ్య 2345. ఆఱు వార్తాపత్రికలు ఇరవై తదితరపత్రికలు ఉచితపత్రికాపఠనాలయానికి వస్తుండినాయి.

శ్రీశారదాబాలవిహారము:- 1958 వ సంవత్సరంలో ప్రాథమిక పాఠశాల ప్రారంభింపబడింది. ఇందు పాఠాలు ఇంగ్లీషుభాషలో బోధిస్తారు. ఈసంవత్సరం ఇందు చదువుతుండిన శిశువుల సంఖ్య 324. ఇక్కడ పాఠం చెప్పే క్రొత్తపద్ధతులనున్నూ శిశువులపట్ల చూపబడే శ్రద్ధనూ తల్లిదండ్రులు ప్రశంసించారు.

ఇక్కడి ఉచితవైద్యశాలలో రోగులకు హోమియోపాతిక్ సేవకసమాజంవారి ఆధ్వర్యంలో చికిత్స చేయబడుతూఉంది.

ఆశ్రమానికి జరూరు అక్కఱలు:- స్కూలు భవనంపై ఒక అంతస్తు నిర్మించాలి. లైబ్రరీకి రీడింగురూమును పుస్తకాలు పత్రికలు ఇతర పరికరాలు కావాలి, శిశుగ్రంథాలయానికి బొమ్మలపుస్తకాలు కావాలి. ఉన్న భవనాలకు మరమ్మతులు చేయవలసిఉన్నది.

# గ్రంథపరిచయం

## యాత్రామార్గదర్శి

ద్వితీయభాగము (ఉత్తరభారతతీర్థక్షేత్రములు) చతుర్థముద్రణము, పుటలు 560, వెల అట్టబైండు ప్రతి రూ. 6.50. క్యాలికోబైండు ప్రతి రూ. 8.00 లు. రచయిత శ్రీరాగం వేంకటేశ్వర్లుగారు, ప్రకాశకులు శ్రీసీతారామనామసంకీర్తనసంఘమువారు, శ్రీరామనామక్షేత్రము, గుంటూరు 4.

యాత్రల ఆవశ్యకతను భారతీయులకు ఉపన్యసించడం జ్ఞాతజ్ఞాపనమే అవుతుంది. సంసారతరణార్థులకు క్షేత్రయాత్రలు ఎంత ఆవశ్యకాలో, ఆ క్షేత్రాలనుగూర్చిన సర్వవిషయాలను తెలియజేసే యిట్టి గ్రంథాలును అంత ఆవశ్యకాలే. ఆ అక్కఱను గుంటూరు సీతారామనామసంకీర్తనసంఘంవారు శ్రీరాగం వేంకటేశ్వర్లుగారిచే ఈ గ్రంథరచన చేయించి సర్వజనసంస్తుత్యంగా తీర్చినారు. ఈ ద్వితీయభాగంలో మహారాష్ట్రఘూర్జర సౌరాష్ట్ర రాజస్థాన మధ్యప్రదేశోత్తర ప్రదేశములలోను పశ్చిమబెంగాలులోను అస్సాము ఒరిస్సా ఆంధ్రరాష్ట్రములలోను ఉన్న పుణ్యక్షేత్రములు ఉత్తరభారతక్షేత్రము లనుపేర వివరింపబడ్డాయి. ఈ గ్రంథము విలువను యాత్రార్థులు చక్కగా గుర్తించా రనడానికి నాలుగోకూర్పుజరూరు కావడమే తార్కాణం. సర్వజిజ్ఞాసూపజీవ్యమైన యీ పుణ్యగ్రంథమునకును దీని కర్తలకును కారయితలకును ప్రేరకులకును అనుమోదకులకును అధమర్ణులు కాని ఆస్తికాంధ్రు లుండరు. వారికి నిత్యమంగళములు కలుగును గాక.

## శ్రీ లలితాసహస్రనామస్తోత్రమ్

ఇది ఆర్షసాహితీచతుర్థపుష్పము. పాకెట్టుసైజు పుటలు 124, వెల 40 పైసలు, ప్రాప్తిస్థానం ఆర్షసాహితి 25-8-18 ఆమంచివారివీధి, విజయనగరం 2. పారాయణమునకు అత్యంతోపయుక్తముగురీతి ముద్రితమై యున్నది. అనుబంధంగా శ్రీపంచదశీస్తోత్రము చేర్చబడిఉంది.

ప్రభాకర్

# భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు కర్మయోగ రహస్యము నెఱుఁగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

# శ్రీరామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50 క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

గ్రేసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# జ్ఞానయోగము

అనువాదకులు :
శ్రీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు  రెండవ కూర్పు  వెల : రూ. 4-00

నూతన ముద్రణము :  ఇప్పుడే వెలువడినది :

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము – రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)  ఆఱవ కూర్పు  వెల : రూ. 2-50

అడ్రసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హిరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హిరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము ౨౭  ౧౯౭౦ - సెప్టెంబరు : సాధారణ - భాద్రపదము  సంచిక ౩

## విషయసూచిక

‘అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౦ – సెప్టెంబరు : : సాధారణ – భాద్రపదము { సంచిక 3

శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః
ముముక్షో రేవ హి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతా మతా. 17

సారాసారవివేకమును అసారములందు వైరాగ్యమును శమదమాదిగుణసంపదయు మోక్షాభిలాషయు గలవాడు మాత్రమే బ్రహ్మవిచారముచేయుట కర్హుడు. ౧౭

సాధనా న్యత్ర చత్వారి కథితాని మనీషిభిః
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిద్ధ్యతి. 18

ఇందుకు నాలుగు సాధనములను ఋషులు చెప్పియున్నారు. అవి యున్ననే బ్రహ్మవిచారము సాగును. బ్రహ్మనిష్ఠ సిద్ధించును, అవి లేకున్న బ్రహ్మవిచారము సాగదు, బ్రహ్మనిష్ఠ సిద్ధింపదు. ౧౮

ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః పరిగణ్యతే
ఇహాముత్రఫలభోగవిరాగ స్తదనన్తరమ్
శమాది షట్కసమ్పత్తి ర్ముముక్షుత్వ మితి స్ఫుటమ్. 19

ఆ నాల్గు సాధనము లేవి యనగా—(1) నిత్యానిత్యవస్తువివేకము, (2) ఈలోకమునగాని పైలోకమునగాని స్వకీయసుకృతఫలానుభవముపట్ల విరక్తి, (3) శమదమాదిగుణములు ఆఱు, (4) మోక్షాభిలాష. ౧౯

బ్రహ్మసత్యం జగ న్మి థ్యేత్యేవం రూపో వినిశ్చయః
సోఽయం నిత్యానిత్యవస్తువివేక స్సముదాహృతః. 20

"బ్రహ్మము సత్యము జగత్తు మిథ్య" అను నిశ్చయమునే నిత్యానిత్యవస్తువివేక మందురు. ౨౦

త ద్వైరాగ్యం జిహాసా యా దర్శనశ్రవణాదిభిః
దేహాదిబ్రహ్మపర్య న్తే హ్యానిత్యే భోగవస్తుని. 21

దేహాదిబ్రహ్మపర్యంత మున్న భోగవస్తువుల అనిత్యత్వమును దర్శనశ్రవణాదులచే నెఱిగినంతనే "ఛీ! ఇవి వలదు" అని వానిని వదలుకొంద మను కోరిక గలుగును. [వదలుకొంద మను కోరికయే వైరాగ్య మనబడును. జిహాసా = వదలుకొంద మను కోరిక. ఇందుకు జుగుప్సా (= రోత) అను పాఠాంతరము కలదు.] ౨౧

విరజ్య విషయవ్రాతా ద్దోషదృష్ట్యా ముహుర్ముహుః
స్వలక్ష్యే నియతావస్థా మనస శ్శమ ఉచ్యతే. 22

శబ్దాదివిషయముల దోషములను పలుమార్లు గుర్తించి వానినుండి నివర్తిల్లిన మనస్సు తనలక్ష్య (మైన బ్రహ్మ)మందు కుదురుకొనును. ఆ కుదురుపాటునే శమమందురు. ౨౨

విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వ గోళకే
ఉభయేషా మిన్ద్రియాణాం స దమః పరికీర్తితః
బాహ్యానాలమ్బనం వృత్తే రే షోపరతి రుత్తమా. 23

కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు అను రెండువిధములైన యింద్రియములను విషయములనుండి మరల్చి దేనిగోళమున దానిని నిలుపుట 'దమ' మనబడును. వెలుపలి విషయముల ఆశ్రయము మనోవృత్తికి లేకుండుటే ఉత్తమమైన యుపరతి. ౨౩

సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్
చిన్తావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే. 24

ఎన్ని దుఃఖములైన గలుగును గాక, దేనికిని చింతింపక, విలపింపక, ప్రతిక్రియ చేయబూనక, సమస్తము నోర్చుకొనుటే తితిక్ష యనబడును. ౨౪

శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావధారణా
సా శ్రద్ధా కథితా సద్భి ర్యయా వస్తూపలభ్యతే 25

శాస్త్రవాక్యము సత్యమే, గురువాక్యము సత్యమే అనెడి నిశ్చయమును పెద్దలు శ్రద్ధ అని పేర్కొందురు. పరమార్థసిద్ధి కది సాధనము. ౨౫

సమ్యగాస్థాపనం బుద్ధే శ్శుద్ధే బ్రహ్మణి సర్వదా
త త్సమాధాన మి త్యుక్తం, న తు చిత్తస్య లాలనమ్. 26

కుతూహలమును దీర్చి మనస్సును తృప్తిపఱచుట 'సమాధాన' మనిపించుకోదు. శుద్ధబ్రహ్మమందు బుద్ధిని సదా చక్కగా నెలకొల్పుటే 'సమాధాన' మందురు. ౨౬

అహఙ్కారాదిదేహాన్తాన్ బన్ధా నజ్ఞానకల్పితాన్
స్వస్వరూపావబోధేన మోక్తు మిచ్ఛా ముముక్షుతా. 27

అహంకారము మొదలుకొని దేహమువఱకు గల బంధము లెల్ల అజ్ఞానకల్పితములు. స్వస్వరూపము నెఱుంగుటద్వారా ఆబంధములనుండి విడివడుద మను కోరికయే ముముక్షుత్వము. ౨౭

మన్దమధ్యమరూపాపి వైరాగ్యేణ శమాదినా
ప్రసాదేన గురు స్సేయం ప్రవృద్ధా సూయతే ఫలమ్. 28

ఈ మోక్షాభిలాష మొదట మందముగను మధ్యముగను ఉన్నను వైరాగ్యముచేతను శమాదులచేతను గురుదేవు నను గ్రహముచేతను వర్ధిల్లి తీవ్రరూపము దాల్చి ఫలవంతము కాగలదు. ౨౮

వైరాగ్యఞ్చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే
తస్మి న్నే వార్థవ న్త స్స్యుః ఫలవ న్త శ్శమాదయః. 29

తీవ్రవైరాగ్యమును తీవ్రముముక్షుత్వమును ఎవనికి గలుగునో అతనికే శమాది గుణములు సార్థకములును సఫలములు నగును. ౨౯

ఏతయో ర్మన్దతా యత్ర విర క్తత్వ ముముక్షయోః
మరౌ సలిలవ త్తత్ర శమాదే ర్భానమాత్రతా. 30

ఎడారియెండమావులలో నీ రున్నట్లు కనిపించును. కాని నిజమున కుండదు. అట్లే వైరాగ్యమును ముముక్షుత్వమును మందములుగ నున్నచోట శమాదిగుణము లున్నట్లు కనిపించును గాని నిజమున కుండవు. ౩౦

మోక్షకారణసామగ్ర్యాం భ క్తిరేవ గరీయసీ
స్వస్వరూపానుసన్ధానం భ క్తి రి త్యభిధీయతే. 31

ము క్తస్వరూపము నభివ్య క్తము సేయు సాధనములలో భ క్తియే శ్రేష్ఠమైనది. భ క్తి యనగా నిత్యము క్తమైన స్వస్వరూపమును సదా అనుసంధించుచుండుట. (దీనినే నిదిధ్యాసన మనియు నందురు). ౩౧

స్వాత్మత త్త్వానుసన్ధానం భ క్తి రి త్యపరే జగుః
ఉ క్తసాధనసమ్పన్న స్తత్త్వజిజ్ఞాసు రాత్మనః
ఉపసీదే ద్గురుం ప్రాజ్ఞం యస్మా ద్బన్ధవిమోక్షణమ్ 32

జీవుడు బ్రహ్మమే అను నాత్మత త్త్వమును అనుసంధించుటే భ క్తి యని యితరు లనిరి. పైని చెప్పిన వివేకాదిలక్షణములు గల్గి యాత్మత త్త్వ మెఱుగ గోరువాడు—ప్రాజ్ఞుడును బంధ విమోచనదక్షుడు నగు గురువు నాశ్రయింపవలయును. ౩౨

(సశేషము)

సహస్రనామావళినుండి అకారాదిగ సముద్ధృతమైన

# ఆత్మాంత చతుర్వింశతి నామావళి

ఓమ్ అనన్తాత్మనే నమః
ఓమ్ అప్రమేయాత్మనే నమః
ఓమ్ అమేయాత్మనే నమః
ఓమ్ ఏకాత్మనే నమః
ఓమ్ గభీరాత్మనే నమః
ఓమ్ చతురాత్మనే నమః
ఓమ్ త్రిలోకాత్మనే నమః
ఓమ్ ధృతాత్మనే నమః
ఓమ్ నివృత్తాత్మనే నమః
ఓమ్ నైకాత్మనే నమః
ఓమ్ పరమాత్మనే నమః
ఓమ్ పూతాత్మనే నమః
ఓమ్ ప్రకాశాత్మనే నమః
ఓమ్ ప్రసన్నాత్మనే నమః
ఓమ్ భూతాత్మనే నమః
ఓమ్ విజితాత్మనే నమః
ఓమ్ అవిధేయాత్మనే నమః *
ఓమ్ విధేయాత్మనే నమః
ఓమ్ విముక్తాత్మనే నమః
ఓమ్ విశుద్ధాత్మనే నమః
ఓమ్ విశ్రుతాత్మనే నమః
ఓమ్ విశ్వాత్మనే నమః
ఓమ్ వృద్ధాత్మనే నమః
ఓమ్ సమాత్మనే నమః

---

* ఇచట శ్రీశంకరభాష్యమున 'అవిధేయాత్మనే' అనియు శ్రీపరాశరభట్టారకుల భగవద్గుణదర్పణమనెడి భాష్యమున 'విధేయాత్మనే' అనియు పదవిభాగముచేసియున్నారు. భగవంతుని పరాత్పరత్వమును సూచించు శ్రీశంకరుల వివరణమును భక్తపరాధీనతను సూచించు శ్రీపరాశరుల వివరణమును ఉభయమును గ్రాహ్యమే.

## శ్రీ కృష్ణస్తుతి

తేజసే ఒస్తు నమో ధేనుపాలినే లోకపాలినే
రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే.

గోవులను జగములను గాచుచు రాధపాలిండ్లమీఁదను ఆదిశేషునిమీఁదను బవ్వళించు తేజస్స్వరూపమగు కృష్ణాఖ్యబ్రహ్మమునకు నమస్కరించుచున్నాను. —లీలాశుకయోగి

వేదా నుద్ధరతే, జగన్నివహతే, భూగోళ ముద్బిభ్రతే
దైత్యాన్ దారయతే, బలిం ఛలయతే, క్షత్రక్షయం కుర్వతే,
పౌలస్త్యం జయతే, హలం కలయతే, కారుణ్య మాతన్వతే,
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే, దశాకృతికృతే, కృష్ణాయ తుభ్యం నమః.

మత్స్యమూర్తివై వేదముల నుద్ధరించి, కూర్మమవై భూమిని మోసి, వరాహదేవుడవై భూమండలమును బైకెత్తి, నృసింహస్వామివై హిరణ్యకశిపుని భ్రమందించి, వామనుడవై బలిచక్రవర్తిని మోసపుచ్చి, పరశురాముడవై క్షత్త్రియులను జంపి, రఘురాముడవై రావణుని ద్రుంచి, బలరాముడవై నాగేలును దాల్చి, బుద్ధదేవుడవై యహింసను బోధించి, కల్కివై మ్లేచ్ఛులను తెగటార్పబోవు దశావతారధారివగు కృష్ణా, నీకు నమస్కారము.

—జయదేవుడు

కృష్ణ కృష్ణ కృపాసిన్ధో భక్తసిన్ధుసుధాకర
మా ముద్ధర జగన్నాథ మాయామోహమహార్ణవాత్ .

శ్రీకృష్ణా, దయాసాగరా, నీవు భక్తులకు ఆనందాతిశయమును గలిగించు మంగళమూర్తివి. మాయామయమైన సంసారసముద్రమునుండి నన్నుద్ధరింపుము, స్వామీ.

—శ్రీనారాయణతీర్థులు

క. ఆదిపురుషుండ వగుటను వేదంబులు సెప్ప నవియు వెఱచుచుఁ బలుకఁగా,
నీదృక్ప్రకారుఁ డని, దామోదర, నీపెం పెఱుంగ నొరుల కలవియె?

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి, దు
ర్మదదైత్యావళిఁ గూల్చి, పార్థునకు సారథ్యంబు త్రైలోక్యస
మ్మద మారంగ నొనర్చి, దేవమునిసన్మానోద్ధతిన్ భూభరం
బు దొలంగించిన చక్రి నంబురహనాభుం గొల్తు కృష్ణాత్మునిన్.

—కవిబ్రహ్మ తిక్కన

ఉ. దేవ, సమస్తలోకనుత, దివ్యమునీంద్రమనోనివాస, ల
క్ష్మీవర, వాసుదేవ, సరసీరుహనేత్ర, యనాథనాథ, లో
కావనదీక్ష, నిర్జరగణాధిప, కేశవ, యీశ, పీతవ
స్త్రావృత, దేవకీసుత, దయాపర, మమ్ము ననుగ్రహింపవే.

—వెన్నెలకంటి సూరన

క. జయ గోవింద జనార్దన జయ మాధవ కృష్ణ వరద సర్వజ్ఞ హరీ
జయ విజయసఖ జగన్మయ జయ నారాయణ ముకుంద జయ చక్రధరా.

—ప్రబంధపరమేశ్వరుడు చదలువాడ ఎఱ్ఱాప్రెగ్గడ

# శ్రీకృష్ణలీలామృతము

## శ్రీ మేకా సుధాకరరావుగారు

గీ. తల్లియొడిలోన శిశువవై తనరునాడు విషపుపూతన బీల్చిన వీరలీల,
నెలలబాలుడవై నీవు వెలయునాడు శకటరాక్షసు గూల్చిన శౌర్యలీల,
బాల్య మొకయేటిదై నీవు పరగునాడు అలతృణావర్తు ద్రుంచిన బలునిలీల,
'మన్ను తిన లేదు, చూడుముమాత' యనుచు నోట విశ్వంబు చూపిన మేటిలీల,
బకుని వత్సాసురుని నీవు బాల్యమందె తునిమి గోగోపజనముల మనుచు లీల,
అరరె కొనగోట గొడుగుగా గిరిని నిల్పి యింద్రుని మద మడంచు నేడేళ్ళలీల
కృష్ణ పుట్టినప్పటినుండి యిట్టి వెన్నొ లీలలను జూపు నీదివ్యహేల నరయ
అవని నుతియింప తరమౌనె యెవరికైన కరుణ నొకయింత నీవుగా కురియకున్న?

క. వేదము లనియెడి వనమున నీదగు దర్శనమునకును నిశ్చలమతితో
శోధించు మునులు నిన్నారాధించిన కాన రావు, ప్రభు శ్రీకృష్ణా.

క. వ్రేపల్లెవాడలోపల గోపికలను గూడి యుండి గోవుల గావన్
ఏపగిది నచ్చె, నయ్యా? తాపసులను బ్రోవబోవ తగదే నీకున్?

ఉ. నల్లనివాడ వంచును జనంబులు నిన్నెటు లన్న గాని, నా
చల్లనివాడ వంచు, ననిశంబును నిన్నెద గొల్వ గోరెదన్,
అల్లరివాడ వంచు జను లందరు కొందఱు నిన్నెఱుంగకే,
యెల్లరివాడ వంచు నిను నెప్పుడు నమ్మి స్మరింతు భక్తితో.

ఉ. ఓయి దయామయా, నవనవోత్పలచారువినీలమూర్తి క
న్దోయికి పండువెన్న లయి తోచెడి చిన్నగవు ల్వెలార్చు నీ
చాయని ప్రేమభక్తి యను పాశముచేతను గట్టి గోపిక
ల్హాయిగ నిన్నుగూడి రట ఆటల పాటల, నెంత ధన్యలో!

ఉ. దండకయందు తాపసుల దైత్యులు హింసలు పెట్టునాడు కో
దండము బూని కూల్చితివి దైత్యుల నెల్లర రామమూర్తివై,
నిండుమనంబులన్ మునులు నీ కయి గోపికలై జనింపగా,
వెండియు కృష్ణమూర్తివయి ప్రీతిని వారల కోర్కె దీర్చితే?

ఉ. వందన మాచరింతు, యదువంశసుధాకర, ఓ కృపాకరా,
సందియ మొందు నత్తటిని సాదర మొప్పగ వేదసారమున్
పొందికగా నొనర్చియును బోధలు చేసితి వీవు బావనున్;
అందెను గీతయై భువికి నద్దియు నెల్లరి భాగ్యమో యనన్.

ఉ. అందగరానివాడు మునులంతటివారితపస్సు కేనియున్,
బొందగరానివాడు భువి పూజల నెంతొగ గొల్చిపిల్చినన్,
చెందెను ఆ రమేశు నిల చేకొను భాగ్యము పుత్త్రగాను ఆ
నందము చిందులాడ, అల నందయశోదల పుణ్య మెట్టిదో!

ఉ. కొందరు నీదు ప్రేమమును కొందఱు భక్తిని, యోగదృష్టిచే
కందురు నీ ముఖాంబుజ వికాసిత శోభలు కొంద ఱీ భువిన్,
పొందగ నెవ్వ రే విధిని పూజలు చేసిన వారి కవ్విధిన్
అందెద నే నటంచు పలుకాడిన నీకృప దెంత సత్యమో!

# శ్రీకృష్ణుడుపదేశించిన కర్మయోగము

బుద్ధియుక్తులైన మనీషులు కర్మజమగు ఫలమును త్యజించి జన్మబంధ వినిర్ముక్తులై అనామయమగు (బ్రహ్మ)పదమును బొందుదురు.

*  *  *

యోగస్థుడవై, సంగము విడిచి, సిద్ధియందును అసిద్ధియందును సమభావము గలవాడవై, ఓ ధనంజయా కర్మముల నాచరింపుము.

*  *  *

అట్టి సమభావము గలిగి చేయబడు కర్మకంటె(ఫలాపేక్షతో జేయబడు)కర్మ చాల అధమము. కావున ఓ ధనంజయా బుద్ధియోగ సమాశ్రయణమునే కోరుము. ఫలాపేక్షులు కృపణులు,

*  *  *

కర్మలలో కౌశలమే యోగము.

*  *  *

నీకు గల అధికారము కర్మయందే. ఫలముల నెప్పుడును కోరకు. కర్మఫలకారకుడవగుటకు గాని కర్మల ఆచరింపకుండుటకు గాని, పాల్పడకుందువుగాక.

అర్జునుని ప్రశ్న: ఓ జనార్దనా, కర్మకంటె జ్ఞానమే ఎక్కువ అనుట నీ యభిప్రాయమైనచో, ఘోరమైన కర్మమందు నన్ను నియోగించుచున్నావే, ఎందులకు, కేశవా ?

శ్రేయస్సును పొందించునదేదో దానిని నిశ్చయించి, దయతో తెల్పుమా.

శ్రీకృష్ణుని జవాబు: ఓ అనఘా, సాంఖ్యులకు జ్ఞానయోగము అనియు, యోగులకు కర్మయోగము అనియు రెండు విధములైన నిష్ఠను పూర్వము నేను చెప్పియుంటిని.

కర్మలను మానుకొన్నంతమాత్రముచేత పురుషునకు నైష్కర్మ్యము కలుగదు. సన్న్యాసమాత్రముచేత సిద్ధి చేకూఱదు.

*  *  *

ఎవడును ఎప్పుడుగాని కర్మలను చేయక క్షణమైనను ఉండడు. ఏలయన ప్రకృతిగుణములే అందఱిచేతను కర్మలను చేయించుచున్నవి.

*  *  *

కర్మేంద్రియములను అణచిపెట్టియు, ఎవడు ఇంద్రియార్థములను మానసికముగ స్మరించుచుండునో, ఆ విమూఢాత్ముడు మిథ్యాచారుడనబడును.

ఓ అర్జునా, జ్ఞానేంద్రియములను మనసుచేత నియమించి, కర్మేంద్రియములచే కర్మయోగమున ప్రవర్తిలువాడే శ్రేష్ఠుడు.

*  *  *

నీవు నియతమైన కర్మమును చేయుము. ఏలయన కర్మలను చేయకుండుటకంటె చేయుటే మేలైనది. కర్మలను మానుకొంటివేని, నీకు శరీరయాత్ర సయితము నడవదు.

*  *  *

యజ్ఞముకొఱకై చేయబడు కర్మతప్ప, వేఱైన కర్మ లోకులను బంధించునదగును. ఓ కౌంతేయా, సంగరహితుడవై యజ్ఞార్థమై కర్మల నాచరింపుము.

*  *  *

కర్మము బ్రహ్మోద్భవమనియు, బ్రహ్మము అక్షరసముద్భవమనియు నెఱుంగుము.

*  *  *

కాని, ఏ మానవుడు ఆత్మయందే ప్రీతుడై, ఆత్మయందే తృప్తిని సంతోషమును పొందుచుండునో వానికి కర్తవ్యమేమియు లేదు.

ఓ పార్థా, నాకు కర్తవ్యము లేదు. ముల్లోకములందును నేను పొందనిదియు, పొందవలసి యుండునదియు ఏదియు లేదు. అయినను కర్మయందే ప్రవర్తిల్లుచున్నాను.

మెలకువ గలిగి నేను కర్మయందు ప్రవర్తింపక ఎప్పుడైన నుందునేని మనుష్యులు, ఓ పార్థా, అన్నివిధములను నా దారినే అనుసరింతురు,

* * *

ఏలయన శ్రేష్ఠుడు ఏదేది ఆచరించునో ఇతరజనులును దానినే ఆచరింతురు. అతడు దేనిని ప్రమాణీకరించునో, లోకము దానినే అనుసరించును.

* * *

నేను కర్మల చేయకుండినచో, ఈ లోకులు నశింతురు. నేను వర్ణసంకరమును చేసినవాడ నగుదును. ప్రజలకు హాని కలిగించినవాడ నగుదును.

కావున సంగరహితుడవై సదా కర్మలను ఆచరింపుము. ఏలయన సంగరహితముగ కర్మాచరణము చేయు పురుషుడు పరమపదము నొందును.

జనకాదులు కర్మచేతనే సంసిద్ధి నొందిరి. లోకసంగ్రహముపై దృష్టినుంచియైనను కర్మ చేయుటే నీకు యుక్తము.

ఓ భారతా, అవిద్వాంసులు సంగసహితులై ఎట్లు కర్మలను చేయుదురో, అట్లు విద్వాంసుడు సంగరహితుడై లోకసంగ్రహముపై దృష్టి గలిగి కర్మలను చేయవలెను.

అజ్ఞులైన కర్మసంగులకు బుద్ధిభేదమును కలిగింపకూడదు, విద్వాంసుడు ఎచ్చరికతో సకల కర్మలను తాను చేయుచు వారికి కర్మలందు శ్రద్ధను పుట్టింపవలెను.

ప్ర  గుణములచేత సకల కర్మలును ప్రవర్తిల్లుచుండును. అహంకార విమూఢాత్ముడు తాను కర్త నని అనుకొనుచుండును.

* * *

పరధర్మము ఎంత బాగుగ చేయబడినదైనను, దానికంటె స్వధర్మము విగుణమైనను శ్రేష్ఠమే. స్వధర్మమున నిధనము కలిగినను మేలే. పరధర్మము భయావహము.

* * *

కర్మము నా సేవగా ఒనర్పబడినపుడు పవిత్రమును, పవిత్రీకరించునదియు అగును.

* * *

సంగమును త్యజించి బ్రహ్మార్పితముగ ఎవడు కర్మలను చేయునో వానిని పాపమంటదు, తామరాకును నీ రంటనట్లు.

యోగయుక్తుడు, విశుద్ధాత్ముడు, విజితాత్ముడు, జితేంద్రియుడు తనయందున్న ఆత్మయు సకలభూతములందును ఉన్న ఆత్మయు ఒక్కటే అని గుర్తించిన వాడు కర్మలను చేసినను లిప్తుడు కాడు.

* *

నిష్కామముగ కర్మలనుచేయు తత్త్వవేత్త 'దేనికిని కర్తను నేనుకాను' అని తలంపవలెను.

* *

సన్న్యాసమును, కర్మయోగమును రెండును శ్రేయస్కరములే. వానిలో కర్మసన్న్యాసముకంటె, కర్మయోగము విశిష్టము.

* * *

సాంఖ్యమును యోగమును వేఱు వే అని బాలురు అందురు కాని పండితు లనరు. అందొక్కదాని నైనను చక్కగ అనుష్ఠించిన వాడు రెంటి ఫలమును పొందును.

సాంఖ్యులు పొందు స్థానమునే యోగులును పొందుదురు. సాంఖ్యమును యోగము నొక్కటే అని గుర్తించినవాడే సరిగా గుర్తించినవాడు.

* * *

ఓ మహాబాహూ, (సంగరహితముగ కర్మ) యోగ మనుష్ఠింపక సన్న్యాసము నధిగమించుట దుస్సాధ్యము. (నిష్కామకర్మ) యోగ సంపన్నుడగు మునికి అచిర కాలముననే బ్రహ్మప్రాప్తి చేకూరును.

* * *

సదా సర్వకర్మలను చేయుచుండువాడైనను నన్ను శరణుపొందినవాడు నా ప్రసాదముచే శాశ్వతావ్యయపదమును బొందును.

ఎవని సర్వసమారంభములును కామసంకల్పవర్జితములో జ్ఞానాగ్ని దగ్ధకర్ముడగు నతనిని బుధులు పండితుడందురు.

యదృచ్ఛాలాభసంతుష్టుడును ద్వంద్వాతీతుడును విమత్సరుడును లాభాలాభములందు సమభావము గల వాడును కర్మల నాచరించినను బద్ధుడు కాడు.

గతసంగుడై ముక్తుడై జ్ఞానావస్థితచిత్తుడై యజ్ఞార్థము కర్మ నెవడుచేయునో, వాని కర్మ పూర్తిగా లయించును ( = బంధముగా రూపొంద దనుట).

సంకల్ప సన్న్యాసము చేయని వా డెవడును యోగి కాడు.

# కసపకసారము*

## శ్రీ వివేకానందస్వామి

గీత యను గ్రంథము మహాభారతములో నొక భాగము. గీతను సరిగా నర్థముచేసికొనుట కనేకవిషయములు తెలియుట అవసరము. మొదటిది: గీత మహాభారతములోని భాగమేనా? అనగా, దానిరచయిత వేదవ్యాసుడని చెప్పబడుచున్నమాట యథార్థమా! లేక, ఆ మహాకావ్యములో నిది తరువాత ప్రక్షేపింపబడినదా? రెండవది: కృష్ణు డను నొకచారిత్రకపురుషు డుండెనా? మూడవది: గీతయందు చెప్పబడినరీతి కురుక్షేత్రయుద్ధము నిజముగ జరిగినదా? నాల్గవది: అర్జునుడును తదితరులును నిజముగ చారిత్రకపురుషులేనా?

ఇట్టి పరిశీలనకు గల ఆధారము లేవి యన్న సంగతిని మొదట చూతము. వేదవ్యాసు డను పేరు గల వారు పలువు రుండి రని మనకు తెలియును; వారిలో గీతాకారు డెవరు? బాదరాయణవ్యాసుడా, లేక ద్వైపాయన వ్యాసుడా? 'వ్యాసు' డను నది బిరుదు

* 1897 వ సంవత్సరమున ఆలంబజారులో నుండిన మఠమున స్వామిజి శిష్యులకు కావించిన గీతోపదేశముల కిది సంక్షేపము—సం॥

మాత్రమే. శ్రోత్తపురాణము రచించినవానిని వ్యాసు డందురు. 'విక్రమాదిత్య' నామమువలె 'వ్యాస' నామమును వర్గనామమే. మఱియొక విషయము: శంకరాచార్యుఁడు గీతపై గొప్ప భాష్యమును వ్రాసి దానికి ప్రసిద్ధి చేకూర్చుటకు ముందు, భగవద్గీతను గుఱించిన జ్ఞానము సామాన్యప్రజల కెక్కువగ లేదు. అంతకు చిరము పూర్వము గీతపై బోధాయనవ్యాఖ్య ప్రచారములో నుండెనని పలువుర నమ్మకము. ఈ విషయమును రుజువుచేయగలిగినచో గీత పురాతనత్వమును వ్యాసుని తత్కర్తృత్వమును చాలమట్టుకు నిరూపిత మగు ననుటకు సందేహము లేదు. రామానుజుడు బ్రహ్మసూత్రములకు తాను వ్రాసిన శ్రీభాష్యమున ఏ బోధాయనభాష్యము ననుసరించెనో, శంకరాచార్యుడుసైతము ఏ బోధాయనభాష్యమును పేర్కొనుటే కాక అందుండి యుదాహరణములనుసైత మక్కడక్కడ చూపియున్నాడో, ఏ బోధాయనభాష్యమునుగూర్చి దయానంద స్వామి అంతగొప్పగా చర్చించెనో ఆ బోధాయనభాష్యగ్రంథపుప్రతి ఒక్కటైనను భారత దేశమంతటను పర్యటించినను నాకు కనబడ లేదు. శ్రీభాష్యము వ్రాయునప్పుడు రామానుజునకు లభించిన బోధాయనవృత్తివ్రాతప్రతి కూడ చెదలు తినివేసిన ప్రతి యట. గొప్పదగు బోధాయనుని వేదాంతసూత్రభాష్యమే యింతటి సందిగ్ధాంధకారమున మఱుగుపడి యుండగా భగవద్గీతపై కూడ నతనిభాష్య ముండె నని నిరూపింప ప్రయత్నించుట వ్యర్థము. శ్రీశంకరాచార్యుడే గీతాకారుడని, అతడే దానిని మహాభారతములో చొప్పించెనని కొందఱి యూహ.

రెండవవిషయము:–గీతాకారుడగు కృష్ణుని గుఱించి చాలసందేహము కలదు. ఛాందోగ్యోపనిషత్తునం దొకచోట దేవకీకుమారుడు శ్రీకృష్ణుడు ఘోరుడను యోగి యొద్ద ఆత్మోన్నతి దేశములు పొందినట్టు చెప్పబడినది. మహాభారతమున [illegible]ఁడు ద్వారకాధిపతి. విష్ణుపురాణములో గోపికలతోడి శ్రీకృష్ణుని క్రీడల వర్ణన గలదు. భాగవతములో సుదీర్ఘమైన అతని రాసలీలావర్ణన కలదు. మనదేశములో బహుప్రాచీనకాలమున మదనోత్సవము జరిపెడి యాచార ముండెను. అదియే డోలగా మార్పు చేయబడి, కృష్ణుని కారోపిత మైనది. అటులనే ఈ రాసలీల మున్నగునవి కృష్ణుని కంటగట్ట బడినవి కావని చెప్పగలంతగ నెవ్వరు సాహసింపగలరు? చారిత్రకపరిశోధనద్వారా సత్యము తెలిసికొను దృష్టి పూర్వకాలమున మనదేశమున లేనే లేదు. సరియైన నిదర్శనములను ఆధారములను జూపకే ఎవరికి ఉత్తమమని తోచిన యభిప్రాయమును వారు చెప్పు చుండెడివారు. మఱొకవిషయము: ఆ కాలములో జనులు పేరుప్రతిష్ఠలకై ప్రాకులాడెడివారు కారు. అందుచేత ఒకరు గ్రంథము రచించి దానిని తమ గురువుపేరటనో మఱొకరిపేరటనో ప్రచారము చేయుట తఱచు సంభవించుచుండెను. అటువంటి సందర్భములలో చారిత్రకవిషయపరిశోధకునకు నిజము తెలిసికొనుట చాల దుస్తర మగును. పూర్వకాలమున జనులకు భూగోళజ్ఞానము లేదు. తోచిన ట్లెల్ల భావన చేసెడివారు. కనుక మధుసముద్రము పాలసముద్రము పెరుగుసముద్రము వెన్నసముద్రము వంటి వింతవింత మనఃకల్పనలు జరిగినవి. పురాణములలో ఒకడు పదివేల సంవత్సరములు జీవించును. మఱొకడు లక్ష సంవత్సరములు బ్రతుకును! కాని శ్రుతులు 'శతాయుర్వై పురుషః' "మానవుడు నూఱేండ్లు జీవించును" అని చెప్పినవి. ఇక్కడ

మన మెవరిని మన్నింపవలె? కృష్ణునివిషయమై ఇదమిత్థ మని యథార్థమును నిర్ధరించుట ఇంచుమించు చసాధ్యమే.

ఒకమహాపురుషుని యథార్థశీలమునకు చుట్టును ఊహాగోచరములైన రకరకాల అతిమానుషగుణములను కల్పించుట మానవస్వభావము. కృష్ణుని విషయమైకూడ ఇట్లే జరిగియుండవలె. ఐనను అతడు రాజుగ నుండి యుండు ననుట మిక్కిలి సుసంభవ మని తోచుచున్నది. మిక్కిలి సుసంభవ మని ఏల చెప్పితి ననగా పూర్వకాలమున మనదేశములో బ్రహ్మజ్ఞానప్రచారమునకు విశేషముగా పాటుపడినవారు రాజులే. ఇట ముఖ్యముగ గుర్తింపవలసిన ఇంకొకవిషయ మే మన, గీతాకారు డెవరైన గానీ, గీతోపదేశమును యావన్మహాభారతోపదేశము నొక్కటిగనే ఉన్నది. దీనినిబట్టి మహాభారతకాలములో ఒకమహాపురుషు డవతరించి నాటి సమాజమున కీ క్రొత్తపద్ధతిని బ్రహ్మజ్ఞాన ముపదేశించియుండు నని ధారాళముగ నూహింప వచ్చును. స్పష్టముగ గననగు మఱొకవిషయము ప్రాచీనకాలమున ఒకటివెంబడి నొకటిగా మతశాఖలు పుట్టినట్లే, ఒకటివెంబటి నొకటిగా ప్రమాణగ్రంథములును పుట్టి యమలులోనికి వచ్చుచుండినవి. కొంతకాలమునకు మతశాఖయు దాని ప్రమాణగ్రంథమునుకూడ అంతరించెడిది. లేదా మతశాఖ అంతరించి, ప్రమాణగ్రంథము మాత్రము మిగిలెడిది. అట్లే ఒకానొక మతశాఖవారు తమ ఉదాత్తోన్నతాశయములను ఈ గీతలో రూపొందించి యుండ వచ్చును. గీత ఆ మతశాఖవారి ప్రమాణగ్రంథమై యుండ వచ్చు.

మూడవ విషయమునకు – కురుక్షేత్రయుద్ధమును గుఱించినదానికి–వ తము. ఆ యుద్ధము జరిగినదా లేదా అనుటకు ప్రత్యేకప్రమాణము చూపుట సాధ్యము కాదు. కౌరవులకును పాంచాలరాజులకును యుద్ధము జరిగె ననుటకు సందేహము లేదు. వేఱొక విషయము. మహాసైన్యములు వ్యూహములు తీరి పోరాడుటకాజ్ఞను నిరీక్షించుచు సిద్ధముగా నున్న రణరంగమున జ్ఞానమును భక్తిని యోగమును గూర్చిన అంత చర్చ సాగుట ఎట్లు శక్యము? యుద్ధభూమిలో ఆ గడబిడలో ఆ రొదలో శ్రీకృష్ణార్జునసంవాదములో ప్రతిమాటను వ్రాసిపెట్టుటకు సంక్షిప్తలిపి (షార్టుహాండు) లేఖకు డుండెనా? ఈ కురుక్షేత్రసంగ్రామకథ అన్యాపదేశార్థకము (అలిగొరి) అని కొందఱి యభిప్రాయము. దాని యంతరార్థమును సంక్షేపించి చెప్పవలెననిన మానవుని హృదయములో మంచిచెడ్డలకు నిరంతరము జరుగుచున్న పోరాటమే దాని కర్థము. ఈ యభిప్రాయము యుక్తివిరుద్ధము కాదు.

ఇక నాల్గవ విషయము: అర్జునప్రభృతుల చారిత్రక యాథార్థ్యమును సందేహించుటకు కావలసినంత అవకాశ మున్నది. శతపథబ్రాహ్మణము బహుప్రాచీనగ్రంథము. దానియందొకచోట అశ్వమేధయాగము చేసినవారందఱి పేర్లును పేర్కొనబడియున్నవి. అందర్జునుని మునిమనుమడును పరీక్షిత్తుపుత్త్రుడునగు జనమేజయుని ప్రస్తావము కలదు. కాని, అర్జునప్రభృతుల పేర్లు లేవు సరికదా, వానికి సూచనయైనను లేదు. కాని, మహాభారతమందును తదితరగ్రంథములందును యుధిష్ఠిరుడు అర్జునుడు మున్నగువారు యాగము చేసినట్లు చెప్పబడియున్నది.

ఇక్కడ ఒక విషయమును ముఖ్యముగా జ్ఞప్తి యుంచుకొనవలసియున్నది. ఈ చరిత్ర పరిశోధనలకును మన యథార్థలక్ష్యమైన

ధర్మసాధన కవసరమగు జ్ఞానసిద్ధికిని సంబంధము లేదు. చారిత్రకముగా ఈ సర్వము పూర్తిగా అసత్యమని నిర్ధారణఅయినను మన కెంతమాత్రమును నష్టము లేదు. అటు లయిన చరిత్రపరిశోధనలను అంతగా సాగించుటవలన ప్రయోజన మేమని మీ రడుగుదురు. నిజ మేమో తెలిసికొనవలె కనుక దాని ప్రయోజనము దానికి గలదు. అజ్ఞానములో బడి తప్పు డభిప్రాయములకు మనము కట్టుపడి యుండుట చెల్లదు. ఈ దేశములో అట్టి పరిశోధనల ప్రాముఖ్యమును గణింపనే గణింపరు. జనులకు మేలు గలిగించు విషయము బోధించుటకు, అట్టిబోధకు తోడ్పడు నేని, అసత్యము చెప్పినను తప్పు లేదని అనేక మతశాఖల సమ్మతము; అనగా లక్ష్యము సాధనమును సాధూకరించును. కనుకనే పెక్కు తాంత్రిక గ్రంథములు "మహాదేవుడు పార్వతి కిట్లు చెప్పెను" అని ప్రారంభమగును. కాని, సత్యమును గుర్తించుటయు సత్యమును విశ్వసించుటయు మనవిధి. సత్యమును పరిశీలింపకే, ప్రాచీనసంప్రదాయములందు మనవారి కున్న విశ్వాసప్రభావ మట్టిది. వారి కరచరణములను కట్టివేసినది. జీససు క్రీస్తు మహామ్మదు వంటి మహాపురుషులయినను సరే–అట్టి మూఢభావములను పెక్కింటిని విశ్వసించిరి. వానిని త్యజింపలేకపోయిరి. కాని, మీదృష్టిని సర్వదా సత్యముపైనే నిలుపవలె; సకలమూఢవిశ్వాసములను పూర్తిగా పరిత్యజింపవలె.

గీతలో నున్న విషయ మేమో మన మిప్పుడు తెలిసికొనవలయును. ఉపనిషత్తులను చదువుదుమేని వానిలో ఒకదానితో నొకదానికి సంబంధము లేక గహనములయిన విషయములగుండ ముందునకు పోవుదుమేని పోగా పోగా ఒక మహాసత్యమునుగుఱించి ఆకస్మికముగ ప్రవేశపెట్టబడిన సంవాద మొకటి కననగును. కీకారణ్యములో పయనించు బాటసారికి అక్కడక్కడ చిక్కులు వడ్డ ఆకులు ముండ్లు వేరులు గల్గి బహుసుందరమైన గులాబిపువ్వు కనబడినట్లు ఆ దృశ్యముతో పోల్చి చూచినప్పుడు తగినస్థానముల సొంపుగా అమర్పబడిన ఆ మహాసత్యముల బోలినది భగవద్గీత – శ్రేష్ఠ సుమముల చక్కని మాలవంటిది, లేదా చక్కని చెండువంటిది. ఉపనిషత్తులు పెక్కుచోట్ల శ్రద్ధను గుఱించి విస్తారముగా చెప్పును కాని అందు భక్తి ప్రస్తావము లేనే లేదు. మఱి భగవద్గీతలో నన్నో భక్తి మాటిమాటికి చెప్పబడియుండుటే కాదు, భక్తిసార మందు పరమోచ్చస్థాయి నందుకొన్నది.

గీతలో చర్చింపబడిన ప్రధానాంశములు కొన్నిటిని పరిశీలింతము. అంతకు ముందున్న గ్రంథములనుండి భగవద్గీతను ప్రత్యేకించునట్టిదియు, భగవద్గీతకే సొంతమైనదియు నగు విశేష మేమి? అది యిది: గీత పుట్టుటకు పూర్వముకూడ యోగము జ్ఞానము భక్తి మొదలయిన మార్గములను దీక్షతో అనుసరించినవా రుండిరి. ఎవరికి వారు తమమార్గమే తదన్యములకంటె శ్రేష్ఠమైన దని చెప్పుచు వారు పరస్పరము కలహించుకొనుచుండిరి. ఈ విభిన్నపథముల సమన్వయమునకై ప్రయత్నించినవా రొక్కరైనను లేరైరి. వానిని సమన్వయించుటకు తొలిసారిగా ప్రయత్నించినవాడు గీతాకారుడే. ఆనాటి వివిధపథములవారు చెప్పు విషయములలో శ్రేష్ఠాంశముల నీతడు స్వీకరించి వాని నన్నిటిని గీతాసూత్రమున గ్రుచ్చెను. సంపూర్ణసమన్వయమును కృష్ణుడు సాధింపలేకపోయినచోట్లకూడ పందొమ్మిదవ శతాబ్దమున రామకృష్ణపరమహంస సాధించినాడు.

అనంతరవిషయము నిష్కామకర్మ: అనగా నిస్సంగముగ కర్మ ననుష్ఠించుట. ఈకాలమున ప్రజలు దీనిని బహువిధములుగా అర్థము చేసికొనుచున్నారు. సంగము లేకుండుట యనగా ఎట్టిప్రయోజనము నుద్దేశింపకుండుట యని కొంద అందురు. అదియే నిజమైన యర్థమైనచో హృదయములేని పశువులు, ఈ గోడలు నిష్కామకర్మాచరణకు పరమోత్కృష్టనిదర్శనము లగును. చాలమంది జనకునే ఉదాహరింతురు. తమ్ము జనకునితో సమానులుగా, నిష్కామకర్మలో ఆరితేఱినవారినిగా పరిగణింపవలె నని కోరుదురు. జనకుని(=తండ్రి) గొప్పతనము బిడ్డలను కనుటచేత కలిగినది కాదు. కాని, వీ రందఱును గుంపెడేసి బిడ్డలకు తండ్రులై ఆ ఒక్క యోగ్యతచేతనే తాము జనకులు కావలె నని కోరుకొందురు. అది కుదురదు. నిజమైన నిష్కామకర్మి పశువుగా గాని జడుడుగా గాని, హృదయశూన్యుడుగా గాని యుండరాదు. అతడు తామసికుడు కాడు, శుద్ధసత్త్వసంపన్నుడు. అఖిలజగత్తును ఆలింగనముచేసికొనగలంతటి ప్రేమతో, సానుభూతితో ఆతనిహృదయము నిండి యుండును. సర్వాలింగనసమర్థము లగు అతని ప్రేమయు సానుభూతియు సాధారణముగా లోకుల కర్థము కాదు.

వివిధ ధర్మమార్గముల సమన్వయము, నిష్కామకర్మ – ఇవి భగవద్గీతలో గల రెండు విశేషములు:—

ఇక రెండవ యధ్యాయమునుండి కొంచెము చదువుదము—

సంజయ ఉవాచ:

> తం తథా కృపయావిష్ట
> మశ్రుపూర్ణాకులేక్షణమ్
> విషీదన్త మిదం వాక్య
> మువాచ మధుసూదనః

శ్రీ భగవా నువాచ:

> కుత స్త్వా కశ్మల మిదం
> విషమే సముపస్థితమ్
> అనార్యజుష్ట మస్వర్గ్య
> మకీర్తికర మర్జున॥
> క్లైబ్యం మాస్మగమః పార్థ
> నైత త్త్వ య్యుపపద్యతే
> క్షుద్రం హృదయదౌర్బల్యం
> త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥

సంజయు డిట్లు చెప్పెను:

అట్లు దయావిష్టుడును నీరు నిండుటచే కలగిన నేత్రములు కలవాడును విషాదమునొందుచున్నవాడు నగు నర్జునునితో మధుసూదను డిట్లు పలికెను.

భగవాను డిట్లు పలికెను:

ఈ సంకటసమయమున ఈ మోహము నీ కెక్కడినుండి దాపురించిన దోయి? అర్జునా, ఇట్టి మోహమును పొందువారు అనార్యులు. ఇది అప్రతిష్ఠాకరము, స్వర్గప్రాప్తికి ప్రతిబంధకము.

పార్థ, పిఱికితనమును పొందకు. ఇది నీకు తగదోయి. తుచ్ఛమగు ఈ హృదయదౌర్బల్యమును విడిచి ఓ పరంతపా, లెమ్ము.

'తం తథా కృపయావిష్టమ్' అనుటతో ప్రారంభమగు శ్లోకములలో ఎంతసుందరముగా ఎంతటి కవిత్వపు సొబగుతో అర్జునుని వాస్తవపరిస్థితి వర్ణింపబడినది! అంతట శ్రీకృష్ణు డర్జునునకు హిత ముపదేశించును. 'క్లైబ్యం మాస్మగమః పార్థ' ఇత్యాది మాటలచే అత డర్జునుని

పోరాడు మని పురికొల్పుచున్నాడే, ఎందులకు? ఏల యన, శుద్ధసత్త్వగుణప్రాధాన్యము తలమునుకలై, అందుండి పుట్టినది కాదు అర్జునుని యుద్ధవిరక్తి. అతనికి ఈ వైముఖ్యమును గలిగించిన దెల్ల తమోగుణమే. సంపద కలుగనీ, ఆపదరానీ, సకలజీవితపరిస్థితులందును సమాన ప్రశాంతత గల్గియుండుట సత్త్వగుణునిస్వభావము. అర్జునుడు భయపడినాడు, కృపావిష్టుడైనాడు. అతడు యుద్ధభూమికి వచ్చినది పోరాడుటకే, కాని వేఱొకందుకు కాదు. పోరాడుదమను సహజావబోధమును ఇష్టమును అతనికున్న వనుటకు, అతడు యుద్ధభూమికి వచ్చుటే ప్రమాణము. మన జీవితములలోకూడ అట్టి సందర్భములు తఱచు కలుగుచుండును. అనేకులు తాము సాత్త్వికస్వభావుల మని యనుకొందురు. యథార్థమునకు వారు తామసికులే గాని మఱేమియు కారు. అనేకు లశుచిమార్గాలలో జీవించుచు తాము పరమహంసల మనుకొందురు! ఎందుచేత? పరమహంసలు జడులుగానో పిచ్చివారుగానో అశుద్ధాత్ములుగానో ఉందు రని శాస్త్రములలో చెప్పబడినది. పరమహంసలు శిశువులతో పోల్పబడినారు. ఇట సామ్యము పాక్షికము. పరమహంసయు పసిబిడ్డయు ఒక్కరు కారు, అభిన్నులు కారు. కాని వారు విపరీతపరాకాష్ఠలు (ఎక్స్ట్రీమ్పోల్స్) కావున ఒక్కవిధముగానే ఉన్నట్లు కనబడుదురు. ఒకరు జ్ఞానాతీతులు మఱొకరు పూర్తిగా అనధిగతజ్ఞానులు. కాంతిస్పందన మతివేగముగా నున్నను అతిమందముగా నున్నను అది మన కనుచూపున కందదు. కాని యొకదాని యుష్ణమత్యధికము, మఱొకదానియం దుష్ణము లేనే లే దన వచ్చును. పరస్పరవిరుద్ధములగు సత్త్వతమోగుణముల విషయముకూడ నింతే. కొన్ని విషయములలో అవి అభిన్నములుగానే కనబడును. కాని ఆ రెంటికి పరస్పర మపారమగు భేదము గలదు. సత్త్వగుణవేషమున త న్నమర్చుకొనుట తమోగుణమునకు మిక్కిలి యిష్టము. ఇక్కడ మహావీరు డగు నర్జునునియం దది దయారూపమున వెల్వడినది.

అర్జునుని వశముచేసికొన్న యీ భ్రాంతిని నివారించుటకు భగవంతు డేమి చెప్పెను? ఎవరిని గాని పాపి యని దూషింప వల దని, అతనియందున్న సర్వశక్తివంక కతని చూపును మరల్పవలసినదని నే నెప్పుడును చెప్పుచుందునే, అటులనే భగవంతు డర్జునునకు చెప్పెను: ''నైతత్ త్వ య్యుపపద్యతే'' ''ఇది నీకు తగదోయి'' ''నీ వాత్మవు, సమస్తపాపముల కతీతుడవు, అనశ్వరుడవు. నీ యథార్థస్వరూపమును మఱచిపోయితివి. ''నేను పాపిని, దేహదోషాపన్నుడను, మనోవ్యథితుడను'' అను నీ తలంపే నిన్నిట్టివానినిగా చేసినది – నీ కిది తగ దోయి'' అని భగవానుడు చెప్పెను. ''క్లైబ్యం మాస్మగమః పార్థ'' ''పార్థా, క్లైబ్యము నొందకు! లోకములో పాపము లేదు, దైన్యము లేదు, వ్యాధి లేదు, విషాదము లేదు. ప్రపంచములో పాప మన దగిన దేదయిన కల దేని అది యిదే – 'భయము.' నీయందు గూఢముగా నున్న శక్తిని బహిర్గతము చేయు ఏపనియైనను పుణ్యమనియును, దేహమును మనస్సును దుర్బలపఱచు పనియే నిజమగు పాప మనియును గ్రహింపుము. ఈ దౌర్బల్యమును ఈ భీరుత్వమును దులిపివేసికో! క్లైబ్యం మాస్మగమః పార్థ! నీవు వీరుడవు. ఇది నీకు తగనిది.''

బిడ్డలారా, క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్ త్వ య్యుపపద్యతే అను ఈ సందేశమును మీరు లోకమునకు చాటుదు రేని సమస్త

వ్యాధి, విషాదము, పాపము, దుఃఖము ఈ పృథివినుండి మూడుదినములలో మటుమాయ మగును. ఈ దౌర్బల్యపుతలంపు లేవియు ఎక్కడను ఉండవు. ఇప్పుడిది ఈ భయకంపన ప్రవాహము సర్వత్ర కలదు. ప్రవాహమును త్రిప్పివేయుడు. దీనికి వ్యతిరిక్తమగు స్పందన మును గొంత తెండు. అప్పటి యద్భుతపరి వర్తనమును కనుడు! మీరు సర్వశక్తులరు— పొండి. ఫిరంగియెదుటికి పొండి. భయపడకుడు. ఎంతటి హీనపాపిని గాని ద్వేషింపకుడు. అతని బాహ్యమును జూడకుడు. మీ చూపును లోనికి మరల్పుడు. అచ్చట పరమాత్మ ఉన్నాడు, భేరీ ప్రయోగించినట్లుగా లోక మంత టను ఘోషింపుడు: "నీలో పాపము లేదు; నీలో దైన్యము లేదు; నీవు అఘటితఘటనా శక్తినిధివి. లెమ్ము, మేల్కొను, నీలోని దివ్యత్వమును వ్యక్త మొనర్పుము."

> క్లైబ్యం మాస్మగమః పార్థ
> నైతత్త్వ య్యుపపద్యతే
> క్షుద్రం హృదయదౌర్బల్యం
> త్యక్త్వో త్తిష్ఠ పరంతప.

ఈ ఒక్కశ్లోకమును పఠించిన చాలు సమగ్రగీతాపారాయణఫలము పూర్తిగా కలు గును. గీతోపదేశమంతయు ఈ ఒక్కశ్లోక ములో పొందుపడి యున్నది.

# జీవజనార్దనారాధనము

ఒక్కగంతవ్యమునకు దారులు పెక్కు లుండ వచ్చు ననుటయు, ఆ దారులలో దేని ననుసరించినను అది ఆ గంతవ్యమునకు తప్పక చేర్చుననుటయు వేదాంతసిద్ధాంతమునందలి మహోదాత్తాశయములు. కర్మయోగము భక్తియోగము రాజయోగము జ్ఞానయోగము అనునవి నాలుగును ముక్తిమార్గములుగ స్థూలముగ పరిగణితములై యున్నవి. ఈ నాలుగును ఒకదాని కొకటి యంటనంత వైతైనమార్గములు కావు. కర్మయోగమున కర్మజ్ఞానము లుండక పోవు, భక్తియోగమున కర్మజ్ఞానము లుండక పోవు, జ్ఞానయోగమున కర్మమును భక్తియు నుండకపోవు. ఒక్కొక్క యోగమునను ఒకభావము అంగిగను తక్కినవి అంగములుగను పొందుపడియుండు ననుట గమ నార్హము. కర్మయోగములో అంగి కర్మము, భక్తిజ్ఞానములు అంగములు; భక్తియోగ ములో అంగి భక్తి, కర్మజ్ఞానము లంగములు; జ్ఞానయోగములో అంగి జ్ఞానము, భక్తియు కర్మము నంగములు.

అన్నియోగములకును లక్ష్యము బంధవిము క్తియే. అణువు మొదలుకొని మానవునివఱకు ప్రతిదియు విముక్తినొందుటకే పాటుపడు చున్నది. అందఱి పనులకు అన్నిపనులకు ప్రేరకము స్వాతంత్ర్యాభిలాషయే. యోగి కోరునది స్వాతంత్ర్యమే, దోపిడిగాని కభిలషిత మును స్వాతంత్ర్యమే. స్వాతంత్ర్య ప్రాప్తికై పెడదారి పట్టినచో దుష్కృత మనిపించు కొనును, సరిదారి పట్టినచో సుకృత మనిపించు కొనును. పెడదారిలో గాని సరిదారిలో గాని ముందున కుఱుక ప్రాణులను ప్రేరించునది స్వాతంత్ర్యాభిలాషయే. విశ్వచరిత్ర సర్వస్వ మును 'స్వాతంత్ర్యమునకై పడుపాట్లు,

సాగించు పెనుగులాట' అని సంక్షేపించి చెప్పవచ్చు.

స్వాతంత్ర్యలక్ష్యమును చేరుటకై మానవుడు సాగించు యాత్రయే మానవునకు గల యీ స్వాతంత్ర్యాభిరతియే ప్రతిమతములోను ప్రతిబింబితమై యున్నది. నీతిపరతకును నిస్స్వార్థపరతకును పునాదిగ నుండునది కూడ ఈ స్వాతంత్ర్యాభిరతియే. విశ్వజనతాసంక్షేమమునకై ఒకడు పాటుపడుచున్నాడనగా అర్థమేమి? అతనిలో 'తాను' అనెడి సంకుచిత వ్యక్తిత్వ మంతరించిన దని యర్థము. విశ్వముగ విస్తరిల్లియుండునది తనిలోని యాత్మయే అనుట అతని కనుభూతమైన దని యర్థము. ఇదే 'జీవో బ్రహ్మైవ' అను ప్రబోధము. అన్ని యోగముల కిదే లక్ష్యము. కర్మయోగలక్ష్యము నిదే, నిష్కామకర్మాచరణముచే సంసారబంధవిముక్తి నధిగమించుటే కర్మయోగము నీతిశాస్త్రసర్వస్వము నొక్కవాక్యమున సంగ్రహింప వచ్చు. స్వార్థపరతయే అవినీతి, స్వార్థత్యాగమే నీతి. ఇట్టిది స్వార్థపరత, ఇట్టిది స్వార్థపరత కాదను నిర్ణయము దేశకాలములనుబట్టి రవంత భేదిల్ల వచ్చును.

నిస్స్వార్థముగను కేవలము పరార్థముగను సత్కర్మల నాచరించుట ద్వారా సంసారవిముక్తి నొందుటే కర్మయోగము. తర్కముచే జ్ఞానియు ప్రేమచే భక్తుడును పరిష్కరించుకొను సమస్యను కర్మయోగి కర్మాచరణముచేతనే పరిష్కరించుకొనును. కర్మయోగికి ఏసిద్ధాంతములోను నమ్మకముండ నక్కఱ లేదు. దేవునిలో సైత మతనికి నమ్మకము లేకపోవచ్చు.

మనము చేయగల లోకసేవకు గల పరిమితులను గూడ గుర్తింపవలెను. క్షుధార్తునికి అన్నము పెట్ట వచ్చు. అప్పటి కాకలి తీఱి పోవును కాని ఆ కలి మరల కలుగనీయక మనము చేయజాలము. మనము సాగించు కష్టనివారణోద్యమము లన్నియు తాత్కాలిక ఫలప్రదములే కాని వేఱు కావు. కష్టములను లోటుపాట్లను మనము ప్రపంచమునుండి తఱిమివేయజాలము. ఒకచోట వానిని మనము తొలగింతుమేని మఱొకచోట అవి కలంచుచుండును. కావున ప్రపంచచరిత్రలో నాటి నుండి నేటివఱకు కష్టపరంపరలును కష్టనివారణోద్యమాలపరంపరలును సాగుచునే యున్నవి, సాగుచునే యుండగలవు. లోకమున ఉన్న మంచి కాని చెడుగు గాని మొత్తము ఎప్పుడును ఒకంతే. మంచిని కలిగించుటకును చెడుగును తొలగించుటకును మానవులు నిర్వర్తించు ప్రణాళికల ఫలితముగా చెడుగున్న చోటికి మంచి వచ్చి చేరును, చెడుగు వేఱొకచోటును చూచుకొనును, దానికి మఱొకచోటు లభించి తీరును. కడలి కెరటములకు వలె పోటుపాటులు మంచికిని ఉన్నవి, చెడుగునకును ఉన్నవి. ప్రపంచమంతటను చెడుగును తుడిచివేసి మంచిమాత్రమే ఉండనిత్తు మనుకొనుట— ప్రాణులకు చావులేకుండచేసి బ్రతుకును మాత్రమే గలిగింతు మనుకొనుటే.

ప్రపంచమానవులలో వారి పరిస్థితులలో పరిసరాలలో పరికరాలలో కననగుచున్న యెచ్చుతగ్గులను రద్దుచేసి సమత్వమును కలిగింపవలె అను ఉద్యమమును ఇట్టిదే, అనగా అసాధ్యమే అనుట. ఎచ్చుతగ్గు లన్నియు పుట్టుకతో వచ్చినవే. ఎచ్చుతగ్గు లేర్పడుటే సృష్టి. సృష్టి యెచ్చుతగ్గులమయమే. సృష్టి యున్నంత కాలము ఎచ్చుతగ్గు లుండుటే కాదు, వర్ధిల్లుచుండును. సమస్తమును ప్రళయమున మ్రింగినప్పుడు ఎచ్చుతగ్గులు సమసి సర్వసమత్వము సిద్ధించును. 'డెత్ ది లెవలర్' మృత్యుదేవత

సర్వసమీకర్త. ఉత్పత్త్యభివృద్ధివినాశములు కాలధర్మములు, వస్తుధర్మములు. ఉత్పత్తిని గాని అభివృద్ధినిగాని వినాశమునుగాని మనము నివారింపజాలము. అవి అనివార్యములే అనుట. ఉత్పత్త్యభివృద్ధులు 'సృష్టి' యను శీర్షిక క్రింద నమరును. వినాశమే ప్రళయము. సృజనోద్యమములును సంహారణోద్యమములును ప్రక్క-ప్రక్కనే సాగిపోవుచుండును. అది ప్రకృతిధర్మము ఎచ్చుతగ్గులవంకకు సాగునవి సృజనోద్యమములు, సమీకరణమువంకకు సాగునవి సంహారణోద్యమములు. ఈ రెండు విధాల ఉద్యమాలలో ఒకటి ఆగనీ, ఒక్కటి మాత్రమే సాగనీ—అని యనుకొనుట అవివేకము.

ఒకదానిలోపల ఒకటిగా చక్రము లమరియున్న మహాయంత్రము వంటిది యీ సంసారము. అందు తగుల్కొన్న ప్రాణి దానివశమే. చేత నున్న పని ముగిసినవెంటనే మనము విశ్రమింపవచ్చు ననుకొందుము. కాని ఆ పనిలో నాల్గవభాగమైనను ముగియక మున్నే తరువాతి పని మనకై వేచియుండును. ఇందుండి బయట పడుటకు ఉన్న దారులు రెండే, యంత్రముజోలి పెట్టుకొనక ఎడసి యుండుట అనున దొక మార్గము. అందు లోతునకు జొచ్చి కర్మమర్మము నెఱిగి కర్మమునే విముక్తికి సాధకముగ జేసికొను మార్గము రెండవది. మొదటి మార్గ మతిదుష్కరము. కావున రెండవ మార్గమే శరణ్యము. కర్మయోగము మనకు బోధించునది దానినే.

ప్రయోజనాంతరసాధనముగ నొనర్పబడు కర్మము జఘన్యము. స్వతఃప్రయోజనముగ నొనర్పబడు కర్మము ఉత్తమము. మానవు డలవఱచుకొనవలసినది నిస్స్వార్థపరతను, లక్ష్యముగ నుండదగిన దదే. 'కర్మ ణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన' ఫలముపై చూపు పెట్టక కర్తవ్యమును నెఱవేర్పవలయును. ఆలాగాచరింపబడిన కర్మము సంసారబంధ విచ్ఛేదకము. రాజ్య భోగభాగ్యములనెల్ల త్యజించి, జగజ్జనుల కష్టముల తన కష్టములుగ భావించి వానిని తొలగింప ఇంతంతనరానంతగ పాటుపడి ఉజ్జీవనమార్గమును గనుగొని ప్రజాళికి కఱపి ధన్యుడైన బుద్ధదేవు డాదర్శకర్మయోగి. స్వార్థపరతను తుడిచివేసికొని ప్రజారాధన రూపమైన నడవడి నలవఱచు కొనుటే ఆయన తా నాచరించి నదియు ప్రచారము చేసినదియు.

# భీష్ముడు తెల్పిన శ్రీకృష్ణుని మాహాత్మ్యము

## శ్రీ మైలవరపు వేంకటశాస్త్రిగారు

ధర్మరాజు తాను జేయించిన బంధువధకపరిమితదుఃఖము నొందుచుండ వ్యాసాది మహామునులును మహాద్భుతప్రభావశాలియగు శ్రీకృష్ణుడును పెక్కు ఇతిహాసములను దెలిపి యతనిదుఃఖమును బోగొట్ట యత్నించిరి. కాని యతనిదుఃఖము కొంచెమేనియు శాంతిం దాయెను. ఆ ధర్మరాజు మాటిమాటికి తన మిత్రజ్ఞాతిగురుజనములమరణమును దలచుకొని స్నేహమోహావశుడై అజ్ఞాననిబిడచిత్తముతో నిట్లు పలుకజొచ్చెను :

అయ్యో, మిగుల దురాత్ముడను అజ్ఞుడను. తుదకు కుక్కలకును నక్కలకు నాహారము

కాదగిన యీ తుచ్ఛశరీరమును సుఖింప జేయుటకు లెక్కకు మిక్కిలియైన సైన్యములను జంపించితిని. నాయంతటి యవివేకి లోకమున మఱొకడు గలడా? బాలురను బ్రాహ్మణులను మిత్రులను తండ్రులను తమ్ములను గురువులను నిర్దయుడనై చంపించిన నాపాపము పదివేల జన్మములకైనను తీఱునా? చేసినది ధర్మ యుద్ధము, చంపినది శత్రులను, కావున దోషము లేదందురా? ఆ మాట సరి కాదు. ప్రజాకంటకు లైన శత్రువులను జంపుట ధర్మమైన కావచ్చును కాని, దుర్యోధనుడు ప్రజలను కాపాడుచుండెనే కాని రాపాడ లేదే. రాజ్యలోభము చేత కదా నే నిందఱను జంపించినది! అది ఎట్లు పాపము కాకపోవును? పురుషుల నందఱిని జంపుట వారిస్త్రీల కెన లేని ద్రోహము కదా? ఏ కర్మము చేసిన అందుకు ప్రాయశ్చిత్త మగును? కర్మముచే కర్మము తొలగునా? దేహమునంటిన బురద బురదనీటిచే తొలగునా? కల్లుముంతకు శుద్ధి, కల్లుచే గలుగునా? యుద్ధమున నొనరిన నరహత్య యాగరూపము ంజేయు పశుహత్యచే తొలగునా?

ఇట్లు ధర్మరాజు ప్రజాద్రోహమునకు మిగుల వగచుచు సకలధర్మములను దెలిసికొంద మను తలంపుతో కురుక్షేత్రమున వీర శయనము నలంకరించియున్న భీష్ముని దర్శింప బయలుదేఱెను. తమ్ములును ఉత్తమతురగములను బూంచిన స్వర్ణాలంకృతరథముల నధిరోహించి వెంబడించిరి. ధౌమ్యవ్యాసప్రముఖ బ్రాహ్మణులును బయనమైరి. అర్జునునితో నేకరథస్థుడై భగవంతుడగు శ్రీకృష్ణుడును బయలుదేఱెను. అందఱును కురుక్షేత్రమున భీష్మసన్నిధానమునకు జేరుకొని ప్రణమిల్లిరి. భీష్ము డాకాశమునుండి దిగివచ్చిన దేవతవలె ప్రకాశించుచుండెను. దేవర్షి బ్రహ్మర్షి రాజర్షు లనేకులు భీష్మసందర్శనార్థము వచ్చిరి. వారిలో ప్రముఖులు: పర్వతుడు, నారదుడు, వ్యాసుడు, ధౌమ్యుడు, బృహదశ్వుడు, భరద్వాజుడు, పరశురాముడు, శుకుడు, వసిష్ఠుడు, ఇంద్ర ప్రమదుడు, త్రితుడు, కృత్సమదుడు, అసితుడు, కక్షీవంతుడు, గౌతముడు, అత్రి, విశ్వామిత్రుడు, సుదర్శనుడు, కశ్యపుడు, ఆంగీరసుడు, వారి శిష్యులు. ఇట్లు వచ్చిన మునీశ్వరుల కందఱికిని ధర్మజ్ఞుడును దేశకాలవిభాగవిదుడునగు భీష్ముడు యథావిధి పూజ చేయించెను. కృష్ణుని ప్రభావము నెఱిగినవాడు కావున లీలామానుష విగ్రహధారియై తనప్రోల నాసీనుడై యున్న యా దేవుని హృదయకమలమున జేర్చుకొని మానసోపచారములచే పూజించెను. వినయ ప్రేమసంయుతులైన పాండవులను కుశల మడిగి ఆదరించి ధర్మరాజాదులతో నిట్లనెను—

"నాయనలారా, ధర్మమందును బ్రాహ్మణు లందును శ్రీకృష్ణునందును భక్తి గల మీకు దాపురించిన కష్టములకు మిగుల విచారించు చున్నాను. భర్తయగు పాండురాజు మరణించి నప్పటినుండి మీతల్లి కుంతి మీ నిమిత్తము మాటిమాటికిని పలుదుఃఖము లనుభవింపవలసి వచ్చెను. అయినను అందుగూర్చి చింతిల్లకుడు. సకలప్రాణులును కాలమునకు వశంగతులు. కాలమున కసాధ్యము లేదు. కేవలము ధర్మ దేవతకు కుమారుడైన అజాతశత్రువు రాజుగా నుండెను. గదావీరుడగు భీముడును గాండీవ మహాధన్వియగు నర్జునుడును అతనికి తమ్ములు, లోకనాథుడైన భగవంతుడు శ్రీకృష్ణుడు మిత్రము. ఇట్లు ధర్మబలము దేహబలము అస్త్రబలము దైవబలము గల మీకు కష్టములు దాపురించె నన్నచో ఇది కాలప్రభావము గాక వే ఱేమి?

శ్రీకృష్ణుని దివ్యలీలలను ఆకళించుకోలేక బ్రహ్మాదులుసైతము మోహము నొందుచున్నారు. అట్లుండ వానిని గ్రహింపగలవారెవ రున్నారు? సమస్తప్రాణుల సుఖదుఃఖములు కాలాధీనములు. సుఖదుఃఖనిమిత్తములైన కర్మములు కృష్ణుని కధీనములు. కాన ఈ కృష్ణుని విహితము ననువర్తించుచు ప్రజలను ప్రేమానురాగములతో పాలింపుడు.

ఈ శ్రీకృష్ణుడు భగవంతుడు. ఇతడు పరమపురుషుడైన నారాయణమూర్తి. ఇతడు తనమాయచే లోకమును మోహింపజేయుచు యాదవులందు నిగూఢముగ ప్రవర్తించుచున్నాడు. గుహ్యమయిన యీ కృష్ణుని మాహాత్మ్యమును ఈశ్వరు డెఱుగును, దేవర్షియైన నారదు డెఱుగును, భగవంతుడైన కపిలముని యెఱుగును. వీరు కాక అతని మహిమ నెఱిగినవారు వే ఱెవ రున్నారు? ఓ ధర్మరాజా, నీ వీ కృష్ణుని బావమఱదిగాను మిత్రునిగాను దూతగాను మంత్రినిగాను సారథిగాను దలంచుచున్నావు. ఈ కృష్ణుడు పరమపురుషుడు కాని, నీ వనుకొన్నట్లు మనుష్యమాత్రుడు కాడు. మీరు చేయుమన్న నీచకృత్యముల నెల్ల ఆచరించినను, సేవకగత నికృష్టత్వ మతనికి లేదు. దేహాత్మభ్రాంతి లేక, ద్వితీయవస్తుశూన్యుడై, ప్రకృతిపురుష ప్రముఖవస్తుజాతము స్వశరీరముగ గలవాడు కాబట్టి అన్నిటిని సమదృష్టి జూచు నతనికి మతివైషమ్యము లేదు. అట్లు సర్వసముడైనను భగవంతుడు తన యేకాంతభక్తులపట్ల మిగుల దయ వర్షించును. కానియెడల భక్తుడనై కాలవశమున ప్రాణములు విడువ నున్న నాకీ కృష్ణు డిట్లు దర్శన మనుగ్రహించునా? ఇతని దర్శనమువలన గలుగు ఫలము నిరుపమానము. యోగీశ్వరులు భక్తిసంయుతములైన తమ చిత్తముల నేదేవునందు జేర్చి నామముల గీర్తించుచు కళేబరములు విడిచి కామముక్తులును కర్మముక్తులు నగుదురో ఆ దేవుడు ఈ శ్రీకృష్ణుడే. నామకీర్తనమే కామకర్మవిముక్తప్రదమును మోక్షసుఖసంధాయకమునగు నేని ఇక సాక్షాద్దర్శనప్రభావము నింతటి దని చెప్పగలమా? ప్రసన్నమందహాస సుందరమును అరుణనేత్రాంచితమునగు వదనారవిందముతో చతుర్భుజుడు దేవదేవు డీ భగవంతుడునాధ్యానమునకు విషయీభూతుడై నేనీ కళేబరము త్యజించునందాక ఎట్టఎదుట వెలసియుండగనుట నాభాగ్యము.

ధర్మరాజు శరపంజరమున శయనించియున్న భీష్ముని ప్రార్థించి సకలధర్మములను చెప్పించుకొనెను. పురుషధర్మములను స్త్రీధర్మములను వర్ణధర్మములను ఆశ్రమధర్మములను ప్రవృత్తినివృత్తిధర్మములను దానధర్మములను రాజధర్మములను మోక్షధర్మములను భగవద్ధర్మములను—భీష్ముడు ఇతిహాసములందును వ్యాఖ్యానములందును ప్రస్తుతములైన సకలధర్మములను సంగ్రహముగాను విపులముగాను వివరించి చెప్పెను. ఇట్లు చెప్పుచుండగా స్వచ్ఛందమరణుడగు భీష్ముడు నిరీక్షించుచుండిన యుత్తరాయణకాల మేతెంచెను.

అంతట భీష్ముడు మాటాడుట మాని దేహాదిసంబంధమును విసర్జించి, విలసత్పీతాంబరుడై ఎట్టయెదుట వేంచేసియున్న చతుర్భుజుని శ్రీకృష్ణుని తన మనసున నిల్పుకొని నిమీలితనేత్రుడై ఆ దివ్యమంగళరూపమును ధ్యానింపదొడగెను. ఈ ధారణచే భగవత్ప్రాప్తికి విలంబము కలిగించెడి ప్రారబ్ధము నశించినది. దేహమున ఆయుధప్రహారముల బాధ తొలగెను. ఇంద్రియముల వ్యాపారములు నివర్తిల్లెను. దేహాత్మభ్రాంతి మాసెను. భీష్ముడు

జనార్దనుని నానారీతుల స్తుతించి, ఇసనోవా గ్రృష్టులద్వారా ప్రత్యగాత్మ నాయసయం దనుసంధానము గావించి, శ్వాసవాయువుల నిరోధించి శరీరమును వీడి అర్చిరాదిమార్గమున పరమపురుషునిలో జేరిపోయెను.

అచట నున్న వారందఱు రాత్రివేళ పక్షులవలె మౌనము వహించిరి. మింట దేవదుందుభులు మ్రోగినవి, పూలజల్లులు కురిసినవి. ధర్మరాజు వ్యాసాదుల యనుమతమున భీష్ముని కళేబరమునకు అంత్యసంస్కారము నొనర్చి ముహూర్తకాలము దుఃఖవివశు డయ్యెను. మునులందఱు వేదాంతవేద్యరహస్యప్రఖ్యాపకములగు దివ్యనామములతో శ్రీకృష్ణుని స్తుతించి ఆ దేవుని తమ చిత్తముల హత్తించుకొని వీడ్కొనిరి. ధర్మరాజు శ్రీకృష్ణు నానతి మేరకు పైతృకమగు రాజ్యమున నభిషిక్తుడై ధర్మము తప్పక ప్రజల పాలింప నారంభించెను. కృతకృత్యుడై శ్రీకృష్ణుడు సంతోషించెను. శ్రీకృష్ణుని సంతోషము భువనమంగళము.

---

# కృష్ణుని యుపదేశములు

## ప్రాణేశ కుమార

పరంజ్యోతి శ్రీకృష్ణుడు శ్రావణ (సింహ) మాస బహుళాష్టమినాటి నిశీథమున అవతరించెను. అవతరించినది కారాగారమున; చుట్టును కటిక చీకటి. ప్రపంచము నంతటిని అజ్ఞానాంధకారము కూడ ఆవరించియుండెను. కృష్ణు డను పేరునకు నల్లనివా డని యర్థము. ఆయన మేనివన్నె కూడ శ్యామసుందరమే. పేరు, వన్నె, వేళ — సర్వము నలుపే. కాని తన అద్భుత జీవితముచేతను ఉపదేశముల చేతను ఆయన వెలువరించిన వెలుగు మతతత్త్వ శాస్త్రముల నన్నిటిని వెలుగొందించినది. లీలాశుకుడు ఈలా గన్నాడు.

తమసి రవిరి వోద్య, న్మజ్జతా మమ్బురాశౌ
ప్లవ ఇవ, తృషితానాం స్వాదువర్షీవ మేఘః
నిధిరివ విధనానాం, దీర్ఘతీవ్రామయాణాం
భిషగివ-కుశలం నో దాతు మాయాతు శౌరిః.

''చీకటి కలిగినప్పుడు సూర్యు డుదయించినట్లును, సముద్రమున మునిగిపోవుచున్న వానికి నావ చేకూరినట్లును, దప్పిగొన్న వానికి నింపైన వర్షము మబ్బు కురిసినట్లును, పేదకు పెన్నిధి దొరకినట్లును, దీర్ఘరోగమున బాధపడువారికి వైద్యుడు లభించినట్లును — సంసారబద్ధులమైన మమ్ము రక్షింప శ్రీకృష్ణుడరుదెంచును గాక.''

భాగవతమున కృష్ణుడు పూర్ణావతారు డని ప్రస్తుతుడై యున్నాడు. మానవరూపమున నున్నను నిరవధికశక్తిప్రభావములు శ్రీకృష్ణున కుండినవి. ఈ యొక్క యవతారముననే ఆయన పెక్కు భూమికలను నిర్వహించినాడు, ముద్దుతుంటరిబాలుడుగ, మురళీమోహనుడుగ, విశ్వాకర్షకగోపాలుడుగ, రాజ్యతంత్ర నిష్ణాతగా, సారథిగ, పరతత్త్వోపదేశకు డగు ఆచార్యుడుగ మిత్రభక్తదీనులకు సంరక్షకుడుగ, ప్రపన్నులకు మోక్షప్రదుడుగ పనివడినాడు. జగజ్జ్యోతిగను అందఱికిని దృష్టిచిత్తాపహారుడుగను తనరినాడు. పరిస్థితులకు పరిసరములకు అనుగుణముగ సమస్తమును చక్కబఱచు శ్రీకృష్ణుని సామర్థ్యము అద్వితీయము.

శ్రీకృష్ణునిముఖ్యోపదేశములు రెండు. (1) విభిన్నాశయముల సమన్వయము, (2) కర్మయోగాదర్శము. విశ్వవ్యాపమగు పరమార్థమును గుర్తించి వర్ణశాఖవిభేదములను పాటింపక అందఱికిని ఆయన కావించిన పరమార్థప్రదానము లోకోత్తరమైనది. ఇంతటి హృదయవైశాల్యము గల లోకాచార్యులలో ఈయనే ప్రథముడు.

## విభిన్నాశయముల సమన్వయము

విభిన్నాశయములకు శ్రీకృష్ణుడు సమకూర్చిన సమన్వయము ప్రశంసార్హము. భగవద్గీతను ఉపనిషత్సార మందురు. ఉపనిషత్తులందలి వివిధభావములను భగవద్గీతలో ఆయన సమరసభావముతో సమన్వయించి యున్నాడు. మోక్షమార్గములుగ పరిగణితములైన కర్మయోగమునకు, భక్తియోగమునకు, యోగమునకు భగవద్గీతలలో సమకూర్పబడిన సమన్వయము ఉదాహరణము. భగవద్గీతల కాలమున వివిధదర్శనాలవారు విభిన్నాదర్శములను గఱపుచుండిరి. నేతినేతిమార్గమున పరతత్త్వాన్వేషణము, ఆత్మసమర్పణము, ప్రగాఢభక్తి క్రతుకలాపములసమ్యగనుష్ఠానము యోగాభ్యాసము ఇన్నియు భగవత్సాక్షాత్కారమునకు ఇన్నిమార్గములుగ గణింపబడుచుండినవి. భగవద్గీత వీనిలో ఒక్కొక్కదానిని సముచితస్థానమున నెలకొల్పి ఇన్నింటిని అఖండమగు నొక మార్గమున అవయవములుగ నిరూపించెను. ఇదే శ్రీకృష్ణుని గొప్పతనము. కర్మము, భక్తి, జ్ఞానము అనునవి ప్రాప్యసిద్ధికి మార్గములుమాత్రమే కావనియు మానవుని యాధ్యాత్మికపురోగతిలో ఈమూడును మూడుమెట్లనియు భగవద్గీత ఉపదేశించినది.

## కర్మయోగాదర్శము

జగమునకు శ్రీకృష్ణుడు ప్రసాదించిన వానిలో మహిష్ఠమైనది కర్మయోగాదర్శము. భగవద్గీతలో కృష్ణుడు ఏకకాలముననే మానవునిగను భగవంతునిగను తన్ను చూపుకొనును.

> అజోఽపి సన్నవ్యయాత్మా
> భూతానా మీశ్వరోఽపిసన్.
> ప్రకృతిం స్వా మధిష్ఠాయ
> సంభవా మ్యాత్మమాయయా.

నేను జన్మరహితుడను. అలుప్తజ్ఞానశక్తిస్వభావుడను. సర్వభూతేశ్వరుడను. ఐయు, దేనివశమున ఈ జగత్తున్నదో త్రిగుణాత్మికమగు ఆ నా ప్రకృతిని వశ మొనర్చుకొని నా మాయచేతనే జన్మించుచుందును.

> అవజానన్తి మాం మూఢా
> మానుషీం తను మాశ్రితమ్,
> పరం భావ మజానన్తో
> మమ భూతమహేశ్వరమ్.

సర్వభూతేశ్వరుడనగు నా పరతత్త్వము నెఱుగక మూఢులు మానవదేహమును ధరించిన నన్ను అవజ్ఞయొనర్చుచున్నారు—అని శ్రీకృష్ణుడు స్వయముగా చెప్పినను భగవద్గీత ఆయనమహావ్యక్తిత్వమును ప్రతిపాదించుచునే యున్నది.

భగవద్గీతలో ప్రతిపాదితమైన కర్మయోగాదర్శమెట్టిది? కర్మ మను పదము కృ అను ధాతువునుండి నిష్పన్నమైనది. సమస్తవ్యాపారమును కర్మమే. కర్మమను శబ్దమునకు సాంకేతికముగా కర్మఫలమనియు అర్థము. తత్త్వశాస్త్రానుసారము ఈశబ్దమున కొక్కొక్కప్పుడు మనపూర్వకర్మముల ఫలితమని యర్థమగును.

జీవుడు కర్మమార్గమున దేవునితో సాయుజ్య మొందుటే కర్మయోగము. ఏపని చేసినను సమగ్రఫలప్రాప్తిని లక్షించియే చేయుదుము. అది సిద్ధింపవలెనన్న కర్మానుష్ఠానవిధాన మెఱుగవలెను. కర్మయోగమర్మము నవగాహన చేసికోవలెను. 'యోగః కర్మసు కౌశలమ్' 'కర్మముల మోక్షప్రదములుగ నొనర్చు కౌశలమే యోగము'' అన్నది భగవద్గీత. కర్మములోని మర్మమేమి, దేని నెఱిగినచో కర్మ మనకు సమగ్రోజ్జీవనప్రదమగును: స్వార్థమును ఫలమును గోరక యాచరించిన కర్మమే నిశ్శ్రేయసము నొనగూర్చు నని శ్రీకృష్ణుడు తెల్పుచున్నారు. ''కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన'' ''నీకు కర్మమందే యధికారమున్నది. ఎన్నడును నీకు కర్మఫలములయందాసక్తి కలుగకుండును గాక'' అనుట గీతాసూక్తి. పనిచేయునప్పుడు స్వలాభాపేక్షను పూర్తిగా వదలుకొనుటయే అందులమర్మము. ఈ నిగ్రహమే సకలకర్మలను భగవదారాధనాప్రకారములుగ రూపొందించునది. ''స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః'' మానవుడు తన వర్ణమునకు ఆశ్రమమునకును విహితమైన కర్మము నాచరించి సర్వాంతర్యామియగు పరమేశ్వరుని అర్చించి సిద్ధిని పొందును. పవిత్రీకరణసామర్థ్యమే సత్కర్మకు గల మహిమ. స్వార్థమును పూర్తిగ వదలుకొనని దే అది సిద్ధింపదు. కావుననే సంగరహితుడవై 'స్వలాభాపేక్ష లేనివాడవై కర్తవ్యములను నిర్వహింపు'మని కర్మయోగము బోధించుచున్నది.

సంగమును పరిత్యజించుటకు రెండు మార్గము లున్నవి. ఫలితములను లక్ష్యపెట్టక అభిలషింపక కర్మము నాచరించుట ఒక పద్ధతి. ఫలములను ఈశ్వరున కర్పించుచు కర్మల నాచరించుట మఱొక పద్ధతి. తొలి పద్ధతికి ఎంతో ఆత్మనిగ్రహముండవలెను. కావున అది దుష్కరము. రెండవ పద్ధతిలో పురోగమించుటకు భగవంతునందు సరళ ప్రగాఢ విశ్వాస మున్న చాలును.

నిస్సంగబుద్ధితో నిర్వర్తితమగు కర్మమే వరిష్ఠము. నిజమునకు అందఱిలో నంతర్యామిగ నుండి సకలమునకును కర్త యగువా డీశ్వరుడే కావున ఆయన నుపాసించుట కిదొక ప్రకారమని తదర్పితఫలముగ కర్మల నాచరింపనగును. అట్లొనర్పబడిన కర్మము మనలను పవిత్రీకరించి బంధవిముక్తి సాధన మగును.

శ్రీకృష్ణు డీ కర్మయోగము నుపదేశించినది యుద్ధభూమిలో ననుటను గమనింపవలెను. ఆయన ప్రతిపాదించిన యోగి లక్షణములకు ఉత్తమలక్ష్యము ఆయనయే అనుట ఇందుచేత సూచితమైనది.

> కర్మణ్యకర్మ యః పశ్యేత్
> అకర్మణి చ కర్మయః
> సబుద్ధిమా న్మనుష్యేషు
> సయుక్తః కృత్స్నకర్మకృత్.

కర్మమందు తన కర్తృత్వమును నైష్కర్మ్యమందు బ్రహ్మమును సాక్షాత్కరించుకొను వాడు మానవులలో బుద్ధిమంతుడు, యోగయుక్తుడు, కృతకృత్యుడు నగుచున్నాడు. శ్రీకృష్ణుడు అర్జునునికి మెట్టుమెట్టుగా నచ్చజెప్పిన రీతి ఆశ్చర్యకరము. సారథియైన తాను రథియైన అర్జునుని ''శత్రువులతో పోరాడుట అనెడి క్షత్రియకృత్యము నిర్వర్తింపు''మని చెప్పెను. ఈమాట అతని తల కెక్కకపోగా నిష్కామ కర్మయోగమును ఉపదేశించును. ఇదియు అర్జునుని హృదయమును మార్పజాలక పోగా అప్పుడు శ్రీకృష్ణుడు విశ్వరూపమునుచూపును.

శ్రీకృష్ణుని సర్వాంతర్యామిత్వము చూచి నంతనే అర్జునుని సంకుచితాహంకారము విచ్ఛిన్నమై కర్త కృష్ణుడే, తా నతనిచేత నొక పనిముట్టుమాత్రమే అనుట అర్జునునకు తెలిసి వచ్చెను. అంత నతడు మిథ్యావిషాదమును దులుపుకొని యథాపూర్వము అద్వితీయ ధనుర్ధరుడై శత్రువులతో పోరాడ లేచెను.

శ్రీకృష్ణునిగూర్చి శ్రీ వివేకానందస్వామి పల్కిన ఈ మాటలు సంస్మరణార్హములు. ''నాకు తెలిసినంతవఱకు అతడు ప్రజ్ఞయందు ఔదార్యమందు కౌశలమందు సమానముగా అద్భుతముగా పెంపొంది సర్వతోముఖ సమగ్రత గలవాడు. గౌరవార్హ మహాపురుషుడుగ నేమి, యోధుడుగ నున్నప్పుడేమి, సచివుడుగ నున్నప్పుడేమి, మఱొక్కదశలో నేమి, అతని జీవితములో ప్రతిక్షణమును క్రియావ్యగ్రతతో గడచెను. అతడు పురుషులలో గొప్ప, కవులలో గొప్ప, సర్వతోముఖసమగ్రమును, అద్భుతావహమును అగు ఈ క్రియావ్యగ్రతయు ఈ ఔదార్య ప్రజ్ఞామేళనమును భగవద్గీతాది గ్రంథములలో కాననగును. ఔదార్యము మహాద్భుతము. వాణి అత్యంత మనోహరము. దానికి సాటి ఎందును లేదు. శ్రీకృష్ణుని ఈ అత్యంత క్రియావ్యగ్రతయొక్క ముద్ర ఇప్పటికిని అందున్నది. ఐదు వేల సంవత్సరములు గడచిపోయినవి. కోట్లకొలది మానవులపై ఆయన ప్రభావము ప్రసరించినది. మీకు తెలిసియుండవచ్చు. తెలియకుండ అఖిలవిశ్వముపై అతని ప్రభావ మెంతగా నున్నదో ఊహించి చూడుడు. అతనిమతి నిష్కళంకము. అందుకే నా కాతనియం దాదరము. ఆ బుఱ్ఱలో సాలె పట్లు లేవు. గ్రుడ్డినమ్మకాలు లేవు. ప్రతి దాని ఉపయోగ మతడెఱుగును. దేనికి తగిన స్థానము దానికి నిర్ణయింపవలసి వచ్చినప్పుడు నిర్ణయించున దతడే...... ఇక అతని ఔదార్యమో! ప్రతి వర్ణము వారికిని మతములో ప్రవేశము కలుగ వాకిలి తెఱచుట కతడే ప్రథముడు. ఆ విషయములో బుద్ధునకు సైతము అతడు మార్గదర్శకుడు.'' భగవద్గీతలో కృష్ణుడు విశ్వమున కొసంగిన సందేశ సారమిది.

యోమాం పశ్యతి సర్వత్ర
సర్వంచ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి.

సర్వభూతములలో నన్ను దర్శించువాడును నాయందు సర్వభూతములను చూచువాడు నగు పురుషునకు నేను అదృశ్యుడను కాను. అతడు నా కదృశ్యుడు కాడు.''

# శివానంద స్మృతులు - 38

## అను : శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరుమఠము

బుధవారము క్రీ. శ. 13-3-1929

శ్రీమహాపురుషుల ఆరోగ్యము సరిగాలేదు. సేవకుని వైపు చూచుచు ''చూడు! జలుబు తగ్గినది. కఫము ఎక్కువ అయినది. ఒకటి పోయిన మఱొకటి అంటిపెట్టుకొనే ఉన్నది. ఈవిధముగా ఈ శరీరము ఇక ఎక్కువదినాలు ఉండుట మంచిదా? మీ అందఱికికూడ ఎంత కష్టము కలిగించుచున్నాను!

సేవకుడు: అదేమి? మీరు అలాగు అనకుడు. మాకేమియు కష్టము లేదు. మీరే మాతల్లియు, తండ్రియు, అంతయు మీరే. ఈ వృద్ధాప్యమున

మేము ఈ కొద్దిపాటి సేవచేయలేమా? ఈ కొద్దిపాటి సేవచేయగల్గు అవకాశము మాకు లభించుట మా సౌభాగ్యఫలమే కదా!

మహాపురుషులు: నాకు ఈ విషయము బాగుగ తెలియును. మీరు ఎంతో ప్రేమతో నాకు సేవచేయుచున్నారు. అసలు విషయ మేమనగా ఈలాగు రోగపీడితుడనై ఎక్కువ దినములు జీవించియుండుటకు నే నిచ్ఛగించుట లేదు. అంతయు శ్రీభగవానుని ఇచ్ఛ. వారు ఎలాగుంచెదరో ఆలాగే యుండవలెను.

సేవకుడు: స్వామీ, మేము శ్రీ భగవానుని (శ్రీ రామకృష్ణుని) చూడలేదు. మీరు ఉన్నారు. అదే మాకు ఎంతయో ఆనందమును కల్గించుచున్నది. మీరు శ్రీభగవానుని బిడ్డలు. మీ చెంతచేరగల్గు మా భాగ్యము ఏమని తెల్పుదును! మీరున్నారు కావుననే పెక్కురు సాధుబ్రహ్మచారులకేగాక, పెక్కు భక్తులకును ఆనందమును కల్గించుచున్నారు. ఒక్కొక్క మాఱు నాకు ఈలాగు తోచును—ఆహా! మిమ్ములనొక్కసారి దర్శించు ఆశతో ఎంతో డబ్బు ఖర్చుపెట్టుకొని, ఎంతో కష్టపడి చాల దూరమునుండి పెక్కుభక్తులు వచ్చుచున్నారు కదా! మా పరమసౌభాగ్యవశముననేకదా మేము సర్వదా మీవద్దనుండగల్గునట్టి అవకాశము చేకూరినది.

మహాపురుషులు: మీపై శ్రీ భగవానుని విశేష కృప కలదు. అందుచేతనే వారు మీద్వారా తనభక్తుని సేవచేయించుచున్నారు. మీరు ధన్యులు. మీతోడ ఉండగల్గినందులకు నేనును ధన్యుడను లేకున్న నేను ఎక్కడ ఉండువాడనో? ఎవరు నాచెంత ఉండువారో? శ్రీ భగవానుడు సర్వదా మా యోగక్షేమముల నరయుచునే యున్నాడు. శ్రీమహారాజు (బ్రహ్మానందస్వామి) మహాసమాధికి కొన్ని నిమిష ములకు ముందు సేవకులవంకజూచి "మీరందఱును నాసేవచేసితిరి. మీ కేమి చెప్పుదును! మీకెల్లరకును బ్రహ్మజ్ఞానము కల్గుగాక" అనిరి. నేనుకూడ మీకు ఆలాగే చెప్పుచున్నాను— "మీ కెల్లరకును బ్రహ్మజ్ఞానము కలుగుగాక! పరిపూర్ణభక్తి విశ్వాసములు కలుగుగాక— మీరెల్లరును ఆనందము ననుభవింతురుగాక."

శ్రీమహాపురుషుల అనారోగ్యకారణమున ప్రతిదినము ఆలయమునకువెళ్ళి మంత్రోపదేశముల నొసగుశక్తి లేకుండెను. అట్టితఱి పెక్కు మార్లు తమగదిలో మంచముపై కూర్చుండియే మంత్రదీక్షనొసగెడివారు. ఆనాటిసాయంత్రము సుమారు $4\frac{1}{2}$ గం॥ లకు మద్రాసునుండి ఒక భక్తుడువచ్చి మంత్రోపదేశమునొసగ శ్రీవారిని ప్రార్థించెను. మహాపురుషులు వెంటనే అందులకు సమ్మతించి మరునాడు ఉపదేశము చేయుదునని పల్కిరి.

భక్తుడు మీఇష్టమే మామహాభాగ్యమనెను.

మహాపురుషులు: భగవన్నామమున కిట్టి నిబంధనలు లేవు. లోపలినుండి భగవన్నామస్మరణచేయవలెనను కోర్కెకల్గిన వెంటనే నామజపము కావింపవలెను. భగవానుడు పతితపావనుడు. పతితుల నుద్ధరించు నిమిత్తము నరదేహము దాల్చివచ్చెను. మేము ఆయన దాసులము, ఆయన బిడ్డలము. ఈ శరీరము ఉండువఱకు ఆ తారకమంత్రమును, ముముక్షువులకు అందజేయుచుండెదము— మా మంత్రోపదేశము - పురోహితుల మంత్రోపదేశమువలె కాదుసుమా! ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో అతడే శ్రీరామకృష్ణరూపమున అవతరించెను. వివిధమతభావములు - సమస్తదేవదేవీస్వరూపములు - ప్రతిమూర్తియే శ్రీరామకృష్ణుడని మా దృఢభావన. మాకు ఆ శ్రీరామకృష్ణుని తప్ప వేఱొండుగతి లేదు.

## 60

చిల్కా—పేట,
అల్మోడ, ఉ. ప్ర.
ప్రియా, 27 అక్టోబరు 1915.

నీజాబు చూచుకొని నిర్భరానంద మొందితిని. 'పూజా' విరామదినాలలో నీవు ఊరికి మరలివచ్చితి వనియు ఆ ప్రాంతాలలో గురుదేవు డెట్లు స్థిరముగ నెలకొనుచున్నాడో ప్రత్యక్షముగ చూచుచున్నావనియు తెలిసి మఱింతగా ఆనందించితిని. కాలక్రమమున ఇంక నెన్ని విశేషములను నీవు చూడ నున్నావో!

జవాబిది: (1) మన మీ లోకమునకు మరల వత్తుమా రామా అను నిట్టి తలంపు లెల్ల అజ్ఞానముచే గలుగుచుండును. అట్టి తలంపులు భక్తుల కెన్నడును గలుగవు. తమ జీవితములను దేవుని శ్రీచరణముల కంకితము చేసికొన్నవారు పూర్తిగా భగవదిచ్ఛాపరతంత్రులుగ నుందురు. ఈ లోకమునకు మరల వత్తుమో రామో పెరుమాళ్ళకే ఎఱుక. మనము పోవునది ఆయనయొద్దకు. మన ముండునది ఆయనతో గూడి, ఈలోకమునకు మనము రావలసి వచ్చినను ఆయనతో గూడియే వత్తుము. ఉన్నచోటను చన్నచోటను మనకు సఖు డాయనయే.

(2) దివ్యభావములకన్నిటికి నియంత సర్వేశ్వరుడే. ఎప్పు డే భావము గల్గిన, అప్పు డందు మునిగి యుండుటే శ్రేష్ఠము. ప్రస్తుతము నీవు మునిగియున్న దివ్యభావము సర్వసాధకము. ఇప్పుడు మాతృభావము నీకు నచ్చుచుండుటకు కారణ మదే. భగవంతుని పట్ల నేభావ మున్నను తప్పు లేదు, ప్రతిభావమును సరియైనదే. ఇది శ్రీరామకృష్ణదేవు నభిప్రాయము. సకలభావాలసారమునకు స్వచ్ఛమూర్తిభావమే శ్రీరామకృష్ణుడు. ఆ ప్రాంతాలలో భక్తుల సంఖ్య హెచ్చుచుండుట ఎంతయు సంతోషకరము. కోళ్ళొల్లలుగ పెంపొందును గాక! యుగావతారుడు తన ప్రభావమును వ్యాపింప జేసికొను విధ మిదే. భక్తుల డెందములలో ప్రేమ ప్రబుద్ధ మగుటకును వారి పరస్పరసానుభూతి సహకారములకును కారణము, దుర్జ్ఞేయమైన భగవంతుని యోగమాయయే! అదంతయు చాల బాగున్నది. నీవు మాతృశ్రీ ప్రతిమ నొకదానిని సంపాదించి దానిని ఆరాధించుచున్నా వను విషయము నాకు ప్రత్యేకముగ సంతోషకరము. మీ జీవితములు ధన్యదశ నధిగమించుచున్నవి. గ్రంథాలయ మభివృద్ధి చెందుచున్నదనుట ఆశాజనకవార్త మహానందదాయకము. గ్రంథాలయమునకు ప్రత్యేకావశ్యకత గలదు.

విజయసందర్భమున నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు.

నీ శ్రేయోభిలాషి
శివానంద.

అనుబంధము: ఒకవిధముగా నా ఆరోగ్యము బాగున్నది. దేహ మున్నంతవఱకు మంచిచెడుగులు అనివార్యములు. మన స్మృతిలో భావనలో దేవు డున్నంతవఱకు అంతయు మంచిదే. లేకున్న అంతయు చెడుగే.

## 61

రామకృష్ణ అద్వైతాశ్రమము.
లుగ్స, కాశి.
నవంబరు 6, 1915 పూర్వాహ్ణము 11-30 గంటలకు

ప్రియ హరిమహరాజ్,

భగవత్సంకల్పానుసారము నేను నిన్న సాయంకాలమునకు ముందే, సుమారు 5 గంట

లప్పటికి ఇక్కడికి క్షేమముగా చేరినాను. శ్యామాపూజకు సమస్తము సిద్ధమగుచున్నది కల్కత్తానుండి సురేశుడును ఈదినము వచ్చి పూజాపరికరాలను పెక్కింటిని అతడు తీసికొని వచ్చినాడు. అతనితల్లిగారు రాజాలకపోయి నారు, కాని ఆమె ప్రత్యేకముగ కోరినందుననే, శ్యామా ఆస్థలో అపేక్షించినందుననే పూజకు ఏర్పాట్లు చేయబడుచున్నవి. మహారాజుగారు (శ్రీ బ్రహ్మానందస్వామి) పూరికి పోయి యున్నారు. నీరోదు మద్రాసులో ఉన్నాడు. అతనికి ఆరోగ్యము బాగులేదు, ఉండియున్న అతడు తప్పక వచ్చియుండును.

......నేపాలు పూజను నిర్వర్తించును. ప్రకాశ్ తంత్రధారకుడుగ నుండును, (పూజ జరుగుచున్నప్పుడు పుస్తకమునుండి మంత్రములు చదువువాడు తంత్రధారకుడు.) ప్రకాశ్ చండిపారాయణము చేయుచున్నాడు...... ఈశ్వరానుగ్రహముచే చారుబాబుకు కాళిబాబుకు కేదారబాబుకు, అద్వైతాశ్రమ రామకృష్ణమిషను సేవాశ్రమాలందున్న యితరులకు ఆరోగ్యము బాగున్నది. సుకులమహారాజు పరిస్థితి రవంత మెఱుగుగా నున్నది. నీవు రానందుకు అందఱును చింతిల్లుచున్నారు..... ప్రొద్దున సుమారు 9 గంటలప్పుడు శ్యామతో నేను విశ్వనాథపుణ్యమూర్తిని అన్నపూర్ణామాతను దర్శించి, పవిత్ర గంగాభవానిని దర్శింప స్పృశింప గంటిని.

నాప్రేమప్రణతుల నందుకొమ్ము. ఇచ్చట ఉన్న యితరులును తమ ప్రణామములను నీకు అందజేయుచున్నారు. కానాయికిని సీతాపతికిని నాప్రేమాశీస్సుల నందజేయుము.

సేవకుడు—తారకుడు.

## 62

రామకృష్ణ అద్వైతాశ్రమము
లుక్సా, బనారస్ సిటి,
12 నవంబరు 1915

ప్రియ హరిమహారాజ్,

నీ రెండుజాబులును యథాక్రమముగా చేరినవి......ఇక్కడ జరిగిన మాతృపూజకుసంబంధించిన వివరముల నన్నిటిని నీకు చంద్రుడు వ్రాసియున్నందున, నేను మరల ప్రత్యేకముగా వ్రాయనైతిని. నేపాలుడే పూజారి. కాని నాటిరాత్రి సుమారు ఒంటిగంట ఒకటిన్నర గంటలప్పుడు అతడు ఎంతయు దుర్బలుడుగనుండినందున కూర్చుండజాలక పోయెను. పిత్తముచే నతడు రెండుమూడు పర్యాయములు వాంతిచేసికొనెను. కావున విశ్రమింపవలసి వచ్చెను. నేనుపవాస ముంటిని, కావున నేనును ప్రకాశుడును పూజాక్రమములో చరమభాగాలను హోమాదులను నిర్వర్తించితిమి. ప్రభాతమున ఆఱుగంటలప్పటికి పూజ ముగిసినది.........

శ్యామాదేవికి పోవు ఎగుదారి నిట్రమైనది నీ వచటికి పోవుట మంచిది కాదు. డోలీలో పొమ్ము. నీకు చాల విసుగుగలిగించును.

దుర్గాచరణబాబు నిన్న సాయంకాల మిచ్చట నుండినాడు. చాల ఖిన్నుడై 'హరి మహారాజు రాలేదే, ఆయన వచ్చియుండిన ఎంత బాగుండెడిది' అని మాటిమాటికిని చెప్పుచుండినాడు. నా హృదయపూర్వప్రేమప్రణామాదులను స్వీకరింపుము. చలికాలములో నీకు కష్టముగ నుండునేని, మధుమేహవ్యాధి మఱింత తీవ్రమగునేని, ఇక్కడికి రమ్ము.

సేవకుడు—తారకుడు.

## 63

రామకృష్ణ అద్వైతాశ్రమము
లుగ్సా, వారణాశి,
29 నవంబరు 1915

ప్రియ—,

నీజాబు యథావిధిగా చేరినది. కాని నే నిక్కడికి జరూరుగ రావలసి యుండినది. శ్యామాపూజలప్పుడు నే నిక్కడికి వచ్చినాను. ఇక్కడికి వచ్చినప్పటినుండి నా శారోగ్యము బాగులేదు. ఇన్ని కారణాలచేత నీజాబుకు జవాబు వ్రాయలేక పోయితిని.

గురుదేవు ననుగ్రహముచే నీవు ఆయననే శరణుజొచ్చితివి. నీ కిచ్చవచ్చిన రీతిలో ఆయనను స్మరింతువు గాక. ఇష్టమైన వైఖరిలో ఆయన నాశ్రయింతువు గాక. శిశువువలె ఆయనను ప్రార్థింపుము. ఆయనను ప్రార్థించితివేని భక్తిని శ్రద్ధను ప్రేమను పవిత్రతను సమస్తమును బడయగలవు. మానవులకు భక్తిని శ్రద్ధను జ్ఞానమును ప్రసాదించుటకే భగవంతుడు మానవరూపమున అవతరించుచుండును. గురుదేవుడు ఈ యుగావతారుడు. ఈ విషయమును నమ్మి భక్తిశ్రద్ధల బడయ ఆయనను ప్రార్థించితివేని, నీడెందమున శాంతి సుస్థితులు నెలకొనును. ఈనామాటల నాలకింపుము. ఆయన శ్రీచరణముల సమాశ్రయించిన దాసుడను నేను. నీ కీ సలహాను నాచే ఆయనయే యిప్పించుచున్నాడని నీవు నమ్మ వచ్చు. భగవద్ధ్యానచింతనలు భగవత్ప్రేమ – ఇవి హృదయమునకు సంబంధించిన విషయములు. ఇందు నీ కడ్డువచ్చుటకును, భగవత్సాన్నిధ్యమును నీకు లేకుండ జేయుటకును ఎవరికిని శక్యము కాదు. శ్రీరామకృష్ణుని శరణుజొచ్చినచో, విశ్వసంతారకమైన ఆయన యనుగ్రహము నీపట్ల కలుగునో కలుగదో అనుచింత నీ కక్కఱ లేదు. ఈ విషయమును నీవు గట్టిగ తెలిసిపెట్టుకోవచ్చు. పెద్దలపట్ల భక్త్యాదరములు గల్గి యుండుట నీకు విధాయకము, కావున అలాగుందువు గాక. నీకు నాహృదయపూర్వకాశీస్సులు.

నీశ్రేయోభిలాషి
శివానంద

అనుబంధము: భక్తులలో చీలిక లుండుట భక్తిలక్షణము కాదు. చీలికలు కలుగకుండ వలెనని ప్రార్థింపుము.

# వార్తలు - విశేషాలు

## వివేకానంద శిలమీది స్మారకమండపాల ఆవిష్కరణ మహోత్సవాలు, కన్యాకుమారి.

## నివేదిక

### ముందుదినం ఉత్సవనిర్వాహకులు కావించిన తెలివిడి

మండపాల నిర్మాణం పూర్తియై 2-9-1970వ తేదీనాడు ప్రొద్దున 9-30 గంటలకు వాని ఆవిష్కరణం జరుగుతుంది. 1893వ సంవత్సరం సెప్టెంబరులో షికాగోనగరమున విశ్వమతమహాపరిషద్వేదికపై శ్రీస్వామీజీ అవిస్మరణీయోపన్యాసం కావించారు. అందుకిప్పుడు 77-వ వార్షికోత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవదినం ఈ ఉత్సవదినం భారతీయ పంచాంగాన్ని

బట్టి—ఒక్కటిగా కుదిరింది. నూత్నమండపాలను రాష్ట్రపతి శ్రీ వ. వే. గిరిగారు ఆవిష్కరిస్తారు, తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ము. కరుణానిధిగారు సభాధ్యక్ష్యం వహిస్తారు. శ్రీరామకృష్ణసర్వమతాధ్యక్షులు శ్రీ శ్రీ వీరేశ్వరానంద స్వాములు ఈ ఉత్సవములో పాల్గొంటారు. ఆశీర్మంగళం అనుగ్రహిస్తారు. మండపాలకు సంప్రోక్షణ వారే చేస్తారు. ఆకార్యకలాపం ప్రొద్దున 7 గంటలప్పటికి ముగిసిపోవాలి. అన్ని జిల్లాలనుండిన్నీ ఈ ఉత్సవానికి కన్యాకుమారికి దాదాపు రెండులక్షలమంది రావచ్చని అంచనా వేయబడింది. ఊరు చిన్నది. రైల్వేలైనుకు సుమారు యాభైమైళ్ళదూరంలో ఉంది. స్మారక మండపాలు రెండున్నర ఫర్లాంగుల దూరాన నడిసముద్రంలో ఉన్నాయి. పడవలో పోవాలి. అందఱికి ఏకకాలాన రాకపోకలు సాధ్యపడవు. కాబట్టి రెండునెలలకాలంలో ఈ ఈప్రాంతాల వారికి ఈ ఈ వారా లని ఒకక్రమం ఏర్పఱచబడిఉంది. రైల్వేవారుకూడా తిరునెల్వేలి త్రివేంద్రము స్టేషన్లకు ఆగస్టు 20 వ తేదినుండి అక్టోబరు 30-వ తేదివఱకు ప్రత్యేక కన్సెషను టిక్కెట్లిస్తామని ప్రకటించారు. మన సంస్కృతిని స్వామిజీ జీవితోపదేశాలను ప్రతిపాదించే సమావేశాలకు ప్రసంగాలకు ఛాయాచిత్రాలకు నాటకాలకు పాటకచ్చేరీలకు భజనలకు ఏర్పాట్లు చేయబడి ఉన్నాయి. వచ్చిన ప్రతిఒక్కరు (పిల్లలుతప్ప) 6 రూపాయలు చెల్లిస్తే వారికి డెలిగేట్లకు సముచితములైన సకలోపచారాలు చేయబడతాయి. వారికి బసలేర్పాటుచేసియున్న చోటికి వివేకానందపురమని పేరు. అది కన్యాకుమారిఊరిద్వారం దగ్గఱే ఉంది. స్వామిజీ జీవితకార్యాలను సూచించే ఒక వస్తుప్రదర్శనానికి ఏర్పాట్లై ఉన్నాయి. ఆప్రదర్శనానికి 'ఉత్తిష్ఠత జాగ్రత' 'లెండి, మేలుకొండి' అని పేరు. మండపంలో ప్రతిష్ఠించి ఉన్న శ్రీవివేకానందస్వాముల ఎనిమిదడుగుల పొడుగు పెద్దకంచుబొమ్మను తయారు చేసినవారు, శ్రీ ఎన్. ఎల్. సోనావదేకరు. ఆయన బొంబాయి 'ఆర్ట్సుస్కూలు'లో ఉపాధ్యాయులు. ఈ రెండునెలల ఉత్సవాల తుదిదినం సమావేశానికి ఉపరాష్ట్రపతి శ్రీ జి. ఎస్. పాఠక్కుగారు అధ్యక్షత వహిస్తారు. అప్పుడు 800 పుటల 'వివేకానందస్మారక' సంపుటం డాక్టరు ఆర్. సి. మజుందారుగారి ఉపోద్ఘాతంతో వెలువరింపబడుతుంది. "విశ్వాశయాలలో సంస్కృతిలో యుగయుగాలుగా భారతీయులు సమకూర్చిన భాగాన్ని" గూర్చి అందులో దేశీయవిదేశీయ విద్వద్వతంసుల వ్యాసాలుంటాయి. ఈ నిర్మాణాలకు ఉత్సవాలకు మద్రాసు కేంద్రకార్యాలయంలో ఇప్పటివఱకు వసూలైన మొత్తం సుమారు తొంభైలక్షల రూపాయలు. విరాళాలు ఇంకా వస్తూనే ఉన్నాయి. అంచనావేసిన మొత్తం ఒక కోటి యిరవైలక్షల రూపాయలు.

## శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వాముల ప్రసంగం

[1-9-1970 నాటి సాయంకాలం 7 గంటలకు ఆకాశవాణిలో ప్రసారితమైనది.]

తనకు మునుపుండినవారివలె కాదు శ్రీ వివేకానందస్వామి. ఈయన మతాధ్యాత్మికపరుడైనా దేశీయజీవితంలో అన్ని రంగాలను గూర్చి స్వాభిప్రాయాలను తెలిపిఉన్నాడు. కాబట్టి ఈయన్ను గొప్పదేశభక్తుడని, విద్యానిష్ణాత అని, సంఘసంస్కర్త అని, ఇంకను పలు విధాల ప్రస్తుతించడం చూస్తున్నాం. ఐతే ఆయనకు ఈ విశేషణాలు చాలవు. మఱికొంత కావాలి. ఆయన పరమార్థాన్ని సాక్షాత్కరించుకొన్న సిద్ధుడు, జీవితంమీద అందు అన్ని రంగాలమీద ఆయన ప్రసరింపజేసిన దృష్టి



కన్యాకుమారికి దిగువ మూడు సముద్రాల కూడలిలో వివేకానంద శిల మీది స్మారక నిర్మాణాలు



(ఎడమవైపు) వివేకానంద మండపం (కుడివైపు) శ్రీపద మండపం



స్మారక మండపంలో ప్రతిష్ఠితమైన శ్రీ వివేకానంద
స్వాముల కంచు విగ్రహం, ఎత్తు ఎనిమిదడుగులు



శ్రీ వివేకానందస్వాముల విగ్రహమున కెదుట
రాష్ట్రపతి శ్రీ వ. వే. గిరి, తమిళనాడు ముఖ్యమంత్రి
శ్రీ ము. కరుణానిధి ప్రముఖులు



వేదికపై శ్రీ రామకృష్ణ సర్వ మఠాధ్యక్షులు శ్రీ వీరేశ్వరానంద స్వాములు, రాష్ట్రపతి వ. వే. గిరి, ముఖ్యమంత్రి ము. కరుణానిధి మున్నగువారు



ఆశీర్మంగళవాక్కు అనుగ్రహిస్తున్న శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వామి. (కూర్చున్నవారు ఎడమవైపు నుండి) శ్రీ డి. ఎన్. సింహా, పశ్చిమ బెంగాలు మాజీ ప్రధాన న్యాయమూర్తి, డాక్టరు వే. రాఘవను, శ్రీ ఏకనాథ రనడేగారు



నిర్వాహక కార్యదర్శి శ్రీ ఏకనాథ రనడేగారు నివేదిక చదువుతున్నారు



స్మారక నిర్మాణాల ఆవిష్కరణోత్సవానికి హాజరైన ప్రజానీకం

సాక్షాత్కారసిద్ధుని దృష్టి. చరిత్రలో నాటి నుండి నేటివఱకు అన్నియుగాలలో భారతీయుల జీవితదృక్పథం ప్రత్యేకమైనదని ఆయన గుర్తించాడు. భారతదేశలక్ష్యం ఎప్పుడూ ఆధ్యాత్మికం. ఆ లక్ష్యం తగ్గిపోవడమే భారతదేశానికి దాపురించిన సకల సమస్యలకూ కారణమని స్వామిజీ గ్రహించాడు. కాబట్టి ఆధ్యాత్మిక విప్లవం తెచ్చి దేశీయజీవితాన్ని ఉత్తేజపఱచాలని ఆయన ఉద్దేశించాడు. కాబట్టి ప్రతి జీవిలోని దివ్యతను మేలుకొల్పడం. ఆయన ప్రధాన లక్ష్యమైనది: దేశీయజీవితంలో అన్ని వైపులకూ ఆధ్యాత్మిక లక్ష్యంతో సమన్వయం కుదరాలి అనడం ఆయన కోరిక. ఈ యాధ్యాత్మికపు పునాదిమీదనే తప్ప వేఱొక పునాదిపై భారతపునర్నిర్మాణం నెగ్గదు. ఆర్థిక రాజకీయ లక్ష్యాలు ఉపయోగపడవు. భారతదేశం ఆధ్యాత్మిలక్ష్యాన్ని విడిచి మఱొక లక్ష్యంవైపు తిరిగితే—వినాశానికి దారి తీస్తుందని ఆయన హెచ్చరించాడు.

అయితే, పురోహితులచే వ్యవస్థితములై వారి అంగీకారం పొందిన నమ్మకాలు ఆచారాలు సంస్థలు—ఇవే మతం అని ఆయన భావించలేదు. అలాంటి దృక్పథాన్ని స్వామిజి ఖండించారు. ఆయనకు మతం అంటే అనుభూతీ, సాక్షాత్కారమూ. ఇదిగోండి ఆయన నిర్వచనం:- "ప్రతి జీవియందును దేవత్వము గర్భితముగా నున్నది. బాహ్యాంతరప్రకృతి నంతయు నిరోధించి, యంతర్గతమగు నీదేవత్వమును వ్యక్తము చేయుటయే జీవితపరమావధి. ఇందులకై కర్మభక్తియోగజ్ఞానమార్గములలో ఒక్కటినిగాని కొన్నిటినిగాని యన్నిటినిగాని యవలంబించి—ముక్తుడవగుము. ఇదియే మతసారము, తత్త్వసారము; వాదములు సిద్ధాంతములు గ్రంథములు కర్మకలాపములు దేవాలయములు విధులు—ఇవన్నియు కేవల మప్రధాన వివరములు."

బంధంనుంచి కష్టాలనుంచి మనకు విముక్తి కూర్చడమే మతసారం. ఏది బంధం? 'నేను' 'నాది' అను తలంపే బంధం, స్వార్థపరతయే బంధం, నిస్స్వార్థతయే ప్రేమయే విముక్తి. భగవత్సాక్షాత్కారానికి విముక్తికి దారులే యోగాలు నాలుగున్నా. ప్రతియోగంలోనూ సారం అహంకార మమకారాలు అంతరించడమే.

ఈ మతనిర్వచనం మతసహనమునకూ సామరస్యానికీ కూడా మూలం అవుతుంది. ప్రతి మతంలోను లక్ష్యం అహంకార మమకారాలను అంతరింపజేయడమే. అందుకు విహితమైన మార్గంకూడా ఈ నాల్గు యోగాలలో ఒకటిగానో, ఒక రెంటి మూటి కలయికగానో ఉంటుంది. కాబట్టి సారమయిన అంశం అన్ని మతాలలోను ఒక్కటే. క్రతుకలాపాలలో సంకేతాలలో కొన్నిభేదాలుండవచ్చు. ఏ జాతిలో ఏమతం పుడుతుందో ఆజాతి కనుగుణాలుగా క్రతుకలాపాలు సంకేతాలు ఆ మతంలో ఏర్పడతాయి. జాతికొక భాష రూపొందినట్లుగా క్రతుకలాపాలు సంకేతాలు కూడా ఏజాతికి ఆజాతివారి మానసిక పూర్వపరిస్థితులనుబట్టి ఏర్పడుతాయి. వానిలోని విభేదాలకిదే కారణం. సారమైన భాగం అన్ని మతాలలో ఒక్కటే. కాబట్టి మతకలహాలు అర్థరహితాలు.

లోకానికి స్వామిజి ప్రసాదించిన మఱొక గొప్పవరం—'సేవాసిద్ధాంతం'. భారతదేశచరిత్రలో చూడండి, ఆధ్యాత్మిక మహావ్యక్తి అవతరించినప్పుడంతా, వెంబడే సన్న్యాస సంప్రదాయం ఒకటి ఏర్పడుతుంది. ఆ సన్న్యాసులు తమప్రవక్త బోధించిన లక్ష్యాలను తమ నిత్యాచరణలో చూపుతూ ప్రజలలో వాటిని

ప్రచారం చేస్తారు. శ్రీరామకృష్ణుని వెంబడిన్ని ఒకసన్న్యాససంప్రదాయం వచ్చింది. కాని ప్రాతసన్న్యాససంప్రదాయాలకు శ్రీవివేకానంద స్వామి స్థాపించిన యీ క్రొత్తసన్న్యాససంప్రదాయానికి రవంత భేదం ఉంది. ప్రాతసంప్రదాయాలలో సకలేతరకార్యాలుమానుకొని ధ్యాన మార్గంలో భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవడం ఒక్కటే లక్ష్యం. అవిచ్ఛిన్నధ్యానం సాక్షాత్కారానికి సోపానం. వేఱు ఏ సత్కార్యానికి పూనుకొన్నా, అది ధ్యానానికి అంతరాయమే. కాని దేశపునర్నిర్మాణానికి వివిధ రంగాలలో సన్న్యాసులు నిర్వర్తించవలసిన పనులున్నూ ఎన్నో ఉన్నాయని స్వామిజి గుర్తించారు. ఐతే ఇలాంటి ఐహికకార్య వ్యగ్రతచే ధ్యానానికి అంతరాయం లక్ష్యానికి అస్తమయం కలుగుతుంటే—అంటే, ప్రతిపనిని ఉపాసనాస్థాయి నధిరోహింప· ఆ మొజ్జి తొలగించేశారు శ్రీస్వామిజి. ఈలాగు అన్నారు స్వామిజి: "భగవంతుడికి పరాత్పరత్వమూ సర్వాంతర్యామిత్వమూ—రెండూ ఉన్నాయి. మనపనికి – మానవులలో అంతర్యామిగా ఉన్న దేవుణ్ణి లక్ష్యంగా చేసుకోవడం మూలాన – ఆ పనియే ఉపాసన అవుతుంది. పరాత్పరుణ్ణి ఉద్దేశించి చేసే ధ్యానానికి మానవాంతర్యామియైన భగవంతుణ్ణి ఉద్దేశించి చేసే సేవ అనుబంధమే కాని ప్రతిబంధం కాదు. 'ఆత్మనో మోక్షాయ జగద్ధితాయ చ' మనం సాధించుకో వలసింది 'స్వాంతానికి మోక్షం లోకానికి హితం' అనే లక్ష్యం లోకానికి శ్రీవివేకానందస్వామి దయ చేసిన అద్వితీయప్రసాదము. ఆత్మమోక్షం జగద్ధితం అనే రెంటిలో మొదటిది ముఖ్యం. రెండోది అప్రధానం. అంటే మొదటిదానికై సాగేసాధనకు రెండోది అంగభూతం. దాన్ని సాధిస్తే ఇది తనంతట సిద్ధిస్తుంది.

మునుపటి ప్రపంచంలో వలె కాక నేటి ప్రపంచంలో బాధ్యతలను గుర్తించక కేవలం హక్కులకై కలహాలు ద్వేషాలు పోటెక్కి ఉన్నాయి. మానవుల హక్కులపై మూల భూతములైన హక్కులపై మనహక్కులపై మనం ఉంచుతుండే ఊనిక మనలను అత్యంత స్వార్థపరులనుగా చేస్తుంది. ద్వేషాసూయలు కలహకల్లోలాలు అన్ని వాటి ఫ జీవునిలో ఉన్న దేవునికి సేవచేయడం అనే యీ 'సేవాసిద్ధాంతం' మనజీవితదృక్పథాన్ని చక్కబరుస్తుంది. దేశనిర్మాణానికి అమోఘ సాధకం అవుతుంది. ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

(ఆకాశవాణి సౌజన్యంతో)

# కార్యక్రమం

కన్యాకుమారి సముద్రతీరంలో 'లెండి మేలుకొండి' వస్తుప్రదర్శనం ఏర్పాటై ఉన్నచోటికి రాష్ట్రపతి 1-9-70 వ తేది సాయంత్రం విచ్చేసి ప్రదర్శనానికి శ్రీకారం చుట్టారు.

## **2-9-1970** నాడు

ప్రభాతమప్పుడు : శ్రీరామకృష్ణసర్వమతాధ్యక్షులు శ్రీశ్రీ వీరేశ్వరానందస్వాములు మండపాలకు సంప్రోక్షణ కావించి పూర్ణాహుతి జరిపారు. మద్రాసు మఠా ులు శ్రీమత్కైలాసానందస్వాములు, త్రివేంద్రం మఠాధ్యక్షులు శ్రీతపస్యానందస్వాములు ఇతరసన్న్యాసులు భక్తులు ఇందు పాల్గొన్నారు.

| | |
|---|---|
| పూర్వాహ్ణం గంటలు : 9-20 | రాష్ట్రప వ. వే. గిరిగారు వివేకానందశిలయొద్దకు విచ్చేశారు. వారికి ముఖ్యమంత్రి కరుణానిధిగారికి పూర్ణకుంభాలతో స్వాగతోపచారం జరిగింది. |
| 9-30 | రాష్ట్రపతిగారు చుట్టు తిలకించి ముఖ్యమండపంలో వివేకానందవిగ్రహానికి ప్రసాదములు సమర్పించి గుత్తిదీపాలు వెలిగించారు. పూరి - ద్వారక - బదరినాథ - రామేశ్వరములనుంచిన్నీ కన్యాకుమారిగుడినుండిన్నీ వచ్చిన ప్రసాదాలను ముఖ్యద్వారానికి అలది మండపాలను ఆవిష్కరించారు. |
| 10-00 | రాష్ట్రపతి ప్రముఖులు తీరానికివచ్చి మరల సభావేదిక నలంకరించారు. |
| 10-05 | పరిషదుపాధ్యక్షులలో ఒకరైన డాక్టరు వే. రాఘవనుగారు ప్రార్థన జరిపారు. |
| 10-10 | రాష్ట్రపతిని శ్రీ డి. ఎన్. సింహాగారు, ముఖ్యమంత్రిని శ్రీ ఏకనాథ రనడేగారు, శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వామిని డాక్టరు వే. రాఘవనుగారు, మంత్రి కె. వి. సుబ్బయ్యగారిని డాక్టరు నటేశంగారు—మాలలతో అలంకరించారు. |
| 10-15 | పరిషదధ్యక్షులగు శ్రీ డి.ఎన్. సింహాగారు స్వాగతోపన్యాసం కావించారు. |
| 10-25 | పరిషత్కార్యదర్శి శ్రీ కె. ఆర్. సుందరరాజుగారు ప్రముఖుల సందేశాలను వినిపించారు. |
| 10-35 | నిర్వాహకకార్యదర్శి శ్రీ ఏకనాథ రనడేగారు నివేదిక చదివారు. |
| 10-45 | స్థపతి శ్రీ ఎస్కే ఆచార్యగారికి శిల్పి శ్రీ ఎన్. ఎల్. సోనావాద్కరుగారికి రాష్ట్రపతిగారు దుశ్శాలువలను 'రథ' 'నటరాజ' ప్రతిమలను బహూకరించి సన్మానించారు. |
| 10-50 | శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వాములు ఆశీర్మంగళం అనుగ్రహించారు. |
| 10-55 | సభాధ్యక్షులైన తమిళనాడు ముఖ్యమంత్రిగారు ఉపన్యసించారు. |
| 11-10 | రాష్ట్రపతిగారు ఆవిష్కరణమంగళోపన్యాసం కావించారు. |
| 11-30 | పరిషదుపాధ్యక్షులలో ఒకరగు డాక్టరు ఎన్. నటేశంగారు సదస్సుకు కృతజ్ఞతావందనోపచారం చేశారు. |
| 11-35 | కార్యక్రమపరిసమాప్తిమంగళంగా జాతీయగీతం గానంచేశారు. |

## పరిషదధ్యక్షులైన శ్రీ డి. ఎన్. సింహగారి ఉపన్యాస సంక్షేపం

ఎనిమిదేండ్లకు ఈ నిర్మాణాలు ముగిశాయి. వీని ఆవిష్కరణోత్సవసందర్భంలో మీ కందఱికీ స్వాగత వందన సమర్పణం, పరిషదధ్యక్షుణ్ణి కాబట్టి నావంతు. ఈ కార్యక్రమం సాగిన వివరాలు ఇప్పుడే కార్యదర్శి శ్రీ ఏకనాథరనడేగారు మీకు వినిపిస్తారు. సకలకార్యభారం నిర్వహించిన ఆయన చెప్పగలంతకంటె నేను ఎక్కువగా చెప్పగలది ఏమీ లేదు.

ఈ శిలకు స్వామిజితో సంబంధం ఏర్పడ్డ సందర్భాన్ని మాత్రం రెండుమాటలలో చెబుతాను. పరమహంస శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరం ఆయన సన్న్యాసశిష్యులందఱు శ్రీ స్వామిజినాయకత్వాన ఒకబృందంగా ఏర్పడ్డారు. స్వామిజి పరివ్రాజకుడుగా హిమాలయం నుంచి కన్యాకుమారివఱకు యావద్భారత దేశమూ సంచరించారు. రామేశ్వరస్వామిని సేవించి తర్వాత స్వామి సముద్రంలో ఈదుకుంటూ పోయి ఈశిల నధిరోహించి, దీనిపై ధ్యానసమాధిలో కూర్చున్నారు. భారతదేశ పతనమునకు కారణం పునరుద్ధరణకు మార్గం అనువాటిని గూర్చిన ప్రబోధం ఆయనకు కలిగింది ఈశిలమీదె. ఆధ్యాత్మికాదర్శం అడుగునబడడమే పతనకారణం. ఆ ఆదర్శాన్ని మళ్ళీ పైకి తేవడమే దేశోద్ధరణకు మార్గం. ఇరవైకోట్ల భారతీయులు నిరక్షరకుక్షులుగను నిఱుపేదలుగను ఉన్నారు. వారి సముద్ధరణను మించిన భగవదారాధన వేఱొకటి లేదు. ఆతలపోతలనుండియే నేడు విశ్వవ్యాప్తమై యున్న శ్రీరామకృష్ణసేవాసంఘం (మిషను) అవతరించింది. త్యాగమున్నూ సేవయూ ఈ సంఘులక్ష్యాలు. సోషలిజము (ప్రజాసామ్యవాదము)నకు మనదేశమున ప్రథమప్రవక్త శ్రీ స్వామిజియే – అనుట ఆయన గ్రంథావళిని సేవించిన వారికి విదితమే. అప్పుడాయన కలిగించిన ఊపే మనకు స్వాతంత్ర్యసిద్ధిని చేకూర్చినది. స్వామిజి ఉద్బోధించిన లక్ష్యాలను మనజ్ఞప్తికి తేస్తూ వాటిని సాధించు అభినివేశమును మనలో వర్ధిల్లజేస్తూ ఈ స్మారక మండపాలు చరితార్థాలు కాగలవు. శ్రీరామకృష్ణభగవానుని శ్రీవివేకానందయతీంద్రునిఅను గ్రహానికి మనం అందఱం భాజనులం కావాలి.

## శ్రీ ఏకనాథరనెడిగారి నివేదిక

మనం కంటూవచ్చిన కలలో ఒకభాగం నిజమైంది. స్వామిజికి స్మారకనిర్మాణాలు ఎన్నో ఉన్నాయి. కేవలం ఆశోవకు మాత్రం చేరేది కాదు ఈ మండపాలనిర్మాణం. బోధి వృక్షం క్రింద బుద్ధునకు జ్ఞానోదయం అయినట్లు ఈ శిలమీద స్వామిజీకి ప్రబోధం కలిగింది. అప్పటివఱకు సాధారణపరివ్రాజకుడుగ ఉన్న స్వామిజీ అప్పటినుండి గొప్పసంస్కర్తగా నిర్మాతగా లోకగురువుగా వికసించాడు. ఆ స్మృతిని కొనియాడటానికి ఈ నిర్మాణాలు. లక్షలు వ్యయమైంది అనుకోండి. ఎక్కడికి పోయిందిఆ డబ్బంతా? మన కార్మికులకే, మన శిల్పులకే, మన కళాకారులకే. ఎక్కడినుంచి వచ్చింది ఆ డబ్బంతా? కుబేరులవద్దనుండి కాదు. రైతులు కార్మికులు విద్యార్థులు జవానులు అలాంటివారివద్దనుండియే ఈ ధనంలో విశేషభాగం వసూలైంది. ఈ డబ్బునంతా పోగు చేసినవారు అళసింగపెరుమాళ్ళవంటి సేవాసక్తులే కాని గొప్పఅధికారపదవులలో ఉండేవారు కారు. వివిధరాష్ట్రప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వం, సంఘంలో అన్ని అంతస్తులవారు ఈ మహాకార్యానికి ధనవిరాళా లిచ్చారు ఒక కోటిరూపాయలకంటె ఎక్కువే ప్రోగైనాయి. ఈనాటికైన ఖర్చులుమొత్తం 91 లక్షలు. ఈ నిర్మాణాలను ఇంత అందంగా రూపొందించిన స్థపతి శ్రీ ఎస్కే-ఆచారియు శిల్పి ప్రొఫెస్సరు సోనావద్కరున్నూ అభినందనార్హులు. ఇక కాసేపట్లో మనరాష్ట్రపతిగారు వారిని సన్మానించబోతున్నారు. కలలో ఒక భాగం నిజమైంది అన్నాను మొదట్లో. శేషించినభాగం రామకృష్ణసేవాసంఘంవంటి యావద్దేశవ్యాప్తమగు సేవాసంఘాన్ని సన్న్యాసులు కానట్టివారితో ఏర్పఱచి అందుకు శిక్షా

కేంద్రాన్ని కన్యాకుమారిలో నెలకొల్పడం. ఇందుకు కనీసం రెండుకోట్ల రూపాయలు కావాలి. ప్రతిభావంతులగు ఉత్సాహశీలురు కావాలి. ధనమును వ్యక్తులనుకూడ సంపాదించ వచ్చు అని నా నమ్మకం. ఈనాడు ఈ ఉత్సవంలో పాల్గొని మనల్ని ఆశీర్వదించటానికి పండిత జవహర్లాలు నెహ్రూ, లాల్బహదూరుశాస్త్రి, సి. ఎన్. అణ్ణాదురై, మన్నాథు పద్మనాభం, వి. రాజగోపాలాచార్యులు లేరు కదా అంటు ఆ ఒక్క దుఃఖం మనస్సులో బాధిస్తూంది.

## శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వాముల ఆశీర్మంగళవాక్కు

రాష్ట్రపతీ, ముఖ్యమంత్రిమహాశయా, పరిషత్సభ్యులారా, మిత్రులారా,

మన శ్రేయస్సును లోకశ్రేయస్సును కోరి లోకమాత శ్రీ వివేకానందస్వామిని మనకు ప్రసాదించింది. ఆ ప్రఖ్యాతోదాత్తమహాపురుషుని స్మృతిని కొనియాట్టానికై లోకమాత కన్యాకుమారిచరణసన్నిధిలో మ న స్సు లో హత్తుకు పొయ్యే గంభీరసన్నివేశాలతో ఏర్పాటైన ఈ ఉత్సవంలో పాల్గొన గలుగడం భాగ్యవిశేషంగా భావిస్తున్నాను ఇక్కడ సమావేశమై యున్న మన అందటిమీద సుదూరప్రాంతాలనుండి యిచటి విశేషాలను పరికిస్తున్న శ్రద్ధాళువులమీద, ఈ ఉత్సవ నిర్వాహకులమీద లోకజనని పరమానుగ్రహం ప్రసరించును గాక.

ఈ శిలపై ధ్యానసమాధిలో కూర్చున్న శ్రీ వివేకానందస్వాముల మనస్సులో నిండిన అమూల్యాశయాలను కొన్నింటిని ఇప్పుడు ప్రస్తావించడం అప్రసక్తం కా దనుకుంటాను. స్వామిజి ఇక్కడికి వచ్చారు. గుడిలో అమ్మవారిని సేవించారు. ఎడసి ఉన్న ఆ శిలమీద ఏకాంతంగా ధ్యానంలో కూర్చుందా మనే తీవ్రవాంఛ ఆయనకు కలిగింది. సముద్రంలో ఈదుకుంటూ పోయి ఆ శిలమీదికి చేరారు. ఈభరతమాతృపుత్రవరేణ్యుని స్మారకమందిరం ప్రస్తుతం అక్కడ ఉంది. ఆ శిలమీద కూర్చుండి గాఢధ్యాననిమగ్ను డయ్యాడు. దేశమంతా పర్యటించి ప్రజలను వారిజీవితాలనుగూర్చి తాను సేకరించుకొన్న విషయాలను, శతాబ్దాల దేశచరిత్రను భారతీయుల లక్ష్యాలను సిద్ధులను సమీక్షించాడు. ఆధ్యాత్మికపరతయే భారతీయులకు ప్రాణ మని, ఆత్మ యని, కాబట్టి దేశభావిసమష్టి పునరుద్ధరణం కూడా ఆ ధ్యా త్మి ప ర త గుండానే సాగాలి అని, గుర్తించారు. జాతి-భాషాచారవిభేదాలు ఎన్నో ఉన్నా, వైజ్ఞాని కాధ్యాత్మిక దృక్పథంలో ఉన్న ఐక్యభావం ఆయన గుర్తించారు. దేశమున కదే ఐక్యబంధం.

ఆ ధ్యా త్మి క ల క్ష్య ప్రా ము ఖ్యమునున్నూ దేశంమీద దానిప్రభావమునున్నూ స్వామిజీ గుర్తించారు. కాని భారతప్రజల పేదఱికాన్ని నిరక్షరాస్యతను దుఃస్థితిని ఆయన విస్మరింపజాలకపొయ్యాడు. కుట్రకోరులు తమ మతం పేరుపెట్టి శతాబ్దాలకొలది ప్రజలను అణచిట్టారు. ఉన్నతవర్గాలవారు నిమ్నవర్గాలవారిని ఉపేక్షించారు, హిందువులలో అత్యధికసంఖ్యాకులకు హిందువులుగా ఉండడం లాభదాయకం కానీకుండా చేశారు. ఇందుకు ఫలితం దేశపతనమే. సామాన్యప్రజల లౌకికపరిస్థితులను సరిపఱచాలి, వారికి విద్య కఱపాలి, అప్పుడే దేశానికి పునరున్నతి గలుగుతుం దని ఆయన గ్రహించారు.

భారతదేశపతనానికి మఱొక కారణం ఇది. భారతదేశం తక్కిన ప్రపంచంతో కలియ నంటూ, తనవద్ద ఉన్న జీవనప్రదములగు సత్యాలలో ఇతరదేశాలవారిని పాల్గొననీయ నంటూ, తన్ను కేటాయించుకుంది. ఇతరదేశా

లతో కలిసి మెలిసి తన ఆధ్యాత్మికవిజ్ఞాన ధనాన్ని వారికిన్నీ పంచియిస్తుండిన ప్రాచీన కాలంలో భారతదేశం ఉన్నతస్థానం అధిష్ఠించి ఉణ్ణింది. కాని సంకుచితదృక్పథం అవలంబింప ఆరంభించిననాడే దేశపతనం ప్రారంభమైంది. వేదాంతమును బాగా వెదజల్లితే భారతదేశ మునకు అన్యదేశాలకు కూడా ఇంతంతనరా నంత లాభాలు చేకూరుతాయి.

భవిష్యన్నాగరకతను ఆయన మనసులో భావించాడు. దాన్ని ఆయన సమగ్రనాగర కత అని పేర్కొన్నాడు. అందులో భారతీయుల ఆధ్యాత్మికాదర్శము పాశ్చాత్యులభౌతికాది శాస్త్రపారిశ్రామికవిజ్ఞానము ఇమడాలి. అలాంటి నాగరకతకై లోకం నిరీక్షిస్తుంది. ఈ ఉద్దేశ్యంతోనే స్వామిజీ పాశ్చాత్యదేశాలకు పోవ సంకల్పించారు.

ఈ శిలమీద కూర్చుండి ధ్యానిస్తున్న స్వామిజి మనస్సులో ఊటీనతలంపు లివి: ధ్యానంనుంచి లేవగానే తన జీవితకార్యం ఆయనదృష్టికి తేటతెల్లంగా గోచరించింది, అదే భారతదేశసముద్ధరణానికి ఆయన సందేశం. విశ్వమానవసంఘపునర్నిర్మాణానికి పాశ్చాత్యదేశాలకు అదే ఆయన సందేశం.

కాబట్టి మనదేశంలో ఈ శిలకు చారిత్రక ప్రాముఖ్యం ఉంది. ఆభారతమాతృపుత్రరత్న మునకు ఈ శిలపై స్మారకమండపాలు నిర్మిత ములు కావడం ఎంతయూ సముచితం.

శ్రీ ఏకానాథరనడేగారికి ఈ ఘనకార్యంలో ఆయనకు సహకరించిన సహాయులకు మిత్రులకు దేశమంతా ఋణపడి ఉన్నది. లోకజనని వారి నందఱిని అనుగ్రహించునుగాక. ఆమె కృపచే శ్రీ వివేకానందస్వామి లోకాని కిచ్చి పోయిన భవ్యసందేశం ఈ కేంద్రంనుంచి విశ్వ మంతటికి ప్రసారిత మగును గాక. ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

## సభాధ్యక్షులగు శ్రీ ము. కరుణానిధిగారి ప్రసంగసంక్షేపం

తొల్కాప్పియం అనే అతిప్రాచీన తమిళ వ్యాకరణగ్రంథంలో 'తెంకుమరి' అని ప్రస్తుత మైన యీ కన్యాకుమారి చాల ప్రాచీన క్షేత్రం. మూడు సముద్రాలనడిమి యీ గంభీరశిలపై ప్రబోధం గాంచి శ్రీ వివేకానంద స్వామి లోకానికి జ్ఞానజ్యోతిఃప్రదమైన సందేశం అందజేశారు. షికాగో విశ్వమతమహాసద స్సులో స్వామిజి కావించిన ప్రసంగంతో మానవచరిత్రలో నూతనశకం ప్రారంభమైంది. ఆ ఘనవిజయానికి స్వామిజిని అభిముఖుణ్ణిగా చేయడంలో విశేషభాగం నిర్వహించిన భాగ్యం తమిళదేశానికి కన్యాకుమారికి దక్కింది. వివేకానందనామం సార్థకం. ఆయన ఉపదేశాలున్నూ విశాలదృక్పథములున్నూ సన్నిహితులందఱిలో ఉదాత్తత కలిగించాయి. 1893 సెప్టెంబరు నెలలో విశ్వమతమహాపరి షత్తులో 30 సంవత్సరాల యీ యువమహా పురుషుని వ్యక్తిమహిమ సదస్యులను ముగ్ధుల నొనర్చింది. పోయిన ప్రతిచోటా అగ్రస్థానం ఈయనదే. స్వామిజి ఇప్పుడు లేకున్నా ఆయన వెలిగించిన జ్ఞానప్రదీపం కాంతులు వెదజల్లు తుంది. భారతీయులకు తమయందును తమ ఐక్యమందున్నూ విశ్వాసం గల్గించిన ఆయన గొప్పసందేశం మానవతతికి నిర్వృతిదాయకం. ఈ స్మారకమండపాలు మన పొలిమేరలకూ సంస్కృతి సముదాచారాలకు రక్షకాలు. ఈ నిర్మాణాలలో దేవకోట శ్రీ ఎస్కే ఆచారిగారి పనితనాన్ని చూచి ఆనందిస్తున్నాను. స్వామిజి అమెరికాకు వెళ్లేటప్పుడు సేతుపతినాయ కత్వాన ఆయన కాజ్ఞానిర్వర్తకులుగ ఉండినా రనడం తమిళదేశీయులకు గర్వకారణం. ఈనాడు స్వామిజికి తమప్రణతులు చెల్లించు కునేందుకు నాగరకప్రపంచమంతా ఈ దక్షి

ణపుకొనలో సమావేశమైనట్లు కనిపిస్తున్నది. పతితజనసముద్ధరణం స్వామిజి సందేశసారం మనమహావిజ్ఞాని అణ్ణాదురైగారి గ్రంథాల సారము సందేశసారము అదే. దానిని నిర్వ రించడమే తమిళనాడు ప్రభుత్వలక్ష్యమై ఉంటున్నది. స్వామిజి దృష్టి విశ్వవిశాలం. తదనుగుణంగా వర్ణశాఖాది విభేదాలను రద్దు చేసి సర్వులకూ సమానత్వం ఉండే ఐక్యభారత మును రూపొందించాలని, అది స్వామిజికి ఘన సన్మానమాతుందని, మనవిచేస్తున్నాను. భారతదేశ వివిధప్రాంతాలనుండి ఇక్కడ చేరబాటిన సోదరసోదరీమణుల కందటికీ నా అభినందనాలు. తమిళనాడు గొప్పకూడలి దేశం. కన్యాకుమారిలో క్రొత్తతరం ప్రజలను చూచి గర్విస్తున్నాను. స్వామిజి మానవతతికి ఉమ్మడిసొమ్ము. ఈ స్మారక భవనరాజియూ విశ్వమంతటికీ అభిగమ్యం. మన సంస్కృతికి మూర్తిభావ మనదగిన భారతరాష్ట్రపతి ఈ నిర్మాణాలను ఆవిష్కరించడం మిక్కిలి సముచితం.

''లెండి, మేలుకొండి, సాధించందే ఆగకండి'' అనే ఆదేశాన్ని మనం నెగ్గించాలి. ప్రణతి.

## రాష్ట్రపతి శ్రీ వ. వే. గిరిగారి ఉపన్యాస సంగ్రహం

నేటి ఉత్సవంలో పాల్గొనే అవకాశం నాకు కలిగించినందుకు 'వివేకానంద శిల – స్మారక నిర్మాణాల పరిషత్సభ్యుల'కు నా కృతజ్ఞతాభి వందనాలు. స్వామిజికి ప్రబోధం కలిగించి పాశ్చాత్యఖండవిజయానికి దారిచేసిన చోట ఈమండపాల నిర్మితి చరితార్థం.

ఈనిర్మాణాలు ఈఉత్సవాలు ప్రశంసార్హాలే కాని, స్వామిజీబోధనలను యథాశక్తి మన ఆచరణలో ఉంచుకోవడం అంతకంటె ముఖ్యం. దేశాభివృద్ధికి నాయకుల కృషి చాలదు. ప్రజ లలో ప్రతిఒక్కరు పాటుపడాలి. స్వామిజి కేవలం మతానికో సంస్కృతికో మాత్రం ఉద్ధారకుడు కాడు. ప్రజల దృక్పథంలో ప్రవ ణతలలో మంచికి మార్పు తీసుకువచ్చారు. శ్రీ శంకరాచార్యులకు తర్వాత అంతటి సర్వతో ముఖప్రతిభానిధి ఈయనే. ఆధ్యాత్మికపరతను ఈయన సామాన్యమానవులకు సుగమం చేశారు. మతబోధకంటె ముందు ప్రజలను నిరక్షరాస్యతనుండి నిప్పచ్చరంనుండి ఉద్ధరిం చడం ముఖ్యమని, కడుపులు కాలుతున్నవారికి మతబోధ చేయబూనడం అపచార మని, స్వామిజి చెప్పిన మాట నాకు మిక్కిలి నచ్చింది. నేడు మన ఆధ్యాత్మికపరత దరిద్రనారాయణ సంతర్పణరూపం దాల్చాలి. తోడిమానవుల నేమో సోదరులనుగా భావించక వేదికమీద నుండి 'అందఱం దేవునిబిడ్డలం, అందఱం దేవుని బిడ్డలం' అని ఘోషించడం నిరర్థకం. తన లక్ష్యాన్ని విస్మరించకుండా నిస్స్వార్థబుద్ధితో ఏపనిచేసినా అది ఉపాసనే. సేవాపరత కలిగితే స్వార్థపరత తొలగుతుంది. స్వామిజీ అభి ప్రాయంలో బుద్ధదేవుడు ఆదర్శకర్మయోగి. అన్నిమతాలసారం ఒక్కటే. ప్రతివ్యక్తీ సచ్ఛీలవంతుడైతే దేశం సచ్ఛీలశోభిత మాతుంది. ప్రజలలో హెచ్చుతగ్గులు అనాది కాలంగా ఉన్నా, ధనికదరిద్ర విభేదం ఇటీవల మఱీ తీవ్రరూపం దాల్చింది. ఇట్టి విభేదాలు మాసి సర్వసమానత్వం సంఘంలో కుదరాలంటే ప్రజల హృదయాలలో దృక్పథంలో పరిణామం రావాలి. శ్రీరామకృష్ణ (మిషను) సేవాసంఘం, స్వామిజీ లోకాని కొసగిన మహాప్రసాదము. ప్రజాసేవానిరతి ఈ సంఘసభ్యుల విశిష్టత. సంకు చితభావాలను దులుపుకొని సమస్తవసుధను స్వకుటుంబంగా భావించాలనే స్వామిజీబోధను మన హృదయాలలో ప్రతిష్ఠించుకొందాం. అసలు నిమ్నవర్గాలనుండియే నూతనభారత దేశం రూపుదాల్చాలి.

# చోటు-మండపాల-వర్ణన

మూడు సముద్రాలు కలిసేచోట కన్యాకుమారికి దిగువ రెండుఫర్లాంగుల దూరంలో రెండుపెద్దగుట్ట ఉన్నాయి. 1892-వ సంవత్సరం డిసంబరులో ఇచ్చట శ్రీపాదశిలమీదనే స్వామిజికి ప్రబోధం కలిగింది. వివేకానందశతవార్షికోత్సవనిర్వాహకపరిషత్తువారు ఒక పెద్ద మండపం కట్టించి అందులో శ్రీవివేకానందస్వాముల పెద్దవిగ్రహాన్ని (పరివ్రాజక వేషంలో) నెలకొల్పారు, శ్రీపాదమండపం కట్టించి అందు దేవిశ్రీపాదాలను ప్రతిష్ఠించారు. ఈ నిర్మాణాలకు పట్టిన కాలం ఆరేండ్లు, ధనం తొంభైలక్షలు.

బేలూరు రామకృష్ణమఠం నమూనాలో మండపం నిర్మితమైంది. దాని ముందువైపు అజంతా వాస్తుశిల్పాన్ని తలంపునకు తెస్తుంది. మండపగోపురాలు పల్లవుల వాస్తుశిల్పాన్ని స్మరింపజేస్తాయి. వివేకానందవిగ్రహానికి నలువైపులనున్న పెద్దస్తంభాలు చోళశిల్ప విధానంలో చెక్కబడ్డాయి, ధ్యానమండపంలో పూజామండపంలో సింహావిగ్రహాలలో పల్లవుల శైలిని, శ్రీపదమండపంలో చోళులశైలిని గుర్తించవచ్చు. ఇక్కడ పనివాండ్రందఱు మహాబలిపుర ప్రభుత్వశిల్పకళాశాలలో తర్ఫీదైనవారు. కట్టడంలో వినియుక్తములైన రాళ్లు 73000 ఘన అడుగులు. ఇవి చాలవఱకు తమిళదేశ వివిధప్రాంతాలనుండి సేకరింపబడ్డాయి. ఆరేండ్లకాలం ఇక్కడ పనిచేసిన పనివాండ్ర సరాసరి దినసంఖ్య 650 మంది. కట్టడాల వెలుపలిభాగాలు కడలిగాలికి ఖిలంకాకుండేందుకు వాటికి 'సిలికను' పూత పూసి ఉన్నారు. రాగిరేకులమీద స్వామిజి జీవితాన్ని చెక్కించి ధ్యానమండపంలో అమర్చబోతారు.

---

# గ్రంథపరిచయం

## సర్వతత్త్వార్థ దర్శని

(వేదాంత వచనగ్రంథము)

గ్రంథకర్తయూ ప్రాప్తిస్థానమును తిమ్మనేని మహేంద్రనాగప్ప, శ్రీరాధాకృష్ణ టింబరు డిపో, తిమ్మంచర్ల పోస్టు, గుంతకల్లు. పుటలు, 130. వెల రూ. **2-50.**

ఈగ్రంథనామం సార్థకం. ఇందు రచయిత సృష్టిక్రమం ఆత్మవిచారం మొదలైన శీర్షికల ఉపనిషత్కథలను చేర్చి అరటిపండొలిచి అఱచేత పెట్టినట్లు సులభశైలిలో వివరించి ఉన్నారు. గాయత్రిమంత్రం, భజగోవింద శ్లోకాలు, శివవిష్ణునవగ్రహాదిదైవస్తుతిశ్లోకాలు ఆంధ్రతాత్పర్యంతో పొందుపఱచారు. వ్యయప్రయాస లేవియు లేకుండగనే చిన్న చిన్న వ్యాధులను ఎవరికివారే నయంచేసుకునేందుకు పద్ధతులు, సంతానప్రా[illegible]జ్వర భూతబాలగ్రహాదిచికిత్సలకు యంత్రమంత్రములు, గృహదోషములను తొలగించుకొను మార్గములు శుభాశుభ శకునజన్మనక్షత్రరాశి ఫలాది జ్యోతిశ్శాస్త్రాంశాలు- ఇలాంటి విషయాలనేకము లిందున్నవి. వేయేల ధర్మార్థకామ మోక్షముల సాధించు ప్రయత్నమున ప్రతి మానవునకు ఇది తోడ్పడగలదు.

## సంకీర్తనము

రచయిత : శ్రీ టి. నాగేంద్రగుప్తగారు, ప్రాప్తిస్థానం : ఉమామహేశ్వర ఆయుర్వేద ఏజన్సీస్ సాదక్ రోడ్డు, మచిలీపట్నం, పుటలు 84. భక్తియే మూల్యము.

నామమహిమను సంకీర్తన ప్రభావమును గూర్చి తదనుభవరసికప్రముఖుల వాక్కుల నుదాహరిస్తూ రచయిత వ్రాసిన తెలుగువచన గ్రంథం ఇది. నామసంకీర్తనప్రవణత లేనివారికీ పుస్తకం చదివితే కలుగుతుంది, ఉన్నవారికి పెరుగుతుంది.

ప్రభాకర్

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక.

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు; ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక.

సాలు చందా : ఇండియాలో ర్నూ 5 లు, సింహళము ర్నూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక.

సాలు చందా : ఇండియాలో ర్నూ 5 లు, సింహళము ర్నూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే నెల రెండవ వారాంత్యానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్ని తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

---

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

---

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౦ - అక్టోబరు : సాధారణ - ఆశ్వయుజము సంచిక ౪

## విషయసూచిక

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక.

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు ;
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక.

సాలు చందా : ఇండియాలో రూ. 5 లు, సింహళము రూ. 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక.

సాలు చందా : ఇండియాలో రూ. 5 లు, సింహళము రూ. 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే నెల రెండవ వారాంత్యానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్ని తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

## అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు : తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సన్డే స్టాన్డర్డు : తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల : రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

## అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల : 2-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

‘అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనిక్రృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౦ - అక్టోబరు సాధారణ - ఆశ్వయుజము { సంచిక ౮

శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

శ్రోత్రియో ఽవృజినో ఽకామహతో యో బ్రహ్మవిత్తమః
బ్రహ్మణ్యుపరత శ్శాన్తో నిరిన్ధన ఇవానలః
అహేతుకదయాసిన్ధు ర్బన్ధు రానమతాం సతామ్. 33

వేదవేదాంతముల నధికరించినవాడుగను, పాపరహితుడుగను, విషయవాంఛలచే కొలుకుడువడనివాడుగను, బ్రహ్మజ్ఞానులలో ఉత్తముడుగను, బ్రహ్మమందే మనస్సును విలీన మొనర్చుకొన్నవాడుగను, కట్టెలు సమసిన నిప్పువలె ప్రశాంతుడుగను, సహజకరుణాసాగరుడు గను, శరణాగతులకు బంధువుగను (ఉండు గురువు నాశ్రయింపవలయును.) 33

త మారాధ్య గురుం భక్త్యా ప్రహ్వః ప్రశ్రయసేవనైః
ప్రసన్నం త మనుప్రాప్య పృచ్ఛేజ్ జ్ఞాతవ్య మాత్మనః. 34

అటువంటిగురువును శిష్యుడు భక్తినమ్రతలతో ఆరాధింపవలయును. తన సవినయ పరిచర్యల కతడు ప్రసన్నుడైయుండు అదను కనిపట్టి, సమీపించి, తాను తెలిసికోవలసినదానిని గూర్చి ప్రశ్నింపవలయును. 34

స్వామిన్, నమ స్తే, నతలోకబన్ధో, కారుణ్యసిన్ధో, పతితం భవాబ్ధౌ
మా ముద్ధ రాత్మీయకటాక్షదృష్ట్యా ఋజ్వ్యాతికారుణ్యసుధాభివృష్ట్యా. 35

స్వామీ, ప్రణమిల్లిన ప్రజలపాలిటిబంధూ, కరుణాసాగరా, నీకు మ్రొక్కుచున్నాను, తిన్నని నీకడకంటిచూపుల పరమకారుణ్యామృతమును వర్షింపుమా; సంసారసాగరమున బడి యున్న నన్ను గట్టెక్కింపుమా. 35

దుర్వారసంసారదవాగ్నితప్తం దోధూయమానం దురదృష్టవాతైః
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః, శ్శరణ్య మన్యం య దహం న జానే. 36

ఆర్పరాని సంసారదావాగ్ని నన్ను కాల్చివేయుచున్నది. దురదృష్టవాతములు నన్ను ఊపివైచుచున్నవి. భయ మగుచున్నది. వేఱు దిక్కెఱుగను. నిన్ను శరణు జొచ్చుచున్నాను మృత్యువుబారినుండి నన్ను కాపాడుమా. 36

శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసన్తవ ల్లోకహితం చరన్తః
తీర్ణా స్స్వయం భీమభవార్ణవం జనా నహేతు నాన్యా నపి తారయన్తః. 37

(భవాదృశులు) సజ్జనులు శాంతులు మహాత్ములు, లోకహితంకరస్వభావమున వసంతమును బోలినవారు భయంకర సంసారసాగరమును స్వయము దాటినవారు, నిర్హేతుకకృపచే నితరులనుగూడ దాటించువారు. 37

అయం స్వభావ స్స్వత ఏవ య త్పరశ్రమాపనోదప్రవణం మహాత్మనామ్
సుధాంశు రేష స్వయ మర్కకర్కశప్రభాభితప్తా మవతి క్షితిం కిల. 38

తమంతట పరులకష్టముల తొలగింప దివురుట మహాత్ములస్వభావమే. సూర్యుని చుఱుకుటెండకు క్రాగిన భూమిని రక్షించుపనిని అమృతకిరణుడు తనంతటనే కదా నిర్వ రించును. 38

బ్రహ్మానన్దరసానుభూతికలితైః పూతైః స్సుశీతైః స్సితై
ర్యుష్మద్వాక్కలశోజ్ఝితైః శ్రుతిసుఖై ర్వాక్యామృతైః స్సేచయ
సన్తప్తం భవతాపదావదహనజ్వాలాభి రేనం ప్రభో
ధన్యా స్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతా స్స్వీకృతాః. 39

స్వామీ, సంసారతాప మనెడి కాఱుచిచ్చు (సెగ)కు ఉడుకెక్కియున్న యీ నన్ను-బ్రహ్మానందరసానుభవముతోకూడినవియు, పవిత్రములును, సుశీతలములును స్వచ్ఛములును శ్రవణానందకరములును వాక్కలశమునుండి వెలువడినవియు నగు—నీవాక్యామృతములచే తడుపుమా (తాపముదీర్పుమా). క్షణకాలమైనను నీకడకంటిచూపులకు భాజనులై నీచే స్వీయ జనులుగ సమాదృతులగువారు ధన్యులు కదా. 39

కథం తరేయం భవసిన్ధు మేతం కా వా గతి ర్మే కతమో ఽస్త్యుపాయః
జానే న కిఞ్చిత్ కృప యావ మాం ప్రభో సంసారదుఃఖక్షతి మాతనుష్వ. 40

గురుదేవా, ఈసంసారసాగరము నెట్లు తరింతును? నా కేది గతి? ఉపాయ మేమున్నది? నే నేమియు నెఱుగను. దయతో కాపాడుము, ఈసంసారదుఃఖమును తుద ముట్టింపుమా. 40

తథా వదన్తం శరణాగతం స్వం సంసారదావానలతాపతప్తమ్
నిరీక్ష్య కారుణ్యరసార్ద్రదృష్ట్యా దద్యా దభీతిం సహసా మహాత్మా. 41

దావానలముచేతంబోలె సంసారతాపత్రయముచేత క్రాగి పైన చెప్పినరీతిలో ప్రార్థించుచు తన్ను శరణుజొచ్చినవానిని మహాత్ముడగు గురువు కనికర మొలుకు చల్లని చూపుల జూచి వెంటనే అతని కభయ మొసంగ వలయును. 41

విద్వాన్ స తస్మా ఉపసత్తిమీయుషే ముముక్షవే సాధుయథోక్తకారిణే
ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ తత్త్వోపదేశం కృప యైవ కుర్యాత్. 42

ఆలాగు తన్ను ఆశ్రయించినవాడును ముముక్షువును శాస్త్ర విధేయుడును శమయుతుడును ప్రశాంతచిత్తుడు నగు శిష్యునకు విద్వాంసుడగు గురువు కేవలము కృపాకార్యముగా తత్త్వోపదేశము చేయవలయును. 42

మా భైష్ట విద్వం స్తవ నా స్త్యపాయ స్సంసారసిన్ధో స్తరణే ఽస్త్యుపాయః
యేనైవ యాతా యతయో ఽస్యపారం త మేవ మార్గం తవ నిర్దిశామి. 43

ఓవిద్వాంసుడా, భయపడకు, నీ కపాయము లేదు. సంసారసముద్రమును దాటుటకుపాయ మున్నది. ఆమార్గము నవలంబించియే యతులు దానిని దాటిరి. ఆమార్గమునే నీకు చూపెదను. 43

అ స్త్యుపాయో మహాన్ కశ్చి త్సంసారభయనాశనః
తేన తీర్త్వా భవామ్భోధిం పరమానన్ద మాప్స్యసి. 44

సంసారభయమును బోగొట్టు నుపాయము దొడ్డది ఒకటి యున్నది. ఆమార్గమునుబట్టి సంసారసాగరమును దాటి పరమానందమును ప్రాపింపగలవు. 44

వేదాన్తార్థవిచారేణ జాయతే జ్ఞానముత్తమమ్
తే నాత్యన్తికసంసారదుఃఖనాశో భవత్యను. 45

ఉపనిషత్తుల యర్థవిచారము చేసినచో (నేను బ్రహ్మమనే అనెడి) ఉత్తమజ్ఞానము గలుగును. ఆ జ్ఞానము గలిగినవెంటనే సంసారదుఃఖము నిశ్శేషముగను పునరావృత్తిరహితముగను తొలగిపోవును. 45

శ్రద్ధాభక్తిధ్యానయోగా న్ముముక్షో ర్ముక్తే ర్హేతూ న్వక్తి సాక్షా చ్ఛ్రుతే ర్గీః
యో వా ఏతే ష్వేవ తిష్ఠ త్యముష్య మోక్షో ఽవిద్యాకల్పితా ద్దేహబన్ధాత్. 46

ముముక్షువునకు శ్రద్ధయు భక్తియు ధ్యానమును యోగమును ముక్తిహేతువు లని సాక్షాద్వేదవాక్యములు పల్కుచున్నవి. ఈ శ్రద్ధాదులందు నిలుకడ గన్న వాడు అవిద్యాకల్పితమగు దేహబంధమునుండి విడు పొందును. 46

అజ్ఞానయోగా త్పరమాత్మన స్తవ హ్యనాత్మబన్ధ, స్తత ఏవ సంసృతిః,
తయో ర్వివేకోదితబోధవహ్ని రజ్ఞానకార్యం ప్రదహే త్సమూలమ్. 47

పరమాత్మవగు నీకు జననమరణపరంపర గల్గుటకు కారణము అనాత్మబంధము (=దేహాదిబంధము). అనాత్మబంధమునకు కారణము అజ్ఞానయోగము. ఆత్మానాత్మవివేకముచే గలుగు ఆత్మజ్ఞాన మనెడి నిప్పు అజ్ఞానసంభవములైన వాని నెల్ల మూలముతో సహా కాల్చి వేయును. 47

శిష్యఉవాచ :—

కృపయా శ్రూయతాం స్వామిన్, ప్రశ్నో ఒయం క్రియతే మయా
యదుత్తర మహం శ్రుత్వా కృతార్థ స్స్యాం భవన్ముఖాత్. 48

శిష్యుడు పలుకుచున్నాడు :—

స్వామీ, ప్రశ్న అడుగుచున్నాను. దయచేసి వినుము. నీనోట (వెలువడు) జవాబును విని కృతార్థుడ నగుదును. 48

(సశేషము)

# పరమహంసదేవుని ప్రబోధవాణి

'మ'—భగవంతునిమీద మనమనస్సు నేకాగ్ర మొనర్చు టెట్లు?

శ్రీరామకృష్ణుడు-భగవంతుని నామమును జపింపుము. భగవంతుని గుణములను కీర్తింపుము. అప్పుడప్పుడు భగవద్భక్తులను సాధువులను దర్శనము చేసికొనుచుండుము. రాత్రింబవళ్లు ఐహికవ్యవహారములందును ప్రాపంచిక కర్తవ్యములందును బాధ్యతలందును నిమగ్నమై యుండు మనమనస్సునకు భగవంతునిపై గుఱి నిలువదు. కావున అప్పుడప్పుడు ఏకాంతమునకు పోయి భగవంతుని ధ్యానించుట మిక్కిలి యావశ్యకము. ధ్యానము నేకాంతమున నభ్యసింపవలయును. కానిచో ప్రారంభదశలో దేవునిమీద మనస్సును నిలుపుట చాల కష్టము. చెట్టు చిన్నదిగ నున్నప్పుడు దానికి చుట్టును కంచె యుండ వలయును. లేకున్న పశువులు దాని నాశనముచేయును. ధ్యానించుపద్ధతులు మూడున్నవి. నీ విహితకార్యములను చేయుచున్నప్పుడే దైవమును స్మరించుచుండుట ఒకపద్ధతి. మీయింటిలోనే యేకాంతస్థలమున నుండి భగవంతుని ధ్యానించుట రెండవపద్ధతి. అడవికి బోయి అచట భగవంతుని ధ్యానించుట మూడవపద్ధతి. నీవు తథ్యమిథ్యావివేచనమును మాత్రము సదా చేయుచుండవలసినదే. పరమాత్మ ఒక్కటే సత్యము, నిత్యపదార్థము. తక్కినదంతయు మిథ్య, అనిత్యము. ఇట్లు వివేచించుచు వచ్చి, మనస్సునుండి యనిత్యవస్తువులను గూర్చిన తలంపులను దులిపివేసికొనవలయును.

'మ'—ఈ లోకమున మనము జీవితము నెట్లు గడపవలయును?

శ్రీరామకృష్ణుడు — నీకు విహితములైన కృత్యములనన్నిటిని నిర్వర్తింపుము. మనస్సును మాత్రము దేవునిపై నుండనిమ్ము. భార్యతో

బిడ్డలతో తండ్రితో తల్లితో అందఱితోను గలిసి వసింపుము. వారికి సేవ చేయుము. అత్యంతము ప్రీతిపాత్రులనుగ వారిని జూడుము. కాని నీ యంతరంగమునమాత్రము వారు నీకు సొంతము కా రని తెలిసికొనుము.

ఒక భాగ్యవంతునింటి పరిచారిక ఆయింటి పనుల నన్నిటిని చేయును. కాని సొంత గ్రామములోని స్వగృహముపైని తలంపులను వీడదు. ఆ భాగ్యవంతుని బిడ్డల నామె తన బిడ్డలను బోలెనే సాకును. వారినిగూర్చి చెప్పు నప్పుడు 'నా రాముడు' 'నా హరి' యనియే చెప్పుచుండును. కాని యంతరంగమున మాత్రము వారు తనబిడ్డలు కానే కా రను విషయ మామెకు బాగుగ తెలియును.

తాబేలు నీటిలో అటుఇటు తిరుగుచుండును గాని దాని తలంపులు దేనిమీద నున్నవో నీ వూహింపవచ్చు. గట్టుపై నున్నవి దాని తలంపులు. గట్టుపై నున్నవి దాని యండములు. లోకములో నీవిధుల నన్నిటిని నిర్వర్తింపుము, మనసునుమాత్రము దేవునిపై నిలుపుము.

ముందుగా భగవద్భక్తిని అలవఱుచుకొనక లోకమున ప్రవేశింతువేని నీకు ప్రతిబంధకములు నానాటికి హెచ్చుచుండును. అందలి యిడుములు పరితాపములు ఏడుపులు నిన్ను ముంచివేయును. ఐహికవిషయములను నీవు ధ్యానించుకొలది నీకు వానియందు సంగము ఎక్కువగుచుండును.

మొదట నీ చేతులకు నూనె పట్టించుకొని, అటుపిమ్మట పనసపండును తరుగుము. లేకున్న, దానిపాలజిగట నీ కంటుకొనును. మొదట దివ్యమగు ప్రేమతైలమును గడించుకొనుము, అటుపిమ్మట నీ లౌకికవిధులకు గడంగుము.

కాని ఆదివ్యప్రేమ సిద్ధింపవలయు ననిన ఏకాంతవాస మావశ్యకము. పాలనుండి వెన్నను తీయ వలయు ననిన మొదట ఆ పాలను ప్రత్యేకస్థలమున తోఁగబెట్టవలయును. పాలను ఎక్కువగ కలియబెట్టిన అది పెరుగు కానేఱదు. పెరుగైనపిదప, నీవు తక్కినపనులను విడిచి, ప్రశాంతస్థలమున కూర్చుండి పెరుగును చిలుకవలయును. అప్పటికి గాని, నీకు వెన్న లభింపదు.

అదియునుగాక ఏకాంతమున దేవుని ధ్యానించుటచే చిత్తమునకు జ్ఞానమును వైరాగ్యమును భక్తియు నలవడును. ఆ చిత్తమే లౌకికాసక్తికి లోనైనయెడల అధఃపతనము గాంచును. ఈ లోకములో ప్రవృత్తికిని కామినీకాంచనముల స తప్ప వేఱు లేదు.

లోకము నీటివంటిది, మనస్సు పాలవంటిది. పాలను నీటిలో పోసిన అది అందులో కలిసిపోవును. అటుతర్వాత అప్పటమైన పాలు నీకగపడదు. అట్లు కాక పాలను పెరుగుగా చేసి, ఆ పెరుగును చిలికి వెన్నగా చేయుము. ఆ వెన్నను నీటిపై నుంచిన, అది తేలును. కావున ఆధ్యాత్మికసాధనను ఏకాంతమునచేసి, భక్తిజ్ఞానము లనెడి వెన్నను గడింపుము. ఆ వెన్నను నీవు ఈలోక మనెడి నీటిపై నుంచినను, అది తేలునే గాని, నీటితో కలిసిపోదు.

ఇందుతోఁబాటు నీవు సారాసారవివేచనమును అభ్యసింపవలయును. కామినీకాంచనములు నశ్వరములు. దేవు డొక్కడే నిత్యుడు. ధనమువలన మానవున కేమి కలుగును? అన్నవస్త్రములు లభించును, నిలువ నీడ లభించును. అంతే. అంతకన్న ఎక్కువ ఏమియు లేదు. దేవుని సాక్షాత్కరించుకొనుటకు నీకు ధనము తోడ్పడ జాలదు. కావున జీవితలక్ష్యముగ నుండు నర్హత ధనమున కెప్పుడుకాని లేనే లేదు. వివేచించుక్రమ మిది. తెలిసినదా?

మ—చితము.

# దేవ్యష్టావింశతి నామావళి

## దుర్గాసప్తశతినుండి (గ్రథితము)

| | | | |
|---|---|---|---|
| ఓమ్ దేవ్యైనమః | 1 | ఓమ్ సిద్ధ్యైనమః | 15 |
| ఓమ్ మహాదేవ్యైనమః | 2 | ఓమ్ నైరృత్యైనమః | 16 |
| ఓమ్ శివాయైనమః | 3 | ఓమ్ లక్ష్మ్యైనమః | 17 |
| ఓమ్ ప్రకృత్యైనమః | 4 | ఓమ్ శర్వాణ్యైనమః | 18 |
| ఓమ్ భద్రాయైనమః | 5 | ఓమ్ దుర్గాయైనమః | 19 |
| ఓమ్ రౌద్రాయైనమః | 6 | ఓమ్ దుర్గసారాయైనమః | 20 |
| ఓమ్ నిత్యాయైనమః | 7 | ఓమ్ సారాయైనమః | 21 |
| ఓమ్ గౌర్యైనమః | 8 | ఓమ్ సర్వకారిణ్యైనమః | 22 |
| ఓమ్ ధాత్ర్యైనమః | 9 | ఓమ్ ఖ్యాత్యైనమః | 23 |
| ఓమ్ జ్యోత్స్నాయైనమః | 10 | ఓమ్ కృష్ణాయైనమః | 24 |
| ఓమ్ ఇన్దురూపిణ్యైనమః | 11 | ఓమ్ ధూమ్రాయైనమః | 25 |
| ఓమ్ సుఖాయైనమః | 12 | ఓమ్ అతిసౌమ్యాతిరౌద్రాయైనమః | 26 |
| ఓమ్ కల్యాణ్యైనమః | 13 | ఓమ్ జగత్ప్రతిష్ఠాయైనమః | 27 |
| ఓమ్ వృద్ధ్యైనమః | 14 | ఓమ్ కృత్యైనమః | 28 |

నమస్తే నమస్తే నమః

# మాతృనుతి నవరత్నమాలిక

## శ్రీ తిరుపతి వేంకటకవుల శ్రీ దేవీభాగవతమునుండి

శా. నీ నామమ్ములు లెక్కపెట్టుటకుఁ గానీ, నీదు రూపం బొకిం
తేనిన్ వర్ణనఁజేయఁబూనుటకుఁ గానీ - లేఁ డొకండేని; యెం
దేనిం ద్వచ్చరితంబు దెల్పుటకునై యెవ్వాఁ డగుం దేవి ? కు
ల్యానీరమ్మును దాఁట భీతిపడువాఁ డంభోనిధిం దాఁటునే ? 1

గీ. నీదు విభవంబు దేవతానికరమందు నొక్కఁడేనియు నెఱుఁగమి నిక్క, మంబ,
నీవ సకలంబునకు నియంత్రి వనుపట్ల, నేమ సాక్ష్య మొసంగి జయింపఁగలము. 2

ఆ. ఆస్థ లేని దాన వయ్యును సకలంబుఁ జేయుచుందు వనెడి చిత్రచరిత
మంబ, నీక తెలియ దన్నచో - మాబోఁటి జడమతుల కెఱుంగఁబడుట యెట్లు. 3

గీ. దివ్య మన నోపు నీరూపు తేటతెల్లముగఁ గనుంగొంటి నాపూర్వపుణ్యరేఖ;
భక్తకల్పద్రుమమంబ, నీపాదపద్మయుగమునకు మ్రొక్కెదం, బ్రోవు, మో మదంబ. 4

ఉ. అంబ, సురాసురాదులు ననర్హ్వాలు తావకదివ్యభవ్యతే
జంబు గనుంగొనంగ, మనుజన్ము లనంగ ని కెంతవారు? నా
కుం బొడగట్టి తీ వనుటకుఁ మది విస్మయ మంద కున్నె? నీ
చుం బరమానురాగమునఁ జూచుట చోద్యము గాదె, శాంకరీ? 5

క. శంభుండును విధియును విశ్వంభరుఁడును సూర్యచంద్రవరుణాదులు నా
జంభారియు నినుఁ గనుఁగొను దంభం బెఱుఁగ రన, నాదు తరమే, జననీ? 6

గీ. జలధిజాపతి నీసత్త్వశక్తినెఱుఁగు; శారదాపతి నీరజశ్శక్తినెఱుఁగు;
చండికాపతి నీతమశ్శక్తినెఱుఁగు-గాని, నీనిర్గుణత వారు గాంచువారె? 7

గీ. మూఢుఁడైనట్టి యే నేడ! పూర్ణమైన యీ కటాక్షప్రసార మ దేడ! నీకు
భక్తజనులందుఁ గల్గిన పక్షపాత మింత యని చెప్పఁగలనె, లోకైకజననీ? 8

సీ. ఒకవేళఁ బ్రణయకోపోద్రేకమున , ...మ్మపై వామపాద ముంచి
ఒకవేళ ననురాగవికలీభవత్క్రోధవై యురఃపీఠమ్ము నధిగమించి
ఒకవేళఁ గడుఁ జాకచకి నొప్పు మెఱపు నా జఘనప్రదేశమ్ము సంశ్రయించి
ఒకవేళ సింగార మొల్క ముద్దులు గుల్క నంకభాగమ్ముపై నధివసించి

గీ. వాహనము నాఁగఁ దగు మధువైరి కీవ లక్ష్మివై మోద మిడెదు విలాసగతుల
నీ కటాక్షమ్ము లేకున్న నీరజాక్షుఁ డంబ, యొకగవ్వయైనఁ జేయఁడు, నిజంబు. 9

# మాతృపూజ-శ్రీరామకృష్ణుడు

దైవమును 'అమ్మ' రూపములో ఆరాధించుట ఇప్పుడు హిందువుల ప్రత్యేకాచారముగ ఉన్నను ప్రాచీనకాలములో ఆ యాచారము పలుచోట్ల అమలులో ఉండినది. ఈజిప్టు బాబిలోను అస్సిరియ గ్రీసు మున్నగు అతి ప్రాచీన నాగరకతా కేంద్రాలలో ప్రజలు మాతృదేవతల ఆరాధించుచుండిరి. ఆ విధానాలు అప్పు డాచోట్ల నుండినవి. ఆ మతాచారాలు అన్నియు అనంతరకాలమున క్రైస్తవము మహమ్మదీయము అనెడి సెమిటిక్కు మతాలప్రవాహవేగమునకు కొట్టుకొనిపోయినవి. సెమిటిక్కులకు పురుషపక్షపాత మతి మాత్రము. కావున ఆరాధ్యదైవము మహిళారూపమున నుండుట వారి కసహ్యము. మహిళారూపమున దైవము నారాధించుటను రవంతైన ఓర్చుకోలేనివారు మహమ్మదీయులు. ప్రాచీనమతసంప్రదాయాలను అనేకములను తనలోనికి చేర్చుకొన్న క్రైస్తవమతమున క్రీస్తుదేవుని తల్లియగు మేరీకన్య నాదరించు రూపమున మహిళాపూజ నేటికిని మిగిలియున్నది. ఆ కాలమునుండి ఈ కాలమువఱకు దివ్యమాత్రారాధనము అవిచ్ఛిన్నముగ సాగుచుండు దేశము మన భారతదేశ మొక్కటే.

భారతీయసంస్కృతి సంకీర్ణమైనది. వివిధ ప్రజావర్గాల ఆశయాలు సంప్రదాయాలు భారతీయసంస్కృతిలో కలిసిపోయియున్నవి. మొహెంజదాడోనాగరకతలో మాతృదేవతల పూజ యుండినది. ప్రాచీన ద్రావిడులును శక్తిపూజాభిరతులే. వేదములలో వేల్పుల తల్లి అదితియు, ఉమాహైమవతియు, ఋషివాక్కనెడి మగువయు ప్రస్తుతలై యున్నారు.

శ్రీ వివేకానందస్వామి సెలవిచ్చిన రీతిలో ప్రతిమతములోను తత్త్వశాస్త్రము – పురాణములు – భగవత్సాయుజ్యప్రదాయకములగు క్రతుకలాపము లనెడి మూడంశము లున్నవి. తత్త్వశాస్త్రమే మౌ సిద్ధాంతములను దెలుపును. పురాణములు వేల్పులయు దివ్యపురుషులయు చరిత్రముల ఉదాహరించుచు ఆ మార్గమున తత్త్వశాస్త్రసిద్ధాంతముల వివరించును. తత్త్వశాస్త్రార్థముల అనుభూతిరూపమగు పరిజ్ఞానమునకు భగవత్సాయుజ్యమునకు ప్రాపకములైన సాధనవిశేషములను క్రతుకలాపాలను ఆగమములును యోగములును దెలుపుచున్నవి. హిందువులకందఱికిని వేదము ఉమ్మడియైన ప్రమాణము. విష్ణు – శివ – దేవీత్యాదిగా వారు వా రుపాసించు నిష్టదేవతల కనుగుణముగా పురాణములును ఆగమములును మాత్రము భేదిల్లుచుండును. పరదైవముగ దేవి నారాధించు సంప్రదాయము శాక్త మన బరగును.

శాక్తసంప్రదాయమున లక్ష్యము 'శక్తి'. పరతత్త్వము అఖండ మని, అనంత మని, అవిభాజ్య మని భారతీయుడు భావించును. అది వాక్కుకు మనస్సుకు అందదు, దేశమున కాలమున ఇముడదు, కార్యకారణసూత్రమున కట్టువడదు. సకలవిధసీమాతీతమైన దాని నుండియే నామరూపాత్మకమగు నీ విశాల జగము ఉప్పతిల్లినది. నామరూపాత్మకమగు ఈ జగముగా రూపొందు శక్తి కల దానినిగా పరతత్త్వమును భావింపకున్నచో, అది కేవలము శూన్యమో శూన్యకల్పమో అగును. ఈ శక్తినే వేదాంతులు సగుణబ్రహ్మమందురు. దేవి దేవునకు జోడు అని శాక్తేయులలో పలు వర్గాలవారు తలంతురు కాని నిర్గుణబ్రహ్మమును సగుణబ్రహ్మము నొక్కటే అనుటయు సగుణబ్రహ్మమును శక్తియు నొక్కరే యనుటయు శ్రీరామకృష్ణు నుపదేశము. విను డాయన పల్కులను. "బ్రహ్మమును శక్తియు అభిన్నములు. ఆ రెంట ఒక్కదాని నంగీకరింతువేని రెండవదానిని అంగీకరింపక నీకు తప్పదు. అవి అగ్నిని దాహకశక్తిని బోలినవి. అగ్ని నంగీకరింతువేని దాని దాహకశక్తినిగూడ గుర్తించి తీరుదువు. దాహశక్తిరహితమగు అగ్ని అసంభావ్యము. అగ్ని లేనిదే దాహకశక్తి అసంభవము. కిరణములు లేని సూర్యబింబ మసంభావ్యము. సూర్యుడు లేనిదే కిరణము లసంభవములు... తెలుపు వన్నె లేని పాలు అసంభావ్యము. పాలు లేనిదే పాల తెం[illegible] సంభావ్యము. అట్లే శక్తివిరహితమగు బ్రహ్మమును బ్రహ్మమును బాసిన శక్తియు నసంభావ్యములు. సగుణము లేక, నిర్గుణము మాత్రమే ఉండుటయో, నిర్గుణము లేక సగుణముమాత్రమే ఉండుటయో అసంభావ్యము. ఆదిశక్తి క్రీడ సదా చెల్లుచుండును. సృష్టిస్థితిసంహారములనెడి శక్తిక్రీడ సాగిపోవుచున్నది. ఆ శక్తికి కాళి యని పేరు. బ్రహ్మమే కాళి, కాళియే బ్రహ్మము, తత్త్వ మొక్కటే. సృష్టిస్థితిసంహారములం దన్వయింపక క్రియాశూన్యముగ నున్నప్పుడు దానిని బ్రహ్మమందుము. సృష్టిస్థితిసంహారములందు వ్యాప్త

తమై యున్నప్పుడు దానిని కాళి యందుము, శక్తి యందుము.''

పైని వివరించిన స్వభావముగల శక్తియే వేదాంతములో జెప్పబడుచున్న సగుణబ్రహ్మము. సగుణబ్రహ్మ మనగా గుణవిశిష్టుడైన యీశ్వరుడు. నిర్గుణబ్రహ్మ మనగా గుణములు లేని యీశ్వరుడు. ఇద్దఱు ఈశ్వరులు లేరు. ఈశ్వరునం దివి భాగములు కావు. పై నుదాహృతమైన శ్రీరామకృష్ణునిసూక్తిలో చెప్పియున్నటుల సగుణబ్రహ్మమును నిర్గుణబ్రహ్మము నొక్కటే. జగత్తునకు కారణముగా భావించినచో బ్రహ్మము సగుణము. క్రియాశూన్యముగను కేవలము సాక్షిగను భావించినచో బ్రహ్మము నిర్గుణము.

భారతదేశమున శైవము వైష్ణవము శాక్తము మున్నగా పెక్కుమతము లున్నవి. వాని వివరములు వారివారి పురాణములలో ఆగమములలో గననగును. ఈ మతము లన్నియు ఏదో యొకరూపమున వేదాంత తత్త్వమును అంగీకరించినవి. ఈ యంగీకారము వానియుమ్మడి లక్షణము. వేదాంతమున ప్రతిపాదితుడైన సగుణబ్రహ్మము తమ ఇష్టదైవమే అను సమన్వయముచేత ఈ యైక్యము కుదిరినది. సగుణబ్రహ్మప్రతిపాదికములగు శ్వేతాశ్వతరప్రముఖోపనిషత్తులు ప్రత్యేకముగ నే మతమును ప్రధానీకరించుట లేదు. వానిలో దేవునకు మానవరూపకల్పనముకూడ చాల తక్కువే. దేవునకందు ప్రత్యేకమైన యునికిపట్టు ప్రత్యేకరూపము ప్రత్యేకగుణములు లేవు. సర్వశక్తి యనియు సర్వజ్ఞు డనియు అన్ని మేలుములు కలవా డనియు మాత్రమే దేవుడు వర్ణితుడై యుండును. పురాణములును ఆగమములును సగుణబ్రహ్మమును తమ తమ ఇష్టదైవమును అభిన్నము లని చెప్పినప్పుడు ఆ దేవునకు ఈ మతాలు తెల్పు ప్రత్యేకత లన్నియు కలిగినవి. కాని, విశ్వవ్యాప్తు డనియు సృష్టిస్థితిసంహారకర్త యనియు ఉపనిషత్తులు కావించు ప్రతిపాదనల ప్రాముఖ్యము తొలగ లేదు. ఆ సగుణబ్రహ్మము శివు డని శైవమతమును, విష్ణు వని వైష్ణవమతమును, శక్తి యని శాక్తేయమతమును వాకొనినవి. శివుడే విష్ణువే శక్తియే అనుకొనునప్పుడు మానవరూపకల్పనము అతిమాత్రముగ పెంపొందినది. మానవులబుద్ధి వ్యక్తిత్వమునుమాత్రమే అవగాహన చేసికొనగలదు. వ్యక్తిత్వ మనగా పుంరూపమో స్త్రీరూపమో. అన్నిరూపములును దేవుని నుండియే ఉత్పత్తిల్లినందున అన్నిరూపములకును మూలమైన రూప మాయనదని భావింపవచ్చును. వివిధహిందూమతములలో వర్ణితములగు భగవద్రూపములు దీనినే సూచించును. ప్రతిమతమువారును తా మిష్టపడిన రూపపు దైవమే వేదాంతములందు ప్రస్తుతమైన సగుణబ్రహ్మ మనిరి. ఆ వేల్పులీలలను, అవతార చరిత్రలను, వర్ణించు పురాణములును, భక్తిగేయసారస్వతమును విస్తారముగ పెంపొందినది. రూపము లోకము సహాయులు పరికరములు ఒక్కొక్కదేవునికిని ప్రత్యేకములు.

పెక్కుమతాలలో దైవమును తండ్రిగ భావించుట కలదు. శివుడో విష్ణువో మగవేల్పుగను, జగజ్జనకుడుగను భావింపబడినాడు. దైవమును తల్లిగాకూడ భావింపవచ్చును కదా. అట్లు భావించు మతము శాక్తేయమతము. తల్లికడుపునుండి కదా బిడ్డపుట్టునది. సర్వజగత్తును పరమాత్మనుండి కదా ఉత్పత్తిల్లినది. కావున పరదైవమును తల్లిగా భావించుట యుక్తతర మని శాక్తేయులమతము. తండ్రియు పరదైవమే. కాని తల్లి అంతకంటెకూడ పైమెట్టు అని శాక్తేయభక్తుల అభిప్రాయము.

భక్తిపరిణామములో పరదైవమును భక్తుడు సాక్షాత్కరించుకొను దృక్పథము చాల ముఖ్యము. పరదైవము శక్తిస్వరూపమగుటే కాదు ఆశక్తి భక్తునిపట్ల అనుగ్రహమయము. దైవమును తల్లిగ భావించినప్పుడు తదనుగ్రహము మఱింత ప్రధానముగ వెలువడును. కావున ఈ భావన ఆధ్యా వృద్ధికి ప్రబలసహకారి. శిశువునకు తల్లి విశ్వాసమునకు రక్షణమునకు భోగ్యతకు శాంతికి వివేకమునకు మూర్తీభావము. అందఱికంటె తల్లి సొంతము కదా, కోరికలను నిక్కచ్చిచేసి తల్లినుండి బడయవచ్చును కదా. దైవమును తల్లిగా భావించువాడు ఇట్టి ఆశయముల కన్నిటికిని ఆమెను లక్ష్యముగ నొనర్చుకొని ప్రేమభక్తిని మఱింత శీఘ్రముగ నధిగమించును. ఆమె మనకు సొంత మనుకొనుటయు తదనుగుణమైన ఆంతరంగికతయు ప్రేమభక్తికి సారము.

పరదేవము జగజ్జనని యనగానే ఆమె అనంతశక్తిస్వరూపిణి యనియు తల్లి యగుటచే అనంతప్రేమమూర్తి యనియు వ్యంజితములగును. శాక్తేయమతచరిత్రను తిలకించితిమేని ఈ రెండు వ్యంగ్యాంశములలో ఊనిక దీని మీదినుండి దానికిని దానిమీదినుండి దీనికిని మాఱుచుండుట కననగును. కొందఱిదృష్టిలో మాతృత్వము వెనుకబడి శక్తిత్వము ప్రాధాన్యము నొందినది. అట్టివారికి సిద్ధులును అద్భుతశక్తులును లక్ష్యములు.

సాధకుడు తన్ను తాను అదుపులో నుంచుకొనుట నలవఱచుకొనునప్పుడు అద్భుతశక్తులు ఆ మార్గమున గల్గు ఆవిష్కృతు లని యోగ సూత్రములందు పతంజలి చెప్పియున్నాడు. ఈ యద్భుతశక్తులు సాధకుని పారమార్థికమార్గము నుండి పెడదారికి మరలించుననియు కావున వాని విషయమున సాధకుడు జాగ్రత్త కలిగి యుండవలె ననియు చెప్పబడియున్నది. కాని జనులు సాధారణముగ ఈ హెచ్చరికలను విస్మరింతురు. పామరజనులు సిద్ధులను అద్భుతశక్తులను ఆధ్యాత్మికోన్నతికి కొలగఱ్ఱ లని భ్రమింతురు. శాక్తేయమతపరిణామములో తాంత్రికులు అద్భుతశక్తులమూలమున ప్రదరమును చూఱగొనిరి. అద్భుతశక్తుల అభివృద్ధికి వారు మంత్రజపమును సాధనముగ గొనిరి.

పరిణామమున కంతటికిని కలిగిన అనివార్యఫల మిది – ఆధ్యాత్మికతృష్ణగాని వైరాగ్యముగాని ఇసుమంతైన లేని కేవలైహిక చిత్తులు ఈ అద్భుతశక్తుల కాశపడి ఈ శాక్తేయవర్గములోనికి ఆకృష్టులైరి. చిత్తవృత్తిని దృక్పథమునుబట్టి చూతుమేని ఈ యద్భుతశక్తులకై అన్వేషించువారికిని పెడదారులలో ధన మపహరించుకొనజూచువారికిని భేదమే లేదు. ఆ ధనాన్వేషకులలో సరళతయు నిష్కపటతయు నున్నది. అద్భుతశక్తుల నన్వేషించువాడు మానవాతీతుడైనట్లును దివ్యుడైనట్లును అభినయించును. శక్తిసమారాధకుల వర్గములోనికి ఇట్టివారు చేరుకొనుట చేత అందులో భక్తి అడుగున పడినది. వారి చర్య లన్నియు గారడీవిద్యలవంటివిగా తయారైనవి. భారతదేశమధ్యకాలచరిత్రమున ఇటువంటి పరిణామము లుండినవి. కావున అద్భుతశక్తులపైని మోజుచే మోసపోకు డని పతంజలి కావించిన హెచ్చరిక సమంజసమే. ఆ దినాలలో శక్తిపూజకులు మంత్రశక్తిచే ముగ్ధుల నొనర్చుట, శత్రువులను నాశమొందించుట, అంతర్ధానమగుట, తనువును తేలికపఱచుకొనుట, కామగమనము, కోరినదాని నెల్లబడయుట మొదలగు నద్భుతములను

ప్రదర్శించుచు వచ్చిరి. భయము, అంధవిశ్వాసము, అతిమాత్రమైన ఐహికపరత సర్వత్ర వ్యాపించినవి.

మధ్యయుగభారతీయులు విస్మరించిన పతంజలి హెచ్చరికను ప్రస్తుతయుగమున శ్రీరామకృష్ణుడును కావించినాడు. తాంత్రికసాధన లప్పుడు వివిధాద్భుతశక్తులు ఆయన కెదుట తమ్ము చూపుకొనినవి. కాని ఆయన తనమనస్సును వానివెంట బడనీయలేదు. దేవీ సాక్షాత్కారానుభవమునే లక్ష్యముగా గల వాని నిష్ఠను శోధించుటకై ఈ యద్భుత శక్తులు వినియుక్తము లగుచుండు నని ఆయన గ్రహించెను. వైరాగ్యమును ఆధ్యాత్మిక తృష్ణయు ప్రబలములుగ నుండకున్నచో సాధకుడు ఈ యద్భుతశక్తుల ప్రలోభనములకు లొంగిపోవును. శ్రీరామకృష్ణునందు ఈ పరమాద్భుతశక్తు లన్నియు నున్న వని గుర్తించి ఆయనమేనత్తదౌహిత్రుడును పర్యవేక్షకుడు నగు హృదయుడు "ఈ శక్తులను వినియోగించి ప్రాపంచికలాభములను బడయు" మని సదా బోధించుచుండెను. శిశూచితశ్రద్ధాభక్తులతో గురుదేవుడు తనకు సరిదారిని చూపవలసిన దని లోకజననినే ప్రార్థించెను. అప్పుడాయనకొక దివ్యదృశ్యము కనవయ్యెను. వికృతరూపుడగు నొకవ్యక్తి తననుండి వెలికి వచ్చుచున్నట్లు ఆయనకు కనిపించెను. "వెలికి వచ్చుచున్న ఈ మలినరూపునివలె అద్భుత శక్తులన్నియు పరమహేయము" లను నొక దివ్యవాణి వినవయ్యెను. పెక్కేండ్లకు పిమ్మట వివేకానందస్వామి గురుదేవునొద్ద శిక్షణమును పొందుచుండినప్పుడు, గురుదేవుడు తనయొద్ద వినియుక్తములు కాకున్నట్టి పరమాద్భుతశక్తులను శిష్యుని కీయ జూపెను. "భగవత్సాక్షాత్కారమునకు ఈ పరమాద్భుతశక్తులు సాధకము లగునా" అని వివేకానందు డడిగెను. "భగవత్సాక్షాత్కారపథమున ఈ శక్తులకు తావు లేనేలేదు. కాని మానవులనడుమ పనులు నిర్వహింపవలసిన నీకు ఇవి ఉపయోగపడ వచ్చును" అని గురుదేవుడు చెప్పెను. కాని స్వామిజీ ఈ శక్తులను బడయ నిరాకరించెను. శక్తిపూజావిధానమున అద్భుతశక్తులమీది మోజును శ్రీరామకృష్ణుడు తనజీవితముచేతను ఉపదేశముచేతను తొలగించినాడు.

దేవి దేవునకు కేవలము శక్తి యగుటే గాక లోకజనని అనుటను పరదైవ మనుటను లోకులు విస్మరించుచుండిరి. బౌద్ధమతమందేమి మధ్యకాల హిందూమతమందేమి శక్తిపూజ తాంత్రికరూపమును దాల్చినది. సాధకుల అంతస్తులకు తగినట్లుగా తాంత్రికసాధనలలో మెట్లు కలవు. పశుభావన, వీరభావన, దివ్యభావన అను మూడుభావనలతో కూడినవారికి సాధనక్రమములు ఇందు విహితములై యున్నవి. కొన్నిక్రియలు జరుపునప్పుడు స్త్రీలు ప్రక్కనే యుండ వలయును. ఇందుకు మూలాధారము పరతత్త్వము, అర్ధనారీశ్వరాదిరూపమున జంటవేల్పనెడి యాశయము. హిందూబౌద్ధ తాంత్రికాశయములకు ముఖ్యభేద మొకటి కలదు. హిందూతాంత్రికాశయమున శివుడు స్థాణువు, శక్తి సంచలనశీలము. బౌద్ధులతాంత్రికాశయము ఇందులకు విపరీతము. వారు మహిళాంశమును ప్రజ్ఞ యనియు శూన్యత యనియు పురుషాంశమును కరుణ యనియు ఉపాయ మనియు పేర్కొందురు. వారియాశయమున మహిళాంశము చలనరహితము, పురుషాంశము సంచలనశీలము. మగువలును మగవారును కలిసి నిర్వహింపవలసిన సాధనలు దుష్పరిణామమునకులోనై వామాచార మను పేరవిశృంఖల ప్రవర్తనమునకు దారితీసినవి.

మానవుని మనసున కందుబాటగుటకై దేవుడు మానవరూపము దాల్చుటఅనివార్యమే యైనను మానవుడు తనకు దివ్యత్వమును ఆరోపించుకొను ప్రవణతగలవాడు కావున ఇందు పరిమితిని పాటింపవలయును. ఈసందర్భమున అప్పయ్యదీక్షితుల శ్లోక మొకటి జ్ఞప్తికివచ్చుచున్నది. ఈక్రిందిపద్యము దాని కనువాదము కాదు గాని అనుకరణము .—

పరిపరిగతుల సర్వవ్యాపకుని నిన్ను
వెదకఁబోయితి, నెంత వెఱ్ఱి నయ్య!
నీనామరహితత నే నెఱింగియు నట్టె
పిలువ బూనితి, నెంత వెకలి నయ్య!
ఆకారశూన్యుఁడ వౌ టెఱింగియు నిన్ను
నరయఁ గోరితి, నెంత మొఱకు నయ్య!
సర్వసముఁడ వన్న సంతన యెఱింగియుఁ
బొగడ సాగితి, నెంత మొరటు నయ్య!
అవగతం బయ్యె నిగమరహస్య మెల్ల
ఆకళింపయ్యెఁ బ్రకృతిగూఢార్థ మెల్ల
నేన నీ వౌట నేఁటికి నెఱుఁగ నయ్యె
స్వాంత మింతకుఁ దండ్రి నిశ్చింత మయ్యె.

(శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు)

'ఈపద్యహృదయమును ఆకళించుకొన్నచో భక్తిమతాలలో మానవుని దేవునిగ భావించు విధానమున నేర్పడిన అతివాదములు తొలగును. ఆధ్యాత్మికపరిణతిలో శైశవదశయం దున్న మానవుని దౌర్బల్యముచేత దేవుని మానవునిగ భావింపవలసివచ్చుచున్నది. అట్లు భావించు నప్పుడు కూడ దేవుడు మానవునిపరిమితులను అతిక్రమించినవా డనెడి జ్ఞప్తి పూర్తిగ నుండ వలయును. దేవుడు మానవరూపము దాల్చుట కేవలము కరుణాకార్యమే. దేవునకు నివేదించుటకు వరిష్ఠములైన పదార్థములనే ఏరికైకొను నట్లు దేవుని మానవునిగ భావించునప్పుడు కూడ హేయగుణరహితునిగను కల్యాణగుణ మహితునిగను భావింపవలయును. కావున తాంత్రికుడు పరదైవమును స్త్రీపురుషరూపములలో ప్రతిపాదించుట చాల క్రింది మెట్టు. పరదైవమును జననిగ భావించు తత్త్వమార్గమునకు స్త్రీత్వపురుషత్వములకు సంబంధించిన భోగ్యబుద్ధి యుండ కూడదు. ఉపాస్యబుద్ధి మాత్రమే ఉండవలయును. భోగ్యబుద్ధిని తుడిచివేసి యుపాస్యబుద్ధిని గలిగించి పెంపొందించుటయే మాతృభావపు టమోఘమహిమ.

శ్రీరామకృష్ణుడు పరదైవమును జననిగా నుపాసించినప్పు డాయనమనసుకు 'స్త్రీత్వము' 'జననీత్వము'ను పర్యాయము లైనవి. కావున ఆయన దృష్టిలో ప్రతిమహిళయు మాతృస్వరూపిణియే. మాతృశ్రీశారదాదేవి ఒకనా డాయనకు పాదసంవాహనము చేయుచు ''నన్నుగూర్చి మీ తలం పేమి'' అని యడుగగా ''గుడిలో మూర్తిగా ఉన్న జనని నీవే నన్ను కని ప్రస్తుతము నహబత్తులో నున్న చంద్రమణి దేవి నీవే నీవునీవే అని ప్రస్తుతము ఆయన చెప్పిన జవాబు ప్రసిద్ధము. భక్తులతో తన యాశయము నాయన ఇంకను ఇట్లు విస్తరించెను. ''నాలో ఆధ్యాత్మిక చైతన్యమును ప్రబోధింప, రవంత సూచన గలిగినను చాలెడిది. పదనాలుగేండ్ల పడుచునందు నేను త్రిపుర సుందరి నారాధించితిని. ఆమె లోకజననికి ప్రత్యక్షరూపముగ నాకు కనిపించినది. . .ఆదినాలలో నేను కన్యలను ఆహ్వానించి ఉపాసించుచుంటిని. దివ్యమాతృమూర్తులుగా వారు నాకు కనిపించెడివారు. ఒకనాడు వకుళవృక్షమునొద్ద నిలుచున్న మహిళ నొకెతను గంటిని. ఆమె వ్యభిచారిణి యట. కాని నాకంటి కామె రావణుని చెఱనుండి విముక్తురాలై రాముని చేర బోవు సీతామహాదేవిగా కనిపించినది.''

ఆమె లోకజనని, తా నామెశిశువ నను ఈసుదృఢాధ్యవసాయముతోనే శ్రీ రామకృష్ణుని తాంత్రికసాధన లన్నియు చెల్లినవి. విశ్వజనని నియమానుసాము అందుకు ఆయన భైరవిబ్రాహ్మణిని గురువుగా వరించెను. దేవాలయప్రాకారమున ఉత్తరపువైపు పంచవటిలో బిల్వవృక్షముక్రింద అతడు సూక్ష్మగంభీరతపః క్రియ లాచరించెను. తంత్రశాస్త్రగ్రంథాలు అఱువదినాలుగింటిలో విహితములై యున్న క్రమముల నన్నిటిని ఆయన సాధన చేసెను. ఒక్కొక్కదానిలోను చెప్పబడిన సిద్ధిని బొందుట కాయనకు మూడు దినాలకంటె ఎక్కువ కాలము పట్టలేదు. ప్రారంభక్రియలు ముగియగానే అతని నొక దివ్యౌత్సుక్యము పైకొనెడిది. అంతట సమాధి దశలో అతని మనస్సు ఆదివ్యతత్త్వమున లీనమై యుండెడిది. సకలద్వంద్వములును లోకజననిలో కలిసిపోయినవి. వాగతీతమైన యామెరూప వైభవమున జగత్సంహారోచితమైన భయంకరత్వమును మాతృహృదయోచితమైన ధైర్యకరత్వమును రెండును మిళితములైనవి.

శ్రీరామకృష్ణుని యీ దేవీస్తోత్రప్రకార మీ వ్యాసమునకు సమాప్తిమంగళ మగుత!

అమ్మా, నిజముగా నీవే బ్రహ్మమవు, నిజముగ నీవే శక్తివి, నీవే పురుషుడవు, నీవే ప్ర నీవే విరాట్స్వరూపిణివి, ద్వంద్వాతీతతత్త్వమవును నీవే, ద్వంద్వముల రూపున నున్నదియు నీవే, నిజమునకు చతుర్వింశతి తత్త్వములును నీవే.

# శ్రీ వివేకానందుని జీవితచరిత్రమున 'కన్యాకుమారి'

శ్రీ ఏనమండ్రం వేంకటరామయ్యాగారు

కాలినడకన యావద్భారతదేశయాత్ర సాగించుచుండిన వివేకానందస్వామికన్యాకుమారికి విచ్చేయుట ఆయన జీవితచరిత్రలో నూతనాధ్యాయమునకు ప్రారంభక మయ్యెను. ఎట్లనగ, ఆయనకు భారతదేశ ప్రాచీనమహిమ సాక్షాత్కృతమైన దిచ్చటనే. పూర్వోన్నతస్థితికి భారతదేశమును మరల తెచ్చుటకు ప్రణాళిక ఆయనకు స్ఫురించిన దిచ్చటనే. స్వామిజీ తనజీవితమున నిర్వర్తింపవలసినపనిని ముందుగనే తెలిసికొనియున్న శ్రీరామకృష్ణు డాయనతో ఇట్లనెను కదా. ''ఈనాడు 'నేను నాసర్వస్వమును నీ కిచ్చివేసితిని. ఏమియు లేని ఫకీరనైతిని. ఈశక్తిచే నీవు లోకమునకు అనంత శ్రేయస్సులను సమకూర్తువు. కర్తవ్యమును పూర్తిచేసిన పిమ్మటనే యథాస్థానమునకు మరలగలవు.''

శ్రీరామకృష్ణుడు మహాసమాధి నొందిన పిమ్మట వివేకానందప్రముఖశిష్యులు విషణ్ణులై యుండిరి. వారికి గలిగిన తొలికోరిక, జనుల కలకలమునుండి ఏకాంతదూరస్థలములకుపోయి అచట జీవితశేషమును గడపుద మని. వివేకానందస్వామియే పెక్కుపర్యాయములు కల్కత్తాను వీడి నిర్వృతికై హిమాచలప్రాంతమున కేగెను. కాని ''భారతదేశమునకు మానవతతికి నీవు సేవ చేయవలె'' నని గురుదేవుడు చెప్పియుండిన మాట తుదకు నెగ్గినది. ఈసేవా

కార్యమును నిర్వర్తించుటకు సంసిద్ధతను చేకూర్చుకొనుటకై స్వామిజీ భారతదేశ మంతట సంచరించి సకలపరిస్థితులను స్వంతముగ చూచి తెలిసికొనగోరెను. మధ్యభారతమున పశ్చిమభారతమున దక్షిణభారతమున వివేకానందుని పర్యటనలు గాదాపు రెండేండ్ల కాలము చెల్లినవి. యాత్ర చాలమట్టుకు కాలి నడకనే సాగెను.

సంచారక్రమమున స్వామిజీ భారతదేశ దక్షిణపుకొనకు వచ్చెను. కన్యాకుమారిగుడికి పోయి దేవియెదుట సాగిలబడి వెలుపలికి వచ్చెను. సముద్రమున ఈదుకొని పోయి అట నున్న శిలాగ్రము నధిరోహించెను. మాతృదేశ భూతవర్తమాన భవిష్యములను గూర్చి ఆలోచించుచు ధ్యాననిమగ్నుడై స్వామి అట కూర్చుండెను. కన్యాకుమారియగ్రమునకుదిగువ సముద్రమున నుండిన యాశిల భారతదేశవిధిని నిర్ణయించు శిలగా పరిణమించెను. అది ఇప్పుడు ప్రశస్తమైన ''వివేకానందశిల''యను నామమును దాల్చుచున్నది.

అనంతరకాలమున అమెరికానుండిస్వామీజీ వ్రాసిన యొక లేఖలో ఈశిలమీద తనకు కలిగిన స్ఫురణమునుగూర్చి ఇట్లు తెలిపెను: ''కన్యాకుమారియగ్రమున అమ్మకుమారి గుడిలో, భారతదేశపు కొట్టకొసననుండు శిలపై కూర్చుండి యున్నప్పుడు నాకొక పన్నాగము స్ఫురించినది. ఇంతమంది సన్యాసులమున్నాము. ప్రజలకు వేదాంతము బోధించుచు తిరుగుచున్నాము. ఇదంతయు వెఱ్ఱి. ''కడుపుమాడు చుండువారి నెత్తిన వేదాంతము రుద్దుట మంచిది కా'' దని గురుదేవుడు చెప్పియుండెను కదా. ఈప్రజ లిట్లు మృగప్రాయులుగ జీవితములు గడుపుచుండుటకు కారణము అజ్ఞానము. నిస్వార్థబుద్ధులగు సన్న్యాసులు కొందఱు పరోపకార దీక్షితులై గ్రామాలు చుట్టుచు దేశపటముల ఛాయాగ్రహణయంత్రముల గోళముల తోడ్పాటుతో చండాలురతో సహా సకలప్రజలకు విద్య గఱపుచు వారి స్థితిగతులను మెఱుగొందించుటకు పాటుపడుదురేని కాలక్రమమున లోకకళ్యాణము చేకూరదా? భారతజాతి వ్యక్తిత్వమును కోల్పోయినది. భారతదేశమున నున్న చెడుగుల కన్నిటికి కారణ మదే. నిమ్న వర్గాల వారిని అభివృద్ధికి తెచ్చి జాతికి వ్యక్తిత్వమును మరల కలిగించుట మన కర్తవ్యము.

భారతదేశసేవకు తనజీవితము నంకితము చేసికోవలయు నని, దుఃస్థితి యందున్న కోట్లకొలది ప్రజలకుసర్వతోముఖమైనఅభ్యుదయము కలిగించుటకు నిర్విరామముగ పాటుపడవలయు నని శ్రీవివేకానందస్వామి శపథపూర్వకముగ నిశ్చయించుకొన్నది కన్యాకుమారియొద్ద. ఇట్లు సన్న్యాసి దేశసేవకుడుగ పరిణమించెను. అసహాయులకు సాయపడవలయునను, బాధలుపడుచున్న వారి కష్టముల నివారింపవలెనను, తీవ్రతృష్ణ ఆయన డెందమున నిండెను.

శ్రీవివేకానందస్వామి జీవితమున మఱొక ముఖ్యాధ్యాయము ఆయన మద్రాసుకువిజయము చేయుట. ఇచ్చటి మిత్రులు భక్తులు కొందఱు ''అమెరికాకు పోయి 1893 లో షికాగో నగరమున జరుగనున్న విశ్వమత మహాపరిషత్తులో హిందూమతమునకు ప్రాతినిధ్యము వహింపవలసిన'' దని స్వామిని ప్రోత్సహించిరి. తాను సంకల్పించిన సేవాకార్యమును తొడగుట కవకాశము స్వామీజీకి గోచరించినది. విశ్వమతమహాపరిషత్తుకు పోవుద మను కోరిక ఆయనమనస్సులో జాడగా అంతకు ముందే యున్నను అది స్పష్టరూపమును దాల్చినది మదరాసులోనే. ఇచటి భక్తులును మిత్రులును ఆయన యమెరికాకుపోవుటకు ఏర్పాట్లు

చేయుటేగాక అందుకు వలసిన ధనమును మహా జనులవిరాళములరూపమున సేకరించిరి.

శ్రీవివేకానందస్వామి విశ్వమతమహాపరిషత్సమావేశములో పాల్గొన్నంతనే అప్పటి వఱకు అజ్ఞాతహిందూసన్న్యాసిగనుండిన ఆయన తటాలున విశ్వమతాచార్యుడుగ వికసించెను. న్యూయార్కు-హెరాల్డు పత్రిక విశ్వమతమహాపరిషత్సభలో మహోజ్జ్వలతమవ్యక్తి ఈయనే అని వర్ణించినది. ఆసభావేదికపై స్వామీజీ ఘోషించినది-''కావలసినది తోడ్పాటు, పోరాటము కాదు; సమన్వయము, విధ్వంసనము కాదు; శాంతిసామరస్యములు, చీలికలు కావు.''

అద్వైతమే ప్రగాఢమును పవిత్రమునగు భారతదేశ హృదయ మనుట స్వామీజీకి ఎంతయు నచ్చినది. అద్వైతానుభూతి శ్రీరామకృష్ణునొద్దనుండి ఈ శిష్యవరేణ్యునకు సంక్రమించినది. సంకుచితత్వపు జాడయైనను లేనిది అద్వైతానుభూతి. పెక్కుమతములలో అద్వైతమొక మతము కా దనియు సర్వమతముల సమన్వయమే అద్వైత మనియు శ్రీవివేకానందుని యభిప్రాయము. భారతదేశమును సముద్ధరించునదియు భారతీయుల సోమరితనమును దులిపివేయించునదియు పాశ్చాత్యభౌతికాదిశాస్త్రజ్ఞుల దృక్పథమునకు సంతృప్తి కూర్చునదియు అద్వైత మని ఆయన విశ్వసించినాడు. సర్వమతలక్ష్యములును పరస్పర మెట్టివిరోధమును లేక సమన్వితము లగునది అద్వైతమందే.

ఈనాడు మన మనుభవించుచున్న స్వాతంత్ర్యమునకు గట్టిపునాదిని శ్రీ వివేకానంద స్వామియే వేసెను. స్వామీజీ తన జీవితకార్యముగ నెన్నుకొన్నది ఆధ్యాత్మికత నభివృద్ధిపఱచుటే యైనను అలనాటి యాంగ్లప్రభువులు ఆయన ననుమానించుచుండిరి. ఆయన విప్లవకారు డని భావించి పోయినచోటికెల్ల గూఢ పరిశోధకులు వెంబడించుచుండిరి. ఆయన విప్లవకారు డనుట నిజమే. సామాన్య విప్లవకారుడు కాడు. ఆయన ప్రాచీనమైన ఈ దేశమున రాజచేసిన నిప్పు దాస్యబంధములను దగ్ధ మొనర్చినది. ఆయన దేశభక్తి ఆధ్యాత్మిక పరతనుండి పుట్టువొందినది. రాజకీయములందు పారమార్థికపరతను గాంధీజీ ప్రవేశపఱచె నందురు. అందు తనకు మార్గదర్శకులు శ్రీరామకృష్ణుడును, శ్రీవివేకానందస్వామియునే అని గాంధీజీ స్వయముగ అంగీకరించియున్నారు.

# మహిషాసురమర్దనము

## సంకలనకర్త: శ్రీ తుమ్మల పేరారెడ్డిగారు

పూర్వము అసురులకు మహిషాసురుడును దేవతలకు ఇంద్రుడును అధిపతులుగ నున్నప్పుడు దేవాసురులకు పూర్ణముగా నూఱేండ్లు యుద్ధము చెల్లెను. అందు దేవసైన్యము మహావీర్యసంపన్నమగు నసురసేనధాటికోడిపోయెను. వేల్పులందఱును నిర్జితులైన పిదప మహిషాసురుడు ఇంద్రపదవి నధిష్ఠించెను.

అంతట ఓటమి నొందిన దేవతలు ప్రజాపతి యగు బ్రహ్మదేవుని పురస్కరించుకొని శివుడును విష్ణువు నున్నచోటికి పోయిరి. మహిషాసురుడు తమ్ము ఓడించిన వృత్తాంతమును, జరిగినదానిని జరిగినట్లే, సవిస్తరముగా దేవతలు వారికి తెలియపఱచిరి. ''సూర్య-చంద్ర-ఇంద్రాగ్ని - యమ - వరుణ ప్రముఖదేవతల

యధికారముల నన్నిటిని మహిషుడు స్వాయ
ముగా నధిష్ఠించినాడు. దురాత్ముడగు మహి
షునిచే తఱుమగొట్టబడిన వేల్పులందఱును
భూమిపై మనుష్యులవలె త్రిప్పట నొందు
చున్నారు. అమరశత్రుని దుశ్చేష్టితము నంత
టిని మీ యిద్దఱకును తెలుపుకుంటిమి. మీ
యిద్దఱిని శరణుజొచ్చితిమి. మీ రిద్దఱును
అతనిని మట్టుపెట్టు మార్గము నాలోచింపుడు.''

దేవతలమాటలు విన్నంతనే శివకేశవులు
క్రుద్ధులైరి. వారియాననములు భ్రుకుటీకుటి
లము లయ్యెను. అతికోపపూర్ణుడగు విష్ణుదేవుని
వదనమునుండి యొక మహాతేజ మావిర్భ
వించెను. బ్రహ్మరుద్రులముఖములనుండియు
శక్రాదులగు సురలశరీరములనుండియు నట్లే
సుమహాతేజము లుప్పతిల్లినవి. ఆ తేజస్సంతయు
నేక మయ్యెను. వేల్పుల యెట్టయెదుట ఆ
తేజోరాశి పర్వతసన్నిభ మాయెను. జ్వాలలు
ముల్లోకముల ఎల్లదిశల వ్యాపించుచుండ,
ఆ తేజ మొకస్త్రీమూర్తిగ నయ్యెను. ఆమె
ముఖముగా నున్న తేజము శివునిది, వెంట్రు
కలుగా నున్న తేజము యమునిది, బాహువు
లుగ నైన తేజము విష్ణుదేవునిది, కుచద్వయ
ముగ రూపొందిన తేజము చంద్రునిది, నడు
ముగనైన తేజ మింద్రునిది, పిక్కలుగను
తొడలుగను నైన తేజము వరుణునిది, పిఱు
దులుగ నైన తేజస్సు భూమిది. బ్రహ్మతేజ
స్సుచే ఆమెపాదములును సూర్యతేజస్సుచే
ఆమెకాలివ్రేళ్లును, వసువుల తేజస్సుచే నామె
చేతివ్రేళ్లును కుబేర తేజస్సుచే ఆమెముక్కును,
ప్రజాపతుల తేజముచే నామెదంతములును,
మూడగ్నుల తేజస్సుచే నామె మూడుకన్ను
లును, ద్విసంధ్యల తేజస్సుచే నామెకనుబొమ
లును, వాయు తేజముచే నామె వీనులును
రూపొందినవి. ఇతర దేవతల తేజములుకూడ
ఆ శుభమూర్తిలోనికి ప్రవహించినవి. ఇట్లు
తమయందలి తేజోరాశినుండి సముద్భవించిన
యామెను దర్శించి మహిషాసురపీడితులగు
దేవతలు ముద మందిరి.

ఆమెకు పినాకపాణి తనశూలమునుండి
యొకశూలమును దీసియిచ్చెను. విష్ణువు తన
చక్రమునుండి యొకచక్రమును తీసియిచ్చెను.
వరుణుడు శంఖమును, అగ్ని శక్త్యాయుధమును,
వాయువు ధనువును, బాణములునిండిన రెండు
తూణీరములను ఇచ్చిరి. అమరాధిపుడగు
నింద్రుడు తన వజ్రాయుధమునుండి యొక
వజ్రాయుధమును ఐరావతగజఘంటలనుండి
యొకఘంటను తీసి ఆమెకిచ్చెను. కాలదండము
నుండి యొకదండమును యముడును పాశా
యుధమును వరుణుడు నామెకిచ్చిరి. ప్రజాపతి
యగు బ్రహ్మ ఆమెకు అక్షమాలను కమండ
లువు నిచ్చెను. సూర్యు డామె సమస్త రోమ
కూపములందును తనకిరణముల నిచ్చెను.
కాలుడు కత్తిని డాలు నొసగెను. పాలసము
ద్రము నిర్మలముక్తాహారమును నిత్యనూతనము
లగు రెండుచీరలను దివ్యశిరోరత్నమును కమ్మ
లను కటకములను శుభ్రమైన యర్ధచంద్రా
భరణమును, అన్ని బాహువులకును, భుజకీర్తు
లను, స్వచ్ఛమంజీరములను, అనుత్తమమైన
కంఠాభరణమును, అన్నివ్రేళ్ళకును మేలైన
యుంగరములను సమర్పించెను. విశ్వకర్మ
మహోజ్జ్వలమగు పరశువును అనేకరూపము
లగు నస్త్రములను అభేద్యకవచము నిచ్చెను.
సముద్రరాజు ఎన్నటికిని వాడిపోని తామర
పూలమాలలను రెంటిని తెచ్చి, దేవికి తలపై
నొకదానిని వక్షఃప్రదేశమున నొకదానిని
అర్పించెను, చేత పట్టుకొనుట కతిమనోహర
మగు నొకకమలము నిచ్చెను. హిమవంతుడు
సింహవాహనమును వివిధరత్నముల నొసగెను.

కుబేరుడు సదా మద్యము నిండియుండు పాన పాత్రము నిచ్చెను. పృథ్వీభారవాహకుడును సర్వనాగేశుడు నగు శేషుడు నాగహారమును, బహూకరించెను. ఇతర దేవతలును భూష ణాయుధముల నిచ్చి సమ్మానించిరి

అంత ఆ దేవి అట్టహాసముతో మరల మరల గర్జించెను. అది అనంతమై విశ్వ వ్యాపమై ప్ర నులతోగూడి లోకములను గడగడలాడించి సముద్రములను క్షోభిల్ల జేసెను, భూమిని కదిపెను, పర్వతములను ప్రక్కదలజేసెను. వేల్పులు జేకొట్టిరి. మునులు భక్తి వినమ్రులై స్తుతించిరి.

ఈ సంక్షోభమును జూచి సురవైరులు తమ సేనల సిద్ధపఱచుకొని గృహీతాయుధులై నిలబడిరి. బహుసహస్రరథగజతురగపదాతివర్గ ములతో అసంఖ్యాకరాక్షసపరివేష్టితుడై మహి షాసురుడు ఆశబ్దమువచ్చినదిశ కభిముఖముగ పరుగిడి దేవిని దర్శించెను. ఆమెకాంతి ముల్లో కముల వ్యాపించియుండెను. ఆమెపాదఘట్టన మునకు భూమి క్రుంగుచుండెను. ఆమెకిరీట మాకాశము నొరయుచుండెను. ఆమె ధను ష్టంకారము సకలపాతాళములను సంక్షోభిల్ల జేయుచుండెను. ఆమె వేయిబాహువులు అన్ని దెసల కొసల దాకుచుండెను.

అంతట దేవికిని సురవైరులకును యుద్ధ మారంభమయ్యెను. అందు ప్రయుక్తములైన చిల్లకోలలు, గుదియలు, భల్లములు, రోకండ్లు, ఖడ్గములు, గండ్రగొడ్డండ్లు, అడ్డకత్తులు, బల్లెములు, పాశములు – అవి ఇవి అన నేల నానాశస్త్రాస్త్రములు దిగంతరముల దీపింప జేసినవి. మహిషాసురుని సేనాని చిక్షురుడను మహాసురుడు. చామరప్రముఖదానవులు చతు రంగబలసమేతులై అతనికి తోడ్పడిరి. అఱువది వేలరథములు గలవాడు ఉదగ్రాసురుడు, నూఱులక్షల రథములు గలవాడు మహా హనుడు, నూటయేబది లక్షల రథములు గల వాడు అసిలోముడు, అఱువదిలక్షల రథములు గలవాడు బాష్కలుడు, బహుసహస్రగజతురగ ములును కోటిరథములును గలవాడు పరివారి తాసూరుడు. ఏనూఱుకోట్ల రథబలసంపన్నుడు బిడాలుడు. వీరును చతురంగబలసంపన్నులగు నితరమహాసురులు బహుసహస్రసంఖ్యాకులును దేవితో పోరాడిరి

ఖడ్గప్రహారములచే దేవిని సంహరింప వా రురవడించిరి. చండికాదేవి వారి శస్త్రాస్త్రముల నన్నిటిని అవలీలగ ఖండించివైచెను. వాహన సింహముకూడ క్రుద్ధమై జూలు విదుర్చుచు కారడవిలో దావానలమువలె శత్రుసేనలందు సంచరించెను. దేవి విడిచిన నిట్టూర్పులనుండి వేలకొలది సైన్యగణము లుప్పతిల్లి నానాయుధ ములతో రక్కసులను పైకొనుచు ధ్వంస మొనర్చుచుండినవి. ఈశ్వరియు నసురులపై వివిధశస్త్రాస్త్రములను ప్రయోగించి, వధించెను. ఆమె ఘంటానాదమును విన్నమాత్ర కే పెక్కండ్రు రక్కసులు విగతజీవు లగుచుండిరి ఆమె ఖడ్గప్రహారములకు గదప్రేటులకు రోకటి పోటులకు శూలపు పొడుపులకు ఛిన్నబాహువు లును త్రుటితకంఠులును ఖండితమధ్యులును చూర్ణితవివిధావయవులునై ప్రమందిన యసుర సేనలకు మితి లేదు. వారి రక్తము మహానదీ రూపమున ప్రవహించెను. తలలు తెగిన పిదపకూడ మొండెములు పోరునుసాగించు మహాద్భుతము ఆ రణరంగమున కననగు చుండెను. గడ్డివామికాని కట్టెలరాసి కాని ఎంత పెద్దదైనను, నిప్పంటుకొన్నచో క్షణ ములో రూపుమాయునట్లు, దేవి పర్వించిన శస్త్రాస్త్రాగ్నిచే అసురమహాసైన్యము క్షణములో

తెగటార్చెను. వేల్పులును మునులును దేవిని ప్రస్తుతించిరి, మింటినుండి పూలవాన కురిసెను.

అసుర సేనాపతి చిక్షురుడు స్వసైన్య వినాశమును జూచి క్రుద్ధుడై వచ్చి అంబికపై శరవర్షము కురిపించెను. ఆమె యతని బాణముల మరల్చి, సారథిని రథాశ్వములను జంపి, ధనువును ధ్వజమును ద్రుంచెను. ఇట్లు విరథుడును బాణవిద్ధుడునై యతడు ఖడ్గమునుగొని దానితో వాహనసింహమును దేవిని ప్రహరించెను. దేవి మేను తగిలినంత నా ఖడ్గము తుత్తునియలై నేల వ్రాలెను. అంత నత డంబికపై విసరిన శూలమును అతనిని—దేవీప్రయుక్తమైన శూలము తుత్తునియ లొనర్చెను. అంతట చామరుడు గజారూఢుడై యంబిక నెదిర్చెను. ఆమె హుంకారముచే నతనిచేతి బల్లెము నిర్వీర్యమై నేలబడెను, ఆమెబాణము లత డేసిన శూలమును త్రుంచివేసినది. ఆమె వాహనసింహ మతనిపై కుప్పించి పాదముతో గొట్టగా అతని తల తెగి క్రిందబడెను. అంతట దేవి శిలావృక్షాదులతో నుదగ్రుని పొలియించెను. కరాళుని దంతములతో కొట్టికి పిడికిళ్ళతో పొడిచి చెంపపెట్టులు పెట్టి గెడపెను, గదతో నుద్ధతుని, గుదియతో బాష్కలుని, అమ్ములతో నంధకతామ్ర దుర్ధరదుర్ముఖులను త్రిశూలముతో ఉగ్రాస్యోగ్ర వీర్యమహాహనులను ఖడ్గముతో బిడాలుని పొరిపుచ్చెను.

అంత మహిషాసురుడు దేవీసేనల భీతిల్లజేసెను. అతనివేగము అతని యూర్పుగాలి సోకినంత మాత్రకే, అతని గర్జన విన్నంత మాత్రకే, అతని పరుగును కన్నంతమాత్రకే, ఎందఱో నేలగూలిరి. అతని త్రొక్కిళ్లకు నేల దుమ్మయ్యెను, తోకచఱపులకు సముద్రము పొంగిపొరలెను, కొమ్ముల ఊపునకు మింట మేఘములు తునాతునుకలైనవి. అతడు కొందఱిని మోరతో గొట్టెను, కొందఱిని గిట్టలతో చిమ్మెను, కొందఱిని తోకతో బాదెను, కొందఱిని కొమ్ములతో బొడిచెను. కొండలను విసరెను, వాహనసింహము మీది కురవడించెను. అప్పుడు దేవి విసిరిన పాశమున కతడు బద్ధుడయ్యెను. రూపములు మార్చుకొనజొచ్చెను. సింహముగ నయ్యెను, దేవి దానితలను ద్రుంచెను; ఖడ్గపాణి యగు మానవుడుగ నయ్యెను, దేవి బాణములచే ఆయుధములతో సహా తుత్తునియ లయ్యెను; ఏనుగుగనై దేవీ వాహనసింహము నీడ్వసాగెను. దేవికత్తి వ్రేటునకు దాని తొండము తెగి పోయెను. అంత నతడు మరల మహిషరూపమును దాల్చెను. దివ్యపానమును ద్రాగుచు మాటిమాటికిని నవ్వుచున్న చండికపై నతడు తన కొమ్ములతో కొండలను వీచివైచెను. చండికయు మద్యమును పూర్తిగ త్రాగి అసురునిపై కుప్పించి పడవైచి అతని కుత్తుకను తన పాదముక్రింద నదిమిపెట్టెను. అతడు పూర్తిగా లొంగిపోయెను. తన ముఖమునుండి స్వస్వరూపమును సగము వెలువఱచి పెనుగులాడ జూడగా దేవి ఖడ్గముతో నతని తల నఱికి వధించెను.

అంత దైత్యసేనలు హాహాకారములు సేయుచు నశించినవి. వేల్పులును ఋషులును పరమహర్షము నొందిరి, దేవిని స్తుతించిరి. గంధర్వపతులు పాడిరి. అప్సరోగణము లాడిరి.

# యువభారతీయులకు ప్రబోధము

## శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వామిమహారాజులుంగారు

స్వాతంత్ర్యము లభించిననాటినుండియు మన యువకులలో దేశపునర్నిర్మాణోత్సాహము ఎంతగనో కననగుచున్నది. ఆసముత్సాహము మిక్కిలి కొనియాడదగినది; కాని ఈ పనికి పూనుకొనుటకు ముందు భవిష్యద్భారతదేశ మెట్టిదిగా నుండవలె నని వారి తలంపో స్పష్టముగ తెల్పుకోవలయును. చిత్రకారుడు కూడ మొదటనే కిత్తనారగుడ్డమీద వర్ణము లొలుకడు. ఆలాగు చేసినచో మంచిబొమ్మ రూపొందదు. అతడు చక్కగా ఆలోచించి తాను చిత్రింపనున్న చిత్తరువును మొదట తన మనస్సులో రూపొందించుకొనును. తర్వాతనే తన మనసులో నున్న రూపము కిత్తనారగుడ్డమీదికి మార్పగలడు. వాస్తుశిల్పియు భవననిర్మాణమును సరాసరి ఆరంభింపడు. ఆ భవన మెట్టిదిగ నుండవలెనో మొదట మనస్సులో ఆలోచించుకొనును. పాఠశాలయా, ఆసుపత్రియా, కార్యాలయమా, వాసగృహమా అనుటను ముందుగ నిశ్చయించుకొనును. తర్వాత అక్కఱల కనుగుణముగా సాంగోపాంగమైన నమూనా నేర్పఱచుకొనును. నిర్మాణకార్యమును తర్వాత నారంభించును. ఆలాగే మీరును భవిష్యద్భారతదేశ మెట్టిదిగా నుండవలెనో మొదట మనస్సులో స్పష్టముగ నిర్ణయించుకొని పిదపనే నిర్మాణకార్యమును తొడంగవలయును. యుద్ధోచితమహాసైన్యబలసంపన్న దేశముగా మన దేశమును రూపొందింపగోరుచున్నారా? మీ రాలాగు కోర రని నాగట్టి నమ్మకము. ఏలయన యుద్ధవిజయాలు గడించిన దేశ మేదియు చిరకాలము జీవించియుండలేదు. హిట్లరును ముస్సోలినియు ఏమైరో చూడుడు. పారిశ్రామిక వ్యావసాయక రంగాలలో అత్యంతాభివృద్ధులు గడించిన అమెరికావంటి ధనసంపన్న దేశముగా మన దేశమును తీర్పగోరెదరా?

మనది బీదదేశము. ప్రజల ఆకలిబాధ తీర్పగలిగియుండుటకు మనకు సంపద కావలసియున్నది. కాని మనసమస్య పరిష్కృత మగుటకు ఆహార మున్న చాలునా? ఎంతో ముందడుగు వేసియున్న అమెరికాప్రముఖదేశాలలో కావలసినంత సంపద ఉన్నది కదా, అక్కడ ప్రజలకు మనశ్శాంతి ఉన్నదా, నిజమైన సుఖమున్నదా? లేదు. లేనేలేదు. సంపన్నుల యిండ్లలో యువకులను యువతులను జూడుడు, తమ కున్నదాని కొకసార్థకత లేక, పని పాటు లేక త్రిమ్మరుచున్నారు. వారిలో కొందఱ కున్న సంపద కుబేరసంపద అనవచ్చు, కాని జీవితమున వారి కొక లక్ష్యము లేదు. వెఱపుగొలుపునంతగ జీవితనిరర్థకత కనిపించుచున్నది. మనకు సైన్యబలము కావలసియున్నది. సైన్యబలము మన దేశస్వాతంత్ర్యమును కాపాడుకొనుటకే కాని పొరుగు దేశాలపైబడి దోచుకొనుటకు కాదు. బీదప్రజల కడుపుచిచ్చు చల్లబఱచుటకు, మనకు సంపద కావలసియున్నది. కాని సంపదే మన దేశలక్ష్యముగ నుండదగదు. సైన్యబల ముండవలసినదే, సిరిసంపద లుండవలసినవే, వీనికంటె విశేషమైన మఱొకటికూడ మనకు కావలెను. సంపదతోబాటు శక్తియుక్తులతోబాటు శాంతినిగూడ సమకూర్చెడి అదేది?

మీకు నా సలహా-భారతదేశ ప్రాచీనచరిత్రమును జదువుడు. అశోక చంద్రగుప్త కనిష్కప్రముఖులకాలమున బలపరాక్రమములలో సిరిసంపదలలో భోగభాగ్యములలో భారతదేశ

మెంతటిసమున్నతస్థానము నధిష్ఠించియుండెనో గుర్తింపుడు. వైదికయుగమునను బౌద్ధయుగమునను అంతటి యున్నతిని సాధించిపెట్టగల గొప్ప ఆదర్శాలు మన కుండినవి. తర్వాత పతన మేలాగు ప్రాప్తించినది? పతనమునకు కారణము లేవో మనము కనుగొనవలయును. కావున భవిష్యద్భారత దేశమునురూపొందించునప్పుడు లోగడ దాని పతనమును తెచ్చిపెట్టిన దేదో దానిని మనము విడువవలయును. సమున్నతిని సముపార్జించియిచ్చిన లక్ష్యములను మనము గ్రహింపవలయును. వానితోబాటు శాస్త్ర విజ్ఞానమును పారిశ్రామిక కళలపరిజ్ఞానమును చేర్చుకోవలయును.

ఈదినాలలో భౌతికాదిశాస్త్రవిజ్ఞానమునే అన్నిటికిని ప్రమాణముగ ఆదరించుచున్నాము. "ఇది వట్టి గ్రుడ్డినమ్మకము, శాస్త్రీయము కాదు" అనుచుందుము. గతచరిత్రమును పూర్తిగా నిరాకరించుటయు, అందేమి మంచి యుండెనో, మూడువేలేండ్ల కాలము మన దేశమును దేశముగ నిలబెట్టిన వేవో గుర్తించు శ్రద్ధ పూనకుండుటయు, రెండువందలయేండ్లకు మునుపు లేనివియు కేవలము నిన్నమొన్నటివియు నగు పాశ్చాత్యాశయాల వెంటబడుటయు–ఇది శాస్త్రీయపునడవడియేనా? పాశ్చాత్త్యుల ఆదర్శాలు వారిదేశాల సమస్యలనైనను పరిష్కరింపజాలినవా? శాంతిసౌఖ్యములు వారి కున్నవా? ఉన్నట్లుగ, కనిపించుట లేదు. మఱి మన మా ఆదర్శాల వెంటబడు టెందులకు?

నాయువమిత్రులారా, మనము మనుష్యులము. ఎల్లయ్యయు పుల్లయ్యయు వచ్చి బల్ల గ్రుద్ది ఉపన్యసించి గోవులమందలను మరలించి నట్లు మనలను మరలింప జూతురు. అప్రలోభనములకు లోబడకుండ గల్గుటకై వినియోగించు కొను డని దేవుడు మనకు వివేకమును ప్రసాదించియున్నాడు. కావున మీరు భూతవర్తమాన విషయముల నన్నిటిని సేకరింపుడు, చక్కగా ఆలోచింపుడు, తర్వాత భవిష్యత్తుకు ప్రణాళిక ల నేర్పఱుపుడు. భావోద్రేకములకు లోనుగాకుడు. ఇది మీకు నా సలహా.

అన్నిటికంటె ప్రథమావశ్యకము 'శీలము'. శీలము లేనిదే ఏ ఘనకార్యమునుగాని సాధింప జాలము. మహాత్మాజీని పరికింపుడు. తన శీల ప్రభావముచే ఎట్లు ఆయనమన దేశము నుద్ధ్రాత లూపెనో, ఆంగ్లప్రభువుల పట్టునుండి భారత దేశమును వదలించెనో గుర్తింపుడు. ఆయన మందుగుండు అణుగుండు మున్నగువానిని ప్రయోగింపలేదు. భారత దేశమును మీరు గొప్పదేశముగా జేయగోరుదురేని మొదట మీశీలమును రూపొందించుకొనుడు. పిమ్మట మీవివేకమును వినియోగించుకొని ఎటువంటి భారత దేశమును నిర్మించుట మీ కభిమతమో నిర్ణయించుకొనుడు. తర్వాత అందుకై పాటుపడుడు, ప్రాణము నర్పింపవలసివచ్చినను అర్పింపుడు. ఇటువంటి పరిశీలనకు–శ్రీ వివేకానంద స్వాముల గ్రంథావళి మీకు చక్కనిమార్గ దర్శకమగును. భారతీయాదర్శాల శ్రేష్ఠతను సంస్కృతీ వరిష్ఠతను ఆ గ్రంథావళి మీకు తెలుపగలదు.

# శివానంద స్మృతులు - 39

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామప్రాణ

(బేలూరు మఠము)

క్రీ. శ. 1929, ఏప్రిలు 8-వ తేది (సోమవారము)

పగలు సుమారు $11\frac{1}{2}$ గంటలవేళ శ్రీమహాపురుషులు స్నానాదికములు చేసి గదిలో కూర్చుండియున్నతఱి, శ్రీ అచలానందస్వామి (కేదారబాబా) వచ్చి శ్రీవారికి ప్రణమిల్లెను మహాపురుషులు మందహాసముతో "జయము కేదారబాబా, జయము, అచలానందస్వామీ" అనిరి - అటుపై గంభీరవదనులై "జయప్రభూ! జయఠాకూరు, జయదీనశరణ్యప్రభూ!" అని పల్కుచు భోజనమునకు కూర్చుండి మరల - ఓ భగవంతుడా, మాకు శుద్ధభక్తిని ప్రసాదింపుము.- ఆడంబరముతో కూడిన భక్తిని ప్రసాదింపకుము.- పైకి చూపించుకొనెడి భక్తి వలన ఏమి ప్రయోజనము? భగవానుడు పరమ కరుణామయుడు - ఎవరేమి కోర్కొందురో - వాని కదే ప్రసాదించును." అటుపై కేదారబాబావైపు చూచుచు- -"మొదట నారాయణునకు నివేదించెదను."

"నీవు సాక్షాన్నారాయణుడవు. నీ సేవయే ముందు. ఇదిగో ప్రసాదము అందుకొనుము" అని పల్కుచు పళ్లెమునుండి ప్రసాదము కేదారబాబాకు ఇచ్చి "ఇదంతయు శ్రీఠాకూరు ప్రసాదము, మొదట నారాయణునికి నివేదించి అటుపై భుజించెదను."

"స్వామిజీ (వివేకానంద) వద్ద ఒక పాత్ర ఉండెడిది-వారు - అప్పుడప్పుడే వంటచేసి - శ్రీఠాకూరుకు నైవేద్యము పెట్టి- అటుపై మాకందఱికి నిచ్చెడివారు." 'మొదట నారాయణుని సేవ - అటుపై సొంతభోజనము' అనెడివారు. 'మా కెల్లరకును తినబెట్టి పిదప స్వయముగ భుజించెడివారు.'

కేదారబాబా వెడలిపోయిన పిదప మహాపురుషులు భుజింప నారంభించెను. ప్రక్కనే ఒకసాధువు కూర్చుండి యుండెను. ప్రసంగవశమున- మఠవాసియగు ఒకసాధువు, గ్రామములో మధుకరమెత్తి భుజించు నని చర్చ వచ్చెను. మహాపురుషులు!—"మేము కూడ ఇక్కడ మధుకర మెత్తి భుజించితిమి. అది చాలదినములక్రిందటిమాట. అప్పుడు స్వామిజీ, మఠములో క్రొత్తగ ఈ నియమము నేర్పఱిచిరి- వేకువ నాల్గుగంటలకు గంట మ్రోగింపబడును. మఠవాసు లెల్లరును లేచి, ముఖము కాళ్లు చేతులు కడుగుకొని ఆలయమునకు వెళ్లి ధ్యానింప వలయు నని. ఈ నియమమును ఎవ రే దినము పాటింపజాలరో, వా రా దినము మధుకర మెత్తికొని భుజింపవలెను. మే మంద ఱము మామూలుగ వేకువనే లేచి, 4 గంటలకు గంట మ్రోగుటతోడనే ఆలయమునకు వచ్చి ధ్యానించెడివారము. ఒక్కొక్కదినము మంచినిద్ర పట్టినచో గంట వినిపించెడిది కాదు. అట్టి తఱి స్వామిజీ ఇలాగు పల్కెడివారు. "మనమే స్వయముగ ఈ నియమమును అనుసరింపనిచో, ఇక పిల్లవాండ్రు అనుసరించెదరా? అందుచే పోయి మధుకర మెత్తి తినుము." ఒకటి రెండుసార్లు ఈసందర్భముననే మధుకర మెత్తి భుజించితిని.

సాయంత్రము మహాపురుషులు తమగదిలో కూర్చుండియున్న తఱి యువకు డొకడు వచ్చి శ్రీవారికి ప్రణమిల్లి నేలపై కూర్చుండెను. మహాపురుషులు వానిపేరు అడిగి- "నీవు ఇచట దీక్ష (మంత్రోపదేశము)బడసితివా?" అని ప్రశ్నింపనతడు- "లోగడ శ్రావణమాసమున మంత్రోపదేశము గ్రహించితిని" అని తెలిపెను.

మహాపురుషులు :- అలాగునా? మంచిదే! జపధ్యానములు చేయుచున్నావు కదా? చూడుము, ఇక్కడినుండి కాని, మఱి వేఱు చోటినుండి గాని, ఎక్కడినుండి మంత్రోపదేశము బడసినను సరే, భగవానుని నామజపము సక్రమముగ నిరంతరము చేయవలయును సుమీ. అప్పుడే ఆనందము లభించును. వానికడ అతిదీనముగ ప్రార్థింపుము—ఓ భగవంతుడా, నీవు నాకు నిశ్చలభక్తిని ప్రసాదింపుము, విశ్వాసమును అనుగ్రహింపుము, భువనమోహనమగు నీ మాయలో నన్ను ముంచివేయకుము.'' వీలు చిక్కినప్పుడెల్ల వాని నామస్మరణ చేయుము. తోడ్తోడ అత్యంత వ్యాకులమనస్కుడవై ప్రార్థింపుము.

భక్తుడు:—ఇంతకు ముందు ఎక్కువసేపు జపము చేయగల్గుచుంటిని, కాని ఇటీవల అసందర్భవశమున అంతగ చేయజాలకున్నాను.

మహాపురుషులు:—అలాగే కానిమ్ము. కాని జపధ్యానముల సమయముపై నిర్భరపడియుండవలదు. ఏకొద్దిపాటి సమయము, పది నిమిషములపాటు కాని, లేకున్న ఐదు నిమిషములపాటు కాని చేసినను పరవా లేదు. కాని మనస్సును ప్రాణముల నన్నింటిని శ్రీభగవానుని పాదములకడ సమర్పించి ఏకనిష్ఠగ చేయుము. భగవానుడు అంతర్యామి. అతడు నీలోనే యున్నాడు కాన, నీహృదయమునే చూచును. కాని నీవెంతసేపు చేయుచున్నావో లెక్కింపడు. సాయంకాలము వీలు దొరకినంతనే భగవానుని స్మరింపుము, అతిదీనముగ ప్రార్థింపుము. ''ప్రభూ, ఈ సంసారసముద్రముననే మునిగి నిన్ను మఱచిపోకుందును గాక.'' ఈ సంసారము రెండుదినాలపాటిది. ఈ మాయాజగత్తును చూచి భ్రమించి వానిని మఱువకుము. నీవు కోటీశ్వరుడవైనను సరే, లేక నీకు నూర్లకొద్ది కార్యములచేయు సామర్థ్యము కల్గినను సరే - అంతయు మిథ్యయే ఒకానొక దినము వీనినెల్ల వదలిపోవలసినదే. ఈ విషయమును సర్వదా డెందమున నుంచుకొని వానినే స్మరించుము, వానినే శరణుజొరుము. నీబాధనములనెల్ల అతడే తెంచును.

భక్తుడు: మీరు ఆశీర్వదించినచో అంతయు సరిఅగును.

మహాపురుషులు : ఆశీర్వదించుచునే యున్నాను. తోడ్తోడ హృదయపూర్వకముగ ప్రార్థించుచున్నాను. మావద్ద ఆశీర్వాదములు తప్ప మఱేమియు లేవు. ఆశీర్వదించుటకే ఇంకను మేము జీవించియున్నాము. భగవానుని మనసార పిలువుము, వానినే శరణుజొరుము. శ్రీఠాకూరు (శ్రీరామకృష్ణులు) ప్రత్యక్షముగ విరాజిల్లుచున్నారు. వ్యాకులచిత్తముతో పిల్చినచో, వెంటనే ప్రత్యుత్తర మిచ్చును. ఎవడు ఆది, దేవాదిదేవుడో, ఎవడు ఆ పరబ్రహ్మమో, అతడే బహుజనహితార్థము, లోకకల్యాణార్థము-మానవరూపమును దాల్చి ఈ యుగమున శ్రీరామకృష్ణునిరూపమున వచ్చెను. నీవు అట్టి యుగావతారుని ఆశ్రయము జొచ్చితివి. ఇక చింతింపనేల?

భక్తుడు : స్వామీ, భయముచేతను, సిగ్గుచేతను నేను మీ కొకవిషయము చెప్పక మఱుగుపఱచితిని. మాతల్లిదండ్రుల ఏడుపులు పెడబొబ్బలు వినలేక, నేను, నాకు ఇష్టములేకున్నను, గత్యంతరము లేక వివాహ మాడవలసి వచ్చినది.

మహాపురుషులు : ఓ, ఇందులో మునిగిపోయిన దేమి? జన్మ, మృత్యువు, వివాహము,

ఈ మూడును మనుష్యునిచేతిలోనివి కావు. అవెల్ల విధివశమే. వివాహము చేసికొన్నంత మాత్రముననే అంతయు ముంచుకొనిపోలేదు. ఆ అడసులోనే ఇఱుకుకొనియుండవలెనని ఎట్టి నిర్బంధము లేదు. అంతయు మంచికే. నీవు నీపనులను సక్రమముగ చేసికొనుచు, సాధనముల చేయుచుండుము. నిన్నుచూచి నీభార్య కూడ నిన్ననుసరించును. ఆమెకు కూడ జీవితోద్దేశ్యము ఒకటి కలదు కదా? కేవలము భోగవిలాసార్థమే మానవజన్మ లభింపలేదు. నీవలెనే ఆమెకూడ భగవంతునిచే సృష్టింపబడినజీవియే సుమా. నీవేలాగు శ్రీభగవానుని అంశమో, ఆలాగే ఆమెయు శ్రీజగదంబ యంశము. నీవేలాగు జీవితమును గడపుచున్నావో, అట్లుగడప ఆమెకుకూడ నేర్పుము. ఆమెఇంటిపనిపాటులతోపాటుభగవన్నామము, పూజవ్రతములు, భజనారాధనల చేయును; గురుజనుల సేవాశుశ్రూషలు చేయును. ఆమెకు ఇవన్నియు సక్రమముగ నేర్పుము. అప్పుడే జీవితము సార్థక మగును. అటులగాక నీభోగవిలాసార్థమే ఆమెను వినియోగించుకొనినచో "ఛీ" అనవలసినదే!

కామకాంచనములే మనుష్యుని మనుష్యత్వమును నశింపజేయును. అందుచే నాయనా, నేను మాటిమాటికి నిన్ను హెచ్చరించునదేమన "సంసారములోనే లీనుడవు కావల" దని.

భక్తుడు: స్వామీ, మీ ఆశీర్వాదముల బడసితిని. ఠాకూరు శ్రీరామకృష్ణుని చరణాశ్రయముననే పడియున్నాను. ఇక అంతయు సరిగా అగు ననియే నా విశ్వాసము.

మహాపురుషులు: ఇంకొకమాట. ముఖ్య విషయమే మన జీవితలక్ష్యము నెన్నటికిని మఱవకుము. జీవితము అనిత్యము, రెండు దినాలపాటిది. భోగవిలాసార్థము కానే కాదు. ఈ విషయము సర్వదా జ్ఞప్తియుంచుకొనుము.

ఇక శ్రీభగవానుని ఆలయమునకు వెళ్ళి ప్రణమిల్లి, వానిని మనసార ధ్యానించి, వాని కడ హృదయమును విప్పి ప్రార్థింపుము. భగవానుడు నీకు తప్పక శాంతి నొసంగును.

# శివానందలేఖావళి

## 64

వారణాసి
27 డిసంబరు 1915

ప్రియ హరిమహారాజ్,

నీకు నేను జాబు వ్రాసి చాలకాల మైనది. ప్రకాశము వ్రాయు జాబులద్వారా అప్పుడప్పుడు నీవార్తలు నాకందుచుండును లెమ్ము. నీ ఆరోగ్య మెట్లున్నది? చిల్కాపేటలో మంచు పడినదా? చలి చాల హెచ్చిపోయినది లే. మంచు పడునేని చలి ఇంకను మిక్కుటమగును. ఆవు పాలిచ్చుచునే యున్న దనుకొందును. పాల కేమైన కాటక మేర్పడినదా? కుటీరనిర్మాణ మెంతవఱకు సాగినది?...

జనవరినెల ప్రారంభమప్పటికి మఠమునకు పోదునేమో. మహారాజు (శ్రీ బ్రహ్మానంద స్వామి) గారు జరూ రుత్తరము వ్రాసినారు. యథాకాలము అక్కడికి చేరుకొందునని నేనును జవాబు వ్రాసితిని. మఠమునకు మరలినపిమ్మట ఆల్మోడాలోని కుటీరనిర్మాణమునకై కొంత విరాళముల ప్రోగుచేయ ప్రయత్నింతు నని

ఆయన నాతో చెప్పియుండిరి. అందుంగూర్చి నేను ఆయనకు జ్ఞ అంచితిని. గోపాలబాబు ఇచ్చిన ముప్పదిరూపాయలు నాయొద్దనున్నవి సురేంద్రసేనుడు ఇప్పటికి కొంత వసూలు చేసి యున్నాడు, మఱికొంత వసూలు చేయ నున్నాడు. అదియు అందినపిమ్మట అన్నిటిని కలిపి పంపుద మనుకొనుచున్నాను. మొత్తమెంతైన కానీ.

ఇక్కడి వార్తలు:- .తేపు మాతృశ్రీ జయంతి. అందుకు సన్నాహములు నేడు జరుగు చున్నవి. కేదారుడు జ్వరముతోను రొంప తోను కొన్నాళ్లు బాధపడినాడు. సుకులమహారాజు హోమియోపాతిక్కు వైద్యము చేయించు కొనుచున్నాడు...

ధర్మమహామండలవార్షికోత్సవము చుఱుకుగా సాగుచున్నది. కోలాహల మెక్కువగా నున్నది. అంతయు వట్టి ఆడంబరము. నా ప్రేమ ప్రణామాదుల స్వీకరింపుము. బాలురకు నా ప్రేమాశీస్సులు. తారకు ఆరోగ్యము బాగున్న దనుకొనుచున్నాను.

వకుడు తారకుడు.

## 65

రామకృష్ణ అద్వైతాశ్రమము<br>
లుగ్సా వారణాసి<br>
14 జనవరి 1916.

ప్రియహరిమహారాజ్,

8 వ తేదినాడు నీవు వ్రాసిన జాబు యథాకాలము చేరినది. సంగతులు తెలిసినవి...... మహారాజు (శ్రీ బ్రహ్మానందస్వామి) బాబురాం మహారాజు మఱికొందఱు ఢాకాకు పోవుదురు. వారితో నన్ను రమ్మని తంతె చేసిరి. కాని దైవసంకల్పానుసారము ఆదినము నాకు అతి తీవ్రమైన రొంపబాధ కలిగినది. అందుండి నే నింకను విముక్తుడను కాలేదు. ఆ సంగతిని నేను వారికి తంతిద్వారా తెలియజేసితిని. వారు మొదట కామాఖ్యకు పోయి తర్వాత ఢాకాకు చేరుకొందు రన్న వార్త పిమ్మట నా చెవిలో పడినది. ఇంతటి తీవ్రమైన రొంపతో రాత్రివేళ నిర్విరామమైన రైలుబండిప్రయాణము చేయుట మంచిది కాదు. కావున నేను పోలేదు. కాని త్వరలోనే అచటికి పోగలను. వత్తు నని తంతి ద్వారా తెలిపియున్నాను.

సుకులమహారాజు కల్కత్తాకు పోయి యున్నాడు. మహారాజు (బ్రహ్మానందస్వామి) గారు త్వరలో ఢాకాకు పోవుచున్నా రని వినుటచే అతడు పరుగున పోయెను.

ఈమధ్యకాలమున సేవాశ్రమకార్యమునకై హరిప్రసన్నమహారాజు ఇచ్చట మూడునాలుగు దినము లుండెను.

అమెరికానుండి వచ్చిన వార్తలు నా కెంతయు సంతోషకరములుగ నుండినవి. భగవత్సంకల్పముచేత స్వామీజీ తొడంగినపని సాగు నని నాకు తోచుచున్నది. లోకేశ్వరునికి జయము. నీమహిమ అపారము! ఈకార్యకలాపాలకై స్వామీజీ తనజీవితమును హవిస్సుగ నర్పించెను. నీవును నీజీవితశక్తియుక్తులను చాలమట్టు కచ్చట వినియుక్తపఱచి వచ్చియున్నావు. కావున, ఇట్టి భగవత్కార్యము ఎప్పుడు కాని వ్యర్థ మగునా? పాపము శారదుడును ఈపనిని నిర్వర్తించుచునే తన జీవితమును కోల్పోయెను. గురుదాసప్రముఖులైన అచ్చటిభక్తులు ఎంతమంది ఇందుకై పాటుపడి యున్నారు! ఎట్లో భగవంతుడు అనుగ్రహించి

ఈప్రణాళికను రక్షించెను; ప్రకాశానందుడును సమర్థుడే. ఈపని నాతని కప్పగించుట వివేకమే.

డాక్టరు జగదీశచంద్రబోసు విజ్ఞానశాస్త్ర పరిషత్సమావేశమున ఉపన్యసించుటకులక్నోకు పోయినాడు. బోషియు అతనితోనే యున్నాడు. ఇచ్చట కిరణబాబుగారి యింట వారు రెండు మూడుదినములు ఆగవలసియుండినది. అందు కేర్పాట్లన్నియు చేయబడియుండినవి. కాని వారు జరూరుగ పోవలసియున్నందున ఇచ్చట దిగ లేదు.

నాహృదయపూర్వకప్రేమ ప్రణామములను స్వీకరింపుము. నాప్రేమాశీస్సులను కానాయి, సారాం, కే—మున్నగు నందఱికిని అంద జేయుము.

సేవకుడు తారకుడు.

# శంబుక వధాంతర్య సందేశం

## శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కేశవ తీర్థస్వామివారు

శ్రీమద్రామాయణం - ఉత్తరకాండలో - శంబుకవధనుగూర్చిన కథ ఉన్నది. శ్రీరాముడు అయోధ్యాపాలనం చేస్తున్నకాలంలో శంబుకుడనేశూద్రుడు, సశరీరంగా స్వర్గానికి వెళ్లాలని ఘోరతపస్సుచేస్తున్నందున, ఆ యుగధర్మము ననుసరించి శూద్రుడు తపస్సుచేయుటకు అనధికారిగనుక, ఏతత్పాపఫలితంగా సాకేత రాజ్యంలో ఒక బ్రాహ్మణబాలుడు మరణించినట్లు, ఆ అకాలమరణరూపమైన వైపరీత్య కారణమును శ్రీరాముడు నారదర్షిద్వారా తెలిసికొని, శంబుకుని కడకేగి, అతని విపరీత తపశ్చర్యను కనుకొని, ఆతని శిరస్సును ఖండించి, ఆతనికి మోక్షమిచ్చి, మరణించిన బ్రాహ్మణబాలుని తిరిగి బ్రతికించి, ధర్మపరిరక్షణం చేసినట్లు కథ మనకు కనబడుతుంది.

ఈ కథను చూచి, శ్రీరాముడు బ్రాహ్మణ పక్షపాతి, శూద్రద్వేషి, అన్యాయంగా తపస్వియైన శంబుకుని వధించా"డని కొందఱు శ్రీరాముని గర్హిస్తుంటారు. భక్తిచేత కొందఱు పట్టించుకోకుండా పోతుంటారు. కొందఱు కథతో ఏకీభవిస్తుంటారు. రామాయణంలో ఇప్పుడున్నరీతిగా పైపైనచూస్తే ఈ శంబుక వధకథ కటువుగా కనబడుతుంది. వివేచించి చూస్తే ఈ కథలో మధ్యకాలంలో కొన్ని మార్పులుకూడా జరుపబడినట్లు మనంగ్రహించగలం. ఋషిప్రోక్తములైన పురాణేతిహాసాల్లో పెక్కుచోట్ల స్వార్థప్రయోజనసిద్ధికి, నిజవాదహారులైన కుపండితులు మధ్యకాలాల్లో తమతమ చేర్పుకూర్పులతో వైపరీత్యాలు సృష్టించారు. ఈ ఘోర్జరీలను గుర్తించగల సునిశిత దృష్టి మన కవసరం. అమృతప్రదానసమయంలో దేవతలపంక్తిలో దేవతలవేషాలతో గూర్చున్న మాయావులగు రాక్షసులను, నారాయణుడు గుర్తించి ఖండించినట్లు, ఋషుల విశాలబోధలమధ్య ఇరుక్కొని కూర్చున్న కుపండితులమిథ్యాలాపాలను మనం వివేకంతో బహిష్కరించాలె. ఈ శంబుకవధకథలో కొలదిమార్పులు మధ్యకాలాల్లో జరిగియున్నట్లు తోస్తుంది. అందుచేతనే ఈ కథలో పూర్వాపరసమన్వయం, స్పష్టత, అంతగా కనబడదు,

అయినా ఆ కథను సక్రమస్వరూపంలో సమీక్షించి, దానిమూలసందేశమును మీకు వినరిసాము.

శంబుకుడు శూద్రజన్ముడైనందున తపస్సుకు అయోగ్యుడు కాలేదు. శూద్రగుణం - శూద్రకర్మ - కలవాడైనందున మాత్రమే తపస్సుకు అయోగ్యుడైనాడు. శూద్రజన్మ కాని శూద్రకులం కాని తపస్సుకు అయోగ్యంకాదు. శూద్రగుణం - శూద్రసంస్కారం - తపస్సుకు అయోగ్యం. శూద్రగుణమంటే-బ్రహ్మవిచారణకు బ్రహ్మదర్శనమునకు కావలసిన ఉన్నత సాత్త్వికజ్ఞానవికాసము లేని జడసంస్కారమన్నమాట. శూద్రుడు తపస్సుకు అనధికారి అంటే-శూద్రసంస్కారము గల వ్యక్తి తపస్సుకు అనధికారి అని. శూద్రకులస్థులైనా విదురాదులవలె బ్రాహ్మణసంస్కృతి గలవారంతా తపోధికారులే అవుతారు. కులంకాదు, గుణం మన పూర్వీకులకు ప్రధానం. ఎక్కడ పుట్టావని కాదు, ఎక్కడ చేరుకున్నావనే మన పూర్వీకుల ప్రశ్న. శూద్రకులస్థులంతా తపోధికార యోగ్యులు కాకపోతే, శ్రీరాముని కాలంలోనే శబరివంటి బోయస్త్రీలు సైతం తపస్సు చేయడం ఎట్లు జరుగుతుంది? మహర్షులలో అనేకులు శూద్రకులాల్లో జన్మించారు. కాబట్టి శూద్రకులం గాదు-శూద్రగుణమే తపస్సుకు అయోగ్యమైంది. బ్రాహ్మణకులస్థుడైనా, బ్రాహ్మణగుణం లేనివాడు- శూద్రసంస్కారం కలవాడు-తపస్సుకు అయోగ్యుడే. అతడు తపస్సుకు పూనినా, సత్ఫలితాన్ని పొందలేడు. రావణాదులు బ్రాహ్మణజన్ములైనా, సాత్త్విక సంస్కార హీనులైనందున, బ్రహ్మరాక్షసులైనారు గాని బ్రాహ్మణులు కాలేదు.

శూద్రుడు తపస్సుకు అనధికారి అంటే - శూద్రజాతి, నీచమైనదని కాదు. దానిస్థానంలో అది ఘనమైనదే. తపోరంగానికి అతడు పనికి రాడని మాత్రమే. కానీ వ్యవసాయరంగంలో అతడు ఘనుడే. గుఱ్ఱం పాడికి పనికిరాదంటే నీచమైనదని కాదు! అది స్వారీ చేయడానికి ఎంతో ఉపయోగిస్తుంది. కామధేనువైనా - గుఱ్ఱము చేసేపని చేయడానికి అయోగ్యమైందే. దేనిలో ఉన్న సౌందర్యాన్ని దానిలో చూడడానికి విజ్ఞానచక్షువు అవసరం. తమ తమ పనులు చేయడం కష్టమని, రెండుమాత్రలివ్వడమే కదా సులభమని వైద్యవివేకం లేకుండా అందరూ వైద్యానికి దగితే ఏమవుతుంది? ఘోరప్రమాదం సంభవిస్తుంది. కడుపులోనికి తీసికొనేమందు ఘనమైనదే కావచ్చు; కండ్లలో కది వాడకూడదు. కన్నులకిచ్చే మందు ఘనమైనదే కావచ్చు; కడుపులోని కది అపాయకరం. ఏసంస్కారం కలవాడు ఆ సంస్కారానుసారం ప్రగతిపథాన్ని చూచుకోవాలె. ప్రాచీనుల వర్ణాశ్రమవ్యూహరచనాశయ మిదే! అర్జునుడు సన్న్యాసం తీసికుంటానంటే శ్రీకృష్ణుడు చీవాట్లు పెట్టి యుద్ధం చెయ్యమన్నాడు. వర్ణాశ్రమవిభజనం న్యూనాధిక భేదదృష్టితో ఏర్పడలేదు. వర్ణాశ్రమ విభజనం స్వాతంత్ర్య నిరోధకం కాదు. వర్ణాశ్రమ ధర్మ విభజనం ప్రతిమానవుడు వాని వాని స్థానంలోనుంచే, అతిసహజవిధానంలో ప్రగతిని పొందడానికి ఏర్పడిన స్వాతంత్ర్యప్రణాళిక మాత్రమే-అందఱినీ ఒకే చీకటిగదిలో కుక్కి-అందఱినీ ఒకేమార్గంలోనికి బలవంతాన ఈడ్చే -నిరంకుశచర్యకు మోక్షభూమి యైన సనాతన భారతం ఒప్పుకోదు. వానివాని సంస్కారానుసారం, ప్రతివ్యక్తీ విహితపథంలో నడచి, గమ్యమును చేరుకోవచ్చని భారతీయవర్ణాశ్రమదర్శనం. సత్యదృక్సంపన్నులైనభారతీయులు ఒకవర్ణం ఎక్కువని ఒకవర్ణం తక్కు-

వని ఎంచరు. ప్రతివర్ణం, ప్రతివర్ణధర్మం, దాని స్థానంలో అది ఘనమైనదే. అందుకనే వేద ఋషులు, సమస్తవర్ణమానవులను మాధవుని వివిధాంగములుగా సందర్శించి నరులంతా నారాయణస్వరూపులే అన్న మహాసత్యమును గానం చేశారు. సాత్వికసంస్కారం కలిగి నివృత్తి పరాయణులై విశ్వశ్రేయస్సుకై తపో జీవనం చేయగలిగిన బ్రాహ్మణులను భగవంతుని ఉత్తమాంగంగా (శిరస్సుగా) రాజసిక సంస్కారం కలిగి, శౌర్యప్రకృతిగల క్షత్రియులను పరమేశ్వరుని మహాబాహువులనుగా, రజోగుణతమోగుణసంస్కారం కలిగి, వ్యాపారకుశలులైన వైశ్యులను ఈశ్వరుని ఊరు భాగాలుగా, తమోగుణసంస్కారులై కృషి ప్రియులై యావత్సమాజసౌధమూలభూతులైన శూద్రులను దేవదేవుని దివ్యపాదాలుగా సనాతనఋషులు విరాడ్రూపసందర్శనం చేశారు. బ్రాహ్మణాపచారం భగవదపచారమే. క్షత్రియ ద్రోహం పరమేశ్వరద్రోహమే. వైశ్యనింద ఈశ్వరనిందే. శూద్రపీడనం దైవపీడనమే. అందుచేత, ఏ వర్ణమానవున కపచారం చేసినా భగవదపచారమే అవుతుంది. ఈ సత్యమును మానవజాతి ఎప్పుడూ మఱచి పోకూడదు

బ్రాహ్మణుడు తపస్సుచేత, క్షత్రియుడు వీరత్వంచేత, వైశ్యుడు వణిక్కర్మచేత-పొందే పరమార్థాన్ని - శూద్రుడు కేవల సేవాకర్మ చేతచే పొందుతాడు. తమతమ స్వధర్మ కర్మలను ఈశ్వరప్రీత్యర్థంగా చేయడమే-ప్రతి వర్ణస్థుని కర్తవ్యం. శిశువు పాలు త్రాగి జీవిస్తుంది. పెద్దవాడు అన్నం తిని జీవిస్తాడు. ఇక్కడ జీవన ధర్మం ఒకటే. కానీ జీవనసాధనం మాత్రం వేఱు. అట్టే వర్ణాశ్రమధర్మవిధానములు వేఱైనా, వర్ణాశ్రమధర్మలక్ష్యం-ఒకటే. వర్ణాశ్రమాలు కంటి అద్దాలవంటివే. అవి సత్యదృష్టిని నిరోధించడానికి ఏర్పడలేదు. సత్యదృష్టిని తగినరీతి బలపఱచడానికే ఏర్పడ్డాయి. తల్లిరొమ్ము గుడిచి జీవించదగ్గశిశువు మొక్కజొన్నకండెలు తినడం అనుచితం, అపాయకరం. మొక్కజొన్న కూడు తినవలసినవాడు స్తన్యపానానికి సాహసించడం ఎంతోదోషం. ఎంతో అపాయకరం. స్వధర్మచ్యుతి అలాంటిదే. ప్రస్తుతానికి వద్దాం.

శంబుకుడు జన్మచేత శూద్రుడు, గుణంచేత కూడా శూద్రుడు. అతడు కృషీవలధర్మార్హుడు. ఆతని సంస్కారమతనిముందుంచిన స్వధర్మం - కృషి-సేవాకర్మ. కానీ శంబుకుడేమి చేశాడు? తన స్వధర్మమును-తనకృషీవలత్వమును - తన శూద్రధర్మమును-తృణీకరించి దేహాలాలసుడై భోగతృష్ణతో తన కర్హతలేని తపోవృత్తికి ఉద్యమించాడు. శరీరంతో స్వర్గానికి వెళ్లాలని ఆతనిఆశ. తల్లక్రిందుగా తపస్సుచేయసాగాడు. ఎవనికైనా శరీరవాసన పోతేనే స్వర్గానందం లభించేది. ఆతనివాంఛ ప్రకృతివిరుద్ధం. అందుకే ఆతడు తల్లక్రిందుగా తపస్సుచేసినట్లు కథలో చిత్రింపబడింది. దేహవాసనను అంటిపెట్టికొని దేవుని చేరాలనుకోవడం మొసలిని మొద్దనుకొని, తెప్పగా చేసికొని, నదిని దాటడానికి ప్రయత్నించడం వంటిదే యని - శంకర భగవత్పాదులవా రంటారు. శంబుకుడు స్వధర్మమును విడిచి, మిథ్యావేదాంతియై, ఆ అకార్యానికే ఉద్యమించాడు. ఆతనితామస సంస్కారం తనువుతో స్వర్గానికి వెళ్ళి తప్పత్రాగి తందనాలాడడం తపఃఫల మనుకొన్నది. ఖడ్గం గొప్పదే పిఱికివాడు దాన్ని పట్టుకున్నాడు. శంబుకుడు వెఱ్ఱిమొఱ్ఱిభావాలతో తపస్సుకు ఉపక్రమించాడు. తా [illegible] వన మంతా చెఱచినటు ఆతనివల్ల ఇక పాడైపోయేవాం డెంతమందో!- శరీరంతో స్వర్గానికి వెళ్లాలని, స్వర్గతుల్యమైన

పృథ్విని నరకప్రాయంగా చేసేవాండ్లుండటా శంబుకుని అనుయాయులు ఇకబయలుదేఱకుండా ఉంటారా? కృషిప్రాముఖ్యము కృశించింది. సేవాకర్మ చాకిరిగా తోచింది. శ్రామిక సమాజంలో నిర్వీర్యత నిస్పృహత్వం నిరుద్యోగం సోమరితనం,ప్రచలితమైంది. కర్మంతా వ్యర్థమై దురదృష్టలక్షణమంటూ, శరీరం, కందకుండా, సత్రపుభోజనము మత పునిద్ర మరగి, మెట్టవేదాంతాలు చెప్పే సోమరిసోమశాసురులు సమాజంలో సందులేకుండా నిండే ప్రమాదం సంభవించింది. తమోగుణం సాత్విక వేషం వేసికొని విహరింపసాగింది. నాగళ్ళు మూలపడి, గంజాయిసాదుల యోగదండాలు రచ్చకెక్కడం ప్రారంభించాయి. పనిచేయడం పాపం; మూలన గూర్చోడం మోక్షమైపోయింది. పరమార్థంకోసంకాక, పండెముల కొరకో-పని తప్పించుకోవడం కొరకో-తపస్సులు, తలలెత్తాయి. రామరాజ్యంలో-భక్తి జ్ఞాన కర్మయోగసమన్వయస్థానమైన రామరాజ్యంలో-శంబుకుని వక్రతపస్సుచేత ధర్మగ్లాని ఏర్పడింది. బ్రాహ్మణబాలుడు చనిపోయినాడు. అంటే-కృత్రిమతపస్సులు, సోమరినిద్రలు ఎక్కువై, సత్యతపస్సాధన అనగా-ధర్మబీజం నశించే అవకాశం ఏర్పడిందన్నమాట. ప్రవృత్తిపథం పాడైతే నివృత్తిపథ మింక నిలువని మాట నిజమేకదా! సరియైనకంచె లేకపోతే గులాబీలతోట ఏమవుతుంది?

ఇట్లు సమాజపతనానికి దారితీసిన శంబుకుని, లోకపాలకుడైన శ్రీరామభగవానుడు శిక్షింపవలసివచ్చింది. ఇక్కడ ఒకవిషయం గమనించాలి. శూద్రునిమీది ద్వేషంతో, శూద్రుని ప్రగతిని సహించలేక, రాముడు శూద్రశంబుకుని సంహరించాడని, కొందఱంటుంటారు. కానీ ఇది అవిచారమూలమైన అపోహ. శ్రీరాముడు శూద్రునిగానీ శూద్రకర్మనుగానీ న్యూనపరచలేదు. చాతుర్వర్ణ్యధర్మపరిరక్షకుడు శ్రీరాముడు. సర్వవర్ణపావిత్ర్యాన్ని, గౌరవాన్ని కాపాడడం ఆయనధర్మం. శూద్రధర్మమును-స్వధర్మమును - నిర్లక్ష్యంచేసి దానిని వదలి స్వేచ్ఛగా పరధర్మమును అనుకరించడం ద్వారా నిజానికి శూద్రధర్మమును అగౌరవించింది-శంబుకుడే. కృషిధర్మమును అగౌరవించిన శంబుకుని, కృషిధర్మగౌరవంచేతనే - శ్రీరాముడు కఠినంగా శిక్షింపవలసివచ్చింది. గుహుని కౌగిటజేర్చినట్టి, శబరి ఆతిథ్యాన్ని స్వీకరించినట్టి, పతితాహల్యను పరిరక్షించినట్టి పశుపక్ష్యాదులను గూడా ప్రేమతో చూచినట్టి రాక్షసునకుసైతం రాజ్యమొసగినట్టి శ్రీరాముని విశాలప్రేమను గ్రుడ్డివాడైనా గుర్తించవచ్చు. శ్రీరాముని దివ్యాలింగనంలో సర్వులకు స్థానమున్నది. శూద్రద్వేషంతో శ్రీరాముడు శంబుకుని వధించలేదు. శూద్రధర్మమును నిర్లక్ష్యం చేసినందున - శ్రామికయోగమును, న్యూనపరచి-తామసప్రవృత్తిలో తపస్సుకు దిగి, సాత్విక తేజమును చంప నుద్యమించినందున-ధర్మరక్షణకై శ్రీరాముడు శంబుకుని శిక్షించాడు. శ్రీరాముడు తపస్సుచేస్తున్న శంబుకుని. "ఓసువ్రతా, నీ వెవరు? నీతపస్సెందుకు?" అని అడిగాడు. శంబుకుడు "నేను శూద్రుడను" అన్నాడు. "సశరీర స్వర్గప్రాప్తికి తపస్సు చేస్తున్నా" నన్నాడు ఈసమాధానంలోనే శంబుకుని సంస్కారం అర్థమవుతుంది. నేను శూద్రుడను అనేవాసన అతనికి పోలేదు. ఇక ఆశయంవిషయమా - భగవత్ప్రాప్తి కాదు-దేహంతో స్వర్గభోగాలు అనుభవించటం మాత్రమే అతనిఆశయం. శంబుకుని సంస్కృతి, శంబుకుని ఆశయం-ఎంతో పేలవమయింది. తాను పతితుడై, సమాజపతనానికి దారితీసిన

శంబుకుని ఆ రెండుమాటలు విని-శ్రీరాముడు, చంద్రహాసంతో వానిశిరస్సును ఖండించి మోక్షాన్ని ప్రసాదించినట్లు కథలో మనం చూస్తాము. చంద్రహాసంతో తలనరికాడు: మోక్షమిచ్చాడు. కానీ ఇక్కడ మనం-చంద్రహాసమంటేచల్లని మందహాసము-అని గ్రహించి, తల నరకడమంటే - తల మార్చడమని-బుద్ధి మార్చడమని-తాత్పర్యం తీసికోవచ్చు. అంటే శ్రీరాముడు శంబుకుని దేహవాసనను, తమోమయ ప్రకృతిని గ్రహించి చిరునవ్వు నవ్వి, ఆ శంబుకుని తప్పుడుతలంపును ఖండించి. అతనికి సన్మార్గమును చూపి సత్యస్వర్గమునకు అధిగమింపచేశా డన్నమాటకాక తలతీశాడే అనుకున్నాము. తలంపు మార్చడానికి (జ్ఞానప్రదానానికి) తప్పనిపరిస్థితిలో తలతీసినా, ప్రేమావతారమూర్తియైన శ్రీరామునకు దోషం లేదు. తల్లి-పాలు పోసినా, కారపు ఉగ్గుపోసినా, - రెండూ శిశురక్షణార్థమైన వాత్సల్యవిలాసములే! శంబుకుని మరణంతో కథలో బ్రాహ్మణ బాలుడు పునర్జీవిస్తాడు. దేహవాసన నశిస్తే బ్రహ్మజ్ఞానం ఉదయిస్తుందని నీతిపాఠం. కృత్రిమాను కరణాలు, డాంభికవిధానాలు, స్వార్థ భావాలు, వక్రకృత్యాలు నశించినప్పుడు, సత్యజ్ఞానకిరణం జీవితరంగంమీదికి ప్రసరిస్తుందని నీతిపాఠం!

"అహంకృతిని దేహభావమును వదలక, లోన ఉంచుకొని, పరమేశ్వరుని విశేషాధిక్యముపైహక్కు ఆశించినవాడు గర్వపర్వతశిఖరంపైన దుఃఖసంకులము లనేగ్రద్దలచే పొడవబడి చీల్చి వేయబడక తప్పదు"-అన్న శ్రీరామ తీర్థమహావాక్యమును, శంబుకవధాంతర్యసందేశంగా మనం గ్రహించవచ్చు. ఈకథను మన మీవిధంగా అర్థంచేసికోవడమే న్యాయం! శుభదాయకం!

ఓం తత్ సత్

# వారలు - విశేషాలు

## రామకృష్ణానందస్వామి జయంతి

శ్రీరామకృష్ణుని అంతరంగశిష్యులలో అన్యతముడును మదరాసు శ్రీరామకృష్ణమఠస్థాపకుడును ఐన (శశిమహారాజు) రామకృష్ణానంద స్వాముల 108-వ జయంతి తిథిపూజ మైలాపూరుమఠంలో జూలై 31-వ తేది శుక్రవారం నాడు భక్తితో వైభవంతో జరుపబడింది. మఠ భవనమును ప్రాకారమును ఆకర్షకంగా అలంకరింపబడినవి. దినకార్యక్రమం మంగళహారతితో మంగళవాద్యాలతో ప్రొద్దున 5 గంటలకు గుడిలో ప్రారంభమైనది. రామకృష్ణానందస్వాముల పెద్ద చిత్రపటమును అలంకరించి వేదికపై నెలకొల్పారు. భక్తబృందం పూర్వాహ్ణమంతా భజనసంకీర్తన సాగించింది. ఉపనిషత్తుల, భగవద్గీతల అనుసంధానము దేవీమాహాత్మ్యపారాయణము ప్రత్యేక పూజ హోమం భక్తులకు ప్రసాదవినిమయం ముగిసేటప్పటికి ఒంటిగంట ఐనది. వివేకానంద కాలేజి ఎన్సీసి విద్యార్థులు ఉత్సవనిర్వాహంలో తోడ్పడ్డారు. సాయంపూజానంతరం మఠమండపంలో సమావేశమైన భక్తగోష్ఠిలో శ్రీ విరూపాక్షానందస్వామి శశిమహారాజ జీవితచరిత్రం లోంచి ముఖ్యఘట్టాలు చదివి వినిపించారు. శ్రీమత్కైలాసానందపరమాత్మానందస్వాములు రామకృష్ణానందస్వాముల జీవితమును గురించి ఆయన సాధించిన కార్యాలనుగురించి ఉపన్య

సించారు. ప్రమాణగ్రంథాల్లోంచి ఉదాహరణములు ఉద్ఘాటించారు. శశిమహారాజుశీలంలోని మేలుములను మననం చెయ్యండి అని సదస్యులను ప్రోత్సహించారు.

ఆగస్టు 2-వ తేది భానువారం మధ్యాహ్నానంతరం బహిరంగోత్సవము ప్రారంభింపబడింది. బ్రహ్మశ్రీ టి. ఎస్. బాలకృష్ణశాస్త్రిగారు 3 గంటలనుండి 5 గంటలవఱకు ఉద్ధవచరిత్రమునుగూర్చి శ్రోతృజనరంజకంగా సంగీతోపన్యాసం కావించారు. 5-30 గంటలకు పౌరమహాసభ ప్రారంభం అయింది. మంత్రపుష్పం ప్రార్థనగేయం ముగిశాక మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు సదస్యులకు స్వాగతమంగళం అనుగ్రహించి సభాధ్యక్షులైన విజయనగరరాజకుమారులగు పి. వి. గజపతిరాజుగారిని, ఉపన్యాసకులను పరిచయపఱిచారు. శశిమహారాజమాహాత్మ్యమును గూర్చి ప్రసంగిస్తూ ఈలా గన్నారు: చిన్న సంస్థగా ప్రారంభమైన రామకృష్ణమిషను ఇంతగా పెంపొందడానికి ఆయనే కారణం. ఫలితం గొప్పదిగా ఉంటే కారణమును గొప్పదిగా ఉండియుండవలె అను న్యాయ ముంది కదా. ఎటువంటి కష్టపరిస్థితులలో శశిమహారాజు తనకార్యప్రణాళికను నిర్వహించాడో తలంచుకుంటే ఆయన కుండిన నిర్మాణశక్తిసామర్థ్యాలు కొంత గ్రహించగలం. ఘనకార్యసాధకునకు వలసిన గుణాలతో ఆయన అవతరించాడు. ఘనకార్యప్రారంభకులకు సాధారణంగా కలిగే చిక్కులు, శోధనలు ఆయనకూ కలిగాయి. కాని ఆయనధైర్యంతో భగవద్విశ్వాసంతో సౌజన్యప్రాభవంతో ఎదుర్కొని చిక్కుల నతిక్రమించి తనఉద్యమం విజయవంతం అయ్యేటట్లుగా చేశాడు. ఆయనలో ప్రాచీన విజ్ఞానమును ఆధునికసంస్కృతియు కలిశాయి. సమస్యలను ఆయన ఎదుర్కొనే విధంలో స్వాతంత్ర్యం ఉండేది. ఆయన ప్రసంగాలలో రచనలలో ఆయన పద్ధతులలో సన్నిహితులను ముగ్ధుల నొనర్చే శక్తియుండేది. భక్తిసాఫల్యానికి ఆయన ప్రజ్వలోదాహరణం. దక్షిణభారతదేశంలో కార్యప్రణాళికను సాగించడానికి యోగ్యుడీయనే అని గుర్తించి శశిమహారాజును శ్రీవివేకానందస్వామియే ఎన్నుకొన్నా రనడం మఱవకండి. మద్రాసులో ఒక కేంద్రం నెలకొల్పవలె నని, వివేకానందస్వాములు ఇచ్చటి ప్రజలలో కలిగించిన సముత్సాహమును స్థిరపఱచాలని-పౌరప్రముఖులు 1897లో వివేకానందస్వామిని ప్రార్థించారు. "మీలో అత్యంతవైదికులకంటె అధికవైదికుడైన ఒకనిని పంపెదను" అని చెప్పి కల్కత్తాకు చేరుకున్న శ్రీవివేకానందస్వామి మఱినావలోనే శశిమహారాజును మద్రాసుకు తరలించారు. శశిమహారాజు మొదట అపరిచితవ్యక్తిగా మద్రాసుకు వచ్చారు. 1897 నుండి 1911 వఱకు పదునాల్గు సంవత్సరాలు ఆయన పాటుపడ్డాడు. ఆయనపట్ల మన కృతజ్ఞత సడలకుండాలి. ఆయన ఆత్మ ఇంకా ఇక్కడ కార్యసాధకంగానే ఉంటున్నది. వచ్చి పని ప్రారంభించినప్పుడు ఆయన చేతిలో గురుమహారాజు చిత్రపటంతప్ప వే ఱేమీ లేదు. ఈ దినం ఈ సంస్థ యావద్దక్షిణభారతదేశంలో వేరులు పాఱిఉంది. తల్లిదండ్రులను కోల్పోయిన శిశువులపై స్వామిహృదయమున ఉప్పొంగిన కనికరము నుండి "స్టూడెంట్సుహోము" విద్యార్థుల విడిది పుట్టువొందింది. అందుండి క్రమక్రమముగా లెక్కకు మిక్కిలియైన విద్యాసంస్థలు రూపొందినవి. మదరాసుకువిచ్చేయుటకు ముందు రామకృష్ణానందస్వామి వంగదేశంలో ప్రారంభదశలో ఉండిన మఠాన్ని పోషించేందుకు అను

పేక్ష్యంగా పాటుపడ్డారు. మఱుపూటకు భోజనము లభించుట సందేహాస్పదముగ నుండిన కష్టకాల మది. 1886 నుండి 1897 వఱకు పదకొండు సంవత్సరాలు స్వామి ఆలాగు శ్రమించారు. హనుమంతుని తలపుకు తెచ్చారు. మఠానికి పురోహితుడు, వంటవాడు, బంట్రోతు అన్నీ తానే. దక్షిణ దేశమునకు తరలవలసినదని వివేకానందస్వామి కోరగానే శశి ఆమాటను గురువాక్యంగానే తలదాల్చి ఇటు వచ్చి దక్షిణంలో అనేక రామకృష్ణ కేంద్రాలను ఏర్పఱచారు. గురుదేవుని ఆయనపూజచేస్తున్నప్పుడు అది దేవతలకుసైతం దర్శనీయంగా ఉండేది. అందఱిని తనయొద్దకు చేరదీసికొనే మహిమ ఆయనకుండింది. అన్ని యోగాలు ఆయనలో మిళితములైనాయి. ప్రజోద్ధరణకై ఆయన తనజీవిత సర్వస్వం అర్పించారు. మానవ చరిత్రలో ఇదొక క్లిష్టయుగం. ప్రాచీనపువిలువలకు ఆపద వాటిల్లుతోంది. సనాతనాదర్శాలు అంధవిశ్వాసాలని త్యజింపబడుతున్నాయి. ఇట్టిపరిస్థితులలో మన సంస్కృతిధనాన్ని నిలుపుకోవాలంటే శశిమహారాజును అనుసరించాలి. మదరాసుకు బాధ్యత ఎక్కువ. ఇక్కడ నేలను తవ్వి చూచామంటే శశిభూషణుని ముద్ర కనబడుతుంది.

తమిళనాడు సర్కారు డెప్యూటీసెక్రటరీగా ఉండి విరామంచెందిన శ్రీ ఎన్. మురుగేశ ముదలియారు తమిళంలో ఉపన్యసించారు. ఆచార్యులు వెలసిన దక్షిణభారత దేశమున రామకృష్ణానందస్వామి నిర్వహించిన సేవాకార్యప్రణాళిక ఎంత అద్వితీయమైందో ప్రమాణపూర్వకంగాప్రస్తుతిస్తూ ఈలగన్నారు. "భగవత్కైంకర్యమునకు నిస్స్వార్థబుద్ధితో తన్నర్పించుకొన్న స్వామి జీవితం ప్రజ్జ్వలోదాహరణం. తల్లిదండ్రులకు అనురూపుడైన కుమారు డితడు. విద్యార్థిదశలోనే శ్రీరామకృష్ణునివంకకు శశి ఆకర్షింపబడ్డాడు. శశి గురుదేవునిసన్నిధిలో ఉండినది మూడేండ్ల కాలమే అయినా అతనికి లభించిన అనుగ్రహమున్ను పరిపూర్ణతయు అపరిమితములు. గురుదేవునిపూజ ఆయనకు కేవల మొక పూజారి కృత్యం కాదు. అందఱు ఆయనను సంఘమునకు మాతృస్థానీయుడనిన్నీ మూల స్తంభభూతుడనిన్నీ గుర్తించారు. సేవామహిమ బహుమత సమన్వయసాధకమైన దృష్టివిశాలత వైరాగ్యగరిమ హృదయమార్దవసమ్మిళితమైన శిక్షకుని కఱకుదనము ఇష్టదైవమును గురుదేవుడును ఒక్కరే అనెడి విశ్వాసం-ఇవన్ని రామకృష్ణానందస్వాముల జీవితజ్యోతిలోని వెలుగులు."

వివేకానందకాలేజి ప్రొఫెస్సరు డాక్టరు ఎస్. వేణుగోపాలంగారు ఆంగ్లంలో ఉపన్యసించారు. ఆ ఉపన్యాససంక్షేపం: "కర్మజ్ఞానభక్తుల నెడి నదులకు పుట్టుకచోటైన మహోన్నతహిమవంతంవంటివాడు శ్రీరామకృష్ణుడు. సచ్చిదానందసాగరంనుండి రూపుదాల్చిన శ్రీరామకృష్ణ మేఘం దక్షిణేశ్వరంనుండి కురిసిన జ్ఞానామృతం, శిష్యవరేణ్యుడైన వివేకానందుని మూలంగా ఖండఖండాంతరవ్యాప్తమైనది. దక్షిణభారతదేశంలో ప్రవహించిన త్రివేణి - (1) శ్రీరామకృష్ణుని వెలుగువాక, ధాటీమండితమైన వివేకానందుని వాణి, రామకృష్ణానందుని వివేకానురాగవృష్టి;(2)శ్రీరామకృష్ణుడు గంగ, వివేకానందుడు యమున, శశిమహారాజు సరస్వతి; (3) మఠమునకు ఆత్మ శ్రీరామకృష్ణుడు, తల్లి వివేకానందుడు, దాది శశిమహారాజు. (4) శ్రీరామకృష్ణుడు మూలమూర్తి, వివేకానందుడు ఉత్సవమూర్తి, శశిమహారాజు గుడిపూజారి; (5) మఠమునకు బీజం శ్రీరామకృష్ణుడు, అంకురింపజేసినవాడు వివేకానందుడు, దిగంతవ్యాప్తమహావృక్షంగా

పెంపొందజేసినవాడు శశి. (6) శంకర-రామానుజమధ్వపథములు వెలసిందిన్నీ దక్షిణభారతదేశంలోనే. శశిమహారాజజీవితాన్ని నాల్గుదశలుగా భాగించవచ్చు. (1) తండ్రిశిక్షణలో ఉన్న ఇరవైయేండ్లు (1863-1883) (2) గురుదేవుని సేవలో గడచిన మూడేండ్లు (1883-1886) (3) బరానగర-ఆలంబజారుమఠాలలో గురుదేవుని అస్థికల ఆరాధనంలో సోదరశిష్యుల సేవలో గడచిన పదకొండు సంవత్సరాలు (1886-1887) (4) దక్షిణభారతమున ముఖ్యంగా మద్రాసులో విశ్వమానవసేవలో గడచిన 14 ఏండ్లు. (1897-1911) 'దివ్యులరగుడు' 'తోడివారిని దివ్యులనుగ నొనర్పుడు' అనే శ్రీవివేకానందస్వాముల ఉపదేశాన్ని శశిభూషణుని అనుష్ఠానంలో గుర్తించవచ్చు. సర్వమతసర్వసిద్ధాంతసమన్వయం, శశిబోధనల హృదయం.

సభాధ్యక్షులు శ్రీగజపతిరాజుగారు శశిజీవితం సర్వతోముఖప్రాముఖ్యసమంచితమని ప్రస్తుతించారు.

శ్రీ కృ. బాలసుబ్రహ్మణ్యయ్యరుగారి వందనసమర్పణంతో సభ ముగిసింది.

ఆరాత్రికమునకు తర్వాత మఠమండపంలో మఠభజనబృందంవారు ప్రియానందస్వాముల ఆధ్వర్యాన గంటన్నరసేపు కాళికీర్తనం జరిపారు.

# గ్రంథ పరిచయం

## శంకరకృప

ఇదొక మతాధ్యాత్మికమాసపత్రిక. దీనికి సంపాదకులు శ్రీ టి. రామలింగేశ్వరరావుగారు బి. ఎస్సి. ప్రకాశకులు శ్రీ జె. నారాయణమూర్తి విజయవాడ 2. శ్రీ శంకరకృప కార్యాలయంనుంచి వెలువడుతుంది. దీని సెప్టెంబరు ప్రత్యేకసంచిక మాకు అందింది. పుటలు 94. వెల రూపాయి. వివిధత విశిష్టత గల్గి వ్యాసాలు పత్రికాలక్ష్యానికి సాధకాలుగా ఉన్నాయి.

## శ్రీవాసపదార్పిత శతపత్రము

రచయితయు ప్రాప్తిస్థానమున్నూ విద్వాన్ నడాదూరి విజయ రాఘవాచార్యులు, 35 శ్రీనివాసయ్యంగారుస్ట్రీట్, మద్రాసు 33, పుటలు 22, వెల 30 పైసలు.

ఇది శ్రీ వేంకటేశ్వరమకుటాంచితమైన శతకం. హృదయాన్ని హృదయాధినాథునెదుట విప్పి తెల్పుకొను విధానవిశేషమైన శతకంగా అఱువై ఉత్పలాలలోను నలభై ఆఱు చంపకాలలోను రూపొంది రచయితగారి పద్యరచనావ్యాసంగం. ఇందు చరితార్థమైంది.

## శ్రీరామనామ మహిమానుకీర్తనము

మచిలీపట్నం ప్రార్థనాసంఘసభ్యులయిన సూరె అప్పారావుగారున్నూ వారిసతీమణి వెంకటనరసమ్మగారున్నూ భక్తులకు ఉచితంగా అందజేస్తున్న 'హనుమాన్ చాలీసా' సమేతమైన చిఱుత కీర్తనపుస్తకం ఇది. భక్తిసంజాతమైన యిది భక్తికి సంజనకమున్నూ కాగలదు. ప్రాప్తిస్థానం:- సూరె అప్పారావు, జనరల్ మర్చంటు, రాబర్ట్సన్ పేట, మచిలీపట్నం, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

ప్రభాకర్

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　　　రెండవ కూర్పు　　　　వెల: రూ. 4-00

నూతన ముద్రణము!　　　　　　　　　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　　　ఆఱవ కూర్పు　　　　వెల: రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు ; కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము—సర్వవిధముల నమూల్యమైన గ్రంథ రాజము. —శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * * —శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

శ్రీ రామకృష్ణ పరమహంస జీవితము ఇందు సంపూర్ణముగ వివరింపబడియున్నది. శ్రీవారు కావించిన సాధనవిధానము, వారు లోకమునకు అనుగ్రహించిన సందేశము విపులముగ భక్తజనుల కందింపబడియున్నది.

526 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 5-00

---

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

---

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭  ౧౯౭౦ - నవంబరు : సాధారణ - కార్తికము  సంచిక ౫

## విషయసూచిక

# తెలుగు, తమిళ పాఠకుల అరుదైన అవకాశం

## ఈ క్రింది పుస్తకాల ధరలో 25 శాతం తగ్గింపు

పుస్తకాల ఖరీదు పంపి లాభం పొందండి.
తపాలా ఖర్చులు అదనం.

## తెలుగు

### శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణ గ్రంథావళి కిది తేటతెనుగున అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్ూ. 51-50 | కాలికో | ర్ూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 38-63 | ,, | ర్ూ. 48-75 |

## తమిళం

### 1. స్వామి వివేకానన్దరిన్ జ్ఞానదీపమ్

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణ గ్రంథావళి కిది సరళ తమిళములోనికి అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్ూ. 50-00 | కాలికో | ర్ూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 37-50 | ,, | ర్ూ. 48-75 |

### 2. స్వామి వివేకానంద

రచయిత : రా. గణపతి

(పుటలు 895)

స్వామిజి జీవితచరిత్రం ఇందు విపులంగా పొందుపఱుపబడి ఉన్నది.

| | | |
|---|---|---|
| అసలు ఖరీదు | కాలికో | ర్ూ. 9-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 6-75 |

పుస్తక విక్రేతలకు $33\frac{1}{3}$ శాతము కమీషను ఈయబడును.

శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: **మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**

'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౦ – నవంబరు : : సాధారణ – కార్తికము { సంచిక ౫



శ్రీః

## వివేకచూడామణి



మూలము — శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య



కో నామ బన్ధః? కథ మేష ఆగతః? కథం ప్రతి ష్ఠాస్య? కథం విమోక్షః?
కో ఽసా వనాత్మా? పరమః క ఆత్మా? తయో ర్వివేకః కథ? మేత దుచ్యతామ్. 49

బంధ మనగా నేమి? అది ఎట్లు వచ్చినది? ఎట్లు నిల్చియున్నది? దానినుండి విడుపొందు టెట్లు? ఈ అనాత్మ యనగా నేమి? పరమాత్మ ఎవ్వరు? అనాత్మను పరమాత్మను వేఱుపఱచి తెలిసికొను టెట్లు? ఈ విషయములను దెల్పుమా. ౪౯

గురు రువాచ :

ధన్యో ఽసి, కృతకృత్యో ఽసి, పావితం తే కులం త్వయా,
య దవిద్యాబన్ధముక్త్యా బ్రహ్మీభవితు మిచ్ఛసి. 50

గురువు చెప్పుచున్నాడు :

ఓయీ, నీవు ధన్యుడవు, కృతకృత్యుడవు, నీచే నీకులమంతయు పవిత్రమైనది, ఏలయన అవిద్యాబంధమును వదలించుకొని బ్రహ్మముగా నగుద మని కోరుచున్నావే. ౫౦

ఋణమోచనకర్తారః పితు స్సన్తి సుతాదయః,
బన్ధమోచనకర్తా తు, స్వస్మా దన్యో న కశ్చన. 51

ఋణములనుండి విడిపించుటకు తండ్రికి పుత్త్రాదు లున్నారు. (సంసార)బంధమునుండి విము క్తి నన్ననో తనకు తానే సాధించుకోవలసినది. (సాధించిపెట్టువా రొరు లెవ్వరును లేరు.)

మ స్తకన్య స్తభారాదే ర్దుఃఖ మన్యై ర్నివార్యతే,
క్షుధాదికృతదుఃఖం తు, వినా స్వేన న కేనచిత్. 52

తలపై నున్న బరువు మోయ లేక యొక డవస్థపడుచున్నా డనుకో, మఱొక డాదుకొని యతనికష్టము తీర్పవచ్చు. ఆకలి మున్నగు బాధ లట్టివి కావు. ఎవడు కాని తాను భుజించియే తన యాకలి తీర్చుకోవలె. మఱొకడు భుజించినచో, వీని యాకలి తీరదు. ౫౨

పథ్య మౌషధసేవా చ క్రియతే యేన రోగిణా
ఆరోగ్యసిద్ధి ర్దృష్టా ఽస్య, నాన్యానుష్ఠితకర్మణా. 53

రోగి కారోగ్యము సిద్ధింపవలె నన్న, అతనికై యౌషధము నితరులు సేవించిన గాదు; ఔషధము నతడే సేవింపవలెను; అతనికై పథ్యము నితరులు పాటించుట పనికి రాదు, ము నతడే పాటింపవలెను. ౫3

వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా స్వేనైవ వేద్యం, న తు పణ్డితేన,
చన్ద్రస్వరూపం నిజచక్షుషైవ జ్ఞాతవ్య, మన్యై రవగమ్యతే కిమ్? 54

వస్తువును జూచిన పండితుడు ఎంత వర్ణించి చెప్పినను మనకు జాలదు. సమర్థమైన మనసొంతజ్ఞాననేత్రముతో జూచిననే వస్తుస్వరూప మవగత మగును. చంద్రస్వరూపము నెఱుగ వలె ననిన సొంతకంటితో జూడవలెను, కాని గ్రుడ్డివానికి ఆ యెఱుక నితరులు కలిగింపగలరా?

అవిద్యాకామకర్మాదిపాశబన్ధం విమోచితుమ్
క శ్శక్నుయా ద్వి నాత్మానం కల్పకోటిశతై రపి 55

జననమరణసుఖదుఃఖానుభవాలకు కారణము కర్మము; కర్మమునకు ప్రేరకము కామము; కామమునకు ఉత్పాదకము అవిద్య. అవిద్య యనగా స్వస్వరూపజ్ఞానము లేకపోవుట. ఎవడు గాని ఈ పాశములబంధమునుండి తన విడుదలను తాను సంపాదించుకోవలసినదే కాని, నూఱుకోట్లకల్పములకైనను సరే విడుదలను ఒకనికి మఱొక డెవడు చేకూర్పగలడు? ౫౫

న యోగేన, న సాంఖ్యేన, కర్మణా నో, న విద్యయా,
బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్ష స్సిద్ధ్యతి నాన్యథా. 56

మోక్షము జీవబ్రహ్మైక మాత్రమే సిద్ధించును గాని, వేఱు దేనిచేతను సిద్ధింపదు. (హఠ)యోగము కాని, సాంఖ్యము కాని, కర్మము కాని, విద్య కాని- మోక్షమునకు సాక్షాత్సాధనములు కావు. ౫౬

వీణాయా రూపసౌన్దర్యం తన్త్రీవాదనసౌష్ఠవమ్
ప్రజారఞ్జనమాత్రం త, న్న సామ్రాజ్యాయ కల్పతే. 57

వీణకు గల రూపసౌందర్యమును, తీగలను మీటుచు వాయించుటలో గల నేర్పును ప్రజారంజనమునుమాత్రము సేయగలుగునే కాని చక్రవర్తిపదవిని సంపాదించి పెట్టజాలవు. ౫౭

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్
వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్తయే, న తు ముక్తయే. 58

మాటలగారడి - ఉపన్యాసధాటి - శాస్త్రార్థముల వివరించునేర్పు - పాండిత్యము అనెడి యివి పండితులకు భుక్తిసాధకములే కాని ముక్తిసాధకములు కావు ౫౮

అవిజ్ఞాతే పరే తత్త్వే, శాస్త్రాధీతి స్తు నిష్ఫలా,
విజ్ఞాతే ఽపి పరే తత్త్వే, శాస్త్రాధీతి స్తు నిష్ఫలా. 59

పరతత్త్వజ్ఞానము కలుగకుండునంతవఱకు చదివిన శాస్త్రాల చదువంతయు వ్యర్థమే. పరతత్త్వజ్ఞానము కలిగినపిమ్మటనో, చదివిన శాస్త్రాల చదువంతయు వ్యర్థమే. సిద్ధి కలుగవలసి యుండగా దానిని కలుగజేయజాలని సాధనములు అక్కఱ లేదు; సిద్ధి కలిగినపిమ్మట ఏ సాధనములు అక్కఱ లేదు. ౫౯

శబ్దజాలం మహారణ్యం, చిత్తభ్రమణకారణమ్,
అతః ప్రయత్నాజ్ జ్ఞాతవ్యం తత్త్వజ్ఞై స్తత్త్వమాత్మనః. 60

శాస్త్రరూపమగు శబ్దజాల మొక పే రడవి వంటిది. దానివలన మనసునకు కలుగునది త్రిప్పట మాత్రమే. కావున వివేకులు ఆత్మతత్త్వ మెఱుగుటకే జతనపడవలయును. ౬౦

అజ్ఞానసర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా,
కిము వేదై శ్చ, శాస్త్రై శ్చ, కిము మన్త్రైః కి మౌషధైః? 61

అజ్ఞాన మొకపాము; ఆ పాముకాటువడిన వానికి వేద-శాస్త్ర-మంత్ర-ప్రముఖములైన కుత్సితౌషధములవలన నేమి లాభము? అతనికి కావలసినది బ్రహ్మజ్ఞాన మనెడి యమోఘౌషధమే. ౬౧

న గచ్ఛతి వినా పానం వ్యాధి రౌషధశబ్దతః,
వి నాపరోక్షానుభవం బ్రహ్మశబ్దై ర్న ముచ్యతే. 62

'మందు' 'మందు' 'మందు' అని ఉచ్చరించుచున్నంతమాత్రమున వ్యాధి తొలగదు; మందును త్రాగిననే అది తొలగును. అట్లే బ్రహ్మము బ్రహ్మము అని ఉచ్చరించుచున్నంత మాత్రమున (సంసారబంధ) విముక్తి కలుగదు. అపరోక్షబ్రహ్మానుభూతిచేతమాత్రమే అది కలుగును. ౬౨

అకృత్వా దృశ్యవిలయ మజ్ఞాత్వా తత్త్వ మాత్మనః
బ్రహ్మశబ్దైః కుతో ముక్తి రుక్తిమాత్రఫలై ర్నృణామ్. 63

దృశ్యజగము విలయ మొందవలెను, ఆత్మతత్త్వ మెఱుకపడవలెను, ఇది జరుగకుండ, ఊరక బ్రహ్మము బ్రహ్మము అని శబ్దించుచున్నచో నరులకు ఫలించునది ఉక్తిమాత్రమే. ముక్తి యెక్కడిది? ౬౩

అకృత్వా శత్రుసంహార మగత్వాఖిలభూశ్రియమ్
రాజాహ మితి శబ్దా న్నో రాజా భవితు మర్హతి. 64

శత్రువులను సంహరింపక, సర్వభూమండలసంపదల బడయక, ఊరక 'నేను చక్రవర్తిని' అని వాగుచుండుటచే నెవడును చక్రవర్తి కాజాలడు. ౬౪

(సశేషము)

# పరమహంస దేవుని ప్రబోధవాణి

మ: దేవుని ప్రత్యక్షముగ జూచుట సాధ్యమా?

గురుదేవుడు: ముమ్మాటికిని సాధ్యమే. దేవుని జూడవలయుననిన, అందుల కప్పుడప్పు డేకాంతమున నుండుట, భగవన్నామమును జపించుట, సంకీర్తనముసేయుట, తథ్య మిథ్యలను వివేచించుట—అనెడి ఇవే అవలంబింపదగిన సాధనములు.

మ: దేవుడగపడవలె ననిన, అందుల క-క్షితము లేవి?

గురుదేవుడు: హృదయమున గాటమైన యాతురముతో దేవు నుద్దేశించి మొఱపెట్టుము. నీకు దర్శనము తప్పక లభించును. అందఱును భార్యలకొఱకును, బిడ్డలకొఱకును కడవలునిండ కన్నీరు కార్తురు. ధనమునకై కన్నీళ్ళలో నీదులాడుదురు. దేవునికొఱ కేడ్చువారెవరు? దేవునికై ఏడువుము, వాస్తవముగ ఏడువుము.

చూడవలెననెడి యాతుర మరుణోదయము వంటిది. అరుణోదయానంతరము సూర్యోదయము, ఆతురము పుట్టినపిదప భగవత్సాక్షాత్కారము. ఇహపరుల కైహిక సంపదయందున్నట్టి యాస, తల్లికి బిడ్డయందున్నట్టి యాస, సతికి పతియందున్నట్టి యాస—ఈమూ డాసల యుద్రేకము నొక్కటిగా గూడిన ఎంతయగునో ంతగా భక్తుడు భగవంతునికై యుబలాట పడునేని అతనికి దేవుడు దర్శనము ననుగ్రహించును. ఈ మూడాశల శక్తి ఒక్కటిగ గూడిన ఎంతో అంతటి యాతురము దేవునం దెవనికి గలుగునో అతనికి భగవత్సాక్షాత్కారము గలుగును. అనగా - తల్లి బిడ్డల నెంత ప్రేమించునో భక్తుడు భగవంతు నంత ప్రేమింపవలెను: పతివ్రత భర్త నెంత ప్రేమించునో భక్తుడు భగవంతు నంత ప్రేమింపవలెను. ఇహపరులు ధనము నెంత ప్రేమింతురో భక్తుడు భగవంతు నంత ప్రేమింపవలెను. ఈముబ్విధముల ప్రేమ శక్తిని ఆకర్షణశక్తిని ఒక్కటిగ జేర్చి ఆమొత్తమును భగవంతునివైపు మరలింపుము. అప్పుడు నీవు తప్పక భగవంతుని జూడగలవు.

ఉబలాట పడుచున్న హృదయముతో దేవుని బ్రార్థింపవలయును. మ్యావు మ్యావు మని యఱచుచు తల్లిని బిలుచుట యొక్కటే పిల్లికూనకు తెలిసినది. తన్ను, తల్లి యెచ్చట నుంచినను, ఆ కూనకు సంతోషమే. ఒకప్పుడు వంటయింటను, ఒకప్పుడు నేలమీదను, ఒకప్పుడు పాన్పుమీదను, పిల్లి, తన కూనను పెట్టుచుండును. తనకు బాధ కలిగినను, కూన యేమిసేయును? మ్యావు మ్యావు మని యఱచును. అంతే, దానికి దెలిసిన దంతే. కాని, ఆ కూత చెవిని బడినంతనే, తల్లి తా నెచ్చట నున్నను, కూనయొద్దకు వచ్చి వ్రాలును.

* * *

ఒక భక్తుడు: స్వామీ, యెవడేని దుర్మార్గుడు మనకు హానిచేయుట కుంకించినను, హానిని చేయనేచేసినను, అప్పుడు మన మూరకుండవలసిన దేనా?

గురుదేవుడు: సంఘమున జీవితమును గడపుచుండు మానవుడు దుష్టచిత్తుల బారినుండి తన్ను కాపాడుకొనుటకుగాను పైకి కోపమును జూపవలసి యుండును. అంతేకాని, ఇతరులు తనకు హానిచేయ నున్నారని ఆశంకించి (ముందుగనే) వారిలో ఎవరికిగాని తాను హాని చేయరాదు.

ఒక కథను విను. పచ్చికబయ లున్నది. అందు గొల్లబాలు రావులను మేపుకొనుచుండిరి. అక్కడనే భయంకర విషసర్పమొకటి యుండెను. దానివలని వెఱపుచే నెల్లరును వేయికన్నులతో మెలకువ గలిగియుండెడివారు.

ఒకనాడొక బ్రహ్మచారి ఆ పచ్చికబయలు మీదుగ బోవుచుండెను. గొల్లపిల్లవాండ్రు పరుగున నతనిని సమీపించి 'ఓమహాశయా, అటువైపుపోకు. దయచేసి మరలుము. ఆప్రాంతమున నాగుబాముున్న'దని యెచ్చరించిరి. అందుల కాయన 'ఉన్ననేమి ? దానివలన నాకెట్టిభయమును లేదు. మంచిపిల్లలారా, నాకు దెలిసిన మంత్రములు కొన్ని కల' వని బదులు చెప్పి తనదారిని ముందున కేగెను. కాని, ఆ గొల్లపిల్లలు ఆయనను వెంబడింపలేదు. ఏలయన, వారికి భయము. ఇంతలో సర్పము పడగనెత్తుకొని బ్రహ్మచారిమీదికురవడించెను. అతడొక మంత్రము నుచ్చరించెను. వెంటనే నాగుబాము వానపాముంటిదై అతనిపాదముల కడ పడియుండెను. బ్రహ్మచారి దానితో ''ఇదుగో, ఇటుచూడు. ఎందులకు నీవొరులను హింసించుచు తిరుగాడెదవు ? ఇటురమ్ము, నీకొక పుణ్యమంత్రము నుపదేశింతును. దానిని జపింపుము. నీకు దైవభక్తి యలవడును. అందుచే, నీఘాతుకస్వభావము తొలగుటే కాదు, కడకు భగవత్సాక్షాత్కారము చేకూరు'' నని పల్కి, మంత్రోపదేశము చేసి ఆధ్యాత్మిక జీవితములోనికి ప్రవేశమొసంగెను. పాము గురువునకు మ్రొక్కి ''ఆధ్యాత్మికనియమానుష్ఠానము నాకెట్లలవడు'' నని యడిగెను. ''ఈమంత్రమునే జపించుచుండుము. ఎవరిని గాని హింసింపకు, మరలవచ్చి నిన్నుజూతు'' నని చెప్పి బ్రహ్మచారి వెడలిపోయెను.

కొన్నాళ్లు గడచినవి. పాము కఱచుటలేదని గొల్లపిల్లవాండ్రు గుర్తించిరి. వారు దానిమీద రాళ్లురువ్విరి. కాని అది బుస్సుమనలేదు. వానపామువలెనే యూరకుండినది. ఒకనాడొక బాలుడు దానిని సమీపించి తోకయొద్దపట్టుకొని, చుట్టుచుట్టి, నేలమీదమోది, పాఱవేసెను. పాము నెత్తురుగ్రక్కి స్మృతి గోల్పోయెను. కదలక పడియున్నందున అది చచ్చినదనియెంచి పిల్లవాండ్రు తమదారినేగిరి.

సగమురాత్రియప్పటికి పామునకు చైతన్యము కలిగెను. మెల్లగను ఎంతో కష్టముతోను తన దేహము నీడ్చుకొనుచు అది పుట్టలోనికి ప్రాకినది. దానియెముకలు తునుకలైనవి. కదలుటకైనను దానికి శక్తిలేకుండెను. పెక్కుదినములు గడచిపోయినవి. పాము, తోలుకప్పిన పట్టియెముకలగూడుగా రూపొందెను. అప్పుడప్పుడది రాత్రులందుమాత్ర మాహారమునకై బయటికి వచ్చుచుండెను. పగటివేళలలో ఆబాలురవలనిభయముచేత పుట్టవదలివచ్చుటే లేదు. గురువునొద్ద మంత్రోపదేశముపొందినప్పటినుండి అది హింసించుటను బొత్తిగామానివేసెను. మట్టియు చెట్లనుండి తమంతట రాలిన యాకులును పండ్లును—ఇవే దానికాహారము.

ఇంచుమించొక సంవత్సరమునకు బిమ్మట ఆ బ్రహ్మచారివచ్చి, పాముసంగతిని విచారించెను. అది చచ్చిపోయినదని గొల్లపిల్లవాండ్రు చెప్పిరి. కాని అతడు నమ్మజాలకపోయెను. ఉపదిష్టమైన మంత్రసిద్ధిని బడయక పాము మరణింపదని యతనికి దెలియును. కావున అతడది యున్నచోటికి దారికనుగొని పోయి, ఇటుఅటు వెదకి, దానికి దానుపెట్టియుండిన పేరుతో బిలిచెను. గురునికంఠము వినగానే అది పుట్టనుండి వెలుపలికివచ్చి, మహాదరముతో నతనిమ్రోల నమస్కరించెను.

బ్రహ్మచారి—ఏమోయీ, ఎటులున్నావు ?

పాము—క్షేమముగానే ఉన్నాను, స్వామీ.

బ్రహ్మచారి—మఱి ఎందుకంతగా కృశించియున్నావు ?

పాము—పూజ్యగురుదేవా, ఎవరినిగానిహింసిం పకుమని మీరు నాకు కట్టడచేసితిరికదా. కాబట్టి ఆకులపైని పండ్లపైని ఆధారపడి జీవితమును గడపుచున్నాను. అందుచేత కృశించియుందును.

పాము ధార్మికముగ మాఱినది. ఎవరిపైని గాని దానికి కోపముకలుగుటలేదు. గొల్లపిల్ల వాండ్రు అలనాడుతన్నుకొనయూపిరితో విడిచి పెట్టిన సంగతిని, అది పూర్తిగా మఱచి పోయెను.

బ్రహ్మచారి "తిండి లేక పోయినంత మాత్రముచే నీవింతగా నెండుకొనిపోయి యుండవు. వేఱుకారణ మేదో యుండవలె, జ్ఞప్తికి తెచ్చుకో" అనెను. పిల్లవాండ్రుతన్ను నేలమీదమోదిన సంగతి అప్పుడు దానిజ్ఞప్తికి వచ్చెను. రాగా "ఔను, స్వామీ, ఇప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఒకనాడు, పిల్లవాండ్రు నన్ను, నేలకువేసి చావమోదిరి. పాపము, వారికేమి తెలియును ? నామనస్సెంతగామార్పు జెందియున్నదియు వారు గ్రహింపరైరి. నేనెవ రినిగాని కఱవనని, హింసింపనని వారెట్లు తెలిసికోగల" రనెను.

బ్రహ్మచారి—ఎంత సిగ్గుచేటు! అంత అవివేకివా నీవు ? నిన్ను నీవు కాపాడుకొనుదారి యైనను నీకు తెలియదా? నీతో నేను "కఱవకు" మంటినేకాని 'బుసకొట్టకు' మంటినా ? బుస్సు మని వారిని నీవేల బెదరగొట్టకపోయితి"—వని యఱచెను.

కాబట్టి దుష్టులవైపు కస్సుబుస్సు అనుచుండ వలయును. లేకున్న వారు నీకు హానిదెత్తురు. వారిని బెదరగొట్టవచ్చునుగాని, వారిలోనికి నీ విషము నెక్కింపరాదు. ఎవరుగాని, ఎవరినిగాని హింసింపరాదు.

# ప్రజోద్ధరణోద్యమములు

ప్రపంచమంతటను విప్లవములు పోటెక్కి యున్నవి. క్లేశములు ముంచుకొని వచ్చు చున్నవి.

లక్ష్యముల సాధించుకొనుటకు భౌతికాది శాస్త్రవిజ్ఞానమును సమష్టిస్వామ్యవిధానమును అందఱు ఆశ్రయించుచున్నారు. కాని ఈ కాలమున ఈ విషమపరిణతిని గుర్తింపుడు. భౌతికాదిశాస్త్రవిజ్ఞానమును సమష్టిస్వామ్య విధానమును హెచ్చుకొలదియు మానవుని హోదా తగ్గిపోవుచున్నది. అతని జీవిత దుఃఖములు సమస్యలు పెరిగిపోవుచున్నవి ఐహిక పరతకు అతడు మఱింత యెక్కువగా వశపడి పోవుచున్నాడు. చిక్కులనుండి అతడు కాంక్షించు విముక్తి వాస్తవముగ గలుగక కేవలము స్వప్నముగా ఆగిపోవుచున్నది.

మన యోగక్షేమభారమును ఆంగ్లప్రభువులు వహింతురను నమ్మకముండిన కాలము దాటినది. మనకు సమస్తయోగక్షేమములును సమష్టిస్వామ్యవిధానమువలన గలుగునను నమ్మకము ప్రబలుచున్న కాలమిది. కాని మనల స్వతంత్రులనుగ నొనర్పనుద్దిష్టములైన విధానములే మనల బానిసలను నొనర్చు విధానములుగ మాఱుటకు ఎంతోకాలము పట్టుటలేదు. ఉద్యమమునకు మీరు ఏపేరైనను

పెట్టవచ్చు కాని దాస్యమే స్వాతంత్ర్యము కాజాలదు. 'ఇది స్వాతంత్ర్యప్రకారవిశేష' మనుచు దాస్యము నంటగట్టు ఉద్యమములు కోకొల్లలుగ సాగుచున్నవి. సామాన్య మానవుడు దిగ్భ్రమలో తగుల్కొని వెలువడ నేరకున్నాడు.

సమష్టిస్వామ్యవిధానమును ఆధ్యాత్మికపు పునాదులపై నెలకొల్పవలయును. అది ప్రజలను కష్టదుఃఖసాగరమునుదాటించిఅనంతతత్త్వము నొద్దకు జేర్చునదిగ నుండవలయును. అట్లు లేకున్న సమష్టిస్వామ్యవిధానము దారుణ నిరంకుశ ప్రభుత్వ మగును, వ్యక్తి కొక రొట్టెతునుక నందించిన చాలదు. సమష్టిస్వామ్యవిధానము ప్రజలకు అన్నింటను పరిపూర్ణతను సమకూర్చునదై యుండవలయును.

మానవు డుదాత్తుడుగ పరిణమింపలేదు. కాని ప్రకృతిశాస్త్రవిజ్ఞానఫలముగా అతిఘోర మారణశస్త్రము లతని చేతులలో పడినవి. స్వార్థసాధనకై సంఘర్షించు మానవు లట్టి శస్త్రముల జూపి యొండొరుల బెదరించుకొనుచున్నారు. మానవున కాయుధబలము పెంపొందుచున్నది కాని విశ్వశ్రేయఃకాంక్షా రూపమైన వివేక మలవడలేదు. వివేకసనాథము కాని మారణాయుధసంపద విపత్కరము. తనలో ఉదాత్తతాపరిణతిని మానవుడు కలిగించుకొన్ననే వివేక మమోఘముగ పనివడును. అది కలుగకుండునంతవఱకు శాస్త్రవిజ్ఞానపరతయు సమష్టిస్వామ్యవిధాననిరతియు మానవుని ఐహికసుఖలాభము లనెడి యెండమావులవెంబడి పరుగులు వాఱించును.

ఉత్పత్తికేంద్రాలను సమష్టిస్వామ్యము క్రిందికి తెచ్చినంతమాత్రమున మనము కనుచున్న కలలు నిజములుగ పరిణమింపవు. మానవునిలోని దురాశలును పేరాశలును క్షాళితములు కావలయును. మానవుని వచ్చుబడి పెరుగుటతో అతని అక్కఱలును పెచ్చుపెరుగునేని ఎట్టి మేలును లేదు. 'సహిభవతి దరిద్రోయస్య తృష్ణా విశాలా' 'ఎవని అక్కఱలును ఆశలును పెరుగుండునో వాడే దరిద్రు' డనెడి భర్తృహరిసుభాషితమును స్మరింపుడు.

ప్రజల జీవితస్థాయిని పైమెట్టెక్కింపవలెననుట సకలప్రజానాయకులు పాడెడి పల్లవిగానున్నది. కాని అందులోని మర్మమును గ్రహింపవలయును. జీవితస్థాయి యున్నతమగుటతోబాటు చిత్తోన్నతియు నొనగూడవలయును–లేకున్నచో మానవుడు తన వినాశమునకే దారి చేసికొనును. గొప్పలను సాధించుకొనుటకై విప్లవములను లేవదీయును. విప్లవము పోటెక్కినప్పుడు అది అచిరకాలములోనే హింసాకాండగ రూపొందునని చరిత్ర మనకు తెలుపుచున్నది.

ప్రపంచమున పెక్కు ప్రాంతాలలో చూడుడు–ప్రజలు లేపిన విప్లవాలు వారికే ప్రతికూలములుగ పరిణమించుచున్నవి. స్వశాఖాదురభిమానులువిప్లవనాయకులగుచున్నారు. ప్రాచీనకాలమున స్వమత దురభిమానులు దేవుని పేరు చెప్పి కుత్తుకలు కత్తిరించినట్లు ఈ కాలమున స్వశాఖాదురభిమానులు ప్రజల పేరు చెప్పి హింసాకాండను నిర్వహించుచున్నారు.

'ప్రజల క్షేమమునకు మేము చెప్పు దారియే దారి, వేఱుదారిలే' దనెడి యీ స్వశాఖాదురభిమానుల మొండిపట్టుచే శాఖావైషమ్యములు పెరుగును, స్వేచ్ఛ అంతరించును, భద్రత మటుమాయమగును, ప్రజలనుక్షణభయవిహ్వలులుగ నుందురు. కలిగిన ఫలితము లివియైనను కోరిన ఫలితము లివి కావు కదా.

మానవుని జీవిత పరిస్థితుల నొకవంక చక్కజేయుచు మఱొకవంక అతనిని ఉదాత్తునిగ పరిణమింపజేయవలయును. ఇట్లు ఈ రెండును సాగక, మొదటిదానియందుమాత్రము శ్రద్ధవహింతుమేని తొలగు చిక్కులకంటె కలుగు చిక్కులు హెచ్చగును. మానవుల జీవితములతో చెలలాడబూనుకొనుచుండు వారు అందుకు అర్హత బొత్తిగా లేనివారు. హృదయవిశుద్ధిని తా మలవఱచుకొనక ప్రజల జీవితపరిస్థితులను జక్కజేయబూనుట అపత్కరము. అందుకు బూనుకొన్న వారికి చుఱుకైన బుద్ధియు నిస్స్వార్థపరతయు విశ్వమానవప్రేమయు నుండవలయును. ఉన్నచో మార్పులు, రక్తపాతము లేక, శ్రేయస్సాధకము లగుచుండును.

దేశప్రభుత్వాలవారు చక్కని ప్రణాళికల ద్వారా రాజకీయసాంఘికపరిణామములను సాధింపజూచుచున్నారు. కాని ఆ ప్రణాళికలన్నియు మానవుల జీవితపరిస్థితులను జక్కబఱచుటయందుమాత్రమే శ్రద్ధావంతములై మానవుల ఆధ్యాత్మికపారమార్థిక రంగములందుపేక్ష గల్గియున్నవి. వ్యక్తివిలువ తగ్గిపోవుచున్నది. అతనిచుట్టు నున్న యితరవస్తువుల విలువ విపరీతముగ హెచ్చిపోవుచున్నది.

ఎక్కువ వస్తువులను ధన మిచ్చి కొనగల శక్తిని ప్రజలకు పెంపొందించుటే వారి జీవిత పరిస్థితిని జక్కబఱచుట అను భ్రాంతి సర్వత్ర ఉన్నది. ఒక హద్దు దాటిన పిమ్మట వస్తుసమృద్ధి హెచ్చుకొలదియు వాని యవసరమును ఉపయోగమును తగ్గుచుండును. అవి ఖర్చుపడక మనమే ఖర్చు కావలసివచ్చును. వస్తుసమృద్ధితోపాటు శీలాభివృద్ధియునున్న, శీలాభివృద్ధియే హెచ్చుగ నున్న—దేశచరిత్ర ఇప్పుడున్నట్లు కాక మేలైన రీతిలో నుండెడిది.

మానవునిలో ఉదాత్తతను రూపొందించి పెంపొందించునది ధర్మమే, కావున పురుషార్థములలో దాని నగ్రమైనదానినిగ గణింతురు. ధనమునకు గల విలువను హెచ్చించునదియు ధర్మమే. ప్రజోద్ధరణప్రణాళికల నేర్పఱచువారందఱును ఈనిజమును గుర్తించి ధర్మమునకు తమ ప్రణాళికలలో సముచితమైన స్థానము నొసగవలయును. ధర్మప్రవర్ధకముకాని ప్రణాళిక ప్రజలను మ్రింగివేయునదిగ పరిణమించును.

ఉత్పత్తికేంద్రాలను మనవశమం దుంచుకొన్న జాలదు. ఉత్పత్తికై ఆధునికవిధానాల ననుసరించినంతమాత్రమున చాలదు. ఉత్పత్తికి కేంద్రస్థానీయుడైన మానవుని విస్మరింపరాదు. మానవుని మానవత్వము పెంపొందవలయును. దీనిని మనకు గఱపునది ఆధ్యాత్మికశాస్త్రము. మానవుని మృగస్థాయినుండి ఉద్ధరించి మానవస్థాయినందించినవారు విప్లవకర్తలే, కాని వారు మానవునిలోని దివ్యతను గుర్తించి మానవస్థాయినుండి అతనిని దేవస్థాయికి నుద్ధరింతురేని వారి విప్లవములు ఇంక నెంతో విజయప్రదము లగును. దీనిని మానవాళికి భవిష్యత్కల్పమున నిరూపింపబోవునది ఆధ్యాత్మికశాస్త్రమే.

మానవుల లోటుపాట్లచే విప్లవములు చెడవచ్చు; సాగుననుకొన్నవి సాగకపోవచ్చు, ఆగుననుకొన్నవి ఆగక పోవచ్చు. కాని కార్మికుల పురోగతిని మాత్ర మెవ్వరును అరికట్టజాలరు. వారి పురోగతియే ప్రకృతయుగధర్మము. వారికి వికాసము సర్వతోముఖముగ గలిగినచో అంతకు మించిన శ్రేయము వారికి వేఱొకటి యుండబోదు. తన కుండునది గొడ్డుబలము కాదనియు ఆత్మబల మనియు కార్మికుడు గుర్తింపవలెను. ఇప్పటి కేమో కార్మికునకు లక్ష్యము తనయైహికసంపదభివృద్ధియందు మాత్రమే యున్నది. వారికి పారమార్థిక సంప

దభివృద్ధినికూడ సమకూర్పవలెనని నాయకులు గుర్తించిన జాడ ఏదీ? లక్ష్యసాధనకు తా మనుసరించు మార్గము నిర్దుష్టమైనదిగ నుండ వలయునని యైనను వారు మెలకువ చెంద కున్నారు. హక్కులపై అపేక్షయు బాధ్యతలపై ఉపేక్షయు చూపుచున్నారు. ఇందుచే నష్టము పెట్టుబడిదారులకుమాత్రమే కాదు, కార్మికుల కును గలుగుచున్నది. సమయమువచ్చినప్పుడు చూడుడు; కార్మికులలో ఒక వర్గమువారు మఱొకవర్గమువారి కుత్తుకలు నులుముట కెంత ముందుకు పరుగులెత్తుచుందురో!

కాబట్టి కార్మికులకు తమ ఆర్థికసుస్థితియం దక్కఱ గలుగుటతోబాటు పారమార్థికపర తయు నలవడవలయును. అప్పుడే వారికి పరి పూర్ణత చేకూరును. పరతత్త్వమం దభి రుచియు నభినివేశమును దృఢపడ్డధీరులే బల యుక్తులు. 'సత్యము'నకు పక్షపాత ముండదు. కావున విముక్తి అందఱికిని గలుగవలెనని యుండుటే ప్రాప్తము; 'సత్యము'నకు పగ యుండదు. ప్రేమయే అందఱిపట్ల నుండును. త్యాగముగ రూపొందుటే ప్రేమస్వభావము. దేనినైనను సరే ఇచ్చుటే దానిని శాశ్వతముగ పడయుటకు దారి. మోక్షము నీకు కలుగ గోరుదువేని మొదట ఇతరులకు కలిగింప పాటు పడుము. 'మావర్గము వారికి మాత్రమే మోక్షము కలుగవలె' నని కోరువారికి నిజము నకు తమ వర్గమువారిపై సైతము ప్రేమ లేదు.

# శ్రీ శివానందస్మృతులు–40-41

### శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

క్రీ. శ. 10-4-1929. (బుధవారము)
(బేలూరు మఠము)

శ్రీమహాపురుషులు భోజనముచేయుచు "చూడుము, ఈ భోజనము మందువలె తిను చున్నాను. నిజముగా ఆహారము ఔషధమే కదా! శ్రీశంకరాచార్యులవారు "క్షుద్వ్యాధిశ్చ, చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం "ఆకలిరూపమగువ్యాధికి చికిత్స చేయుము – భిక్షౌషధమును సేవింపుము." అన్నారు. ఆకలికూడ ఒకవ్యాధియే సుమా. మందుద్వారా వ్యాధికి ఉపశమనము కలుగు నట్లుగ, క్షుధారూపవ్యాధికి, ఆహారముద్వారా ఉపశమనముకల్గుచున్నది. ఇట్టిభావనతో ఆహా రము దినవలెను. శంకరాచార్యులవారు మహా జ్ఞాని. అందుచేతనే వారిట్లు పలుకగల్గిరి. ఆత్మ కు ఆకలిదప్పులు లేవు. ఆత్మకు ఎట్టివికారములు లేవు. శుద్ధచైతన్యస్వరూపము. పరమాత్మకు ఆకలిదప్పులు లేవు – అవన్నియు దేహధర్మ ములే సుమా!

క్రీ. శ. 18-4-1929. (గురువారము)
(బేలూరు మఠము)

సాయంకాలము సుమారు 5 గంటల సమయ మున ఒకసన్న్యాసి వచ్చి, శ్రీమహాపురుషులకు నమస్కరింప, శ్రీవారు వెంటనే "క్షేమ మే మైన కలదా" అని ప్రశ్నించిరి. సాధారణముగ ఈసన్న్యాసి, అట్టిసమయమున శ్రీమహాపురు షులగదికి వచ్చెడివాడు కాడు, అందుచే వా రతనిని ప్రశ్నించిరి.

సన్న్యాసి : నిన్న నేను (శ్రీ)మాస్టరుమహాశయుల (శ్రీమహేంద్రనాథగుప్తగారి) ఇంటికి వెళ్లితిని. వారు శ్రీఠాకూరు (శ్రీరామకృష్ణుని) గుఱించి చాలసేపు ముచ్చటించిరి.

మహాపురుషులు : ఆహా! మాస్టరుమహాశయులు! (శ్రీ)ఠాకూరుగారి మహాభక్తులు! (శ్రీ)భగవానుని విషయముతప్ప వేఱొండు విషయమును వారు ప్రసంగింపనేరరు.

సన్న్యాసి : స్వామీ, నామనస్సులో చాల అశాంతి. సాధనానుష్ఠానముల సరిగ చేయలేకున్నాను. ఈలాగే దినములు గడచిపోవుచున్నవి. మా కిక ఏమి గతి.

మహాపురుషులు: నాయనా, శరణాగతుడవై పడియుండుము. వానికృప వినా ఏమియు కలుగనేరదు. (జపధ్యానములు) సాధనానుష్ఠానములు చేసినంతమాత్రముననే మానవునికి భగవద్దర్శనము లభించునా ఏమి? వానిని మనము చిక్కించుకొనగలమా ఏమి? అతడు కరుణించి, మన అందుబాటులోనికి వచ్చిననే, మనము వాని బొందగలము. కాని, మనము స్వప్రయత్నములచే వానిని బొందగల్గుదుమనుట కలలోని వార్త. మనకు అట్టిసామర్థ్యము లేదు–వానిని అందుకోగలశక్తి మనకు లేనేలేదు. సాధనభజనలనైనను, మానవులు ఎంతసేపు చేయగలరు? ఏదో రెండుగంటలో లేకున్న నాల్గు గంటలో, ఇంకను ఎక్కువయున్నచో ఏలాగో దినమునకు ఎనిమిదిగంటలపాటు చేయగలరు. కాని ఈలాగు సాధనచేయుటకు ప్రేరేపణయు శక్తియు, అతడే ఇచ్చుచున్నాడు. సర్వవిధములశక్తికి అతడే ఆధారము. అతడు దయచూపి, శక్తిసామర్థ్యముల ప్రసాదించుచున్నప్పుడే మానవుడు, సాధనానుష్ఠానముల చేయగల్గుచున్నాడు. అందుచేతనే శరణాగతుడవై పడియుండు మనియే చెప్పుచున్నాను. కడుదీనుడవై ప్రార్థింపుము–"ప్రభూ, కరుణింపుము, కరుణింపుము." ఠాకూరు "నాహం! నాహం! (నేను కాదు) "త్వమేవ" "త్వమేవ" (నీవే) అని పల్కెడివారు. "భగవానుడు కృపాపరవశుడై మనచేజిక్కిననే మనము వానిని అందుకొనగలము. ఓ ప్రభూ, కృపావర్షము కురిపింపుము"

సన్న్యాసి : మహారాజ్, నామనస్సు చాల చంచలముగ నున్నది. సరిగా ప్రార్థింపలేకున్నాను. మనస్సునే స్థిరము చేయలేక పోవుచున్నాను.

మహారాజు : ఈలాగు చెప్పినంతమాత్రమున చాలదు. అతివ్యాకులచిత్తముతో ప్రార్థింపవలెను. మనస్సులో ఎన్నటికిని నిరాశాభావమును జొరనీయకు. ఆనందమనస్కుడవై యొప్పుము. తోడ్తోడ సతతము ప్రార్థింపుము. నాయనా, భగవానునికడ పొందజాలని దేదియు లేదు. అతడు సర్వమును ప్రసాదింపగలడు. ఏది కోరుకొన్నను సరియే వానినెల్ల నొసగగలడు భక్తిని అడుగుము, లేక విశ్వాసమును కోరుము, త్యాగము నర్థింపుము. వైరాగ్య మొసంగ కోరుము, వివేకమును యాచింపుము, పవిత్రతకై ప్రార్థింపుము, నీ మనోవాంఛలనెల్ల అతడే తీర్పగలడు, భగవానుడు మానవరూపమును దాల్చినది మీకెల్లరకు మేలు చేకూర్చుటకే – వానికడ నున్నదైవీసంపద లెల్ల మీకు ప్రసాదించుటకే మిమ్ముల నిచటికి ఆకర్షించి కొనివచ్చి, మీకెల్లరకు ఆశ్రయ మిచ్చి, మీయోగక్షేమముల నరయుచు, మిమ్ముల తనరక్షణలో నుంచుకొనినది. మీఅంతట మీరే (ఈసంఘములో) చేరుటకు ఇచ్చటికి రాగల్గితిరా ఏమి? ఆలాగెన్నటికిని భావింపకుడు. ఆలాగు భావిం

చుట పొరపాటు. శ్రీఠాకూరే కనికరించి మిమ్ములనిచ్చటికిని బలత్కారముగ కొని వచ్చినాడు. అతడు అహేతుక కృపాసింధువు. నాయనా, వాని ద్వారముకడ పడి యుండుము. వేచియుండుము. క్రమముగ నీవు కోరిన దెల్ల పొందగల్గుదువు. నామాటల విశ్వసింపుము. అతడు భక్తివిశ్వాసములతో మీ డెందముల నింపును. అని పలికి ఒకపాటపాడ నారంభించిరి. (బెంగాలీ)

"అపనా తే అపని థేకో మన్, జేటో,
నాకో, కారో ఘరే!
జా చాబి తా బోశే పాబి, ఖోంజో నిజ
అంతఃపురే" ॥

["ఓ మనసా, నీవు పరాయియిండ్లకు పోకుము, నీలోనే నీవు స్థిరముగ నుండుము. నీవు నీ అంతఃపురమునందే వెదకుము. నీవు వృథాగా ఇటునటు తిరుగ నక్కఱలేదు. నీ వున్నచోటనే నీవు కోరిన కోర్కె లెల్ల ఫలించును."]

# శివానంద లేఖావళి

## 66

మఠము, బేలూరు,
7 మార్చి 1916.

ప్రియ హరిమహరాజ్,

నిన్న ప్రొద్దున ఇక్కడకు చేరుకొంటిని. భూషణునితో వారియూరైన మహిజములో అరదినము గడపి అతనితోకూడనే ఇచ్చటికి వచ్చితిని. బ- కాని న- కాని అక్కడికి పోజాలక పోయిరి.

శ్రీరామకృష్ణుని జయంతిపూజ ప్రభాతమందే ప్రారంభమైనది. శరత్తుమహారాజు ఉండెను. అతులుడు (లక్ష్మణుడు) అర్చకుడు, నిర్మలుడు పరిచారకుడు. వేయిమందికంటె ఎక్కువగానే భక్తులు ప్రసాదము స్వీకరించినారు. మహారాజు (బ్రహ్మానందస్వామి) బాబురాము మున్నగు నందఱును అత్యంతము భోగ్యముగ నుండిన తూర్పుబంగాళయాత్రనుండి మరలి వచ్చిరి. ఇక్కడ మహారాజునకు కడుపునొప్పి కలిగి యున్నది. గంగాజలముకూడ ఉప్పనగా మాఱుచున్నది. నేను చూచుచున్నాను. ఈశ్వర సంకల్పానుసారము నేనిక్కడ నెన్నినాళ్లుండ గలనో ఎఱుగను. గంగాధరమహారాజు నిన్ననే వచ్చినాడు. అతని యారోగ్యము చాల చెడి యున్నది. కల్కత్తాలో నతడు డాక్టరు బిపిను నొద్ద వైద్యము చేయించుకొన్నాడు. చాల మట్టుకు నయమైనది.

కుటీరనిర్మాణసామగ్రి వచ్చి చేరినదా? నీకు పైక మేమైన లభించుచున్నదా? నీయారోగ్య మెట్లున్నది? చలి చాలమట్టుకు తగ్గియుండవలెను. ఇక్కడ వసంతము ఉజ్జ్వలమనోహరముగ నున్నది.

రామునికి ఆరోగ్యము బాగున్నందుకు మహారాజు చాలసంతోషించెను. నా ప్రేమ ప్రణామాదికములను స్వీకరింపుము. నా ప్రేమాశీస్సులను సా-కు రామునికి క-కు అందింపుము.

సేవకుడు, తారకుడు.

## 67

రామకృష్ణమఠము,
బేలూరుపోస్టు, హౌరా,
20 ఏప్రిలు 1916.

ప్రియ హరిమహరాజ్,

15-వ తేది నీవు వ్రాసిన జాబు నాకు యథాకాలము చేరినది. సంగతులు తెలిసినవి. నీ

యారోగ్యము రవంత మెఱుగుగ నున్నందుకు నా కెంతో సంతోషముగ నున్నది. పర్వత ప్రాంతాలపరిస్థితులు చాల దుఃఖకరములుగ నున్నవి. ఇప్పటివఱకు వానలే కురియలే దని త్వరలో వానలు కురియ గల సూచన లైనను లేవనియు నీవు వ్రాసియున్నావు. ఇది విధి విపర్యాసముగ కన్పించుచున్నది. త్వరలో వానలు కురియునుగాక యని నేను హృదయపూర్వకముగ ప్రార్థించుచున్నాను.

అతులున కిప్పుడు చిల్కాపేటలో నుండుట సులభమే. అక్కడ ఎండలు నీకు దుస్సహముగ నున్నచో నీవు మాయావతికి పోయి కొన్నాళ్లుండవచ్చు. అక్కడి వారు అన్ని ఏర్పాట్లు చేయుటకు సిద్ధముగా నున్నారు. అల్మోడాలో కుటీరనిర్మాణమునకై నేను ఈ దినము ఇరువది రూపాయలను నారాయణునకు పంపినాను. పాల్ ఫ్రెండ్సుల అప్పును ఇక్కడినుండియే నేను కొంచెము కొంచెముగ తీర్చివేయగల నని అనుకొనుచున్నాను.

నేను బాబురామమహారాజుతో అతని అల్మోడాప్రయాణమును గూర్చి చెప్పితిని. అతడు చెప్పినాడు: ఈ ఎండలో ప్రయాణమును నే నోర్వ గలిగి యుండను. ముఖ్యముగ బోడు రైల్వేలో, పోయినప్పు డెల్ల నాకు జ్వరము వచ్చుచుండినది. ప్రసన్నబాబు మున్నగువారు మమ్ములనిద్దఱిని షిల్లాంగుకు పొండని నిక్కచ్చి చేయుచున్నారు. అందుంగూర్చి ఇంకను ఏమియు తీర్మానింపబడ లేదు. కాబట్టి అల్మోడాకు నే నెప్పుడు పోగలనో సరిగా చెప్పలేను. కొంతపైకమునుకూడ వసూలు చేయవలసియున్నది. భగవత్సంకల్పానుసారము——నేను నీకు తరము వ్రాసెదను లెమ్ము.

కుటీరమునకు క్రింద ఊటలో నీరు లేదు, చలమయొద్దకు నడచుదారిని ఏర్పఱచుట ప్రథమావశ్యకము. నిజముగ ఏదైన హోమము మున్నగువానిని చేయనిదే ఆయింట నుండుట ఎవరికిని మంచిది కాదు.

పర్వతప్రాంతాల క్షేమమునకై నేను భగవంతుని ప్రగాఢముగ ప్రార్థించుచున్నాను. నేను పోవు టేమో తప్పదు. కాని రవంత ఆలస్యము కావచ్చు.

సేవకుడు, తారకుడు.

## 68

రామకృష్ణ మఠము,
బేలూరు, హౌరా,

ప్రియ హరిమహరాజ్,        15 మే 1916.

10–వ తేది వివరముగ నీవు వ్రాసిన జాబును చూచుకొని ఎంతో సంతోషించితిని. ఆ జాబునకై నే నాత్రముతో నిరీక్షించుచుంటిని. భగవదనుగ్రహముచే ఆ ప్రాంతములలో మంచివాన కురిసిన దని విన్నంతనే నా దిగులు చాలమట్టుకు తీరిపోయినది. దేవు డనుగ్రహింపకున్నచో సృష్టికి సుస్థితి ఎట్లు కలుగును ?

షిల్లాంగునకు నా ప్రయాణమునకు విలంబమగుచున్నది. అచటి భక్తులు మమ్ము మఱొక పక్షము దినములు వేచియుండుమనిరి; ప్రయాణ ఖర్చులకు వారు మాకు పైకము పంపియున్నారు లెమ్ము. ఇప్పటికి కూడ అచ్చటికి పోవుద మను తీవ్రమైన కోరిక నాకు కలుగకున్నది. అందులకు కారణములు పెక్కులు. అచ్చట నన్ను ప్రబలముగ నాకర్షించునదియు నొకటి కలదు. ఏదనగా కామాఖ్యాదేవిసన్నిధానమే. అది తలపునకు వచ్చినప్పుడు తక్కిన ఇబ్బందుల కన్నిటికిని ఓర్చుకొనుట నాకు కష్ట మనిపించుట లేదు. భగవంతుడు ఏమి సంకల్పించునో చూతము... ఇప్పు డిచ్చట నొక పెద్ద భక్తబృంద మున్నది. వారి దర్శనమే బ్రహ్మానందకరము. వారిని నీవు

చూడగన్నచో ఎంతగనో ఆనందింతువు. గురుదేవుని యాదర్శములను స్వామీజీ యాదర్శములను పెక్కురవలంబించుచున్నారు, అవలంబింప సంసిద్ధు లగుచున్నారు. దీనిని చూచి నప్పుడు ఎవరికైనను ఆనందమును ఆశాభావమును తప్పక నిండుకొనును. నీ విచ్చటికి రావలెనని కొన్నాళ్ళిచ్చట గడపవలె నని నే నభిలషించుచున్నాను. ఇతరులును అట్లే యభిలషించుచున్నారు. చలికాలమునకు ముందు నీ విచ్చటికి వచ్చుటకు సుంతయు వీలు కాదులే; శ్రీ...కొన్నాళ్లు మఠములో మహారాజుతో నుండునేని అతని కెంతయు క్షేమంకర మగు నని నాకు తోచుచున్నది. కొన్నాళ్లు మఠమున నుండునేని అతని మనోమాలిన్యము చాల మట్టుకు క్షాళిత మగు నని నా దృఢవిశ్వాసము. దేవుని సంకల్పానుసారము జరుగును. దేవు డతనికి ఆత్యంతిక క్షేమమును కల్గింపవలె ననుట నా యంతరంగ ప్రార్థనము.

నా షిల్లాంగుప్రయాణము జరుగకున్నచో నేను అల్మోడాకు పోవుదును, అది దేవు నభీష్టమగుచో. నాహృదయపూర్వక ప్రేమప్రణామములను అందుకొనుము; రామునకు క...కును అందజేయుము.

సేవకుడు, తారకుడు.

## 69

రామకృష్ణమఠము,
బేలూరు, హౌరా,

ప్రియహరి మహరాజ్, 25 మే 1916.

నీవు 20-వ తేది వ్రాసిన జాబు చేరినది. సంగతులు తెలిసినవి. ఈశ్వరానుగ్రహముచే కుటీరమునొద్ద క్రిందటి సోమవారమునాడు హోమాదులు నిర్వర్తితములైన వని నమ్ముచున్నాను. ఇప్పు డది వాసయోగ్య మనెడి వార్త నా కెంతయు సంతోషకరము. అల్మోడాలో గురుదేవున కొకచో యేర్పడుటయు గురుదేవునిపై తమ ఆస లుంచుకొన్న భక్తు లచ్చట వసింతు రనుటయు మహానందకరమైన విషయము. అటువంటిచోట ఆరోగ్యము బాగుండును. తపస్సాధనలను సంతృప్తికరముగ సాగించుకోవచ్చును. నీజాబు చదివి మహారాజు గారు కూడ సంతోషించిరి. కానాయి అక్కడికి చేరుకున్నా డనుట తెలిసి చాల సంతోషించితిని. "కీ——" దేహ మింత దుర్బలముగ నున్నప్పుడు కైలాసము, మానససరోవరము మున్నగు దుష్కరయాత్రాస్థలములకు పోవుటకు మహారాజుగారు గాని, బాబురామమహారాజుగాని సమ్మతింప లేదు. అతని జాబు వచ్చుచుండగనే బాబురామ మహారాజు అందలి వార్తలను మహారాజుగారికి తెలిపెను. వెంటనే చాల నొచ్చుకొని మహారాజుగా రిట్లనిరి. "ఎంతో పుణ్యము సేకరింపబడియున్ననే మహాత్ముని సహవాసము లభించును. అది యతనికి చాల సులభముగ లభించినది. పైగా అతులునికి చేయ వలసిన యుపచారముల నన్నిటిని చేయుచున్నాడు. అతులుడును పావనాత్ముడే. వీని నన్నిటిని మానుకొని ఆ అత్యంతదుష్కరయాత్ర చేయుటవలన గలుగు ప్రత్యేక లాభము లేవియు లేవు. మరలు నప్పటికి మితిమీఱిన యనారోగ్యము అతనిని పైకొనుట ఫలితమగును.' నా యభిప్రాయము అదే.

షిల్లాంగుప్రయాణమునకై ఏమియు చేయ లేదు. ఎండవేడిమి దుస్సహముగ నున్నది. అదియు నిచ్చట గడచిపోవుచున్నది. వానకాలములో షిల్లాంగు ఎంతయు వాసానర్హము. జూనులో ఆల్మోడాకు పోవుద మని అనుకొనుచున్నాను. ఈశ్వరానుగ్రహమున కొంత

వర్షము పడునేని చాల బాగుండును. ఈ ప్రాంతములందును అనావృష్టిగానే యున్నది. దేశపరిస్థితి భయంకరముగ నున్నది. కామిల్లాలో కాటక మేర్పడినది. బంకూరాసంగతి చెప్ప నక్కఱ లేదు. అచ్చటి వారు కోరగా మహేశబాబు కామిల్లాకు ఇద్దఱు పనివాండ్రను పిలుచుకొని పోయియున్నాడు. వా రచ్చట పనిచేయుచున్నారు. భగవంతుని సంకల్పముచే బంకూరా క్షామనివారణకై ధనము కోకొల్లలుగ వచ్చుచున్నది. అచ్చట ఇరువదియైదు అడుగుల వెడల్పునను ఒకమైలు పొడవునను కాలువను త్రవ్వుచున్నారు. బావులను తటాకములను ఎన్నింటినో ఏర్పఱచినారు, ఏర్పఱచుచున్నారు...అమ్మసంకల్ప మమ్మకే తెలియును. దేశపరిస్థితిమాత్ర మతిశోచనీయముగ నున్నది.

నాహృదయపూర్వకప్రేమ ప్రణామాదికమును స్వీకరింపుము ... ఇక్కడ అందఱును ఒకరీతిగా బాగున్నారు. నిన్ను చూడవలె నని నీతో కనీసము కొన్నాళ్లుండ వలయు నని కుఱ్ఱవాండ్రు పెక్కండ్రు కోరుచున్నారు. కొందఱు మంచిబాలురే వచ్చి యున్నారు.

సేవకుడు—తారకుడు.

అనుబంధము: దారిలో కాశిని, ప్రయాగను, బృందావనమును దర్శించి శరత్తుమహారాజు కల్కత్తాకు మరలినాడు. ఈ దినమే మఠమునకు చేరుకొన్నాడు, క్షేమముగ నున్నాడు.

## 70

శ్రీరామకృష్ణమిషను,
బేలూరుపోస్టు, హౌరాజిల్లా;

ప్రియమహారాజ్, 26 ఆగస్టు 1916.

నీ పెద్దజాబు చేరినది. దానిని చూచుకొని చాల సంతోషించితిని. మహేంద్రబాబు మరణించి ఎనిమిదేండ్లకంటె ఎక్కువకాలమే గడచిపోయినది. వారు మరల మరల ఆహ్వానించుచునే యున్నను మనము డార్జిలింగుకు పోజాలమైతిమి. ఈసారి నేను పోవుట చాల మంచిదైనది. వా రత్యంతకృతజ్ఞులై యుండిరి. నాకును చాల సంతోషముగ నుండెను. డార్జిలింగులో స్వామిజీ జ్ఞాపకార్థము ఏమైన ఏర్పఱుపవలయు నని "..." గారి తల్లిగారు చాల కోరుచున్నది. ఆమె నా కొక భూమిని చూపినది. కాని అది నగరమునకు రెండుమైళ్ళుదిగువన పల్లమున నున్నది. అక్కడికి దిగి ఎక్కుట చాల కష్టము. ఆ చోటును చూచి మరలి వచ్చునప్పుడు నాకు అమితముగ విసు గెత్తినది. అది ఏకాంతమైన చోటే, శ్మశానమునకు చేరువుగా నున్నది, చాల చేరువగ కాదు. ఒక రిద్దఱు సంపన్నులైన మార్వారీలు ఇందు సాయముచేయుదు మని సమ్మతించిరి. వారు ప్రస్తుతము డార్జిలింగులో లేరు, కల్కత్తాలో నున్నారు. వారు మరలి వచ్చిన వెంటనే ఈ విషయమును చర్చింతుము. అక్కడ నేను దాదాపు నెలదినము లుంటిని. ఒక్కనాడైనను నా కారోగ్యము బాగుండలేదు. అన్నాళ్ళును నాకు కడుపునొప్పి యుండినది. అంతే కాదు. నరములనొప్పితోను బాధపడుచుంటిని.

బాబురామమహారాజు నియమానుసారము జన్మాష్టమినాడు ఇచ్చట వైద్యశాలకు ప్రారంభోత్సవము జరిపితిమి. శ్రీరామకృష్ణుని పూజయు హోమమును నిర్వర్తింపబడినవి. భాగవతములో కొన్నిభాగములును భగవద్గీతయు పారాయణము చేయబడినవి. సాయంకాలము ఆ గదిలో కొన్ని మందులసీసాలను బెట్టితిమి. మర్నాటినుండి మందు లిచ్చుటకు ఆ గదిలోనే ప్రారంభించితిమి. జబ్బునకు కలిగిన

సంతోషము ఇంతంత కాదు. గదిలో చెమ్మ ఇంకను పూర్తిగా ఆరలేదు లెమ్ము. కాని పని జరిగిపోవుచున్నది. వచ్చురోగులసంఖ్య పెచ్చు పెరుగుచున్నది. ప్రతిదినము అఱువదియేడు అఱువదిఎనిమిదిమందిరోగులు వచ్చుచున్నారు. వేచియుండు రోగులకు కూర్చుండు సౌకర్యములు చేయబడినవి.

మద్రాసులో ఆశ్రమమునకు శంకుస్థాపనము చేసిరనియు పైతరగతి ఇంజనీ రొకాయన ఈ విషయములో సాయము చేయుచున్నా రనియు వార్త విని చాల సంతోషించితిని. మన నిర్మాణపు నమూనాను ఆయన ఎక్కువ ఆమోదించె నని విన్నప్పుడు నా సంతోషము హెచ్చినది. ఈశ్వరానుగ్రహముచే ఆపని మెల్లగా ముగియు నేని అందఱు సంతోషింతురు. ఎంతో వ్యయ మగు ననుటకు సందేహము లేదు. ముఖ్యముగ పునాదులను మఱింత లోతునకు దింపవలసి వచ్చినందున వ్యయము తప్పక పెరుగును. ఎట్లో దానిని ప్రారంభించితిమి ఈశ్వరానుగ్రహముచే అది తప్పక పూర్తి యగును. అందునుగూర్చి సందేహము లేదు

బెంగుళూరులో మీ రందఱు ఆరోగ్యముగ నున్నా రనుట నా కెంతయు సంతోషకరము. "...మహారాజు" భక్తుడు. నీకు సేవ చేయుట యందు అతని కతిమాత్రమైన ఆశ. మీ రందఱు ఎచ్చట నున్నను భగవంతుడు మిమ్ము సంతోషముగ నుంచును. "...మహారాజు" అక్కడ నుండుటచే ప్రజల డెందములలో సద్విషయములు హత్తుకొనుచున్నవి, అందుకు సంతోషము...భక్తులను భగవంతుడు రక్షించును. వారు పొరపడి పెడదారి బట్టినను కరుణాప్రేరితుడై భగవంతుడు తండ్రియుం బోలె వారిని సరిదారికి తెచ్చి విడచును. లేకున్న, భక్తునకు వే ఱేది గతి? బెంగుళూరులో కూరగాయ లన్నియు చౌకయనియు చాల రుచికరములనియు వినుచున్నాను. మంచిపాలు దొరకునటనే. భగవంతుడు మిమ్ము సౌఖ్య మహానందములలో నోలలాడించునుగాక. ఇది నా అత్యాంతరంగికమైన ప్రార్థనము. కూరగాయలమ్మువారిలో ఆ భక్తురాలినిగూర్చి విన్నంతనే ఆనందపరవశుడ నైతిని. భగవంతుని భక్తులు ఎల్లెడల నున్నారు. దేశకాలముల విభేదము భగవంతునకు లేదు.

ఇచ్చట ఎడతెంపు లేక వాన కురియు చున్నది. ప్రతిదినమును ఆకాశము మేఘచ్ఛన్నమై యున్నది. కాని కురియుచున్న వానలు అపరిమితములు కావు. తటాకముల జలములో ఎక్కువ పెరుగుదల లేదు...ఈశ్వరానుగ్రహముచే ఇచ్చట తక్కిన విషయము లన్నియు ఒకరీతి చాల బాగున్నవి. సుకుల మహారాజు పరిస్థితి రవంత మెఱుగుగా నున్నది ... సూర్యుడు, శ్యామాచరణుడు, సనత్తు, వరదుడు—నలుగురును కాశికిపోయి యున్నారు. ఇతర విషయములను గూర్చిన జాబును నీకు బాబురామమహారాజు వ్రాయ గలడు.

నా హృదయపూర్వకప్రేమ ప్రణామాదికములను స్వీకరింపుము. అచ్చటి కుఱ్ఱవాండ్ర కందఱికిని నాప్రేమాశీస్సులను అందజేయుము. నాహృదయపూర్వకప్రేమాశీస్సులను నారాయణయ్యంగారుకు అందజేయ మఱవకుము ... కికూడ అందజేయుము.

భవదీయుడు,

శివానంద,

# ఉపనిషత్కథావళి - పిప్పలాదుని శిష్యులు కబంధి*

## శ్రీరాంపల్లి శ్రీరామచంద్రమూర్తిగారు

పిప్పలాదుడు గొప్పవిరాగి. ఆయన తన ఆహారపానీయములనుగుఱించికూడ పట్టించుకోరు. తాను వసించుటకు కుటీరము నిర్మించుకొనవలెనను కాంక్షకూడ ఆయనకు లేదు. నిరంతరము సంచారములు చేయుచుందురు. ఆకాలములో పిప్పలాదుని మించిన పండితులు లేరు. నిగూఢమైన శాస్త్రవిషయములను పిప్పలాదుడు వివరించుచుండును. ఆయనకు శిష్యులు దేశము నలుమూలల నుండెడివారు. లాదుని మొట్టమొదటిపేరు మనకు తెలియదు. కాని అది తరువాత వచ్చినపేరే యని రూఢిగా భావింపవచ్చును. పిప్పలాదు డనగా పిప్పలి పండ్లు (రావిపండ్లు) తినిజీవించువా డనియర్థము. మనపూర్వుల జ్ఞానపిపాస, వైరాగ్యము మనము నమ్మలేనంతగా పెంపొందినవి. బ్రహ్మజిజ్ఞాసతోను, సమాజసేవతోను కాలము గడపు మన పూర్వులు తమ శరీరసౌఖ్యముల నేమాత్రము దృష్టిలో పెట్టుకొనెడివారు కారు. పిప్పలాదుని వలెనే కణాదుడు (నూకతిండి) కూడ జగద్విఖ్యాతుడైన మహర్షి.

ప్పలాదునిశిష్యులు, భక్తులు ఆయన నొక కుటీరములో నుంచి స్థిరనివాస మేర్పాటు చేయవలె నని భావించెడివారు. కాని ఆయనకు శారీరకసుఖము లనుభవించు తలంపు లేనందున వారి కోరిక నంగీకరింపలేదు. ఏశిష్యుడైనను మిక్కిలి నిక్కచ్చిచేసిన అతికష్టముపై నొక్క రాత్రి మాత్ర ముండెడివారు. ఉదయము మరల ప్రయాణము కావలసినదే.

ఒక పర్యాయము పిప్పలాదుడు తీర్థయాత్రలు చేయుచు గంగాయమునాసంగమ స్థానమునకు వచ్చినారు. ఆకాలమునకూడ ఆప్రదేశము పేరు ప్రయాగయే. దేశము నలుమూలలనుండియు పెక్కుమంది మహర్షులు వచ్చి యజ్ఞములు చేయుటకు పూనుకొనిరి. ఇక్కడకు దగ్గఱలోనే గంగానది తూర్పుగట్టున ప్రతిష్ఠానపురము (ఝూన్సీ) ఉన్నది. అది మన ప్రాచీనరాజధానులలో పెద్దది. భరద్వాజమునీంద్రు నాశ్రమముకూడ ఇచ్చటనే యున్నది. ఆ సమయమున ప్రయాగలో సుమారు నెలవఱకు మేలా జరిగెడిది. మేలా పూర్తియగువఱకు పిప్పలాదు డచ్చటనుండి దేశదేశములనుండి వచ్చిన మహర్షుల సందేహములను తొలగించెడివారు. ఇప్పటివలె ఆకాలమున ప్రయాగలోని మేలాలో ఆటపాటలు, నాట్యప్రదర్శనలు మొదలగునవి లేవు. చక్కగా ముస్తాబై విలాసార్థము ప్రజ లక్కడకు చేరెడివారుకారు. ప్రతిసంవత్సరము ఒక మహారాజు వచ్చి పెద్ద (ప్ర)యాగము చేసెడివారు. అందు లక్షలకొలది విద్వాంసులు పాల్గొనెడివారు. అందు పాల్గొను పండితులు ప్రజలకు శాంతిజీవితము గడపుటకు తోడ్పడు ధర్మము లుపదేశించెడివారు. దయ, ధర్మము, క్షమ, సత్యము, అహింస మొదలగువాని రహస్యములు తెలియజేసి గృహస్థుల అజ్ఞానాంధకారము తొలగించి భక్తిజ్ఞానబీజములు నాటెడివారు. ఇట్టి మేలాలవలన దేశప్రజలలో సోదరభావము పెంపొంది కలహము లంతరించిపోయెడివి. దొంగతనములు హత్యలు అసత్యము హింస మొదలగు దుర్గుణములు తలయెత్తకుండుటచే గ్రామగ్రామమున ఆనందము

*రామప్రతాపపాఠీశాస్త్రిగారి హిందిమూలమునుండి...

ప్రశాంతి తాండవించెడివి. రోగాలు, కలవులు మచ్చునకుగూడ కన్పట్టెడివి కావు.

దైవవశమున నొక సంవత్సరము మేలాలో చేరిన మునులలో భరద్వాజుని కుమారుడు సుకేశి, శిబిపుత్రుడు సత్యకాముడు, సౌర్యుని కొడుకు గార్గ్యుడు, కత్యునిసుతుడు కబంధి, భృగుపుత్రుడు వైదర్భి, అశ్వలుని కొడుకు కౌశల్యుడు కూడ నున్నారు. వీరందఱు యువ మునులు, వేదవేదాంగపారంగతులు పరమ తపస్సంపన్నులు. పిప్పలాదుని కలిసికొని పరిపూర్ణబ్రహ్మజ్ఞానము పొందవలె నని తలంచి వీ రందఱు విచ్చేసిరి.

మహర్షులెల్లరు సమిధలు, కుశలు, పుష్పములు, మృగచర్మములు తీసికొని పిప్పలాదుని సమీపించి భక్తి శ్రద్ధలతో నమస్కరించి "మహాత్మా, మే మందఱము బ్రహ్మవిద్య బడయుటకై మిమ్ము సేవింపవచ్చితిమి. మాయందు దయయుంచి పరమనిగూఢమైన బ్రహ్మవిద్య పరిపూర్ణముగా నెఱింగింపుడు" అని ప్రార్థించిరి.

పిప్పలాదుడు వారి నందఱిని పరిశీలనగా జూచినాడు. వా రందఱు పాతిక, ముప్పది సంవత్సరములవయస్సులో నున్న యువకులు. వారి నేత్రములలో చాంచల్యము తగ్గలేదు. మాటలలో వినమ్రత తగ్గియున్నది. ప్రాపంచిక దుఃఖములను ప్రత్యక్షముగా చవిచూచు నవకాశము వారికి లభింప లేదు.

ప్పలాదమహర్షి కొంతసేపు వారిని లించి చూచి నవ్వుచు గంభీరస్వరముతో నిట్లు పలికెను. "ఋషికుమారులార, ఇది సర్వసాధారణముగా నందఱకు నుపదేశించునది కాదు. అయినను మీకు బ్రహ్మవిద్య నుపదేశింతును. కాని ఉపదేశము పొందుటకై మీ రందఱు సాధన చేయవలసియుండును. బ్రహ్మవిద్య పరమరహస్యమైనది. అర్హతగల యధికారులకు మాత్రమే యుపదేశింపదగినది బ్రహ్మవిద్య నుపదేశము పొందదగు పవిత్రత మీకు సిద్ధింపలేదు. మీరందఱు పరమతపస్సంపన్నులు, వేదవేదాంగవేత్తలు అని నే నెఱుగుదును. కాని యింతవఱకు మీకు ధైర్యము, క్షమ, సంతోషము అనువాని యథార్థానుభవము కలుగలేదు. ఇందునిమిత్తమై మీరు నాతో నొక సంవత్సరముండి కఠోరబ్రహ్మచర్య మవలంబించి పరమాస్తిక్యము సాధనచేయవలయును. వికల్పములు, బాధలు లేని మానసికస్థితిని పొందుడు. ఇట్టి సాధనచేసిన తరువాత మీ మనస్సులలోని శంకలకు తగిన ప్రత్యుత్తరము లొసంగెదను. ఇట్టి కఠోరవ్రతానుష్ఠానవిషయమై మీ రందఱు ఒక నిశ్చయమునకు వచ్చి తరువాత నాకు చెప్పుడు." ఇప్పుడు 6 గురు ఋషికుమారులు సందిగ్ధావస్థలో పడినారు. కాని పిప్పలాదుడు చెప్పినది దప్ప వారికి గత్యంతరము లేదు. కొంతసేపు వా రార్గురు ఒకరిమొగము లొకరు చూచుకొనుచు నుండిపోయిరి. కొన్నిక్షణాలతరువాత వారార్గురిలో వయస్సున కొంచెము పెద్దవాడైన కబంధి (కత్యుని కొడుకు) సాహసముగా ముందుకువచ్చి చేతులు జోడించి "పూజ్యపాదా, మీయానతి సంతోషముగా స్వీకరించితిమి. మీతో నొక సంవత్సరము కలసి మెలసి యుండగల్గుట మా యదృష్టము. మా మనస్సులలోని చిరకాల వాంఛ సులభముగా నెఱవేఱుట మా పూర్వపుణ్యఫలమే" అని విన్నవించెను.

మిగిలిన మునికుమారులుకూడ కబంధి చెప్పినదానికి మౌనముగానే మోదము తెల్పిరి. ఆసమయమున వారిముఖములందు ఆనందము

తాండవించినది. నేత్రములలో నుల్లాసము వెలుగొందినది.

పిప్పలాదుడు కబంధివైపు మరల చూపు ప్రసరింపజేసినాడు. అతని ముఖమండలముపై కొంతసేపటివఱకు కాంతివంతమైన దృక్కులు పరుగెలె త్తినవి.

కబంధి తనచూపు మరలించి పిప్పలాదుని పాదములపై ప్రసరింపజేసినాడు. పిప్పలాదుడు "నాయనా, కబంధి, నాతో నుండుటవలన మీ రనుభవింపవలసిన కష్టములను మీరు గుర్తించి నట్లు లేదు. నా కెక్కడను స్థిరనివాసము లేదను విషయము మీ రెఱుగుదురు. నాయాహారాదివిషయములు ఏప్రకారముగా నున్నవో మీరు చూచుచునే యున్నారు. సంకల్పమునకు ముందు మీరు బాగుగా యోచించుకొనుట మంచిది. ఇంతవఱకే మునికుమారుడును నా అగ్నిపరీక్ష కాగలేకపోయినారు. కొంద రాఱు నెలలవఱకు నాగగా మఱికొంద ఱింకను ముందుగనే విడిచిపెట్టిపోయిరి.

కబంధి కొంతసేపు యోచించి చేతులు జోడించి వినీతస్వరముతో "పూజ్యపాద, మా సంకల్పము ఎప్పుడును చలించునది కాదు. నేను తమపాదసన్నిధిని నివసించి జీవితము ధన్యముచేసికొన దలచితిని. నా సంకల్పమునకు విఘాత మిప్పుడే కాదు ఎప్పుడును సంభవింపదు" అని పలికి మౌన మవలంబించినాడు. కబంధి ప్రక్కననిలిచిన మిగిలిన ఋషికుమారులందఱు ఒకసంవత్సరము పిప్పలాదునివెంట సంచరించి కఠినబ్రహ్మచర్య మవలంబించుటకు తమసంసిద్ధతను వెల్లడించిరి. అది తమభాగ్యమని విన్నవించుకొనిరి.

పిప్పలాదుడు "ఋషికుమారులార, మీరు చెప్పిన ట్లంగీకరించితిని. నేటినుండి మీరందఱు నాతో నుండుడు. మనస్సును ఇంద్రియములను వశపఱచుకొనుట సాధనచేయుడు. మనస్సు మిక్కిలి చంచలమైనది. దుర్గ్రాహ్యమైనది కాన ముందు మనోనిగ్రహ మలవఱచుకొనుడు. మనోనిగ్రహము సాధించుటకు ముఖ్యమైన, కఠోరమైన యుపాయము కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములను వశపఱచుకొనుట, మెల్ల మెల్లగా నభ్యాసము చేసికొనుచు, మధ్యలో తటస్థించు కష్టములను అతిక్రమించుటకు ప్రయత్నింపుడు. త్రికరణశుద్ధిగా మీకాస్తిక్యము అలవడిన దని నేను భావించినప్పుడు మీకు బ్రహ్మవిద్య నుపదేశింతును. అప్పుడు మీ మనస్సులోని సందేహము లన్నియు తగిన సమాధానములు చెప్పి తొలగింతును" అని వివరించెను.

ఋషికుమారులు పిప్పలాదు ననుసరించి సంచరించుచు నిగ్రహ మలవఱచుకొనుటకు నిశ్చయించుకొనిరి. వా రార్గురును తమ తమ యాశ్రమములకు తమ నిశ్చయమును తెలియజేసి యానాడే పిప్పలాదుని శిష్యులుగా జేసిరి.

మునికుమారు లార్గురును మహర్షి వెంట తిరుగుచు బ్రహ్మచర్య మవలంబించి శాస్త్రప్రకారముగ నియమపాలన మొనరించిరి. ఇంద్రియములను మనస్సును వశపఱచుకొనుట నేర్చిరి. వారిలో నపూర్వమైన యాస్తిక్యభావము పెంపొందినది. సృష్టిలోని ప్రతియణువునందును భగవత్స్వరూపమే గోచరించుచున్నది తము పాండిత్యమునుగుఱించి వారి కున్న గర్వము మటుమాయమైనది.

ఒకనా డుదయము మహర్షి సంధ్యావందనాదికృత్యములు నెఱవేర్చుకొని తనశిష్యులలో పెద్దవాడైన కబంధిని దగ్గఱకు పిలిచి కూర్చుండుమని సంజ్ఞ చేసి "మీరు నాకు శిష్యులుగా

చేరి నావెంట నుండుట ప్రారంభించి సంవత్సరము దాటినది. నాకు తెలిసినంతవఱకు మీరందఱు బ్రహ్మచర్యవ్రతమును విధిపూర్వకముగ పాలించితిరి. మీకు ఇప్పటికైన సంతోషము కలిగినదో ఇంకను కలుగలేదో తెలిసికొనగోరుచున్నాను. ఎందుకనగా సంతోషమే మనస్సును ఇంద్రియములను వశపఱచుకొను ముఖ్యసాధనము.''

కబంధి వినయముగా చేతులు జోడించి ''పూజ్యగురుదేవ, మాకు లభించినదానికి, సాధింపగలిగినదానికి మీ సాంగత్యమే ముఖ్య కారణము. ఇప్పుడు మాకు కన్ను, చెవి, ముక్కు, చర్మము మొదలగు నింద్రియముల వలన నెట్టిచిక్కును లేదు. మామనస్సులలోని సందేహములు మమ్ము బాధించుట లేదు. ఇదియంతయు తమ సన్నిధానప్రభావమే. ఇట్టి యనుభవము పూర్వ మెప్పుడును లభించి యుండలేదు'' అని విన్నవించెను.

పిప్పలాదుడు కబంధి మాటలు విని గంభీర ముద్ర దాల్చినాడు. కొంతసేపు శిష్యునివైపు రెప్పవ్రాల్ప కుండ తిలకించెను. కాంతివంతములైన కబంధికన్నులు గురువుగారి పదనఖములపై నిలిచినవి. ముఖమండలమున నొకవిధమైన యుల్లాసము తాండవించుచుండెను. పిప్పలాదుడు ''నాయనా, నీకు బ్రహ్మవిద్యాధికారము సిద్ధించిన దని నమ్ముచున్నాను. న న్నడుగదలచిన దడుగవచ్చును'' అని సెలవిచ్చెను. కబంధి కృతార్థు డయ్యెను. వాని సాధనయొక్క సఫలతపై గురువుగారి యామోదముద్ర పడినది. విరాగియైన పిప్పలాదుని యనుగ్రహము కబంధికి రోమాంచము కలిగించినది. శిష్యుడు లేచి గురువు చరణకమలములపై శిరస్సు నుంచినాడు. అతని కన్నులు కృతజ్ఞతవలన చెమ్మగిల్లినవి. గురువు దక్షిణహస్తముతో శిష్యుని వీపుపై నిమురుచు ''కుమారా, నీసాధనకు సంతసించితిని. న న్నడుగదలచినది యడుగ వచ్చును'' అని యనుగ్రహించెను.

కబంధి చేతులు జోడించి ''గురుదేవ, ఈ చరాచరప్రపంచమున గల ప్రాణు లన్నియు నెట్లు జన్మించుచున్నవి? న న్నీయొక్క సందేహము బాధించుచున్నది'' అని విన్నవించెను. పిప్పలాదుడు ''నాయనా, నీ వడిగిన ప్రశ్న సులభమైనది కాదు. శ్రద్ధగా నాలకింపుము. సవిస్తరముగా తెలియజేయుదును.''

కబంధి నిర్నిమేషదృష్టులతో గురువుగారి ముఖమండలము తిలకించుచు ఉపదేశామృతము గ్రోలుటకై సంసిద్ధుడయ్యెను.

పిప్పలాదుడు – ''కబంధి, ఈ చరాచర ప్రపంచమున గల జీవరాసుల కన్నింటికిని సృష్టికర్త ప్రజాపతియైన బ్రహ్మ. ప్రాణులను సృష్టించుటకై యతడు ఘోరతపస్సు (ఏకాగ్ర చింతనము) చేసి తనమనస్సును జాగరిత మొనరించినాడు. మనస్సును జాగరిత మొనరించి సృష్టించుటకు సంకల్పించినాడు. ఇందు నిమిత్తమై అన్నప్రాణములను సృష్టించెను. ఈ అన్నప్రాణములసంయోగమువలననే ప్రపంచమున పెక్కువిధములగు ప్రజలను సృష్టించెను. అన్నము చంద్రుడు ప్రాణము (ప్రాణరూపాగ్నికి అధిష్ఠానదైవమైన) సూర్యుడునై యున్నారు.

ఉదయము తూర్పున ఉదయించిన సూర్యుడు జీవశక్తి నొసంగు కిరణములతో ప్రాగ్భాగమందలి ప్రాణులకు వెలుగు నొసంగును. మధ్యాహ్నము దక్షిణదిశకు, సాయంకాలము పడమటిదిక్కునకు వెలుగు నొసంగును. అట్లే ఉత్తరదిశకు, పైకి, క్రిందకు, ప్రాణప్రదమైన వెలుగు ప్రసరింపజేయును. ఇట్టి సూర్యుడు

సర్వవ్యాపకమైన యాత్మస్వరూపమే. సూర్యుని వలననే చరాచరప్రపంచ మేర్పడుచున్నది.''

కబంధి గురువు చెప్పునది వినుచు అస్తమించుచున్న సూర్యుని విస్మితనేత్రములతో కొంతసేపు చూచి ''గురుదేవా, సూర్యుని వ్యాపకత్వమునుగురించి యింకను వినగోరుచున్నాను'' అని పలికెను.

పిప్పలాదుడు కొంతసేపు మౌన మవలంబించి ''వత్సా, సూర్యుడు విశ్వవ్యాపి. సూర్యకిరణములు చొరలేని చోటు లేదు. అతడు జ్ఞానస్వరూపుడు. సర్వప్రాణులకు ఆశ్రయ మొసంగువాడు. అందఱకు చూపు నొసంగు దైవము. ప్రాణరూపమైన యగ్ని సూర్యుని తేజఃపుంజములోని కణము మాత్రమే.''

కబంధి – ''గురుదేవా, సూర్యునియునికి, గమనము దేనిపై నాధారపడి యున్నవి? సూర్యుని పొందు టెట్లు?''

పిప్పలాదుడు ''నాయనా, సూర్యునివలన నిర్మితమగు సంవత్సరమే ప్రజాపతి యగు బ్రహ్మగా నెఱుంగుము. సూర్యున కుత్తరాయణము దక్షిణాయనము అని రెండుమార్గములు కలవు.

''ప్రపంచమున జన్మించి సాంసారికవాంఛలలో కర్మజాలమునపడి యుండువారు మృత్యుమార్గమని చెప్పబడు దక్షిణమార్గమును పొందుదురు. అట్టివారు దక్షిణమార్గము ద్వారా చంద్రలోకము పొందుదురు. వారికర్మల ననుసరించి పుట్టుచు చచ్చుచుందురు. బ్రహ్మచర్యము తపస్సు శ్రద్ధ జ్ఞానము అనువాని ద్వారా ఆత్మస్వరూపాన్వేషణ చేయువారు ప్రాణరూపియైన సూర్యుని యథార్థరూపము గుర్తింపగలరు. అట్టివా రుత్తరమార్గమున పయనించి శాశ్వతమైన సూర్యలోకము డయగలరు. సూర్యలోకము పొందినవారు జననమరణరూపమైన చక్రమున తిరుగ నక్కఱలేదు.

పరమపితయైన సూర్యుని విషయమై పెక్కుమంది విద్వాంసులు పెక్కురకాలుగా వివరించుచున్నారు. సూర్యుడు కాలస్వరూపుడని భావించువారు అయిదు ఋతువులు సూర్యుని అయిదు పాదములనియు (వారి యుద్దేశములో హేమంతము శిశిరము ఒక్కఋతువే) చైత్రాదిమాసములు 12 సూర్యుని 12 అంగములనియు భావింతురు. కొందఱు పండితులు సూర్యుడు జ్ఞానస్వరూపుడనియు, సచరాచర జగత్తునకు సృష్టికర్త యనియు సూర్యుని కిరణములలోని 7 రంగులు 7 జ్ఞానచక్రములనియు భావింతురు. ఈ విద్వాంసులు వసంతాదిఋతువులాఱును చక్రములకు ఆకులనియు కాలరూపమైన రథముపై సూర్యు డధిష్ఠించుననియు చెప్పుదురు. నాయనా, పండితుల యభిప్రాయములు భిన్నముగా నున్నను సూర్యస్వరూపియైన పరబ్రహ్మమే స్థూలసూక్ష్మస్వరూపములతో చరాచరప్రపంచమునకు కర్త యనుటలో సందేహము లేదు. ఈ సూర్యునివలననే సమస్త చరాచరప్రపంచము సృష్టిస్థితిలయముల నందుచున్నది.'' పిప్పలాదుని యుపదేశమువలన కబంధిసందేహము లన్నియు తొలగినవి. వానినేత్రములు అపూర్వకాంతితో వెలుగ సాగినవి. అతని నిర్మలహృదయము సాత్త్వికానందముతో నిండిపోయినది. గురుపాదధూళి కన్నుల కద్దుకొని శిరస్సుపై ధరించినాడు.

# పరబ్రహ్మముతో మన బాంధవ్యము*

## శ్రీ కలగర నాగభూషణచౌదరిగారు

తత్త్వధర్మజిజ్ఞాసువులకును, సత్యాన్వేషకులకును, మానవునకు పరబ్రహ్మముతో గల బాంధవ్యమును గుఱించి సుస్పష్టమయిన జ్ఞాన మత్యంతావశ్యకము. పురాతనకాలమునుండి తత్త్వవేత్తలీ బాంధవ్యమును తెలియజేయుటకు కృషి సలిపి, భిన్నభిన్ననిర్ణయములకు వచ్చి, వాని నాధారము చేసికొని యనేకమయిన తత్త్వ ధర్మసిద్ధాంతములను చేసి యుండిరి.

కాని ప్రపంచమున గల యనేకధార్మిక గ్రంథములలో నెచటను పరబ్రహ్మప్రశంసయే కానరాదు. వ్యక్తిదేవుని (Personal God) గుఱించి మాత్రమే చెప్పబడినది. వ్యక్తిదేవుడు, పరబ్రహ్మము, రెండు నొకటేనా? కానిచో పరబ్రహ్మ మన నేమి? క్రైస్తవుల బైబిలును పరిశీలించినచో, భగవంతుడు, విశ్వమునకంతకు ప్రభువనియు, సృష్టికర్త, పాలకుడు, శాసకుడు అనియు తెలియును. దేవుని కన్ని గుణములు, లక్షణములు చెప్పబడినవి గాని, యీ దేవుడు, పరబ్రహ్మమునకు భిన్ను డని గాని, యీ దేవుడే పరబ్రహ్మమని గాని చెప్పబడియుండలేదు. పారశీకుల జెండవస్థ, మహమ్మదీయుల కొరాను మొదలగు నితర మతముల ధార్మికగ్రంథములలో కూడ, ఈ దేవుడే పరబ్రహ్మ మని యర్థము చెప్పకొనిన తప్ప, పరబ్రహ్మ మను మాటయే లేదు.

పరబ్రహ్మ మను భావమే లేని యితరులు కొంద ఱున్నారు. వారికి దానిని గుఱించి తెలియనే తెలియదు. దేవుని యునికినిగాని, జీవబ్రహ్మైక్యమును గాని వారు విశ్వసింపరు. సర్వము ప్రకృతియొక్క యాంత్రికపద్ధతిని పదార్థము యొక్క సూక్ష్మరేణువులనుండి యుద్భవించిన దని వారు భావింతురు. భగవంతునికి, (పరబ్రహ్మమునకు,) మనకు గల బాంధవ్యమును గుఱించి యాలోచించుట కాలమును శక్తిని దుర్వినియోగము చేయుట యని వారి తలంపు. అందుచే వానిని గుఱించి చింతింపరాదు. ఈ జగత్తులో నివసించుచు, దీనిని నిరీశ్వరమయిన జగత్తుగ నెంచుచు, ఈ నిరీశ్వరజగత్తునుండి ఆత్మలేని శరీరసౌఖ్యము కొఱకు కావలసిన భోగముల నన్నిటిని పొందుటయే వారికిష్టము. మరణముతో సర్వము నంత మగు నని వారి యుద్దేశము. భౌతిక శరీరముగతియే, భౌతికవిశ్వమునకు కూడ కలుగు నని వారి నమ్మకము. పరబ్రహ్మ మనునది లేనే లేదు. దానిని గుఱించి మనము యోచింపలేము. ఈవిధమగు చింతగలవారు కొందఱు. వారికి, భౌతికవాదులని, నిరీశ్వరవాదులని, నాస్తికులని వివిధముగ నామకరణము చేయవచ్చును. వీరికి భిన్నులగువారిని, ద్వైతులు, విశిష్టాద్వైతులు, అద్వైతులు అని మూడు తెగలుగ విభజింపవచ్చును.

ద్వైతులు, సృష్టికర్త, నియామకుడు, పాలకుడు, సగుణుడు అను పరబ్రహ్మముయొక్క యొకముఖమునే గాంతురు. వారిదృష్టిలో, విశ్వనియామకుడు, సగుణుడు అనునదే సర్వస్వము. ఆయన ఈ విశ్వమును శూన్యములో నుండి సృష్టించును. మానవులను శూన్యములో నుండి సృష్టించును. ప్రతిదానికి నొక యాకారమును, నామమును ఇచ్చి పిమ్మట ప్రతిదానిని పాలించును. ఆయన మనకును, విశ్వమునకును వెలుపల నున్నాడు. ఆయన ప్రకృతికి, మనకు,

* మూలము : శ్రీ అభేదానందస్వామి

మన భావనకు ఆవల నున్నాడు. ఆయన చేతిలో కీలుబొమ్మల మగుట తప్ప మన మేమియు కాము. ఇట్టి విశ్వాసము గలవారు కొందఱాయనకు మానవగుణముల నారోపించి, ఆ గుణములే కొండంతలుగా గల మానవునిగ భావింతురు. ఇతరు లాయనకు రూప మున్నట్లు భావింతురు. వారీసగుణునకు, సృష్టికర్తకు, విశ్వపాలకునకు మానవరూపము నూహింతురు. బైబిలు ఆదికాండలో ఈడెను వనమునం దిట్టి వర్ణనమును మనము చదువుదుము. భగవానుడు నడచెను. ఆయనకు కంఠస్వన ముండెను. ఆయన కంఠధ్వనిని విని ఆదాము, ఆయన కంట బడకుండ చెట్లవెనుక, పొదలవెనుక దాగుకొనెను. ఇశ్రాయెలు పెద్దలలో డెబ్బదిమందికూడ దేవుని చూచిరి. మోసెసు యహోవా వీపును చూచెను. యహోవా మామ్రేలో వృక్షముల క్రింద భుజించెను. బలిఅన్నముయొక్క కమ్మనివాసన కాయన సంతుష్టుడయ్యెను. యహోవాకు మన అందఱికివలె మానవగుణములు, మానవ లక్షణము లుండెను. మన లోపములుమాత్ర మీ సగుణబ్రహ్మమునకు ముడిపెట్టబడలేదు. ఆయన హస్తద్వయముతో సింహాసనము నధిష్ఠించి, దుర్మార్గులను శాశ్వతమగు గ్నిలో త్రేల్చును. సృష్టింపబడినదానికిని సృష్టికర్తకును, పాలకునకును, పాలితులకును, బానిసకును యజమానునికిని గల బాంధవ్యమే యట్టి పరబ్రహ్మమునకును మనకును గల బాంధవ్యము. బానిస తన యజమానునికి విధేయుడయి యుండి, తన విధులను సక్రమముగ నెఱవేర్చి, యజమానునియాజ్ఞల నన్నిటిని పాలించునట్లు, మనముకూడ స్వర్గములో నున్న ప్రభువు ఆజ్ఞల నన్నిటిని విధేయతతో పాలింపవలెను. లేనిచో ఆయన మనను శిక్షించును.

అట్టి మతములకును, భక్తివిశ్వాసములకును, సాధనలకును శిక్ష యను దానిభయమే మూలమయి యున్నది. మనము జీవించుచు నితరుల నేల జీవింపనీయవలెను? భయము చేతనే లేనిచో శిక్ష ననుభవింపవలసియుండును. ఒక రాజ్యములో రాజశాసనమును, పాలకుని యాజ్ఞల నుల్లంఘించినచో మన మెట్టు శిక్షార్హులమో అట్లే.

ఈ బాంధవ్యము, యూదులు, మహమ్మదీయులు, క్రైస్తవులు అను వారిలో కనపడుచున్నది. వారి వ్యక్తిదేవునితో మఱి యే యితరసంబంధమును గుఱించి మాటలాడినను వారు వినజాలరు. 'మే మాయన బానిసలము. సేవకులము. జంతువులము. ఆయన నెన్నడును సమీపింపలేము' అని వారు సమాధాన మిత్తురు. పారసీధర్మగ్రంథములలోకూడ ఆ హూరామజ్దాసింహాసనము నధిష్ఠించియున్నట్లు కనపడును. ఆయనను కూడ నెవరును సమీపింపలేరు.

బైబిలు ఆదికాండలో, దేవుడు మానవుని తన ప్రతిబింబముగ సృష్టించె నని చెప్పబడినను, ఆ ప్రతిబింబ మన నేమో తెలిసికొనుట మిక్కిలి కష్టము. మనరూపము దేవునిప్రతిబింబ మనియా దాని యర్థము? దేవునికి మానవరూప మున్నచో, సామాన్యమానవులు సహజముగ ప్రతిబింబ మన మన రూపమే యని యర్థము చేసికొందురు. పరబ్రహ్మమును, సర్వశక్తిసంపన్నుడునగు నీశ్వరుని మానవరూపమునుబోలి మన ముంటి మని యనుకొందురు, అయినను, సృష్టికిని సృష్టికర్తకును సేవకునికిని యజమానునికిని గల బాంధవ్యమే మిగిలి యున్నది. మనము ప్రతిబింబ మను పదము నర్థముచేసికొన ప్రయత్నించినచో, మొదట ఆదాము దేవుని ప్రతిబింబముగ సృష్టింపబడె

నని అనగా నతని యాశాపతనములకు పూర్వమితనియందు దైవీలక్షణము లుండె ననియు, పిమ్మట వానిని గోల్పోయి పాపాత్ము డయ్యె ననియు మనకు తోచును. దేవుని ప్రతిబింబత్వమాతనియందు లేకుండపోయెను. ఆతనినుండి మన ముద్భవించినందున పాపము లన్నియు మనకు సంక్రమించినవి. అందుచే భగవంతుని ప్రతిబింబమును మనముకూడ పోగొట్టుకొంటిమి. ఏసుక్రీస్తు భగవత్సంజనితుడగు నేకైక పుత్రుడు. ఆయనది ప్రత్యేకవిషయము. ఆయన పాపములో పుట్టి యుండలేదు. ఇతరమానవులందరికంటె భిన్నముగ తాను భగవంతుని యేకైకపుత్రుడ నని యేసుక్రీస్తు ఎన్నడయినను చెప్పదలంచెనా యనున దింకను సందేహాస్పదమయిన విషయము. ఆ ప్రశ్నకు సమాధానమింకను తేలవలసియున్నది. అందు చాల చిక్కు లుండుటచే క్రైస్తవచర్చిలవా రీ ప్రశ్న నెత్తనే యెత్తరు. మన మందఱము భగవంతునిసంతాన మయినచో, రాజకుమారుని వివాహోపాఖ్యానములో చదివినట్లు స్వర్గవాసియగు మనతండ్రి మనను శాశ్వతమయిన యగ్నిలో నేల వ్రేల్చి శిక్షింపవలెను? ఆ యుపాఖ్యానములో 'వీనిని (తనపుత్రుని) కాలుసేతులు కట్టి తీసికొనిపోయి ఏడ్పులు పెడబొబ్బలు గల యంధకారములో పడవేయుడు. ఎందఱికి పిలుపు వచ్చినను కొలది మందిమాత్రమే యుత్తీర్ణు లగుదురు' అని రాజాజ్ఞ యయినట్లు చెప్పబడియున్నది. మత్తయిసువార్తలో 'ఓ సర్పములారా, విషపు పురుగులారా, మీరు నరకజ్వాలలనుండి యెట్లు తప్పించుకొన గలరు?' అని యేసుక్రీస్తు నుడివినట్లు చెప్పబడియున్నది. అట్టి భావములు, స్వర్గవాసియగు తండ్రి, కరుణామయుడు, ప్రేమస్వరూపుడు నగు తండ్రి తనబిడ్డల నెట్లు శాశ్వతమయిన యగ్నిలో వ్రేల్చి శిక్షించు నను తలంపున కెదురుతిరుగునట్లు చేయును. ఈ భావములు శతాబ్దములుగ మనకు నేర్పబడి బోధింపబడుచున్నవి. కాని యవి భగవంతునిగూర్చిన మనభావనను మార్పగలవా? పరబ్రహ్మమును గుఱించి, పరబ్రహ్మమునకు మనకు గల బాంధవ్యమును గుఱించి అవి యేవయిన క్రొత్తవిషయములను మనకు తెలుపుచున్నవా? ఏమియు లేదు. మనము శూన్యమునుండి పుట్టితిమా, పూర్వమునుండి యుంటిమా యను ప్రశ్న లన్నియు సమాధానములేని గుప్తవిషయములుగ విడిచిపెట్టబడినవి. ఈ ధార్మికగ్రంథపఠనమువలన, ఆత్మయొక్క స్వభావమును, దానికి దేవునితో గల యథార్థసంబంధమును, మనము మరణానంతరము కూడ జీవించుచు మరల నీ భూమి మీదికి వత్తుమా లేదా యను విషయమును తెలిసికొనలేము, అర్థము చేసికొనలేము. అవి యన్నియు మనకు గుహ్యములు. మనకు కొన్ని సూత్రములు, సిద్ధాంతములుమాత్ర మియ్యబడినవి. వానియందు మనకిష్టమున్నను లేకున్నను, అవి మన కుపకరించినను లేకపోయినను వానిని మనము తప్పనిసరిగ నంగీకరించియే తీరవలెను. వాని నంగీకరించి సత్యములని విశ్వసింపవలెను.

ఇతరవర్గములకు చెందిన ద్వైతులు, సగుణుడగు భగవంతుడు ప్రకృతికి విశ్వమునకు భిన్నముగ నుండుననియు, కాని శూన్యమునుండిమాత్రము దేనిని సృజింపజాల డనియు విశ్వసింతురు. ఆయన సర్వమును ప్రకృతిపదార్థమునుండి సృజించును. వారి యభిప్రాయము ననుసరించి, దేవునితోపాటు ప్రకృతి కూడ ననాది శాశ్వతము. దేవుడు శాశ్వతుడు, ప్రకృతి శాశ్వతము. ప్రత్యగాత్మలు శాశ్వత

ములు. ఆత్మలు ప్రకృతిలో నుండును. సృష్టి కాలమందు ఈశ్వరుడు వానిని ప్రకృతినుండి వెలికి లాగి జంతుజాలములుగను మానవులుగను చేయును. భారతదేశమునను ప్రపంచమున నితరభాగములలోను గల యితర ద్వైత మతముల ననుసరించి, ప్రకృతిలో నదివఱకే యున్న దానిని వెలికి దీయుటయే సృష్టి. వారి యభిప్రాయములో సృజింపబడినవానికిని సృష్టికర్తకును, బానిసకును యజమానునికిని గల సంబంధమువలె మాత్రమే గాక, వ్యష్టిఆత్మకును దేవునికిని గల సంబంధము, పుత్రునికిని, ప్రేమించు తండ్రికిని గల సంబంధమువంటిది. ఈశ్వరుడు తనపుత్రుని శిక్షింపడు. ఆయన దుర్మార్గులను శిక్షింపడు. ఈ తెగకు చెందిన ద్వైతులు, శిక్షణ, రక్షణయనుప్రశ్నకు కార్యకారణధర్మమును సమాధానముగ చెప్పుదురు. ప్రతికారణము నొకకార్యము కలిగింపవలెను. ఈ కార్యకారణ (క్రియప్రతిక్రియ) ధర్మము మానవకోటి కంతటికిని వర్తించును. దానినుండి తప్పించుకొనలేము. మన మేదయిన దుష్కార్యము నొనర్చినచో, క్రియప్రతిక్రియధర్మము ననుసరించి దానిఫలితము తిరిగి మన కడకు వచ్చి దాని ననుభవింతుము. వ్రేలి నగ్నిలో నుంచినచో నది కాలును. వ్రేలి నగ్నియందుంచుట యను క్రియవలన కాలుట యను ప్రతిక్రియ వచ్చి బాధపడుదుము. అందుచే ప్రతిచెడ్డపనియు సహజముగ బాధను కలిగించును. సైతానుగాని, మఱియొక పాపనిర్మాతగాని కల డని విశ్వసింప నవసరము లేదు. శాశ్వతశిక్షాకేంద్రముగాని, నరకజ్వాలగాని యెచటను లేదు. కాని దుష్టుల యాత్మలు దారి తెన్ను తెలియక తడవుకొను నొక విధమయిన యంధకారముమాత్ర మున్నది. చనిపోయిన పిమ్మట తా మెచట నున్నదియు వారికి తెలియదు. దారి తెన్ను తెలియదు. అజ్ఞానములో నుందురు. ఈ లోకమున చాలమంది యజ్ఞానతిమిరమున బడి కొట్టుకొనుచున్నట్లే, యేమి జరుగనున్నదియు వారికి తెలియదు. వారు దేనిని చూడరు, చూడజాలరు. కన్నులు మూసికొనిన ట్లుండును. వారిదృష్టి మిక్కిలి హ్రస్వముగను సంకుచితముగ నుండును. వారు పర్యవసానము నాలోచింపక యొక విధమయిన పని చేయ నారంభింతురు. అదియే మనము 'నరకము' అని పేర్కొను స్థితి. ఈ లోకమునకూడ మన మంధకారములో జీవించుచున్నచో, నరకమున నున్నట్లే. ఈ లోకమున నొకవ్యక్తి యంధకారములో నుండి యే ధర్మమును తెలిసికొనలే దని యనుకొందము. జీవితమంతయు పరమమూర్ఖునివలె తప్పులే చేసె ననుకొందము. చనిపోయినపిమ్మట నత డొక్కసారిగ సర్వజ్ఞుడగు దేవత యగునా? ఎప్పుడును కాదు. అతడు భౌతికజీవితములో నెట్లుండెనో, అట్లే యుండును. ఆత్మహత్య చేసికొనినవాడు, మరణానంతరము తా నెచట నున్నదియు తెలిసికొనజాలడు. అంతయు నంధకారము, అగమ్యగోచరముగ నుండును. అతడు కొన్నిధర్మముల నుల్లంఘించి దాని ఫలితమును తెచ్చిపెట్టుకొనెను. దానితో నీశ్వరుని కేమి సంబంధము? సైతానుయొక్క లేక పాపమును సృష్టించు మఱియొకరియొక్క యావశ్యకత యేమి?

కనుక భారతదేశమునుండి సైతానును గాక సగుణబ్రహ్మమునుమాత్రమే విశ్వసించు ద్వైతులు, మానవుల యాత్మ జీవితమును నడపు కొన్నిధర్మములను తెలిసికొనిరి. పాపనిర్మాత కల డని నమ్మువారు, ఆ ధర్మముయొక్క యొకభాగమునకు మానవరూపము నిచ్చి, ఆ మానవరూపధారియగు పాపమునకు

భీతి నొందుచున్నారు. ఇది కేవలము కల్పనామాత్రమే. మన మనస్సుకు వెలుపల పాపమునకు రూప మెచటను లేదు.

సత్కార్యములను చేయువారు, ఆయురారోగ్య భాగ్యములను ప్రాపంచికసుఖముల నన్నిటిని అనుభవింతురు. సంస్కారములతో జన్మించినవాడు, వానిని పూర్వజన్మనుండి తనతో తెచ్చుకొనుచున్నాడు. ఆత్మలు ఆకస్మికముగ తయారుచేయబడినవి కావు. అవి పరిణామములో వివిధములయిన దశలను పొందుచు క్రిందినుండి పయికి పోవుచు, అనేకములయిన యనుభవములను సంపాదించుచు పరబ్రహ్మజ్ఞాన మను చరమలక్ష్యమునకు ప్రయాణమును సాగించుచున్నవి. పరబ్రహ్మమును తెలిసికొనుటయే అందఱి లక్ష్యము. ఇపుడు పరబ్రహ్మ మన నేమియో తెలియక పోయినను, ఎప్పటికయినను మన కన్నులు తెఱవబడును. ఎపుడో ఒకప్పుడు మఱియొక విధమగు నున్నతమయిన జ్ఞానమును పొంది, మన జీవితములను నడపు ధర్మముల నేనాటికయినను అవగాహన చేసికొన గలుగుదుము. ప్రస్తుతము వానినిగుఱించి మనకు తెలియదు. అందుచే మన పరిణామము పూర్తికాలేదు. ఆదర్శమగు మన లక్ష్యమును ఆస్థితిని సాధించు వఱకు మనము పరిణామమును పొందుచు, దినదినాభివృద్ధిని గాంచుచున్నాము. పరబ్రహ్మ మన నేమో తెలిసికొనగలుగుటకు ముందు మన యాధ్యాత్మికాభివృద్ధిలో వివిధదశల పరిణామమును మనము దాటవలసియుండును. మున్ముందు భౌతికశరీరముతోను, దానికి విశ్వముతో గల సంబంధముతోను ప్రారంభింతుము. పిమ్మట పయినుండి క్రమముగ లోనికి కేంద్రమునకు పోవుదుము. విశ్వమున కావల నుండువాడును, శూన్యమునుండి సృష్టించువాడు నగు సగుణబ్రహ్మము మనకు తెలిసి యుండినచో, మనము క్రమముగ నీ తప్పుఅభిప్రాయములను తప్పుభావనల నన్నిటిని తొలగించుకొనగలుగు స్థితికి వచ్చి, భగవంతుని స్వభావమును స్పష్టముగ తెలిసికొని భగవంతునికి మనము కల్పించు లక్షణములను విమర్శించి, పిమ్మట నీ యన్ని భావనల కధిష్ఠానమగు పరమసత్యమును తెలిసికొందుము. ప్రస్తుతము మనము మానవుని మనస్సుచే సృష్టింపబడిన మానవదేవు నారాధించుచున్నాము. నిజమయిన దేవుడు దూరమున నెచటనో యున్నాడు. సగుణబ్రహ్మమునకు ప్రణామము చేయునపుడు మనము మానసికముగ నొక మూర్తిని భావించుకొందుము. ఆమూర్తి మన మనఃకల్పితము. క్రీస్తును తలంచినపుడు ఆయన మూర్తిని మానసికముగ భావింపవలసియుండును. క్రీస్తు పటమును గాని విగ్రహమును గాని చూచి యుందుము. దానివలె నుండునట్లు, దానిని పూర్తిగ పోలియుండునట్లు మనస్సులో నొక మూర్తిని భావింతుము. అది కేవలము మనస్సులో పుట్టినదే. అసలు క్రీస్తు ఎచటనో యున్నాడు. కొందఱు చిత్రకారులు క్రీస్తుకు నీలనేత్రములు, బంగారువన్నె గల కేశములు నున్నట్లు చిత్రించి యున్నారు. క్రీస్తున కట్టివేవియు లేకే యుండవచ్చును. ఆయన ఆశియాఖండమున జన్మించెను. నల్లని కేశములతోను నేత్రములతోను జన్మించెను. కాని తెల్లజాతులవారు తమవలె తెల్లగ, నీలనేత్రములతో బంగరురంగుగల వెండ్రుకలతో నుండు నని యూహించుకొందురు. అట్టి మూర్తిని మనస్సులో కల్పించుకొని దాని ముందు మోకరిల్లి ప్రార్థించుచున్నారు.

అట్లే యహోవాను గుఱించి గాని మఱియొక వ్యక్తిదేవుని నామమును గాని స్మరించి

నపుడు ఆయన నామమును జపించుచు, మానసికముగ నాయనమూర్తిని బహుశః పెద్దయాకారము, అంతు లేని బలము, శక్తి, జ్ఞానము, అన్నిటిని చూచు కన్నులు – మొదలయినవానితో నూహించుకొందుము. అవి యన్నియు మనోభావములే గాని మఱేమియు కావు. పరబ్రహ్మ మన నేమియో తెలిసికొన యత్నించినపుడు మన మీ భావనలనన్నిటిని నతిక్రమింపవలసియుండును. ఈ భావనలన్నియు పరబ్రహ్మజ్ఞానోపలబ్ధికి సోపానములుమాత్రమే.

అందుచే వ్యక్తిదేవుని భావించుకొనుట మొదటిమెట్టు. పిమ్మట క్రమముగ నభివృద్ధి గాంచుచు, విశ్వమున కావల మేఘములలో నాకసమున నున్న వ్యక్తిదేవునికంటె నున్నతమును, గొప్పదియు నను భావనలోనికి పోవుదుము. దానిని విశిష్టాద్వైతమందురు; దేవుడు ప్రకృతినుండి వేఱుగ లేడు. ఆయన ప్రకృతిలోనే నివసించుచుండును. ఆయన యెచటనో దూరమున లేడు. సమీపమున, సర్వాంతర్యామి యయియున్నాడు. ప్రకృతికి వెలుపలనుండి శాసించుట లేదు. శరీరమును పాలించుచు ఆత్మ యున్నట్లే, భగవంతుడు లోపలినుండియే ప్రకృతిని పాలించుచున్నాడు. ఆత్మ శరీరములో నుండియే శాసించుచున్నది. అట్లే యీశ్వరుడు ప్రకృతిలో నుండియే ప్రకృతిని శాసించుచున్నాడు. ఆయన ప్రతియణువునందు నున్నాడు. సూర్యమండలములో, సూర్యచంద్రతారకలలో, పృథ్వియందు, మనశరీరములలో, ఆబల్ల, యీకుర్చీ, అది యిది యన నేల, సర్వమునందును, అన్ని యెడల నున్నాడు. ఆయన సర్వోపగతుడు. ప్రాకృతికశక్తులన్నియు నాయన సంకల్ప వ్యక్తీకరణములుమాత్రమే. వ్యష్టి మనస్సుల సమష్టి ఆయనమనస్సు. అదియే విశ్వమనస్సు. వ్యష్టిసంకల్పముల సమష్టియే ఆయనసంకల్పము. ఆయన కసంఖ్యాకములగు నేత్రము లున్నవి. అన్ని కన్నులతోను చూచును, అన్ని చెవులతోను వినును, అన్ని మేధస్సులతోను ఆలోచించును, అన్ని చేతులతోను పనిచేయును. ఆ విశ్వవిరాట్పురుషునిలో మన మొకభాగము, అంశము. ఆయన మహత్తరమయిన పరిపూర్ణము. మనమాయనలో జీవించి, మనుచున్నాము. ఆయన వినా ఏమియు లేదు. ఈ భావన, భగవంతుని, జగత్తును సమన్వయముచేయును. వ్యక్తిదేవుని కంటె, నిది విశ్వాత్మకమయినది. విశ్వాత్మకము మాత్రమే గాక అనుష్ఠానయోగ్యము కూడ నయి యున్నది. ఇది భగవచ్చైతన్యములో నాదర్శజీవితమును జీవించుటకు మనకు తోడ్పడును. భగవంతు డెచటనో దూరమున నున్నాడని, మన మాయనను చేరజాలమని తలంచినచో, భగవచ్చైతన్యయుతమగు నాదర్శజీవితము మనకు లభింపనేరదు. అందుకు భిన్నముగ, భగవంతుడు మన యంతరంగమున నున్నాడని, మన మాయనయందే జీవించి నడయాడుచుంటిమని మనము గ్రహించినచో, మనము చేయు పను లన్నియు మనవి కావనియు, మన మొకానొక దైవీశక్తిచే, పరాసంకల్పముచే నడుపబడుచుంటి మనియు, అదియే సర్వమును పాలించి శాసించు ననియు గ్రహింపగలుగుదుము. మొదట వర్ణింపబడిన ద్వైతవాదులు చెప్పినట్లు, భగవంతుడు, శూన్యములోనుండి దేనిని సృష్టింపడు, ఆయన విశ్వమునకు నిమిత్తోపాదానకారణములు రెండు నయి యున్నాడు. ఆయన మనప్రకృతియే. ప్రకృతి యాయనశరీరము. ప్రకృతి యన, భగవంతునికి శరీరమువలె నుండు దైవీశక్తియే. మన మింద్రియములతో చూచు స్థూలభౌతికవిశ్వమే భగవంతుని భౌతిక శరీరము. ఆయన విశ్వమునకు ఆత్మ. మన

అందఱి మనస్సుల సమష్టియే-విశ్వమనస్సే. విశ్వమనస్సుతో మనకు గల సంబంధము, సంతతప్రవాహమగు విశ్వమనస్సునకును, అందుదయించు తరంగములకును గల సంబంధము వంటిది. మనవ్యష్టిసంకల్పములు సూర్యకిరణములవంటివి. దైవసంకల్పములో నీ కిరణములన్నియు కలసియుండును. సూర్యకిరణములు, స్వయంప్రకాశకము, దేదీప్యమానము నగు నాదివ్యగోళమునుండి వెలువడునట్లు, వ్యష్టిసంకల్ప కిరణము లన్నియు ఆయేకమూలమునుండి వెలువడును. మనము భగవంతునికి దూరముగ నుండలేము. మన మాయనయందే జీవించుచున్నాము. మన మేది చేయుచున్నను; వీథిలో నడచుచున్నను, చేతులతో పనిచేయుచున్నను, భగవంతుడు మనలో నున్నాడనియు మన మాయనచేతిలోని సాధనములవలె మాత్రమే యుంటి మనియు, ఈమానవశరీరములను సాధనములు దైవసంకల్పముచే నడుపబడి పాలింపబడుచున్న వనియు తలంచినచో, మన మే తప్పును గాని దుష్కార్యమును గాని చేయజాలము. ఎన్నడును ఎట్టితప్పును చేయ వీలులేని సర్వోపగతుడగు దేవుని స్మరణము మనస్సులో నుండుటచే మనము తప్పును గాని దుష్కార్యమును గాని చేయుట యసంభవమగును. ప్రస్తుతము, మనవ్యష్టియాత్మను గుఱించి మనకు గల జ్ఞానము, అట్టి మఱియొక జ్ఞానమునుండి, అనగా విశ్వమునుండి వేఱుగ నుండుటచే, ప్రస్తుతము మనకు గల జ్ఞానము కంటె దైవస్మరణయుతమయిన జ్ఞానము మనకెక్కువ సత్యమయినది. మన మీ వ్యష్టిశరీరముకొఱకే జీవించుచున్నాము. వ్యష్టిశరీరమునకు సంబంధించిన దెల్లను, ఆ జ్ఞానమును, మిక్కిలి సంకుచితమును పరిమితమునయియున్నది. దానివలన మనకు సుఖము లభింపనేరదు. మిగిలిన విశ్వమునుండి వేఱుగ నున్న దని యంగీకరింపబడిన యీ వ్యష్టియాత్మజ్ఞానము, అజ్ఞానాత్మవ్యామోహజన్యము. ఒకరినుండి యొకరు విశ్వమునుండి వేఱుపడి మన మీ విశ్వములో నుండజాలము.

# మాయావాదము

### శ్రీ నిర్వాణానందస్వామి

మాయావాదమునకు ఉపోద్ఘాత మవసరము లేదనుకొందును. అది ప్రథమప్రాముఖ్యము గల విషయము. వేదాంతతత్త్వశాస్త్రము దానిపైనే యాధారపడి యున్నది. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అను భావముతో నీ జగత్తు అసత్యముగా పరిగణింపబడుచున్నది. బ్రహ్మ "అద్వితీయం" అనియు, రెండవది లేనిదిగా చెప్పబడుచున్నది. దాని అంతరార్థ మేలాగున నున్నప్పటికి తత్త్వసమస్యల విషయములో నీ మాయాసిద్ధాంత మనునది కొంత పొరపాటుకు లోనై యున్నదనుట స్పష్టము. సర్వసామాన్యమైన మానవుని మనస్సులో వ్యాపించి యున్న తప్పు టభిప్రాయమునకు చెందినదే అది. అట్టి తప్పు రెండువిధములుగా నున్నట్లు వేదాంతరీతిలో అర్థము చేసికొనవచ్చును. మొదటిది-విశ్వమునకు, రెండవది-మానవునకును సంబంధించినది. విశ్వమునకు సంబంధించినంతవఱకు మాయ యనియు,

మానవునికి సంబంధించినంతవఱకు "అవిద్య" (అజ్ఞానము) అనియు ఆరోపింపబడెను. ఈ తప్పు అనునది చీకటి స్వభావము కలదిగా స్పష్టము చేయబడినది. ఇంకను విప్పి చెప్ప వలె నన్నచో, అడ్డుతెరగా వర్ణింపబడినది. ఇది యితరులదృష్టినుండి యథార్థమైన దానిని అనగా ఆత్మను మఱుగుపఱచును. కాబట్టి సారాంశములలోని ముఖ్యప్రశ్న యేమనగా ఈ మాయాతత్త్వము యొక్కయు, అవిద్య యొక్కయు స్వభావ మెట్టిది? ఇది యే యే వస్తువులతో చేయబడినది అనునదియే.

ఈ మాయ యనునది అదొక "తీరా?" లేక "తత్త్వమా?" అది కర్తృత్వసత్యమా? లేక "బాహ్యమైనదా?" అది బాహ్యమైనదే యని తలచినవారు, ఆత్మశ్రేయస్సును కోరి, తుట్టతుద కీ ప్ర తత్త్వశాస్త్రరీతిలో నిలిచియుండునది కాదనెడి సిద్ధాంతమునకు వచ్చిరి. నిస్సారమైనటువంటి నీడగా భావించిరి. (వాచారంభాణాం వికారో నామధేయః). ఇది యిట్లుండగా నీ మాయకు కర్తృత్వసత్యము నాపాదించువారు చేసిన సిద్ధాంత మే మనగా- ప్రపంచపుటునికిని వేదాంతము కాదన లేదనియు (అనగా నిషేధింప లేదనియు) అదియు కూడ బ్రహ్మతోపాటు సత్యమే యనియు, కాని అదే అర్థములోను, అదే అంతస్సులోను మాత్రము కాదనియు, బ్రహ్మలో కలిసి యీ సృష్టికూడ సమతుల్యముగా నొక్కవరుసను జట్టాపట్టాలు వేసికొని యున్నదనియు, అది బ్రహ్మచే బ్రహ్మలోనుండి, ముందుకు త్రోయబడిన కారణముచే "బ్రహ్మ సత్యం" అను స్థానములో నీ సృష్టికూడ చేరియున్న దనియు వారు చెప్పుదురు. వీనినిబట్టి ఒక విషయము స్పష్టపడుచున్నది. అది యేమనగా ఆ రెండింటి లోను ప్రపంచము తన స్వతంత్రమైన ఉన్నత స్థానమును గోలుపోయెను. దానికి సహజమైన ఉనికి లే దనియు స్వయంపోషణ, స్వయంశక్తి అనునవి లే వనియు, అందరంగీకరించినదే. ఈవిధము?గాస్థిరపడినదానిని రెండువిధములుగా అర్థము చేసికొనవచ్చును. మొదటిది - ప్రపంచము సత్యము కాదు - రెండవది-సాపేక్షమైన లేక సంబంధార్థకమైన సత్యము, గొప్పతనము మాత్రమే అది పొందియున్నది. వీనిలో రెండవది స్వభావసిద్ధమైన అర్థము కల దనియు, అట్టి యభిప్రాయమునే వేదములు, ఉపనిషత్తులు బలపఱచుచున్నవనియు నేను భావించుచున్నాను. మొదటి అభిప్రాయము ప్రపంచము సత్యము కాదనుదానిని పరీక్షించి చూచిన, అది తప్పు త్రోవను బట్టినట్లుగా మొదటి లోనే ంపవచ్చును సృష్టికి ఉనికి కలదా, లేదా, అను సూటి ప్రశ్నకు, సరియైన సమాధానముగా మాయయొక్క నిర్వచనము అందు పరిష్కరింప లేకపోయినది. "నేహ నానాస్తికించన" (ఇందు అనేకత్వ మనునది లేదు). "శుక్తిరజత" (ముత్యపుచిప్పను చూచి వెండిగా భ్రాంతిపడుట). "రజ్జుసర్ప (త్రాడును చూచి పాముగా భ్రాంతిపడుట). గంధర్వనగరి" (గాలిమేడలు కట్టుట). మొదలైన మహావాక్యములు మొదటి అభిప్రాయమునకు పునాదిగా వేదాంతగ్రంథములు బోధించుచున్నవి.

ప్రపంచమునకు ఉనికి అనునది లే దనియు, అదొక భ్రాంతియనియు, (మరుమరీచిక) పిచ్చి యోచన యనియు, కలలసంపుటి కొఱకై ఉపయోగపడిన వస్తువుల సముదాయముతో కల్లబొల్లిగా నల్లబడిన, నిస్సారమైన అదొక వేడుక యనియు, దాని నెవరు సత్యమైన దానినిగా నెంచెదరో అట్టివారు బుద్ధిహీను లనియు చెప్పబడెను. ఇందుకు కారణము

స్పష్టమే. బ్రహ్మపదార్థ మొక్కటే సత్యమైనది. దానిని పోటీచేయునది మరియొకటి లేకపోవుటయే. దాని ముఖవైఖరినిబట్టి ప్రపంచము ఈషన్మాత్రము సత్యమైనది కాదు. అట్టి అశాస్త్రీయమైన యథార్థ మనునది (వ్యావహారికసత్యము) బహుజనప్రియమైన ఆవశ్యకతను తీర్చునట్టిదిగా నున్నది అంతే. దాని నిజస్వభావము అదియొక (idea) అభిప్రాయముమాత్రముగా నుండుటయే. అది ఒకానొకని భ్రాంతిలో మాత్రము నిలిచియున్నది. ఈ మనస్సువలన, ముందుకు పొడుచుకొని వచ్చిన మాయాప్రపంచము అనంతమైనదానిలో శుద్ధశూన్యముగా నంతరించిపోయినది. ఈ అభిప్రాయమును బట్టి మాయ యనునది అసత్యపు ముఖవైఖరియొక్క ముందునకు విసరబడినటువంటి చీట్లపేకతో కట్టబడిన గుల్లమేడగాను, కొద్దిదినములు మాత్రమే నిలిచియుండు, ఇంద్రధనుస్సుగాను మారును. అనగా అది తాత్కాలికమైనది- శ్రీరామకృష్ణపరమహంస చెప్పినట్లు రెండు దినములుమాత్రము నిలిచియుండునది.

ఈమాయయొక్క వివరణము కొన్ని కష్టములనుకూడ దీసిపెట్టునది. బ్రహ్మయొక్క శాశ్వతత్వము వక్కాణింపబడుట బాగుగనే యున్నది. కాని మరియొకదానికి హానిచేకూర్చి, అది ఆలాగ జరుగుట మంచిపని కాదు. బ్రహ్మ సత్యమని వక్కాణించినందుకు వేదాంతితో నెవరును భిన్నాభిప్రాయులు కాజాలరు. బ్రహ్మ ఒక్కటే (ఏకమ్) బ్రహ్మసత్యం అని వాదించు ఉత్సాహపరుడు బ్రహ్మ "అద్వితీయ" ముగా నున్నదనికూడ చెప్పబడుదానిని మఱచిపోవుచున్నాడు. ఈసిద్ధాంతములో భాష పునరుక్తి దోషముగా ప్రయోగింపబడనిపక్షమున, దాని అర్థములో సూక్ష్మమైనను తేడా లేకపోలేదు. ఆరెండక్షరములును ద్వంద్వార్థము నిచ్చునవిగా నే నెంచుచున్నాను. దాని అర్థములో అదే తేడా కలిగియున్నట్లు మఱియొక పదము "అద్వైత" మను మాట తెలియజేయుచున్నది. ఈ విధమైన వర్ణనకు అంతర్గతమైన భావము ప్రపంచమును కేవలము అబద్ధమే యని కొట్టివేయుటకు కాదనియు, సత్యమైన దానితో సమతుల్యముగా జేయునదిగాను కనిపించును. మొదటిపదము "తెలియజేయునట్టి" (denotation) దానినిగా నెంచుకోవచ్చును. రెండవది—దానిఅర్థమును "తెలుపునది"గా (Connotation) భావింపవచ్చును—అనగా, ఆ రెండుకూడ నొక్కదానినే ఉద్దేశించినవనియు, మరియు నీ "అద్వితీయ" మనునది వ్యతిరేకార్థసంజ్ఞకమైన కథనము (వివరణము)గా నర్థమగుచుండుటయేగాక, ఈసృష్టికికూడ అన్వయించి, సత్యమైనదానికి భిన్నముగా నెన్నడు ఉండలేదనునట్లుగా నున్నది. ఈవిషయములో గ్రంథములను నేను బలాత్కరించుట లేదని నిశ్చయముగా చెప్పగలను. రెండవది సహజమైన వాక్యార్థము కాదనియు బ్రహ్మమునుండి బాహ్యముగా ప్రత్యక్షమైనదానినిగా నీసృష్టికి అన్వయ మనునది లేదనియు, ఆక్షేపించిన యెడల, దానికి నాజవాబేమనగా—సృష్టి అబద్ధ మను నిర్వచనము, అదే రీతిగా, ఎచ్చటను చేయబడలేదనియే చెప్పవలసివచ్చును. ఎందుచేతననగా—బ్రహ్మ రెండవది లేనట్టిదిగాను, అన్యమేదియు లేదనియు రూఢిగా చెప్పబడినపుడు, అంతమాత్రముచేత, ప్రపంచము పూర్తిగా నెత్తివేయబడినట్లుగా నర్థముచేసికొనవలసినది కాదు. బ్రహ్మముయొక్క ఏకత్వస్థాయినుండిగాని, దాని సర్వోత్కృష్టతనుండిగాని, ప్రపంచము శుద్ధశూన్యమని మనము వాదింపజాలము. మధ్యమాట మఱొకటి లేదు

ఏకత్వమనునది, నానాత్వమును రద్దుచేయునని గాని, యీభేదమును కొట్టివేయునని గాని వాదించుట సరియైనది కాదు. ఏకత్వము అసంభవమే కాక, అర్థరహితమైనదని, సృష్టిభిన్నమైనంతమాత్రాన, అంతఃప్రవాహమైన ఏకత్వమును మినహాయించి, సృష్టికి ఒక్కస్థానమునే చూపెట్టుట అనవసరము. ఇంతే కాక, ''అద్వితీ''య మను మాట ''వ్యత్యాసము లే దని'' అనగా ''వ్యత్యాసము కలిగియుండ లేదని'' అర్థము కాదు. కాని ''ఇంకొకదానిని పొందనిది'' అను అర్థమై యున్నది. ''అద్వైత'' మనుమాటలో అదే భావము కలిగియున్నది. ''ఇంకొకదానిని పొందనిది'' అనుమాటకు అర్థము ''వ్యత్యాసము కలుగలేదనెడి'' అర్థమున్నట్లుగా నాకు తెలియదు. ఆత్మయు, ఇంకొకటియు, భిన్న స్వరూపులైనప్పటికి, ఆత్మయు దాని స్వాంతమైన వ్యత్యాసమును భిన్న మైనంతటికి కాదనిమాత్రము నాకు తెలియును.

(సశేషము)

# వార్తలు - విశేషాలు

## రామకృష్ణమిషను వివేకానందస్మృతిమందిరము 1967-68 సంవత్సర నివేదిక

ఈ క్రిందివి యీ కేంద్రకార్యకలాపాలు-

వైద్యం - ప్రసూతికేంద్రం శిశుసంక్షేమ కేంద్రం ఉన్నాయి. ఈ సంవత్సరం కేంద్రంలోనే ఉండి వైద్యం చేయించుకొన్నవారిసంఖ్య 32, ఎప్పటికప్పుడు వచ్చి వైద్యం చేయించుకొని పోయినవారి సంఖ్య 216. సుశిక్షితులును అనుభవశాలురు అగు వైద్యు లున్నారు.

విద్య - శారదాశిశువిహారం (కిండర్గార్టెన్) వస్తుబోధనాపద్ధతిలో నడపబడుతుంది. మూడేండ్ల పిల్లలు మొదలు, ఏడేండ్ల పిల్లలవఱకు ఇందు చేర్చుకోబడుతారు. ఈ సంవత్సరం ఇందున్న బాలుర సంఖ్య 76, బాలికలసంఖ్య 26. బాలురలో పదహారుమందిన్ని బాలికలలో ఏడుగురున్నూ హరిజనులు. శిశువిహారంలో శిశుగ్రంథాలయంకూడా ఉంది. అందున్న పుస్తకాలసంఖ్య 375. చందాలు కట్టి 5 పత్రికలు తెప్పించబడుతున్నాయి. శిశువులకు ప్రతి దినం పాలున్నూ విటమినుమాత్రలున్నూ ఇవ్వబడుతూ వచ్చాయి. మిషనువారి ఆధ్వర్యంలో పౌరుల కని గ్రంథాలయం ఒకటి ఉంది. పత్రికాపఠనాలయమూ ఉంది. గ్రంథాలయంలో ఉన్న గ్రంథాల సంఖ్య మొత్తం 3,750. ఇందు ఈ సంవత్సరం చదువరులు చదివి వాపసు చేసిన గ్రంథాలసంఖ్య 2,643. 215 క్రొత్త పుస్తకాలు గ్రంథాలయంలో చేర్చబడ్డాయి. పత్రికాపఠనాలయానికి 5 దినపత్రికలు, 8 వారపత్రికలు, 4 పక్షపత్రికలు 1 త్రైమాసిక పత్రిక వస్తాయి. దినంవచ్చే చదువరుల సరాసరి సంఖ్య 40.

సంస్కృతి— శ్రీశారదా-శ్రీరామకృష్ణ-శ్రీవివేకానందస్వాముల జయంతులును శ్రీకృష్ణజన్మాష్టమియు, బుద్ధపూర్ణిమయు, క్రిస్మసీవును, శంకరజయంతియు కొనియాడబడినాయి.

జరూరు అక్కఱలు— (i) స్మృతిమందిర భవనానికి మరమ్మత్తు చేయాలి. (ii) శారదా విహారపాఠశాలకు ఉపకరణాలు సామగ్రి కావలసిఉన్నాయి. అప్పులు తీర్చడానికి దైనందినపు జరుగుబాటుకు రొక్కం కావలసిఉంది. (iii) గ్రంథాలయానికి పత్రికాపఠనాలయానికి కూడా గ్రంథాలు ఇతర సామగ్రి కావలసిఉంది.

## శ్రీ రామకృష్ణ మఠము, మద్రాసు-4.
## శ్రీకృష్ణజయంతి

1970 సంవత్సరము ఆగస్టు 24-వ తేది సోమవారము రాత్రి తొలిజామున మైలాపూరు శ్రీరామకృష్ణమఠములో శ్రీకృష్ణ జయంతి మహోత్సవం జరుపబడింది. శ్రీకృష్ణ భగవానుని చిత్తరువును చక్కగ అలంకరించి మఠమండపంలో నెలకొల్పారు. గుడిలో సాయం ఆరాత్రికం ముగిసినవెంటనే శ్రీవిద్యా పాత్రానందస్వామి శ్రీమద్భాగవతంలో కృష్ణావతారఘట్టమును శ్రీకృష్ణశిశువు గోకులమునకు చేర్పబడునంతవఱకు సవ్యాఖ్యానంగా చదివి సదస్యులకు వినిపించారు. రాత్రి 9 గంటలనుండి నిశీథంవఱకు ప్రత్యేకపూజయు భజనసంకీర్తనలును చెల్లి ప్రసాదవినిమయంతో నాటి కార్యక్రమం పూర్తి అయింది.

1970-వ సంవత్సరం సెప్టెంబరు 6-వ తేది భానువారం పౌరమహాసభ సమావేశమైనది. మఠాధ్యక్షులైన శ్రీమత్కైలాసానందస్వామి సదస్యులకు, వక్తగా విచ్చేసిన అణ్ణామలైవిశ్వకళాపరిషత్తు వృక్షశాస్త్రశాఖాధ్యక్షులైన డాక్టరు కె. రంగస్వామిఅయ్యంగారుకు స్వాగతం పలికి ఈలాగు వాక్రుచ్చారు—"చారిత్రకమహాపురుషులలో శ్రీకృష్ణుడు విశిష్ట వ్యక్తి. విశ్వప్రజ లందఱికి రక్తికూర్చేవాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణునందు భక్తి లేనివానిని భారతీయునిగా గాని ఆత్మాన్వేషకునిగ గాని బ్రహ్మవిద్యాధ్యేతగాగాని గణించడం కుదరదు. సదాసర్వకాలం యావద్భారతదేశప్రసిద్ధి గన్న మహాపురుషుడు శ్రీకృష్ణుడు. భరతఖండంలో మానవజీవితంపై శ్రీకృష్ణునిజీవితం అద్భుత ప్రభావాన్ని ప్రసరింపజేసింది. భవిష్యత్తుగల యువకులకును జీవితము కడచనిన వృద్ధులకును సమానంగా శ్రీకృష్ణు డాశ్రయుడే. పారమార్థిక నిశ్రేణిలో శ్రీకృష్ణనామసంకీర్తనం తొలిమెట్టు. అన్ని శాస్త్రాలలోను ఆత్మవిద్యయే ఎక్కువ అనుష్ఠానయోగ్యమైనది. ఆ శాస్త్రానికి పెద్ద ప్రయోగశాల అక్కఱలేదు. అదేమో విశాలమైన రంగమే. బంగారంకంటె రత్నాలకంటె శ్రీకృష్ణనామం బరువెక్కువని సత్యభామకు రుక్మిణి నిరూపించె ననెడికథ సాధకులకు గొప్ప గుణపాఠం. గోవిందనామం కౌరవసభలో ద్రౌపదిని అక్షయవస్త్రసంయుతనుగా చేసి ఆమె మానమును సంరక్షించె ననెడి ఇతివృత్తమును మానవతతికి భగవన్నామమహిమను తెలిపే గొప్పపాఠమే. భగవంతున కేమో శత్రువులు లేరు మిత్రులు లేరు. "న మే ద్వేష్యోస్తి న ప్రియః" కాని భక్తితో ఆరాధించినవారికి భగవంతుడు కొంగుబంగారం. ఒక్కసారి శరణు అంటే చాలు. "సకృదేవ ప్రపన్నాయ" భగవంతుడు కాపాడి తీరుతాడు. శ్రీకృష్ణుడులేని దే హిందూధర్మమే లేదు. వికసిత హిందూధర్మ స్వరూపుడే శ్రీకృష్ణుడు. శ్రీరామకృష్ణుడు తన ముఖ్యశిష్యుడైన వివేకానందునితో "ఆరాముణ్ణే నేనే ఆకృష్ణుణ్ణె నేనే"అని చెప్పిన వాక్యమునకు ప్రాముఖ్యం లేక పోలేదు. శ్రీకృష్ణజన్మాష్టమి మహోత్సవమును జరపడం భక్తిసాధనలో ఒకఅంగం. జపం చేయడానికి తమకు వ్యవధి లేదని ఈకాలంలో కొందఱు చెప్పేమాటకు అర్థం లేదు. కాసేపు వారు ఐహికప్రపంచమును అందలి క్షుద్రాంశములను తొలగించుకొని పూర్ణావతారునివైభవమును మననం చేస్తే—వెక్కిరింపవచ్చినవారు వెఱ్ఱిభక్తులుగ ఏలాగు మాఱుతారో బోధపడుతుంది. శ్రీకృష్ణుడు ఎన్నియో భూమికలను నిర్వహించాడు. గీతాశాస్త్రంలో ఒక్కమాట చాలు, జీవుని ఉద్ధరించడానికి. సంస్కృతదేశభాషాసారస్వ

తాలు బహుతరంగా బృందావనకృష్ణుని ద్వార కానాథుని లీలలతో నిండి ఉన్నాయి. ఆ సార స్వతాలు నిత్యోజ్జ్వలాలుగా ఉండడానికి కారణ మదే.''

తరువాత డాక్టరు కె. రంగస్వామిఅయ్యాంగారు మొదట కొంతసేపు సంస్కృతభాషలోను తరువాత ఆంగ్లభాషలోను కృష్ణావతారపు మేలుములనుగూర్చి సభారంజకంగా ఉపన్యసించారు.

ప్రొఫెస్సరు కె. శ్రీనివాసనుగారి వందన సమర్పణంతో సభాకార్యక్రమం ముగిసింది.

# గ్రంథ పరిచయం

## లోకమాత
### (శ్రీ శారదాదేవి)

రచయితయూ ప్రాప్తిస్థానమున్నూ శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులు, శ్రీగోదాగ్రంథ మాలావ్యవస్థాపకులు. ముసునూరు, కృష్ణా జిల్లా, పుటలు 8౫, వెల రూపాయి.

వీరి బాలసాహితిలో పందొమ్మిదో ప్రచురణమైన యిది బాలపాఠకులతో మాటిమాటికి 'సుమండీ' 'సుమండీ' అంటూ ముఖాముఖి సంభాషించురీతిలో రూపొంది, శ్రీ చిరంతనానందస్వాముల కృతికి చక్కని సంక్షేపం అనిపించుకుంటుంది. విశ్వోపజీవ్యమైన మాతృశ్రీ చరితామృతమును సర్వసుగ్రహం చేసే యీ జతనానికి మా అభినందనలు.

## మహిజాస్తవము

రచయితయూ ప్రాప్తిస్థానమున్నూ విద్వాన్ నడాదూరి విజయరాఘవాచార్యులు, 35, శ్రీనివాసయ్యాంగారు వీథి. మద్రాసు-33. పుటలు 20, వెల 25 పైసలు.

ఇది దాక తేటగీతుల శతకం. సీతాదేవి స్తుతి, ఆమెగారి అభిజాత్యం, అజ్ఞాతనిగ్రహమైన ఆమె అనుగ్రహమయత్వం, రామమహిమను మించిన ఆమెమహిమ, నిప్పుకు నిప్పు అనిపించుకునే ఆమెవిశుద్ధి-మున్నగునవి ఇందు చక్కగా ప్రస్తుతము లయ్యాయి. లక్ష్మణుడు సీతనోట కటూక్తులు పడుట కతడు లోగడ కావించిన పితృదూషణము కారణ మనడం (25), సుగ్రీవునకు గలిగిన సీతానుగ్రహం వాలికి కలుగక పోవడానికి వాలి వ్యభిచరణ శీలుడగు దేవేంద్రుని కుమారుడు కావడం కారణ మనడం (30) ఈ మొదలైన చక్కని భావా లిందు పొందుపడి ఉన్నాయి. వానిని కవిగారే (100) 'ఉల్లమునఁ దేనెసోనలై వెల్లి విరియు భావములఁ గృతిపాత్రలోఁ బట్టి తెచ్చితి'' నని చెప్పుకొన్నారు. నాలుగోచరణాన్ని కొన్ని పద్యాలకు 'అర్థిజనకల్పవల్లి సీతమ్మతల్లి' అని, మఱికొన్నిపద్యాలకు ''గలుగ సీతమ్మ నెనరుంచి పలుకవమ్మ'' అని—పొందుపఱచడం పునరుక్తిఅయినా, విశేష మేమంటే పునరుక్తి ఇతరరంగాలలో దోషం, స్తోత్ర రంగంలో గుణం. ఈశతకం సర్వవిధాలా అస్వాద్యమైన ఫణితి.

ప్రభాకర్.

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　　రెండవ కూర్పు　　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　　ఆఱవ కూర్పు　　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

శ్రీ రామకృష్ణ ప్రభ ఆఫీసు,
శ్రీ రామకృష్ణ మఠము,
మైలాపూరు :: మద్రాసు - 4.

Phone: 71231

# ప్రకటన

మీ చందా యీ..........నెలాఖరుతో ముగియును. రాబోవు సంవత్సరమునకు మీ చందా (రూ. 5) మనియార్డరు ద్వారా, మా కార్యాలయమునకు రాబోవు నెల 10-వ తేదీలోగా అందునట్లు పంపగోరెదము. అట్లు మనియార్డరు పంపనియెడల, రాబోవు సంచికను వి. పి. పి. ద్వారా పంపెదము. పత్రికయెడ మీ యాదరాభిమానములను యథాప్రకారముగా జూపుదురని నమ్ముచున్నాము. మనియార్డరుద్వారా మీ చందా పంపినయెడల, తపాలా వీ. పీ. రిజిస్ట్రేషను చార్జీలు ~~70~~ 1-10 పైసలు మీకు మిగులునని గుర్తింతురుగాక. అనివార్యమయిన యే కారణములచేనైనను మీరిక చందాదారుగా నుండగోరనియెడల రాబోవు నెల 5-వ తేదీ లోపుగా ఆ సంగతి మాకు దయచేసి తప్పక తెలుపగోరెదము. అట్లు మీ యొద్దనుండి ఉత్తరము రాకపోవుసేని మీరు తప్పక వీ. పీ. విడిపించుకొందురను నమ్మకముచే మేము వీ. పీ. పంపి, మీరు విడిపించుకొనకపోయినయెడల వృథాగా ఈ ధర్మసంస్థకు వీ.పీ. చార్జీలు నష్టముగలిగించినవారగుదురు. దయ చేసి ఈవిషయము గుర్తింతురు గాక.

ఉత్తరప్రత్యుత్తరము లన్నిటిలోను మీ చందాదారు సంఖ్యను ఉదాహరించుచు, మీ పూర్తి పేరును, విలాసమును స్పష్టముగా వ్రాయగోరెదము.

మేనేజరు, శ్రీ రామకృష్ణ ప్రభ

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౦ - డిసెంబరు : సాధారణ - మార్గశిరము సంచిక ౬

## విషయసూచిక

ఫోను : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు; ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్సూ 5 లు, సింహళము ర్సూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్సూ 5 లు, సింహళము ర్సూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే నెల రెండవ వారాంత్యానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్ని తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను ప్రాగ్జ్ఞగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

‘అఖిలవిధు శరణొందుమ, యా తుణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.


# రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౦ – డిసంబరు : : సాధారణ – మార్గశిరము { సంచిక ౬


శ్రీః

## వివేకచూడామణి

మూలము : వ్యాఖ్యాత :

శ్రీ శంకర భగవత్పాదులు అన్నమాచార్య

ఆప్తోక్తిం ఖననం తథోపరి శిలాద్యుత్కర్షణం స్వీకృతిం
నిక్షేప స్సమపేక్షతే, న హి బహి శ్శబ్దై స్తు నిర్గచ్ఛతి
తద్వద్బ్రహ్మవిదోపదేశమననధ్యానాదిభి ర్లభ్యతే
మాయాకార్యతిరోహితం స్వ మమలం త త్త్వం, న దుర్యుక్తిభిః. 65

భూగర్భమున నిక్షిప్తమైన ధనము ఉన్నచోటు తెలిసి చెప్పువారు కావలయును, ఆచోట త్రవ్వవలయును, అడ్డముగ నున్న రాళ్లను రప్పలను తీసివేయవలయును, పిమ్మట ధనము చేకొనవలయును. ఇ వేవియు లేక, వెలుపలినుండి యూరక ‘ధనము’ అని కేక లిడిన ధనము వెలుపడదు. అట్లే మాయచేతను దానివలన నేర్పడు అన్నమయాదికోశముల చేతను మఱుగుపఱుపబడియున్న అమలాత్మతత్త్వమును ప్రాపింపవలయు నన్న బ్రహ్మజ్ఞునుప దేశము కావలయును, మననధ్యానాదులు కావలయును. ఇ వేవియు లేక, వట్టి కుతర్కములు చేయుచున్నచో బ్రహ్మప్రాప్తి కలుగదు ౬౫

తస్మా త్సర్వప్రయత్నేన భవబన్ధవిముక్తయే
స్వైరేవ యత్నః కర్తవ్యో రోగాదే రివ పణ్డితైః.

కావున రోగాదివిముక్తికింబోలె భవబంధవిముక్తికిని ఎల్లవిధముల ప్రయత్నములను వివేకవంతులు తమకుతామే చేసికొనవలయును. ౬౬

య స్త్వ యాద్య కృతః ప్రశ్నో వరీయా౯ శాస్త్రవిన్మతః
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్య శ్చ ముముక్షుభిః. 67

నీవిపుడు మొదటడిగిన ప్రశ్నలో అర్థములు నిగూఢములుగ నున్నవి. చాల మేలైన ప్రశ్న! శాస్త్రవేత్తల కిది యభిమతము. సూత్రప్రాయముగ నున్నది. మోక్షాభిలాషు లవశ్యము తెలిసికొనవలసిన దిది. ౬౭

శృణు ష్వావహితో విద్వ౯ య న్మయా సముదీర్యతే
త దేత చ్ఛ్రవణా త్సద్యో భవబన్ధా త్ప్రమోక్ష్యసే. 68

ఓ పండితుడా, నేను చెప్పుదానిని అవధానముతో ఆలకింపుము. ఆలకించిన తక్షణమే భవబంధములనుండి విముక్తి చేకూరును. ౬౮

మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే వైరాగ్య మత్యన్త మనిత్య వస్తుషు
తత శ్శమ శ్చాపి దమ స్తితిక్షా న్యాసః ప్రసక్తాఖిలకర్మణాం భృశమ్. 69

మోక్షమునకు సాధనములను జెప్పుచున్నాను—మొట్టమొదటిది అనిత్యవస్తువులందత్యంతవైరాగ్యము నలవఱచుకొనుట, తర్వాత అంతరింద్రియశమనము, బాహ్యేంద్రియదమనము, సర్వదుఃఖసహనము, విహితములైన వర్ణాశ్రమకర్మముల నన్నిటిని పూర్తిగా త్యజించుట. ౬౯

తతః శ్రుతి స్తన్మననం సతత్త్వధ్యానం చిరం నిత్యనిరన్తరం మునేః
తతో ౽వికల్పం పర మేత్య విద్వా నిహైవ నిర్వాణసుఖం సమృచ్ఛతి. 70

పిమ్మట గురుముఖముగా పరమార్థమును వినవలయును. విన్నదానిని చింతన చేయవలయును, ఆత్మతత్త్వమును ఎడతెంపులేక సదా ధ్యానించుట చిరకాలము సాగవలయును. అట్లు సాగించిన విద్వాంసుడు నిర్వికల్పసమాధి నొందును, ఈ జన్మలోనే అతడు నిర్వాణసుఖము ననుభవించును. ౭౦

య ద్బోద్ధవ్యం త వేదానీ మాత్మానాత్మవివేచనమ్
త దుచ్యతే మయా సమ్య క్ఛ్రుత్వాత్మ న్యవధారయ. 71

నీ విప్పుడు తెలిసికోవలసినది ఆత్మానాత్మవివేకము. దానిని చెప్పుచున్నాను. చక్కగా విని, మనస్సులో నిశ్చయమును కుదుర్చుకో. ౭౧

మజ్జాస్థిమేదఃపలరక్తచర్మత్వగాహ్వయై ర్ధాతుభి రేభి రన్వితమ్
పాదోరువక్షోభుజపృష్ఠమస్తకై రఙ్గై రుపాఙ్గై రుపయుక్త మేతత్. 72

క్రొవ్వు ఎముకలు మెదడు మాంసము నెత్తురు తోలు తోలుపైపొర అనెడి సప్త ధాతువులతోను, కాళ్లు తొడలు రొమ్ము భుజములు వీపు తల అను అంగములతోను చీల

మండలు పిక్కలు మోకాళ్లు మున్నగు ఉపాంగములతోను కూడినదియు (పైశ్లోకముతో అన్వయము.) ౭౨

అహం మ మేతి ప్రథితం శరీరం మోహాస్పదం స్థూల మి తీర్యతే బుధైః

నేను నాది అను వ్యవహారమునకు పాత్రమును మోహాస్పదమునగు శరీరమును విద్వాంసులు స్థూలశరీర మందురు.

నభో నభస్వ ద్దహ నామ్బు భూమయ స్సూక్ష్మాణి భూతాని భవన్తి తాని. 73

ఆకాశము వాయువు అగ్ని జలము భూమి అను ఇవి సూక్ష్మభూతములు. ౭౩

పరస్పరాంశై ర్మిళితాని భూత్వా స్థూలాని చ స్థూలశరీరహేతవః
మాత్రా స్తదీయా విషయా భవన్తి శబ్దాదయః పఞ్చ సుఖాయ భోక్తుః. 74

సూక్ష్మభూతములలో నొక్కొక్కదానిలోని సగభాగముతో తక్కిననాల్గింట ప్రతిదానిలోని పరకభాగము చేరినచో పృథివి - అప్పు - తేజము - వాయువు - ఆకాశము అను స్థూలభూతము లేర్పడును. స్థూలభూతములే స్థూలశరీరకారణములు. స్థూలభూతముల గుణములు వరుసగా - గంధము - రసము - రూపము - స్పర్శము - శబ్దము. వీనినే తన్మాత్ర లనియు విషయము లనియు పేర్కొందురు. భోక్తయగు జీవునకు ఈ యైదింటిచే సుఖదుఃఖానుభవములు గలుగుచుండును. ౭౪

య ఏషు మూఢా విషయేషు బద్ధా రాగోరుపాశేన సుదుర్దమేన
ఆయాన్తి నిర్యా న్త్యథ ఊర్ధ్వ ముచ్చైః స్వకర్మదూతేన జవేన నీతాః. 75

సులువుగ త్రెంచుకోరానిదియు సుదీర్ఘము నగు రాగపాశము మూర్ఖులను శబ్దాది విషయములందు కట్టువఅచును. వారికర్మమే దూతగా వారి నతివేగముగ ఊర్ధ్వలోకమునకును అధోలోకమునకును గొనిచనుచుండ వారు రాకపోకలు కావించుచుందురు. ౭౫

శబ్దాదిభిః పఞ్చభి రేవ పఞ్చ పఞ్చత్వ మాపుః స్వగుణేన బద్ధాః
కురఙ్గ మాతఙ్గ పతఙ్గ మీన భృఙ్గా, నరః పఞ్చభి రఞ్చితః కిమ్ ? 76

జింకకు శ్రోత్రమును, ఏనుగునకు త్వక్కును, మిడుతకు నేత్రమును, చేపకు జిహ్వయు, తుమ్మెదకు ఘ్రాణమును పటువులైన యింద్రియములు. వీనిలో నొక్కొక్కదానికిని గల తక్కిన యింద్రియము లింతపటుత్వము గలవి కావు. ఈ జంతువు లీ యొక్కొక్కయింద్రియముచేత నే వంచితములై పంచత్వము (మరణము) నొందుచున్న వనగా, ఇంద్రియము లైదును పటువులుగ నుండు మానవుని గతి చెప్పవలయునా ? ౭౬

దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి
విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షు షాప్యయమ్. 77

కీడు సేయుటలో, శబ్దము స్పర్శము రూపము రసము గంధము అనెడి విషయములు నల్లత్రాచువిషమునకంటె అధికదారుణములు. తిన్నవానిని జంపునది విషము, కన్నెత్తి చూచిన జాలును, విషయములు ముప్పు తెచ్చును. ౭౭

విషయాశామహాపాశా ద్యో విముక్త స్సుదుస్త్యజాత్
స ఏవ కల్పతే ముక్త్యై నాన్య షట్ఛాస్త్రవే ద్యపి. 78

విషయాశ అనున దొక మహాపాశము. దానిని వదలించుకొనుట చాల కష్టము. దానినుండి విడుపొందినవాడుమాత్రమే మోక్షప్రాప్తి కర్హుడు. ఇతరుడు ఎంత చదువు చదివినను, (షట్ఛాస్త్రపండితుడైనను) సరే మోక్షప్రాప్తి కర్హుడు కాడు. ౭౮

ఆపాతవైరాగ్యవతో ముముక్షూన్ భవాబ్ధిపారం ప్రతియాతు ముద్యతాన్
ఆశాగ్రహో మజ్జయతే ఒన్తరాళే నిగృహ్యా కణ్ఠే వినివర్త్య వేగాత్. 79

కొండటికి వైరాగ్య మీ క్షణములో మాత్ర మున్నది. అది క్రిందటిక్షణమప్పటికి పుట్ట లేదు, మీదటిక్షణమప్పటికి నిలువబోదు. అట్టి వైరాగ్యముతో మోక్షాభిలాషగలవారై సంసారసాగరపుటద్దరిని జేర నుద్యమించు వారిని ఆశ యనెడి మొసలి నడిదారిలోనే మెడ పట్టుకొని బరబర వెనుక కీడ్చుకొని వచ్చి ముంచివేయును. ౭౯

విషయాఖ్యగ్రహో యేన సువిరక్త్యసినా హతః
స గచ్ఛతి భవామ్భోధేః పారం ప్రత్యూహవర్జితః. 80

సువిరక్తియనెడి కత్తితో విషయ మనెడి నక్రమును నఱికివేసినవాడు ఎట్టి యాటంకమును లేక సంసారసముద్రపుటద్దరిని జేరిపోవును. ౮౦

# పరమహంస దేవుని ప్రబోధవాణి

1882 వ సంవత్సరము ఆగస్టునెల 5వ తేది ఈశ్వరచంద్రవిద్యాసాగరునింట క్రిక్కిఱిసి వినుచున్న జిజ్ఞాసువులకు పరమహంస గురుదేవుడు కావించిన ప్రబోధము :—

మీపనులకెల్ల ప్రేరకము సత్త్వమే. వానికి రాజసత్వ మున్నను, వానిపై సత్త్వప్రభావ మున్నది. సత్త్వమునుండియే కనికరము పుట్టును. పరులమేలుకొఱకై పాటుపడుట రజోగుణమునకు సంబంధించినదైనను ఆ రజోగుణమునకు సత్త్వగుణ మాధారమై యున్నందున అది చెఱుపు చేయదు. శుకుడు మొదలైన మహర్షులు పరమకృపాళువులై లోకుల కాస్తిక్యమును గఱపి దేవునిగుఱించి బోధించిరి. విద్యాసాగరుడు అన్నదానములను విద్యాదానములను చేయుచున్నాడు. అవియు మంచివే. నిస్స్వార్థబుద్ధితో ఈపనులను చేసిన ఇవే భగవంతుని బ్రాపింప జేయును. కాని ప్రాయికముగా లోకులు పుణ్యమును గోరియు పేరు

గోరియునే పాటుపడుదురు. వారిపనులు స్వార్థ రహితములు కావు.

వట్టిపండితులు చెడి, గట్టిపాజై, పండనే పండని కాయలను బోలినవారు. అట్టికాయకు పచ్చికాయ కున్న క్రొత్తదనము గాని, పండిన దాని కున్న రుచి కాని లేదు.

గ్రద్దలు ఎంతపైకెగిరినను వానిచూపులు నేలమీది కుళ్ళిన మాంసముపైనే నెలకొని యుండును. గ్రంథపాండిత్యముగలవారికి బుద్ధిమంతు లనెడి పే రుండును గాని, కామినీ కాంచనసక్తి వారిని వీడదు. కుళ్ళిన మాంసము నకై గ్రద్దలవలె వారును వెదకుచుందురు. అజ్ఞానప్రపంచముపైనే వారి తగులాటము. భూతదయయు భగవద్భక్తియు వైరాగ్యమునే పారమార్థికజ్ఞానపు మహోజ్జ్వలలక్ష్యములు.

* *

బ్రహ్మము విద్యకును అవిద్యకును జ్ఞానమునకును అజ్ఞానమునకును అతీతమైనది. భేదభ్రాంతికిని మాయకు నతీతమైనది.

జగత్తు జ్ఞానాజ్ఞానభేదభ్రాంతికరము. అందు భక్తిజ్ఞానములు కలవు. కామినీకాంచనసక్తియు కలదు. ధర్మాధర్మములును మేలుకీళ్లును గలవు. కాని బ్రహ్మమున కివి యంటవు. మేలు కీళ్లేమి ధర్మాధర్మము లేమి జీవున(కు ప్రత్యగాత్మ) కున్న వే కాని బ్రహ్మముపై వీనికి ప్రభావము లేనే లేదు.

దీపము నెదుట నొకడు భాగవతమును పఠింపవచ్చును. ఆ దీపము నెదుటనే వేఱొకడు దొంగపత్రములను తయారుచేయవచ్చును. దీపమున కెట్టి మార్పును లేదు. సూర్యుడు తన వెలుగును శిష్టులపై నెట్లో దుష్టులపై నట్లే ప్రసరింపజేయుచునే యుండును.

దుఃఖములకును పాపములకును కష్టములకును నీసమాధాన మేమి యని యడుగుదు రేమో! ఇదే నా సమాధానము :—అవి జీవునకుమాత్రమే వర్తించును. వానివలన బ్రహ్మమున కెట్టి పరిణామమును లేదు. పాములో విష మున్నది. పాముకాటునకు గుఱియైనవా రందఱును ఆ విషముచే చత్తురు. కాని, ఆ విషము పాము నేమియును చేయదు.

బ్రహ్మ మిట్టి దని నిర్వచించుట సాధ్యము కాదు. వేదములు పురాణములు తంత్రములు షడ్దర్శనములు (మొదలుగా) లోకములోని వన్నియు ఎంగిలికూటివలె మైలపడినవి. ఇంతవఱకు నట్లు మైలపడనిది బ్రహ్మ మొక్కటే. బ్రహ్మ మిట్టి దని చెప్పగలవా రెవ్వరు నింతవఱకును లేరు.

ఒకానొకని కిద్దఱు కొడుకు లుండిరి. 'బ్రహ్మజ్ఞానము నలవఱచుకొను' డని తండ్రి కొడుకుల నొక గురువునొద్ద కంపెను. కొన్ని సంవత్సరములు గడచినపిమ్మట వారు గురుగృహము నుండి మరలి వచ్చి తండ్రికి ప్రణమిల్లిరి. ఎవరి బ్రహ్మజ్ఞాన మెంతో తెలిసికోగోరి తండ్రి మొదట పెద్దకుమారునితో 'అబ్బాయీ, అన్ని వేదాలను చదివి వచ్చితివి. బ్రహ్మ మన నెట్టిదో యిప్పుడు నాకు చెప్పు' మనెను. బ్రహ్మమును వివరించుటకై బాలుడు వివిధశ్రుతి వాక్యాల నేకరువుపెట్ట సాగెను. తండ్రి యేమియు పలుక లేదు, పెద్దవాని నడిగిన ప్రశ్ననే తరువాత చిన్నకొడుకు నడిగెను. ఆ బాలుడు నోరు తెఱవక క్రిందుచూపులతో మౌనము వహించి యుండెను, పెదవులనుండి యొక్క మాటయైనను వెలువడ లేదు. తండ్రి పరమ సంతోషముతో 'నాయనా, బ్రహ్మము నించించుక తెలిసికొన్నవాడవు నీవే. బ్రహ్మస్వ

రూపము మాటల కందునది కా' దని యభినందించెను.

బ్రహ్మమును సమగ్రముగ తెలిసికొంటిమని కొందఱు తఱచు తలచుచుందురు. ఒకప్పుడొక చీమ యొక చక్కెరకొండయొద్దకు పోయినదట. చక్కెరలోని ఒక్క రవతో దానికడుపు నిండెను. మఱొక్క రవను నోట కఱచుకొని అది యింటికి బయలుదేఱినది. దారిలో వచ్చుచున్నప్పుడు 'ఈతూరి ఆ కొండనే ఇంటికి చేర్చుకొందు' ననుకొన్నదట. సంకుచితచిత్తుల తలంపులిట్లుండును. బ్రహ్మము మాటలకును మనస్సులకును అందని దని వారెఱుగరు. మానవుడెంత గొప్పవాడైన నగును గాక, బ్రహ్మమునుగూర్చి యతడు గ్రహింపగలిగిన దెంత? శ్రీశుకదేవుడును ఆయనవంటి మహర్షులును చీమలలో పెద్దచీమలు కావచ్చు. వారైనను ఎనిమిదిపదిరవలకంటె నెక్కువ చక్కెరను మోయజాలరు.

వేదములును పురాణములును గావించు ప్రతిపాదన లెట్టివో మీ రెఱుగుదురా? ఒకడు సముద్రమును జూచె ననుకొనుడు. 'ఎట్లున్నది సముద్ర' మని యెవరైన నడిగిన, చూచిన యతడు నోటి నెంత తెఱవగలడో అంత తెఱచి 'ఆహా! ఏమి దృశ్యము! ఏమి భయంకరములైన కెరటములు! ఏమి ఘోష' అనును. వేదములలోని బ్రహ్మప్రతిపాదన మిట్టే యుండును. బ్రహ్మము ఆనందమయ మని సచ్చిదానందమని వేదములు చెప్పుచున్నవి.

శుకాదిమహర్షులు బ్రహ్మ మనెడి సముద్రమును తీరమున నిలిచి చూచినవారు, జలమును స్పృశించినవారు. ఆ సముద్రములో వా రెన్నడును మునుగనే లే దని కొంద ఱందురు. మునిగినవారు ఈలోకమునకు మరలి రాలేరు.

బ్రహ్మజ్ఞానప్రాప్తియు బ్రహ్మసాక్షాత్కారమును సమాధిదశలో కలుగును. ఆ దశలో తర్కము పూర్తిగ ఆగి పోవును. మానవుని మౌన మావహించును. బ్రహ్మస్వరూపమును వర్ణించు శక్తి అతని కుండదు.

ఒకప్పుడు ఉప్పుబొమ్మ యొకటి సముద్రపు లోతును కొలువబోయె నట. (అందఱును నవ్వుదురు.) సముద్ర మెంతలోతో ఇతరులకు దెలుపవలె నను కోరిక దాని కుండెను. కాని, పాపము, ఎప్పటికిని తెలుపజాలకే పోయెను. ఏలయన నీట జొచ్చిన వెంటనే అది కరగి పోయెను. ఇక లోతును దెలుపుట కెవరున్నారు?

# శ్రీ శారదా సూక్తిమంజరి

సృష్టిసమయమున జనులు సత్త్వగుణయుక్తమైన తేజస్సుతో బుట్టిరి. పుట్టినప్పటినుండియు వారు జ్ఞానులే. ఈకారణమువలన జగత్తునకు గల యనిత్యస్వభావమును వారు వెంటనే గ్రహించి దానిని బరిత్యజించి పారమార్థిక సాధన చేయుచుండెడివారు. మిక్కిలి త్వరితముగా వారికి ముక్తి లభించుచుండెను. తన సృష్టి వ్యర్థమై పోవుచుండె నని సృష్టికర్త గ్రహించెను. ఇట్లు ముక్తి నొందిన జ్ఞానులు జగన్నాటకనిర్వహణమునకు బనికిరాకుండిరి. పిమ్మట, భగవంతుడు సృష్టిని మరల ప్రారంభించి, సత్త్వముతో రజస్తమోగుణములను

గూడ గలిపెను. ఆయనయుద్దేశ మప్పుడు నెఱ వేఱెను.

క్రొత్తగా వచ్చు భక్తజనులకు పూజా మందిరములో, స్వామిసేవావకాశము నిచ్చు చుండవలయును. నవనవోత్సాహపూరితులై వారు శ్రీభగవానుని శ్రద్ధగా సేవింతురు. ఇత రుల కీసేవ ఆయాసకరముగ నుండును. నిజ మైన సేవ యనిన వేళాకోళము కాదు. మనము చేయు భగవంతునిసేవలో నేవిధమైన లోపము రాకుండ బహుజాగరూకులమై యుండవల యును. కాని, నిజ మే మనగా దయామయు డైన భగవానుడు మన యవివేకమును గ్రహించి మనలను క్షమించుచుండును...... పూజామందిరములో మనము బహుశ్రద్ధతో వ్యవహరించుచు నైవేద్యమును తక్కినయితర సేవలను సరియైన కాలములో చేయుచుండవల యును.

ఆహా శ్రీగురుమహారాజుగా రెంత బాగుగా పాడెడువారు! ఆయనకంఠ మెంతో మధుర ముగ నుండెడిది. పాట పాడుచుండినపు డాయన తన్మయులై యుందురు. ఇప్పటికిని ఆయనపాట తీరు నాజ్ఞప్తికి వచ్చుచుండును. అది నాతలపు నకు వచ్చినప్పు డితరుల పాటలు మిక్కిలి పేల వములుగా కనబడును. నరేంద్రునికంఠముకూడ మధురముగా నుండెడిది. ఈయూరు విడిచి వెళ్లినప్పు డాతడు నన్ను జూచుటకై వచ్చి కొన్నిపాటలు పాడెను. నాయొద్ద సెలవుపొంది వెళ్లినప్పుడు 'అమ్మా, నాపురుషజన్మను సార్థ కము చేసికొని, నేను తురల రాగలిగినచో మిమ్ము తిరిగి దర్శింతును. లేనిచో నిదియే కడ సారి చూపు' అని చెప్పెను. 'నాయనా, నీ యుద్దేశ్యమే' మని నిర్ఘాంతపడి యడిచితిని. అందుల కాతడు 'మంచిది! మీదయావిశేషము చేత నేను త్వరలోనే తిరిగి వచ్చెదను' అని బదులు చెప్పెను. గిరీశబాబు కంఠము కూడ మధురమైన దే.

భార్యాభర్తలు మతసాధనలను గుఱించి యేకాభిప్రాయులై యున్నచో, ఆధ్యాత్మికాభి వృద్ధి వారికి సులభముగా గలుగును.

అమ్మాయీ, ఈవిషయము (=భగవత్సా క్షాత్కారము) ఎట్టిదో నీకు తెలియునా? ఇది యొకశిశువుచేతిలోని కలకండముక్కవంటిది. కొంతమంది యా శిశువును దానిని తమ కిమ్మని ఎంత యడిగినను ఇయ్యడు. కాని తన కిష్ట మున్న మఱియొకని కడిగిన వెంటనే ఇచ్చి వేయును. తన యావజ్జీవము నొక మనుష్యుడు భగవత్సాక్షాత్కారముకొఱకు ఎన్ని కఠిన సాధనలను చేసినను లాభము లేకుండును. కాని మఱియొకరికి ప్రాయికముగా ఏకృషియు లేకయే పరమార్థము లభించును. ఇది భగ వంతుని దయపై ఆధారపడియున్నది. ఆయన తన కిష్టమున్నవారికి తనదయను ప్రసాదిం చును. దైవకృపయే బహుముఖ్యము.

'ఈ లోకము దుఃఖమయము. మేము దైవము నెంత ప్రార్థించినను, మాదుఃఖమున కంతము లేకున్నది' అని యెల్లరు విచారముతో జెప్పుచుందురు. దుఃఖము భగవంతు డనుగ్ర హించు వరమే కాని వే ఱొకటి కాదు. అది పరమేశ్వరుని దయా చిహ్నము. ఈలోకములో దుఃఖ మనుభవింపని వా రెవ రున్నారు? శ్రీకృష్ణునితో నతని భక్తురాలు బృంద యను

నామె యిట్లు చెప్పెను. 'నీవు దయగలవాడ
వని యెవరు చెప్పుదురు? నీ రామావతార
కాలమున యావజ్జీవము నీకొఱకై సీత నేడ్పిం
చితివి. ఈ శ్రీకృష్ణావతారములో రాధ నీనిమి
త్తమై యేడ్చుచున్నది. నీతల్లిదండ్రులు కంసుని
చెఱసాలలో నపరిమితబాధ నొందుచు రేయిం
బగళ్లు నీనామ ముచ్చరించుచు విలపించిరి.
అట్లైనను, నే నెందుకు నీ నామస్మరణము చేయు
చుందును? నీ నామము మరణభయమును
సమూలముగ పెకలించి వేయును కనుకనే.''

* * * *

'మ' రచించిన శ్రీరామకృష్ణవచనామృ
తము చాల బాగున్నది. అతడు శ్రీగురుదేవుని
మాటలను యథాతథముగా లిఖించియుండు
టయే దీనికి కారణము. ఆహా! ఆమాట లెంత
మధురములు! నాలుగైదుపుస్తకములు నింప
గల సామగ్రి యాతనియొద్ద నున్నదట. కాని
అత డిప్పుడు ముసలివాడైనాడు. ఆపనిని నిర్వ
హింపగలడో లేడో యని నా సందేహము. ఆ
గ్రంథమును విక్రయించి ధనమెంతో గడించి
అత డొకచోట వడ్డీకి వేసియుంచెను. జయరా
మ్బాటిలో నీగృహనిర్మాణమునకై వేయి
రూప్యముల నిచ్చుటయే కాక, ఆసందర్భమున
తగిలిన యితరవ్యయములనుగూడ నాతడు
భరించెను. ఇంతే కాక, నెలనెలకు పదిరూప్యము
లతడు నాకు పంపుచుండును. నేను కలకత్తాలో
నుండునపుడు ఇరువదియో అంతకంటె నెక్కు
వగనో రూప్యము లిచ్చుచుండును...గిరీశుడు
కూడ అప్పు డప్పుడు ధన మిచ్చుచుండెను.
ఒకప్పు డతడు పదునెనిమిది నెలలవఱకు నాకైన
వ్యయమునంతటిని భరించెను. విస్తారముగా
ధన మెక్కడ నుండి తెచ్చి యియ్యగలడు?
అత డెన్నడును భాగ్యవంతుడు కాడు. అతని
జీవితము ప్రారంభదశనుండి అంతనిర్మలమైనది
కాదు; దుష్టులతో సహవాసము చేయుచు
నాటకములలో వేషమువేయువాడు. కాని,
అతనివిశ్వాసము మహాద్భుతము. అందుచేతనే
యాతనికి శ్రీరామకృష్ణుల దయ లభించెను.
ఈయవతారములో శ్రీరామకృష్ణులు గిరీశు
నుద్ధరించిరి. భూమిపై భగవంతు డవతరించినపు
డెల్ల, పతితుల నిట్లే ఆదయామయుడు పావనుల
నొనర్చుచుండును. గౌరాంగుడు జగాయ్
మధాయ్ (జగన్నాథమాధవులు) అను నిరు
వురు సోదరులను రక్షించెను. గిరీశునియందు
శివాంశము కల దని శ్రీరామకృష్ణు లొక సారి
చెప్పిరి.

# చరిత్రంలో అపూర్వాధ్యాయం

## శ్రీ హీరానందస్వామి

భారతదేశచరిత్రను అన్యదేశాలచరిత్ర
లతో పోల్చి చూడండి. స్త్రీపురుషవిభేదనిర
పేక్షంగా ప్రతివ్యక్తి పెంపొందడానికి అనువుగా
సంఘనియమా లీ దేశంలో ఏర్పఱుపబడి
యున్నట్లు గుర్తిస్తారు. విశ్వచరిత్రలో సంఘ
నియమాలను ఏర్పఱచినవారు ఎందఱో
ఉన్నారు. స్మృతికర్త మనుమహర్షి ఉన్నాడు.
సంఘాని కభివృద్ధిని సమకూర్చే కిటుకును
గూర్చిన ఆయన ప్రతిపాదన ఆశ్చర్యకరం!
''యత్ర నార్యస్తు నన్దన్తే ప్రీయన్తే తత్ర

దేవతాః "మగువలు ఆనందించే చోట వేల్పులు ప్రీతు లవుతారు అంటున్నాడు మనువు. ఇటువంటి ప్రతిపాదన ఏ దేశపు ఏ చట్టగ్రంథంలో ఉంది? మగువలపట్ల ఒక సంఘం ఏలాగు ప్రవర్తిస్తుందో దాన్నిబట్టి ఆ సంఘనాగరికతను మనం నిర్ణయించవచ్చు. నిప్పుతో మనం చలిబాధ తీర్చుకోవచ్చు, అన్నం వండుకోవచ్చు. వివిధప్రయోజనాలకు దాన్ని వాడుకోవచ్చు. దహించడానికిన్ని నిప్పును ఉపయోగించుకోవచ్చు. సరిగా ఉపయోగించుకోవడం తెలియనివాడు నిప్పును నిందిస్తాడు. మగువలుకూడ మహోన్నత ప్రయోజనాలకు వినియోగార్హ లవుతారు.

పరమార్థమును సాక్షాత్కరించుకొన్న మహర్షులే భారతదేశంలో స్మృతికర్తలుగా వెలిశారు. మగువలూ మగవారూ ఆధ్యాత్మిక వికాసం చెందడానికి సమృద్ధమైన అవకాశం కలిగించే రీతిలో వారు నియమాలు ఏర్పఱచి ఉన్నారు. యోగంలో భ్రంశం కలిగినా, అంతమాత్రంచేత నరకం కానీ హీనజన్మగాని ప్రాప్తించదట. యోగభ్రష్టుడు పుణ్యాత్ముల లోకమునే పడయుననియు, అచ్చట పెక్కేండ్లు సుఖించి పిమ్మట సదాచారసంపన్నులగు ధనికులయిండ్లలో జన్మించుచుండుననియు భగవద్గీత (VI-41) తెలుపుచున్నది. ఐహికసంపదయే సర్వస్వ మని వారు అభిప్రాయపడలేదు. విశుద్ధియు నియమపరతంత్రతయు గృహస్థజీవితమునకు పునాదులుగ వారు నిర్ణయించారు. కాబట్టి అటువంటి కుటుంబాలలో జన్మించిన బాలబాలికలకుకూడా నియమపరత ఉగ్గుపాలతో అలవడుతుంది. జీవితలక్ష్యం వారు ఆకళించుకోగలరు. కుటుంబవాతావరణంలోనే విశుద్ధియు నిష్ఠయు నుండునేని ఆ కుటుంబము వారికి ధ్యానసిద్ధి తప్పకుండా చేకూరుతుంది. వారు వ్యర్థభావనలతో వ్యర్థప్రసంగంతో వ్యర్థచర్యలతో కాలాన్ని రిత్తపుచ్చరు. మనలో మానవశక్తియుక్తులు ఎంతగానో వ్యర్థ మవుతూ మనం మానవస్థాయికంటె క్రిందికి దిగజాఱిపోతున్నాం. వ్యక్తిజీవితంలోను కౌటుంబికజీవితంలోను క్రమశిక్షణకు ఏలాంటి ప్రభావం ఉందో తెలిసికోవలెనంటే, అహింస సత్యము అస్తేయం అప్రతిగ్రహం మనోవాక్కర్మశుద్ధి అను వానిశక్తిని చూడండి. సంఘంలో ఉన్న దురాశయాలను దుష్టశక్తులను సంఘవిరోధులను రూపుమాపగలశక్తి అని ఎవడైనా గుర్తించగలుగుతాడు. నియమబద్ధమైన జీవితం గడిపేవాడికే ఈ ప్రపంచం భోగ్యం. భోగానుభూతియే కాక, అతనిలోని ప్రజ్ఞయూ పదును దేఱుతుంది. సృష్టిమర్మాలను అతడు అర్థం చేసుకోగలుగుతాడు. వేంద్రుకంతైనా దారి తప్పకుండా అతడు పురోగమించి మహోన్నతమైన లక్ష్యాన్ని సాధించుకుంటాడు.

సమాజపురోగతికిన్నీ, ప్రతి ఒక్కరూ నిర్నిరోధంగా అభివృద్ధిని పరిణతిని పొందడానికిన్నీ మహర్షులు చూపిన దారి అలాంటిది. అయితే మనకు ఓపిక తక్కువ, పట్టుదల సున్న, సోమరితనంచేత ప్రతిదానికి మనం కుఱుచదారులు వెతుకుతాం. అది తమోగుణప్రభావం. అది మనలను కామినీకాంచనదాసులనుగా చేసివేసుంది.

...ని జీవితాన్ని చూడండి. ప్రపంచచరిత్రలో ఏపరిశోధకునిలోనూ మనం కని విని యెఱుగనంతటి దీక్షతో ఆయన అనేకసాధనలు చేసి ఒక్కొక్కదానిలోను సిద్ధి పొందాడు. యాభైయేండ్లలో ఆయన ఏం సాధించాడో దానిని మానవసమాజం ఇంతవఱకూ ఆకళించుకోజాలకుంది. భారతీయాధ్యా

త్మిక చరిత్రమంతా పరమహంస దేవుని జీవితంలో ఇమిడి ఉందన్నారు శ్రీ వివేకానందస్వామి.

విద్యార్థులలో నియమబద్ధత లేనిదే, ఉపాధ్యాయులూ విశ్వకళాపరిషత్తులూ వారి కేలాటి బోధనలు చేయజాలకున్నారు. విద్యారంగంలో ప్రస్తుతం ఉన్న చెడుగుల కన్నిటికీ మూలం నియమబద్ధత లేకపోవడమే. నియమానుసరణం అనేటటువంటి పునాది లేకపోతే లౌకికవిద్యకైనా పేరు సార్థకం కాజాలదు. ఏకాగ్రత లేనిదే ఏవిద్య యైనా ఏలాగు అలవడుతుంది? లౌకికవిద్య అధికరించి ధనం గడించి భోగ జీవితం గడుపుతుండే వాళ్లకు దానివలన సంతృప్తి ఏమైనా కలుగుతూ ఉందా? సంతుష్టికి పరిపూర్ణతకు నశ్వరములైన లౌకికవస్తులబ్ధి చాలదు.

నియమబద్ధమైన జీవితం ఏలాగు పరమ లక్ష్యసాధకం అవుతుం దనడానికి శ్రీ శారదా దేవియు శ్రీరామకృష్ణుడు మహోజ్జ్వలోదాహరణాలు. భార్యాభర్తలుగాను గురుశిష్యులు గాను కలిసిన వీరు మహాద్భుతమూర్తులు. భర్త భార్యకు అన్నము పెట్టుటతో అతని కర్తవ్యం ముగియదు. సంసారసముద్రమును దాటునప్పుడు ఆమె తనకు సహాయురాలు కాతగినరీతిలో ఆమెను తర్ఫీదు చేయవలె. ఉపనిషత్కథలలో మనకు మైత్రేయి యాజ్ఞవల్క్యుల ప్రసిద్ధోదాహరణం కలదు కదా. కేవలం సొమ్ము ఇస్తా నన్న యాజ్ఞవల్క్యుని మైత్రేయి సంసారతరణమునకు అమోఘసాధనమైన బ్రహ్మజ్ఞానాన్ని అడిగి పొందింది.

శ్రీరామకృష్ణుడు తనకాలములో మేధానిధు లని ప్రసిద్ధి నొందిన కేశవచంద్రసేను, ఈశ్వరచంద్రవిద్యాసాగరుడు శశధరచూడామణి పద్మలోచనుడు బంకిన్ చంద్రఛాటర్జి మున్నగువారికి ప్రబోధమునూర్చిన గురుదేవుడు. అటువంటివారికి విద్యగఱప సామర్థ్యం గురుదేవున కుంటుం దే గాని ప్రపంచంలోని ఏ విశ్వకళాపరిషత్తుకు ఉండదు. మానవజీవిత పరమార్థాన్ని తుణ్ణంగా ఎఱిగినవాడు శ్రీరామకృష్ణుడు. నిప్పునుగాని ఆత్మనుగాని మానవ సంఘాన్నిగాని ఏలాగు వినియోగించుకొనవలెనో ఆయన ఎఱుగును. లోకానికి ఆయన అనుగ్రహించిన మహిమ్నప్రసాదం మాతృశ్రీయే. భగవద్గీతలో-

> శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
> తత్పర స్సంయతేన్ద్రియః. (IV-39)

"శ్రద్ధావంతుడున్నూ గురుసేవానిరతుడున్నూ జితేంద్రియుడున్నూ అగు వాడు బ్రహ్మజ్ఞానమును పొందుతా'డని ఉంది కదా. మాతృశ్రీలో ఆలాంటి ఆశయాలను నింపడం శ్రీరామకృష్ణునికే శక్యమైంది. మహాదారిద్ర్యం అనుభవిస్తూ శరీరకష్టం చేస్తూ మాతృశ్రీ ఆదర్శమైన జీవితం గడపింది. పేదఱికం ఒకవిధంగా మంచిదే, సోమరితనమును అది దరికి రానీయక మనుష్యుని సదా చుఱుకు గల్గి ఉండేటట్లు చేస్తుంది.

1853 వ సంవత్సరం డిసంబరు 22 వ నాడు జయరామ్బాటిలో అవతరించింది మొదలు 1920 వ సంవత్సరం జూలై 20 వ తేది మహాసమాధి నొందేవఱకు గడచిన మాతృశ్రీ జీవితంలో అందం, ఘనత, శాంతి, సరసత, లాలిత్యం, సామరస్యం పిక్కటిల్లుతుంటాయి. పారమార్థికపరుల కుటుంబంలో పుట్టింది. పసిప్రాయంనుండి సోమరితనం ఎఱుగదు, ఇంటి పనులన్నీ చేస్తుండేది. తనదివ్యత తా నెఱిగినా, ఆమె సాధారణమానవాంగనవలెనే బంధువుల మిత్రుల భక్తుల నడుమ మెలగింది. సతీపతుల చిత్తైక్యం శ్రీశారదారామకృష్ణులలో నున్నంతవే తెక్కడా కనిపించదంటే అతిశయోక్తి

కాదు. 1867 లో ప్రాణవల్లభుని సన్నిధానంలో తా సనుభవించిన బ్రహ్మానందాన్ని గూర్చి కాలాంతరాన మాతృశ్రీయే శిష్యురాండ్ర కిట్లు తెల్పినది—"నా అంతరంగంలో అప్పుడు అమృతభాండం ఉంచినట్లుండేది. ఆసమయంలో నా కిది నిరంతరానుభవం. ఆ అనుభవం ఆ ఆనందం ఈలాంటి దని తెల్పజాలను." అనంతర కాలాన విశ్వమాతగా వెలిసేందుకు తగినట్లామె రూపొందుతుండిన దినా లవి.

అమ్మ పుట్టినింట నిత్యకృత్యాలలో నిమగ్నయై అహోరాత్రములు గడపుతుండంగా ఊరి అమ్మలక్కలు "శారద మగడు పిచ్చివాడై దిగంబరుడై హరి హరి అని అఱుస్తూ తిరుగాడుతున్నాడట" అని చెప్పుకోసాగారు. ఆయనకు మతి పోయిం దనడం నిజమా, సాధ్యమా? నిజమైతే, తాను పుట్టింట కాలక్షేపం చేస్తూండడం తగునా? ఆయనవద్ద కేగి సేవ చేయడం తన కర్తవ్యం కదా అని ఆలోచిస్తున్న శారదకు అందుకు సదవకాశం లభించింది. శ్రీ చైతన్యదినోత్సవసమయంలో కొందఱు మహిళలు గంగాస్నానార్థమై కల్కత్తాకు పోతుండినారు. ఆ జట్టులో కలిసి తాను దక్షిణేశ్వరానికి పోదా మని అమ్మ అనుకుంది. రామచంద్ర ముఖర్జీ స్వయంగా ఆమెను పిలుచుకు వెళ్లాడు. అక్కడ శ్రీరామకృష్ణుడో యథాపూర్వాదరంతో శారదను చేరదీసికొన్నాడు. ఆయన ప్రేమాదరాలను చూఱగొన్నప్పు డామె ఆనందాన్ని ఎవ్వరు వర్ణించగలరు? పందికేమి తెలుసు పన్నీటిపరిమళం అన్నట్లు గురుదేవు నఖండాధ్యాత్మికప్రతిభయూ పారమార్థికవైభవమున్నూ పలుగాకులైన లోకులకేం తెలు సని ఆమె అనుకుంది. ప్రాణేశ్వరునికిని పూజ్యురాలగు అత్తగారికిని సేవ చేస్తూ శారదమ్మ దక్షిణేశ్వరంలో ఉంటూవచ్చింది. భోగానుభవమున కతీతులై ఒకరి నొకరు దైవంగా భజించిన సతీపతులు శ్రీ శారదా రామకృష్ణులు. వారిదాంప త్యంలో మణివిరాజితసువర్ణాక్షరాలతో లిఖింపదగిన మహాసంఘటనం షోడశీపూజ. అది విశ్వచరిత్రంలో అపూర్వాధ్యాయం. అది ఫలహారిణీ కాళీపూజా సుదినం. 1872 వ సంవత్సరం జూను నెల 5వ తేది నాటిరాత్రి శ్రీరామకృష్ణుడు కాళీదేవతకై ప్రత్యేకంగా అమర్చబడిన పీఠంమీద శ్రీ శారదమ్మను కూర్చుండబెట్టి ఆమెయందు లోకజననిని ఆవాహనంచేసి యథావిధిగా పూజించి, పూజావసానమప్పుడు ఆమెకు ఆత్మసమర్పణం కావించుకొని, తన సమస్తసాధనల ఫలమునూ జపమాలనూ తనదగు సర్వస్వమునూ ఆమె శ్రీచరణములకు సమర్పించాడు.

శ్రీ శారదమ్మ జీవితంలో ముఖ్యాగమనార్హాలు—(1) తన నిత్యనైమిత్తికవిధులను సమగ్రంగా నిర్వహిస్తూ, వాటితోకూడా ఆమె సాగించిన నిరంతరాధ్యాత్మికసాధన. (2) అంగీకరిస్తే లక్షలు ధనం సమర్పించడానికి ఆత్రపడుచున్న శిష్యు లెందఱో ఉన్నా శ్రీరామకృష్ణుని పరమవైరాగ్యంతో దీటు వచ్చే పరమవైరాగ్యం. (3) కామార్పుకూరులో దక్షిణేశ్వరంలో శ్యామ్పుకూరులో కాశిపూరులో గురుదేవున కామె కావించిన సభక్తికమైన శుశ్రూష.

1886 లో శ్రీరామకృష్ణుడు మహాసమాధి నొందాడు. వియోగదుఃఖం దుర్భరమై, అమ్మ బృందావనానికి వెళ్లింది. అక్కడుండగా శ్రీరామకృష్ణుడు ఆమెకు తఱచు దివ్యదర్శనాలలో అగపడి క్రమక్రమంగా ఊరట కలిగించాడు. శ్రీరామకృష్ణుడు స్థూలదేహంలో లేకపోయినా, అమ్మకు ఆయన సాహచర్యం నిరంతరంగా ఉంటూవచ్చింది. శ్రీరామకృష్ణునకు

నివేదించకుండా ఆమె ఏమీ పుచ్చుకోదు. ఉద్బోధనవసతిలో ఉండంగాకూడ శ్రీరామకృష్ణునిసాహచర్యమున్నూ, శ్రీరామకృష్ణుని భజనమునే ఆమె నిత్యకృత్యాల సారం.

శ్రీరామకృష్ణమఠ సేవాసంఘాల నిర్వహణమునకు దిగ్దంతులవంటి శ్రీవివేకానంద - బ్రహ్మానంద ప్రముఖులకుకూడా మార్గదర్శకురాలీమె. శ్రీరామకృష్ణుని శిష్యులకందఱికీ ఆమె అమ్మ - మార్గదర్శకురాలు - ఆశ్వాసకురాలు. 1910లో ఆమె దక్షిణభారత దేశమునకు విచ్చేసినప్పుడు ఆమె శ్రీచరణములందు శ్రీరామకృష్ణానందస్వాముల భక్తిప్రపత్తులు మహోజ్వలంగా వెలుగొందాయి. అనుగ్రహమయమునూ అజ్ఞాతనిగ్రహమున్నూ అయిన మాతృహృదయం శ్రీశారదమ్మది. మంచివారు చెడ్డవారు అనే భేదం లేకుండా ఆమె అందఱి అమ్మ. బిడ్డకు మురికి అంటుకుంటే బిడ్డనెత్తుకొని మురికిని కడిగివేయవలసింది అమ్మకు విధి గదా అని ఆమె వాక్రుచ్చెడిది. సాక్షాజ్జగజ్జనని కానిదే అలా గన గలదా?

భగవద్గీతలో (IV—18) "కర్మ ణ్యా కర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః సబుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకత్ "ఎవడు కర్మమందు కర్మను - కర్మాభామును అకర్తృత్వమును గాంచునో, ఎవడు అకర్మమందు (=నైష్కర్మ్యమందు) కర్మను (సర్వకర్మల ఆశయమగు బ్రహ్మను) జూచునో అతడే మానవుల కెల్ల బుద్ధిమంతుడు, యోగయుక్తుడు, కృతకృత్యుడు" అని చెప్పబడ్డ శ్లోకార్థమును మాతృశ్రీ తన జీవితంలో ప్రదర్శించింది. గృహస్థజీవితంలోనే పరమలక్ష్య సిద్ధి పొందవచ్చు ననడానికి ఆమె చరిత్రం మహిళలకు ప్రమాణం.

మగువకు ఆభరణం లజ్జ సదా ఆ ఆభరణంతో శోభించింది మాతృశ్రీ. సరస్వతీదేవియే శారదగా అవతరించిం దని శ్రీరామకృష్ణు డొకసారి వక్కాణించాడు. అయితే దివ్యసౌందర్యాన్ని ఆమె మఱుగుపఱచుకుంది. ఎందుకంటె అలాంటి సౌందర్యాన్ని జూచి భోగ్యబుద్ధిని పొందకుండా ఉపాస్యబుద్ధి నిలుపుకోగల సత్త్వం ఈకాలంవారికి ఉండదు. కావున వారు పెడదారిలో అడుగుపెట్టి అనర్థానికి గుఱికావచ్చు.

ఆమె ఉపదేశాలు వాక్యరూపంలో కంటె హెచ్చుగా స్వానుష్ఠానరూపంలో వెలుగొందాయి. నిజంగా ఇ దొక లోకోత్తరమైన ఆచార్యకం. ఆమె నిర్యాణానికి ఐదు దినాలు ముందు అన్నపూర్ణామాత అనే భక్తురాలు ఆమెను దర్శింపవచ్చింది ఆమెకు అమ్మ కావించిన ఉపదేశం, ఉపదేశాలలో తలమానికం. అమ్మ ఈలా గుపదేశించింది. "మనశ్శాంతి కావాలంటె, ఒరులలో తప్పులెన్నడం మాను. నీలోని తప్పులనే గుర్తించుకో. పరాయివా రెవ్వరూ లేరు. లోక మంతా నీ సొంతమే నమ్మా". 'చీపురుకట్టనైనా అలక్ష్యం చేయకూడదు' అన్నది మఱొక సందర్భంలో.

భువియం దవతరించి సుఖదుఃఖాలలో పాల్గొంటూ మనమధ్య మెలగుతూనే విశ్వాదర్శమైన జీవితం గడపిన మాతృశ్రీ సంసారార్ణవమున నష్టమార్గులైన వారికి సరి దారి చూపే మహోన్నతప్రజ్వాల దీపస్తంభం.

పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా
పవిత్రతా స్వరూపిణ్యై తస్యై కుర్మో నమోనమః.
ఎవతె జీవనచరితము ల్పావనాలో యెవతె రూపుగాంచినయట్టి పావనతయొ
అట్టి మాశారదమ్మ పదాబ్జములకు భక్తి నిడియెద శిర సొగ్గి ప్రణతిశతము.

# మాతృ శారద

వెలుపలి ప్రపంచమే మానవులను ఆక
ర్షించుచుండును. మానవతతిలో దానిచే
ఆకృష్టులగువారే అధికసంఖ్యాకులు. వారి
యభిప్రాయమున ఈ యైహికప్రపంచమే
అన్నిటికన్న ఎక్కువ నిజము. కాని పరమార్థ
మును సాక్షాత్కరించుకొన్న ఋషుల యభి
ప్రాయము వేఱు. ఆ ఋషులనిర్ణయమును ఈ
యైహికపరునకు చెప్పితిమేని అతడు నమ్మడు
ఆమోదింపడు. పరమఋషుల నిర్ణయమును
అర్థము చేసికొనవలయుననిన పైమెట్టుప్రతిభ
కావలయును. ఎన్నో సంవత్సరములు నియమ
నిష్ఠలతో జీవితము గడపి సాధనలు చేసిన
వారికే ఆపైమెట్టు ప్రతిభ అలవడును. కావున
ఐహికసంగమును వదలించుకొనుటకును వస్తు
యథార్థస్వరూపమును గ్రహించుటకును మాన
వునిప్రతిభ సమర్థమైనదిగ కావలయునేని
దానిని సాధించుటకు అనుసరింపవలసిన నియ
మావళిని మహర్షులు ఏర్పఱచియున్నారు.

మానవస్వభావమును వ్యక్తులప్రవణతలను
అభిరుచులను సునిశితముగ పరిశీలించి, తత్పరి
శీలనాఫలితముగ ఏర్పఱుపబడినవే వర్ణాశ్రమ
ధర్మములు. ఏదేనొకవర్ణమునకు ఆధిక్యమును
కల్పించుటకో నిరంకుశాధికారము నర్పించు
టకో ఏర్పడినవి కావు ఈ వ్యవస్థలు. వ్యక్తికిని
సంఘమునకును లాభప్రదములుగ నుండవలె
ననెడి యుద్దేశముతో ఏర్పఱుపబడినవే యవి.
వ్యక్తులగుణకర్మలను బట్టియే వర్ణవిభేద మేర్ప
ఱుపబడినది. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మవిభాగశః" అని శ్రీ గీతాచార్యుడు
వక్కాణించెను. ప్రతివర్ణమును ప్రతి ఆశ్రమ
మును దాని స్థానమున అది గొప్పదే. ఏ
వర్ణమువా రావర్ణధర్మములను ఏయాశ్రమము
వా రాయాశ్రమధర్మములను యథావిధిగ
ననుష్ఠించిన వ్యక్తికి జీవితలక్ష్యము సిద్ధించు
ననియు సంఘమునకు లాభకరముగ నుండు
ననియు మహర్షుల విశ్వాసము. వ్యాసమహర్షి
మహాభారతమున ఒక పతివ్రతయు ఒక ధర్మ
వ్యాధుడును కేవలము తమ విహితకృత్యము
లను యథావిధిగను సభక్తికముగను నిర్వ
ర్తించుటచే పరమజ్ఞానసిద్ధిని బడసినరీతిని
తెలిపియున్నాడు. "స్వకర్మణా త మభ్యర్చ్య
సిద్ధిం విన్దతి మానవః" "తనకు విహితమైన
కర్మ నాచరించుటచే భగవంతు నారాధించి
మానవుడు సిద్ధి నొందుచున్నా"డని చెప్పిన
శ్రీకృష్ణుడును వ్యాసమహర్షితో నేకాభి
ప్రాయుడే.

ఇటువంటి యుపదేశములు ఎన్నిపర్యాయ
ములు కావించినను అనుష్ఠించిచూపినను
మానవు లేమో మరల మరల జఘన్యాశయ
ములవంకకు మొగ్గుచుండుట వారి స్వభావము.
కావున మానవులను చక్కబఱచుటకై భగ
వంతుడో ఆయన పరివారమో భువియందు
అవతరింపవలసి వచ్చుచుండును.

పరమప్రకృతి పరమపురుషునికి సహాయ
ముగ జగజ్జనసముద్ధరణమునకై మాతృశ్రీ
శారదాదేవిగా అవతరించినది. సరళస్వభావ
మైన పల్లెపడుచుగ నవతరించినది. ఆమెజీవిత
మున వెలుపలికి కొట్టవచ్చినట్లు కననగు
సంభవములు లేవు. అద్భుతలీలలు లేవు.
వైభవాడంబరప్రదర్శనము లేదు. ప్రభాతమున
మంచునీరు నిశ్శబ్దముగ పడి లక్షలకొలది
పుష్పములకు వికాస మొనగూర్చునట్లు నడచి
నది ఆమె యవతారకార్యము. ఆశ్రయించిన
వారి కెల్ల ఆమెయనుగ్రహము సుప్రాపమే.
స్వకీయజీవితము బాహ్యమునకు కూడ మహో
న్నతముగను మన అవగాహనకు అందనిదిగను

ఉండునేని దాని నాదర్శముగ గ్రహించు టెట్లు? కావున ఆమె తనలోని దివ్యాంశమునకంటె మానవాంశమునే అధికముగ ప్రదర్శించెను. ఆమె ఎదుటివారికన్నులను మిఱుమిట్లుగొలుపక చందమామ చలివెలుగులవలె ఆహ్లాదమును ఆప్యాయనమును గూర్చెడిది. చందమామ అందఱికిని మామయైనట్లు అమ్మయు అందఱికిని అమ్మయే. ఐనను ఆమె తనలోని దివ్యాంశమును చూపకే పోలేదు. మిక్కిలి ఆంతరంగికులకు కొందఱికి చూపనే చూపినది, ఇతరులకు మాత్ర మామె కేవలము ప్రేమపూర్ణయగు జనని. పుత్రిగా సోదరిగా సతిగా మాతగా ఆమె ఆదర్శజీవితమును గడపి ఆధ్యాత్మిక జీవితమునకు ఏస్థానమును ప్రతికూలము కాదు అని నిరూపించెను.

మన స్మృతికర్తలు మానవజీవితమును నాలుగువిభాగములుగ గుర్తించి విభాగములను ఆశ్రమములని పేర్కొనిరి: బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము. వీనిలో బాధ్యత తక్కినవానికంటె గార్హస్థ్యమున కెక్కువ. గృహస్థుడే సంఘమున కవలంబము. తక్కిన మూడుఆశ్రమాలు అతనిని జుట్టియుండును. సంఘమున ధర్మపరతగాని పతనముగాని అతనిపై నాధారపడియుండును. తరువాతి తరాలవారికి చక్కని విద్య యలవడుటకు ఆనుకూల్యములను సమకూర్పవలసినవాడును వానప్రస్థులయు సన్న్యాసులయు పోషణ నిర్వహింపవలసినవాడును గృహస్థుడే.

గృహస్థుడు నిర్వహింపవలసిన బాధ్యతలకు ఋషులు పంచయజ్ఞము లని పేరుపెట్టిరి. దేవఋణమును ఋషిఋణమును పితృఋణమును గృహస్థుడు తీర్చుకోవలెను. నిత్యకర్మానుష్ఠానముచే దేవఋణమును, వేదాధ్యయనముచే ఋషిఋణమును, శ్రాద్ధకరణముచే పితౄణమును తీరును. అతిథిఅభ్యాగతులను అత డాదరింపవలయును. పశుపక్ష్యాదులను పోషింపవలయును. ఆదర్శగృహస్థునకు ఇన్ని ఋణములను తీర్చుకొనవలసిన బాధ్యత కలదు.

బాధ్యతలు మిక్కుటమనిపించును కాని ఈ నియమావళిని పాటించిననే జీవితమున పురోగతి కలుగును. మనస్సునకు శాంతి చేకూరును. కాని చరిత్రలో వింత ఏ మనగ ప్రజలు తమ హక్కులను మాత్రము జ్ఞప్తియుంచుకొందురు. బాధ్యతలను విస్మరించుచుందురు. స్వార్థపరత దురాక్రమణము గర్వము ఇటువంటివి హెచ్చి ఉదారగుణములు అడుగున బడుచుండును. అడుగునబడిన వానిని పైకి తెచ్చుటకును భారత జీవితలక్ష్యపుమేలిమిని మరల స్థాపించుటకును మనలను సంసారబంధమునుండి విడిపించుటకును మాతృశ్రీ భువిపై నవతరించినది.

ఆమె నాలుగువిధములైన భూమికలను నిర్వహింపవలసియుండెను. (1) సంరక్షకిగా (2) ఆదర్శగృహిణిగా (3) ఆదర్శసన్యాసినిగా (4) ఆదర్శమహిళగా. ఇన్ని ఆదర్శములను ఆమె తనలో ఎట్లు సమన్వయించుకొనెనో పరిశీలింపవలయును.

కరుణయు రక్షణప్రవణతయు మాతృశ్రీలో శైశవమునుండియే కననగుచుండినవి. ఆజిల్లాలో పెనుకాటకము దాపురించినది. ఆమెతండ్రి పేదవాడైనను ఉన్నంతలో పేదలకు అన్నదానము చేయుచుండెను. ఒక్కొక్కప్పుడు వంటవార్పులు రాత్రివఱకు సాగుచుండెడివి. ఆకలిచే నకనకపడువారు వడ్డించిన అన్నము వేడి స్పర్శసహముగునంత తగ్గువఱకు వేచియుండజాలక ఆత్రపడుచుండగ పదునొకండు సంవత్సరములవయస్సు గల శారద వారిపరిస్థితిని గని మనస్సు కరగి అన్నము చల్లబడునట్లు

విసనకఱ్ఱతో వీచెడిది. ఆధ్యాత్మికమైన వెలుగును కోరి తన్ను సమీపించెడివారిలో పలు అంతస్తులవా రున్నను ఎట్టి భేదమును పాటింపక సమానాదరముతో అందఱిని ఆమె చేరదీసెడిది. పల్లమునకు పాఱు ప్రవాహమువలె ఆమెకృప పతితులమీదికి నిమ్నులమీదికి మఱింత వేగముగ ప్రవహించెడిది. అరుదైన సందర్భములలో ఆమెలోని దివ్యత్వము ప్రకటమైనప్పుడు ఆమె నోట నిర్వృతిప్రదములైన వాక్యములు వెలువడెడివి. ఒకభక్తుడు ఆమెచరణము లంటి తన పాపాలబరువును ఆమెకు సోకింప వెనుదీయగా ఆమె ఇట్లనెను. నాయనా, ఏల సంకోచింతువు? మేము పుట్టినదే ఇందుకు. మీ పాపాలను దుఃఖాలను మేము అంగీకరింపకున్నచో వేఱెవ రంగీకరింతురు? పాపులయు దుఃఖితులయు బాధ్యతలను ఎవరు వహింతురు?

పతితులస్పర్శచే అప్పుడప్పుడామెకు మిక్కుటమైన దేహబాధలు ఒడలిమంటలు కలిగెడివి. కాని ఆమె మాతృహృదయము భక్తుల కాశ్రయ మిచ్చుటకు వెనుదీసి యెఱుగదు. అందఱిని ఆమె రానిచ్చెడిది. ఆమె యనుచరులు కొందఱు "అమ్మా, అర్హతను గుర్తించి ఆదరింపు" మని బోధించెడివారు. అందు కామె "నేను అందఱికిని అమ్మను కదా. వచ్చినవారి నెల్ల ఊరడించుట నావిధి కదా" అని చెప్పెడిది. అవతారమూర్తితప్ప ఇట్టి యభయప్రదానమును ఎవరు చేయగలరు? విభీషణుని చేరదీయరాదు అని సుగ్రీవుడు పట్టుపట్టినప్పుడు శ్రీరామచంద్రుడు చెప్పిన వాక్యము మనకు జ్ఞప్తికి రాకతప్పదు. "విభీషణుడు రావణుని తమ్ముడు ఏదో దురుద్దేశముతోనే వచ్చియుండు" నని సుగ్రీవు డనెను. అందుకు శ్రీరాముడు చెప్పిన జవాబు.

> సకృదేవ ప్రపన్నాయ
> త వాస్మీతి చ యాచతే
> అభయం సర్వభూతేభ్యో
> దదా మ్యేత ద్వ్రతం మమ
> ఆన యైనం హరిశ్రేష్ఠ
> దత్త మ స్యాభయం మయా
> విభీషణో వా సుగ్రీవ
> యది వా రావణః స్వయమ్.

"ఒక్కసారి శరణు కోరి 'నేను నీవాడ' నని ఎవడు యాచించునో అతనికి సర్వభూతముల వారినుండి అభయ మిచ్చుట నావ్రతము. వానరోత్తమా సుగ్రీవా, వచ్చినవాడు విభీషణుడుగానీ, స్వయముగ రావణుడేగానీ అతనికి నే నభయ మిచ్చియైనది. కావున అతనిని పిలుచుకొనిరమ్ము." (రామాయణము యుద్ధకాండము XVIII-33-35) పతితులమీదికి ప్రసరించిన మాతృశ్రీకృపయు నట్టిదే. వర్ణవర్గమతభేదములను పాటింపక ఆమె యనుగ్రహించెడిది. జయరాంబాటీగ్రామములో నుండిన దారిదోపిడిగాండ్రగు మహమ్మదీయులపట్ల సైతము ఆమె మాతృవాత్సల్యముతో మెలగెను. వారిజాతిగాని వృత్తిగాని ఆమెప్రేమను మార్పొందింపలేదు.

సామాన్యమానవులు ఆమె నవగాహన చేసికొనజాలరు. ఆమెస్వరూపమును ఏరవంతయైన గ్రహింపగోరుదుమేని ఆధ్యాత్మికదిగ్దంతులైన శ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యుల సూక్తులను రచనలను గనవలయును. ఒకజాబులో శ్రీ ప్రేమానందస్వామి ఆమెనుగూర్చి ఇట్లు వ్రాసెను. "మాతృశ్రీని ఎవ రర్థము చేసికొనిరి? ఎవ రర్థము చేసికొనగలరు? సీతనుగూర్చి సావిత్రినిగూర్చి విష్ణుప్రియనుగూర్చి రాధారాణినిగూర్చి మీరు వినియున్నారు. వారందఱికంటె చాల పైమెట్టు నధిష్ఠించినది మాతృశ్రీ.

ఆమెలో దివ్యశక్తులు జాడగానైన కనిపించెడివి కావు. శ్రీరామకృష్ణునిలో విద్యాశక్తి యుండెడివి. ఆయన భావోద్రేకములను సమాధులను పలుసందర్భములలో చూచియున్నాము. మాతృశ్రీలో విద్యాశక్తులుసైతము కనిపించెడివి కావు. అది ఎంతటి యుత్కృష్టప్రభావము! ఎందఱు ఆమెనాశ్రయింప క్రిక్కిఱిసెడివారో చూచుచున్నారు కదా. మనము జీర్ణించుకోలేని విషమును అమ్మవంకకు నెట్టివేయుచున్నాము. ఆమె యేమో అందఱికి ఆశ్రయ మిచ్చుచున్నది. అనంతము కదా ఆమె ప్రభావము! అపారము కదా ఆమెకృప! మాతృశ్రీకి జయము! మనసంగతి ఎందుకు? శ్రీరామకృష్ణునిలోసైతము ఇటువంటి అనాలోచితవిశేషాశేష లోకశరణ్యత కానము. సునిశితముగ పరీక్షించియే ఆయన ఎవరినిగాని దరిజేర నిచ్చెడివాడు. మఱి మాతృశ్రీయో ఆశ్చర్యము! అద్భుతము! ఆమె అందఱికి శరణమొసగుచున్నది. అందఱిపాపములను జీర్ణించుకొనుచున్నది. అమ్మ! అమ్మ! అమ్మకు జయము!''

మొదట పుట్టినింటిలోగాని పిమ్మట దక్షిణేశ్వరమునగాని కామార్పుకురునకాని మరల జయరాంబాటిలోగాని ఆమెజీవితము నిర్వ్యాజ నిరంతరసేవామయము. జయరాంబాటిలో తమ్ములను విచారించుకొనుట వంటవార్పులు ఆవులకు మేతపెట్టుట మున్నగు నన్నిపనులను ఆమె యొక్కతే నిర్వహించెడిది. దక్షిణేశ్వరమున అత్తగారికే గాక కారణజన్ముడగు శ్రీరామకృష్ణునకును ఆయనయొద్దకు వచ్చు భక్తబృందమునకును ఆమె పరిచర్య చేయవలసియుండెడిది. అన్నపానములను ఒక్కొక్కరికొక్కొక్కరీతి తయారు చేయవలసియుండెడిది. కాని దివ్యపురుషుడగు శ్రీరామకృష్ణుని సన్నిధానప్రభావముచే ఆమెకీ సేవాకార్యక్రమము మహానంద మొసగూర్చుచుండెడిది. అనంతరము జయరాంబాటిలో ఆమె గడపిన జీవితమునుగూర్చి శ్రీ ప్రేమానందస్వామి ఒకజాబులో నిట్లు వ్రాసెను. ''మహోన్నతసామ్రాజ్ఞి స్వేచ్ఛచేతనే పేదమహిళగా నవతరించినది. నేల నూడ్చునదామెయే. గిన్నెలను తోమునది ఆమెయే. వడ్లు దంచుకొనునదామెయే. భక్తులు భుజించిన పిమ్మట ఎంగిలాకు లెత్తి శుద్ధము చేయునదియు ఆమెయే. గృహిణులకు దారి చూపుటకై జయరాంబాటిలో ఆమె నానాకష్టములకు లోనగుచుండెను. ఆత్యంతికమైన సహనము అపారమైనకృప సమగ్రమైన నిరహంకారత ఆమెలో రూపుదాల్చినది.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము కమార్పుకూరులో నుండిన దినములలో అన్నములోనికి ఉప్పుసైతము లేనంతదరిద్రస్థితిలో ఆమె యుండినను ఎవ్వరికిని ఆమె దానిని తెలియనీయలేదు. కమార్పుకూరునకు వచ్చు సాధువులకు ఆమె ఆతిథ్యమును సలుపుచునే యుండినది.

ఆమె గృహిణిజీవితమును గడపినను అది త్యాగముతోను సేవాపరతతోను నిండినది. త్యాగప్రవణుల కెల్ల ఆమె జీవిత మొక గుణపాఠము. సంసారసంగము బొత్తుగ లేక ఆధ్యాత్మిక సాధనలతోను అనుభూతులతోను వ్యాప్తమైయుండె నామె జీవితము. ఆమెకు దినము నిశీథానంతరము మూడుగంటలకు ప్రారంభమై రాత్రి 11 గంటలవఱకు సాగెడిది. ప్రాతస్సంధ్యకు మునుపటి గంటలును అనంతరము తీఱికగల గంటలును ఆమెకు ధ్యానజపములతో గడచెడివి. తాను జగజ్జనని యైనను భక్తులకు దారిచూపుటకై ఆమె ఆధ్యాత్మికసాధనలను చేసెను. ఒకదినము

కాదు రెండు దినములు కావు. లేచి నడమాడ జాలని దశ వచ్చువఱకు జీవితకాలమంతయు ఆమెసాధనలు చేయుచునే యుండెను. శిష్యులకు ఆమె ఈలాగు చెప్పెడిది. "నాయొద్ద నున్న దానిని మంత్రోపదేశ మప్పుడే మీకు నే నిచ్చివేసితిని. వెంటనే మనశ్శాంతి పొంద గోరుదురేని విహితమైన ఆధ్యాత్మిక సాధనలను చేయుడు. చేయకున్నచో దేహపతనానంతరమే కాని సిద్ధి నొంద జాలరు."

తల్లిదండ్రులున్నంతవఱకు పుత్రిగా వారికి తాను చేయవలసిన విధుల నెల్ల చేయుచు గృహకృత్యముల నిర్వహించుచు శుశ్రూషించుచుండెను. అక్క కాబట్టి తమ్ములకు తాను చేయవలసిన వానినెల్ల చేసెను, వారి కుటుంబములను విచారించుకొనెను. వలసినప్పుడు ధనసాహాయ్యముసైతము చేసెను. ఆమె ఆదర్శగృహిణి. సీతవంటి యొకమహిళ ఉండుట సుసంభవమా అని ప్రజలు సందేహింపజొచ్చిన కాలమున మాతృశ్రీ సీత గడపిన జీవితమువంటి జీవితము ప్రత్యక్షముగ గడపి సంశయాత్ములను చూపెను.

జయరాంబాటిలో ఆమె యుండగా భర్తకు పిచ్చి పట్టినదని వార్త చెవిని బడెను. ఆయన పిలుపును నిరీక్షించుచుండిన ఈమె ఆ సందర్భమున ఆయనచెంత నుండుటే తనకు విధాయకమని యెంచెను. కాబట్టి భయసంశయములతో దక్షిణేశ్వరమునకు బయలువెడలినది. పోయి చూడగా తాను విన్న వదంతు లన్నియు అసత్యము లనుట బోధపడెను. కొన్నియేండ్లకు మునుపు కామార్పుకూరులో చూచినప్పుడు శ్రీరామకృష్ణుడు తనయెడ నెంత ప్రేమపూర్ణుడుగ నుండెనో ఇప్పుడును అట్లే యుండెను. కాని ప్రస్తుత మాయనకు తన పరిచర్యయు సాహాయ్యమును ఆవశ్యకము లని ఆమె గుర్తించెను. సుదీర్ఘ ప్రగాఢతపస్సాధనలచే ఆయన దేహము కృశించి ఉపచార సాపేక్షమై యుండెను. అప్పటినుండి ఆమె ప్రాయికముగా భర్తృనిర్యాణమువఱకు ఆయనచెంతనే యుండి శుశ్రూషించుచుండెను. దక్షిణేశ్వరమున ఆమె నడవడిని కంటిమేని శ్రీరామకృష్ణ సేవతప్ప ఆమెకు వేఱొక యపేక్షితము లేదనుట స్పష్టపడును ఆమె వచ్చిన క్రొత్తలో శ్రీరామకృష్ణు డొకసారి యామెను "నన్ను మాయామార్గము నకు దింపుద మను కోర్కె నీ కున్నదా" అని యడిగెను. తడుముకొనక వెంటనే ఆమె ఇట్లనెను. "ఆలాగు నే నేల చేయవలయును? ఆధ్యాత్మికజీవితమార్గమున మీకు తోడ్పడుటకే నేను వచ్చితిని." ఆమె శీలోదాత్తతకును జీవిత పవిత్రతకును ప్రమాణమైనది ఈ ప్రత్యుత్తరము.

ఈ వాక్యనిగూఢార్థమును గ్రహింపగలవాడు శ్రీరామకృష్ణు డొక్కడే. ఆధ్యాత్మిక జీవితమున తన కామె తోడ్పడినరీతిని అభినందించుచు అనంతరకాలమున ఆయన స్వశిష్యులతో నిట్లనెను. "ఆమెలో అంతటి పవిత్రత లేకుండిన ఆమె ప్రలోభనములకు లోబడి నే నేమై యుందునో ఎవ రెఱుగుదురు?" శ్రీశారదాసుగుణసంపదకు గురుదేవుని ఈ వాక్యమును మించిన ప్రమాణ ముండబోదు. సరళమైన ఈవాక్యము ఆత్మనిగ్రహమందును ఆధ్యాత్మికపరతయందును మాతృశ్రీ గురుదేవునకు దీటువచ్చునదే అని స్పష్టపఱచుచున్నది.

ఆదర్శహిందూగృహిణి ఐనందుల కనురూపముగా ఆమె సకలాశయములును శ్రీరామకృష్ణునాశయముల కభిన్నములు. ఆయన యాశయముల నన్నిటిని ఆమె చక్కగా జీర్ణించుకొని తనవిగ చేసికొనెను. ఇప్పటి ప్రపంచమునకు శ్రీరామకృష్ణుడు ప్రసాదించినవానిలో

అన్నిటిని మించినది వైరాగ్యమని ఆమె వక్కాణించెను. ఒకప్పు డొకభక్తుడు శ్రీరామకృష్ణున కపారధనవిరాళము సమర్పింపగోరెను. కాని ఆయన మూర్తీభవించిన వైరాగ్యమే కావున ధనమును కూడబెట్టుకొను తలంపే ఆయనకు గిట్టదు. కావున "ఇక నెప్పుడు ఈ మాట నెత్తకు" అని ఆభక్తుని హెచ్చరించెను. ఐనను "మాతృశ్రీకి ఆక్షేప ముండనిచో ఈధనమును నీ వామెకీయ వచ్చును" అని శ్రీరామకృష్ణు డనెను. స్వీకరింప నిరాకరించుచు అమ్మ శ్రీరామకృష్ణునితో నిట్లనెను: "ప్రజలందఱు నిన్ను నీవైరాగ్యమును బట్టియే పూజించు చున్నారు. ఈధనమును నేను గైకొందునేని నీకొఱకే కదా వెచ్చింతును. కావున దానిని నే నెట్లు స్వీకరింతును?" ఈపలుకులు శ్రీరామ కృష్ణునకు అత్యంతప్రీతికరములుగ నుండె నట.

శ్రీరామకృష్ణునిఆదేశాలను అమ్మ అక్షరాల పాటించినది. మానవస్వభావమును చక్కగా నెఱిగిన గురుదేవుడు "ఎవరిని గాని పైసా ఐనను అడుగకూడ" దని అమ్మకు చెప్పియుండెను. "కమార్పుకూరులో నుండుము. ధాన్యమును శాకములను నీవే పండించుకొని భుజింపవలసి నది. ఒరులసాయము కోరవలసిన యవకాశ ముండరాదు" అనియు ఆయన చెప్పియుండెను. ఈసలహాను ఆమె "తు. చ" తప్పక పాటించిన రీతిని మన మెఱుగుదుము.

ఇక నామె మాతృభావము అనన్యాదృశము. భువియందు ఏతల్లియు తన బిడ్డలను ఆమె ప్రేమించినంతగ ప్రేమించి యుండదు. ఆమె వహించినంత యక్కఱ వహించి యుండదు. ఇది ఆమె నాశ్రయించిన ఎల్లరిస్వానుభవమే. ఆమె సన్న్యాసులకు మాత్రమే కాదు తల్లి, అందఱికిని తల్లియే. సంసారమును త్యజింపవలె ననెడి తీవ్రమైన యుబలాటముతో వచ్చిన వారితో నామె "ఔను, ఏ మున్నది సంసారములో? మీరు కావించుకొన్న నిశ్చయము సరియైనదే" అని చెప్పెడిది. కాని ఇంకను విషయ సంగ మున్నవారు వచ్చినప్పుడు వారితో "కాషాయవస్త్రములు ధరించుటయే జీవిత చరమలక్ష్యమా ఏమి?" భగవంతునందు ప్రగాఢమైన భక్తి యుండవలె ననుటే పరమార్థము. సన్న్యసించు టెందులకు?" అని చెప్పెడిది. తమతమయభిలాషానురూపమైన జవాబును విని ఉభయవర్గముల వారును సంతోషించిరి.

మాతృశ్రీ శ్రీరామకృష్ణున కెంత విధేయురాలుగ నుండెడిదో మనము గుర్తించి యున్నాము. కాని మాతృవాత్సల్యవిషయమున ఆయనసైతము ఆమెను మార్పలేదు. ఎప్పుడైన ఆమెకు గల మాతృవాత్సల్యమునకు ప్రతికూలముగ గురుదేవుడు మాటాడునేని అట్లాయన జోక్యము కలుగజేసికొనుట తన కప్రియ మని ఆమె సూచించెడిది. అప్పు డాయన ఆమె వాత్సల్య గరిమను గుర్తించి తానే లోబడి పోయెడివాడు. ఒకప్పుడు దక్షిణేశ్వరమునకు వచ్చిన భక్తులకును పరిసరప్రాంతశిశువులకును ఆమె ప్రసాదమును మధురభక్ష్యములను ధారాళముగ పంచి పెట్టుచుండుటను చూచి గురుదేవుడు "ఈలాగు వెచ్చింతువేని ఎట్లు ఆగ గలవు?" అని యడిగెను. ఈమాట అమ్మకు నచ్చలేదు. కొన్ని నిమిషములు మౌనముగ నుండి మోము ముడుచుకొని చరచర నడచి పోయెను. గురుదేవుడు వెంటనే పరిస్థితిని గ్రహించి ఆమెను సమాధానపఱుపు మని తన అన్నకుమారుడైన రామలాలును పంపెను.

మఱొకప్పుడు కూడ మాతృశ్రీ గురుదేవుని కంటె భిన్నాభిప్రాయురా లయ్యెను. శ్రీరామ కృష్ణుడు ఆధ్యాత్మికాచార్యకమున ఎంత కచ్చి

తముగ నుండెడివాడో మన మెఱుగుదుము. భక్తులలో ముఖ్యముగ యువకుల పురోభివృద్ధి విషయమును ఆయన కను పెట్టుచుండును. వారు పెడదారిని అడుగు పెట్టినప్పుడెల్ల సరిదిద్దుచుండెను. ఒక్కొక్కరు ఏమి భుజింపవలసినది ఎంత భుజింపవలసినది అను విషయమునుకూడ ఆయనయే నిర్ణయించెడివాడు. ఒకనాడు ఆయన బాబురామును (ప్రేమానందస్వామిని) "రాత్రులందు ఎన్ని చపాతులు తినుచున్నా" వని యడిగెను. "ఐదారు చపాతులు తిందు" నని అతడనెను. "అన్ని చపాతు లేల తినుచున్నావు" అని గురుదేవు డడిగెను. "అమ్మ పెట్టినది తినుచున్నాను" అని యతడనెను. అంత గురుదేవుడు "మితిమీరినతిండి పెట్టి శిష్యుల ఆధ్యాత్మికాభివృద్ధిని చెడగొట్టుచున్నా"వని మాతృశ్రీతో ననగా ఆమె "రెండు చపాతులు ఎక్కువ తినినందుకు మీ రింతగ బాధపడ నేల ? వారి యోగక్షేమమును నేను చూచుకొందును లెండి. తిన్నందుకు వారిపై కోపపడకుడు" అని బదులు చెప్పెను. ఆమె భుక్తిముక్తిప్రదాయిని యగు శక్తి కదా, కాబట్టి శిష్యుల పురోభివృద్ధి చెడ దని గట్టిగా చెప్పుటకు ఆమెకే సాధ్యపడినది.

మహిళాధర్మమునకు ఆమె పరమాదర్శము. భారతీయమహిళాధర్మమునకు శ్రీరామకృష్ణు డీమెను పరమలక్ష్యముగ భావించె నని సోదరి నివేదిత తెలిపియున్నది. పల్లెవాతావరణమున పుట్టిపెరిగిన యామెను సిగ్గు మిక్కుటము. మేలిముసుగు లేకుండ మగవారియెదుటికి వచ్చెడిది కాదు. ఉన్నచోటు ఎవరికిని తెలియనీయకుండెడిది. దక్షిణేశ్వరమున ఆమె ఉన్న దినములలో ఎవరికంటికిని ఆమె కనిపించెడిది కాదు. దక్షిణేశ్వరపుగుడికార్యనిర్వాహకుడు ఆమె ఇక్కడ ఉన్న దని వినుచున్నాము. కాని ఎన్నడును కనిపించినది కాదు" అనెను. అంత నిరాడంబరత, అంత సిగ్గు ఆమెకు! కాని ఇవి పతికి ఆమె చేయవలసిన కర్తవ్యములకు అడ్డుతగులలేదు. వేగుజామున లేచి ఇతరులెవరును మేలుకొనుటకు ముందే గంగలో ఆమె స్నానాదికములను ముగించెడిది. గుడిలో గుంపంతయు పోవువఱకు వేచి యుండి మధ్యాహ్నము శిరోజముల తడియార్చుకొనుటకు రవంత వెలుపలికి వచ్చెడిది.

వసతులు తక్కువగ నుండుట, శరీరకష్టము– ఇవి ఆమె కొక లెక్కకాదు. దక్షిణేశ్వరమున వంటకు, వస్తువు లుంచుకొనుటకు,వచ్చినవారిని కూర్చుండబెట్టుకొనుటకు– వీని కంతటికిని ఉన్న గది ఒక్కటే, చాల చిన్నది. చిఱుచాపయే ఆమె పాన్పు. పదుమూడుసంవత్సరములు తా నుండిన ఆగదిని గూర్చి అనంతరకాలమున తన మేనకోడండ్రతో చెప్పుచు "మీ రెవ్వరును ఒక్కదినమైనను అం దుండ లేరు" అనెను. అంత చిన్నగదిని ఆమె ఎట్లు సరిపుచ్చుకొనుచుండెనో ఊహింపనైన జాలము. అప్పుడప్పుడు రాత్రులందు గురుదేవుని భక్తమహిళలు కొందఱు మాతృశ్రీతో అందు విశ్రమించెడివారు. గురుదేవుని మెలకువతో పరిచారించుకొనవలసిన ఆవశ్యకతచేతను గురుదేవుని నుండి నిరంతరము వెలువడు ఆనందప్రవాహము చేతను ఆమె ఆ ఇబ్బందుల నన్నిటిని సంతోషముతో భరించెను. కన్నతల్లివలె ఆమె గురుదేవునిచేత కొసరి కొసరి అన్నము తినిపించెడిది. భుజించుచున్నంత సేపు ఆయనతో సరళసల్లాపము సలుపుచు సమాధిరంగమునకు ఎగసిపోవు స్వభావముగల ఆయన చిత్తమును మామూలు స్థాయిలో ఉంచి - ఆయన కారోగ్యము సమకూర్చెడిది.

అత్తగారికి ఆమె చేయుచుండిన సేవయు చూపుచుండిన ఆదరమును చరిత్రలోను కట్టుకథలలోను మనము కనువానికంటె మించి యుండెడిది. చంద్రాదేవి తన పూర్తిపేరును పిలుచుటకు ముందే ఈమె ఆమెయెదుట వ్రాలెడిది. ''మెల్లగ పోవమ్మా'' అని చెప్పిన యొక శిష్యునితో ఈమె 'తొందరలో ద్వారబంధమున కేసి తలకొట్టుకొన్నను నాకు పర్వాలేదు. ఆమె నాకు గురువు తల్లి కూడ. ముసలామె. నేనాలసించినచో ఆమెకిబ్బంది కదా. అందుకై పరుగిడెదను' అని చెప్పెను. ఇందువలన ఆమె ఎంతటి గాఢప్రేమతో సేవ చేసెడిదో తెలియుచున్నది. నవ్యజగత్తునకు ఆమె ప్రదర్శించిన ఆదర్శ మిది.

సోదరులు ధనమునకై ఈమెను బాధించెడివారు. పిచ్చిదైపోయిన ఒక వదినెయు మేనకోడలైన రాధును ఈమెకు కలిగించిన ఇబ్బందులు ఇంతంత కాదు. రాధు పుట్టినప్పటినుండి అమ్మను వేపించుచుండినదే. కాని అమ్మ ఎచ్చటికి పోయినను వారిని తమయింటి అవిభాజ్యాంగములుగ భావించి సమస్తమును నిశ్శబ్దముగ ఓర్చుకొనెడిది. గలభాచేయు గుంపుమధ్య నుండియే బ్రతికినంత కాల మామె పరమార్థోపదేశకార్యమును సాగించుచుండెను.

ఒడలు వంచి పాటువడుటే గొప్పతన మని వక్త లుపన్యసించుచుందురు కదా. అందుకు వెలుగుబాట తన నడవడిచే మాతృశ్రీ చూపినది. ఈకాలపు మహిళలు చేయుట కేవగించుకొను పనులనుసైతము ఆశ్రితులకై అమ్మ జయరాంబాటిలో కామార్పుకూరులో దక్షిణేశ్వరములో కల్కత్తాలో ఇంక నితరప్రదేశములలో చేసియున్నది.

రామకృష్ణసంస్థ నెలకొల్పబడినప్పటినుండి దాని పరిపాలనమందు ఎంతో భాగమును ఆమె నిరాడంబరముగ నిర్వహించినది. చిక్కుపరిస్థితులు సంభవించినప్పుడు సమయస్ఫూర్తితో – చిక్కునుండి వెలువడుమార్గము లామె తెల్పెడిది. ఆ సంస్థకు తీరు తెన్ను ఏర్పఱచిన దామెయే.

శ్రీ వివేకానందస్వామి భారతదేశపర్యటనములను కన్యాకుమారియగ్రమున కడలినడిమి తిప్పపైని ధ్యానములను సాక్షాత్కారములను ముగిసినపిమ్మట పాశ్చాత్యదేశములకు బోవ నెంచియు ఇంకను నిశ్చయము కుదుర్చుకోలేకుండిన దినములలో 'మీ యభిప్రాయమును అనుమతిని దెలుపవలసిన'' దని మాతృశ్రీకి జాబు వ్రాసెను. ఆమె యనుమతి నొసగి నంతనే స్వామికి సకలసందేహములను చాంచల్యములును తొలగిపోయినవి. అది దివ్యాజ్ఞగా ఆయనచిత్తమున కెక్కెను. రామకృష్ణసంప్రదాయసన్న్యాసులు సేవాశ్రమాలలోను ధర్మవైద్యశాలలలోను గ్రంథవిక్రయశాలలలోను కార్యభారమును నిర్వహించుట మంచిదేనా అని యొక శిష్యు డడిగినప్పుడు ఆమె చెప్పిన జవాబు—''చాల మంచిది. ఆ పనులు చేయక మీరు వేఱేమి చేయుదురు? ఇరువదినాలుగుగంటలును ధ్యానజపములు సేయుచుందురా ఏమి? మీరు పాటువడుచున్నందుననే భుక్తి గడచుచున్నది. మఠములను సాగింపవలసినది ఈ రీతులలోనే.'' సంస్థల నిర్వాహమున ఆమె కుండిన సర్వాతిశాయిసామర్థ్యములను నిరూపించు సందర్భము లెన్నో గలవు

ఈవిధముగా మాతృశ్రీ తనలో మానవత్వదివ్యత్వములను కలుపుకొని జగదుద్ధారకమైన స్వానుగ్రహము నెల్లరకును లభ్యమొనర్చెను. ఆమెను మనము సదా స్మరించుచుందము గాక, ఆమె కృపః నవలంబింతము

గాక, ఆమె యిష్టమునకు పరతంత్రులమై యుందము గాక. ఏలన — దేవ్యపరాధక్షమాపణస్తోత్రములో శ్రీ శంకరభగవత్పాదులు — 'కుపుత్రో జాయేత క్వచి దపి కుమాతా న భవతి' 'అమ్మకు మేలు కోరని కుమారు డెక్కడనైన జన్మించిన జన్మింపవచ్చును గాని పుత్రునికి మేలుకూర్పని తల్లి లోకమున ఉండనే యుండ' దని వ్రాసిచ్చిరి కదా. తనకు తగిన బిడ్డల మనిపించుకొనుటకు వలసిన శక్తిని మనకు ఆమెయే ప్రసాదించును గాక. స్వానుష్ఠానములో ఆమె చూపిన సుగుణములలో నొక్కదానినైన నలవఱచుకొనుటకు మనల నామె సమర్థులనుగా చేయును గాక!

# లోకమాత శారదమ్మ నెఱపిన యాచార్యకము

శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులుగారు

పరిమళము, మకరందము అను వానిచే ఆకర్షింపబడి తేనెటీగలు కుసుమముల నెట్లు చేరునో ఉపదేశామృతమును గ్రోలుటకు శిష్యులుగూడ గురువులవద్ద కట్లే యేతెంతురు. ఇట్టివారు శిష్యులహృదయతాపము తీర్చుటకే సదా కృషి చేయుచుందురు. అంతేగాదు, వారి శరీరతాపము తీర్చుటకూడ తమపవిత్రధర్మముగా భావింతురు. కాని చాలమంది దీనికి వ్యతిరేకముగా వారి తాపములు తీర్చుటకుబదులు తమ తాపత్రయము తీర్చుకొనుటకే శిష్యులను పలుబాధలకు పాలుచేయుచుందురు; మొదటి వారిని బోధగురువులని, రెండవవారిని బాధ గురువులని పల్కుటలో దోషమేమి?

సర్వగ్రంథసారము దివ్యజ్ఞానస్వరూపము ధరించి సద్గురువు నాశ్రయించి యుండును. వారుగూడ మనవలెనే సంసారతాపత్రయముతో బాధపడుచున్నట్లు కనిపింతురు; కాని వారి అంతరంగమునమాత్రము అలౌకికశాంతి నాట్యము చేయుచుండును. మన లోకమాత జీవితమే యిందుకు మచ్చుతునక. ఒకవైపు బంధుజాలము — మఱొకవైపు శిష్యవర్గము - ఆమె నాశ్రయించెనుగదా! శరీరతాపము పోగొట్టుకొనుటకు బంధువులామెను జేర, అంతరంగతాపము బోగొట్టుకొని ఆత్మజ్ఞానము నందుటకై శిష్యులామె నాశ్రయించిరి. శిక్ష అనగా దండన, చదువుచెప్పుట అని రెండర్థములు. అవసరమైనచో దండన పొందియైనను మంచి చదువు నేర్చుకొనుటకే శిష్యుడు ప్రయత్నింపవలెను. శిక్షతోబాటు చక్కని శిక్షణ — జ్ఞానబోధచేయువాడే గురువు. అతనిచే శిక్షింపబడదగినవాడే శిష్యుడు. వైద్యుడిచ్చుమందు చేదుగనున్ననేగాని మనకు పట్టేదుకదా. అట్లే గురువు పరుషవాక్కులతో దండింపనిదే మన కాతనియెడ భయభక్తులెట్లు కలుగును?

దైవమానవ ప్రకృతులు నేనుముందు నేను ముందు అని పందెము వైచుకొని మనమాతలో ప్రవేశించెను. దైవప్రకృతితో శిష్యుల కామెయొకప్రక్క ఆత్మబోధ చేయుచు మానవ ప్రకృతితో మఱొకప్రక్క వారి శరీరములకు అవసరమయిన ఆహారాదులకై పాటుపడుచుండెడిది. మానవప్రకృతితో తన బంధువులకు సర్వ సేవలు చేయుచుగూడ దైవప్రకృతితో శిష్యుల

ఆత్మోన్నతికై అనితర కఠోరదీక్ష పూనెడిది. తమబిడ్డలకంటె నెక్కువగా శిష్యులను ప్రేమతో చూచుట గురువులవిధి యని ఈ ప్రకరణమున మనము గమనింతుము. శిక్షింపకయే మనతల్లి తన శిష్యులకు చక్కనిశిక్షణ ఇచ్చుట చిత్రాతి చిత్రము!

గురుశిష్యబంధము దివ్యము, అనగా అలౌకికము. గురువులు డబ్బుకు తమ్ము పీల్చి పిప్పి చేయు శరీరసంబంధులకంటె తమపై సదా భక్తిప్రపత్తులు కలిగియుండు శిష్యులను త్రికరణశుద్ధిగా ప్రేమించుట అత్యంత సహజము. గురువు పావనాత్ముడు, కామినీకాంచనముల కతీతుడు, బ్రహ్మవేత్తయునై యుండవలెను. అట్లే శిష్యుడుగూడ గురువునే సర్వస్వముగా భావించి గురుని శరీరపోషణభారము వహింపవలెను. పూర్వము కులగురువులు వచ్చి తఱచుగా జ్ఞానబోధ చేయుచుండుట, వారికి శక్తికొలది భోజనసామగ్రి పంపి శిష్యులు పూజించి సంభావనలిచ్చి గౌరవించుట జరుగుచుండెడిది. ఇప్పుడట్టి గురువులున్న గదా శిష్యులు పూజించుటకు; శిష్యులట్టివారున్నగదా గురువులు వారి వద్దకు వచ్చుట! తన గురువును కేవలము మానవునిగా తలంచువాడెన్ని జపతపములు చేసినను వ్యర్థమేగదా!

జ్ఞానోపదేశముచేయు గురువు గొప్ప బాధ్యతవహింపవలెను. గురువుశక్తి మంత్రరూపమున శిష్యునియందు ప్రవేశించును. దాని ద్వారానే శిష్యుని పాపములను గైకొని గురువు మిక్కుటమైన శరీరబాధ ననుభవించును. తన శిష్యుల పాపసమూహమే కంఠమున వ్రణమై బాధించెనని శ్రీ గురుదేవుడంతిమ సమయమున శిష్యులతో బల్కెనుగదా! కొందఱు శిష్యులు వారి పూర్వజన్మకర్మల ననుసరించి శీఘ్రముగా పాపనిర్ముక్తులై ఆత్మవికాసము పొందుదురు. తమ పూర్వజన్మ పాపము లడ్డుపడగా మఱికొంద రెంతకాలమునకైనను ఫలితము నొందలేరు. తాననుభవించిన తీవ్రశరీర బాధలు, వ్యాధులు, శిష్యులనుండి తాను గ్రహించిన పాపములకు ప్రతిఫలములేయని మాతృదేవిగూడ పల్కుచుండెడిది. పాపులగు జను లామె పాదములు తాకవచ్చినపు డవి చప్పున వెనుకకు బోయెడివి. ఒకవేళ అట్టివారు తాకిన ఆమెశరీరము మంటలెత్తెడిది.

1916 లో బేలూరు మఠమున ఆమె దుర్గాపూజ గావించినపుడు చాలమంది ఆమెపాదములను స్పృశించి నమస్కరించిరి. గంగాజలములో ఆమె తనపాదము లెన్నిసార్లు కడుగుకొన్నను ఆమెతాపము శాంతింపలేదు. దీనికి వ్యతిరేకముగ పుణ్యాత్ములామె పాదములు తాకినపుడు శరీరమున మంచి గంధము పూసికొనినంత హాయిగా నుండెడిది!

పరులకై బాధపడుట యామె తన ప్రత్యేక హక్కుగా భావించి గర్వపడుచుండెడిది. లోకాతీతము, లోకవ్యాప్తము అగు దివ్యమాతకుండదగు ప్రేమానురాగముచే, సర్వజనకారుణ్యముచే ఆమె తన్నర్థించినవారందఱికి వారి వారి మతానుసారము మంత్రము లుపదేశించెడిది. సద్గురువుచే ఉపదేశము పొందుటతోబాటు జపతపఆది సాధనలతో మాత్రమే శిష్యులకు చిత్తశాంతి లభించునని ఆమె పల్కుచుండెడిది.

భక్తుల కుపదేశించుటయేగాక వారికి భోజనాది సమస్త సదుపాయములు కల్పించుటలో లోకమాత వాత్సల్యము మఱింత ప్రస్ఫుటమగుచుండెడిది. ఆమె ప్రేమాదరములు చూచి శిష్యు లానందబాష్పములు రాల్చువారు. బాల్యమున తల్లిని పోగొట్టుకొన్నవారు, అసలు తల్లిప్రేమ చవిచూడనివారు, ఆమెను చూడగానే "ఆహా! ఈమెయే మాతల్లి, మమ్ము

గన్నతల్లి యీ '' అని బ్రహ్మానందమందువారు. కన్నతల్లి గూడ ఈమెవలె తమపై ప్రేమ చూపలేదని కృతజ్ఞత చూపిన శిష్యులుగూడ చాలమంది గలరు. "నావంటిపుత్రులు మీకెందఱో గలరు కాని మీవంటి తల్లి నాకు లే"దని యొక శిష్యు డామెతోనే పల్కెను.

శిష్యులకు, భక్తులకు ఆమె వండి వడ్డించి, వారలయెంగిలి ఆకులుగూడ ఎత్తివేయుచుండెడిది. ఇందులో జాతిమతభేదములుగూడ నామె చూడలేదు. అతిథులు రాగానే విసరి, ప్రక్షాళనకై పాదములపై నీరు పోయగా. కొంతమంది—సాక్షాత్తుగ త్రైలోక్య మాత లక్ష్మీదేవి యీ రూపమున నవతరించినదని నమ్మినవారు — అందుకు వ్యతిరేకించెడివారు. అపు డామె ప్రేమతో "మీకు నేనేమి చేసితిని-మీ అమ్మను కానా నేను! తనబిడ్డలకు సర్వవిధములుగా సేవచేయుట — తుదకు స్వయముగా వారి మలమూత్రములనుగూ నెత్తుట తల్లికి హక్కుగదా'' అని పల్కెడిది. అపుడపుడు తనయింటికి వచ్చినవారిబిడ్డల మలమూత్రములను ఎత్తి పాఱవేయుటలోగూడ నామె వెనుకాడెడిదికాదు.

టి త్రాగుట కలవడిన యేశిష్యునికొఱకో, వ్యాధిగ్రస్తుడైన యేభక్తునికొఱకో, ఆమె యింటింటికిదిరుగుట సాధారణదృశ్యము. చేతిలో కుఱుపులు లేచినయొక శిష్యునకామె స్వయముగా చాల దినములవఱకు అన్నము తినిపించెను. భోజనవేళవచ్చిన అతిథి నామె భుజింపనిదే పోనిచ్చెడిదికాదు. ఇతర సమయములందు వచ్చువారికి మిఠాయిలను, పండ్లను, పాలను ఒసగి వారి నానందసాగరమున ముంచి తేల్చెడిది. భక్తులు సమర్పించు వస్తువులను ఇసుమంతయు భుజింపక తన శిష్యులకై దాచియుంచుట ఆమె యలవాటు. సదా పరులకిచ్చుటయేగాని తాను మిగుల్చుకొనుట యెఱుగ దా తల్లి! ఆహా, ఎట్టి ధన్యాత్మురాలామె! అట్టిమాత జన్మించిన యీ భారత వసుంధరపై, రత్నగర్భపై జన్మించుటయేగాక ఆమెతో బా రెండు మూడు సంవత్సరము లీ పుడమితల్లిపై జీవించియుండి, యిప్పుడిట్టులామెచరిత్ర వ్రాయదగిన మహాభాగ్యమునకు నోచుకొన్న నేనుగూడ ధన్యుడనే సుమండీ! మఱి మీరుగూడ ఈమె పవిత్రచరిత్ర చదివినందున ఆమె సుగుణములలో నేకొన్నియైన అలవఱచుకొని ధన్యత గాంచుడు!

---

# శ్రీ ప్రేమానందస్వామిగారి మాతృభక్తి

శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

పరమహంస శ్రీరామకృష్ణుడు ప్రేమానందస్వామినిగూర్చి "బాబురామునియెముకలవఱకు పవిత్రత చొచ్చుకొనియున్నది'' అనెడివారు. యథార్థముగ ప్రేమానందస్వామి సర్వసద్గుణ సంపన్నుడు, నిరాడంబరజీవి, శాంతమూర్తి, మధురభాషి, ధ్యాననిష్ఠుడును. అందుచేతనే ప్రేమానందస్వామి స్పృశించిన ద్రవ్యముల శ్రీరామకృష్ణదేవులు అతిపవిత్రముగ పరిగణించెడివారు. శ్రీరామకృష్ణదేవుల నిర్యాణానంతరము, ప్రేమానందస్వామి శ్రీశ్రీ శారదా

దేవిని, శ్రీ వివేకానందస్వాముల నాశ్రయించి తన గురువర్యులు చూపిన ఆదర్శమును ముందు నిడుకొని తనజీవితమును గడప నారంభించెను.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము శ్రీ శారదాదేవియు కొంతకాలము కామార్పు కూరునందే నివసించెను. కాని మహాత్యాగు లగు శ్రీరామకృష్ణశిష్యబృందముయొక్కయు, పరమభక్తులయొక్కయు వాంఛను పూరించు టకుగాను మాతృదేవి కామార్పుకూరు వదలి కలకత్తాలో బాగ్బజారునందు నివసింపదొడం గెను. అదిమొదలు శ్రీరామకృష్ణసంఘజనని యగు శ్రీ శారదాదేవి కాజ్ఞానువర్తియై, ప్రేమానందస్వామి మెలంగెను. మాతృదేవి స్వామికి సాక్షాజ్జగజ్జనని. ఆమెపల్కులే ఆయ నకు శ్రీరామరక్ష.

బేలూరుమఠములో శ్రీ శ్రీ దుర్గాపూజా మహోత్సవసందర్భమున శ్రీ శారదాదేవి ఆహ్వానింపబడి వచ్చెడిది. ఒకసంవత్సరము దుర్గాపూజకుగాను మాతృదేవిని ఆహ్వానించు టకై శ్రీ ప్రేమానందస్వామి ఒకసన్న్యాసిని పంపెను. తల్లి అచ్చటికి వచ్చి ఒకవారము రోజులపాటు ఉండుటకు సమ్మతించెనని విని ప్రేమానందస్వామి ఎంతయు సుప్పొంగెను. బోధనపూజరోజు (షష్ఠిరోజు) మధ్యాహ్నము మాతృదేవి బేలూరుమఠమునకు వచ్చి చేర వలసియుండెను. కాని మధ్యాహ్నము దాటి పోయినది. సాయంకాలముకూడ గడచిపోవు చుండెను. ఇంకను మాతృదేవి రాక జాడ తెలియదాయెను. ప్రేమానందస్వామి కడు వ్యాకులచిత్తముతో మఠము ప్రవేశద్వారము నొద్దకు వచ్చెను. వాకిటికడ శుభచిహ్నములగు మంగళఘటములు, కదళీవృక్షములు ఇంకను స్థాపింపబడలేదు. ప్రేమానందస్వామి వెంటనే కడుత త్తరపాటుతో మంగళచిహ్నములగు ఘటములు, మున్నగునవి ఇంకను అమర్పలేదే అమ్మ ఏలాగు వచ్చును అని సక్రమముగ మంగళసూచకములగు తోరణాలంకారముల నెల్ల సత్వరము ముగింపజేసెను. అటు పూజా మండపమున సకాలముననే శ్రీ దుర్గాదేవి బోధనపూజ ప్రారంభమాయెను. సరిగా పూజ సమాప్తికాబోవు సమయమునకు శ్రీ శారదా దేవి గుఱ్ఱపుబండి మఠముముందు వచ్చి నిల్చెను, వెంటనే బాబురాంమహారాజు భక్త సన్న్యాసులతోడ ఎదురేగి, బండికికట్టిన గుఱ్ఱమును వదలి, స్వయముగ పూజామండపము వఱకు బండిని లాగుకొనివచ్చిరి. శ్రీగోలాప్‌మా మాతృదేవిచేయి పట్టుకొని మెల్లగ బండినుండి దింపెను. బండిదిగుచు శ్రీ శారదాదేవి మఠము నాల్గువైపుల పరిశీలించి చూచి "పూజ కేర్పాట్లు అన్నియు చక్కగ అమర్పబడి యున్నవి. శ్రీ దుర్గాదేవివలె అలంకరించుకొని మనము వచ్చినాము" అని పల్కెను. ఆనంద మయియగు మాతృదేవి ఆయాగమనముచే మఠము ఆనందమున పొంగిపొరలెను. ఇక శ్రీ బాబురాంమహారాజుగారి విషయము చెప్ప నక్కఱలేదు. అందఱును వచ్చి శ్రీ మాతృ దేవికి ప్రణమిల్లిరి. తల్లియు ఎల్లరను ఆశీర్వ దింపసాగెను. అటు శ్రీ శ్రీ దుర్గాదేవిపూజ యథావిధిగ కడువైభవముగ జరుగుచుండెను. దుర్గాష్టమినాడు 300 మందికన్న ఎక్కువ భక్తులు శ్రీ శ్రీ దుర్గాదేవిచరణకమలములకడ పుష్పాంజలి సమర్పించి, శ్రీ శారదాదేవికడకు వచ్చి ఆశీస్సుల నందిరి. ఆదినము శ్రీ శారదా దేవి కొందఱు భక్తులకు మంత్రోపదేశము కావించిరి. ఆనాటిరాత్రి సుప్రసిద్ధనాటకరచ యితయగు శ్రీ గిరీశచంద్రఘోషుచే రచింప బడిన "జనా" అను నాటకమును ప్రదర్శించిరి. అటుపై సంధిపూజ ఏర్పాట్లు (అష్టమితిథి దాటి

నవమివచ్చు సంధిసమయమున విశేషపూజా హోమములు జరుగును) కావింపబడుచుండెను. శ్రీ శారదాదేవి స్వయముగ పూజామండపమున ఒకవైపు వచ్చి కూర్చుండి జపము చేయుచు ధ్యానమగ్నురాలాయెను శ్రీ దుర్గాదేవి ప్రతిమకు మఱొకవైపు కాషాయాంబరధారులగు సన్న్యాసులును, శుభ్రవస్త్రధారులగు బ్రహ్మచారులు కూర్చుండి ధ్యానించుచుండిరి. ఆహా! అపూర్వమగు దేవదుర్లభంబగు ఆదృశ్యమును కన్నులపండువుగ చూచినవారే ధన్యులు కదా! సంధిపూజ ముగియుట తోడనే భక్తులు సన్న్యాసులతోపాటు శ్రీ శారదాదేవి, శ్రీ శ్రీ దుర్గాదేవి పాదములకడ పుష్పాంజలి సమర్పించెను. అటుపై భక్తులెల్లరు ఒక్కపెట్టున "జయ జయ" ధ్వని కావించిరి. ఆధ్వని భాగీరథీతీరమున ప్రతిధ్వనించెను. మాతృదేవి తనవిడిదికి వెళ్లిపోయెను. అటుపై శ్రీ శారదానందస్వామి ఒక బ్రహ్మచారిని పిలిచి "ఈ బంగారుమూక అమ్మకు సమర్పించి ప్రణమిల్లి రమ్ము" అనెను. బ్రహ్మచారి "అమ్మ" అనగా శ్రీ శ్రీ దుర్గాదేవికే మూకసమర్పించి ప్రణమిల్లి రమ్మనిరనిభావించెను. కాని ఎందులకో మనస్సులో సందేహముతో మరల వచ్చి శ్రీ శారదానందస్వాములవారికి తన సందేహము తెల్పెను. వెంటనే నవ్వి శ్రీ శారదానందస్వామి ఇట్లనిరి—"అదుగో, ఆ తోటలో అమ్మ ఉన్నది. ఆమెకు ఈ నాణెము సమర్పించి ప్రణమిల్లి రమ్ము. ఇచ్చట మండపమున జరిగినది ఆమెపూజయే సుమా." అంత ద్రష్టిపరాయణులును శుద్ధసత్త్వగుణప్రధానులు నగు శ్రీ శారదానందాదిమహానుభావులు శ్రీ శారదాదేవి యథార్థతత్త్వమును తెలిసికొకల్గిరి.

విజయదశమినాడు యథావిధి పూజానంతరము శ్రీ శ్రీ దుర్గాప్రతిమను పవిత్రగంగానదిలో నోలలాడించిరి. ఆ యోలలాడించిన చోటునుండి పూజచేసిన కలశములో నీరునింపి తెచ్చి వేదమంత్రముల చదువుచు ప్రోక్షింతురు. దీనినే శాంతిజల మందురు. భక్తులతోపాటు శ్రీ శారదాదేవియు శాంతిజలము ప్రోక్షించుకొనెను.

శ్రీ మాతృదేవి వచ్చి పూజసమాప్తి అగువఱకు మఠములోనే యుండి తనమనోవాంఛను తీర్చినందులకుగాను ప్రేమానందస్వామి తన అంతరంగమునుండి పొంగి పొరలి వచ్చుచున్న ఆనందమును ఆపుకొనలేక పాటపాడుచు నాట్యము చేయ నారంభించెను.

పాట : మా జార్ ఆనన్దమయీ
శేకీ నిరానన్దే థాకే
తార్ ఇహకాలే పరకాలే
మా తారే ఆనన్దే రాఖె.

[ఆనందమయి ఎవరి తల్లియో అతడు నిరానందములో నుండునా, వాని ఇహకాలమందును, పరకాలమందును వానిని అమ్మ ఆనందములోనే యుంచును!]

సరళ ప్రేమానందస్వామిగారి సహజమగు ఆనందమును చూచి భక్తుల హృదయములు కూడ ఆనందమున నిండినవి.

శ్రీ ప్రేమానందస్వామిగారి మఱొకగొప్ప గుణమేమన వారు మాతృదేవి ఆజ్ఞకు భిన్నముగ ఏపనినైనను చేయబూనరు. మాతృదేవి ఆదేశించినచో అది ఎట్టిపని ఐననుసరే వెంటనే ప్రాణముల నిచ్చి ఐనను చేయవలసినదే. ఇదియే వారిజీవితమహావ్రతము.

ఒకనాటి ఘటన :- శ్రీ శారదాదేవి కలకత్తాలో ఉద్బోధన కార్యాలయభవనమున

నుండెను. ప్రేమానందస్వామి బేలూరుమఠములో చాలదూరములో నున్న "మాలదాహ" అను ఊరునుండి ఒకభక్తుడు తన గ్రామములో ప్రతిసంవత్సరము యథావిధి జరుపబడు శ్రీరామకృష్ణుని ఉత్సవమునకుగాను శ్రీ ప్రేమానందస్వామిని తనతోడ తీసికొనిపోవు సంకల్పముతో బేలూరుమఠమునకు వచ్చెను. అప్పుడు ప్రేమానందస్వామి ఆరోగ్యము అంతగ సరిగా లేకుండెను. కాని భక్తునికోర్కె చాల తీవ్రముగ నుండెను. భక్తుడు అతిదీనముగ ప్రార్థింప దొడంగెను. గత్యంతరము లేక భక్తునికోర్కెను మన్నించి వానితో పోవుటకు స్వామి సమ్మతించెను. కాని ప్రయాణమునకు ముందు శ్రీ మాతృదేవి అనుమతి, ఆశీస్సుల గైకొను నుద్దేశ్యముతో, ఆ భక్తుని వెంటనిడుకొనిఆమెయొద్దకు వెళ్లెను. మాతృదేవిని సమీపించి ప్రణమిల్లి సవిస్తరముగ అంతయువిన్నవించుకొనెను. మాతృదేవియు సావధానముగ అంతయు విని "నీ ఆరోగ్యము సరిగా లేదు, ఉత్సవసందర్భమున భోజనముకూడ (స్నానపానాదులు) సక్రమముగ జరుగవు, దారికూడ చాలకష్టమైనది. ఈ యెండలలో అంతదూరము పోకున్ననే బాగుండును" అనిరి. వెంటనే ప్రేమానందస్వామి మాతృదేవిఆజ్ఞను శిరసావహించి తన ప్రయాణమును ఆపివేసికొనెను. ఈ విషయము ఆ భక్తుడు తెలిసికొని కడు దుఃఖముతో మాతృదేవి కడకు వెళ్ళి, కన్నీళ్లు విడుచుచు "ప్రేమానందస్వామికి ఎట్టి ఇబ్బంది కాని, కష్టముకాని కలుగకుండ చూచుకొను బాధ్యత తన" దని విన్నవించుకొనెను. భక్తుని మొర నాలకించి, కరుణారూపిణియగు శారదాదేవి బాబురాంమహారాజును పిలిపించి "ఈ భక్తుడు ఇంతగ బ్రతిమాలుకొనుచున్నాడు. నీవు పోయెదవా ఏమి?" వెంటనే బాబురాంమహారాజ్ (ప్రేమానందస్వామి) "అమ్మా, నాకేమియు తెలియదు. మీరు ఆనతిచ్చునట్లుగనే చేసెదను." మాతృదేవి వెంటనే "పోయి రమ్ము, కాని ఎక్కువరోజు లుండకు" అనెను. ప్రేమానందస్వామి ఏమియు మాఱుపలుకక "చిత్తము" అని వెంటనే ఆ భక్తునివెంట వానియూరికి పయనించెను. ప్రేమానందస్వామి జీవితములో ఇలాటి ఘటనలు లెక్కకు మిక్కుటముగ కానవచ్చును. మాతృదేవిపై వారికి గల సంపూర్ణనిర్భరత సాటిలేనిది.

బాబురాంమహారాజు భక్తులతోడ మాతృదేవినిగూర్చి ఈవిధముగ చెప్పెడివారు —— "దినాలు గడచుకొలది (శ్రీ)మాతృదేవియొక్క దైవీశక్తిని చూచి అబ్బురపడుచున్నాను. (శ్రీ)రామకృష్ణుని చూచితిని కదా - ఆయన తన ఆధ్యాత్మికభావముల లోన ఇముడ్చుకొన ప్రయత్నించియు, విఫలుడయ్యెడివాడు - కాని (శ్రీ) మాతృదేవియో - సతతము భావావస్థయం దుండియు, బైటికి తెలియనిచ్చుటలేదు. ఈమెది శ్రీరామకృష్ణునికన్న గొప్పఆధారము అందుచే తనశక్తిని అవలీలగ లోన ఇముడ్చుకొ గల్గుచున్నది. లోకకల్యాణార్థము మానవశరీరమును ధరించివచ్చినట్టి ఆద్యశక్తి,జగదంబ, శ్రీ శారదాదేవి, అతిసామాన్యురాలగు పల్లెపడుచువలె మెలగుచున్నది.

మఱొకమాఱు ఒకభక్తునితో ప్రేమానందస్వామి ఈలాగు అనిరి "రాజరాజేశ్వరి, స్వేచ్ఛగ దరిద్రబ్రాహ్మణివేషము ధరించి, ఇల్లు చిమ్ముట, గుడ్డలు ఉతుకుట, బియ్యము దంచుట, అంట్లుతోముట, కడకు భక్తులఎంగిళ్లు ఎత్తుటకూడ చేయుచున్నది. ఇదంతయు గృహస్థులకు గార్హస్థ్యధర్మము నుపదేశించుటకే." ... "అమ్మను ఎవరు తెలిసికొనగలరు? లేక

మాత్రము ఐశ్వర్యము కానరాదు. శ్రీరామకృష్ణుని విద్యైశ్వర్యము ఎల్లరకు బోధపడెడిది. కాని ఈమె అంతయు లోన ఇముడ్చుకొన్నది. ఇదేమివింత ? మహాశక్తియా! శ్రీరామకృష్ణుడు ఏరి కోరి ఎన్నివిధములనో పరీక్షించి శిష్యుల చేసికొనెడివారు – అమ్మయో – ఎవ్వరును స్వీకరింపజాలని మహావిషమును అవలీలగ జీర్ణించుకొనుచున్నది – పాపి, తాపి, మూర్ఖ–పండిత, స్త్రీ–పురుష విచక్షణ లేక ఎల్లరను కన్నతల్లిగ సంరక్షించుచున్నది. ఆశ్రయించిన వారల పాపకర్మములనెల్ల స్వీకరించి వారలకు అభయదానమొసగుచున్నది – యాచించిన వారలకెల్ల మంత్రోపదేశము చేసి, వారికి మాఱుగ తానే స్వయముగ రాత్రులందు విశ్రమింపక జపముచేయుచున్నది.”

శ్రీ ప్రేమానందస్వామిపై మాతృదేవికి అనురూపమగు వాత్సల్యముండెను. స్వామి నిర్యాణ వార్త విని ఆమె కడు విలపించుచు ఇట్లనెను : “బాబురాం నా ప్రాణముతో సమానము. ఆహా! బేలూరులో గంగాతీరమున వెలుగుగ ఉండినాడు.” మఠములో, భక్తి, ముక్తి, యుక్తి అంతయు నా బాబురాం “ఓ ప్రభూ! నా బాబురాంను తీసికొనిపోతివా” అని విలపించెను.

ఆశ్చర్యమగు మాతృభక్తి, ఆశ్చర్యమగు సంతానవాత్సల్యము!!

# శివానంద లేఖావళి

## 71

మఠము,
బేలూరుపోస్టు. హౌరా, బెంగాలు,
9 అక్టోబరు 1916.

ప్రియహరిమహరాజ్,

నేను బాబురాము మహారాజు మఠముననున్న ఇతరులందఱు సమర్పించు విజయ ప్రణామాలింగనాదులను స్వీకరింపుము. ఇక్కడి పూజా వివరములన్నియు బాబురాము మహారాజు వ్రాసిన జాబువలన నీకు తెలిసియుండును. మఠములో విగ్రహమును ప్రతిష్ఠించి మహామాయను పూజించుట యనునది ఇంతకుముందు రెండు పర్యాయములు జరిగియున్నను నేనెప్పుడును చూచియుండలేదు. పైగా ఈసారి మాతృశ్రీ అక్కడికి విచ్చేసియున్నందున పూజ లోకజనని ప్రత్యక్షసన్నిధానమున జరుగుచున్నట్లనిపించినది. భావించుకోవలసిన ఆవశ్యకత లేకుండినది. విగ్రహము అత్యంతసుందరముగను ఆకర్షకముగను నుండినది. ముఖ్య పూజారియు పరిచారకుడును ఇద్దఱును బ్రహ్మచారులు. ఆ యువ పరిచారకుడు పట్టపరీక్షయందు నెగ్గియున్నవాడు, చక్కని శాస్త్రగ్రంథపాండిత్యము కలవాడు, ఇంతకు పూర్వము ఏదో ప్రభుత్వము వారి ఆంగ్లోన్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయుగ నుండినవాడతడు. ఇప్పుడు అతడు మాతృశ్రీయొద్ద తత్త్వోపదేశముపొంది ఐహికములనెల్ల విసర్జించి మఠమున వసించుచున్నాడు. ముఖ్యపూజను నెరపినవాడు, ఈపూజను తన ఇంటియొద్ద కొన్ని పర్యాయములు చేసినవాడే కావున పెక్కు విషయములతనికి తెలిసియుండినవి, పూజాకలాపమును చాల చక్కగ నిర్వహించినాడు. కష్టవాంద్రందఱును అతిమానుష శ్రద్ధతో పాటుపడుదురు. వారి పరిశ్రమమూలముననే పూజ అంత వైభవముతో నెఱవేఱినది. ఆమూడు దినములును ఎడతెంపులేని వానయు తుపానును కలిగియున్నను లోకజనని

పరమానుగ్రహముచే కార్యక్రమములో ఏ యంశమునకును ఎట్టి యాటంకములును కలుగ లేదు. భక్తులు ప్రసాదము నారగించుటకు కూర్చున్నప్పుడు వాన కొంతసేపు ఆగియుండెడిది. అందు కందఱును అద్భుతావిష్టులగు చుండిరి. అనంతరకాలమున యోగిన్మా మాకు తెలిపినది: భక్తులు ప్రసాద మారగించుటకు కూర్చున్నప్పుడెల్ల వర్షము పడనున్న సూచనలను గుర్తించి, మాతృశ్రీ తత్క్షణమే దుర్గా మాతృనామముల కీర్తించుచు ఈలాగనెనట. 'ఔను. వానలో ఇంతమంది ప్రజలు ఎట్లు కూర్చుందురు? ఎట్లు భుజింతురు? వాననీటి వెల్లువలో విస్తళ్ళును పదార్థములును కొట్టుకొని పోవునే, ఓ జననీ, మమ్ము కాపాడుము.'' లోకజనని వాస్తవముగ మమ్ము కాపాడినది. మూడు దినములును ఆలాగే జరిగినది. మూడు దినములును రెండు పూటలును ప్రసాదమారగించిన భక్తుల మొత్తము సంఖ్య సుమారు నాల్గువేలు.

విజయదశమినాడు మాతృశ్రీయు ఆమె యింటి మహిళలునువచ్చి వరణాది క్రియాకలాపమును నిర్వర్తించిరి. పిమ్మట కాళ్ళువాండ్రే ఆ విగ్రహమును ఒక్కటిగ కట్టబడిన రెండు పడవలపైనుంచి ఉత్తరమున 'దా' గుడి వఱకు కొనిపోయి దక్షిణమున లాలాబాబుగారి తటాకమునొద్దకు తెచ్చి, మరఘట్టమున నీటిలో కలిపిరి.

నీవు బాబురాము మహారాజుకు వ్రాసిన జాబును నేడు చదివితిని. అక్కడిపూజ మున్నగు సంగతులన్నియు తెలిసినవి.

డిమెల్లోనుగూర్చిన వివరములన్నియు నాకు భూషణుని జాబువలన తెలియనైనవి. సమస్తమును ఈశ్వరసంకల్పాధీనమనుట నిజము. భగవంతుడతని ననుగ్రహించునుగాక. అదొక్కటే మనప్రార్థనయంతయు. 'క'—జబ్బు నయమై మరలి వచ్చెననియు రాముడును కానాయియు క్షేమముగ నున్నారనియు విని సంతోషించితిని. నా యాశీస్సులను ప్రేమను వారికిని మోహన్ లాలు, గోవిందలాలు, గంగీ, లాచ్చీరాము, గోపాలు అనువారికిని అందజేయుము.

ఇప్పటినుండి అల్మోడా వాతావరణము చాల హాయిగనుండును. ఈశ్వర సంకల్పానుసారము నీయారోగ్యమును మెఱుగుగా నుండును. నాహృదయపూర్వకప్రేమ నమస్కారాదులను నీకు మరల నర్పించుచున్నాను. అన్నిసంగతులను గూర్చి వ్రాయుము.

సేవకుడు,
శివానందుడు,

---

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమఠ ధర్మవైద్యశాల, మదరాసు - 4.

## నలభైమూడో వార్షిక నివేదిక 1969-70

మహాజనులకు ఈ నివేదికను సంతోషముతో సమర్పిస్తున్నాం.

### ఉపోద్ఘాతం

దేశీయ సాంఘిక మతకల్లోలములచే విదీర్ణమై ఉండిన నవ్యభారతదేశానికి శ్రీ వివేకానంద స్వామి ప్రగతిశీలమైన క్రొత్తసందేశాన్ని అందజేశారు. "త్యాగమున్ను సేవయు ఈ రెండే భారతదేశీయలక్ష్యాలు. ఆ మార్గాలలో దేశమును పెంపొందించండి. తక్కినదంతా తనంతట చక్కపడుతుంది'' అని ఘోషించా

డాయన. భారతదేశానికే గాక ప్రపంచమంతటికీ కూడ క్షేమంకరలక్ష్యాలు ఇవే అని స్వామీజీ దృఢంగా నమ్మారు. ఈ ఉదాత్త లక్ష్యాలకు ఒకరూపేర్పఱచడానికే సర్వమత సామరస్యప్రవక్తయైన శ్రీరామకృష్ణుని భవ్య నామాంకితంగా ఉద్యమాన్ని ఆయన ప్రారంభించాడు. తత్ఫలితమే విద్యా-ప్రజాసేవా-పారమార్థికసందేశప్రచారములకు విశ్వవిఖ్యాతములైన రామకృష్ణమఠము సేవాసంఘము (మిషను) అవతరించడం. రామకృష్ణమిషను పునాదులు ఆధ్యాత్మికపరతలో నెలకొని ఉన్నప్పటికి దాని కార్యరంగం కేవలం మతపరిమితం కాదు. వారి సేవాప్రణాళికకు మూలం కేవలం కనికరము ఉపకారపరాయణత కాదు. "జీవుడు దేవుడే. ఆయనకు కనికరం చూపగలవాడెవడు? మానవునిపట్ల చూపవలసినది కనికరం కాదు. మానవుని మాధవునిగాభావించి ఆరాధించాలి" అనుట శ్రీరామకృష్ణు నుపదేశం. కాబట్టి జాతిమతవర్ణవిభేదాలు పాటించక సకలమానవులును భగవంతుని ప్రతిరూపములనెడి భావం రామకృష్ణమఠమిషనుల కార్యక్రమాలలో పిక్కటిల్లుతుంటుంది. ఈ భావం మానవుని అహంకారానికి విఱుగుడు. ఈ భావంకల మానవుడు తనఅధికారాన్ని దుర్వినియోగం చేయడు. చెడిపోడు. ఈ లక్ష్యాలను సాధించేందుకే రామకృష్ణమఠమిషనుల వివిధకేంద్రాలూ పాటుపడుతున్నాయి. భారతదేశంలోనేమి విదేశాలలోనేమి ఆశ్రమాలు, మఠాలు, ఆసుపత్రులు, ఔషధవినిమయకేంద్రాలు, స్కూళ్లు, కాలేజీలు, గ్రంథాలయాలు, పత్రికాపఠనాలయాలు మున్నగు రూపాలలో 114 కేంద్రాలును, 21 ఉపకేంద్రాలును ఉన్నాయి, ప్రజల ఐహికాముష్మికోన్నతికి పాటుపడుతున్నాయి. 1967-68 సంవత్సరంలో మఠమిషనులు తమ 10 ఆసుపత్రులద్వారాను 66 ఔషధవినిమయ కేంద్రాలద్వారాను 30,60,898 రోగులకు చికిత్స చేశాయి. తమ విద్యాసంస్థలద్వారా 49,486 బాలురకును 19,486 బాలికలకును విద్యగఱపింది. ఆధ్యాత్మిక-సాంస్కృతిక కార్యక్రమాలు గ్రామోద్ధరణం అనావృష్టిచేత వఱదలచేత వివిధరాష్ట్రాల్లో నష్టపడ్డ ప్రజలకు కష్టనివారణకార్యక్రమాలు—ఇవి నిర్వహింపబడ్డాయి.

## ప్రారంభాభివృద్ధులు

దక్షిణభారతదేశమునకంతటికిని మదరాసు రామకృష్ణమఠం ముఖ్యకేంద్రం. 1897 లో పాశ్చాత్యదేశాలనుండి మరలివచ్చిన శ్రీవివేకానందస్వామి సంకల్పించిన ఈ మఠం మొదట సముద్రతీరంలో వివేకానందభవనంలో ఉండినది. ఈ మఠాన్ని స్థాపించినవారు శ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యులలో అన్యతములైన రామకృష్ణానందస్వామి. కొన్నాళ్ళకు మఠం మైలాపూరులో శ్రీకపాలీశ్వరగుడిసమీపానికి మార్చబడింది. వివిధకార్యక్రమాలమధ్య మఠం ఒక ధర్మవైద్యశాలనుకూడ ప్రారంభించింది. ప్రాంతీయప్రజలలో దిక్కులేనివారి పేదవారి సేవకై ఈ వైద్యశాల నలభైయైదుసంవత్సరాల కృతం 1925 లో ప్రారంభింపబడింది. సర్కారుఉద్యోగమునుండి విరామమొందియుండిన రావుసాహేబు డాక్టరు బి. రాఘవేంద్రరావుగారు తన సొంతఖర్చుతో ఈ వైద్యసేవను ప్రారంభించారు. కీర్తిశేషులు డాక్టర్ ఎస్. జి. కత్రే, కీర్తిశేషులు డాక్టర్ ఎస్. కృష్ణమూర్తిఅయ్యరు కీ. శే. డాక్టర్ బి. శేషగిరిరావుగారు, కీ. శే. కాప్టన్ ఎన్. శేషాద్రినాథనుగారు మున్నగువారి సభక్తికమహోదారసేవలతోను మఠసన్న్యాసుల సహకారంతోను ఈ వైద్యశాల మద్రాసునగరంలో

అత్యంత ప్రాముఖ్యం గడించింది. మొదటిసంవత్సరం ఈ వైద్యశాలలో చికిత్సచేయించుకొన్న రోగులసంఖ్య 970. 1969-70 సంవత్సరంలో వైద్యం చేయించుకొన్నవారి సంఖ్య 1,60,921. ఈ వైద్యశాల పొందిన అభివృద్ధిని నిర్వహిస్తున్న సేవను ఈ సంఖ్యలే నిరూపిస్తాయి.

1969-70 సంవత్సరంలో ఆలోపాతిక్ హోమియోపాతిక్ శాఖలలో ఈ వైద్యశాలలో చికిత్స పొందిన రోగుల సంఖ్య 1,60,921. ఈ సంవత్సరం ఆదాయం మొత్తం రూ. 52,111-51, వ్యయం రూ. 58,067-58 లు. కాబట్టి వచ్చుబడికంటెఖర్చు 5,956-07 లు ఎక్కువగా ఉంది. ఈ ప్రజాసేవను మేము సాగిస్తుండగలందులకు విరాళా లిచ్చి తోడ్పడవలసిందని ప్రభుత్వంవారిని ఉదారమహాజనులను ప్రార్థిస్తున్నాం.

న్యూఢిల్లీ సెంట్రలు రెవెన్యూబోర్డువారు ఈ ధర్మవైద్యశాలకు అర్పింపబడే విరాళాలకు వరుమానపుపన్నును దయచేసి తొలగించారు. (చూ. ఇండియన్ ఇన్కంటాక్సు ఆక్టు 1961 సెక్షను 80G ఆర్డరు నెంబరు RC/2467R/HOW/A తేదీ 21-1-1970-కల్కత్తా).

## నేత్రశాఖ

ఇది 1957 సంవత్సరం జనవరి మొదటి తేది ప్రారంభింపబడింది. డబ్బిచ్చి వైద్యం చేయించుకోలేని పేదలకు ఈ శాఖ వరప్రసాదంగా పనివడుతోంది. ఈ సంవత్సరం నేత్రవైద్యం చేయించుకున్నవారిలో క్రొత్తవారు 4,908, ప్రాతవారు 11,912. మొత్తం 16,820. వక్రీకరణ ప్రక్రియ (Refractions) చేయవలసివచ్చిన సందర్భాలు 500.

## శ్రోత్రఘ్రాణకంఠశాఖ

ఈ శాఖలో ఆధునిక పరికరాలన్నీ అమర్పబడివున్నాయి. ఈ శాఖలో వైద్యం చేయించుకొన్న వారిలో క్రొత్తవారు 4,943, ప్రాతవారు 5,181. మొత్తం 10,124.

## ఎక్స్రే శాఖ

ఈ శాఖను 1957 సంవత్సరం ఆగస్టునెలలో మద్రాసు ముఖ్యమంత్రిగారు ఆవిష్కరించారు. ఈ శాఖ ఎంతో ఉపయోగకరంగా ఉంటున్నది. ఈ సంవత్సరం ఎక్స్రేఫోటోలు తీయించుకొన్న రోగుల సంఖ్య మొత్తం 690.

## దంతవైద్యశాఖ

ఈ శాఖకున్నూ రోగులు అధికసంఖ్యలోనే వస్తున్నారు. ఈ సంవత్సరం దంతము లూడదీయించుకున్నవారి సంఖ్య 832. దంతపటుత్వానికై చికిత్స పొందినవారు 2,166. దంతాలలో చీము నెత్తురుకాఱు రోగమునకు చికిత్సపొందినవారు 498. మొత్తం 3,496.

## శిశుశాఖ

మాతృశ్రీ శతతమ జయంతి సందర్భంలో ప్రారంభింపబడ్డ ముఖ్యశాఖ ఇది. శిశువైద్య నిష్ణాతమైన డాక్టర్ ఎం. బి. ప్రభుగారు ప్రతి బుధవారం వచ్చి శిశురోగాలకు చికిత్స చేస్తుంటారు.

## పరిశోధనాలయం

ఇది 1953 లో ప్రారంభమై ఇప్పటి కెంతో ప్రాముఖ్యం గడించింది. ఈసంవత్సరం దాదాపు 576 దినుసులు ఇక్కడ పరిశోధింపబడ్డాయి.

## వైద్యులు

మా ధర్మవైద్యశాలకు ప్రభుత్వంవారు ప్రజలు ఇచ్చే విరాళాలే కాక నిష్ణాతులును ఉదారహృదయులునై ఉచితవైద్యసేవ చేసే వైద్యశేఖరుల జట్టు ముఖ్యాధారం. 1969-70 సంవత్సరంలో వైద్యసాహాయ్యం చేసిన ఈ క్రిందివైద్యులకు మా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనములను ఇందు మూలంగా నివేదించుకుంటున్నాము.

డాక్టర్ వి. ఎస్. రాఘవాచారి, M.B., B.S., D.L.O. (శ్రోత్రఘ్రాణకంఠవైద్యనిష్ణాత)
డాక్టర్ ఎం. బి. ప్రభు, M.D. (శిశువైద్యనిష్ణాత)
డాక్టర్ ఎస్. జి. ఎ. రాజు, M.B., B.S., L.T.M.
డాక్టర్ ఎన్. ఎస్. నరసింహ అయ్యర్, F.R.C.S.
డాక్టర్ ఆర్. కె. తిరుపాద, M.B., B.S.
డాక్టర్ సి. ఆర్. విఠల్‌రావు, M.B., B.S.
డాక్టర్ శ్రీమతి శాంభవీకృష్ణమూర్తి, M.B., B.S.
డాక్టర్ కె. జి. కృష్ణస్వామి, M.S.
డాక్టర్ పద్మనాభన్, L.D.S. (దంతవైద్యులు)
డాక్టర్ సి. ఇ. రామరావు, M.B., D.O., M.S. (నేత్రవైద్యుడు)
డాక్టర్ ఎన్. సుందరేశన్, L.M.P., L.O. (నేత్రవైద్యుడు)
డాక్టర్ బైల్ వెంకటేశ, B.Sc., M.B., M.S., D.L.O. (శ్రోత్రఘ్రాణకంఠవైద్యుడు)
డాక్టర్ పి. శేషగిరిరావు, B.H.M.S. (హోమియో)

## ఇతరోద్యోగులు

మతసన్న్యాసులలో ఒకరు ఈవైద్యశాల కార్యకలాపాలనిర్వహణం విచారించుకుంటారు. శ్రద్ధాళువులున్ను శ్రమసహులును అగు ఉద్యోగులు కంపౌండరులుగా కట్లుకట్టువారుగా ఎక్స్‌రే పరిశోధనాలయ సహాయులుగా ఇతరులుగా ఆసన్న్యాసికి తోడ్పడతారు. ఇందఱికిన్ని మా కృతజ్ఞతాభివందనములను తెలుపుకుంటున్నాము.

మాధర్మవైద్యశాల ఆయవ్యయపట్టికలను ఉచితంగా సరిచూచిన ఆడిటరులు ఆర్. జానకీరామన్ కంపెనీవారికిని ఎక్స్‌రేఫోటోలను చూచి ఉచితంగా నిర్ణయములు తెలుపుతుండిన మేజర్ ఎ. కృష్ణన్ M.B., B.S., గారికిని, పేదలకు ఉచితంగా ఇమ్మని 576 సీసాల వాటర్‌బరీకాంపౌండు విరాళంగా ఇచ్చిన వార్నరు హిందూస్థాన్ కంపెనీవారికిన్ని మాకృతజ్ఞతను తెలుపుకుంటున్నాము. మిత్రులకు సహాయులకు సానుభూతిపరులకు అందఱికి కృతజ్ఞులము.

## విన్నపము

వెలలు పెచ్చుపెరిగిపోయిన ఈకాలంలో ఈధర్మవైద్యసేవను మేము కొనసాగింప గలిగి ఉండగలందులకు చాలినంతగ తోడ్పడవలసిందని సహకరించ వలసిందని ఉదారమహాజనులను ప్రార్థిస్తున్నాము. మిత్రుల పేర్లనో బంధువులపేర్లనో శాశ్వతము చేసుకొనగోరిన మహాజనులు వారిపేరట ధర్మవైద్యశాలకు విరాళ మూలధనం ఏర్పఱచవచ్చు. అట్టివారిపేర్లను శిలాలిఖితం చేసి భిత్తికలలో అమరుస్తాము. రోగబాధితులగు సోదరమానవులకై మేము చేస్తున్న ఈవిన్నపమును ఉదారమహాజనులు సఫలం చేస్తారని మా నమ్మకం. విరాళం మొత్తం ఎంతకొంచెమైనా కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

## అనుబంధం

వైద్యం చేయించుకున్న రోగులు (1-4-69 నుండి 31-3-1970 వఱకు) అలోపతిక్కు :-

| | |
|---|---|
| ప్రాతవారు | 91,690 |
| క్రొత్తవారు | 68,873 |
| మొత్తం | 1,60,563 |

హోమియో పతిక్కు :-

| | |
|---|---|
| ప్రాతవారు | 283 |
| క్రొత్తవారు | 75 |
| మొత్తం | 358 |

| | |
|---|---|
| ఇంజక్షన్లు | 20,656 |
| పరిశోధించిన దినుసులు | 576 |
| శస్త్రచికిత్స పొందినవారు | 1,077 |
| కట్లు కట్టించుకున్నవారు | 24 25 |

జమ బట్వాడాలు

| | |
|---|---|
| సమష్టి భరణం | రూ 59,067.58 |
| స్టేట్ సోషల్ వెల్ఫేరుబోర్డువారి విరాళం | రూ 9,263.17 |
| ఎక్స్రే లెక్క | రూ 14,108.65 |
| బాడుగల తాలూకు | రూ 37,740.34 |
| శాశ్వతవిరాళనిధి లెక్క | రూ 52,452.23 |

కైలాసానందస్వామి
మఠాధ్యక్షులు.

# గ్రంథ పరిచయం

**శ్రీ గాంధిమాహాత్మ్యము-తృతీయ సప్తకము**

రచయితయు ప్రాప్తిస్థానమును:అష్టావధాని విద్వాన్ అంబటి సుబ్బరాయగుప్త ఎమ్ ఏ., బి. ఓ. ఎల్., బి. ఇడి., 12-K. పచ్చేప్పారోడ్డు, మద్రాసు-11. రాయలుసైజు పుటలు 283, వెల సాదాప్రతి రూ.10-00, మేలుప్రతి రూ. 12-00.

ఈసంపుటముమాత్రమే సమీక్షకు పంపబడింది. దీనిని తృతీయసప్తకం అని పేర్కొనడంచేత ఏడుస్కంధాలున్న ఈసంపుటం మూడోది అని తెలుస్తోంది. 1938 వ సంవత్సరం డిసెంబరునుండి 1948 వ సంవత్సరం జనవరి 30 వ తేదీవఱకు గాంధీజీ జీవితచరిత్రం ఇందు పొందుపఱుపబడిఉంది. గ్రంథం మొత్తం పద్దెనిమిది స్కంధాలనిన్నీ తొలిసంపుటంలో ఐదుస్కంధాలున్ను రెండోసంపుటంలో ఆఱు స్కంధాలున్ను ఉన్నవనిన్నీ మొదటి సంపుటంలో 1919 సంవత్సరంవఱకున్ను రెండో సంపుటంలో 1938 నవంబరు వఱకున్ను కథ కథితమైనదనిన్నీ వింటున్నాం. ఇది చరిత్రకథనంగాను గుణసంకీర్తనంగాను శీలచిత్రణంగాను రూపొంది ఉంది. తారీఖులక్రమాన సంభవాలు సంగ్రథితములైన ఇందు తు. చ. తప్పని నివేదికల పోలికలు ఉన్నాయి.

సాధారణంగా గ్రంథప్రశస్తి విషయవైలక్షణ్యంమీద వక్తృవైలక్షణ్యంమీద ఆధారపడి ఉంటుంది. ఎన్నో గ్రంథాలకు రెండు వైలక్షణ్యాలు సమప్రధానాలుగా ఉంటాయి. లక్షకొకదానికి కోటికొకదానికి అని చెప్పదగినంత అరుదుగా కొన్నిగ్రంథాలకు రెండో వైలక్షణ్యంతో అక్కఱలేకుండ విశ్వశిరోధార్యత్వమును ఆవహిల్లజేయుగల ప్రభావం ఒక్క వైలక్షణ్యానికే ఉంటుంది. ఇందు ఛందోవ్యాకరణాలంకారవ్యుత్క్రమాలున్నాయని రచయితగారే చెప్పుకున్నారు. భావోత్కటతచే కొన్నిచోట్ల ఉరవడియు కొన్నిచోట్ల స్తబ్ధతయు కలుగుతుంది. తదనుగుణంగా ఇందు కొన్నిపద్యాలలో భావోద్వేగం నాలుగోపాదంతో ఆగక ఐదోపాదంలోకి తొణికింది. ఒకటి రెండుకందాలు మూడేసిపాదాలతోనే ఆగాయని శ్రీపాలా వేంకటసుబ్బయ్యగారు గుర్తించి చూపారు. ఐతే ఎటువంటి ఇనుమునైనా మేలి బంగారంగా చేసే ప్రభావం పరుసవేదికున్నట్లుగ ఈవ్యుత్క్రమాలను మాధుర్యానికి బాధకాలుగా కానీయక సాధకాలుగానే పనివఱచుకునే అద్భుతమహిమ పతితపావనమైన గాంధీజీ చరిత్రానికుంది. 'ఆత్మనో మోక్షాయ జగద్ధితాయ' అన్నట్లుగా తమకును లోకానికిని సముత్తారకమైన శ్రీసుబ్బరాయగుప్తగారి ఈసారస్వతవ్యాసంగాన్ని అభినందిస్తున్నాం.

ప్రభాకర్

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియో చేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



పబ్లిక్ ప్రావిడెంటు ఫండు
అకౌంటు ద్వారా
5%
ఆర్జించండి
ఇతర లాభాలు
• ఋణాలు మరియు విత్‌డ్రావలు సౌకర్యము
• జమచేసిన మొత్తాలకు కోర్టు వ్యవహారాల నుండి విముక్తి
• పన్ను వేయబడే ఆదాయంలో నుండి జమ మొత్తాలు తీసివేయబడ్తాయి
వివరాలకై స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా వారిని సంప్రదించండి.
జాతీయ పొదుపు మొత్తాల వ్యవస్థ
davp 70/372

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు— అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! | ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూర్, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.